# ఆచార్య సూక్తిముక్తావళి—పరిశీలనము

(ఉస్మానియా యూనివర్సిటీవారిచే 1992లో Ph D.
పట్టా పొందిన సిద్ధాంత వ్యాస గ్రంథము)



వాదిభీకరగురుడనె మోదమలర!

శ్రీదేవి యురమున జెన్నొంద భూనీళ
 లిరుగెలంకుల దన కింపు సలుప
అహమన్న మహమన్న మనుచు సూరులు గొల్వ
 పరమ పదమునందు పరమ గురుడు
నారాయణుడు ముందు పేరోలగంబుండి
 మంత్రరత్నం బగ్రమహిషి కొసగె
ద్వయమది సిరియు విష్వక్సేనులకు నిచ్చె
 నమ్మంత్రమతడు శఠారి కొసగె
అమ్మహాత్ముని చరితామృతాబ్ధియందు
చిత్తమా నీవు నోలాడి చెంది సుఖము
పదుగురార్యుల దలపుమీ భక్తి ననుచు
వాదిభీకరగురుడనె మోదమలర!

(వాది భీకర గురుడు - కృతివక్త)

**నంబూరి కేశవాచార్యులు** - ఆ.సూ ము. కృతికర్త.

**డాక్టర్ తిరునగరి శ్రీనివాస్**

# ఆచార్య సూక్తిముక్తావళి - పరిశీలనము

ప్రథమ ముద్రణము
శ్రీరామనవమి, 1995

ప్రతులు : 1000

This book is Published with the Financial
aid of T.T.D. under their Scheme
AID TO PUBLISH RELIGIOUS BOOKS

పీఠిక కృతజ్ఞతలు



ప్రతులకు :

1. M/s Sri Gopal Publications
Lane opp. Arya Samaj Mandir,
Kutibiguda, Hyderabad.

2. Gayatri Publishers
Andhra Saraswatha Parishad,
Tilak Road, Hyderabad-1.

3. శ్రీమతి తిరునగరి అనసూయాదేవి
'శ్రీ సూక్తి నిలయము'
ఇం. నెం. 29-1401/3/8,
దీనదయాళ్ నగర్, నేరెడ్‌మెట్, సికింద్రాబాద్ - 500 056.

వెల : రూ. 175-00

ముద్రణ :
పద్మావతి ఆర్ట్ ప్రింటర్స్
1-1-517/B/1, న్యూ బాకారం,
గాంధీనగర్, హైద్రాబాద్ - 500 380.
ఫోను : 611413, 600547.

* స్మృత్యంజలి *

నా తలిదండ్రులు



పరమ భాగవతోత్తములు

కీ.శే తిరునగరి కృష్ణయ్య — కీ శే. మంగతాయారమ్మ గారలు

*వీరు సంప్రదాయ గ్రంథములు 15 వరకు వ్రాసిరి. అవి అముద్రితములు.

స్వగ్రామం : చాడ - ఆత్మకూరు మండలం,

వయా భువనగిరి.

**వారి మంగళాశాసనములతో**

# అంకితము

# నా యొక్క అత్తా మేనమామలకు



(1924 - 1992)



పరమ భాగవతోత్తములు

కీ.శే. తిరుక్కోవళూరు వేంకటప్పయ్య - భార్య శ్రీమతి రంగనాయకమ్మగారలు

స్వగ్రామం : ఆత్మకూరు మండలం.

## సమర్పకులు



గ్రంథకర్త — డాక్టర్ తిరునగరి శ్రీనివాస్ - శ్రీవారి కుమార్తె — శ్రీమతి అనసూయాదేవి

# స్మృత్యంజలి – అంకిత పద్యావళి

"వాదిభీకరగురుడనె మోదమలర!"
చెవిని బడినంత నాయన చెంతకేగి
బాల్యమందలి చాపల్య భావగరిమ
'తెలుగునాదను' గర్వమ్ము బలిసిరాగ
"కాదు నాయనా! అది భీకర గురుండు"
నను చు వాదించు నా దిట్టతనము జూచి
"ఐన! చూడురా!" గ్రంథమ్ము నందు జూపె
"వాది" యను మాట - నిట్టులు వాదులాడు
ఘట్టముల నెంతు నీనాడు కడుపునిండ!

తల్లి తాయారు, కృష్ణయ్య తండ్రి ప్రీతి
వారి కడుపున బుట్టిన ఫలము నేను
దాని సాఫల్యమును జేయు తగిన ఫలము
ఆహా! నాకబ్బె రామానుజార్య కృపను
నాన్న చదివెడు గ్రంథమే నాకు దొరికె
వారసత్వంపు సంపద ఫలము నాగ
చూడనందులో వారి దస్తూరిగాంచి
జన్మతరియించెనని నేడు సంతసింతు.

"ఔను ఆచార్య సూక్తి ముక్తావళీమ
హాప్రబంధమ్ము - అనుశీలనైకబందు
రమ్ము జేసితి నాయనా! అమ్మ! దీని
మీకు స్మృత్యంజలిగనిత్తు, మీదునాజ్ఞ
మంగళాశాసనాత్త సంప్రాప్తి చేత
అత్త మామల కిత్తును అంకితముగ."
పైతృకంబగు ఆస్తి ప్రబంధమిద్ది-
పితృఋణమది తీరు నీ విధముగాన!

అమ్మా! నాయన! పూర్వజన్మకృత సమ్యగ్రూప సాఫల్యమే
ఇమ్మార్గమ్మున నావహించి నను వ్రాయించెన్ విశిష్టాద్వైత-శ్రీ
సమ్మోదైకముల్లైన వ్యాసముల, నాచార్యాళి సంసూక్తులన్
ఇమ్ముక్తావళి మీరు వేసినది మీకేనిత్తు దివ్యార్థది
వ్యమ్మై ఇమ్మెయి పుత్రగాత్ర సుపరిష్వంగమ్మె సౌఖ్యమ్మునా!
సొమ్మీ సత్కృతి స్వీకరించుడిదె దాసోహమ్ము - స్మృత్యంజలుల్.

శ్రీ తిరుక్కోవలూరు శ్రీకర వంశాబ్ధి
చంద్రుడు, సౌమ్యుండు, సద్గుణుండు
ఎంబయార్యుని మనుమడెంచ శ్రీ నర్సయ్య
వంతులు - ఆండాళుభవ్యసుతుడు
అత్తాను శ్రీ సుందరాచార్య శిష్యుండు,
వరలు చాత్తాద శ్రీ వైష్ణవుండు,
రంగనాయకి భర్త - మంగతాయారుకు
పరగ తమ్ముడు - తిర్నగరి సువంశ

చాడ కృష్ణయ్యగారికి స్వంత మరిది
మరియు శిష్యుండు, బాల్య మందర యనిట్లు
ఇట్టి సత్కుల సంబంధ మిలను గలిగి
ఖ్యాతిగాంచిన వేంకటప్పయ్యవరుకు,
వారి దివ్యాత్మశాంతికి ప్రార్థనముల
సేతుమోదేవ! చిల్కుమాశీస్సులలర! (14-11-1992)

తిరునగరి - తిరుక్కోవలూరు దివ్యదేశ
ములు క్రమమ్ముగ మా వంశములకు పేర్లు
మమత లిబ్బంగి, నమ్మాళువారి, మధుర
కవుల దివ్య ప్రబంధాల కలిమి - బలిమి;
బ్రతుకుచున్నట్టి వారికి భాగ్యమిచ్చి
పరమపదవాసులకు మోక్ష పదములిచ్చి
వైష్ణవాళికి నాదర్శ ప్రాయమగుచు
అమృతమయమౌత! రామానుజార్య కృపను!

పరమ భాగవతుల్ దైవపరులు - సూరు
లాళువారులు - ఆచార్యులందరెలమి
సరససాయించు మంగళాశాసనములు
వరగ ఎంబెరు మానారు తిరువడిఘళు
లందఱకు గూడ శరణమై విందుగూర్చి
శుభము లిచ్చుత! నాచార్య సూక్తులలర!
ఉదయవరువై భవమ్ముల పుడమి యలర!
"వాదిభీకరగురుడనె మోదమలర!"



పరమహంస పరివ్రాజకులు

## శ్రీ శ్రీ శ్రీ త్రిదండి చిన్న శ్రీమన్నారాయణ రామానుజ జీయర్ స్వామివారి

# మంగళాశాసనము

ప్రియ శ్రీమాన్ టి. శ్రీనివాస్‌గారు!

శ్రీమతే నారాయణాయ నమః!

అనేక మంగళాశాసనములు!

మీరు అందించిన "ఆచార్యసూక్తిముక్తావళి - పరిశీలనము" అను సిద్ధాంత వ్యాస గ్రంథము నచ్చుటచ్చుట పరిశీలించితిమి, పరిశోధన బాగానే యున్నది.

శ్రీవైష్ణవమత వ్యాప్తి కావించిన ఆళ్వారాచార్యుల సమగ్ర చరిత్రను తెలుపు ఉద్దేశ్యముతో శ్రీమాన్ నంబూరి కేశవాచార్యులుగారు తాము విన్న, తమకు లభించిన విషయముల నన్నింటిని క్రమబద్ధము చేసి కావ్యరూపంలో వెలువరించారు ఒకనాడు. అందులో కథాప్రక్రియకాటంకము కాని రీతిలో విషయాన్ని విస్తరించి అందించారు.

ఆళ్వారాచార్యుల విషయమై గురుపరంపరాప్రభావం ద్రావిడంలోకాని; సంస్కృతంలో కాని, ప్రపన్నామృతమనే సంస్కృత గ్రంథం కాని వివరించిన విషయము, కథగ జిజ్ఞాసువులు వారి చరిత్రను తెలిసికొని రుచి జనింపచేసుకొని, వారి వారి గ్రంథములలో ప్రవర్తించడం ద్వారా భగవదనురక్తిని పెంచుకొంటా రనేగద! పై గ్రంథాలలో లభించని కొన్ని చరిత్ర విశేషాలు దివ్యప్రబంధముల యొక్క వ్యాఖ్యానాల్లో, ఆయా ఘట్టములను, పాశురములను, శ్లోకములను వ్యాఖ్యానించే పూర్వాచార్యుల ప్రసంగాల్లో మనకు కన్పిస్తాయి.

ఆళ్వారుల చరిత్ర విషయంలో తరువాతివారు ఊహించి అందించిన సమాచారమే బహుళముగ కన్పిస్తుందితప్ప, ఆయా కాలాల్లో వారి చరిత్రను యథాతథంగ గ్రంథస్థం చేసిన వారెవ్వరూ లేరు అనేది వాస్తవం. ఇక ఊహించి విషయాన్ని వివరించినవారు సందర్భోచితంగ అందించడం జరిగింది. ఏది ఏమైనా క్రీస్తుశకానికి ముందే ఆళ్వారులందరి సమయం అయిపోయి ఉండవచ్చు ననేది పెద్దల అభిప్రాయం. క్రీస్తుశకానికి తరువాత ఆచార్యుల సమయమే నడిచింది.

లోకుల ఎవ్వరి ఉపదేశమూ లేక, జాతి నిర్బంధం లేక నేరుగ భగవదనుగ్రహంతోనే భగవద్విషయాన్ని వేదవిరుద్ధం కాని రీతిలో ప్రవర్తింపచేసినవారాళ్వార్లు. వీరివీరి ప్రబంధాల శైలినిబట్టి వారివారిని భగవంతుని ఆయుధాది అంశ అని అన్నా, వారంతా సామాన్యమానవులే అయి ఉండి, భగవదనుగ్రహంతో అంత దివ్యజ్ఞానాన్ని పొంది ప్రబంధాలకు ద్రష్టలైనారు.

ఏదో ఒక గురుపరంపరను గ్రహించి, ఉపదేశాలు పొంది శాస్త్రీయమైన ఆచార క్రమంలో సంప్రదాయ ప్రవర్తకులై భగద్విషయాన్ని ప్రవర్తింప చేసిన వారాచార్యులైనారు. వీరికి నియమాదులు చాల ఉన్నాయి. కాలమున్నది. శిష్య పరంపర ఉంది.

ఆళ్వారులకు కాలనిర్ణయం చేయడం మాత్రం సముచితమైనది అనిపించదు. అదలా ఉంచినా, ఈనాటి పరిశోధనలు వ్యక్తుల జీవితాలు, వారి సమకాలికులు, వారినాటి సాంఘిక పరిస్థితులు, వారికాలము అలవాట్లు - వీటిపై అత్యధికంగ సాగిపోయి, వారి కృతుల ఆంతర్యంపై పే దృష్టి సారించబడటం లేదు. దానివల్ల ఏ అభిప్రాయంతో ఆదర్శంగ గ్రహించడం జరిగిందో, ఆ అభిప్రాయమే నెరవేరకుండా పోతోంది. వారి గ్రంథాలుగాని, అందులో వారు చూపిన తత్త్వార్థములుగాని పరిశీలనలో చోటుచేసుకోవడం నామమాత్రమైంది. ఈ విధమైన పద్ధతి మారడం చాల అవసరంగ మేము భావిస్తున్నాం. ఉదాహరణకు ఆళ్వారులెందరనే విషయాన్ని బాగ చర్చించడం జరిగింది. దానికి అనేక పాశుర, పద, శ్లోకాదులను ఉటంకిస్తు వివరణ నివ్వడం జరిగింది. అసలు ఆయా శ్లోకాదులలో ఆయా వ్యక్తుల పేర్లను స్పృశించడం, ఒక్కొక్కరు

ఉండవచ్చు. ఛందస్సు కోసమైతే ఆ క్రమముమీద అంత చర్చ అవసరము లేదు. కాని ''భూతం సరశ్చ....నిత్యం'' లాంటి శ్లోకాల్లో ఉన్న వ్యక్తుల నెందు కోసం అలా ఒకేచోట చేర్చడం జరిగింది అనేది పరంపరాగతార్థవిజ్ఞులైన వృద్ధుల నాశ్రయించితే సక్రమంగ తెలుసుకోవచ్చు తప్ప లేకపోతే అపార్థములను గుర్తించే అవకాశం లేకపోలేదు.

ఆ. సూ. ము. గ్రంథ రచయిత ఇలాంటి అనుశీలనములను దృష్టిలో నిడుకొని గ్రంథరచన చేసి ఉండకపోవచ్చు.

ఏది ఏమైనా గ్రంథకాలాది విషయపరిశీలనతో బాటు వారు అందించిన, వారినావిధముగా తీర్చిదిద్దిన సంప్రదాయ విషయమునందు, తత్త్వార్థ ప్రతిపాదన మందును విశేష పరిశీలనము జరుపుట ఎంతైనా అవసరము.

ఈ విషయములో మీరు తగురీతిలో, అవకాశమున్నంతలో సాగించిన కృషి మిగిల ప్రశంసనీయమైనదిగ మేం భావిస్తున్నాం.

ఇకపై ఆ గ్రంథమునందు ప్రవేశించువారలకుగాని, సిద్ధాంత విషయ జిజ్ఞాసువులకుగాని మీ పరిశోధన వ్యాసగ్రంథమొక మార్గదర్శకము కావలెనని ఆశిస్తూ మీకనేక మంగళాశాసనములను చేస్తున్నాం.

ఈ వయస్సులో గూడ మీరు సాగించే ఈ కృషి మీకు సద్విషయము లందుండే ఆసక్తిని తెలియజేస్తోంది. వర్ధతాం!

(సంతకము)

రీడర్, A.S.P. ఓరియంటల్ కాలేజి
హైద్రాబాదు. 1.4.95

# ఆశీర్వచనములు

శ్రీమాన్ డా॥ తిరునగరి శ్రీనివాస్‌గారి ఆచార్యనిష్ఠకు తగినట్లుగానే ఉస్మానియా విశ్వవిద్యాలయం తెలుగుశాఖవారు "ఆచార్య సూక్తిముక్తావళి" గ్రంథ పరిశోధనకు అనుమతి ఇవ్వడం సముచితంగా ఉన్నది. ఈ పరిశోధనకు పర్య వేక్షకునిగా ఉండటం నా భాగ్యంగా భావిస్తున్నాను.

శ్రీనివాస్‌గారిది విశిష్టాద్వైత సంప్రదాయ కుటుంబం. చిన్నప్పటి నుండి ఆ సంప్రదాయంలో పెరిగి రహస్యాలు ఆకళింపు చేసికొన్నారు. సమాజానికి ఆళ్వారుల - ఆచార్యుల సూక్తులు ఎంత అవశ్యకాలో గుర్తించినారు నేటి హేతువాదయుగానికి సరిపడేట్లు చారిత్ర - భౌగోళిక దృష్టిని జోడించి పరిశోధించి నారు. లెక్కకు మిక్కిలిగా ఆళ్వారాచార్యులను గురించి వచ్చిన సంస్కృతాంధ్ర తమిళాంగ్ల గ్రంథాలు, వ్యాసాలు పరిశీలించినారు. అవసరమైన విషయం బోలెడంత సంపాదించినారు. సిద్ధాంత వ్యాసంలో చేరని విషయమెంతో ఆయన వద్ద ఉన్నది.

సిద్ధాంత వ్యాసరచన విషయంలో శ్రీనివాస్‌గారికి సంపూర్ణ స్వేచ్ఛ నిచ్చినాను. తృప్తితీరా రాయమన్నాను. నా కారణంగా అసంతృప్తికి లోను కాకూడదన్నాను. అందువల్లనే ఈ మధ్య వచ్చిన Ph D. సిద్ధాంత గ్రంథాల్లో విషయాన్నిబట్టి చూచినా, విస్తృతినిబట్టి చూచినా ఈ వ్యాసం ఎంతో పెద్దది.

వ్యాసరచనలో శ్రీనివాస్‌గారు చూపిన శ్రద్ధ, సహనం పాఠకలోకం కూడా చూపినపుడే ఈ పరిశ్రమ సార్థకమవుతుంది. దీన్ని ప్రచురించడానికి ఆర్థికసహాయం అందించిన సంస్థలను గౌరవసభ్యులను అభినందిస్తూ, ఈ గ్రంథ ప్రతులను కొని గ్రంథాలయాలనలంకరింపజేయవలసినదిగా గ్రంథాలయాధికారు రను, సంచాలకులను కోరుతున్నాను.

ఆచార్యానుగ్రహం సంపూర్ణంగా పొందాలని, శ్రీనివాస్‌గారిని యువ ఉగాది సందర్భంగా ఆశీర్వదిస్తున్నాను.

(సంతకం)

ఆచార్య ఎం. కులశేఖరరావు
విజ్ఞానపురి - విద్యానగరం
హైదరాబాదు
శ్రీరామనవమి 9-4-95

# పరిచయము

ఇతర దక్షిణ భారత భాషల్లో వచ్చినంత విరివిగా, ఎందుచేతనోకాని, తెలుగులో సంప్రదాయ సాహిత్యం ముఖ్యంగా వైష్ణంగా గ్రంథాలు రాలేదు. విశిష్టాద్వైత సిద్ధాంతాన్ని, దాన్ని ఉత్కృష్టతను ప్రతిపాదించే మొదటి కావ్యం; మనకు తెలిసినంతవఱకు, శ్రీకృష్ణదేవరాయలు వ్రాసిన అముక్తమాల్యదయే మొదటిది. తరువాతి శతాబ్దాల్లో కూడ అక్కడక్కడ కొన్ని గ్రంథాలు వెలువడినాయేగాని ప్రచురంగా రాలేదు. క్రి.శ. 19వ శతాబ్దిలో రచితమైన నంబూరి కేశవాచార్యుల ఆచార్యసూక్తిముక్తావళి తెలుగు సాహిత్యంలోని ఈ లోపాన్ని కొంతవరకు తీర్చ గలిగింది.

ఇతర దివ్యసూరులు ప్రతిపాదించగా శ్రీ రామానుజాచార్యులచేత దేశ వ్యాప్తంగా ప్రచారం చేయబడిన విశిష్టాద్వైత సిద్ధాంతం భక్తి ప్రపత్తి ప్రధాన మైంది. సాత్త్విక గుణానికి సంకేతంగా ఉన్న ఈ సంప్రదాయాన్ని భారతీయులు స్వీకరించగా, తర్వాతి కాలంలో చైతన్యప్రభువు, వల్లభాచార్యులు దాన్ని మరింత పటిష్ఠం చేసినారు. తెలుగుదేశంలో ఈ పనికి అన్నమాచార్యులు, రామదాసు, త్యాగరాజువంటి వాగ్గేయకారులు తమ రచనల ద్వారా జనంలో ప్రవేశించి ప్రచారం చేసినారు.

సాహిత్యకులకు పనిద్దరాళ్వారుల చరిత్రను, వారి బోధామృతాన్ని అందించవలెననే సదాశయంతో, నంబూరి కేశవాచార్యులు ఆచార్య సూక్తిముక్తావళిని రచించి సార్థకతను సంపాదించినారు. శ్రీవైష్ణవ సంప్రదానుయాయుల్లో ఆచార్య సూక్తిముక్తావళికి గౌరవము, ప్రచారము ఉన్నాయి. గడిచిన రెండు వందల సంవత్సరాలకు పైగా ఈ గ్రంథాన్ని వైష్ణవులు కాలక్షేప గ్రంథంగా గ్రహించి శ్రవణ పాఠనాల్లో ఉపయోగిస్తున్నారు. ఇట్లా చేయడానికి కారణం ఈ గ్రంథానికి ఉండే ప్రామాణ్యమనే భావించవలె. ఎందుచేతనంటే, విశిష్టాద్వైత సంప్రదానుయాయులకు అతి పవిత్రమైన ప్రసన్నామృతము, యతీంద్ర ప్రవణ ప్రభావము, దివ్యసూరి చరిత్రము, గురుపరంపరా ప్రభావము మొదలైన ప్రాచీన గ్రంథాలు ఈ తెలుగు గ్రంథానికి ఆధారభూతములైనాయి. ఈ గ్రంథాన్ని వ్రాసిన కేశవాచార్యులు గూడ సామాన్యుదేమి కాదు. సంప్రదాయబద్ధమైన గురు శుశ్రూషతోబాటు వివిధ శాస్త్రముల పరిజ్ఞానం, ఖగోళ, జ్యోతిష, భౌగోళిక విష

కొన్నది.

ఆచార్య సూక్తిముక్తావళిని, దాని ప్రాశస్త్యాన్ని ఆంధ్రసాహిత్య చరిత్రకారులు చాలా కాలంగా విస్మరిస్తూనే యున్నారు నామమాత్రంగా గ్రంథం పేరు, గ్రంథకర్త పేరు తమ సాహిత్య చరిత్రల్లో ఉల్లేఖించడమే కాని విషయ వివేచన చేయడం ఎక్కడ జరుగలేదు. పన్నెండుమంది వైష్ణవాచార్యుల వృత్తాంతాలున్న ఈ కావ్యాన్ని పరిశీలన చేయవలెనని చాలా కాలంగా నేను భావిస్తూ ఉండినాను. సంప్రదాయ పరిజ్ఞానం చాలినంత లేకపోవడంచేతనేమి, తగిన సమయం లభించకపోవడం చేతనేమి, ఆ పని చేయడం నాకు సాధ్యం కానేలేదు. ఆచార్య కటాక్షం కూడ నామీద పడనట్లున్నది ఐనా విషయం విస్మరించక ఈ గ్రంథాన్ని గూర్చి పరిపూర్ణ విమర్శ చేయుడని శ్రీ తిరునగరి శ్రీనివాస్‌గారిని కోరినాను. వారు నా కోరికమేరకు చక్కని సిద్ధాంత గ్రంథము వ్రాసి కృతార్థులైనారు. విశిష్టాద్వైత సంప్రదాయానికి ఎనలేని సేవ చేసినారు. డాక్టరు శ్రీనివాస్‌గారికి, వారి మార్గదర్శకులైన డాక్టరు కె.వి. సుందరాచార్యుల వారికి నా అభినందనలు తెలియజేసుకుంటున్నాను.

"ఆచార్య సూక్తిముక్తావళి పరిశీలనము" అను ఈ సిద్ధాంత గ్రంథంలో చాల విషయాలు ప్రపంచితమైనాయి. నంబూరు కేశవాచార్యులు గురుపరంపరాప్రభావం నుంచి గ్రైకొన్న విశేషాలు సూక్ష్మంగా పరిశోధకులు వివేచన చేసినారు. పన్నిద్దఱ్వారుల సంఖ్యను గురించి, వారి క్రమాన్ని గురించి, వారు సంప్రదాయానికి చేసిన సేవను గురించి ఈ గ్రంథంలో వివరణ ఉన్నది. ఒక చారిత్రక నేపథ్యం ఉన్నది. ఆధారసహితమైన చర్చ ఉన్నది

మనకు శ్రీకృష్ణదేవరాయల యుగంనుంచి ప్రబంధాలనే కావ్యాలు విరివిగా వచ్చినాయి. ప్రప్రథమంగా తెలుగుప్రబంధం వ్రాసిన మహానుభావుడు శ్రీకృష్ణదేవరాయలే. విష్ణుమూర్తి కథలు, ఆయన భక్తివృత్తాంతాలు ఉన్నప్పుడు దాన్ని విశిష్టాద్వైత సాంప్రదాయకులు దివ్యప్రబంధంగా భావిస్తారు. రాయలు తన గ్రంథంలో పెరియాళ్వారు, గోదాదేవి, యామునాచార్యులు, మాలదాసరి మొదలైన విష్ణుభక్తుల కథలు వ్రాసి దాన్ని ప్రబంధంగా పేర్కొని సార్థకం చేసినారు. బహుశః ఆనాటి సాంఘిక వ్యవస్థలో 'యథారాజా తథాప్రజా' అనే పద్ధతి ఉండేది కాబట్టి ఆయన సమకాలికులు, తర్వాతివారు తమ కావ్యాలను

ప్రబంధాలుగా పేర్కొన్నారు. వీటిలో విష్ణుమూర్తి కథలు లేకపోయినప్పుడు దశావతార పద్యాల వంటివి చేర్చడం గమనించవచ్చు. పారిజాతాపహరణం, పాండురంగమాహాత్మ్యం విష్ణుమూర్తి కథాత్మకమైన ప్రబంధాలే గదా.

ఈ విధంగా చూస్తే ఆచార్య సూక్తిముక్తావళి పరిపూర్ణమైన ఆంధ్ర దివ్య ప్రబంధం. ముదలాళ్వారులు మొదలుకొని పెరియాళ్వారుల వరకు చరిత్రలు దీనిలో చాల రమ్యంగా వర్ణితమైనాయి. గోదాదేవి కల్యాణ వృత్తాంతం బహు రమణీయంగా ఉన్నది. ఇక శ్రీరామానుజాచార్యుల కథలు సరేసరి. గ్రంథంలో సగభాగం ఉడయవరుల వృత్తాంతమే విస్తృతమైనది. ఆ మహానుభావుడు విశిష్టాద్వైత సిద్ధాంతానికి తన జీవితాన్ని ఎట్లా ధారవోసినారో, ఆ సంప్రదాయాన్ని ప్రచారం చేయడంలో ఎంత కృషి చేసినారో డాక్టర్ శ్రీనివాస్‌గారు విస్తరించి చెప్పినారు. శ్రీ రామానుజులు తమ జీవితకాలంలో ఒక సందర్భంలో ప్రముఖ వచన సంకీర్తనకారుడైన కాంతకృష్ణమాచార్యులను కలుసుకున్నట్లుగా ఒక ఐతిహ్యము ఈ ప్రబంధంలో వర్ణింపబడి ఉన్నది. సింహాచల వరాహ నృసింహస్వామి కటాక్షంచేత రవంత గర్వం పొందిన కృష్ణమాచార్యుల గర్వ నిర్వాపణం చేయడమే ఈ ఐతిహ్యంలోని పరమార్థం కాని చారిత్రకంగా ఈ సంఘటన సాధ్యమగునా? అనే సందేహం రాకమానదు. శ్రీ రామానుజులకు, కృష్ణమాచార్యులకు జీవితకాలంలో దాదాపు రెండుశతాబ్దాల అంతరం ఉన్నది. అందుచేతనే దీన్ని సమర్థించడానికి నాకొక ఊహ కలిగినది. అదేమంటే, కృష్ణమాచార్యుల స్వోత్కర్షను నిర్మూలించడానికి శ్రీ రామానుజులు ఆయన స్వప్నంలో సాక్షాత్కరించి యుండవచ్చు. వైష్ణవునికి సాత్త్వికభావం తప్ప మరొకటి పనికిరాదని ఉపదేశించి ఉండవచ్చు. ఆదిశేషుని అపరావతారమైన లక్ష్మణార్యులకు సాధ్యంకానిది ఏమున్నది? రామానుజులు ఉపదేశం పొందిన వారు కాబట్టే కృష్ణమాచార్యులు ప్రపత్తి వచనరచనలుచేసి మనకు అందించినారు.

ఇరువదినాల్గు ఉల్లాసాల్లో విస్తరించిన ఈ గ్రంథంలో బీబీనాంచారువంటి కథలు, పంచసంస్కారము వంటి సంప్రదాయములు ఎన్నో ఉన్నాయి. వీటి నన్నింటిని డాక్టరు శ్రీనివాస్‌గారు పరిశీలనచేసి విశేషములను వివరించినారు. ఈ వివేచన ప్రామాణికంగా ఉన్నది ఇంతకాలానికి ఆచార్య సూక్తిముక్తావళిపై ఒక సిద్ధాంత గ్రంథం వెలువడడం నాకు పరమానందంగా భాసిస్తున్నది. ఈ సిద్ధాంత గ్రంథాన్ని రచించిన డాక్టరు తిరునగరి శ్రీనివాస్‌గారికి, పర్యవేక్షణ చేసిన డాక్టర్ కె వి. సుందరాచార్యులవారికి మరొకసారి నా అభినందనలు.

(సంతకము)

ఆచార్య కోవెల సంపత్కుమారాచార్య

**15-9-64**, రామన్నపేట,

వరంగల్.

# భగవద్భాగవతాచార్యానుగ్రహం

దాదాపు నలభై ఏళ్ళక్రితం ఎనిమిదో తరగతిలోనో, తొమ్మిదో తరగతిలోనో నా విద్యార్థిగా ఉన్నట్లు గుర్తుచేస్తూ ప్రస్తుతం మిత్రుడయిన తిరునగరి శ్రీనివాస్ క్రమంగా విద్యా - అధ్యయనపరంగా ఎదిగి సాహిత్య డాక్టర్‌గా ఇన్నాళ్ళకు ''ఆచార్య సూక్తిముక్తావళి' పరిశీలనము'' అన్న తన సిద్ధాంత గ్రంథంతో కలువటం నిజంగా ఎంతో సంతోషకరమైన విషయం. మరొక సంతోషకరమైన విషయం ఆయన పరిశోధన "ఆచార్య సూక్తిముక్తావళి" పరంగా వర్ధిల్లటం. ఇది ఆత్మతృప్తి కలిగించే విషయం. అందుకే ఈ పరిశోధనలో ఆయన రమించటం, పారవశ్యం పొందటం గ్రంథమంతటా స్ఫురిస్తూ ఉంటుంది.

శ్రీవైష్ణవ సంప్రదాయానికి చెందిన గ్రంథాలన్నీ దాదాపుగా తమిళంలో ఉన్నాయి. దక్షిణాది నుంచి ఈ పరమభక్తి సంప్రదాయం తెలుగుదేశంలో ఉవ్వెత్తుగా ప్రవహించింది. అందువల్ల తెలుగువారికి తమిళంలోని ఆయా సంప్రదాయ గ్రంథాల మీద పరమప్రామాణ్యాపత్తి. ఇది సహజమే కాకుండా ఉచితం కూడ. తెలుగులో ప్రామాణికంగా వైష్ణవ సంప్రదాయ గ్రంథాలు వెలువడటానికి అవకాశం కొరవడటానికి ఇదొక ప్రధాన కారణంగా కన్పిస్తుంది. ఒక విధంగా తెలుగుకు సంబంధించినంతవరకు ఇది నిజంగా ఒక కొరతే. ఈ కొరతను తీర్చటానికి తొలిగా ప్రయత్నించినవారు ప్రధానంగా తాళ్ళపాక అన్నమయ్యగా రనవచ్చు. ఆయన సంకీర్తనలు ఈ విషయంలో తిరుగులేని సాక్ష్యం. అదే విధంగా తెలుగుదేశంలోని మరింగంటివారూ, మరికొందరు తిరునామాలను వెలయించారు. ఇవన్నీ ఒకవిధంగా ముక్తక రచనలు. తాళ్ళపాక చిన్నన్న పరమయోగి విలాసం ప్రధానంగా పన్నిద్దర్వాళ్ల చరిత్రను చిత్రిస్తుంది. సాంప్రదాయక విషయాల వివరణ అక్కడ కొంత గౌణమే. కాగా ఈ విధమైన సాహిత్యంలో నంబూరి కేశవాచార్యులుగారి 'ఆచార్య సూక్తిముక్తావళి' ఎన్నదగిన రచన.

భక్తిమార్గాన భగవంతుని ప్రాధాన్యం అట్లా ఉంచి, ఆయనను చేరుకొనేందుకు అనేక విధాలుగా సహకరించే ఆచార్యులకు, భాగవతులకు ప్రారాన్యం అధికం అందువల్ల ఆళ్వారాదులను గూర్చి, వారి వైభవాదులను గురించి కృతజ్ఞతా

పూర్వకంగా స్మరించుకోవటం ప్రపన్నులకు విధాయకం. ఆ విధాయకమే ఈ రచనకు పునాది.

పూర్వాచార్య పరంపరలో భగవద్రామానుజుల స్థానం అత్యున్నత మయింది. పూర్వాపరాచార్య పంక్తి యుక్తాయ శ్రీమతే రామానుజాయ నమః అని వారిని ప్రపన్నులు నిత్యం స్మరించుకొంటూ ఉంటారు. కేశవాచార్యులు గారు భగవద్రామానుజులను కేంద్రీకరించుకొని, ఇతరేతరాళ్వారాచార్యుల విష యాలను తమ రచనలో అనుసంధించారు. అందువల్ల గ్రంథం విషయగౌరవం తోనేగాక విస్తృత గౌరవంతోనూ రూపొందింది.

భక్తులకు భగవద్విషయం ఆచార్యముఖతః లభిస్తుంది. అందువల్ల కేశవా చార్యులు తమ రచన అంతా 'తమది' అనిగాక ఆచార్యుల వలన లభించిన సూక్తి విశేషంగా భావించారు. పోతనగారు పలికించెడువాడు రామభద్రుడు అంటూ రచనపై కర్తృత్వాహంకారాన్ని వదులుకొన్నట్లు కేశవాచార్యులు గూడ 'అదరమొప్ప నాదు రసనాగ్ర శుభాసన మధ్యవర్తియౌ వాదిభయంకరార్యుడన వద్య కృపాతి శయంబుచే' పలికించినారంటూ తమ కర్తృత్వాహంకారాన్ని వదులుకొన్నారు. అది ఆచార్యనిష్ఠ.

గ్రంథంలో ఆళ్వారాదుల, రామానుజుల 'చరిత్ర' చెప్పటమనే నెపంగా కేశవాచార్యులుగారు శ్రీవైష్ణవ భక్తి సంప్రదాయానికి సంబంధించిన అనేకాంశా లను ప్రసక్తానుప్రసక్తంగా ఇతరేతరాంశాలను జిజ్ఞాసువులకు అందించారు. అనేక విధాలయిన ఈ యీ అంశాలను అవగాహన చేసికోవటంలో శ్రీనివాస్ పెద్దల గ్రంథాల అనుగ్రహం సంపాదించాడు. అనేక విషయాలను సేకరిం రించాడు. పునరుక్తమవుతున్నా గూడ స్పష్టతకోసం ఆయన ఈ పరిశోధన గ్రంథాన్ని విపులీకరించాడు.

ఆత్మనిష్ఠతో ప్రపత్తి పూర్వకంగా శ్రీనివాస్ చేసిన ఈ కృషికి సంప్ర దాయపరులనుంచీ, సాహిత్యపరులనుంచి గూడ సరయిన ఆదరం లభిస్తుందని విశ్వసిస్తున్నాను. ఈ కృషివల్ల శ్రీనివాస్‌కు భగవద్భాగవతాచార్యానుగ్రహం సంపూర్ణంగా లభిస్తుంది. నిజానికి లభించింది కాబట్టే ఈ కృషిలో ఈ విధంగా గట్టెక్కినాడు.

ఆయనకు-శిష్యుడనిగాదు, ఇంతటి సంప్రదాయ ప్రయోజనకరమైన కృషి చేసినందుకు మనఃపూర్వకాభినందనలు.

(సంతకము)

ఉ. వే. శ్రీమాన్ కె. ఇ. రాఘవాచార్యులు
M A ,B.Ed
సిద్దిపేట రిటైర్డ్ తెలుగు లెక్చరర్,
హైదరాబాద్
యువ, శ్రీరామనవమి 9-4-95

# సత్పథః

ఆచార్యాణాం భవిష్ణుర్విశదమతి జుషాం సూక్తిముక్తావళీయా
పంచాధ్యాయేష్వి భక్తానుమహిత భగవద్భక్త వర్గాశ్రితాసా।
యైః కైశ్చిద్వ్యాఖ్యవహార్యా స్వ్యయమనవరతం శ్రోత్రపేయాసుధేయం
భూయస్యై భూతయేస్యాజ్జగతిపిపఠిషోః శ్రీనివాసేనక్లప్తా॥

తిరునగరి శ్రీనివాసః
గురుకృపయాచార్యసూక్తి గోప్యార్థాన్।
హరిచరణామృత రుచిరాన్
నిరతం సమీక్షతేయః సహి సుకృతీ॥

పట్టం ప్రాప్తః పరిణతమనాః విశ్వవిద్యాలయేఽస్మిన్
పూర్వాచార్య గ్రథిత విషయం సర్వమాలోచ్య సాక్షాత్।
అంభోజేభ్యో మధుకర ఇవారబ్ధ సిద్ధాంతగ్రంథః
వేదాంతాఖ్యాం ప్రథితవిభవో దక్షతే సంప్రదాయః॥

పురాకృతం పుణ్యమనేన శోభితం
ప్రశస్త కావ్యం పరిశీలితం భృశం।
జగద్ధితాయై వహి ముద్రితం పరం
తథాఽపి శేషత్వమపేక్షితం ఖలు॥

వేముగంటి నరసింహాచార్యులు

అధ్యక్షుడు; సాహితీ వికాసమండలి

సిద్దిపేట.

సరస రచనాధురీణులు, ఆప్తులు

శ్రీమాన్ తిరునగరి శ్రీనివాసులుగారికి

# మంగళాశాసనములు

పన్నిద్ద రాళువారులు
మున్నగు ఆచార్యవరుల బోధాంశములన్
విన్ననువుగ ప్రకటించిన
విన్నాణివి శ్రీనివాస విబుధవరేణ్యా!

చతురత మీరగ వాచా
ప్లుతిగ 'ఆచార్య సూక్తిముక్తావళి' సం
హిత పరిశీలించిన నీ
ప్రతిభకు జోహారు శ్రీనివాస బుధమణీ!

తిరునగరి వంశ రత్నా
భరణా! సుగుణనిధీ! శ్రీనివాసాహ్వయ, నీ
వర సిద్ధాంత గ్రంథము
చిరకాలము వెలయుగాత చిద్బోధకమై. (సంతకము)

# అభినందనలు

మీరు శ్రమకోర్చి రచించిన ఆచార్య సూక్తిముక్తావళి - పరిశీలనము, అను సిద్ధాంత వ్యాస గ్రంథమునందెన్నియో మహా విషయములు గలవు. ఇందు ఆళ్వారుల - ఆచార్యుల జీవితములు వైష్ణవమత సంబంధ విషయములు చక్కని సాహిత్య వివేచనతో పరామర్శింపబడినవి. ఇందలి పటములు, పట్టికలు సామాన్య వైష్ణవులకు గూడ ఉపయోగకరముగా రూపొందింపబడినవి.

మీ కృషి నభినందించుచు, ఇక ముందిట్టి ప్రయోజనకరమైన గ్రంథములు వ్రాయుటకై ఆశిస్తూ మిమ్ముల మనసారా అభినందించుచున్నాను.

ఇట్లు

తిరునగరి వేంకట శేషయ్య

ఉప వాణిజ్య పన్నుల అధికారి హైద్రాబాద్.

తెలుగు సాహిత్యచరిత్ర పుటలకెక్కని మహా ప్రబంధ పరిశీలనము:

# వినతి : కృతజ్ఞతాంజలి

**"వాదిభీకరగురుడనె మోదమలర!"**

అని మా నాయనగారు కీ.శే. తిరునగరి కృష్ణయ్యగారు (మా స్వగ్రామమైన చాదలో) బిగ్గరగా చదువుతున్నారు. అప్పుడు 1950 సం॥ కావచ్చు. 6వ తరగతి చదివే నేను వెంటనే లేచి 'వాది' కాదు. 'ఆది' సరియైన పదమని వాదించినాను. అర్థము చెప్పి, వారు గ్రంథమును చూపించినారు. పచ్చ అట్టల క్యాలికో బైండింగు పుస్తకం, ముఖచిత్రంపై పెద్ద అక్షరాలు :

"ఆచార్య సూక్తిముక్తావళి"

(నంబూరి కేశవాచార్య విరచితము - 1922)

కన్పించినవి. లోపలి పేజీల్లో పై మకుటం "వాదిభీకర గురుడనె మోదమలర!" ఇంకా పేజీలు తిరుగవేస్తుంటే "ఆళ్వారాచార్యుల ఫోటోలు" అక్షిగోచరములైనవి. ఐనా నా వాదనను మానలేదు. నాకే తెలుగు వచ్చుననే ధీమా! ఈ సంఘటనం నా మనఃఫలకంపై వేసిన ప్రప్రథమ ప్రభావముద్రణం ప్రథమ సందర్శన మధురస్మృతి. మళ్ళీ ఈ గ్రంథమే నా సిద్ధాంత వ్యాసశీర్షికగా పునర్దర్శనమివ్వడం (1989 - 1990 లో) ఇంకనూ నన్ను వెన్నాడుతూ, ప్రస్తుతం 1995 లో పిహెచ్. డి. పరిశీలన గ్రంథంగా అచ్చురూపంలో ప్రత్యక్షం కావడం! మరుపురాని మహదానందాన్ని కలిగించే దివ్యానుభూతి గదా!

**ఇట్లా గత స్మృతుల్లోకి వెళితే :**

"మాతాపితా యువతయస్తనయావిభూతిః" అనే తనియన్‌ను మా నాయనగారు ఒక తిరువధ్యయనం రోజున (1943-1944) పలకపై వ్రాసియిచ్చి నాకిచ్చి చదువుమన్నారు. 'మాతా-పితా' అంటే 'అమ్మ, నాయన' అని అర్థం చెప్పినారు. అమ్మా-నాయనలపై పద్యమేమిటని నవ్వుతూ, చదువుతూ నవ్వుతున్నాను. నవ్వగూడదన్నారు. ఐనా నవ్వు మానలేదు. వీపుపై రెండు దెబ్బలు. మొత్తంమీద శోకంతోపాట్లు శ్లోకమబ్బినది. భవిష్యత్తులో కబ్బమబ్బినది! ఇట్లు దారు భవిష్యదాచార్యులను (రామానుజులను) సూచించిన నమ్మాళ్వారులపై తనియన్: "మాతా....శ్రీమత్తదంఘ్రియుగళం ప్రణమామిమూర్ధ్నా" మొదటిసారిగా నా గుండెలో నిలిచిపోయినది. ఆ.సూ.ము. కర్త తన పద్యం "శ్రీ సఖ జాలధిలో....

"నమ్మయాళ్వారు నెమ్మదినమ్మ్మాడనుము"

ఆ తర్వాత : 1945 - 1946 లలో 3, 4 వ తరగతులు చదువుచుండ రోజులు బీబీపేట గ్రామంలో ముకుందమాల ఇత్యాది స్తోత్రాలు - "తిరుప్ప ల్లాండు, తిరుపళ్ళి యొళుచ్చి, తిరుప్పావై" సంత చెప్పించుకోవడం జరిగింది. (శ్రీ వేణుగోపాలస్వామి ఆలయంలో, శ్రీ సీతారామాచార్యుల వారాచార్యులు- వారికి కృతజ్ఞతాంజలులు.)

మా స్వగ్రామం చాడలో బంధువుల సంఖ్య అత్యధికం. రాకపోకలు. ఉత్సవాదుల్లో అందరు గుమిగూడడం, దివ్యప్రబంధానుసంధానములు చేయడం; ఇంకా ఆత్మకూరులో మా మేనమామ తండ్రియైన మా తాతగారు కీ.శే తిరుక్కోవళూరు నర్సయ్య పంతులుగారు పరమభాగవతోత్తములు, బంధుప్రీతి గలవారు. తదీయారాధనలు చేయించేవారు ప్రతిరోజు ఉదయం ముకుందమాలను బిగ్గరగా చదవడం; ఇప్పటివరకివన్నీ నా చెవుల్లో మారుమ్రోగుచునేయుంటు న్నాయి. (1957)

ఇట్లా శ్రవణం, మననం, గతస్మృతుల సంచయం ప్రస్తుత రచనకు ప్రేరేపణలుగా భాసిస్తున్నవి గదా!

ఇక మొదటి సాహిత్య ప్రేరేపణం - భువనగిరి హైస్కూల్లో చదివే రోజులు. (1949-1954) మొదటి సాహిత్యగురువు కీ.శే. చొల్లేటి నృసింహశర్మ కవులు (వారి ఆత్మకు నమస్సులు). ఆ పిమ్మట ఆచార్య కోవెల సంపత్కుమారా చార్యులు (ప్రస్తుతం రిటైర్డ్ ప్రొఫెసర్) 8, 9 తరగతుల్లో పాఠాలు చెప్తూ, కవి సమ్మేళనాదుల్లో పాల్గొనజేసేవారు. ఇట్లా కవితాప్రోత్సాహం లభించినది.

తర్వాత అధ్యాపక జీవితం, సాహిత్యాధ్యయం, రచనలు చేయడం జరిగింది. గోలకొండ పత్రికలో 1955 నుండి గేయాలు, పద్యాలు అచ్చైనవి. 1965 లో M.A. డిగ్రీ పిమ్మట Ph.D. చేద్దామనేకోరిక జనించింది. ప్రతి సంవత్సరమూ అరంభశూరత్వమే మిగిలింది. 1983 లో సిద్ధిపేట డిగ్రీ కళాశా లలో ప్రవేశించిన పిమ్మట తెలుగుశాఖ మిత్రుల ప్రోత్సాహం, సాహితీవికాస మండలి సాన్నిహిత్యం లభించింది. వైష్ణవ సాహిత్యగ్రంథా లెక్కువగా తెప్పించుకొని చదివేవాణ్ణి. 1987 లో జోగిపేట డిగ్రీ కళాశాలకు వెళ్ళిన పిదప ఆచార్యానుగ్రహంచేత Ph.D. పై తీవ్రమైన పట్టుదల కలిగింది. నా మనస్సు లోకి సంప్రదాయ శీర్షిక ప్రవేశించినది.(ఆ.సూ.ము.) ఆచార్య ఎం. కులశేఖరరావు గారితో సంప్రదించినాను. ఇరువురి కోరిక లొకటైనవి. నాకివిషయంలో బాసటగా

యంతో స్వీకరించినారు, మన్నించినారు.

ఇట్లు 'ఆచార్య సూక్తిముక్తావళి'లో తాదాత్మ్యం చెందినాను. ఆరాధ్య విషయంగా భావించుకున్నాను 1992 లో ఉస్మానియా యూనివర్సిటీవారు డిగ్రీ ప్రదానం చేసినారు. ప్రస్తుతం గ్రంథముద్రణం.

భగవద్రామానుజులు నాలో ఆవేశించి వ్యాసాలను వ్రాయించుకున్నారేమో! గ్రంథాన్ని ప్రకటించుకుంటున్నారు. ఇందలి దొసగులు నాయవి. గుణములు భాగవతోత్తములవి.

**గత పరిశోధనలు :** ఈ శీర్షికపై 1995 సం॥ వరకెవ్వరును పరిశోధన చేయలేదు. అసలు సాహిత్య చరిత్రలను వ్రాసేవాళ్ళు దీనిని చూచినారా? అని నా అనుమానం!

**పరిమితులు:** ఆ సూ ము. ఒక బృహద్గ్రంథము. సమగ్ర పరిశీలన క్రిందికి వచ్చు విషయములన్నింటిని 99% వరకు పరిచయము చేసినాను. **సిద్ధాంత వ్యాసమునకు** కావలసినవాటిని విపులీకరించినాను. చారిత్రక విషయములున్నవి గాన **Maps**, పటములు పట్టికలు వేసినాను.

పరికల్పనము : **Hypothesis : లక్ష్యాలు :** ఇది విశిష్టాద్వైత తత్త్వ మహాకావ్యము. ఇంకను సంప్రదాయ శాస్త్రాంశముల దెల్పు మహాగ్రంథము. కావ్య ప్రయోజనముల నాయా సందర్భములలో వివరించినాను. ఆచార్యుల సూక్తులు, హితోపదేశములు- కావ్యానందముతోపాటు లోక కల్యాణము- ఆధునిక (Modern) భావాల కనుగుణ్యముగా సమన్వయము. 'ధర్మోరక్షతి రక్షితః' కదా!

**ప్రత్యేకత :** 'రసమ్పృష్ట పదాక్షర రచన' - ఈ సమాసమును తెలుగు సాహిత్యములో ఇంతవరకు ఎవరును ప్రయోగించలేదు.

ఇంకను కృతివక్తమకుటప్రాయమైన గ్రంథమగుట మరొక **విశిష్టత!**

ఆయా ఆశ్వాసములలోని కథావస్తువును కొన్ని పదముల ద్వారా సూచించుట ఆ.సూ.ము. ప్రత్యేకతయే.

**భాష :** భాషా విషయములో, వాక్యనిర్మాణములో, పద్ధతులలో సులభ గ్రాంథికమునే ప్రయోగించినాను సాధ్యమైనంతవరకు అస్పష్టత రానీయలేదు.

**ఒక సంప్రశ్నం ప్రార్థనము :** ఇట్టి బృహద్గ్రంథమును సాహిత్య చరిత్రకారులు ఎందుకు తమ గ్రంథములలో పేర్కొనలేదు? భవిష్యత్తులోనైనా దీనిగూర్చి వివరములు వ్రాయవలయునని ప్రార్థనము.

ఇందు నేను వదిలిపెట్టిన (అతి సూక్ష్మముగా పేర్కొన్నాను) అంశము లెన్నియో గలవు వాటినొక ప్రణాళికగా (Project గా) చేపట్టవలయునను తలంపు గలదు ఉదా॥ (1) who is who వలె జీవిత సంగ్రహములు. (2) చిత్ర పటములు, చరిత్ర పటములు, పట్టికలు - తిరునక్షత్ర తనియన్‌ల సాహిత్యము. (3) వివాదాస్పద విషయముల పరిశీలనము (4) మత సమన్వయము - విశిష్టాద్వైతము (5) విశిష్టాద్వైత వాఙ్మయసూచిక. గద్య- పద్య- పరిశోధనలు మొదలగునవి.

(1) ఈ గ్రంథములో ముద్రింపబడిని మూదవరాజకవి చేసిన **ఆళ్వారుల స్తుతి** ఇట గమనార్హము : కవి రాజా బహరీపామ నాయకుని భార్గవ పురాణము లోనిది.

"తమ దీప్తిచ్ఛట యచ్యుతైక మహిమా తాత్పర్య దుర్వాదృగా
సమ దర్శిత్వము జేసి లోకతమమున్ సంక్షీణముం జేయుచున్
విమలాత్మస్థితి గల్గునాఘనుల సంవిత్ స్ఫూర్తులం గొల్చెదన్
కమనీయాంగుల, శ్రీపరాత్మవరులన్ బన్నిద్దరన్ సూరులన్."

(2) రామానుజుల గూర్చి ఒక మహనీయుడన్న వాక్యములు జాతీయ సమైక్యతకు, మానవత్వమునకు మూలాధారములని నా మనవి. శంకర - రామానుజ - బుద్ధుడు ఇతర మహనీయు లారాధ్యులు-ఇది మత సమన్వయము గదా! చూడండి :

"Ramanuja has combined in himself the propoundity of a thinker, the humanity of a SAINT the heart of BUDDHA the head of SANKARA, and a very great religious, spiritual fervour; and mention of RAMANUJA without SANKARA, and vice versa will be incomplete."

ఇక అ.సూ.ము. లోనికి ప్రవేశించండి. ఆహ్వానం! ఎందుకనగా రామానుజుల ప్రబంధములు (సూక్తులు) మనకాశ్రయభూతములు గదా!

"యతిపతిద్ద ప్రబంధమ్ములాశ్రితులకు
దాపముల బాపి, సుఖముల దనుపు గనుక
తత్ప్రబంధార్థవేత్తలే ధన్యులనుచు
వాది భీకర గురుడనె మోదమలర!"

# కృతజ్ఞతాంజలి

ఈ సిద్ధాంత గ్రంథమును చక్కగా పరిశీలించి ఆలోచింపదగిన, సార్థకమైన సూచనల జేయుచు మంగళాశాసనముల కృపజేసిన దయాసముద్రులు శ్రీశ్రీశ్రీ త్రిదండి చిన్న శ్రీమన్నారాయణ రామానుజ జీయరు స్వామివారికి సాష్టాంగ ప్రణామములు, కృతజ్ఞతలు.

ఇక నాకు పర్యవేక్షకులై వ్యాసరచనకు సంపూర్ణ స్వేచ్ఛనిచ్చి, ఆశీస్సులొసంగిన అమృతహృదయులు డాక్టరు కె. వి. సుందరాచార్యుల వారికి;

ఈ సిద్ధాంత వ్యాసరచన ద్వారా తన చిరకాల వాంఛితము నెరవేరినదని సంబరపడి అభినందనలందించిన విశాల హృదయులు, విద్వత్పరిశోధకులు ఆచార్య ఎం. కులశేఖరరావుగారికి;

ఈ గ్రంథమును చూచి సంతోషమును ప్రకటించి అభినందనాశీస్సులిచ్చిన నా చిన్ననాటి గురువరేణ్యులు, పండిత కవులు ఆచార్య కోవెల సంపత్కుమారాచార్యులవారికి;

ప్రస్తుతము 'సత్పథః' రహస్యార్థశ్లోకావళిచే నన్నభినందించుచు ప్రశస్తి కావ్యాన్ని ముద్రించుట శేషత్వ లక్షణాలలో నొకటని మంగళాశాసనము లందించిన మహావిద్వాంసులు ఉ. వే. శ్రీమాన్ కె వి రాఘవాచార్యులవారికి;

రమణీయములైన పద్యత్రయములచే మంగళాశాసనములు పల్కిన విద్వత్కవులు శ్రీమాన్ వేముగంటి నరసింహాచార్యులవారికి;

పైవారందరకును భగవద్భాగవతాచార్య - గురుశిష్య సంబంధ సహిత దాసభావనాపూర్వక కృతజ్ఞతాంజలులు.

మరి లేఖలద్వారా సమాచారము లందించిన పెద్దలందరకును; నేను సంప్రదించిన గ్రంథములు, పత్రికలెన్నియో గలవు - తత్కర్తలందరకును నమస్సులు, కృతజ్ఞతలు,

ప్రస్తుతము ఉస్మానియా యూనివర్సిటీ తెలుగుశాఖ అధ్యక్షులు ఆచార్య ఎన్ గోపీగారికి, ఆచార్య ఎస్ వి. రామారావుగారికి, ఆచార్య ఎల్లూరి శివారెడ్డి గారికి, డాక్టర్ కసిరెడ్డి వెంకటరెడ్డిగారికి, మిగతావారందరకును స్నేహార్ద్ర కృతజ్ఞతాంజలులు.

నా సిద్ధాంత వ్యాసగ్రంథమును పరిశీలించిన నిర్ణేతలు; నివేదికలందించిన వారు: ఆచార్యులు డి. చిన్న కృష్ణయ్యగారికి (మద్రాసు - వీరు 1875 సం॥ ఆ.సూ.ము. ప్రతి ఉపోద్ఘాతము Xerox Copy ని పంపి నాలో ఉత్సాహాన్ని రేకెత్తించినవారు); మరియు ఆచార్య కె వి సర్వోత్తమరావు (తిరుపతి) గారికి; ఆచార్య కోలవెన్ను మలయవాసిని (విశాఖపట్నం) గారలకు నా హృదయ పూర్వక నమస్సులు.

ఈ సిద్ధాంత వ్యాసరచనకు అవకాశము కల్పించిన ఉస్మానియా విశ్వ విద్యాలయాధికారులకు, అనుమతి నొసంగిన రాష్ట్రప్రభుత్వ ఉన్నతాధికారులకు నమస్సులు.

ఈ గ్రంథ ముద్రణమును ప్రోత్సహించిన నా ఆత్మీయులు:

నా బావమరదులు : చి॥ తిరుకోవళూరు నరసింహస్వామి, చి॥ కృష్ణ స్వాములకు;

తమ్ముళ్లు : చి॥ స్వామినాథం, (ప్రిన్సిపాల్) చి॥ మధుసూదనస్వామి, చి॥ జగన్మోహన స్వామి, షడ్డకుడు చి॥ దాస్యం సీతారాములకు;

నా కుమారులు : చి॥ వెంకటరమణ (సర్పంచ్), చి॥ యాదగిరిస్వామి; కుమార్తె చి॥ ప్రసూన, అల్లుడు చి॥ పరవస్తు రఘువీర్‌లకు ఆశీస్సులు.

శ్రీ టి అనంతస్వామి, శ్రీ యాదగిరిస్వామి మరియు శ్రీ ఎం.వి. కృష్ణ (H.M) అల్లుడుగారికి నమస్సులు.

ఈ సిద్ధాంత వ్యాసరచన లిఖిత ప్రతులలో శీర్షికలను పెయింట్ చేసిన నా చిన్నికుమారుడు చి॥ మురళీమోహన్ B.E. కి; 'శ్రీసఖజలధి' చిత్రమును గీచి యిచ్చిన నా పెద తమ్ముని కుమారుడగు డాక్టర్ నరసింహస్వామికి; అట్లే

ఈ సిద్ధాంత వ్యాసరచన నిమిత్తము సమాచార సేకరణ చిత్తుప్రతులకు సకలు స్వంత దస్తూరీతో వ్రాసి పెట్టి, ఇప్పుడు గ్రంథముద్రణ విషయములో నాకు సర్వస్వమై ధైర్యమును కల్పించిన నా సహధర్మచారిణి చి॥ అనసూయాదేవికి - అందరకును అనేక మంగళాశాసనములు.

ఆప్తబంధువర్గమునకు; ప్రత్యక్షముగను, పరోక్షముగను తోడ్పడిన సహృదయులందరకును, ప్రస్తుతము నేను పనిచేయుచున్న జోగిపేట ప్రభుత్వ డిగ్రీ కళాశాల ప్రిన్సిపాల్ డా॥ మోహన్‌జిత్‌సింగ్ గారికి, ఆధ్యాత్మికమిత్రులు శ్రీ పాండురంగం గారికి, మిగతా మిత్రమండలికి, శ్రీ పి. సంగారెడ్డి (మెదక్, తెలుగుశాఖ) గారికి నమస్కృతులు.

గ్రంథ ప్రచురణముకు ప్రోత్సాహము నిచ్చిన సహృదయులు రామానుజ సంక్షేమ పరిషత్ - ఆం ప్ర. - (చాత్తాద శ్రీ వైష్ణవ సేవాసంస్థ) కార్యవర్గ సభ్యులైన శ్రీ దాస్యం వేణుగోపాల స్వామి, శ్రీ కర్పూరం వేంకటేశ్వర్లు ప్రొఫెసర్ శ్రీ హెచ్. వెంకటేశ్వర్లు, శ్రీ టి.వి. శేషయ్య, డాక్టర్ దాస్యం శ్రీధర్, శ్రీ పి. కృష్ణమూర్తి గారలకు, మరియు ఆత్మీయులకు మనసారా కృతజ్ఞతాంజలులు.

ఈ గ్రంథమును శోభాయమానముగా ముద్రించి యిచ్చిన పద్మావతీ ప్రింటర్స్ అధినేత శ్రీ పి. శ్రీనివాస్ గారికి, వారి సిబ్బందికి హార్దిక కృతజ్ఞతాంజలులు

ఆర్థికసాయమందించినవారికి కృతజ్ఞతలు

**కృతికర్త కేశవార్యుల**

**కృతిభర్తలు "ఉడయవరుల" కృతివక్తలుగా**

**ప్రతివాది భీకరార్యుల**

**స్తుతియింతును 'వ్యాఖ్యానములను' తోరపు భక్తిన్.**

ఇట్లు

**రచయిత**

# విషయసూచిక

శ్రీమతే రామానుజాయ నమః

"శ్రీ మద్వేదాంత సిద్ధాంత స్థాపనా నిత్య దీక్షితమ్।
శ్రీమన్నారాయణం వందే భాంతం సూరిగురూత్తమమ్॥"

# ఆచార్య సూక్తిముక్తావళి – పరిశీలనము

## కవి పరిచయము - ఇతర విశేషములు :

శ్రీమన్నారాయణుడే పరతత్త్వమని సంస్థాపన చేయు సిద్ధాంతముల కాకరమైనట్టివి విశిష్టాద్వైత తత్త్వశాస్త్ర గ్రంథములు. ఇట్టి తత్త్వ విషయముల నింపారు శైలిలో ప్రబంధింపజేసి, పలువురను చదువునట్లు చేయించి, సంప్రదాయ రహస్యములను, పరమార్థములను, పరమ రమణీయముగా చిత్రించి, రసాస్వాదన మొనరింప జేయునవి కావ్యములు, ప్రబంధములు. ఇట్టి ప్రబంధము లెన్నియో భాషలలో వెలువడి యుండవచ్చును. అట్లే తెలుగులో కూడ విశిష్టాద్వైత తత్త్వ కావ్యములు వెలసినవి. కావ్యములకు కథా వస్తువులుండును గదా! ఆ కథా వస్తువులకు మూల పదార్థములు ఆళ్వారుల, ఆచార్యుల జీవిత విషయములును, హితోపదేశములున్నూ. వీటికి సౌందర్య సౌకుమార్య సౌశీల్య సౌలభ్య వాత్సల్యాది గుణముల నాపాదించి, శబ్దార్థ దాంపత్య సంపత్తుల నొకచో ప్రోదిచేసి, సర్వ జనోపభోగ్యమైన భగవద్గుణానుభవమను దివ్యామృతమును పంచిపెట్టు యుద్దేశముతో ప్రబంధ నిర్మాణమును గావించినవారు కొందరే కన్పట్టుచున్నారు. ఆ కొందరిలో శ్రీమాన్ నంబూరి కేశవాచార్యులవా రగ్రగణ్యులు. వీరు ప్రసాదించిన బృహత్ గ్రంథరాజము పేరు "ఆచార్య సూక్తిముక్తావళి." ఈ గ్రంథము సార్థకనామధేయ వైభవోపేతము. దీనిని నిరూపించుటకు ముందు "కవి పరిచయము"ను గావింతును.

### ముందుగా కవి జీవిత కాలమును గూర్చి :

వాఙ్మయచరిత్రలు, సాహిత్య చరిత్రలు తిరుగవేసినచో కవుల సమాచారము దొరకుననుట అందఱకును తెలిసిన విషయమే. ఎందులకో గాని

ఈ గ్రంథము పేరు, కవి పేరు చరిత్ర పుటలలోని కెక్కలేదు. మరి ఆధార మేమనగా :

గ్రంథము చివర గ్రంథకర్తృ వృత్తాంతము గలదు. ఇదియును సంపూర్ణ జీవిత విశేషముల తెలుపదు. కవి తాను జన్మించిన సంవత్సరమును తెలుపలేదు. ఐనను కొన్ని విధములైన సమాచారములను క్రోడీకరించి, ఒక నిర్ణయమునకు రాసమకట్టుటకై నేను గావించిన ప్రయత్నములివి.

**I. కొందఱు రచయితలు, సాహితీవేత్తలు ఆయా గ్రంథములలో పేర్కొనిన విషయములు :**

(a) సకల జీవ సంజీవనము :- TTD ప్రచురణ 1983. పీఠిక: డా. బి. రామరాజుగారు "ప్రాచీనులలో చివరివాడైన నంబూరు కేశవాచార్యులు (1650) రచించిన ఆచార్య సూక్తిముక్తావళి భగవద్రామానుజుల జీవితాన్ని మనోహరముగా వర్ణించే ప్రబంధం."

(b) తెలుగు విజ్ఞానసర్వస్వము : 4 వ సంపుటి. తెలుగు సంస్కృతి-2. తెలుగుభాషా సమితి. 720 వ పుట:- ఇందలి ఒక వ్యాసము ఆ.సూ.ము గూర్చి గలదు. రచయిత శ్రీ బొమ్మకంటి శ్రీనివాసాచార్యులు.

"ఇతని కాలము ఇదమిత్థమని నిర్ణయింప వలనుపడకున్నను ఇతడు చాల అర్వాచీనుడనుట స్పష్టము."

**II. గ్రంథకర్తృ వంశవృత్తాంతమునుబట్టి ఒక ఆధారము :**

ఇందలి నాగలాపుర ప్రసక్తి ననుసరించి లభించిన సమాచారము ఇది. చారిత్రక విషయము.

**"మన ఆలయములు - చరిత్ర" టి.టి.డి. ప్రచురణ 1980 :**

శీర్షిక : నాగలాపురం - నాడు - నేడు. పుటలు : 192-216,217.

రచయిత : శ్రీ పాయసం సుబ్రహ్మణం "ఆంధ్రపత్రిక దినపత్రిక సౌజన్యంతో సారస్వతానుబంధంనుంచి పునర్ముద్రితం."

నాగలాపురం : మద్రాసు - తిరుపతి బస్సు మార్గమధ్యన గలదు. తెలుగు దేశంలో శిల్పచాతుర్యానికి, వాస్తు వైభవానికి ఆటపట్టయిన ప్రాచీన దేవాలయా

లలో శ్రీ వేదనారాయణస్వామి దేవాలయం ప్రాబల్యం వహిస్తున్నది. శ్రీకృష్ణ దేవరాయలు శ్రీ వేదనారాయణస్వామి కైంకర్యం కోసం ఈ యూరికి తన తల్లి నాగలాదేవి పేరుతో నాగలాపురమని నామకరణం చేసి అర్పించారు.[1] విజయ నగర సామ్రాజ్య పతనం తర్వాత ఈ దేవాలయం పూర్తిగా ఉపేక్షితమైనది. కొంతకాలానికి వాహనాలు జీర్ణమైనవి. ఈ ప్రాంతం కాలక్రమాన ఆర్కాటు నవాబుల పాలన క్రిందికి వచ్చింది. దేవాలయ కైకర్యం[2] రాజోచితంగా జరి పించాలని పలువురు ఆచార్యులు, ప్రముఖులు పాటుపడ్డారు వారిలో అగ్ర గణ్యులు "అప్పటి ప్రతివాది భయంకరం అణ్ణంగరాచార్యులు." వారు తమ శిష్యుడు నంబూరి కేశవాచార్యులను ఆర్కాటు నవాబు వద్దకు పంపారు. ఆయన జగన్నాథరావు అనేవారి ద్వారా నవాబు దర్శనం సంపాదించి, వేదనారాయణ స్వామి దుస్థితిని తెలిపి, రాజముద్రాముద్రితమైన ఆజ్ఞాపత్రం తెచ్చి గురువునకు అందజేశాడట అప్పటినుంచి యథావిధిగా మళ్ళీ నిత్యోత్సవ విశేషోత్సవాలు జరగడం మొదలయింది.[3] "రాజముద్రాముద్రితంబైన పత్రంబు గైకొని 'వత్సా! నీవు మాకభితద్బ్రా తుండవు. రెండవ పుత్రుండవని మిగుల సంతసించుచు మహా నుగ్రహంబొసర్చె."[4]

III. కృతికర్తనుబట్టి :

కృతికర్త పూర్వీకుడు "ప్రతివాదిభయంకరం" అను బిరుదమునందిన మొదటి అణ్ణంగరాచార్యుల జీవితకాలము 1350 - 1450 A.D. నడుమ. వీరు సుప్రసిద్ధమైన శ్రీ వేంకటేశ్వర సుప్రభాతమున్రాసిన వారు.[5] మొదట శ్రీ వేదాంతదేశికుల కుమారుడగు నయనాచార్యుల శిష్యుడు. పిమ్మట మణవాళ మహామునుల నాశ్రయించి, వారి అష్టదిగ్గజములలో నొకరైనారు. (నయనారు

1. నాగలాపురప్రాంతమే షడారణ్యము. అరుకాడు అర్కాటు యైనది.
2 దేవాలయ పూజా కైంకర్యాల కోసం 300 రు. ఇచ్చేవారు. పుటలు-216, 217. రచన. శ్రీ గోపీకృష్ణ.
3. TTD వారి ప్రచురణ. "శ్రీనివాసమంగాపురం - మరియు మన ఆలయముల చరిత్ర. 216, 217 పుటలు.
4. ఆచార్య సూక్తిముక్తావళిలోని గ్రంథకర్తృవృత్తాంతము. పుటలు 620-623.
5. డా. వేటూరి ఆనందమూర్తిగారి - తాళ్ళపాక వారి సాహిత్య పరిశీలనము.

దేశికులకాలము. 1316 క్రీ.శ. నుండి సుమారు 100 ఏండ్లు; యామునులకాలము 1370 - 1444 లేదా 1456 క్రీ.శ.) వయస్సులో పైవారికన్న చిన్నవారు గాన వీరు 1350 న గాక 1390 లో జన్మించి యుండుట కవకాశమున్నది. పై వారు పరమపదమునకు వేంచేసిన పిమ్మట గూడ వీరు జీవించియుండిరి. ఇట్లు మొదటి ప్ర. భ. అణ్ణంగారి కాలము 1390 . 1490 అగుటకు వీలగుచున్నది. వీరికి ఈ ప్రబంధమునకు వక్తయగు "వాదిభీకరగురుడు" 8 వ తరము వాడు. 8 వ తరము వచ్చుటకు కనీసము 300 సం॥లు కావచ్చును. 1490 + 300 = 1790 యగును గాన, నంబూరి కేశవాచార్యులవారు 1790 గాకున్నను క్రీ.శ. 1750 లేదా 1790 నుండి 1850, 1870 వరకు జీవించియుండుట కవకాశము గలదు. (కృతివక్త వంశపట్టికను జూడుడు.)

పై యంశములనుబట్టి ఈ క్రింది నిర్ణయములు చేయగలము :

1. గ్రంథకర్తయును, గ్రంథవక్తయును ఇరువురును ఆర్కాట నవాబుల కాలములోనున్నవారు. చివరి నవాబు కాలము. 1754 క్రీ.శ. ఇట్లీకవి 1754 పిమ్మట 80, 90 ఏండ్ల వరకు జీవించి యుండవచ్చును.[1]

2. ఆచార్యులు శిష్యుని "అభిమతచ్ఛాత్రుండవని" సంబోధించినారు. దీనినే నంబూరి కేశవాచార్యులవారు తమ గద్యలో వేసికొన్నారు. "ఇది శ్రీ భగవ ద్రామానుజ కరుణాకటాక్షకలిత కవితావైభవ ప్రతిభయంకర ఆచార్యాభిమత చ్ఛాత్ర" - ఇట్లు సాగినది.

3. దీనిని బట్టి అభిమతచ్ఛాత్రుడను విశేషణము లభించిన పిమ్మటనే యీ గ్రంథరచన కారంభించినాడు.

IV. ముద్రణాసౌకర్యమునుబట్టి :

క్రీ. శ. 1746 - 1747 లో బెంజమిన్ షూల్జ్ అధ్వర్యంలో తొలి తెలుగు గ్రంథం బైబిలు జర్మన్‌లోని హాలెనగరంలో అచ్చుకావడంతో తెలుగు ముద్రణ ప్రారంభమైనది. 1812లో బళ్ళారిలో, పిమ్మట విశాఖపట్టణము, తిరుపతిలో సౌకర్యాలు గల్గినవి. 1816 నాటికి మద్రాసు కాలేజీలో ముద్రణ సౌకర్యాలు

---

[1] భారతదేశ చరిత్ర-సంస్కృతి II. తెలుగు అకాడమి 1983. పుటలు 272.

తెలుగులో అసంఖ్యాకముగా గ్రంథములు అచ్చైనవి. గాన ఆ. సూ. ము. ప్రప్రథమ ముద్రణము క్రీ. శ. 1831 పిమ్మటనే జరిగియుండవచ్చును. తర్వాత సం॥ 1911 ప్రతి వచ్చినది. ప్రప్రథమమున చిలకల ప్రెస్సులనబడు యంత్రములున్న కాలమున ముద్రణ జరిగినట్లు అనగా గత శతాబ్ది చివరి భాగమున కావచ్చునని ఈ గ్రంథము యొక్క ఉపోద్ఘాతములో గలదు. అనగా, 1870 సం॥ అగుటకు వీలున్నది. ఇది కవి వృద్ధాప్యదశ. ప్రప్రథమ ముద్రణ మును కవి స్వయముగా చూచినాడనుట కవకాశములున్నవని ఒక యభి ప్రాయము గలదు [1]

V. గ్రంథ కథాభాగమునందలి చారిత్రక వ్యక్తులనుబట్టి :

ఆ. సూ. ము. పుట 290 లో ఈ కవి ఔరంగజేబు పేరును పేర్కొన్నాడు. ఇతడు మొగలు చక్రవర్తి. కాలము 1618 - 1707. ఔరంగ జేబు దండయాత్రలు అతని మరణము పిమ్మట చరిత్రప్రసిద్ధమగును గదా! కావున నంబూరి కవి కాలము 1707 సం॥ తర్వాతిదగునని ఖచ్చితముగా తెలుప వచ్చును. అనగా 1750 సం॥ పిమ్మట 80, 90, 100 సం॥లు జీవించియుండ వచ్చును.

VI. ఆ సూ.ము. ని అనుకరించినట్లు కన్పట్టు గ్రంథములనుబట్టి అంచనా:

1. ముముక్షుజనకల్పకము : కవి శ్రీ అచ్చి రామానుజాచార్యులు. (వరద ప్రింటర్స్ పీఠిక. 1972 గుత్తావిల్లి. జిల్లా శ్రీకాకుళం.) : ఆ. సూ. ము. వలె కృతివక్త పద్ధతిని కవి అనుకరించినాడు. పెక్కు పద్యములలో ఆ.సూ.ము. ప్రభావము కన్పించును. ఛాయలు గోచరించును. ముముక్షుజనకల్పక ప్రప్రథమ ముద్రణము క్రీ.శ. 1872 లో జరిగి యుండవచ్చునను యభిప్రాయము గలదు. ఐనచో అంతకుముందే ఆ. సూ. ము. ని చదువుట ప్రచారములో నున్నదన వచ్చును. "అచ్చి"వారికాలము 1700 సం॥ ప్రాంతమని శ్రీ ఆరుద్రగారు తెలుపు

---

1. డా॥ టి. వి. రాఘవాచార్యులు (ఉపన్యాసకులు, విశిష్టాద్వైత విభాగము, కేంద్రీయ సంస్కృత విద్యాపీఠము, తిరుపతి)గారి యభిప్రాయము.

చున్నారు.[1] ఇదియును ఖచ్చితమైన నిర్ణయముగాదు. ప్రప్రథమ ముద్రణమును బట్టి 1872 సం॥వరకంచనా వేయవచ్చును.[2]

శల్వపిళ్ళరాయ చరిత్ర : కవి ఆసూరి మరింగంటి నరసింహాచార్యులు. (ద్వితీయ) ఈ గ్రంథముపై ఆ సూ. ము. ప్రభావము గలదని డా. రంగాచార్య (తెలుగు ఉపన్యాసకులు, పాలెం) తెలుపుచున్నారు. కవి కాలము 1680 లేదా 1770 సం॥ ప్రాంతమని వ్రాసినారు[3] ఒకవేళ వీరు 1770 సం॥ నుండి 100 సం॥లు జీవించినచో వీరికాలము 1870 వరకు పొడిగించవచ్చును. ఇట్లు నంబూరి కేశవాచార్యుల వారికాలము 1830, 1840 వరకైనను లాగవచ్చును. మొత్తము మీద నంబూరివారు శల్వపిళ్ళ రాయ చరిత్ర కర్తకు పూర్వీకుడే యగును.

VII. **మౌఖికముగా, లేఖల ద్వారా సమాచారమును సేకరించుటనుబట్టి :**

(1) 90% వరకు సాహిత్యవేత్తలు, సంప్రదాయవేత్తలు ఈ కవికాలమును గూర్చి పట్టించుకొనలేదు. ఇదమిత్థమని మౌఖికముగా ఎవరును తెలుపలేదు. 18 వ శతాబ్దము, 19 వ శతాబ్దమని దాటవేసినారు.

(2) లేఖలద్వారా కొందరు పెద్దలు తెలిపిన విషయములు:

1700 - 1800 A.D. కవి జీవించి యుండవచ్చునని ఊహ చేసినవారు డా. టి. వి. రాఘవాచార్యులు. ఉపన్యాసకులు - కేంద్రీయ సంస్కృత విద్యా పీఠము, తిరుపతి; సుమారుగా 19 వ శతాబ్దము అని వ్రాసినవారు శ్రీ అచ్చి శ్రీనివాసాచార్యులు. ఉపన్యాసకులు - సంగారెడ్డి; డా. రంగాచార్య. తెలుగు ఉపన్యాసకులు - పాలెం వారు ఈ కవి కాలము క్రీ. శ. 1700 సం॥ కావచ్చునన్నారు

---

1. సమగ్రాంధ్ర సాహిత్యం, 8 వ సంపుటము, 270 వ పుట.
2. ముముక్షుజనకల్పక పీఠిక, 1972 ప్రచురణ.
3. మరింగంటి కవుల సాహిత్య సేవ డా॥ రంగాచార్య పాలెం, పుటలు, 42, 172.

VIII. సమన్వయము :

అన్ని పరిశీలనలను సమీకరించిచని పిమ్మట నంబూరి కేశవాచార్యుల జీవిత కాలము క్రీ.శ. 1750 - 1850 సరియైనదని నా యభిప్రాయము. ఇందులకు బలమైన ఆధారములు, 1 కృతివక్త కాలము 2 ఔరంగజేబు జీవిత కాలము 3. ఆర్కాటు నవాబుల ప్రసక్తి[1] మున్నగునవి నిదర్శనములగును.

**కవి వంశ వృత్తాంతము :**

తన పూర్వీకుల పాండిత్య ప్రతిభా విశేష సద్గుణ సంపదల నీకవి దీర్ఘ సమాస విశేషణములచే కొనియాడినాడు. పేర్ల వివరములిట్లున్నవి:

| | | | | | |
|---|---|---|---|---|---|
| కులము | : | విప్రవరుడు ; | గోత్రము | : | కణ్వసగోత్రము. |
| సూత్రము | : | ఆపస్తంబ ; | శాఖ | : | యజుశ్శాఖ |
| మతము | : | శ్రీవైష్ణవము ; | మాతృభాష | : | తెలుగు |

నివాసము : మంగళగిరి ప్రాంత నంబూరు యను గ్రామము. (గుంటూరు సమీపము);

ఇంటి పేరు : నంబూరి.

**తండ్రిననుసరించిన వంశవృక్ష పట్టిక :**

1. శ్రీరామసుధీవరుడు
   - → ఇతని కుమారుని పేరు తెలియదు. మునిమనుమని (నప్త) పేరు
2. జగన్నాథసూరి
   - → ఇతని కుమారుని పేరు తెలియదు. మనుమడు

---

1. ఆ.సూ ములో ఆర్కాటు నవాబు పేరు, కాలము లేదు. ఔరంగజేబు ఆర్కాటును పాలనా కేంద్రంగా చేసి కర్ణాటకంపై ప్రత్యేక నవాబును నియమించినాడు. నిజాముల్ముల్కు-గూడా 1749 నుండి నవాబులను ఏర్పాటు చేసెను. 1749 - 1874 వరకు పాలనలు సాగినవి.
(The Nawabs of Arcot :- Advanced History of India. by Macmillan India Limited. pagss : 1988.)

↓

4. వేంకట కృష్ణార్యుడు + ఇతని భార్య : అలుమేలుమంగ

↓

5. నంబూరి కేశవాచార్యులు : ఆ.సూ.ము. కృతికర్త.

పూర్వీకుల ప్రతిభా పాండిత్యములు, సంప్రదాయ రహస్య విజ్ఞాన గరిమలు ఈ కవికి వారసత్వ సంపదవలె పుట్టుకనుండియే అబ్బినవనుట సత్యదూరము గాదు. ఒకవేళ తండ్రి తాతలనుండి పాండిత్యమబ్బదన్నచో; పరిసర వాతావరణ, కుటుంబ జీవన విధాన ప్రభావములు, కౌతూహల సహజాతములు, నిరంతర విద్యాభ్యాస చింతనములుండుటకు వీలుండి ఇట్లు అనగా కవి - పండిత కవి యగునట్లు చేసెనని చెప్పుట సమంజసమే యగును.

**కవి పూర్వీకుల పాండిత్యమును గూర్చి :**

1. ఈ కవి ముత్తాతలలో మొదటివాడు శ్రీరామ సుధీవరుడు:
   —శంఖచక్రోర్ధ్వపుండ్రాది విష్ణు లక్షణంబులు గలవాడు.
2 ముత్తాత జగన్నాథుడు సుకవీంద్రుడు, అట్లే :
3. తాతయగు కేశవసూరియు కవీశ్వరుడు
4. ఈ కవి తన తండ్రియగు శ్రీ వేంకట కృష్ణార్యునకు వాడిన విశేషములు
   a) పరవాదిభీకర నయనాచార్య శ్రీపాదారవిందపానమత్తతుందిలేందిందిర పురందరుండును;
   b) శ్రీ లక్ష్మీనారాయణార్య ప్రసాదాసాదిత శ్రీ భాష్యాది గ్రంథ తత్త్వార్థానుభవ జనిత మహానందకందళిత హృదయారవిందుండును;
   c) శ్రీ మంగళాద్రి నృసింహ ముఖోల్లాసకర సర్వ విధ కైంకర్య నిర్వాహకుండును;
   d) నిత్య నిరతిశయ తదీయారాధనాపరుండును;
   e) శ్రీ శఠారిదాసాభిధానదాస్యనామాభిరాముండును;
   f) ఉభయ కవితా పితామహుండునగు శ్రీ వేంకట కృష్ణార్యునకు.

| | | |
|---|---|---|
| 5. | ఈ కవి మేనమామ (పేరు లక్ష్మీనారాయణుని) వైదుష్యము (తల్లి యగు అలమేల్మంగకు సహోదరుడు)<br><br>—పాండితీగరిమ, సంప్రదాయజ్ఞానమిందు స్పష్టము. | శ్రీరంగధామంబున మకుళాభరణ రామానుజ సంయమీంద్రుని సన్నిధి నిరువదినాల్గు హాయనంబులు గురుకుల వాసంబు జేసి "కాణాద - పాణినీయ, పూర్వమీమాంసాది సామాన్య శాస్త్రంబులను, ఉభయ వేదాంతంబుల, నష్టాదశ రహస్యంబుల నధికరించి శమదమానంత కల్యాణ గుణ పరిపూర్ణుండై, శ్రీ పరాశర గోత్రుండగు లక్ష్మీనారాయణార్యునకు సహోదరియైన అలమేల్మంగకు పుత్రుండనై జన్మించినవాడ" అని ప్రౌఢముగా వ్రాసికొన్నాడు. |

—ఇతని దాస్యనామము : నారాయణదాసుడు.

(దీనినిబట్టి ఈ కవి తన మేనమామయగు లక్ష్మీనారాయణుని వద్ద చదువు నేర్చెనని కొందఱి యభిప్రాయము).

—ఇతని వ్యవహారనామము : కేశవాచార్యులు. "నంబూరి కేశవయ్య" అని గూడ పేర్కొనబడినాడు. (ఆముక్తమాల్యద పర్యాలోకనము, పుట - 46.)

కవికి పూర్వవయస్సులో (తన ప్రాథమిక వయస్సులో కలిగిన మానసికాందోళనము; తన్నివారణ కథాసందర్భములు; వాదిభీకరగురుడు కవి నంగీకరించి సకల విహితంబుల నొనరించిన తెఱగు; "ఆచార్య సూక్తిముక్తావళి" ఆవిర్భావ-కారణములు; ప్రేరేపణాది విషయములు :

## 1. శ్రీ శఠకోపదేశికుడను బ్రహ్మచారి కవిననుగ్రహించిన విధము :

ఎందులకోగాని, ఈ కవి తన చిన్నతనములోనే మానసికాందోళనమునకు గురియైనాడోయేమో గాని ఊర్ధ్వపుండ్రములు దాల్చియు, తాపసవేషములో శ్రీరంగాది దివ్యదేశముల సేవించుకొని, తీర్థయాత్రలను కొనసాగించుచు "అంజనాచలము" చేరుకొనెను. అచటగల మైసూరివారి మఠములో శ్రీ శఠకోపదేశికుడను బ్రహ్మచారి ఒక వైష్ణవ బాలునకు శ్రీ సూక్తమును చెప్పుచుండగా చూచి

ఈ కవి దేశికులవారికి ప్రణమిల్లెను అంతట దేశికులవారు కవిని కొన్ని ప్రశ్నలడిగి, వంశ విషయములు తెలిసికొని; స్వరూపవిరుద్ధమైన సన్యాసివేషమును విసర్జించి, భగవదాచార్య సన్నిధిలో స్వరూపగ్రంథంబుల నధికరింపుమని మిగుల నాదరపూర్వకముగా నాజ్ఞాపించెను.

## II. అణ్ణంగరాచార్యులవారు కవిననుగ్రహించిన విధము :

అదే సమయములో కవిస్వాచార్యులగు ప్రతివాదిభయంకరం అణ్ణగంరాచార్యులు (వాదిభీకరగురుడు, కృతివక్త) అచటికి వేంచేసిరి. కవి వారికి సాష్టాంగ ప్రణామంబు లాచరించి, తన వంశ పరిచయమును, బదరికాశ్రమ ప్రయాణ వృత్తాంతమును తెలిపెను. అపుడాచార్యవర్యుడు "నీవస్మదీయుండవు. ఇది స్వరూపవిరుద్ధమగు వేషము. ఈ పూర్వ వయస్సు విద్యాభ్యాసమునకు సాధనమగును అటుపైన ఇష్టమైన క్షేత్రమునకు వెళ్ళి తపస్సు చేసికొనవచ్చును. ఇప్పుడు నావద్ద స్వరూపగ్రంథముల నధికరింపుమని నియమించెను; వీర రాఘవస్వామి సన్నిధి సామాన్యశాస్త్ర గ్రంథము లధికరింపుమనిగూడ నుడివెను. వీర రాఘవస్వామి సన్నిధికి వెళ్ళుటకు యిష్టములేకున్నను కవి తనకైతన భక్తిని జూపి అట నివసించు చుండగా నొక సంఘటన జరిగెను. అదియే కవి స్వప్న వృత్తాంతము........

## III. కవి స్వప్నవృత్తాంతము :

ఒకరోజు విల్లిపుత్తూరు నుండి ఇరువురు శ్రీవైష్ణవులు (అణ్ణంగారి నాశ్రయించినవారు) అంజనాద్రికి రాగా, వారిననుగ్రహించి అణ్ణంగారు వారితోపాటు మహిసూరివారి మండపము ప్రవేశించి, ఆ రాత్రి అట విశ్రమించిరి. ఈ కవియు వారి ననుసరించెను. అప్పుడంజనాద్రీశుండా దేశికేంద్రునకు (అణ్ణంగారికి) ప్రసాదము నంపెను. ఆచార్యులవారు దానిని స్వీకరించి, సంశ్రితులతో పాటు ఆరగించి, శేషమును దాసునకు (కవికి) అనుగ్రహించిరి. దానిని స్వీకరించిన కవి తనను కృతార్థుడుగా భావించుకొని ఆ మఠములో నొక్కచో నిద్రించుచుండగా, అపర రాత్రంబున నొక స్వప్నమును గాంచెను. దాని వృత్తాంతమేమనగా—

"విల్లిబుత్తూరునుండి వచ్చిన ఇరువురు వైష్ణవులలో ఆళ్వారని పేరుగల యాతడు కవి చేతిని పట్టుకొని లేపి, నిరుపమానమైన సౌందర్య సంపదచే నొప్పుచున్నట్టి, దరహాసము లొలికించునట్టి అణ్ణంగరాచార్యులను జూపి, సాష్టాంగ నమస్కారము చేయించెను. పిమ్మట కవి తలపై గురువు పాదములుంచి, కవి చేతిని ఆచార్యుల చేతిలో నుంచి, వీనిని విడువకుడని ప్రార్థించెను." అంత కవికి మెలకువ వచ్చినది. తన స్వప్నమును ఆచార్యులవారికి నివేదింప నాతడు శిష్యు ననుగ్రహింపదలచి "ఇటమీదనైనను నా హితోపదేశము రుచించునా?" యని అడిగియ్యగా, కవి మిగుల భయపడి వారికి సాష్టాంగ ప్రణామము లాచరించెను. తదనంతరమా గురువరేణ్యులు కవిని తన గృహంబునకు తీసికొని వెళ్ళి, అతని తపో వేషమును తొలగించివైచిరి. అటుపిమ్మట కవిదాసునకు శ్రీపాదతీర్థ తళిహ ప్రసాదముల నొసంగిరి.

## IV. కవి మంత్రోపదేశమును బడసిన తీరు :

అణ్ణంగరాచార్యులవారు కవికి మంత్రార్థము, ఈడు ముప్పత్తారాయిరప్పడి, శ్రీభాష్యము మొదలగు గ్రంథముల విషయముల ప్రసాదించిరి.

## V. కవి ఆచార్యులకభిమతచ్ఛాత్రుడు, రెండవ పుత్రుడగుట :

కవి తాను గుర్వాజ్ఞ ప్రకారము షడారణ్యాపురంబు (ఇతర పేర్లు : ఆఱుకాడు, నాగలాపురము - ఆర్కాటు[1]) నకు పోయి, అచటి స్వాభిమానం తర్భూతుడగు వేదనారాయణస్వామి కైంకర్యంబును (నిత్యోత్సవ - పక్షోత్సవాలను, దేవాలయ కార్యక్రమములను నిర్వహించుటకు ప్రభుత్వము నుండి ఖర్చుల నిమిత్తము నిర్ణీతములైన ధనసంపత్తి - రూపాయలు 300 వరకిచ్చేవారని ప్రసిద్ధి) జగన్నాథరాట్పండితుని సాయమున పూర్తి గావించుకొని శ్రీపురి చేరుకొనెను. అటుపిమ్మట అచటి గోవిందరాజ మందిరంబున శ్రీ మదార్ద్రా

1. ఔరంగజేబు క్రీ.శ 1686 లో గోల్కొండను ముట్టడించి దక్కన్‌సూబాల నేర్పరచెను. ఇందులో నవాబుగిరీ భాగములు గలవు. అందులో ఆర్కాటు ఒకటి. నిజాం అలీఖాన్ (1761 - 1803) దక్కన్‌సూబాను 1761 లో

నక్షత్రమహోత్సవము జరుగుచుండగా, ఆస్థాన మండపమునందు దివ్యసింహాస నాసీనులై వేంచేసియున్న ఎంబెరుమానారు సన్నిధిలో శ్రీ వైష్ణవ గోష్ఠి మధ్యం బున విచ్చేసియున్న గురుశిఖామణియగు ప్రతివాది భయంకర అణ్ణంగరాచార్యుల జూచి ఈ కవివర్యుడు సాష్టాంగప్రణామముల నాచరించెను. అట్లు అంజలించి యున్న కవిని కటాక్షింప దలచి, యెదురుగా వచ్చి, గ్రుచ్చియెత్తికొని, కౌగిటం జేర్చుకొని అతని చేతిలోనున్న రాజముద్రాముద్రితంబైన పత్రంబుగ్రైకొని, (అర్కాటునవాబు ప్రభుత్వము వారిచ్చిన ఆజ్ఞాపత్రము) అతనిని అభిమత చ్ఛాత్రుండని, రెండవ పుత్రుండని పేర్కొనుచు, సంతసించుచు, మహానుగ్రహం బొనర్చెను.

## VI. గ్రంథమును గూర్చి - ప్రేరేపకుడు, ప్రేరేపకులు :

1. వక్త : శ్రీవాదిభీకరగురుడు. ఎందుకనగా కవిని నిమిత్తముగా, చేసి కొని, కవి నాలుకపై కూర్చొని గ్రంథము నానతిచ్చినాడు. అనగా, వ్రాయించి నాడను యర్థము, ప్రేరేపించినాడను భావము స్ఫురించును.

కృతిభర్త : భగవద్రామానుజులు = ఎంబెమానారు. గద్యలో "ఇది శ్రీభగ వద్రామానుజ కరుణా కటాక్షకలిత కవితావైభవ" అని పేర్కొనబడినందున రామానుజులున్ను గ్రంథ ప్రేరేపకులలో నొకరగుదురు.

ప్రతిపాద్యము (కథావస్తువు) : శ్రీశఠకోప, పరకాల, నాథ-యామున యతీంద్రాది పూర్వాచార్యుల మాహాత్మ్యము. వీరందఱు కవిలో నావేశించిన వార గుటచే ప్రేరేపకులగుదురు.

పరిగ్రహింపవలసినవారు. } మహీతలంబునగల శ్రీ మహాభాగతు
అనుగ్రహింపవలసినవారును : } లందఱును.
కవి : నిమిత్తభూతుడు, సాపరాధచేతనుడు.

**కవి వినయ సంపత్తి :**

1. కవి - నిమిత్తమాత్రుడు. వక్త - వాదిభీకర గురుడు. ఇచట మనకు పోతనామాత్యుని పద్యము స్ఫురించక మానదు. "పలికెడిది భాగవతమట, పలి కించెడు రామభద్రుండట" అనురీతిని ఇచట పలికెడిది "ఆచార్య సూక్తి ముక్తా

పలికినచో భవహరమగునను విషయము మరువరాదు.

2. కవి తనను గూర్చి వేసికొన్న విశేషణములు, పదములు : దాసచేతనుడు, దౌరాత్మ్యము, దౌరాత్మ్యము గలవాడు, సాపరాధ చేతనుడు, సాహసం బోర్చి అనుగ్రహింపవలయును మున్నగునవి.

3. ఆశ్వాసాంతగద్య : అందఱు కవులు పాటించిన నియమములే గలవు. తనను "విబుధ వైష్ణవ విధేయుడు"గా పేర్కొన్నాడు.

4. సంస్కృత శ్లోకమును వ్రాసికొన్నాడు. పుట 624.

"క్షమాసారామహాత్మానః కవయోవైష్ణవోత్తమాః
క్షమంతాం సాహసమిదం దాసోయమితినస్సదా."

**కవి సమకాలికులు, సమకాలికులైన గురువులు, వారుపదేశించిన విషయములు:**

I. 1. శఠకోపదేశికుడను బ్రహ్మచారి : కవి తాపస మనోభావముల మొదట మాన్ప ప్రయత్నించినవారు.

2. ఉప్మాక అను ప్రదేశమున బ్రహ్మచారి వేదాంతాచార్యుని కడ హయగ్రీవ మంత్ర మెరింగెను.

3. కందాద భావనాచార్య శ్రీ పద్మశ్రితుండగు జగన్నాథరాట్పండితుడు. (జగన్నాథరావనిగూడ యందురు.) : నాగలాపురి వేదనారాయణస్వామి కైంకర్యమునిర్వహించు విషయములో సాయపడినాడు. ఆర్కాటు నవాబు దర్శనం చేయించినవాడు. ఆచార్య రత్నహార కర్త వంగీపురం సీతారామాచార్యుల (19 వ శతాబ్ది) కితడు సమకాలికుడు.

4. బాలసరస్వతి యని ప్రఖ్యాతి గాంచిన వీర రాఘవస్వామి వద్ద సామాన్య శాస్త్రముల నధికరించుటకు ఇష్టము లేకున్నను గుర్వాజ్ఞ ప్రకారము కైతవభక్తిని ప్రదర్శించినాడీ కవి. వీరరాఘవస్వామి (19 వ శతాబ్దివాడు) భాగవతమునకు వీరరాఘవీయ వ్యాఖ్య వ్రాసిరి.

II. 5. పరవాదిభీకరగురుడు : వాదిభీకరగురుడు, ప్రతివాద భయంకరం అణ్ణంగరాచార్యులు, అణ్ణంగారు. వాక్యగురు పరంపరలో మొదటివాక్యమున కర్తయైనవాడు (అస్మద్గురుభ్యోన్నమః). ఆచార్యుడు, గ్రంథమునకు వక్త. కవికి మంత్రమంత్రార్థాది సంప్రదాయ రహస్యముల నుపదేశించినవాడు; ఈతడు ముప్పత్తారాయిరప్పడని, శ్రీభాష్యమును ప్రసాదించినవాడు.

ప్రసాదించెను.

8. కౌండిన్య వేంకటనృసింహగురుడు : ద్వారక తిరుమలలో శ్రీవచన భూషణాది రహస్యముల నెఱిగించెను.

9. నేలకొండపల్లి రామానుజ జియ్యరు ; ఇతడు భద్రాచలములో గురు పరంపరాప్రభావమును ప్రసాదించెను.

ఇతనిపేర తనియన్ గూడ కవి వ్రాసినాడు.

"రామానుజ పదాంభోజ రాజహంస మహర్నిశమ్।
శ్రీరామానుజ యోగేంద్రం వందేవాత్సల్య సాగరమ్॥"

కవి ఏ వయస్సులో గ్రంథరచన చేసెను?

1. ఆ. సూ. ము. లో ఈ విషయ ప్రస్తావనము లేదు. ఐనను మనము ఊహ చేయుట కవకాశములు గలవు. అవి :

1. తండ్రి ఉభయకవితాపితామహుడు. సంస్కృతము - తెలుగు కావచ్చును. తాను తెలుగు కబ్బముల నధ్యయనము చేసినట్లు కవి తెలుపలేదు. ఐనను, నన్నయనుండి రఘునాథ భూపాలుని వరకుగల ప్రసిద్ధ కావ్యముల మాధుర్యమును గ్రోలనిదే ఇంతటి మహా ప్రబంధమును నిర్మించలేడు. వీని నధ్యయనము చేయుటకు జీవితములోని కొంతభాగము వ్యయమగును. 2. ఇట్లే సంప్రదాయ గ్రంథముల నుపదేశము పొందుటకు సంస్కృత ప్రబంధముల, శాస్త్ర విషయముల, దివ్యప్రబంధముల సారాంశము నెఱింగి వ్యాఖ్యానార్థముల జీర్ణించుకొనుటకు కొంతకాలము ఖర్చగును. అటుపిమ్మటగాని భగవద్విషయ గుణానుభవములను ఉత్తమ శైలిలో నిబంధింపలేడు.

3. నా నిర్ణయ మేమనగా-గ్రంథ విస్తృతినిబట్టి, గ్రంథము నక్షర రూపములో బెట్టుటకు పట్టినకాలము : ఇందు గద్యపద్యముల సంఖ్య సుమారు 2050 వరకు గలదు. తొంబది శాతములు సీస పద్యములున్నవి. అతిదీర్ఘ వచనము లున్నవి. నెమ్మది నెమ్మదిగా వ్రాయుచు బోయినచో 650 పుటల గ్రంథము

ఆరునెలల కాలమగును. కవి తన రచనమును శ్రీవైష్ణవ గోష్ఠిలో చదివి విని పించుట కవకాశములున్నవి. ఒక సంవత్సరకాలము కావచ్చును.

ఒకవేళ కవి నూరు సంవత్సరములు జీవించియున్నచో: ఇతని వృద్ధాప్య దశలో ఈ పని సాగియుండవచ్చును (60 లేక 70 సంవత్సరముల వయస్సు). అనుభవము పండిననేగాని ఇట్టి మహా విషయముల సాధికారముతో వ్రాయలేడు. గురుపరంపర ప్రభావమును సేవించిన పిమ్మటనే వ్రాసియుండును. "గురువరుం డగు నేలకొండపల్లి - జియ్యర్‌దాసునకు భద్రశిఖరి యందు, గొఱతెపడకుండ తెలిపెను. గురుపరంపరా ప్రభావార్థమగ్గురు- రాజకృపను గ్రంథమంతయు పరి పూర్తిగనియెనిట్లు" (ఉత్తర భాగము, 6 వ యుల్లాసము 351 వ పద్యము).

**కవి జీవితమును గూర్చి ఇతర విశేషముల సేకరణము :**

కృతికర్త వృత్తాంతములో ఈ క్రింది విషయముల ప్రస్తావన లేదు.

1. కవికి అక్క- సెల్లెండ్రు - అన్నదమ్ములు గలరా? (తెలియదు)
వివాహమైనది- లేనిది, ఐనచో సంతానము? (తెలియదు)

2. కవివంశీయులు - రక్తసంబధీకులు గలరా? ఉండవచ్చును. నంబూరి వంశ రచయితల పేర్లు కానవచ్చుచున్నవి.

3. గ్రామము నంబూరు పేరనే వీరికి యింటిపేరు వచ్చినది.

4. కవికి గల బిరుదములు: తెలియవు.

4. కవికి సంబంధించిన చిత్రపటములు లేవు.

6. దేశకాల పరిస్థితులు : 18, 19 శతాబ్దము చరిత్ర గ్రంథములలో లభించును. బ్రిటిషువారి పాలనము. మహమ్మదీయుల దండయాత్రలను గూర్చిన యనుభవములను కవి సేకరించినట్లున్నది.

7. ఇంటి పేరు : నంబూరి. నంబూరుకి చెందినవాడు. ఇది మంగళగిరికి సమీపముతో నున్నది. నంబియను పదమువల్ల నంబూరు ఏర్పడియుండవచ్చును. నంబియనగా దైవభక్తుడు, విష్ణుపూజకుడు లేదా శివార్చకుడు లేదా భగవంతుడు.

**ఒక విశేషము :-** నంబిళ్ళగారి మొదటి పేరు నంబూరి వరదరాజు. కణ్వవంశము. ఆరువేల నియోగి బ్రాహ్మణుడు. ఆర్యావర్త దేశీయుడు. అనగా తమిళ దేశమున కుత్తరమున గల దేశము వాడు.[1] తెలుగు దేశమే యగును.

ఈ కవి ఆర్యావర్త పదమును "గ్రంథకర్తృ వృత్తాంతము"లో గూడ వాడినాడు.[2] దేశ చరిత్రల ప్రకారము ఆర్యావర్తమనగా ఉత్తర భారతము. కాని, ఇచట తమిళ దేశమున కుత్తర భాగమని యర్థము. తనది ఆర్యావర్తకులము అని వ్రాసికొన్నాడు. మొదటనే విప్రుడనని తెలిపినందున తిరిగి బ్రాహ్మణ కులము అనవసరము గదా. ఇచట కులము=అనగా ఊరు అని అర్థము చేసికొనవలెను. ఉత్తరాంధ్రమున నున్న ఊరని యర్థము. అదే నంబూరికుడి యను గ్రామము.

**కవి ఇతర రచనలు :-** కవి ఇతర కృతులను గూర్చిన వివరములు తెలియవు. రచయితగా రూపొందుటకు కవి చేసిన కృషి, వ్రాయగల నేర్పును గూర్చిన వివరములు తెలియవు.

**విద్యాభ్యాసము, యోగ్యతలు :-** కవి ఆనాటి పాఠశాలలు, లేదా గురుకులము, ఆశ్రమములు, వీధిబడ్లు మొదలగు విద్యా సంస్థలలో విద్యనభ్యసించినట్లు వివరములు లభించవు పండిత కుటుంబముగాన తండ్రిద్వారా, ఆత్మీయుల ద్వారా విద్యలను సంగ్రహించి యుండవచ్చును. తెలుగు కావ్యములు, సంస్కృత కావ్యములు, లక్షణ గ్రంథముల చదువనిదే ఇట్టి ప్రబంధమును నిర్మింపలేడు. గురువుల నాశ్రయించి సంప్రదయార్థ రహస్యముల గ్రహించినవాడు.[3] నేటివలె నాడు యోగ్యతా చిహ్నముల దెల్పు ధ్రువపత్రములు లేవేమో! (Certificates). ఆచార్య సమాశ్రయణము, ఆచార్యుల సేవించుకొనుటయే నాటి ప్రధాన యోగ్యతలు. పూర్వ కవిస్తుతి లేనందున ఏయే కావ్యముల నధ్యయనము చేసెనో తెలియదు.

---

1. "ఆర్యావర్తదేశీయ షట్సహస్రద్విజ చక్రవర్తి" ఆ.సూ.ము. పుట 384.
2. "ఆర్యావర్తకులమును నంబూరి కుడియును" గ్రంథకర్తృ వృత్తాంతము. పుట 620.
3. "పరవాది భీకరగురు చరణాంబు మహాశ్రితుడవనుచు" ఆ. సూ. ము.

కవికి గల వేదాంత శాస్త్రాది వివిధ విషయ పరిజ్ఞానము; సంప్రదాయ రహస్య విజ్ఞానగరిమ; భాష - శైలి - కావ్యాలంకార ఛందోరీతులందుగల అభినివేశము; వర్ణనా నైపుణ్యము:

అ. సూ. ము. లో పేర్కొనబడిన అంశములను వస్తు వైవిధ్యమునుబట్టి చూచినచో ఇది విషయ బాహుళ్యమును తెలుపునట్టి బృహత్కావ్యమగును.

ఆళ్వారాచార్యుల జీవిత చరిత్రలను, శ్రీవైష్ణవ లక్షణ సంప్రదాయ సూక్తులను సులభ శైలిలో, అస్పష్టత లేకుండ, లలితముగా హృద్యముగా చెప్పినాడీకవి. సీస పద్యములను తొంబదిపాళ్ళు వాడుటకు గల హేతువును మనమూహింపవచ్చును. అదేమన: వృత్తములు, గీతములలో విషయాంశముల నెక్కువగా తెలుపుట కవకాశముండదుగదా! ఎందుకనగా, అచట పాదముల సంఖ్య తక్కువ. సీసములోని చిన్ని 12, 13 పంక్తులలో ఎక్కువ విషయములు తెలుపుటకు వీలగును. సీసములనే గాక విశేష వృత్తములలో కవితా కళను ప్రదర్శించినాడీకవి. అలంకార విలాసముల చవి జూపించినాడు.

ఈ గ్రంథమును గూర్చి ఉపోద్ఘాతమును వ్రాసిన పుణ్యశేషులు తంజ నగరం దేవరాజసుధీగారు[1] కవి ప్రతిభా సామర్థ్యముల నిట్లుగ్గడించినాడు:

a) "రహస్యార్థములను, సంప్రదాయ విశేషములను వైష్ణవులకు మిక్కిలి ఉపాదేయములైన ఇతర విషయములు పెక్కులును ప్రసక్తి వచ్చినపుడెల్ల మృదుమధుర శైలిని తేటతెల్లముగా వివరించినాడు.

b) ఆయా విషయములను ప్రతిపాదించునపుడు కవికి గల పరిపూర్ణ విషయ ప్రవేశము, పరికర సమృద్ధియు, వర్ణనా ప్రావీణ్యమును, అధ్యవసాయ సంపత్తియు, అభినివేశ ప్రాబల్యమును, పరిభాషా వైలక్ష్యమునుబట్టి చూడగా ఇతనికి భగవద్విషయమందలి గాఢ ప్రవేశమును, భాష్యాదులందు పూర్ణావ గాహనముగలదని తెలియుచున్నది.

---

1. ఆంధ్ర రచయితలు - మధునాపంతుల వారి గ్రంథములో ఇతని జీవిత

**కవికి కవిత్వసంపద యబ్బుటకు కారణము :**

ఒక వ్యక్తికి కవిత్వసంపద యబ్బుట పూర్వజన్మ సుకృత విశేషము. లేదా జీవితములోని హఠాత్సంఘటనలు, అప్రయత్నంగా పెల్లుబికే భావాలు, ఎన్ని కారణాలనైనా చెప్పవచ్చును.

ఈతడు పుట్టుకవి. సహజకవి. తేలిక మాటలలోనే కవిత్వము చెప్ప నేర్పు గలదు. కృత్రిమత్వము లేదు. దీనికితోడు కవి కుటుంబము పండిత వంశము. ఆచార్యానుగ్రహములు. వాదిభీకరగురుడు జిహ్వాగ్రమున నిలిచినాడు. ఇది ఆచార్య సమాశ్రయణకృప. గద్యలో కవితాను "శ్రీభగవద్రామానుజ కరుణా కటాక్షకవిత కవితావైభవము" గలవాడనని వ్రాసికొన్నాడు. అన్ని సంపద లకు ఎంబెరుమానారు దివ్యతిరువడిఘశే శరణము గదా!

ఫలశ్రుతిని వ్రాసినాడా? లేదు. శతకములలోను, స్తోత్రములలోను, లఘు కావ్యములందీ పద్ధతి కాననగును. ఫలశ్రుతులలో గూడ కావ్యప్రయోజనము కానవచ్చును. సాహిత్యోద్దేశ మిమిడియుండును. ఇందలి ఆళ్వారాచార్యుల హితోపదేశ సూక్తులనే ఫలశ్రుతులుగా భావింపవచ్చును.

**కవి వ్యక్తిత్వముద్ర, సంప్రదాయ సంబంధము :**

ఆచార్య ప్రపత్తి ఈతనిలో మూర్తీభవించినట్లు చెప్పవచ్చును. మధుర కవి యాళ్వారులు ఆచార్యుడే దేవుడనుచు కణ్ణినున్ శిరత్తాంబు రచించెను. ఈ కవియును ఆచార్యుని సమాశ్రయించెను. గ్రంథమును తాను రచించినను ఆచార్యుడే చెప్పినట్లును, వారే రచించినట్లుగను నుడివినాడు.

"వాదిభీకరగురుడనె మోదమలర అను మకుటము గ్రంథమును, గ్రంథము నందలి కథలను గురువు వక్కాణించినట్లర్థమగుచున్నది. ఇంకను ఉత్తర భాగమునందలి షష్ఠోల్లాసములో 'మీదటి గ్రంథమంత రసమ్మృష్టపదాక్షర వృత్త పద్య సమ్మేదుర భావమొందుగతి మేలుదయింప రచించు నింపుగాన్.' ఇందులో గురువే రచింపబోవుచున్నాడను అర్థము స్ఫురించుచున్నది.

గురువు చెప్పిన పనులను జయప్రదము గావించినందులకుగాను "అభిమత భ్రాతు"నిగా, రెండవ పుత్రునిగా సంభావింపబడినాడీ కవి. ఇది ఆచార్య సమాశ్రయణమువల్ల కలగిన లాభము, ఆచార్య కటాక్షము. గురువు అనవద్య కృపాతిశయము గలవాడనుటకీ పద్యము సాక్ష్యము:

"ఆదరమొప్ప నాదు రసనాగ్రశుభాసన మధ్యవర్తియో
వాదిభయంకరార్యుడనవద్య కృపాతిశయంబు చేనిక....."

మొదట గురు కటాక్షము, అపైన తన వ్యక్తిత్వ ముద్ర ఇతని రచనలో కన్పించును. భాష - శైలి - భావములు, వర్ణములయెడ స్వేచ్ఛను ప్రదర్శించినా డీకవి. అంతేగాదు, ఈతడొక సిద్ధాంతవ్యాసరచయితవలె, పరిశోధకునివలె కన్పించును.

సామాన్యముగా ప్రబంధములలో ప్రధాన కథా వస్తువునకు, వర్ణనలకు ప్రాధాన్యమీయబడును. విజ్ఞాన, వివిధ శాస్త్రాది విషయముల నంతగా పట్టించు కొనరు. ఈ గ్రంథమట్లుకాదు. జీవిత చరిత్రల కథావస్తువునకు, గమనమునకు భంగము కలుగకుండ, కావ్యోద్దేశ లక్షణముల నన్నింటిని కలిగియుండి, అంతకుమించి సందర్భోచితంగా అనుకూలములైన శాస్త్రాంశములను నిరూపణ కుపబలకరములుగా ప్రామాణికమైన ఆధారములతో నొప్పారుచున్నది.

సిద్ధాంత వ్యాస రచయితలు ఉపయుక్త గ్రంథసూచిని (Bibilography) పేర్కొన్నట్లే కవియు ప్రతిపాద్యాంశ వాక్యములు ముగిసిన వెంటనే ఆధార గ్రంథము పేరును పేర్కొన్నాడు. ఉదా॥ ఏకాదశీ నిర్ణయము. 607 వ పుట. ఈ కవి పరిశోధకుడనుటకు నిదర్శనము అతడు పరిశీలించిన గ్రంథముల సంఖ్య. (గ్రంథబృహత్ స్వరూపములోని పట్టికలను జూడుడు.)

**ఆ. సూ. ము. లోని ప్రధాన విషయాంశములు :** a) ఆళ్వారులందరి జీవిత విశేషములు, b) పూర్వాచార్యుల, రామానుజుల సమగ్ర జీవితము, c) రామానుజుల అనంతరమువారి చరిత్ర, d) వైష్ణవధర్మ సంబంధ విషయములు, e) శాస్త్రాంశముల శోధింపు.

**ఏ యుద్దేశముతో రచింపబడినది? :**

a) సాహిత్యోద్దేశ్యములన్నియు ఇట వర్తించును.

b) ఆళ్వారాచార్యులు బద్ధ చేతనుల నుద్ధరించుటకే గదా జన్మించినది? అట్టి మహనీయుల, భాగవతోత్తముల పరమ విలక్షణములైె జీవితముల తడవుటవల్ల మన జన్మములు సార్థకములగును.

c) ద్రవిడ వేదంబుల సాంగోపాంగములుగా సర్వలోకోపకారార్థముగా ఆళ్వారులు రచించిరి. వీరి కవిత్వములో జగద్ధితము కన్పించును. సర్వచేతనోద్ధారణము, జనుల నుజ్జీవింపజేయుట పరమ లక్ష్యములు.

**తెలుగులో కృతికర్తలకువలె కృతివక్తల సంప్రదాయము గలదా? :**

ఉన్నదనవచ్చును. "వాదిభీకరగురుడనె మోదమలర" ఇట్టి - మకుటమును ప్రయోగించి, అపరోక్షముగా (indirect) గా వ్రాసిన కావ్యములు ఒకటి రెండు కన్పట్టుచున్నవి. 1. ఆ. సూ. ము. 2. ముముక్షుజనకల్పకము.

పోతన్నగారు "పలికించెడువాడు రామభద్రుండట" అని నుడివి, కథను ప్రత్యక్షముగా నడిపినాడు.

ముముక్షుజనకల్పక రచయిత శ్రీ అచ్చి రామానుజాచార్యులు. ఇందు అన్నియు సీస పద్యములే. కృతివక్త : లక్ష్మణదేశికుడు.

"ధ్యేయుడని చెప్పె లక్ష్మణ దేశికుడు" - లక్ష్మణయోగి, ముని, ఆర్యుడు వంటి పదముల చేర్చి మకుటమును వ్రాసినాడు.

విశాలదృష్టితో నాలోచించినచో భగవంతుడే కావ్య ప్రపంచమునకు వక్త. ఆళ్వారుల, ఆచార్యుల రూపములో బద్ధజీవుల నుజ్జీవింపజేయు సూక్తులను, ఆదర్శ జీవన విధానములను, రచనలను మనకందించునట్టివాడు.

**విద్యావివాదములలో వక్త :**

ఈ గ్రంథములో నొక యుదాహరణము గలదు. అది పరతత్త్వ నిర్ణయములో వక్త శ్రీవిష్ణువు. విష్ణుచిత్తునిచే పలికించినాడు. పెరియాళ్వారుల వైభవములో నిది స్పష్టమగును. ఆముక్తమాల్యదలోను నిట్లేగలదు.

**స్వప్నప్రభావములు : కృతికర్తకు, కృతివక్తకు సంబంధించినవి :**

ఈ గ్రంథములో స్వప్నవృత్తాంతము లెన్నియో గలవు.

1. ప్రతివాదిభయంకరం అణ్ణంగారి వైభవములో : పుటలు 586, 597. మొదటి వాదిభీకరగురునకు స్వప్నములో వేంకటాచలనాథుడు కన్పించి, శ్రీపురిలో నివసించుటకుగాను ఆనతిచ్చుట; కరిగిరీశుడును కలలో కనబడి, వరవర మునికడకరుగుమనుట. 450 వ పుట.

2. ఈ కవి వృత్తాంతములో : నంబూరి కేశవాచార్యులకు మైసూరివారి మఠములో గల్గిన స్వప్నము. పుటలు. 622 నందలి వచనము.

ఇట్లు భగవంతుడు లేదా భగవత్స్వరూపుడైన ఆచార్యుడు కవులకు స్వప్నములో సాక్షాత్కరించి అభిమతముల నానతిచ్చుట సంప్రదాయబద్ధమున్ను, సహజమున్నూ.

**ఆచార్య సూక్తిముక్తావళికి ఆధారగ్రంథములు :** కవి తనకుతానై తన గ్రంథమునకు తోడ్పడిన మూలాధార గ్రంథములను స్పష్టముగా, సూటిగా పేర్కొనలేదు. మూలకథావస్తువునకు సంబంధించిన గ్రంథములుండును గదా! కాని, శాస్త్రాంశముల నెందుండి సేకరించెనో ఆ గ్రంథముల పేర్లను పేర్కొనినాడు.

నా యూహాప్రకారము : a) కవికిగల స్వానుభవపరంపరయే ఒక అలిఖిత గ్రంథము. అనగా జీవితానుభవముల ప్రత్యక్ష కథనము.

b) కవితాకళను ప్రదర్శించుటకు, గ్రంథములను వ్రాయుటకు సామాన్యముగా అందఱు రచయితలు చదువునట్టి సందర్భోచితముగా ప్రయోగించునట్టి లక్షణశాస్త్ర గ్రంథములు.

c) పోలికలనుబట్టి, తులనాత్మక పరిశీలనచేసి మనము నిర్ణయముచేయు గ్రంథములు.

శ్రీభాష్యము, శ్రీవచనభూషణము, ఈడు, రామాయణాదులు.

ఇ) ఇతరములు : ప్రసన్నామృతము, యతీంద్రప్రవణప్రభావము, దివ్యసూరి చరితము, గురుపరంపర ప్రభావము మొదలగునవి బాగుగా జీర్ణించుకొన్నాడని ఈ గ్రంథమును చదువువారి కర్థమగును.

కవికిగల అనుభవములు :

విద్యార్థి దశలోనే దేశ పర్యటనానుభవము గడించినవాడీ కవి. ఇతని బదరికాశ్రమమునకు బోవదలంచు ప్రయత్నము యాత్రా మార్గము అవరోహణ క్రమములో జరిగినది. అతనిలో కలిగిన మార్పు - సన్యాసి కాదలంచుట - కెట్టి కారణమిందు కన్పించదు. విరక్తి ఎందులకో అర్థముగాదు. మొదట శ్రీ పురుషోత్తముని, పిమ్మట క్రమముగా శ్రీ కూర్మము, సింహాద్రి, ఉప్మాక అహోబలములచేరి, భగవద్దర్శనముల చేసికొని చివరకు అంజనాద్రి చేరినాడు.

పండిత సమాగమము, పండిత కుటుంబము, సంస్కారము గల వారసత్వసంపద - ఇతని జీవితమునకు వన్నె దెచ్చినట్టివి. నిరంతరము గ్రంథ పఠనాభ్యాసము చేయుట, గురువుల సేవించుకొనుట, గురు శుశ్రూష - సంప్రదాయ రహస్యముల నెరంగుట, కావ్య పఠనాభిలాష ఇతని కార్యక్రమములు. వివిధ శాస్త్రముల, దేశచరిత్ర, ఖగోళ, జ్యోతిష, భూగోళాది విషయముల పరిజ్ఞానము గలవాడు. తాపసేచ్ఛ, మోక్షేచ్ఛ గలవాడైనను లోకజ్ఞుడు. ఇందుకు నిదర్శనము శృంగార రసపోషణము; రాజనీతి గ్రంథముల విషయ వివరణము. కళల నెరింగినవాడు. రసపోషణములో - ముఖ్యముగా శృంగారమును చిత్రించుటలో తెనుగు ప్రసిద్ధ ప్రబంధకర్తల బాణిని స్వీకరించినాడు. శృంగారమతిశయించినను దేవతల, దైవత్వ భావన గలవారి విషయములో అమలిన శృంగారమే యని గ్రహించినవాడుగ దోచును. ఆర్ష విజ్ఞానమునకు సంబంధించిన కర్మకాండల శకర్మల పద్ధతుల నెఱించివాడుగ కన్పట్టును. ఈతని అపార పరిజ్ఞానమునకీ గ్రంథమంతయు నిదర్శనమే.

## ఆచార్య సూక్తి ముక్తావళి ప్రతులు:
## కావ్య పరిశీలనార్థము అధ్యయనము చేసిన ప్రతి

ఏ గ్రంథమునకైనను మొదట వ్రాతప్రతి తాళపత్రముల లేదా కాగితముల వ్రాతప్రతి (లిఖిత ప్రతి) అటు పిమ్మట ముద్రణాప్రతి యుండుట సహజమే గదా! అట్లే ఈ గ్రంథ విషయమున్నూ..[1]

ఆ. సూ. ము. గ్రంథకర్త శ్రీమాన్ నంబూరి కేశవాచార్యులు సుమారు క్రీ. శ. 1750 ప్రాంతము వాడగుటవల్ల వీరిని ప్రాచీనాంధ్ర కవుల జాబితాలో చేర్చవచ్చును గాన వీరు వ్రాసిన ప్రతి అత్యంత ప్రాచీనమగుటయు సత్యమే. ఐనను వీరు నివసించిన నంబూరుకుడి గుంటూరు ప్రాంతములో కొందఱు శ్రీవైష్ణవ కుటుంబములవారు ప్రాచీన సంప్రదాయమునే పోషించుచున్నవారు వ్రాతప్రతులను కాపాడుకొంటున్నట్లు తెలియుచున్నది. (శ్రీమాన్ T. V. రాఘవాచార్యులు, ఉపన్యాసకులు, కేంద్రీయ సంస్కృత విద్యాపీఠము, తిరుపతి - తెలిపిన విషయము.)

**ఇక ముద్రణా ప్రతులను గూర్చి :**

1. ప్రప్రథమ ముద్రణము : క్రీ.శ. 1875 సం॥ వివేక కళానిధి ముద్రాక్షర శాల - చెన్నపురి.

"ఈ ప్రతి అత్యంత ప్రాచీనమైనది. కాగితమును, ముద్రణ పద్ధతినిబట్టి చూడగా గత శతాబ్ది చివరి భాగమున చిలక ప్రెస్సులనబడు యంత్రములతో తయారించబడినట్లు కనుపించుచున్నది. కాగితములు నలిగి అక్షరములు నశించిన చోట్ల చుక్కలు పెట్టబడినవి. ఈగ్రంథ ప్రథమముద్రణకర్తలు శ్రీమతి ఆత్మకూరి రామానుజమ్మ, శ్రీయుత చిన వేంకటగోపాలంగారలని చెప్పబడినది. వీరిరువురు వైశ్య కులాలంకారులని చెప్పనొప్పును."

(ఈ విషయము శ్రీ జమిలి నమ్మాళ్వారు ధర్మనిధి, గుంటూరు, 1972 వ ప్రతిలో గలదు. పుటలు 629, 632)?

2. 1911 సం॥ మొదటి కూర్పు ప్రతి :

పరిశోధించినవారు (పరిష్కర్త) : తం. దేవరాజసుధీగారు. ఆనంద ముద్రాలయ ముద్రితము, మద్రాసు. ఆర్. వెంకటేశ్వర్ అన్డ్ కంపెనీ.

గమనిక : ఈ ప్రతిని నేను చూచినాను.

3. 1922 సం॥ర ప్రతి: రెండవకూర్పు :

పరిశోధించినవారు : శ్రీ పురాణం సూర్యనారాయణతీర్థులు.

తేదీ. 11-2-1922, దుర్మతి, చెన్నపట్టణము. ఆనందముద్రణాలయ ముద్రితము, మద్రాసు. ఆర్. వెంకటేశ్వర అండ్ కంపెనీ.

గమనిక : ఈ రెండవకూర్పు ప్రతిని నేను చూచినాను. పరిశీలించినాను. 1911 సం॥ ప్రతికి, 1922 సం॥ ప్రతికి సం॥లో వ్యత్యాసము తప్ప విషయ సూచికలోని అంశములు, వాటి క్రమసంఖ్యలో భేదము లేదు. రెండవ కూర్పులో మాత్రము దేవరాజ సుధీగారి పీఠికయును, అదనముగా శ్రీ పురాణం సూర్య నారాయణ తీర్థులవారి విన్నప వాక్యములు గలవు.

4. 1972 సం॥ర ప్రతి : ప్రస్తుత ముద్రణ :

స్వస్తిశ్రీ పరీధావి సంవత్సర చైత్రశుద్ధ ౧ గురువారము. 16-3-1972. శ్రీ జమిలి నమ్మాళ్వార్ ధర్మనిధి (రిజిష్టర్డు) - గుంటూరు. ప్రకటన : పండిత శ్రీ జమిలి నమ్మాళ్వారు.

గమనిక : 1972 వ సంవత్సర ప్రతిని నేను కావ్య పరిశీలనార్థము గైకొన్నాను. ఎందుకనగా, 1972 నుండి 1991 నుండి 1991 వరకి గ్రంథము నెవ్వరు ప్రచురించినట్లు లేదు. ఈ ప్రచురణలో గ్రంథము చివరి పేజీలలో మాత్రమే 1911 సం॥ర యుపోద్ఘాతమును, (1922 సం॥ ప్రతిలోని శ్రీ పురాణం సూర్యనారాయణతీర్థుల విన్నపమును వేయలేదు) మరియు ఈ గ్రంథమును గూర్చిన యింకొక యుపోద్ఘాతమును మాత్రమే అచ్చు వేసినారు.

ప్రతుల పరిశీలనమువల్ల తెలిసిన సారాంశ మేమనగా :-

1) అచ్చుయంత్ర విధానముగాన పుటల సంఖ్యలు మారినవి. **1911**, **1922** ఒకేరీతిగా పెద్దసైజు గలవి. **542** పుటలున్నవి. **1972** ప్రతిలో **624** పుటలున్నవి. పైదానికన్న సైజులో చిన్నది. సైజులు : 9.5″ × 6″; 8″ × 5.5″. 1875 సం॥ ప్రతి ఉపోద్ఘాతము ఉన్నది ఉన్నట్లుగా నిందులో గలదు.

2) ప్రతి ముద్రణములోను అచ్చు పొరపాట్లున్నవి. కొద్ది తేడాలు గలవు.

3. మొదటి రెండు ప్రతులలో గ్రంథాదిని యుపోద్ఘాతములుండగా **1972** వ సం॥ ప్రతిలో గ్రంథము చివర ముద్రింపబడినవి.

4. మొదటి రెండు ప్రతులలో "అ. సూ. ము." విషయసూచికలు ఒకే విధముగా ముద్రింపబడినవి. ఇందులో ప్రథమోల్లాసము, ద్వితీయోల్లాసము- ఇట్లు శీర్షికల క్రింద విషయ విభజన చేయబడలేదు. కాని, విషయ విభజనాంశములు గ్రంథ కథా వస్తు విషయముల ప్రకారము క్రమపద్ధతిలో వ్రాయబడినవి. కథను సంగ్రహముగా అర్థము చేసికొనుటలో ఇట్టి విభజన మిక్కిలి తోడ్పడును. అంశములకెదమ ప్రక్కన వరుస సంఖ్య వేయబడలేదు. లెక్కించగా **78** అని తేలినది. **3** నుండి **539** పుటలు సూచింపబడినవి.

**1972** సం॥ర ప్రతి. ప్రస్తుత ప్రతి. ఇందులో విషయసూచిక విభాగ మింకొక విధముగ నున్నది. ప్రతిభాగము అనగా, పూర్వ - మధ్యమ - ఉత్తర భాగములు, ఈ భాగముల క్రింద ఉల్లాసములు గలవు. ఈ యుల్లాసములకింద విషయాంశ విభజనమున్నది. ఈ విభాగమువల్ల ఈ గ్రంథములో ఏమున్నదో గ్రహింపగలము కాని, కథా విషయమును సంగ్రహముగనైనను గ్రహింపలేము. ఆయా ఆళ్వారుల, ఆచార్యుల వైభవములనియే పేర్కొనుట జరిగినది.

5. ''గద్యలు'' అన్ని ప్రతులలోను ఒకే విధముగా నున్నవి.

6. ముఖపత్రములు మొదటి రెంటికొకే విధముగా నున్నవి. ఇందుకు **1972** సం॥ ప్రతి పూర్తిగా భిన్నము.

7. ఆళ్వారుల చిత్రపటములన్నింటిలో ఒకేవిధముగా నున్నవి. అవి:

1) పెరియాళ్వారులు, 2) శూడికొడుత్తనాచ్చియారులు, 3) తొండరడిప్పొడి యాళ్వారులు, 4) తిరుప్పాణియాళ్వారులు, 5) తిరుమంగైయాళ్వారులు, 6) ఉడైయవరులు, 7) మణవాళ మహామునులు (ఆచార్యులు.)

8. పద్యముల సంఖ్య, వచనముల సంఖ్య అన్నింటిలో నొకటే.

9. ఆయా పరిష్కర్తలు కాలానుగుణ్యముగా పెక్కు వ్రాతప్రతులను పరిశీలించినట్లు తెలియుచున్నది.

ఇందలి ఉపోద్ఘాతములను గూర్చి : ప్రప్రథమ ముద్రణము 1875 సం॥ మరియు మొదటి కూర్పు; 1911, రెండవ కూర్పు; 1922, మూడవ కూర్పు, 1972 (ప్రస్తుత ప్రతి.)

ఈ గ్రంథములో, 1911 సం॥ర ప్రతి, 1922 సం॥ర ప్రతి, 1972 సం॥ర ప్రతులలో దేవరాజసుధీగారి ఉపోద్ఘాతములు ముద్రింపబడినవి. అన్ని ప్రతులలోను ఈ ఉపోద్ఘాతములొకే విధముగ నున్నవి.

మొదటి కూర్పు :- ఇందులో ఉపోద్ఘాతకర్త గ్రంథమును గూర్చి, దాని గొప్పదనమును గూర్చి బహుధా ప్రశంసించినాడు. "పెక్కు ప్రతులను పరిశీలించినాను" ఇట్లనుటచే నాటికాలములో ఆ సూ.ము.ని పెక్కురు సంప్రదాయజ్ఞులు చదివెడువారని తెలియుచున్నది. తనకు పరిశోధనలో తోడ్పడిన వారిని గూర్చి తెలిపినాడు.

రెండవ కూర్పు :- ఇందులో పై యుపోద్ఘాతమున కదనముగా శ్రీ పురాణం సూర్యనారాయణ తీర్థులుగారి విన్నపము గలదు. మొదటి కూర్పులో తటస్థించిన పొరపాట్లను సవరించినట్లు వ్రాసినాడు. ప్రమాణార్థ సంస్కృత శ్లోకములను యథామతిని సవరించి, భాషా విషయములో గూడ తప్పులను సవసరించినట్లుగ వ్రాసికొన్నాడు. తనకు గల్గిన లాభముల తెలుసుకొన్నాడు.

ప్రస్తుత ప్రతి :- (1972 సం॥). ఇందులో సూర్యనారాయణగారి విన్నపము లేదు. కాని, ఈ గ్రంథమును గూర్చి యింకొక ఉపోద్ఘాతము

గలదు. ఇదియే 1875 సం॥ ప్రతిలో గలదు. ఇందు ప్రారంభమున 3 తెలుగు పద్యములు, 2 సంస్కృత శ్లోకములో గలవు. పిమ్మట కవినిగూర్చి, గ్రంథ విభాగమును గూర్చి, సీస పద్యములను సమర్థించుటను గూర్చిన వాక్యాలు గలవు. ఆపిమ్మట ఈ ప్రతిని ముద్రించుటకు ప్రేరేపించిన వారి సంగ్రహ జీవితాలు గలవు. ప్రాచీన చిలుకల ప్రెస్సుల ప్రస్తావన చేయబడినది. ఇందులోని ఒక పద్యమును గమనింపుడు:

"ముద్దుమొగంబుఁ, గెంజిగురుమోవి, దయారసమొల్కు కన్నులున్,
నిద్దపు జెక్కులున్, పసిడి నిగ్గులు దేటెడి మేను, బాగుగా
దిద్దిన యూర్ధ్వపుండ్రమును, తెల్లని జన్నిదమున్ త్రిదండమున్
తద్దయునొప్పు చిన్నిసిగదాల్చిన మా యతిరాజు గొల్చెదన్."

## కృతివక్త వంశమును గూర్చిన వివరములు : పట్టిక

### (శ్రీ వాదిభీకరగురునిగూర్చి)

ఆచార్య సూక్తిముక్తావళి యను మహాప్రబంధమునకు వక్త : ప్రతివాది భయంకరం అణ్ణంగరాచార్యులు. వీరినే వాదిభీకరగురుడనియు, పరవాదిభీకర గురుడనియు, ప్రతివాదిభయంకరాచార్యులనియు పేర్కొందురు. ఈ కవికి సమకాలికులైన ఆచార్యులు వీరు. ఆ కాలమున కంచి వైష్ణవ పీఠమునకు అధిపతులు. కవికి మంత్రోపదేశము చేసినవారు. తరములు గడచినకొలది వంశ విస్తరణ యగును గదా! ప్రతివాదభయంకరులలో ఎన్నవతరమువారు వీరి కాచార్యులను సందేహము కలుగును. చారిత్రకాన్వేషణములో దేశకాలపరిస్థితులు మొదలైన విషయముల నెన్నిటినో పరిగణించిన పిమ్మటనే తుది నిర్ణయమునకు రావలసియుండును.

కృతికర్త తన వృత్తాంతమును తెలుపు విభాగమునకు ముందుగా తన గురుపరంపరను గూర్చి, అనగా- మొదట ప్రతివాదభయంకర బిరుదము నందిన అణ్ణంగారినుండి తన ఆచార్యుని వరకుగల పేర్లను పేర్కొనినాడు.

షష్ఠోల్లాసమున ప్రతివాదభయంకరం అణ్ణంగారి వైభవమును గూర్చి అతివిపులముగా వర్ణించినాడు.

బిరుదునందక పూర్వము మొదటి అణ్ణంగారిది ముడుంబ నంబికి చెందిన శ్రీవత్సవ వంశము. ముడుంబనంబియనువారు ఆచార్యపురుషులుగా నుండిరి. క్రమసంఖ్యలో వీరి సంఖ్య 17. వంశమదే యైనను ఇంటిపేరు "ప్రతివాదిభయం కరం" అని ప్రశస్తిగాంచినది. ఇదే పేరులో నేటివరకు కంచిలో శ్రీవైష్ణవ సంఘపీఠాధిపతులై, దేశికోత్తములై అలరారుచున్న యశస్సు వీరికే దక్కు-చున్నదనుట అతిశయోక్తిగాదు.

మొదటి అణ్ణంగరాచార్యులు తన ఆశ్రితకోటికంతకు తత్త్వార్థములు ప్రసాదించుచు, ప్రామాణికార్థములచే వాదమున ప్రత్యర్థుల జయించుచు, అతి దివ్య వైభవోపేతమైన జీవితమును గడుపుచు, నిండ నూరేండ్లుగా జీవించి, తన తేజస్సును కుమారులకు ప్రసాదించి, వారిని ఆశ్రిత జనోద్ధారకుల గావించి, తాను పరమ పదమున కేగెను. ఈ క్రింది పద్యములు వీరి వంశీయుల ప్రశస్తిని తెలుపు నట్టివి:

1. పుట 249 "పాశురం బొక్కటి పఠియించి........

కన్కనే కదా అస్మదాచార్యులు-పదుగురార్యుల స్వత్సంబంధములకు
వ్యాఖ్యాలొనరించి, మనబోటి యాశ్రితులకు
తెలియదగినట్టి యర్థముల్ తేటపరిచి,
చేసి యుపకృతి బలువాసి జెందిరనుచు."

2. పుట 618.

"వరగుణరత్నవార్ధియగు నాదిభయంకర దేశికేంద్రుడా
కరణి శతాబ్దముల్ గడిపి, కారుణికుండగుటన్ సుతాదులం
దురు నిజ తేజ మాశ్రిత జనోద్ధరణంబునకుంచి, యంత సుం
దరవరయోగిరాజ పద తామరసద్వయమొందె భక్తితోన్."

మొదటి వాది భీకరాచార్యులవారి తనియ :

"వేదాంత దేశిక కటాక్ష వివృద్ధ బోధం
కాంతోపయంతృయమినః కరుణైకపాత్రమ్
వత్సాన్వయ మనవద్య గుణైరుపేతమ్,
భక్త్యాభజామి, పరవాది భయంకరార్యమ్."

"అటు వేదాంత దేశికుల కుమారుడైన నయనారు దేశికులకు శిష్యుడు; ఇటు కాంతోపయంతృముని యనబడు మణవాళ మహా మునులకును శిష్యుడు. ఇరువురి ఆస్థానములలో గూడ అష్టదిగ్గజ పీఠము నలంకరించినవాడు.''

341 వ పద్యమునుండి 346 వ పద్యమువరకు గల పద్యములలో ఈ కవి ఆచార్య పీఠము నలంకరించిన అణ్ణంగారి వంశీయుల పేర్లను విశేషణములతో కూడిన వర్ణనలతో పేర్కొనియున్నాడు.

గమనిక : మొదటి అణ్ణంగారు వేదాంత దేశికుల కుమారుడైన నయనారు దేశికుల శిష్యుడు. (పుట. 594.) పిమ్మట నయనాచార్యుల తిరువవతార సమాప్తి తర్వాత, హస్తిగిరీశుని శాసనంబున మణవాళమహాముసుల నాశ్రయించిరి. (పుట. 596.) మణవాళమహాము లితనిని తనకు తోడ్పాటుగా నుండు నిమిత్తము (ఇతడు మహాపండితుడని తన శిష్యుల ద్వారా తెలిసికొనిన పిమ్మట) ఒక శ్రీముఖమును వ్రాసి, కంచి నుండి శ్రీరంగమునకు రప్పించు కొనిరి. (పుటలు. 450 - 451.)

నయనాచార్యులకడ నున్నపుడు సంస్కృతవేదాధిపత్యము, పిమ్మట మణవాళ మహామునుల వద్ద ద్రవిడోపనిషదర్థ సంగతి నెరుంగుట - ఇట్లీతడు ఉభయ వేదాంతులలో అగ్రగణ్యుడాయెను.

**కృతివక్తయైన వాదిభీకరగురుని విశిష్టత - గొప్పతనము :**

ఆ. సూ. ము. కృతివక్త జీవితచరిత్రను ఈ కవి ప్రత్యేకముగా తెలుప లేదు. మొదటి ప్రతివాది భయకరం అణ్ణంగారి వైభవమునే ఈ గ్రంథములో వర్ణించినాడు. 619 వ పుటలో మాత్రము పైవారిని (మొదటి అణ్ణంగారి) గూర్చిన తనియ మరియు కృతివక్త వంశీయుల పరంపర వంశవృక్షమువలె విశేషణాదులతో సహా ఆరు పద్యములలో పొందుపరచినాడు. ఈ క్రింది చివరి పద్యము కృతివక్తకు సంబంధించినట్టిది:

"వాదిభీకరగురువరన ప్తృన ప్తపౌ - త్రుడు గోత్రనే గురుధూర్వహుండు,
శ్రీ కుమారశ్రుతి శేఖరాచార్యున - కభిమత పుత్రుడే యార్యవరుడు,
స్థిరత నణ్ణావేద శిఖర దేశికపాద - పద్మద్విరేఫమే ప్రాజ్ఞమౌళి,
యస్మన్ముఖంబున 'నాచార్య సూక్తిము-క్తావళి' యే గురుడానతిచ్చె,
వత్స వంశాబ్ధి చంద్రుడే సత్సహాయు-డేమహాత్ముడు మద్ధితహేతువయ్యె,
నట్టి మద్గురు నణ్ణగారార్యుననఘు - జిత్తమలర భజించెద చింతమాని.

"మఱియు నిమ్మహాదేశికుండు మదీయ దౌరాత్మ్యంబు దలంపక నన్నంగీకరించి సకల విహితంబులొనరించిన తెఱంగెఱింగించెద" (పుట 620) అనుటచే ఈ వాదిభీకరగురుడు మహాదేశికుడనియు, శిష్యవాత్సల్యముగల వాడనియు తెలియుచున్నది. ఈ వచనము పిమ్మట కవి తన వృత్తాంతమును విపులముగా మూడు పుటలలో పొందుపరచినాడు.

**హితోపదేశము :-** సంశ్రిత వాత్సల్యజలధియగు నిమ్మహాదేశికేంద్రుడైన వాదిభీకరగురుడు కవి ప్రయత్నమును (సన్యాస్లాశ్రమ స్వీకార విధానమును) మాన్పించినాడు. "ఈ పూర్వవయస్సు విద్యాభ్యాసమునకు సాధనము గావున ననంతరంబ ఈప్సితంబగు క్షేత్రంబునకుజని తపంబొనర్చెదవుగాని" యని నుడివినాడు.

కొన్ని రోజుల పిదప వాదిభీకరగురుడు ఈ కవికి శ్రీపాదతీర్థతళిహ ప్రసాదంబు లొసగి మంత్రార్థము, ఈడు ముప్పత్తారయిరప్పడి, శ్రీభాష్యంబు మొదలుగాగల సకల గ్రంథంబులం బ్రసాదించి సకల హితంబు లుపదేశించినాడు.

**శిష్యులకు పనులప్పగించుట :-** వాదిభీకరగురునకీకవి ప్రియశిష్యుడును, నమ్మకము గలవాడనుటచేతనే ఈ కవికి రాజకార్యనిర్వహణ భారమప్పగించినాడు. అదేమన: నాగలాపుర వేదనారాయణస్వామి కైంకర్యమును పునరుద్ధరించుట. దీనికిగాను కవి అచటికి వెళ్ళి రాజముద్రాముద్రితంబైన పత్రమును (దీనినే మనము అంగీకార పత్రము (Order, Permission Letter అందుము) గైకొని, గురుని చేతి కొసంగ నాతడు సంతోషించి కవిని అభిమతచ్ఛాత్రుండవని సంబోధించి కౌగిలించుకొనెను.

**వారి జీవనసరళి :-** పెరుమాళ్ళను సేవించుకొనుట, మంగళాశాసనములు గావించుట, జీర్ణకైంకర్యముల పునరుద్ధరించుట, స్వాధ్యయనాభ్యాసములు, నియమబద్ధజీవనము, స్వయముగా శిష్టాచారముల నాచరించుచు శిష్యులకు సకల శాస్త్రముల, హితముల, మంత్రమంత్రార్థముల నుపదేశించి వారల నుజ్జీవింప జేయుట, దివ్య ప్రబంధాది పఠనమును కొనసాగించుట, భగవదారాధన క్రమానుగత సరళిని కుంటుపడకుండజేయుట మొదలగునవి నాటి పీఠాధిపతుల కార్యక్రమములు.

భీకరగురుడు సదాచార్యుడు, మహాదేశికుడు, ఆచార్యపురుషుడు,

## వంశవృక్షము

## ఆ.సూ.ము. ప్రకారము - పుట. 619

1. ప్రతివాది భయంకరం అణ్ణంగారు. (బిరుద స్థాపకుడు) (1350 - 1450)



2. అనంతగురు సూర్యుడు.



3. నయనారు దేశికులు.



నప్త 4. నిగమమౌళి (వేదాంత దేశికులు).



5. వేంకటార్యుడు.



6. నిగమాంత దేశికులు (వేదాంతాచార్యులు, ఆగమాంతగురుడు).



నప్త 7. కుమారశ్రుతిశేఖరాచార్యులు.



పౌత్రుడు 8. వాదిభీకరగురుడు (కృతివక్త).
(కుమారశ్రుతిశేఖరాచార్యుల కభిమత పుత్రుడు మనుమడగుటకు పీలున్నది. 9 వ తరమగుటకు పీలున్నది. 19 వ శతాబ్దము కావచ్చును.)

**ప్రతివాది అణ్ణంగారి వంశస్థుల పీఠములు : ఆచార్య పీఠములు, 1444 నుండి 1991 వరకు సాగుచునే యున్నవి. ఇవి గృహస్థ పీఠములు.**[1]

**1. శ్రీరంగములో :** ఇచట వేంచేసియుండు రామానుజ పీఠాధిపతులను "అణ్ణన్‌స్వామి" "వరదాచార్యులు" అనియు అందురు.

---

1 శ్రీ రామానుజ కీర్తికౌముది. X వ భాగము. పుటలు. 15. సంసారక్రియము

**2. కాంచీపురములో :** విష్ణుకంచిలో శ్రీవరదరాజస్వామి దేవాలయము గలదు. దేవాలయ సమీపమున కోటితీర్థము అను సరస్సు గలదు. పట్టణ పరిసరమున వేగవతీ నది గలదు. ఇచట వేంచేసియుండు రామానుజ పీఠాధిపతులను "ప్రతివాది భయంకరం అణ్ణన్‌స్వామి" యందురు.

## కృతిభర్త రామానుజాచార్యులను గూర్చి ఆశ్వాసాది - ఆశ్వాసాంత పద్యములు

ఆ. సూ. ముక్తావళికి కృతినాయకుండు "ఎంబెరు మానా"రని కవి గ్రంథ కర్తృ వృత్తాంతములో పేర్కొన్నాడు గాన ఈ గ్రంథము రామానుజులవారి కంకితమీయబడినదని తేటతెల్లమగుచున్నది.

నన్నయకాలమునుండి నేటివరకు కృతిభర్తల సంప్రదాయము అనగా గ్రంథము నొకరి కంకితమిచ్చుట కన్పట్టుచునే యున్నది. కావ్యముల నుండి కథల గ్రంథములదాక మనకెన్నియో దృష్టాంతములు గోచరించుచున్నవి. ఇది అనుస్యూతముగా వచ్చుచున్న రచయితల ఆచారసరణి యన నొప్పును.

ఇక అంకితవిధానము. గ్రంథకర్త యిష్టానుసారమై రూపొందు వాక్యముల సమూహము లేదా పద్యముల సమూహము. కొందఱు తమ కావ్యావతారికలో కృతిపతిని గూర్చి ఆశీఃపూర్వకముగా పద్యముల జెప్పి, అటు పిమ్మట అతని వంశ చరిత్రను తెలుపుదురు. ప్రతి ఆశ్వాసము మొదట కృతిపతిని సంబోధించి వ్రాతురు. ఇట్లే ప్రతి ఆశ్వాసాంతమున కృతిభర్త ప్రతిభా సామర్థ్యముల నుగ్గడింతురు.

కృతిపతి భగవంతుడే యైనచో కృతికర్త వానినే స్తుతించును. ప్రార్థించును. ఒకవేళ కృతిపతి మానవుడైనచో దైవమా కృతి నాయకుని బ్రోవవలయుననే మాటల నుపయోగించును.

గ్రంథావతారికలలో రచయితలు కావ్యారంభమును గూర్చిన నియమములను దృష్టిలో బెట్టుకొని ఒక వరుస క్రమములో ఉపోద్ఘాతమువలె విషయములను తెలుపుట గలదు. ఈ విషయమునుగూర్చి ముందు పేర్కొందును.

ఆచార్య సూక్తి ముక్తావళి కావ్యారంభములో ప్రప్రథమముగా కృతి భర్తను గలదు. భగవద్రామానుజులను సంబోధించుచు వాడిన గంభీ

రార్థములు గల విశేషణములతో గూడిన రచన యిది. ఇందులో పెరుమాళ్ళు కృతికర్త నాశీర్వదించు పద్ధతి పాటించబడలేదు సరే. "ఆచార్యులే దైవము" అన్న ప్రపత్తిభావనతో కవియిట్లు వ్రాసియుండవచ్చునన్నచో కవి "ఆచార్యులకు నమస్కారము"[1] అను భావమునిచ్చు పదములను ప్రయోగించలేదు. వక్తచేత చెప్పించలేదు. ఎందుకనగా మనకు వ్రాతరూపములో కన్పట్టుట లేదు. కాని, గ్రంథారంభమునగల ఈ పద్యమునకు పైనగల కాగితము మధ్యభాగమున "శ్రీమతే రామానుజాయ నమః" అని గలదు. శ్రీ వైష్ణవ చిహ్నముద్రలు (ఊర్ధ్వ పుండ్ర శంఖ చక్రాది గుర్తులు) ముద్రింపబడినవి. ఇది ప్రాచీన సంప్రదాయమని చెప్పనొప్పును.

**సమన్వయమేమన :** కవి ఆచార్య పరంపరను అనుసంధించియే కావ్యా రంభమును గావించినాడు. భాగవతోత్తములు సర్వకాలసర్వావస్థల యందును "శ్రీమన్నారాయణుని చరణాంబుజము"లను మనసులో ధ్యానించుకొనుచుందురు గదా!

**సమన్వయమేమన :** ఈ గ్రంథములో సగభాగము భగవద్రామాను జుల వైభవముగలదు గాన, ఈ కవి గ్రంథాదిని జీవితచరిత్రను వ్రాయుట అన వసరమని భావించి యుండవచ్చును. ఇదియునుగాక ఆశ్వాసాది, ఆశ్వాసాంత మునగల పద్యములలో కృతిపతి జీవిత విశేషములోని కొన్ని భాగములు ద్యోతక మగుచున్నవి.

గమనిక : ఇందలి విశేషాంశములను ప్రత్యేక ప్రకరణములలో పేర్కొందును.

**కృతిభర్తను గూర్చిన పద్యములు : ప్రతి యుల్లాసము మొదట మరియుచివర :**

కృతిభర్తను సంబోధించుచు, స్తుతించుచు, మరియు జీవితములోని ప్రసిద్ధ ఘట్టములను తెల్పుచు వ్రాయబడిన పద్యముల సంఖ్య = 95.

45 + 19
23 + 8 =
95
} ఇందులో : కందములు = 45; శార్దూలములు = 19; మాలినులు = 23; ఇతరములు = 8 గలవు.

---

1. పూర్తి గ్రంథాంతమున ఆశ్వాసాంత పద్యములకు పూర్వమే నమస్కృతి సీసము గలదు. పుట 623.

ప్రతి యుల్లాసము మొదట=1 సంబోధన పద్యము, చివర 3 పద్యములు గలవు. ఇట్లు ప్రతి యుల్లాసములో 1+3=4 పద్యములుండును. కాని, పూర్వభాగమునందలి 5 వ యుల్లాసము చివర రెండు పద్యములేగలవు. లెక్కించగా 24+4=(1+2=3) 96—1=95. ఈ గ్రంథములోని ఉల్లాసముల సంఖ్య=24.

**గ్రంథనామౌచిత్యము : (కావ్యోద్దేశ్యము) :**

ప్రస్తుత గ్రంథముపేరు "ఆచార్యసూక్తిముక్తావళి." గ్రంథకర్త పేరు శ్రీమాన్ నంబూరి కేశవాచార్యులు. ఇతడు తన గ్రంథమునకు ఆ. సూ. ము, అనియే పేరేల పెట్టవలె? ఇంకొక నామధేయము నుంచగూడదా? అని ప్రశ్నవేసి కొని సమాధానముల నాశించుట కౌతూహలజనకమగుననియే నా యభిప్రాయము. గద్యపద్యములుగల్గి, చంపూ పద్ధతిలో కొనసాగిన బృహత్ కావ్యమిది యని మనమిట గ్రహించవలయును.

కావ్యమునకు లేదా గ్రంథమునకు పేరుపెట్టుట లేదా శీర్షిక నెన్నుకొనుట గూడ ఒక కళయే.

ఒక చక్కని పేరుంచవలె. సార్థకమైనట్టిది, సౌందర్యయుతమైనట్టిది, సారవంతమైనట్టిది, అలంకారప్రాయమైనట్టిది, ఆత్మీయమైనట్టిది, గుండెలకు హత్తుకొనునట్టిది, కొంగ్రొత్తది, ప్రమాణమైనది, పరమార్థమైనది. ఇట్లు వ్యక్తిగతాభిరుచులకనుణ్యముగా రచయిత తన కిష్టమైన కథావస్తువును, దానికి తగినట్టి శీర్షికను (పేరును) ఎన్నుకొని కావ్యమును వ్రాయుట కారంభించును. మొదటపెట్టిన పేరుబాగుండనిచో గ్రంథము ముగిసిన పిమ్మట దానిని సవరించి వ్రాసికొనుట సంభావ్యమే.

మొత్తముమీద గ్రంథమేదోవిధముగ ప్రకటితమైన పిమ్మట అది పాఠక లోకమునకందును. మొదట పాఠకుని నయనములకు గోచరించునది గ్రంథము పేరు, పిమ్మట కవి లేదా రచయితపేరు. కావ్యరసాస్వాదనపరులకు కవిత్వాలంకార గ్రంథములు రుచించును. కథలు చదివెడు వారికి కథలు - నవలలు, ఇత్యాది. ఇట్లు వివిధ సాహిత్య ప్రక్రియల నభిమానించు వారుందురు. వారు చదివెడు గ్రంథములుండును. వ్రాసెడువారును యుందురు. కాని, విమర్శకులైన సహృదయ రసజ్ఞులన్ని గ్రంథములను చదువవలెనందురు. గ్రంథశీర్షిక ఆకర్షణీయముగానున్నచో నిక చెప్పెడిదేమి? మొదట దానినే కొని చదువుదురు.

కావ్యాలు కాంతాసమ్మితాలు గాన కావ్యాల పేర్లను కొన్నింటిని తెలుపు చున్నాను. పొట్టిపేర్లు - పొడవైనపేర్లు - అలంకార యుక్తములు కొన్ని - కథా వస్తు సూచకములుకొన్ని. ఇట్లు భిన్నభిన్న దృక్కోణములతో నున్న పేర్లు.

**ఆకర్షణీయములైన పేర్లుగల గ్రంథములు కొన్ని :**

**విశిష్టాద్వైత సంబంధములు :**

ఆముక్తమాల్యద, ఆచార్యరత్నహారం, గోదావధూటీ పరిణయము, సకల జీవ సంజీవనము, పరమయోగివిలాసము, వైజయంతీ విలాసము, కవికర్ణరసాయనము అళ్వార్‌వైభవము, ఆచార్యవైభవరత్నావళి, ప్రపన్నామృతము,రామానుజాభ్యుదయము, ముముక్షుజనకల్పము, ద్వాదశసూరి చరిత్రము మున్నగునవి.

పై గ్రందములు సార్ధక నామదేయములేయనుట సత్యదూరముగాదు.

**ఇదే పేరుగల గ్రంథములున్నవా? :**

లేనేలేవని చెప్పవచ్చును.

"ఆవళి" యను పదము చివరగల గ్రంథముల సంఖ్యాకములు.

"ముక్తావళి" చివరగల గ్రంథములు ఎక్కువగనే కన్పించును.

"సూక్తిముక్తావళి" చివరగల గ్రంథము లతి స్వల్పముగ గోచరించును.

ఇట్లే ''ఆచార్య'' పదము మొదట గల గ్రంథములు కొన్నిమాత్రమే.

**"ఆచార్యసూక్తిముక్తావళి" యను పేరులో గల సౌందర్య విశేషము :**

ఇందులోని "సూక్తిముక్తావళి"=సూక్తులనెడి ముత్తియముల సమూహము. ఇందులో రూపకాలంకారమున్నది. సరే. "ముక్తావళి" యనగా ముత్యాలహారము. ఆభరణ విశేషము. మానవ శరీరమునకు సౌందర్యము నాపాదించునట్టివి. సౌకుమార్యమైన ఉనికి గలవి. స్వచ్ఛమైనవి మలిన రహితములు. పవిత్రతను చేకూర్చును. హృదయాహ్లాదమును గల్గించును. శరీరశోభ నినుమడింప జేయును. జీవకళను జ్జీవింపజేయును 1 "హ్రియతే చిత్తమనేనహారః" "హారోముక్తావళీ" "ముక్తానాం ఆవళీముక్తావళీ" అని అమరకోశము చెప్పుచున్నది.

---

1. ఆయుర్వేదములో ముత్యముల ప్రసక్తి గలదు. "వస్తుగుణదీపిక. 1984 Page 629. ప్రచురణము: రచయిత, శ్రీ యర్రా వేంకటస్వామి:- ముత్య-

**ముక్తావళి ప్రసక్తులు :**

ముత్యముల ప్రశంసను అనగా ముత్యాలహార ప్రశంసను తెలుగు కవులు వివిధరీతుల వర్ణించి యున్నారు. నన్నయగారు-

"విపరీత ప్రతిభాషలేమిటికి యుర్వీనాథ మీపుత్రగా-
త్ర పరిష్వంగసుఖమ్ము చేకొనుము "ముక్తాహార" కర్పూర....
........................ హృద్యంచే కడున్ శీతమే."

(కొడుకు కౌగిలింత నావలకు బెట్టినచో ముక్తాహారములు హృద్యంబులును, శీతలములును.)

("ముక్తా" : ముచ్యతేశుక్తి సంపుటాదితి ముక్తా. ముక్తైవ మౌక్తికం. ముచ్ల్ మోక్షణే. ముత్యపు చిప్పల వలన విడువబడినది. గనుక "ముక్త." ముక్తయే మౌక్తికము.)

**సూక్తి-మౌక్తికము :**

తామ్రపర్ణినదిలో మౌక్తికములు లభించును దాని తీరమునగల కురుకా నగరములో శఠకోపులు జన్మించిరి.వారి సూక్తులు. సూక్తులనియెడి ముత్యములు. ఇట్టిది సార్థకము. ఈ పద్యమును గమనించుడు.

తామ్రపర్ణినది వర్ణనము : ఆ. సూ. ము. పుటలు: 198.

"చారుముక్తాఫలజన్మనిదానము - సమదగజాకీర్ణసైకతంబు,
వకులభూషణ నిర్మాల్యవాసితంబు - తీర్థవత్తామ్రపర్ణినదంబు"

ఇట్టి నదిలో చారుముక్తాఫలములు లభించునట. ముత్యములకు నదులుత్పత్తి స్థానములుగ నున్నట్లు కనిపించదు. కాని, ఇచట ముత్యములు లభించినవి. "తామ్రపర్ణి నదియందే ముత్యములు లభించునట్లు వర్ణింపవలెను" అని కావ్యాలంకారసంగ్రహము పుటలు 491 లో కవిసమయముల శీర్షిక క్రింద శ్రీ సన్నిధానం వారు వ్రాసినారు.

---

ములు = PEARLS. గుణములు: వీటిని ధరించుటవల్ల దేహకాంతి, బుద్ధిబలము, ఆరోగ్యము- సంతోషము గల్గజేయును గ్రహదోషముల శాంతింపజేయును. ("వస్తుగుణ చంద్రిక" రచయిత. చెరుకపల్లి వేంకటరామయ్య, పుట. 772. ఇది నవరత్నములలో నొకటి. వీని ఉత్పత్తి స్థానములు 8 విధములు. ముత్యపుచిప్పలు, మేఘములు మొదలగునవి.)

ఇట్లీ కవి సమయముద్వారా తామ్రవర్ణిలో ముత్యములు లభించుట సార్థకమైనది.

ముత్యములు సౌందర్యకారకములును, శుభప్రదములైనట్లుగనే ఆచార్యుల నోటినుండి వెలువడిన పవిత్రములైన మాటలు, సూక్తులును. సూక్తులనే ముత్తియముల ధరించుట అనగా, వారి మాటలను తలదాల్చుట మానసికశోభను చేకూర్చుటయేగదా. ఇది యొక **"సమర్థనము."**

ఇంకొక **సమర్థనము:** ఈ కవికి స్వప్నములో కనబడిన వాచవీకరగురుడు సౌందర్యమూర్తి. "దివ్యస్రగనులేపనాంబర ధరుడై, సకలాభరణ భూషితుండై, సౌందర్య సౌకుమార్య ఔదార్యాది కల్యాణ దివ్యమంగళ విగ్రహుండై, మంద స్మిత సుందర వదనారవిందుండై" యొప్పుచుండెను. (ఆ. సూ. ము. 922 వ పుట). ఇందలి పదగుంఫనము కావ్యశరీరమునకు ఆభరణవిశేషమని స్ఫురింప జేయుచున్నదిగదా! అట్లే ఈ గ్రంథము పేరులోని ముక్తావళియును. సూక్తి ముక్తావళియును.

**ఇంకను దృష్టాంతములు :**

1) పుట 59, 6. 274, 275 పద్యములు. "అంజనవుంజమో, హరినీలశైలమో....... ...............కవితమణి భూషణాంగములవాడు."

ఇట్టి దివ్యమంగళవిగ్రహుడైన వేంకటాచలనాథుడు "అణ్ణంగారిని" 'వత్స వంశవిభూషణా' యని పేర్కొన్నాడు.

ఇరువురికిని భూషణ విశేషములు. ముక్తావళి యనునది ఆభరణ విశేషము గదా!

అర్చావతారములో నున్న శ్రీమన్నారాయణుడు అలంకార ప్రియుడు గదా. అతడే విశిష్టాద్వైతమునకు ప్రథమాచార్యులు. ఆచార్యావతారమున ఈ లీలా విభూతినే సౌందర్య సౌశీల్య వాత్సల్యాది గుణములచే, సూక్త్యలంకార వైభవాతి శయములచే నుజ్జీవింపజేయుచున్నాడు.

ఇట్లు గ్రంథము పేరంతయును అత్యంత మనోజ్ఞము, మాధుర్యయుతము, అలంకార ప్రాయము, సందర్భోచితమునై భాసించుచున్నది.

**గ్రంథమునకు నామకరణము గావించుట మొదటనే జరిగినది :**

తిచ్చిన యీ 'అ.సూ.ము.'కి వక్త శ్రీ వాదిభీకర గురుండనియు....''

ఇందులోని ''అనతిచ్చిన ఆచార్యసూక్తి ముక్తావళి" అను పదములను జూచినదో ఈ కవి గ్రంథమును వ్రాయుటకు ముందే గుర్వాజ్ఞ ప్రకారము పేరు బెట్టినట్లు స్ఫురించును. పిమ్మట ప్రతి పాఠ్యాంశములగు కథా వస్తువులను వర్ణనా చాతుర్యమునంజేసి మనకందించినాడు.

**"ఆచార్య సూక్తిముక్తావళి గ్రంథము పేరులోని పదములకు గల యర్థములు - సమానమునకర్థము :**

ఆచార్య - సూక్తి - ముక్త - ఆవళి : నాల్గు పదములుగల పదబంధము.

ఆచార్యుని యొక్క (ఆచార్యుల)

సూక్తి యనెడు (సూక్తుల)

ముక్తావళి (ముత్తియముల సమూహము, ముత్యాలహారము. (షష్ఠి - రూపక - షష్ఠి సమాసములు) "ఆచార్యులందఱి (ప్రత్యేకముగా ఒక్కొక్కరి) సూక్తులు (ఉపదేశ వాక్యములు) అనెడి ముత్యాల హారము.''

**ఈ పేరు పెట్టుటలోగల మరికొన్ని విశేషములు: సమయసందర్భ ములు: కారణములు:** ఈ కవి తన స్వప్నవృత్తాంతమును వాదిభీకర గురునకు వినిపించి, వారి శుశ్రూషను జేయుచు, తదాజ్ఞానువర్తియై నాగలాపురంబునం గల వేదనారాయణస్వామి కైంకర్యమును ముగించుకొనిరాగా, గురువు సంతో షించి, కవి ననుగ్రహించి, అతని నాలుకపై నివసించినాడు. ఇదివరకు తాను కవికి ప్రసాదించిన శ్రీభాష్యాది సకల గ్రంథముల సారాంశములను, ఆళ్వారా చార్యుల జీవితచరిత్రలను కవినోట పలికించినాడు. అనగా కవిత్వమును చెప్పించి నాడు. కవి వ్రాసికొన్నాడు. కవికి ఆచార్యుని యందుగల భక్త్యనురాగములు, ఆచార్యప్రపత్తి, భావావేశములు, కవిత్వపుటాలోచనలు ముప్పిరిగొని "వాదిభీకర గురుడనె మోదమలర" అను మకుటాంతముండునట్లుగా జీవితచరిత్ర కావ్యముల లను వ్రాయించినది.

**శీర్షిక పేరునిట్లు సమర్థింతును :**

1) వాదిభీకరగురుడు కవికి ఆచార్యుడు.

2) ఈ యాచార్యుని యొక్క = వీరుబోధించిన, చెప్పిన

**b)** సూక్తిముక్తావళి = సూక్తులసమూహము, మంచిమాటల సమూహము= (సూక్తులలెడి ముత్యాలహారమని అలంకారప్రాయమైన గ్రంథనామమేర్పడినది.)

**2)** ఈ కవి గ్రంథకర్తృ వృత్తాంతములో పేర్కొన్న ప్రతిపాద్యాంశమును గమనించుడు: పుట: 623. ''ప్రతిపాద్యంబు శ్రీశఠకోపుల, పరకాల, నాథ, యామున యతీంద్రాది పూర్వాచార్య మాహాత్మ్యంబనియును.''

ఇందులోని శఠకోపులు, నాథ, యామున, యతీంద్రులు వాక్యగురు పరంపరలోని పూర్వాచార్యులలోని కొందఱు వ్యక్తులు. పరకాలుడు ఆళ్వారులలో నొకడు. ఇక ఆదులనగా మొదలగువారు. ఈ పదమువల్ల ఆళ్వారులందఱును, పూర్వాచార్యులును, తర్వాతి ఆచార్యులును చేరుదురు. (రామానుజుల అనంతరము వారు- ముఖ్యులు మాత్రమే.)

ఈ గ్రంథములో ప్రధానముగా ఆళ్వారుల, ఆచార్యుల జీవిత చరిత్రలు గద్య పద్యరూపములలో నున్నవి. వాదిభీకరుడీ విషయములను మాటలలో అనగా సూక్తులలో తెలిపినాడు. ఇట్టి పేరు సార్థకము.

**15) ఆచార్యుల పంక్తిలోకి ఆళ్వారులెందుకు రావలయును:** ఇరువురి వ్యక్తిత్వములు వేరుగదా? పదములు వేరుగదా? అర్థములు వేరుగదా. యను సందేహములు గలుగ వచ్చును. **''ఆళ్వారాచార్యుల సూక్తి ముక్తావళి''** యని గ్రంథము పేరేల పెట్టగూడదు? అవకాశమున్నది గదా! కవి ఇట్లెందుకు చేసినాడు?

**a)** గురుడానతిచ్చినాడు. కవి శబ్దప్రయోగము (పేరు) గావించినాడు.

**b)** ఆళ్వారుల పేరు నిందులో దూర్చుటకు పేరును మరల సౌందర్య యుతము గావించ వలసి యుండును. చేర్పులు - మార్పులు ఎందుకనుకొన్నాడో యేమో? కవి యిష్టముమీద గ్రంథమాధారపడి యుండును- మనచేతగాదు.

**c) సమర్థనము :** విశాలార్థములోనికి వెళ్ళినపుడు ఆళ్వారులను ఆచార్యులనవచ్చును. ఇట్లనుటకు వీలున్నది - సందర్భములున్నవి, ఆళ్వారులందఱును విశిష్టాద్వైత సిద్ధాంత స్థాపనకు ప్రామాణికమైనవారు, ఆలంబనమైనవారు - కవీశ్వరులు, విద్వాంసులు, ఉపదేశకులు, హితవరులు, శ్రీశఠకోపులవారు ఆళ్వారులును, ఆచార్యులున్నూ.

అందులకే ఆళ్వారులందఱకును ఆచార్యశబ్దము వర్తించును. కాని, ఆచార్యులందఱకును ఆళ్వారు శబ్దము వర్తించదు. (ఒక్క రామానుజులకు తప్ప.)

ఇట్లీ ఆచార్యసూక్తిముక్తావళి యను పేరు ఈ గ్రంథమునకుంచుట సమర్థనీయము, సార్థకము.

4. ఇందలి ఆళ్వారుల సంఖ్య = 12. ఆచార్యుల సంఖ్య అపరిమితము. శిష్యులుగూడ ఆచార్యులగుట, పీఠస్థులగుట యున్నదిగదా! ఆచార్యుడొకప్పటి శిష్యుడే ఇట్లు ఆ. సూ. ము. లోని ప్రసిద్ధులును, ఇతరులను కలిసి 530 వరకాచార్యులున్నారు.

ఇట్లు ఆచార్య ప్రాధాన్యతగల గ్రంథరాజమిది.

5. ఈ గ్రంథములో రామానుజులను గూర్చిన పద్యములు, గద్యములు గ్రంథ సగభాగము నాక్రమించినవి. (సంఖ్యావివరణ ప్రత్యేకముగా చేసినాను.) సంఖ్యనుబట్టి కవిగారు మొదట రామానుజులచరిత్ర వ్రాయుటకు తలపెట్టినట్లున్నది. విషయపరిపూర్ణతకై రామానుజుని పూర్వీకుల, అనంతరము ముఖ్యులైనవారి చరిత్రలను అనుబంధములుగా చేర్చి సమన్వయపరచియుండుట కవకాశమున్నది. ఎట్లయినసేమి? కవి గ్రంథమును వ్రాసినాడు. పేరుపెట్టినాడు. ఆచార్యులెంతమందియున్నను దానికి అర్హుడైనవాడు "రామానుజు డొక్కడే"యని పలువురు ప్రసిద్ధ పండితులు, ఆచార్య శ్రేష్ఠులును వక్కాణించినారు. ఈ క్రింది శ్లోకము ప్రసిద్ధము:

"సత్యం సత్యం పునస్సత్యం - యతిరాజో జగద్గురుః
సయేవ సర్వలోకానాం - ఉద్ధర్తానాస్తి సంశయః"

అన్నట్లు రామానుజులే జగద్గురువు అని భావించి, ఈ కవి తన గ్రంథమునకు ఆ సూ. ము యని పేరుపెట్టియున్నాడనుటలో అసందర్భములేదు అంతేగాదు, రామానుజులవారి స్తుతిని గమనించుడు:

"స్ఫార గురుపంక్తి మౌక్తిక హారతరళ దివ్యరత్న!"

(ఆ. సూ. ము. పుట. 434)

గురుపరంపర యను ముత్యాలహారములోని తరళ దివ్యరత్నము (మధ్యభాగము) శ్రీ రామానుజులవారు.

గ్రంథము పేరు సార్థకము.

ఒక విచిత్రము :

1. కృతికర్త తండ్రి పేరు - ఆసూరి కేశవాచార్యులు
2. కృతిభర్త జన్మస్థలమునగల దేవుని పేరు - కేశవనాథుడు
3. కృతికర్త పేరు - నంబూరి కేశవాచార్యులు

} విశిష్టాద్వైతమత భావనము- తత్త్వత్రయము.

6. గ్రంథము పేరు మూడు భాగములు:
ఆచార్య + సూక్తి + ముక్తావళి;
గ్రంథ ప్రధాన భాగములు మూడు;
పూర్వ - మధ్యమ - ఉత్తర.

} త్రిదండి సంజ్ఞను సూచించును. చిదచిదీశ్వరులు సత్యమే అని తెల్పును. ఊర్ధ్వపుండ్రములు త్రిసంజ్ఞకములు.

గ్రంథమవతరించుటకు ముగ్వురును కారకులే.

కృతిభర్త - కృతివక్త - కృతికర్త.

మంత్రత్రయములో మూడు మంత్రములు:

1. ఈ మంత్రముల నుపదేశించువా రాచార్యులు.
2. వారి వివరణములు, బోధనా విధానములే సూక్తులు, మౌక్తిక తుల్యములు.
3. ఈ సూక్తులను తలదాల్చువారు(సమూహము) విష్ణుదాసులగు శిష్యులు, భక్తులు.

} ఆచార్య + సూక్తిముక్త + ఆవళి.

7. ఎన్నుకొన్న శీర్షికనుబట్టి (పేరు ననుసరించిగూడ) కావ్యమునకు గౌరవ స్థానము లభించును.

"భగవద్రామానుజులు మంత్రరాజమును బహిరంగము సేయగా దానిని విన్నవారు ఆచార్య పురుషులు, 74 సింహాసనాధిపతులైరి. (పుట-173); వీరు యతిరాజుల అంతేవాసులు. క్షేమంకరులు. వీరి నామధేయములు జగత్త్రియ పాపనిర్మోచనములు. అఖిల వైష్ణవలోక కర్ణామృతములు." (పుట. 322)

"అమ్మహాత్ముని యందె యాచార్య దేశిక గురు పదంబులు దొడ్డకూర్మి బెందె" అనుట సార్థకమే.

8. కావ్యోద్దేశము :- చేతనోజ్జీవనము - విశిష్టాద్వైత సంస్థాపనము.
"ధీమాంద్యాదృతవైరిషట్క-హత, మాదృక్ చేతనోజ్జీవనా!
యామోద్వైక నిధాన సద్గుణ విశిష్టాద్వైత సంస్థాపనా!"

అనునది రామానుజుల స్తుతి సూక్తి.

ఇట్లు "ఆచార్య సూక్తిముక్తావళి" నామమీ గ్రంథమున కన్ని విధముల తగినదై, నామసార్థక్య సౌందర్య దర్శనముకురమై, సహృదయుల నాహ్వానించు చున్నయది.

**సూక్తి శబ్ద విచారము :** (సూక్తుల వైభవమును, కొన్ని ప్రధాన సూక్తులను పంచమాధ్యాయములో వివరించినాడను.)

**సూక్తికి నైఘంటికార్థములు :** సుద్ది, సమాచారము, మంచిమాట, నీతి వాక్యము, సుభాషితము, దొసగులు లేని వాక్యము.

C.P. Brown నిఘంటువు = సు + ఉక్తి: **a fair or friendly word, a good word,** మంచిమాట.

వ్యుత్పత్తి : [సు + వచ (పరిభాషణే) + క్తిన్ - కృ.ప్ర.] : చక్కగా చెప్పబడినది.

**వివరణము :** సూక్తులనగా చక్కగా చెప్పబడిన మాటలు. వీటికి సమానార్థకములుగా లోకవ్యవహారములో సుభాషితములని, లోకోక్తులని, సామెతలని, మంచిమాటలని అర్థములు చెప్పుకొనుట గలదు. పదవిశ్లేషణలో సాహిత్యకారున కంతరార్థములు గోచరింపవచ్చును. సమయ సందర్భమునుబట్టి సూక్తిపదమున కర్థ సమన్వయమును గావించుకొనుట విమర్శనాత్మకమైన విచక్షణ యగును.

"సూక్తి'' యను పదము విన్నంతనే "సూక్తము'' యనుమాట స్ఫురించును. సూక్తము సామాన్యజనుల దృష్టికి రానిపదము సూక్తమన్నను చక్కగ జెప్పబడిన మాటయే ఉదాహరణముగా 'పురుషసూక్తము, శ్రీసూక్తము' మున్నగునవి. విశేషవేళయందు దీనిని వాడుదురు. ఒక దేవతను స్తుతించే ఋక్కుల సముదాయమే సూక్తమనబడును.

**తెలుగు సాహిత్యములో సూక్తులు : గ్రంథ సమర్థనము :**

తెలుగు సాహిత్య ప్రపంచంలో మన కెన్నియో సుకవి సూక్తులు, మహానీయుల సుభాషిత గ్రంథములు గలవు. గద్య, పద్య, ఉభయాత్మకములు ఏనుగు లక్ష్మణ కవి సుభాషితములు; వేమన, సుమతి శతకాదులు ప్రసిద్ధములు విరివిగా ప్రచారములో నున్నవి.

ఉద్దేశ్యమేమి? వాని వర్గీకరణమెట్లొనరించవలె? లక్షణములేమి? మొదలగు అంశములు ప్రత్యేకవిషయ (సిద్ధాంతవ్యాస) చర్చలోనికి చేరునుగాన ఈ గ్రంథమున అన్నింటి చర్చ అవసరముగాదు.

1. నన్నయ,శ్రీనాథాదులు ఈ పదములను వాడుకొని వాటికి సార్థక్యతను చేకూర్చినారు. నన్నయగారు "నానారుచిరార్థ సూక్తినిధి" యైతే శ్రీనాథుడు "పరిఢవింతు ప్రబంధ పరమేశ్వరుని తేవసూక్తి వైచిత్రి నొక్కొక్కమాటు" అన్నాడు. ఇట్లే ఎందరో కవులు ఈ శబ్ద ప్రయోగమును గావించినారు. అన్నియును సామాన్యములే.

**2. ఈ గ్రంథవిషయములో సూక్తిపదమొక ప్రత్యేకతను, విలక్షణతను సంపాదించుకొన్నది:**

a) వాదిభీకరగురు డన్నట్లుగనే ఈ గ్రంథ రచయిత ఆళ్వారుల - ఆచార్యుల జీవితములకు ఇతర విషయవిశేషములను జతపరచి, హృదయంగమముగ కవిత్వధోరణిలో తెలుపుచుండుట-అనగా మాటలలో పేర్చుట, సూక్తులుగా హారమువలె దూర్చుట. శీర్షిక సామంజస్యమునకు బలకరము గదా!

ఆచార్యుల జీవితాలు మనకు మార్గదర్శకములు. వారి జీవితచరిత్రలు చక్కని మాటల సమూహములు. అవియే సూక్తులు గాన, ఆ.సూ.ము. యను పేరు సార్థకము.

b) "సూక్తి" యను పదమన్నచో ఈ కవికి మిగుల ఇష్టము. ఈ గ్రంథములో ఎన్నియోమార్లు సూక్తి - శ్రీ సూక్తి - సూక్తులు, శ్రీ సూక్తులు అని సందర్భానుసారముగా వాడినాడు.

సుమారు వీటిసంఖ్య 160 కి పైగా కలదు.మౌక్తికశబ్ద సంఖ్యయు ఎక్కువగనే గలదు-25 కి పైగా.

**4. ఆళ్వారుల రచనములన్నియు సూక్తులనబడును :**

ఇవన్నియును ప్రబోధాత్మకములు. ఉపదేశాత్మకములు. వేదతుల్యములైనను కవితాశోభను గల్గిన కాంతసమ్మితమైన సూక్తులు. సాహిత్య గుణముల జీర్ణించుకొన్నట్టివి. ముక్తక పద్యములవలె విడివిడిగా పాశురము లర్థము నిచ్చును.

ఆళ్వారులవలె ఆచార్యులును రచనల గావించిరి. అవియును **సూక్తులే**. వార్తామాలలును **సూక్తులే**.

తమిళములో అనగా దివ్యప్రబంధాదులలో ఈ పదము తఱచుగా కన్పించును. ఉదా॥ తిరువాయి "ళి" (ళి) పెరుమాళ్ తిరుమొళి(షి).

(లిపిలో గుర్తించుటకై తమిళ "ళ" అను అక్షరమును తెలుగులో ళ . ద - ళZ గా ముద్రించుచున్నారు. గుణితమునయు ఇట్లే )

మొళి = మొళి = మొడి = ముడి = మొషి.

తిరు = శ్రీ; వాయ్ = వాయి = నోరు, ముఖము

మొళి = మొఱ (తిరువాయి + ముడి) షష్ఠీతత్పురుషము అనగా పవిత్రమైన నోటి నుండి వెలువడిన సూక్తి.

తిరువాయి = పవిత్ర వాక్కుగలవారు = పెద్దలు.

ముడి = మాట, వచనము, "సత్యవాక్కు" = భగవత్కటాక్ష జన్యమగు వాగ్ధోరణి; మహనీయుని వాక్కునుండి వెలువడిన "దివ్యవాణి." ఇట్టి రచనలకు శ్రీ **సూక్తుల**ను మాటయు సార్థకము.[1]

**తిరుమాయిమొషి పాశురమొక సూక్తియే :**

పీఠే : "తస్మింస్తదాకంబ శ్శతజిత్సూక్తి పత్రికామ్
వేదాన్తిన్ ద్రావిడ కవి త్రిశతేన విరాజితే"

—నడిగడ్డపాలెం వారి ప్రతి, 646 వ పుట.

ప్రపన్నామృత గద్యలో గూడ "సూక్తి" గలదు. "ఇతి శ్రీప్రపన్నామృతే, భట్టార్య వేదాంతి సంవాదే శ్రీశఠకోపచరిత్రే, శఠజిత్ సూక్తి పత్రికాయా."

(356 వ పుట)

శ్రీవాదిభీకరగురుడు చెప్పిన విషయములన్నియు **సూక్తుల** అర్థవైశాల్య పరిధిలో నిమిడిపోవుట కవకాశమున్నది. కాన ఇందలి జీవిత చరిత్రలు,రచనలు, ఇతర విశేషాంశములన్నియు **సూక్తుల** క్రిందికే వచ్చును.

---

1. **ప్రపన్నామృతము** : 34 వ అధ్యాయము : 34 వ శ్లోకము (అతిప్రాచీన ప్రతి. పుటలు. 356 లో గద్య గలదు).

**శ్రీవైష్ణవుల, విశిష్టాద్వైతతత్త్వరచయితల రచనలలో ఈ "సూక్తి" యనుమాట తఱచుగా కన్పట్టు చుండును :**

"చిన్త్రయ సర్వం - చిదచిద్రూపమ్,

తనురితితస్య - హరేరనురూపమ్" అను శ్రీ సూక్తి యీ యర్థమునే విశదీకరించుచున్నది.

**విశిష్టాద్వైతము శాశ్వతమైన విలువల ప్రతిపాదించు సౌందర్యాత్మకమైన పేరుగలది. ఇట్లే "ఆచార్యసూక్తిముక్తావళి"యును.**

ఈ వాక్యములను గమనింపుడు :

**"Vishitadvaita is the only Philosohy of religion that recognise the eternal value of beauty and recognises Brahman as the beautiful and blissfull." (The Philosophy of Visita-dvaita-"Prof P. N. Srinivasa Chary.)**

**గ్రంథనామమును బలపఱచునట్టి ఈ క్రింది వాక్యములను గమనింపుడు: (ఆ.సూ.ము. పుటలు. 420, 421.)** "వడకుత్తిరువీధిపిళ్ళగారు సాత్త్వికులడిగిన "ఆత్మస్వరూపం - బెట్టిదను ప్రశ్నకు సమాధానమిచ్చు సందర్భము."

"వేదశాస్త్రంబులు, స్మృతీతిహాసపురాణంబు లాచార్య శ్రీ సూక్తులను, శ్రీవకులభూషణముని ప్రముఖ దివ్యసూరి ప్రబంధములును, దక్కినయాగమంబులన్నియు నరసిచూడ, నాచార్యాభిమానంబు కంటె వేరొక మోక్షోపాయంబు లేదు. భాగవతాపచారము కంటె నితరంబగు ముక్తివిరోధంబు లేదు."

పైవిషయాంశముల నీ గ్రంథము స్వీకరించినది. ఆళ్వారాచార్యుల వైభవముల సూక్తుల ద్వారా నిరూపించినది.

**చివరిమాట :-**

అర్చామూర్తులు (శ్రీ వేంకటేశుడు, శ్రీరంగనాథుడు మొదలైనవారు) మొదలుకొని రామానుజులకు పూర్వాచార్యులు, అనంతరము వచ్చిన ఆచార్యులందఱును రామానుజుల ప్రభావమును ప్రకాశింపజేసినవారేగాక ఐక్య

ఆచార్యులందఱు చేసిరిగాన 'సూక్తులనెడు ముత్యాల హారము' అనవచ్చును: పుటలు 335-337-345.

ఆ 'సూక్తిముక్తావళి' యే
''ఎంబెరు మానారు దివ్య తిరువడిగళే శరణము''

అనునది (సర్వదేశ కాలావస్థల యందును) గ్రంథమునకు ప్రాణాధారమైన హృదయమువంటిదైనది.

ఇట్లే ఆ. సూ. ము. గ్రంథనామము సార్థకమైనది. వాదిభీకరుడానతిచ్చిన విషయముల, సూక్తుల క్రోడీకరణ గ్రంథమే ఆచార్యసూక్తిముక్తావళి.

''అస్మన్ముఖంబున ఆచార్యసూక్తిముక్తావళి యేగురుడానతిచ్చె'' (పుట-613.)

''దారు భవిష్యదాచార్యునెవ్వనితొల్లి
సాక్షాత్కరించెను శఠవిరోధి
ఇలను మత్కృతినాయకుండే ఘనుండు
అట్టి రామానుజాచార్యుల స్మదీయ, బుద్ధిగనిపించుగాక'' పుటలు. 155.
ఇట్లు సర్వమును ఆచార్యమయము. వారిని గూర్చిన సూక్తులు.
ఆ. సూ. ము. అన్వర్థాభిధాన యగుచున్నది.

## కావ్యారంభ విధానము: ప్రణాళిక: పద్ధతులు

శ్రీమాన్ నంబూరి కేశవాచార్యులు కృత్యాదిని శ్రీకారమును ప్రయోగించి కృతిపతిని సంబోధించుచు శార్దూలవృత్తము నుపయోగించినాడు. కృతిపతి: శ్రీ మద్రామానుజాచార్యులు. కృతివక్తయైన వాదిభీకరగురుడు గ్రంథరచనా కార్య క్రమ సర్వస్వమును నిర్వహించినాడు. కవికి స్వప్నమున సాక్షాత్కరించినదీ కృతివక్తయే. కృతిపతిగాని, భగవంతుడుగాని కవికి స్వప్నములో కనబడి కావ్యమును వ్రాయుమని కోరలేదు. కృతివక్తయును కోరలేదు. కానీ తానే స్వయముగా కవి జిహ్వాగ్రముపై నిలిచి విషయములను చెప్పినాడు. కవి తలదాల్చినాడు. వ్రాసికొన్నాడు. ఇట్లు గ్రంథ మవతరించినది.

రిక యనునదే లేదు. మనుచరిత్రాది ప్రబంధములనీ కవి చదువుకొన్నాడు గాని ఏలకో నియమముల విషయములో తాను స్వతంత్రించినాడు.

1. అంకిత పద్యము పిమ్మట ఇష్టదేవతా ప్రార్థనలు లేవు.

2. గురు స్తుతులు, కవి స్తుతులు, దేవతాది సజ్జన స్తుతులు లేవు. కుకవి నిందలు లేవు.

3. షష్ఠ్యంతములు లేవు. కృతికర్త వంశ వృత్తాంతము లేదు.

4. "అభ్యుదయ పరంపరాభివృద్ధిగా" 'నా యొనర్పంబూనిన' వంటి కథాక్రమమును దెల్పు వచనము లేదు.

కావ్యారంభ విభాగములో నుండవలసిన అంశములు కొన్ని గ్రంథము చివర గలవు.

1. కృతివక్తను గూర్చిన వంశవృత్తాంతము (తాతముత్తాతల పేర్లు మొదటి అణ్ణంగారినుండి వృతివక్త వరకు).

2) గ్రంథకర్తృ వృత్తాంతము. (ఇందులోనే కృతిపతి పేరు - కృతివక్త పేరు, కృతిప్రతిపాద్యము, కృత్యవతరణమునకు కారణము, పిమ్మట తనకు గ్రంథములను,రహస్యముల ప్రసాదించిన వారి పేర్లు, చిట్టచివరిగా స్వాచార్యుడైన నేలకొండపల్లి జియ్యరుగారి తనియను వ్రాసికొన్నాడు. దీనిని గురుస్తుతిగా భావింపవచ్చును.

3. ఈ కవి పూర్వకవుల నేల స్మరింపలేదో తెలియదు.

4. మొదటి అణ్ణంగారి తనియ విన్నపమును జేసినాడు. కాని, కృతివక్తను గూర్చిన తనియను వ్రాయలేదు.

**ప్రారంభవిధాన వివరణము :**

1. మొట్టమొదట అంకిత పద్యము. రామానుజులస్తుతి.

"శ్రీమద్భూతపురీశ! కేశవనివేశీభూత హృత్పద్మ!ని
ష్కా-మావేశ! పరాశరాదికము నీశ శ్రేష్ఠవాగ్వంశని....
స్సీమ ప్రాభవ! రంగరాజ పద సుస్థేమ ప్రకాశా! యతీ
శా! మాణిక్యమయత్రిదండకర దేశా! కేశవార్యాత్మజా!"

ఈ గ్రంథమాచార్యంకితము. అనగా నరాంకితమని భయపడనవసరము లేదు. శ్రీ మహావిష్ణువే ఆచార్యావతారముల దాల్చువాడు గదా! (వివరములకై ఆచార్యప్రశస్తిని గూర్చిన ప్రకరణమును జూడుడు.)

2. ఈ కవి లఘువచనమైన "అవధరింపుము" అను పదము తోడనే కథా ప్రారంభమును గావించినాడు. ఇది హఠాత్సంఘటన వంటిది. నవలలో; కథలలో ఇట్లే చేయుదురు. ఇదియొక కౌతుహలమును గూర్చు పద్ధతి.

3) "అవధరింపుము" అను వచనము వెన్వెంటనే ఒక సీసపద్యమును వ్రాసినాడు.

ఇందులో శ్రీభూనీళాదేవులతోడను, సమస్త పరివారముతోడను నిండు పేరోలగంబున నున్న శ్రీమన్నారాయణుని దివ్యవైభవముల దృశ్యమును వర్ణించు అంశములతో కథా ప్రారంభము హృదయంగమము గావించబడినది. మంత్రోపదేశ క్రమమిందు గర్భితము. శ్రీమన్నారాయణుని నుండి శఠకోపుల వరకు గల గురుపరంపరను సూచించును.

4) పద్యము ఎత్తుగడలోని గాంభీర్యత, పదగుంఫనము పాండితీస్ఫోరకమై, రామానుజుల హుందాతనమును, దిగ్విజయ యాత్రను సూచించుచున్నది.

5) నాటక రచనాపద్ధతి యందలి 'నాంది'ని తలపింపజేయుచున్నదీ పద్యము.

**మరికొన్ని విశేషములు :-**

"మంగళాదీని, మంగళమధ్యాని, మంగళాంతాని కావ్యాని ప్రథంతే" అని వ్యాకరణ మహాభాష్యకారుడగు పతంజలి వచనము.

ఇచట గ్రంథారంభములోనే శ్రీకారమాదిగాగల రామానుజుల స్తుతి, వెంటనే శ్రీమన్నారాయణుని నిండు పేరోలగ వైభవ వర్ణనము మంగళాచరణములు తెలుపునవి గదా!

తెర యెత్తగనే మనోహర దృశ్యములు నాటకమును రంజింపజేయునట్లు ఈ కావ్యారంభములోనే వైకుంఠ వర్ణనము, శ్రీమన్నారాయణుడు శ్రీదేవితో ముచ్చటించుటలు, దివ్యసభావైభవము నాటకము నందలి ప్రస్తావనను జ్ఞప్తికి దెచ్చును.

కావ్యలక్ష్యములు, కావ్యప్రయోజనము, విశ్వశ్రేయస్సు ఇందు సూచితములు. దీనినే Hypothesis అనగా పరికల్పనము అనవచ్చును.

ఇదివరకే భగవంతు డవతారముల నెత్తినాడు. దశావతరములు పూర్తి (కృష్ణావతారము వరకు) యైనను పని పూర్తికాలేదు.

ఎందుకనగా, ''యథా యథాహి ధర్మస్యగ్లానిర్భవతి భారత!'' ధర్మమునకు గ్లాని తొలగలేదు. "సంభవామి యుగేయుగే" మళ్ళీ కావలయును. దీనికుపాయమాలోచించినాడు నారాయణుడు, తన పరివారమున కాదేశముల నొసంగినాడు. (తనపనిని పూర్తిచేయుటకవతరించుమని.) అవతరించుట యెక్కడోగాదు-దివ్యదేశములయందు. తామ్రవర్ణి, కావేరి మొదలగు నదుల తీరమున. స్థల - జల పర్వత ప్రాంతముల ప్రభావములు వ్యక్తులపై పని జేయును గదా!

భగవంతుని పరివారమే అతని ప్రతినిదులు. ద్రవిడభూభాగములో ఆళ్వారుల, ఆచార్యులరూపములో అవతరించినారు. ఈ క్రింది వాక్యములు దీనిని రూఢిపఱచుచున్నవి:

Note : గమనిక: The Hindhu - Daily 5-7-1990 నుండి ఉద్ధృతము.)

"The PurPose of Divine messengers :"

That person has neither inherited or has innate tendencies for virtue is ultimately attributed to the special grace of God. Very often the Almighty glorifies himself through chosen representatives. To them he allots a duty which they carryout with faith. Example of Periyazwar.

(Discourse by Sri Sthalasayanam.)



## గ్రంథములోని ప్రతిపాద్యమైన విషయము : ముఖ్యాంశ ములు విభాగము (ఇతివృత్తము)

ఇందు ప్రతిపాద్య విషయము: "శ్రీ శఠకోప, పరకాల, నాథ, యామున యతీంద్రాది పూర్వాచార్య మాహాత్మ్యంబు." ఇట్లనుటచే ఆళ్వారులయు, నాథ మునులనుండి రామానుజుల వరకును, అటుపిమ్మట అవతరించిన ఆచార్యు లందఱి జీవిత విశేషములిందు గలవని తెలియుచున్నది:

ఇట్లు జీవిత చరిత్రలను మహాకావ్యరూపములో మలచిన గ్రంథరాజమిది. గ్రంథస్థ కథావస్తువునందలి అంశముల విభాగమును ఆశ్వాసములు, అనగా ఉల్లాసరూపములలోను, అందలి చిన్న భాగములను జీవిత చరిత్రలు, అనగా "వైభవ" శీర్షికలలోను తెలుపుటకై విషయానుక్రమణిక ఏర్పరచుకున్నాడీకవి. 'పెరుమాళ్ళ వైభవమే ఆచార్యుల వైభవమా!' యను ధ్వనిసూచక విభాగమిది.

ఇందలి గద్యలు : ఇందులో 24 ఉల్లాసములకు 24 గద్యలు గలవు. ఇవి విపులముగా నుండి విషయసూచికవలె విభాగింపబడినవి. వీటిని గూర్చి గ్రంథస్థ విభాగమును జూడనగును. (చతుర్థాధ్యాయము )

**ఉల్లాసవిభాగము అంతర్భాగముల సంగ్రహ విషయసూచిక : సం॥ 1972వ ప్రతిననుసరించి :**

ఇందు మూడు ప్రధాన విభాగాలు గలవు:

1. పూర్వభాగము, 2. మధ్యమభాగము, 3. ఉత్తరభాగము.

పూర్వభాగములో 6 ఉల్లాసములు గలవు.

మధ్యభాగములో 12 ఉల్లాసములు గలవు.

ఉత్తరభాగములో 6 ఉల్లాసములు గలవు.

24 మొత్తము ఉల్లాసముల సంఖ్య.

**గమనిక :** ఈ గ్రంథమునను చదువునప్పుడు ఆయా కాలములనాటి దేశచరిత్ర, భౌగోళిక విషయములు; సాంఘిక, సాంస్కృతిక స్థితిగతులపై సరియైన అవగాహనముండుట ఉచితమని మనవి.

౧। శవ్యకావ్యము. పైన పేర్కొనబడిన ప్రతిపాద్యమే ఇందలి ఇతివృత్త సామాన్య విశ్లేషణ మిట్లుండును:




**సమన్వయము:**

ఆ.సూ.ము. కథ ప్రఖ్యాతము. (ఆళ్వారాచార్యులు పుణ్యపురుషులు గదా!) కావ్యములలో వర్ణనలుండునుగాన కల్పనలు తప్పనిసరి. "ఇతి వృత్తవశాయాతాం త్యక్త్వానుగుణాం స్థితమ్ - ఉత్ప్రేక్షాంతరాభీష్ట రసోచిత కథోన్నయః" (ధ్వన్యా. 3-11) ఆ.సూ.ము.లో రసానుగుణములైన కల్పనలున్నవి. ఇందలి వ్యక్తులు చారిత్రక పురుషులు. కాన మూల విషయములలో కల్పనలుండవు. కవి తన రచనా నైపుణ్యముచేత ప్రతిపాద్యమును (ఇతివృత్తమును) హృదయంగమముచేసి కథావస్తువును సార్థకము గావించినాడు.

## గ్రంథ బృహత్ స్వరూపమును గూర్చి :

ఈ గ్రంథ విషయ వైశాల్య పరిధి అతి విస్తృతము. కావ్య ప్రబంధాది లక్షణముల నాకళించుకొని, వేదాంత శాస్త్రాది పరిచయము నొనరించి, పరిశోధకులకు కొంగు బంగారమై, కౌతుహల జనకమైన సంప్రదాయ రహస్యముల నలుగుర కందించుటకు విషయాంశ వైవిధ్యములకు పెన్నిధియై, అసంఖ్యాకములైన గద్యపద్యములతో, ఆళ్వారాచార్యుల నామములతో నొప్పారుచు నామసార్థకము గావించుకొన్నట్టిది. అందులకే దీని సంగ్రహ పరిచయమును పట్టికల రూపములో నందించుచున్నాను. ఇందులో ఏమున్నదో తెలిసికొనుట కిది లక్షణ

విశ్వశ్రేయస్సును గర్భీకరించుకున్న జనుల నుజ్జీవింపజేయు మహోద్దేశ్యమును అవగాహన చేసికొనుటకు సహకరించును. ఇందలి అంశములు సర్వతోముఖము లైనవిగా స్ఫురించును.

1. "చరితం రఘునాథస్య శతకోటి ప్రవిస్తరమ్" అన్నట్లు రామకథ శత కోటి గ్రంథ పరిమితము. దీనిని మించినట్టిదీ ఆళ్వారాచార్యుల కథలుగల గ్రంథము. భక్తులే భగవంతుని కన్న యధిక ప్రభావవంతులు గదా!

2. శఠకోపుల వాఙ్మయ మనంతమైనది. "భక్తామృతం - విశ్వజనాను మోదనం - సర్వార్థదం శ్రీశఠకోప వాఙ్మయం. సహస్ర శాఖోపనిషత్ సమా గమం" వలె ఆ.సూ.ము. లోని వాఙ్మయము బృహత్స్వరూపము దాల్చినది.

3. ఆళ్వారుల, ఆచార్యుల - ముఖ్యముగా రామానుజుల వైభవమును చిత్రించిన దీ గ్రంథము. (పుటలు. 158, 196, 519.) ఇట్టి గ్రంథ వైభవ వైశాల్య మతి విస్తృతము:

"గురు చతుస్సప్తతిఁ గూడియే కాంగులు పంద్రెండువేల సప్తశతి యతులు
చిత్రగుగుప్తులకైన జెప్పశక్యముగాని సాయుధసూరి నిత్యవ్రజంబు
లారీతి కొత్తెపుటమ్మలు గొలువ లక్ష్మణముని వెడలెడు సమయమందు
విష్ణుసేనలరాజా! విహగరాజా! రథాంగరాజా! పన్నగరాజా! రంగ
రాజా! దెసలు గెల్వగ యతిరాజు తెలుగుదాల్చి...."

## కృతి పరిచయం

| | |
|---|---|
| కృతి — | ఆచార్య సూక్తి ముక్తావళి |
| కృతికర్త — | శ్రీమాన్ నంబూరి కేశవాచార్యులు |
| కృతిభర్త — | భగవద్రామానుజులు |
| కృతివక్త — | ప్రతివాది భయంకరం అణ్ణంగరాచార్యులు (మొదటి అణ్ణంగరాచార్యులవారి మునిమనుమని మునిమనుమని మనుమడు=వాదిభీమకరగురుడు. కవికి గురువు. సమకాలికుడు) |

కృతి సీసపద్యము లన్నింట మకుటము — "వాదిభీకరగురుడనె మోదమలర"

పన్నిద్దరు ఆళ్వారులు - నాథమునులు మొదలు కొని రామానుజా చార్యులు - మరియుఅణ్ణంగారి వరకు.

గ్రంథ ప్రక్రియ — ప్రబంధము - మహాకావ్యము
గద్యపద్యోభయము, చంపువు.

భాష — ఇది తెలుగు గ్రంథము.
అనువాద గ్రంథము గాదు.
సంస్కృతశ్లోకాదులు, తమిళ పాశురభాగములు మాత్రము ఉద్ధృతములు.

మతము-సంప్రదాయము— విశిష్టాద్వైతము, శ్రీవైష్ణవము

గ్రంథావతరణకు ప్రేరకుడు—వాదిభీకరగురుడు.

గ్రంథరచనోద్దేశము — సర్వలోకోపకారార్థము,
ముముక్షుజనుల నందరి నుజ్జీవింప జేయుట
సాంఘికోపయోగము, జగద్ధితము
"విశ్వశ్రేయః కావ్యమ్"

గ్రంథావతరణావశ్యత : విశిష్టాద్వైత సంప్రదాయ ప్రచారము, ముఖ్యముగా తెంగలైశాఖ గురుపరంపరల వైభవములను తెలుపుకావ్యములను నిర్మించవలయునను కోరిక 19 వ శతాబ్ది వారికి కలిగిన దనవచ్చును.

**గ్రంథములోని వివిధ ప్రధాన విషయాంశముల పేర్లు: సంఖ్యలు:**

(మొదటి ప్రతి - 1911 సం॥ పూర్వము; రెండవప్రతి - 1911 సం॥ మూడవప్రతి 1922 సం॥, నాల్గవ ప్రస్తుతప్రతి 1972 సం॥ పుటలు 624)

**1972 సం॥ ప్రతి ననుసరించిన వివరములు :**

గ్రంథ ప్రధానభాగములు - 3
ఉల్లాస భాగములు - 24
1911, 1922 సం॥ ప్రతుల విషయసూచికల క్రమసంఖ్యలు-78
గద్యల సంఖ్య - 24
గద్యల సామాన్యపంక్తులు - 96

గద్యల విషయసూచిక పంక్తులు - 341
గద్యల విషయసూచికల అంశములు - 349
అన్నిరకముల పద్యముల సంఖ్య - 1762
సీస పద్యముల సంఖ్య - 1473
అన్ని పద్యముల పాదముల సంఖ్య - 12,940
సీస పద్యముల శాతము - 83%
వచనముల సంఖ్య - 317
వచన పంక్తులసంఖ్య - 6,243
అతి పెద్ద వచనములోని పంక్తులు - 1444 323
అధికముగా వాడిన పంక్తులవచనము :

1 - 5 పదములు=98 సార్లు
6 - 10 ,, ,, = 26 సార్లు
15 పంక్తులు = $\frac{1}{2}$ పుట = 3 సార్లు
30 ,, = 1 పుట = 1 సారి
1 పంక్తి = 110 సార్లు
2 పంక్తులు = 35 ,,
3 పంక్తులు = 14 ,,

తమిళ పాశురభాగములు - 23
తిరునక్షత్ర తనియలు - 64
తనియలు - 57
వచన భాగములోని ఇతర శ్లోకములు - 272
(సంస్కృత న్యాయములు)
న్యాయములు ప్రమాణములు, ఉక్తులవంటివి - 70
శ్లోక పాదములన్నింటి సంఖ్య = 252
ఆధారగ్రంథములు - 110
మౌక్తి పదసంఖ్య - 25
సూక్తి = ఉక్తి సంఖ్యలు = 165
పెరుమాళ్ళ సంఖ్య - 140
పుణ్యక్షేత్రములు, ప్రసిద్ధ స్థలము, దివ్యదేశములు 140
నగరములు - బహుళము
దివ్యపద సంఖ్య - ,,
నదులు, సరస్సులు - అధికము

తీర్థములు, పర్వతములు ,,
వృక్షములు - 45
జంతువులు - 16
పక్షులు - 10
ప్రశ్నలు, సమాధానములు - 51
వాదోపవాదములు - 12
ఉపదేశములు - బహుళము
ఆళ్వారుల సంఖ్య - 12
ఆచార్యపీఠస్థులు - 74
ఆచార్య పురుషులు-రామానుజుల అంతేవాసులు 175 : పురుషుల
స్త్రీలు

రామానుజుల పరివారము :

1. సంయమీంద్రులు 700
2. పీఠస్థులు 74
3. ఏకాంతికులు 12,000
4. చాతనిదాసులు అసంఖ్యాకులు
5. కొత్తెపమ్మలు 300
6. రాజసమూహము అగణితము

ప్రసిద్ధాచార్యుల సంఖ్య 371
ఆచార్యులందఱి పేర్లసంఖ్య 530
వర్ణనలసంఖ్య, అంశములు 55 కు, ముఖ్యమైనవి 62 కు పైగా
శ్రీవైష్ణవ శాఖలు = (వడగలై-తెంగలై) 2
ప్రధాన శిష్యవర్గ సంఖ్య = 148
ఈ క్రింది వారికి :

1. నాథమునులు = 8
2. పుండరీకాక్షులు = 5
3. శ్రీరామమిశ్రులు = 5
4. యామునులు = 21
5. పెరియనంబి = 5
6. రామానుజులకు ముఖ్యులు = 35
7. తిరుమంగైయాళ్వారు = 5
8. పంచనంబులు = 5

12. పిళ్ళలోకాచార్యులు = 9
13. ఇతరములు = 12

గమనిక : 1972 ఆ.సూ.ము. ప్రతిలో అచ్చు యంత్రానుసారమైన గద్యము, వచనముల పంక్తులు:
గ్రంథము సైజు $5\frac{1}{2}'' \times 8\frac{1}{8}''$,
1 పేజీకి పంక్తులు=30 Maximum,

1 పంక్తిలో దాదాపు 30 అక్షరములు అచ్చువేయబడినవి. 1922 సం॥ ప్రతిని మా నాయనగారగు కీ. శే. తిరునగరి కృష్ణయ్యగారు చదువుకొనుచు దానిపై నోట్సు వ్రాసికొన్నారు.

కవి సంప్రదించిన గ్రంథములు :

ఇందు పేర్కొనబడిన ప్రమాణ (ఆధార) గ్రంథముల పేర్లు :
(BIBILOGRAPHY)

ఈ కవి సేకరించిన సమాచారమునకు, శ్లోకాది అంశములకు తోడ్పడిన గ్రంథములు : ఎచటినుండి క్రోడీకరించినాడు? ఈ క్రిందివాటినుండి:

1. శ్రుతులు 2. స్మృతులు 3. ఉపనిషత్తులు 4. ఇతిహాసములు 5. న్యాయములు 6. శాస్త్రములు 7. భగవద్గీత 8. సూక్తులు 9. యోగశాస్త్రము 10. స్తోత్రములు 11. ఆగమములు 12. గ్రంథాంతర్భాగములు 13. జ్యోతిశ్శాస్త్రము 14. ఆళ్వారుల ప్రబంధములు 15. భారతము 16. భాగవతము 17. రామాయణము 18. మంత్ర-యంత్ర-తంత్రములు 19. వ్రతములు 20. ఇతరములు.

గ్రంథముల పేర్లు ప్రత్యేకమైనవి :
(పుటల ప్రకారము వరుస సంఖ్య వేయబడినది)

| | |
|---|---|
| 1. పారాశర్యోత్తరఖండము | 2. గీత |
| 3. కైశిక పురాణము | 4. వ్యాసముని స్తోత్రము |
| 5. ఆనుశాసనిక పర్వము | 6. అశ్వమేధ పర్వము |
| 7. ఉద్యోగ, భీష్మ పర్వము | 8. ముద్గల స్మృతి |
| 9. బ్రహ్మాండహారీత్యాదిస్మృతులు | 10. శ్రుతిః |
| మనుస్మృతి | 12. హారీత స్మృతి |

13. ధర్మశాస్త్రము
14. పద్మపురాణము
15. తత్త్వసంగ్రహ రామాయణము
16. తైత్తిరీయోపనిషత్తు
17. ఆగ్నేయ పురాణము
18. గారుడ పురాణము
19. నృసింహ పురాణము
20. వామన పురాణము
21. ఉత్తర కూర్మపురాణము
22. సాత్త్విక పురాణము
23. శతపథబ్రాహ్మణము
24. సామవేదము
25. మైత్రావరుణశాఖోక్తి
26. అథర్వణ వేదము
27. బృహదారణ్యకము
28. ఋగ్వేదప్రథితపుష్కలసంహిత
29. కాత్యాయోపనిషత్
30 పాంచరాత్రాగమము
31. బ్రహ్మాండ పురాణము
32. మార్కండేయపురాణము
33. కూర్మపురాణము
34. బృహన్నారదీయము
35. శాండిల్య స్మృతి
36. స్కాందపురాణము
37. సనత్కుమారసంహిత
38. విష్ణురహస్యము
39. విష్వక్సేన సంహిత
40. మోక్షధర్మము
41. భవిష్యత్పురాణము
42. వరాహపురాణము
43. లింగపురాణము
44. హరివంశము
45. కఠవల్లి
46. భారద్వాజ సంహిత
47. అత్రిస్మృతి
48. బ్రహ్మరాత్రము
49. మత్స్యపురాణము
50. పురాణాంతరోక్తములు (గ్రంథము?)
51. బ్రహ్మకైవర్తక పురాణము
52. వృద్ధపాద్మము
53. భాగవత మహాత్మ్యము
54. భాగవతము
55. వాసుదేవ సంహిత
56. అభియుక్త శ్రీసూక్తి (గంథము?)
57. శతపథ బ్రాహ్మణము
58 కాణ్వవచనము (గ్రంథము?)
59. స్మృత్యంతరవచనము (గంథము?)
60. బోధాయనోక్తము
61. బృహత్ప్రచేతోవచనము
62. కమలసంహిత
63. రుక్మాంగదచరిత్ర
64. పరాశరవచనములు
65. ఆనందసంహిత
66. ఆదిత్యపురాణము
67. వైఖానసాగమము
68. భాస్కరీయజ్యోతిశ్శాస్త్రము
69. శ్రీమన్నారాయణ సంహిత
70 బ్రహ్మాండపురాణంతర్గతబదరికాశ్రమ మాహాత్మ్యము.

**కవి ఈ గ్రంథములో పేర్కొన్న ఇతర శాస్త్ర గ్రంథములు :**

**తామసశాస్త్ర గ్రంథములు : పుటలు : 470.**

| | |
|---|---|
| 1. విజయము | 2. గాణము |
| 3. సుప్రభేదము | 4. వాధుళము |
| 5. మకుటము | 6. చిత్త్యము |
| 7. వీరనాగామము | 8. చంద్రజ్ఞానము |
| 9. శర్మయుక్తము | 10. సంధానము |
| 11. పారమేశ్వరము | 12. ప్రోద్గీతము |
| 13. మంజువంతము | 14. సూక్ష్మము |
| 15. విమలము | 16. చిత్రిప్రయము |
| 17. నిశ్శ్వాసము | 18. లలితము |
| 19. బింబము | 20. భవనము |
| 21. జగత్త్రిరము | 22. ఛాయము |
| 23. యోగము | 24. జ్ఞానపుంజము |
| 25 నవలము | 26. అసితము |
| 27. గిణము | 28. కామికము |

**ఇతరములు :**

1. పురశ్చర్యాచంద్రిక
2. సిద్ధనాగార్జున తంత్రములు
3. అగమములు

**తమిళ పదములు : దివ్యప్రబంధముల నుండి :**

| | |
|---|---|
| 1. తిరువాయిమొళి = 12 | 2. తిరుప్పావై = 1 |
| 3 నాచ్చియార్‌తిరుమొళి = 1 | 4. పెరియాళ్వారుతిరుమొళి = 1 |
| 5. పెరియతిరుమొళి = 1 | 6. మొదల్, ఇరండామ్, |
| | మూన్రామ్ తిరువందాదులు = |

## ఆళ్వారులు : శబ్దార్థవివరణములు :

ఆళ్వారు: ఇది తమిళపదమేయైనను తెలుగు పదమే యన్నంత భ్రమ గొల్పునట్లుగా భక్తలోకములోనికి చొచ్చుకొనిపోయినది. ఆళ్వారు = ఆళువారు, ఆళ్వా రూపాంతములు. తమిళ భాష లిపిలో అజ్వార్ అని వ్రాతురు. ఆళ్వార్ అని గూడ వ్యవహరింతురు. కన్నడములో అళ్వర్ యందురు. ప్రసిద్ధాంధ్ర నిఘంటువులలోని యర్థములను క్రోడీకరింపగా నిట్లు తేలినది:

1. మహాజ్ఞాని 2. ఒక శ్రీవైష్ణవుడు 3. గరుత్మంతుడు
4. హరిభక్తుడు 5. ద్రావిడ ప్రబంధకర్తయగు శ్రీవైష్ణవుడు.

**తెలుగు వ్యుత్పత్తి పదకోశము సంపుటము I :**[1]

ఆళ్వారు రూ. ఆడువారలు, ఆడువారు, ఆడువాళ్ళు, ఆళువారు వి.

1. విష్ణుభక్తుడు 2. ద్రావిడ ప్రబంధకర్త

2. వైష్ణవ పవిత్రవాచకం ఉదా॥ గరుడాళ్వారు=పవిత్రుడైన గరుడుడు, కోవెలాళ్వారు=పవిత్రమైన కోవెల, గర్భగుడి.

కన్నడము అడ్వార్, ఆళ్వార్, భక్తులు=పన్నిద్దఱు వైష్ణవ వేదాంతుల బిరుదపదం.

తమిళము అఙ్వార్, ధ్యానమగ్నుడు, ద్రావిడ ప్రబంధ కర్త, ఆళ్వార్= జగత్ప్రభువు, భగవంతుడు.

మళయాళము ఆళ్వార్, ఆఴువార్=పన్నిద్దఱు వైష్ణవ వేదాంతుల బిరుద పదం. ప్రభువు, భక్తుడు.

**సి. పి. బ్రౌన్ తెలుగు-ఇంగ్లీషు నిఘంటువు :**

ఆళ్వారు = A Vaishnava name for a Saint. A hawk (గద్ద) is same times called.

తెలుగు పర్యాయ పదనిఘంటువు : గరుడాళ్వారు 2 అళ్వా (శవా)రు, ఏకాంతి, తిరుముడి, వైష్ణవుడు, పట్టిదాసరి.[1]

---

1. ప్రచురణ ఆంధ్రా యూనివర్సిటీ వారిచే సం. డా॥ ఎల్. చక్రధరరావు.

శ్రీ కందాడై శేషాచార్యుల సంప్రదాయ నిఘంటువులో నిట్లు గలదు :[1]

ఆళ్వారు = భగవద్భక్తి పరవశుడు, భగవద్గుణములో ఈదుపడినవాడు.

ఇతరములు : శబ్దోత్పత్తి : ఆళ్వారు అను శబ్దమునకు "మగ్నమగుట" యను అర్థము గలదు.

1. తమిళభాషలో "అళ్ - దళ్" అను శబ్దమునకు శాసించుటఅని యర్థము. కావున ఈ అళ్ దళ్ శబ్దము నుండియే "ఆళ్వార్" అను శబ్దము సముత్పన్నమైనదనియు, భగవత్పరతంత్రులును, భగవద్గుణానుభవ శోభితులు నగు ఆ భక్తాగ్రేసరులు భగవంతునిపై భక్తిపూర్వకమైన యాధిపత్యము చేయగల వారగుటచే "ఆళ్వారులు" అని వ్యవహరింపబడుచుండిరని తమిళ భాషాభిజ్ఞులైన వైష్ణవ హృదయుల నిశ్చితాభిప్రాయము.[2]

ఆళ్వారు శబ్దము తొలిసారిగా :[3]

1. "తిరుక్కురుగైప్పిరాన్ పిళ్ళాన్" అను రామానుజుల శిష్యులు నాలాయిర ప్రబంధముపై రచించిన టీకలో ఆ భక్తాగ్రేసరు నుద్దేశించి "ఆళ్వారులు" అని ప్రయోగించెను. నాటినుండి ఇది అన్వర్థనామమైనది.

2. నాలాయిర దివ్య ప్రబంధములో నొకతావున 'ఆళ్వారు' శబ్దమున్నది. కాని, వైష్ణవభక్తుల నుద్దేశించికాదు.

"నారాయణన్ ఎన్నైయాళి నరకత్తుచ్
చేరామల్ కాక్కుమ్ తిరుమాల్తన్ - పేరాన
పేశప్పెఱాత పిణచ్చమయిర్ పేశక్కేట్టు
ఆశైపట్ట 'ఆళ్వార్' వలర్" (నాన్ముగం తిరువందాది)

3. 'కణ్ణినున్ శిరుత్తాంబు' లోని తనియ పాశురములో 'ఆళ్వార్' అను పదము గలదు. మధుర కవులకు సంబంధించిన పదమది. ఇచ్చట 'ఆళ్వార్' అనగా పాలించువాడని యర్థము.

"వేదొన్ఱుమ్ నానఱియేన్ వేతమ్ తమిళ్ శెయిద, మాఱన్ శడకోపన్ వణ్కురుకూర్ ఏఱ్ ఎజ్ఞళ్ వాళ్వా మెన్ఱేత్తుమ్ మతురైకవియార్ ఎమ్మై ఆళ్వార వరే యరణ్."

1, 2, 3. ఆళ్వారులు, దివ్య ప్రబంధములు : శ్రీ ధనకుధరం వరదాచార్యులు. పుటలు. 63, 64.

**'ఆళ్వార్' అను శబ్దమునకు వ్యవహారములోనున్న పర్యాయపదములు :**

పరమయోగులు, మహాయోగులు, దివ్యసూరులు, సూరులు, ఆర్యులు మున్నగునవి సందర్భమునుబట్టి.

'ఆర్య' శబ్దమును ఆ.సూ.ము కర్త ప్రయోగించినాడు.

"'పదుగురార్యుల దలపు మీ భక్తి ననుచు
వాది భీకర గరుడనె మోదమలర" పుట. 1, 2 వ పద్యము.

**శాసనములలో పేర్లు గలవా? చరిత్రాంశములు గలవా?**

కలవని చెప్పవచ్చును.

"శిలా శాసనములు, తామ్రశాసనముల వల్ల కొన్ని చరిత్రాంశములు తెలియును" (ఆళ్వారులు - దివ్యప్రబంధములు. పుట. 66. శ్రీ ధనకుధరం వరదాచార్యులు.)

"కొన్ని శాసనాలు తెలుపుతున్నట్లుగా 'పరిపాలకులకు' గూడ ఈ శబ్దం వర్తిస్తుంది. అయితే, అది రాజవంశీయులకూ, అభిజాత్య సంపన్నులకూ పరిమితం." (నమ్మాళ్వారు. కేం.సా.ఏ. పుట. 9)

**ఆళ్వారు శబ్దమునకు నిర్వచనములు :**

1. భగవద్గుణానుభవము నిరర్గళముగా స్వర్గంగవలె వీరి వాక్కుల నుండి ద్రావిడ భాషా రూపమున వెలువడినందున వీరికి 'ఆళ్వారులు' అను పేరు కల్గినది. 'ఆళ్వారు' అనిన కాపాడువారు అని వ్యుత్పత్తి. తమ కవితలతో వీరు మనలను కాపాడుటకే యవతరించినారు కాననే వీరికి నామము సర్వదా సార్థకము [1]

2. తమిళ భాషలో భక్తులను 'ఆళ్వార్' యందురు.

'ఆళ్' అనగా శాసించుట; 'వార్' అనగా కర్త- చేయువాడని యర్థము. ఆళ్వార్ లేక శాసన కర్త యను పేరుతో వీరిని సంబోధించుట సముచితము. జగత్తంతా వారి ఆధీనములో నుండును. వీరు ఏదో కొద్దికాలము కొంతప్రదేశముపై

---

1. ద్వాదశసూరి చరిత్ర - శ్రీ K.T L. నరసింహాచార్యులు: పుట 11.

అధికారము చేయక సర్వకాలము లందు సమస్త జగత్తుపైనను ఆధిపత్యము జేయుచుందురు [2]

గమనిక : 'ఆళ్వార్' పదము రాజులకు గూడ వర్తించును. కాని, అది పరిమిత పరిధి గలది. భగవద్భక్తుల యెడ విశాల పరిధి గలది.

3. 'ఆళ్వారు' అనే మాటకు "మునిగినవాడని" యర్థము. అనగా భక్తిలో మునిగినవాడని యర్థము[3].

4. ఆళ్వారు' పదమునకు భక్తితన్మయతతో నుండువాడని యర్థము.[4]

5. "ఆళ్వార్ అరిందవర్' ఆళ్వారంటే లోతు తెలిసినవాడని అర్థం. అనగా పరమాత్మునిపట్ల భక్తి ప్రపత్తులద్వారా పుణ్యఫలాన్ని పొందినపుడు కలిగే ఆనందమనే సాగరం లోతు తెలిసినవాడని అర్థం.[5]

**ఆంగ్లభాషలో గల వివరణము : "ALVAR"**

1. Any group of South Indian mystics who in the 7 th to 10 th Century wandered from temple to temple singing ecstatic hymns in adoration of the God, Vishnu— The new Encyclopaedia Britamica. vol. I.

2. In the Tamil language the supreme devotees of Lord Vishnu are called 'Alvars'. Alvar literary means "one who sinks or dives deep."— by Swami Ramakrishnanda— Life of Ramanuja. Page. 10.)

---

2. శ్రీ రామానుజచరిత్ర-అనువాదం: G. మంగమ్మ పుట. 5.
3. నమ్మాళ్వారు- కేం.సా.ఎ., పుటలు. 9.
4. సర్వసిద్ధాంత సౌరభము - VII భాగము శ్రీ అనుభవానందస్వాములు, 123 వ పుట.
5. "ఆళ్వార్ల మధుర కవితలో తిరుమలేశుని వైభవం" TTD. పుట. 11.

3 "An Alvar is a golden river of love.

An Alvar is a living Gita.

An Alvar is a breathing Upanishad.

A hymning tarrent ef divine Rapture

A moving temple.

Alvar means one who has taken a deep plunge into the ocean of divine consciousness."

— Alvar Saints. Page. 3.

Bharateeya vidya Bhavan, Bombay.

4. The word "Alvar" has peculiar signifcicance of its own It means one who has sunk into the depth of hif exis- tance or one who ia lost in rapturous devotion to the lord. It is a word quite descriptive of All God intoxicated man

—"Grains of Gold."

R. S. Desikan. Page. 6.

**ఆళ్వారుల సంఖ్య :** ఆళ్వారులెంతమంది? అని ప్రశ్న వేసికొన్నప్పుడు తొందరగా వచ్చు సమాధానము పన్నిద్దఱు. తెలుగు సాహిత్య ప్రపంచములో విరివిగా కన్పించునట్టిదీపదము ఇట్లే పదుగురాళ్వారులనియు గలదు. ఎవరిని వదలకుండగా పేర్లను వ్రాసినచో సంఖ్య పదమూడగును. ఒకరిని వదలిన పన్నెండగును, ముగ్గురిని వదలిన పది యగును

12, 12 + 1; 12 + 1 = 13; 13 — 1 = 12, 13 — 3 = 10.

మన పూర్వాచార్యులందఱును ఆళ్వారులను పదిమందిగనే పేర్కొన్నారు.

I **ఉపదేశరత్నమాల :** కర్త మణవాళమహాముని.

"పొయగై యార్, పూదత్తార్, పేయార్, వుకళ్ మళిశై,
అయ్యనరుళ్ మారన్, శేరలర్కోన్, తూయ్యపట్టనాథన్,
అన్బర్ తాళ్ తూళి, నఱ్పాణన్, నల్ కలియన్,
ఈ తినర్ తో త్తద్దె వామిఙ్గు."

ఇందులో ఆండాళ్, మదురకవి, రామానుజుల పేర్లు లేవు.

దీనికి సంస్కృతాను వాదము గలదు : కర్త; అభిరామవరులు.

"కాసార-భూత-మహదాహ్వయ, భక్తిసార,
శ్రీమచ్ఛఠారి-కులశేఖర-భట్టనాథాః
భక్తాంఘ్రిరేణు-మునియాన-కవిద్రుహోపి
భూమౌ వితేను రముతః క్రమతోఽవతారం."

II శ్రీ పరాశరభట్టరువారి శ్లోకము :

"భూతం సరస్య మహదాహ్వయ భట్టనాథ
శ్రీ భక్తిసార, కులశేఖర, యోగివాహన్
భక్తాంఘ్రిరేణు, పరకాల, యతీంద్రమిశ్రాన్
శ్రీమత్పరాంకుశమునిం ప్రణతోస్మినిత్యమ్."

ఇది ఆళ్వారుల స్తుతి.

చర్చ : 1) ఇందు పదిమంది కీర్తింపబడుచున్నారని యొకపక్షము.

పేర్లు :-

1. పూదత్తాళ్వారు, 2. పొయిగై ఆళ్వారు, 3. పేయళ్వారు, 4. పెరియాళ్వారు, 5. తిరుమళిశై యాళ్వారు, 6. కులశేఖరాళ్వారు, 7. తిరుప్పాణాళ్వారు, 8. తొండరడిప్పొడి యాళ్వారు, 9. తిరుమంగై యాళ్వారు, 10. నమ్మాళ్వారు. (యతీంద్ర మిశ్రులనగా శ్రీమద్రామానుజులు వీరిని ఆళ్వారుల ప్రస్తావనలో జేర్చుట గౌరవస్థానమై యున్నది. వీరికి గోష్ఠియందన్వయము లేదు.)

2) పన్నిద్దరాళ్వారులని యొక పక్షము. ఎట్లన:

"శ్రీ భక్తిసార"లోని శ్రీ శబ్దముచే ఆండాళ్ అను అర్థము వచ్చును.

"శ్రీ మత్పరాంకుశ"లోని శ్రీమత్ శబ్దముచే మధుర కవులను పేర్కొనవచ్చును.

మరికొందఱు "యతీంద్రమిశ్రాన్" అనుచోట మిశ్ర శబ్దముచే శ్రీరామమిశ్రులనుకూడ చెప్పి పండ్రెండు సంఖ్యను సాధింతురు.

**మొదటి పక్షమున కాధారము:** దివ్య ప్రబంధమునకు ప్రథమాశ్రయమగునందు 'అరైయర్లు' శ్రీ రంగనాథునకు 'కట్టియం' చెప్పునపుడు "పద్మినర్ పాడుం పెరుమాళ్"- పదిమంది యాళ్వారులు పాడిన దేవుడని వీరి సిద్ధాంతము.

ఆండాళ్, "మధురకవి"- ఈ యిరువురను చేర్చుదురు గాన సంఖ్య, పన్నెండగును. ఇంతేగాక, నమ్మాళ్వారుల మీద శ్రీ మధుర కవులకు గల ప్రావణ్యము, ఆండాళ్ కు తన తండ్రియు, అచార్యుడునైన పెరియాళ్వారులయందుగల భక్తి ఈ పన్నెండు సంఖ్య కాధారమందురు.

III **ప్రపన్నామృతములో పేర్కొనబడిన సంఖ్య : కవి - అనంతార్యులు. 10 + 2 గా నుడివినాడు.** (పుటలు. 36, 37)

1) కాసార-భూత-మహదాహ్వయ-భక్తిసారా
శ్రీమచ్ఛఠారి-కులశేఖర-విష్ణుచిత్తాః
భక్తాంఘ్రిరేణు-మునివాహ-చతుష్కవీంద్రాః
తేదివ్యసూరయ ఇతి ప్రథితాహిచోర్వ్యామ్॥
— (ఈ పదిమంది దివ్య సూరులు)

2) గోదా యతీశ మిశ్రాభ్యామ్, ద్వాదశైతాన్విదుర్బుః
విసృజ్యగోదాం మధుర కవినా-సహాసత్తమ॥

3) కేచిత ద్వాదశ సంఖ్యాతాన్ వదన్తి విమలోత్తమ
ఆరాధ్య భూతాశ్చై తేషాం-గోదాదేవీ హరిప్రియా॥
—(గోదాదేవి + రామానుజులతో సంఖ్య 12 లేదా గోదాదేవిని విడిచి మధురకవులను చేర్చినచో సంఖ్య 12 అగును.)

IV **సి. పి. బ్రౌన్ తెలుగు-ఇంగ్లీషు నిఘంటువులో పన్నిద్దరని గలదు.**

"Alvars or saints were twelve in number, and are considered to have been incarnations of the attenders, arms, insigns of VISNU."

V **భారతీయ దర్శనము : తెలుగు అకాడమి (పుట 161)**

"దక్షిణ భారతదేశములో జన్మించి పూర్తిగా విష్ణుభక్తిలో లీనమైన మహాపురుషులు పన్నెండు మంది ఉన్నారు-వీరే ఆళ్వారులు."

VI **"నమ్మాళ్వారు" కేంద్ర సాహిత్య ఎకాడమి.** పుటలు 9

"ఆళ్వారులు పన్నిద్దరు. వాళ్ళలో 11 మంది భగవంతుణ్ణి స్తుతించగా, మధురకవి తన ఆధ్యాత్మిక గురువైన నమ్మాళ్వారుని ప్రస్తుతించాడు."

శ్రీకృష్ణదేవరాయలు :

''అలపన్నిద్దఱు సూరులందును సముద్యల్లీలగావున్న బె
గ్గలపుం దాపము బాప నానిజమనః కంజాత సంజాత పు
ష్కల మాధ్వీక ఝరిన్ మురారి సొగియంగా జొక్కి-ధన్యాత్ములౌ
నిల పన్నిద్దఱు సూరులందలతు మోక్షేచ్ఛామతిం దివ్యులన్."

సంఖ్య=12 (ఆముక్తమాల్యద 1-10)

సాయపనేని వెంకటాద్రి :

"అతిగాఢంబిల నాస్తికాంతరమతం బాకార మొక్కంట-త
ద్గతి వారింపగ రాదటంచు మదిలో తర్కించి, తానే తదా
కృతులం దాల్చెను ద్వాదశాత్మకుడనన్ శ్రీమత్ప్రభంమించుది
వ్య తనూధారుల సూరులం దొలిచెదం బన్నిద్దరాళ్వారులన్."

సంఖ్య=12 (సకలజీవ సంజీవనము 1-8)

ఇట్లే ''పన్నిద్దఱు'' సంఖ్యను సూచించు కావ్యము లెన్నియో గలవు.

**పదుగురు సంఖ్యను సూచించిన కావ్యము : ఆచార్య సూక్తిముక్తావళి.**

ఈ కవి పలుతావులయందు ఆళ్వారులు పదుగురనియే నుడివినాడు. తొమ్మిది సందర్భములు ముఖ్యమైనవి. గ్రంథాదిని పేర్కొన్న ముఖ్యమైన పద్యము=(పుట 1)

1) ''పదుగురార్యులదలపు మీ భక్తిననుచు-వాది భీకరగురుడనె మోద మలర"

2) "పదుగురు సూరులు పాడిరీయద్రిని కులశేఖరుండెందు గోరె జన్మ''-(230 పుట)

3) ''పుణ్యకోటి విమానమును జూచి చేమోడ్చి-పదుగురు సూరుల భక్తి గొలిచి''- (241 పుట.)

4) "ప్రక్రమంబొనరించి, పదుగురు సూరుల-కన్నుల పండుగగా భజించి''- (241 పుట.)

5) ''పదుగురాళ్వారు లిమ్మహాత్మునకంతేవాసులు''- (540 పుట.)

ఇట్లే 242, 249, 177, 131 పుటలలో పదుగురు సంఖ్య గలదు.

**ఆళ్వారుల పేర్లను వరుసక్రమములో వ్రాయుటను గూర్చి :**

ఎవరితర్వాత ఎవరు? కాలక్రమానుసారముగాను, ఇతర విధములుగాను లభించిన సమాచారమునుబట్టి విషయములను క్రోడీకరించుటయు ఆసక్తి దాయకమే.

**శ్రీ పరాశరభట్టరు వారి శ్లోకమునుబట్టి : "భూతం సరస్య......."**

1. పూదత్త; 2. పొయగై; 3. పేయాళ్వారులు; 4. పెరియాళ్వారు: 5. తిరుమళిశై; 6. కులశేఖర; 7. తిరుపాణాళ్వారులు. 8. తొండరడిప్పొడి; 9. తిరుమంగై; 10. నమ్మాళ్వారులు.

ఇది కాలనుగుణ్యముగ లేదు.

**ఉపదేశ రత్నమాల :- మణవాళమహాములు : "పొయగై యార్........"**

1. పొయగై; 2 పూదత్త; 3 పేయాళ్వారులు. 4. తిరుమళిశై; 5. నమ్మాళ్వారులు. 6. కులశేఖర; 7. పెరియాళ్వారులు 8. తొండరడిప్పొడి; 9. తిరుప్పాణ్ 10. తిరుమంగై యాళ్వారులు.

ఇదియును కాలానుసారము లేదు.

**ప్రపన్నామృతములో నున్నవరున : కవి- అనంతార్యులు.**

1 పొయగై, 2. పూదత్త, 3. పేయాళ్వారులు. 4. తిరుమళిశై, 5. కులశేఖర, 6. పెరియాళ్వారులు 7. అండాళ, 8. తొండరడిప్పొడి, 9. తిరుప్పాణాళ్వారులు 10. తిరుమంగై, 11. నమ్మాళ్వారులు. 12. మధురకవియాళ్వారు.

**కేంద్రసాహిత్య ఎకాడమీ 'నమ్మాళ్వారు' గ్రంథము. (పుట. 10.)**

"జన్మక్రమం పురస్కరించుకొని నమ్మాళ్వారు 5 వ ఆళ్వారని వైష్ణవ సంప్రదాయజ్ఞులు భావిస్తున్నారు."

**తెలుగు విజ్ఞాన సర్వస్వము (III వ సంపుటము. పుట. 562. శ్రీ మల్లంపల్లి సోమశేఖరశర్మ)**

"వైష్ణవ గురుపరంపరలో చెప్పిన ఈ యాళ్వారుల వరుసక్రమము ప్రకారము కడపటి యాళ్వారు తిరుమంగై యాళ్వారు'' పల్లవ వంశీయుడైన మొదటి నరసింహవర్మకు (625-645A.D.) సమకాలికుడు.

**పరమయోగివిలాసపీఠిక: టి. టి. డి. వారి ప్రచురణ. 1938 సం॥**
(పట్టికలు) Tables 3, 4, 5, 6, 7, 8, 9, 10, 11, 12 ప్రకారము

| | | |
|---|---|---|
| 1. | పొయిగై ఆళ్వారు | The first thre Alwars మొదటి ముగ్గురు ఆళ్వారులు. |
| 2. | పూదత్తాళ్వారు | |
| 3. | పేయాళ్వారు | |
| 4. | తిరుమళిశయాళ్వారు | 4th in Order నాల్గవ యోగి |
| 5. | నమ్మాళ్వారు | 5th " " ఐదవ " |
| 6. | మధురకవి యాళ్వారు | 6th " " ఆఱవ " |
| 7. | కులశేఖరయోగి | 7th " " ఏడవ " |
| 8. | తిరుప్పాణాళ్వారు | 8th " " ఎనిమిదవ " |
| 9. | తొండరడిప్పొడియాళ్వారు | 9th " " తొమ్మిదవ " |
| 10. | పెరియాళ్వారు | 10th " " పదవ " |
| 11. | ఆండాళ్ | 11th " " పదకొండవ " |
| 12. | తిరుమంగైయాళ్వారు | 12th " " పన్నెండవ " |

(ఇదియు కాలానుసారము లేదు.)

**ద్వివద పరమయోగివిలాసకవి తాళ్ళపాక తిరువేంగళనాథసూరి (చిన్నన్న) వరుసయే పైపట్టికగా ప్రచురించారు.**

**ఆచార్యసూక్తిముక్తావళిలోనున్నవరుస:** జీవితచరిత్రలీ క్రిందివరుసలో గలవు:

1. పొయిగై, 2) పూదత్త 3) పేయాళ్వారుల వైభవము
2. తిరుమళిశై యాళ్వారుల వైభవము
3. కులశేఖరాళ్వారుల వైభవము
4. పేయాళ్వారుల వైభవము
5 ఆండాళ్ వైభవము
6. తొండరడిప్పొడియాళ్వారుల వైభవము
7. తిరుప్పాణాళ్వారుల వైభవము
8. తిరుమంగైయాళ్వారుల వైభవము
9. నమ్మాళ్వారుల వైభవము (ఇందులోనే మధురకవులు)

**గమనిక :** ఆ సూ. ము. వరుస ప్రకారము "నమ్మాళ్వారులు'' చివరివారు. ఈ నమ్మాళ్వారుల వైభవము వెంటనే కవి నాథమునుల వైభవమును వ్రాయుట మొదలిడినాడు. నమ్మాళ్వారు శిష్యులు మధుర కవులు. మధురకవి ప్రియశిష్యుడగు పరాంకుశదాసుడను పేరు గలవారిద్వారా (ఆ.సూ.ము. పుట. 81) నాథమునులు దివ్యప్రబంధ వృత్తాంతమును తెలిసికొనెను. చివరకు శఠకోపుల కృపకు పాత్రుడై "నాలాయిర దివ్యప్రబంధ" సంకలనము చేసెను. (పుట. 82) దీనినిబట్టి నమ్మాళ్వారులకు, నాథమునులకు మధ్య 100 ఏండ్ల వ్యత్యాసముండియుండవచ్చును.

**మొత్తము మీద సమన్వయము చేయగా తేలిన యంశము లేమనగా :**

1. పదుగురాళ్వారుల సంప్రదాయము మొదటినుండియు (భట్టరువారి కాలము) కొనసాగుచు వచ్చుచున్నది.
2. పన్నిద్దరాళ్వారుల సంప్రదాయము, కాలానుగుణ్యముగా, సందర్భోచితముగా సంకలనము చేయబడినది. తెలుగు సాహిత్యములో చెఱగని ముద్ర వేసినది.
3. మధుర కవులకు బదులు రామానుజులను చేర్చుట తర్వాత జరిగినది. అట్లే గోదాదేవికి బదులు మధురకవులను చేర్చుట జరిగినది.
4. భగవద్వైభవమును పదిమంది కీర్తించినారు.
5. ఆండాళ్ భూదేవి యవతారము తండ్రిని ఆచార్యునిగా కీర్తించినది.
6. మధురకవులు నమ్మాళ్వారుల నాశ్రయించిరి.
7. భగవద్రామానుజులు సరేసరి. పై పన్నిద్దఱి నాధారముగా జేసికొని సర్వజ్ఞుడై మతోద్ధారకుడైనాడు.
8. ఈ పదముగ్గురు ప్రాతరనుసంధేయులు.
9. ఆ. సూ. ము. పదుగురి సంఖ్యనే బలపఱచినది. పదుగురన్నను పదముగ్గురు మనకు ప్రత్యక్షమగుదురు.
10. ఆళ్వారుల వరుసలో నమ్మాళ్వారులు చివరివారు.

**జీవితకాలములనుబట్టి, చారిత్రకాధారములనుబట్టి వరుస :**

ఒక వ్యక్తి జీవిత చరిత్ర నన్ని దృక్కోణముల నుండి అధ్యయనము చేయుటకు ఆ వ్యక్తి జీవితకాలము మిగుల తోడ్పడును. ఆళ్వారులందఱును సుమారు క్రీ.శ. 550-850 వరకున్నట్లు చరిత్రకారులు తెలుపుచున్నారు. వీరి జీవితమును మూడు ప్రధాన వర్గములు గావించినచో నిట్లుండును:

| భాగము | పేర్లు | కాలము |
|---|---|---|
| ప్రాచీనము Ancient | 1. పొయిగై ఆళ్వారు | — |
| | 2. పూదత్తాళ్వారు | — |
| | 3. పేయళ్వారు | — |
| | 4, తిరుమళిశై యాళ్వారు | క్రీ.శ. 720 |
| మధ్యభాగము Middly | 5. నమ్మాళ్వారు | 7-9 శతాబ్దుల మధ్య |
| | 6. మధురకవి యాళ్వారు | 7-9 శతాబ్దుల మధ్య |
| | 7. పెరియాళ్వారు | 725 క్రీ.శ. |
| | 8. కులశేఖరాళ్వారు | 767 క్రీ.శ. |
| | 9. ఆండాళు | 776 క్రీ.శ. |
| కడపటి భాగము | 10. తిరుమంగై యాళ్వారు | 776 క్రీ.శ. |
| | 11 తొండరడిప్పొడియాళ్వారు | 787 క్రీ.శ. |
| | 12. తిరుప్పాణాళ్వారు | 841 క్రీ.శ. |

**"ఆళ్వారు" అనునది బిరుదు పదము వంటిది :** "ఆళ్వారనగా భగవత్తత్త్వపు లోతులందు మునిగి భగవత్ప్రేమానందముల ననుభవించినవారని ప్రసిద్ధార్థము. భగవంతునిపై స్వామ్యమును నెరపినవారను వేరొక మనోహరమైన అన్వయము గూడ గలదు. వీరికీ బిరుదును అనంతరకాలమువారిచ్చిరి."

(గోదా గ్రంథమాలవారి నాచ్చియార్ తిరుమొళి 1977 ప్రచురణ-లఘు వ్యాఖ్య - పీఠిక, పుట IX లో గలదు.)

## ఆళ్వారుల జీవితకాలములనుగూర్చి :

ఆళ్వారుల జీవిత కాలమునుగూర్చి భిన్నాభిప్రాయములున్నవి. సంప్రదాయ గ్రంథములలో క్రీస్తుపూర్వము 4 వేల యేండ్లకు పూర్వమే. ద్వాపర యుగాంతమున, కలియుగాదిలో, ఆ పిమ్మట సుమారుగా 3, 2 వేల యేండ్లకు పూర్వమే ముదలాళ్వారులనుండి చివరి ఆళ్వారు వరకు జీవితకాలమును నిర్ణయించినట్లు గలదు. ముఖ్యముగా గురుపరంపరా ప్రభావము, ప్రపన్నామృతము, దివ్యసూరి చరితము లీకాలమును పేర్కొన్నవి. చారిత్రక దృష్టితో ఇది సరికాదు. ఎందుకనగా, ఆళ్వారులు పురాణ పురుషులుగారు. కల్పిత వ్యక్తులుగారు. సంఘము మధ్యన జీవించిన వ్యక్తులు వారికి సమకాలికులైన రాజులున్నారు. ఇతరమతములలోని భక్తులున్నారు.

విశిష్టాద్వైత తత్త్వకావ్యములైన పరమయోగి విలాసము, దివ్యసూరి చరిత్రము, ఆచార్య సూక్తి ముక్తావళులలో ద్వాపర యుగాంత కాలాదులవరుసనే పేర్కొన్నట్లు గలదు. ఇటీవలి రచయితలు, వ్యాసకర్తలు సంప్రదాయవాదులైనను ఆళ్వారుల జీవిత చరిత్రలను వ్రాయునపుడు రెండు రకములైన కాలములను పేర్కొనుచు చరిత్రకే ప్రాధాన్యత నొసంగినారు.

ఆళ్వారులు క్రీస్తునకు చాల పూర్వము జీవించినారనుట సమంజసముగా లేదు. ఆ.సూ.ము.లోని ఈ క్రింది వాక్యములను గమనింపుడు:

పుటలు 2, 3: "పరమకారుణికుండగు భగవంతుడు ఉర్వియందు
రామకృష్ణాద్యవద్యవతారములొనర్చ నా సంసారి చేతనులు........
నిత్యసూరులంజూచి, మీరలేగి ద్రవిడ భూభాగంబున............"
అవతరించుట కాజ్ఞాపించెను.

ఇచట రామకృష్ణాద్యవతారముల ప్రసక్తి గలదు. కృష్ణావతార సమాప్తి, పరీక్షిత్తు రాజ్యాభిషేకము, కలియుగాది ఒకే కాలము క్రి. పూ. 3102 సం॥. కలియుగారంభము నుండి కొంత కాలము వేచి యుండి, అనగా రెండు మూడు యేండ్లవరకు ఆగి, జనుల యహంకారమును గమనించి శ్రీమన్నారాయణుడు, ఒక ప్రణాళిక ప్రకారము ఆళ్వారాచార్యులను జన్మింప జేసినాడనుట సంభావ్యమే.

ఆళ్వారుల జీవితకాలములను గూర్చిన వివిధాభిప్రాయములు:

1) The History & Culture of Indian People : Bharateeya Vidya Bhavan Vol. III page. 327. లో ఇట్లు గలదు:

'Alwars in all probobility flourished in the period marked by the extreme limits of A D 500 and 850. as same of the greatest Saiva Nayanars and Naishnava Alwars were equally contemporaries (కొందఱు శైవ నయనార్లు - ఆళ్వార్లు సమకాలికులు).

2) LIFE OF RAMAUJA :- by Rama Krishna. శ్రీరామకృష్ణ మఠం. "Append:x A" నుండి :- వీరు ఉపదేశరత్న మూలకర్త శ్రీ మణవాళమహాముని సూచించిన ఆళ్వారులవరుస చారిత్రక కాలమునకు దగ్గరగా నున్నదని నుడివినారు. ఆ క్రమమిది :-

1) Acharya Nadhamuni A.D. 825 - 918.

2) So all the Alwars belong to earlier period before 825 A.D.

3) The first three Alwars. between 5-6 century.

4) Thirumala sai Alwar : begining of 7th century.

5) Perialwar : The second half of the 8th century.

6) ANDAL : born in 716 A.D Sang Thiruppavai in 731 A.D. lived for a few years later.

7) Thairumangai Alwar (The latest) 8th Century A.D.

3) ఆర్.జి. భండార్కరుగారు : Vaishnavism and Saivismలో ఆళ్వారులు 6-9 శతాబ్దముల మధ్యవారని గలదు. (ముకుందమాల పీఠిక. శ్రీ చెలమర్ల రంగాచార్యులు. పుట.9)

4) విజ్ఞాన సర్వస్వము : 7వ సంపుటము, దర్శనములు:మతములు పుటలు 288, 299. ఆళ్వార్లు: రచయిత- శ్రీ మేడేపల్లి వరాహ నరసింహస్వామి:

ఆళ్వార్లు : వీరు పన్నిద్దఱుగలరు. వీరు కలియుగాదిని జన్మించిరని వైష్ణవ సంప్రదాయము, కాని, ఆధునిక చరిత్రాన్వేషణ వీరు క్రీస్తు తర్వాత 2-8 శతాబ్దుల మధ్యవెలసిరి అని చెప్పును.

5) వైష్ణవాంధ్ర వాఙ్మయము : డా. వేటూరి ఆనందమూర్తి పుట. 35

"ఆళ్వారుల జననము పైన జెప్పిన క్రమమున సాగి, ద్వాపరాది యుగములందుగాక క్రీ.శ. 4 వ శతాబ్ది మొదలుకొని 9 వ శతాబ్ద్యంతము వరకు వ్యాపించియుండునని నిశ్చయించనైనది.

6) ఆళ్వారుల దివ్యవైభవము : TTD ప్రచురణ. శ్రీ టి. రాఘవయ్య పుట. 4.

"పన్నిద్దరాళ్వారులలో మొదటి ముప్వురు క్రీ.పూ. 3000 సం॥ల నాటి వారని వాడుకగా, నమ్మకముగా వైష్ణవ మఠాధిపతులంటారు. కాని, చరిత్ర ప్రకారము ద్వాదశాళ్వారులు 7,8,9 శతాబ్దములలో నున్నవారని తేలుచున్నది."

7) భారతీయ దర్శనము : తెలుగు అకాడమి, పుటలు. 121

"వీరి జీవితకాలము 7 నుండి 9 వ శతాబ్దము వరకని ఆధునిక చారిత్రకుల అభిప్రాయము."

8) "వివిధాళ్వారుల నిశ్చయకాలము నిర్ధారణజేయుట అసాధ్యము. కాని వీరు క్రీ.శ. 500 సం॥నుండి తర్వాతి మూడు శతాబ్దులవరకు జీవించి యుందురని సామాన్యముగ నంగీకృతము." సర్వసిద్ధాంత సౌరభము VII. 124 పుట.

9) దక్షిణభారత సాహిత్యములు : స్వా. ఎ. డా. చల్లా రాధాకృష్ణశర్మ పుట. 27

"భిన్నాభిప్రాయాలుగలవు. కాని, భూత, పొయిగై పేయాళ్వారులు 8 వ శతాబ్ది పూర్వార్ధములోనివారు."

10) కేంద్ర సాహిత్య ఎకాడమి. "నమ్మాళ్వారు" పుట. 9 లో ఆళ్వారుల కాలము 5 లేక 6-9 శతాబ్దములమధ్య అని గలదు.

**ఆళ్వారులలో సమకాలికులై ఒకరితో నొకరు కలిసినవారు:**

1) మొదటి నల్వురాళ్వారులు : పొయగై, పూదత్త, పేయాళ్వారు, తిరుమలిశై యాళ్వారులు సమకాలికులు. వీరు పరస్పరము కలిసికొని మాట్లాడు

కొనినట్లు దృష్టాంతరములున్నవి. మొదటి ముప్పుళ్వారులు తిరుక్కోవలూరులో కలిసికొని భగవద్దర్శనానందము బడిసిన కథ (పుట. 4) లో గలదు. ఈ ముప్పురే గ్రామైక సంచారులగుచు మహీసారపురము చేరి భక్తిసారులను కలిసికొనిరి. పుట. 10 పేయాళ్వారులవద్ద తిరుమళిశయాళ్వారులు సారతమార్థ విద్యను గ్రహించెను. (పుటలు. 540, 541, 63, 64, 65 పద్యములు)

2) నమ్మాళ్వారుల శిష్యుడు మధుర కవులు, "వకుళభూషణ మునివరుని జూచి చైతన్య సంశయ శాంతికై పొగడుచు'' కరతాళ మొనరింప శఠకోపులతనిని కటాక్షించిరి. పుట 75.

3) పెరియాళ్వారులకు భగవత్కటాక్షము వల్ల లభించిన కుమార్తె పుట-25 "జనకునింటను తొల్లి జానకి పగిదిని-విష్ణుచిత్తుని యింట'' నుండిన ముద్దుల పట్టియే శూడికొడుత్తనాచ్చియారు. ఈమెకు తండ్రియే ఆచార్యుడు.

4) కులశేఖరాళ్వారులు, తిరుప్పాణాళ్వారులు. తిరుమంగైయాళ్వారులు. జీవితకాలమునుబట్టి సమకాలికులు. కాని, కలిసికొనలేదు. విడివిడిగా జీవించిరి. ఇట్లే తొండరడిప్పొడి యాళ్వారును సమకాలికుడు.

5) తిరుమంగైయాళ్వారులు,తొండరడిప్పొడియాళ్వారులు సమకాలికులు. పరకాలుడు శ్రీరంగనాథునకు సప్తప్రాకార ప్రభృతి కైంకర్యమును జేయుచుండ తొండరడిప్పొడియాళ్వారులు జూచి సంతోషించి, తను చేయు పుష్పమాలా కైంకర్యమునకుపకరణంబగు నాయుధవిశేషమునకు 'కరుళ్మారి' యని పరకాలుని తిరునామముంచెను. పరస్పరము వీరు మాట్లాడుకొన్నట్లు మాత్రము లేదు. పుట. 69

**ఆళ్వారుల కాలములోనే జీవించియున్న ఇతర ప్రసిద్ధ పురుషుల సమాచారము. వాదోపవాదములు: పరమత ఖండనము. స్వపక్ష స్థాపనము :**

వాదోపవాదములు జరిగినవి. పరమత ఖండనమున్నది. స్వపక్ష స్థాపనమున్నది.

1. శ్రీవిల్లిబుత్తూరుసంగల 'వడపెరుంగో యిలుడయాన్" అను భగవంతుని యాదేశము మేరకు శ్రీవిష్ణుచిత్తులు (పెరియాళ్వారులు) మధురాపురంబునకు జని, వల్లవదేయ విద్వత్సభయందు పరపక్ష విక్షేపణ పూర్వకంబుగా సర్వవేదాంత ప్రతిపాద్యంబగు పరతత్త్వంబు నిర్ణయించి విద్యాశుల్కమును గెలుచుకొనెను. (పుట 23).

ప్రసిద్ధులు. రాజు రాజు పురోహితుడు శెల్వనంబి - విద్వత్సభలోనున్న వారు.

స్థాపనము "ఏకోహవై నారాయణ ఆసీత్" ఇత్యాది ఉపనిషత్ వాక్యములు.

2. తిరుమంగై యాళ్వారు శైవమతస్థుడైన (శైవనైనారు) "కార్తికేయాంశ సంభవుండగు సంబంధిప్పెరుమాళ్ (తిరుజ్ఞాన సంబంధరు)తో కవితా వాదము జేసి గెలిచెను. తన కృతిలోని "ఒరుకురుళాయిరు నిలమ్'' అను తిరుమొళిని ఆనతిచ్చెను. పల్లవ వంశీయుడైన మొదటి నరసింహవర్మ కాలము. (625 - 645 A. D.)

3. నమ్మాళ్వారులు ఆ కాలములోనే యున్న ద్రవిడకవి యగు కంబనాథుని (కంబకవి కాలము 850 - 1200 AD) జయించెను. ఆ. సూ.ము. ప్రకారము అర్చారూపములోనున్న నమ్మాళ్వారులు. వీరి తిరువాయిమొళి పాశురములోని "కణ్ణన్‌కలవిన" యనుసూక్తిని కంబ కవి శంఖ ఫలకంబునందుంచిన వారు మధుర కవియాళ్వారులు. అంతనా శ్రీ సూక్తిగల తాళపత్రము శంఖఫలముపై నుండి ఇతర కవుల క్రిందికి ద్రోసెను. పిమ్మట కంబకవి నమ్మాళ్వారుల నాశ్రయించిరి. (పుట - 77)

**ఆళ్వారులకు శిష్యవర్గము :**

1) ముదలాళ్వారులు ముప్పురు గ్రామైక సంచారులు. శిష్యులు లేరు.

2) తిరుమళిశయాళ్వారులు ఎక్కువగా నివాస స్థానములోనే యుండి సంచారము చేయుచుండును. 'కణికణ్ణర'ను వానిని శిష్యునిగా జేసికొనెను. పెరుంబులియూరి బ్రాహ్మణులకు తత్త్వోపదేశము చేసెను.

3 మధుర కవి యాళ్వారులు వయస్సులో పెద్దవారైనను నమ్మాళ్వారుల నాశ్రయించి శిష్యుడాయెను.

4. పేయాళ్వారులు భక్తిసారులకు సారతమార్థ విద్య నుపదేశించెను.

5. కవి శిఖామణి యగు పరకాల యోగీంద్రులకు (తిరుమంగై యాళ్వారులకు) ఆరుగురు శిష్యులు గలరు. 1. అతని మఱది 2. నీరమేల్నడప్పాన్ 3. తాళూదూవాన్ 4. పిన్నెయెదుంగువాన్ 5. నిరల్ మేదిప్పానో 6. శడైత్తంగువాసన్ ఇంకను అసంఖ్యాకు లితరులు గలరు.

6. కులశేఖరులు క్షత్రియరాజు. శిష్యవర్గము లేదు.

7. విష్ణుచిత్తులకు వారి కుమార్తెయగు ఆండాళ్ ను శిష్యురాలిగా నెంచవచ్చును.

8. తొండరడిప్పొడి యాళ్వారులకు దేవదేవి శిష్యురాలైనది. పుట 45.

**ఆళ్వారులకు గురువులు :** ఆళ్వారులందఱును చారిత్రక పురుషులే. వీరికిని ఆచార్య సమాశ్రయణము తప్పని సరియే.

1. విష్వక్సేనులందరాళ్వారులకు గురువులే :
"పదుగురాళ్వారులు విష్వక్సేనులకంతే వాసులు." పుట 540.

2. మొదటి ముప్వురాళ్వారులకు శ్రీమన్నారాయణుడే గురువు:
"భగవదనుగ్రహప్రాప్త దివ్యజ్ఞాన సంపత్తి గలిగి
స్వస్వరూపజ్ఞాన సంపన్నులైరి." పుటలు 4.

3. తిరుమళిశై యాళ్వారులకు గురువు "శ్రీమన్నారాయణుడే" "భక్తత్రాణ పరాయణుండగు నారాయణుండు స్వకీయంబగు దివ్యాత్మస్వరూపంబును ....తెలియంజేసి...." (పుటలు : 7)

4. విష్ణుచిత్తులవారు జన్మవైష్ణవులు. ప్రహ్లాదుని పోలిక. దాస్యభక్తి, విద్యాభ్యాసము లేదు. శ్రీహరియే గురువు. (పుట. 21)

5. ఆండాళ్ కు తండ్రియగు విష్ణుచిత్తులే గురువని భావన గలదు.

6. "తొండరడిప్పొడి యాళ్వారులకు" శ్రీహరియే గురువు.

"విష్ణుకృపాప్రాప్త వివిధసాంగోపాంగ సశిరస్కవేద విజ్ఞానఘనుడు" వేదములు చదువుకొన్నవాడు—(పుట. 28)

7. "తిరుప్పాణాళ్వారు"లకు భగవంతుడే గురువు. "భగవదనుగ్రహప్రాప్తజ్ఞాన సంపన్నుడు"—(పుటలు. 51)

8. తిరుమంగయాళ్వారులకు మొదట చదువు లేదు. విద్యాభ్యాసాదులు లేవు. కుముదవల్లిని పరిణయమాడు సందర్భమున నీ యాళ్వారు తిరువయూరికి జని పరమకారుణికుండగు నంబిని గని సాష్టాంగ దండ ప్రణామం బాచరించి, పంచసంస్కారపరుండై, అర్థపంచకంబెరింగి, ఆకారత్రయ సంపన్నుడయ్యెను. (పుట. 56)

9. మధురకవియాళ్వారులు వయస్సుననుసరించి నమ్మాళ్వారుల కన్న పెద్దవాడు. తండ్రి ఇంటివద్ద వేదవేదాంగముల నుపదేశించెను పిమ్మట నమ్మాళ్వారుల నాశ్రయించి యుజ్జీవించెను. (పుటలు. 74, 75)

10. నమ్మాళ్వారులకు శ్రీమన్నారాయణుడు ప్రత్యక్షమయి సకల జ్ఞాన నివర్తకంబగు దివ్యజ్ఞాన మొసంగెను.—(పుటలు. 76)

శ్రీమన్నారాయణుని గూర్చిన తనియ విన్నపము :

"శ్రీమద్వేదాంత సిద్ధాంత స్థాపనా నిత్యదీక్షితమ్।
శ్రీమన్నారాయణం వందే శాంతం సూరి గురూత్తమైః॥"

## ఆళ్వారుల-ఆచార్యుల గొప్పతనము - తారతమ్యములు :

శ్రీ వైష్ణవ సంప్రదాయములో ఆళ్వారుల, ఆచార్యులకున్న ప్రాధాన్యత ఇంతింతయని వెల కట్టరానిది. మూల్యాంకనము చేయుటకు గూడ అతీతమైనది. సంగ్రహముగా నిట్లు నివేదించుకొనుచున్నాను:

1) "The Vaishnavas of Sri Sampradaya, when they sing the glory of the previous Gurus, Sri Ramanuja and others, feel themselves as pure as Sin-less divine beings through the influence of the holy ones. However thick night be the fall of gloom in the heart of the Vaishnava, how ever perturbed might it be with sufferings and mis-fortunes in this rough ocean of Ssmasara, all afflictions fly away as he remembers those Holy names." (Life of Sri Ramanuja by Swami Rama Krishnananda Page 7).

పై వాక్యముల ప్రకారము సంసార దుఃఖ సాగరములో మునిగిన దాసచేతనులా పేర్లు స్మరించినంత మాత్రముననే కష్టములు మఱచి పోవుదురని తెలియుచున్నది. ఇట్లు ప్రతి వైష్ణవుని నరనరాల్లో, కణకణములో, రక్త నాళము లలో, సర్వాంగములలో ఆళ్వారాచార్యులపేర్లు అంతర్లీనమై, చైతన్యస్ఫూర్తి దాయకములగుచున్నవనుటలో ఆశ్చర్యము లేదు.

"వేదాంతించ్ఛృణు వక్ష్యామి చరితమ్ దివ్యయోగినామ్,
యేషాం శ్రవణమాత్రేణ మహాపాతక నాశనమ్"

(ప్రపన్నామృతము - ప్రథమాధ్యాయము)

ఇట గీతాపఠన ఫలశ్రుతి శ్లోకము ''మహాపాపాదిపాపాని" స్ఫురించును గదా!

3. ఆళ్వారాచార్యుల కథలు పుణ్యకథలని వైష్ణవుల విశ్వాసము. ఇట పోతన్నగారి పద్యము ''ఏ కథల యందు పుణ్య - శ్లోకుడు హరి - సెప్పబడును సూరిజనముచే - నా కథలు పుణ్యకథలని - ఆకర్ణింపుదురు పెద్దలతిహర్షమునన్" (రుక్మిణీకల్యాణము)

శ్రీహరిని గూర్చి చెప్పు కథలు పుణ్యకథలు. అట్లే ఆ హరిని గూర్చి పాడి పాడి, యాడియాడి మైమరచెడు ముకుందగతాత్ములైన వారి జీవితచరిత్రలు పుణ్యకథలగుటలో సందియము లేదు.

ఇట్లే పోతన్నగారి మరొక పద్యము రుక్మిణీకల్యాణములోనిది:

''కల్యాణాత్మకమైన విష్ణుకథ లాకర్ణించుచున్ ముక్తుడౌ
కల్యుండెవ్వడు తృప్తుడౌ, నవి వినంగా గ్రోత్రలౌ చుండు, సా
కల్యంబేర్పడ భూసురోత్తమ యెఱుంగంబల్కవే రుక్మిణీ
కల్యాణంబు వినంగ నాకు మదిలో కౌతుహలంబయ్యెడిన్.''

విష్ణుకథలు కల్యాణాత్మకములు. ముక్తిప్రదాయకములు. వినుటకు శ్రోత్రలగుచుండును. అట్లే విష్ణుకథలను గానము చేసిన దివ్యాత్మికులగు ఆళ్వారాచార్యుల జీవితచరిత్రలు కావ్యములుగా వినుటకు - చదువుటకు శ్రోత్రలగు చుండును గదా!

అందుకే వాదిభీకరగురుడు తెలుగువారి, అందులో విశిష్టాద్వైతతత్త్వకవులలో నగ్రేసరుడగు నంబూరి వారినోట ఈ కథలను వెలయింపజేసినాడనుటలో అసమంజసమేమియును లేదు.

4. "తెలుగు సాహిత్యములో ఆళ్వారాచార్యులను గూర్చిన సంస్తుతుల వైభవము'' పేర Ph D. సిద్ధాంతవ్యాసము వ్రాయుటకు వీలున్నది. నేను 100 గ్రంథములకు పైగా పరిశీలించినాను దీనివలన తెలుగుసీమలో ఆచార్యులకు గల గౌరవస్థానము, ప్రశక్తి తెలియనగును.

5. ఆళ్వారుల, ఆచార్యుల ప్రశస్తిని తెలుపు పద్యములు తెలుగుసాహిత్యములో వందలకొలదిగ కన్పించును. వాటిని ప్రత్యేక ప్రకరణములలో పేర్కొందును. మచ్చుకొకయుదాహరణము- "ఇద్దఱురాజకవులచేతుల్లో పన్నిద్దరాళ్వారులు స్తుతింపబడిన విధము." ఆ రాజకవు లెవరన: శ్రీకృష్ణదేవరాయలు, సాయపనేని వేంకటాద్రియనువారలు.

1. శ్రీకృష్ణదేవరాయల ఆముక్తమాల్యద (1–10) పద్యము:

''అలపన్నిద్దఱుసూరులందును...........

2. వేంకటాద్రి సకలజీవన సంజీవనము: (1.8) పద్యము.

''అతికాథంబిలనాస్తికాంతరమతం, బొక్కంట.... ...

యనునవి కడు ప్రసిద్ధములు.

(గమనిక: ఈ పద్యములను నాల్గుపాదములుగా గత ప్రకరణములో పేర్కొన్నాను.)

6. ముదలాళ్వారుల భక్తితన్మయత్వము పరాకాష్ఠకు చేరుకొన్నది. అందుకు వారి స్తుతులు 1. వయ్యందగళియా 2. అన్బేదగళియా 3 తిరుక్కండేన్ పొన్మేనికండేన్. ఆదియందుగల పాశురములుదాహరణములు.

5. ఇట్టి పవిత్రులైన ఆళ్వారుల నామములను, ఆచార్యుల నామములను హృద్గతము చేసికొన్నపుడు సంతాపములు తొలగిపోవుననుటకు శ్రీరామకృష్ణ పరమహంసగారు ఉచిత రీతిలో నుదహరించినారు. ''ఏదైనా ఒక గృహము వేలకొలది సంవత్సరములనుండి అంధకారమున కాలవాలమై యున్నను ఒక చిన్న అగ్గిపుల్లను గీచినంతనే చీకటిమాయమగును ఇట్టి అగ్నితుల్యులు అళ్వారాదులు. అగ్గిపుల్లను అపసవ్యముగా గీచినచో అగ్నిజనించదు. క్రమబద్ధముగా సవ్యముగా- అట్లే అళ్వారుల పేర్లను, రచనలను నియమబద్ధముగా స్మరించినచో ఫలితము. వీరందరు భక్తులు భాగవతులు - భగవంతులు. ''Bhagavatha, Bhakta and Bhavan'' these three are one. The descipline which

in essential for uttering the name of God, is who necessary for uttering the name of those noble ones–the devotees of God

(The Life of RAMANUJA. అను గ్రంథములోనిది. పుట. 8)

**ఆళ్వారులకు - ఆచార్యులకు తారతమ్యములు :**

1) ఆళ్వారులు భగవద్భక్తిభావావేశపరులు. లోకవ్యవహారముతో వారికి పనిలేదు. రచనల గావించి పాడినారు. ఆడినారు. భగవంతునకు మంగళా శాసనముల జేసినారు. విశిష్టాద్వైతతత్త్వమునకు ఆధార స్తంభములై భావి ఆచార్య పురుషులకు ఊటచెలమలై నిలిచినారు. భగవద్గుణానుభవము-భగవద్విషయము-సర్వస్వము శ్రీమన్నారాయణుడే. అదే వారి జీవితాదర్శము. మతమును, వేదాంతమును ప్రచారము చేయలేదు. ఉద్యమములు లేవదీయలేదు. తమ జోలికి వచ్చినపుడు తప్ప పరమత ఖండనమండనములు వారి కవసరములేదు.

2) ఇందులకు భిన్నముగా నాథమునులనుండి రామానుజులవరకు, రామానుజుల నుండి భావిపరంపరలవరకు (గురు పరంపరల పట్టికను జూడుడు) భక్తి-మతము అనునవి ఉద్యమములుగా కొనసాగినవి. అనగా, ఆచార్యపురుషులందఱును (ఉభయ వేదాంత ప్రవర్తకులై) సంస్కృత-ద్రావిడ వేదాధ్యయనముల నధ్యయనముజేయుచు దక్షిణ, ఉత్తర దివ్యదేశముల తమ ప్రబంధపఠనాద్యుత్సవములతో నుఱ్ఱూతలూగించినారు. సిద్ధాంత ప్రచారముల జేసినారు. వీరు తత్త్వత్రయ సిద్ధాంత నిరూపణకు పూనుకొని, విశిష్టాద్వైతతత్త్వ విషయముల కంకితమైనవారై, సయుక్తికముగా పరమతముల నెదుర్కొని ఖండనమండనముల గావించినారు. దర్శనసిద్ధాంత స్థాపకాచార్యులై; దివ్యదేశముల, క్షేత్రముల, ప్రసిద్ధ స్థలముల దర్శించి, జనుల నుజ్జీవింపజేయుటకై బద్ధకంకణులై నిలిచి సర్వాత్మనా ప్రచారము గావించినారు.

3) "ఆళ్వారులనగా జ్ఞానులనియు, ఆచార్యులనగా బోధకులనియు, ద్వివిధముగా విభాజ్యము. ఈ తారతమ్యమును గోపీనాథరావు పండితుడిట్లు వివరించినాడు:

"The former being the saints who had realised Brahman and had persons enjoycenent cf His garce, where as the

latter were the learned Propounder ahd elaborator of the Philosophy contained in the works of ALVARS and certainly far lower than the ALVARS."[1]

ఇందు తారతమ్యము విస్పష్టము. మొదటివారు బ్రహ్మమును బొంది, అతని దివ్యానుగ్రహ ప్రాప్తి ననుభవించినవారై యుండ, తర్వాతివారు పండిత వ్యాఖ్యాతలై అళ్వారుల రచనములలోగల తాత్త్విక విషయముల వివరణము గావించెదరు. వీరు ఆళ్వారులకంటె తక్కువవారని యభిప్రాయము.

రెండవ శతాబ్దమునుండి పదహేనవ శతాబ్దమువరకు గల భారతదేశ చరిత్ర - మత సంస్కృతుల నధ్యయనము చేసినచో మనకి భేదము కన్పట్టు చుండును. ఆచార్య పురుషులకు రాజులు, పాలకులు, పురప్రముఖులు, ప్రజల తోడి సంబంధ బాంధవ్యములున్నట్లు తెలిసికొనగలము. వీరందఱును మహా తత్త్వవేత్తలు. అనుభవసంపన్నులు.

"ఆళ్వారులు ఆచార్యులంతటి అనుభవసంపన్నులు గాక సామాన్య ప్రజానీకముకంటె నధికులని కృష్ణస్వామి అయ్యంగారి తలంపు."[2]

"వీరు ద్రవిడ వైష్ణవమునకు మేధాసంపదగల వారని పండిత హేమ చంద్రుని తాత్పర్యము."[3]

"భారతదేశమున తత్త్వవివేచనము, మతజీవనము వ్యతిరేకములు కాదు గావున మహోత్తమ భారతీయ తత్త్వవేత్తలు అందఱును అనుభవసంపన్నులే యని ఆచార్య మహాదేవన్ సమర్థించెను."

"The saints are truely citizens of the world. They be- long to the mankind T.M.P. Mahadevan:"[4] These are Saints who live their life in God and form a spritual nobiliy Dr. S. Radnakrishnan."[5]

ఈ మహాభక్తులు భగవంతునిలో జీవించుచు, పారమార్థిక ప్రభు గణముల నిర్మించిరి. భక్తి తన్మయత్వమున బాహ్యాభ్యంతరముల మఱచి, (ఒడలు మఱచి) ఎల్లెడల నా మహాత్ము నీక్షించుచు, నాలించుచు, పలుకరించుచు, స్తుతించుచు, క్రీడించుచు, కీర్తించుచు, నాట్యము సేయుచుండు నా అలౌకిక ఆనందనోన్మాద పీయూష - ఆస్వాదనాశీలురని విజ్ఞుల భావన.

అయ్యెడ నవ విధ భక్తి లక్షణములను సందర్భోచితముగ వీరికన్వయింపఁజేయవచ్చును.

శ్లో॥ శ్రవణం, కీర్తనం, విష్ణోః - స్మరణం, పాద సేవనమ్।
అర్చనం, వందనం, దాస్యం - సఖ్యమాత్మ నివేదనమ్॥

**దీనికిదీటుగా పోతనమాత్యునిపద్యమును గ్రహింపవచ్చును సప్తమస్కంధము:**

''తను హృద్భాషల సఖ్యముఁ, శ్రవణముఁ, దాసత్వముఁ, వందనా
ర్చనముల్, సేవయు, నాత్మలో నెఱుకయుఁ, సంకీర్తనల్, చింతనం,
బను నీ తొమ్మిది భక్తి మార్గముల సర్వాత్ముఁ హరిఁ నమ్మి స
జ్జనుడై యుండుట భద్రమంచు దలతుఁ సత్యంబు దైత్యోత్తమా!"

**ఆళ్వారులు, ప్రసిద్ధాచార్యులు ప్రహ్లాదునివంటి భక్తిగలవారు: సప్తమస్కంధము :**

"పానీయంబులు ద్రావుచుఁ, కుడుచుచుఁ, భాషింపుచుఁ. హాసలీ
లానిద్రాదులు సేయుచుం, దిరుగుచుఁ, లక్షించుచుఁ, సంతతశ్రీ
నారాయణ పాదపద్మ యుగళీ చింతామృతాస్వాద సం
ధానుండై మరచెఁ సురాతిసుతుడే తద్విశ్వముఁ భూవరా!"

**ఇట్లే శరణాగతి, ప్రపత్తికి గజేంద్రమోక్ష ఘట్టము నిదర్శనము :**

''లావొక్కింతయులేదు....సంరక్షించు భద్రాత్మకా!" ఇది ఆర్త ప్రపత్తి.

మహాభక్తులేగాక ఆళ్వారులందఱును, పలువురాచార్యులు ఉత్తమ కవుల కోవకు చెందినవారు. జనతను జాగృతము చేయునట్టి మహాకవులు - మార్గదర్శకులు.

"నానృషిః కురుతే కావ్యమ్" ఇట సార్థకము.

## తెలుగు సాహిత్యములో ఆచార్య సూక్తిముక్తావళి స్థానం: విశిష్టత - ప్రశస్తి:

తెలుగు సాహిత్యములో వెలువడిన అన్ని ప్రక్రియలకు సంబంధించిన విశిష్టాద్వైతమత-సిద్ధాంత తత్త్వగ్రంథము లసంఖ్యాకములు. ముద్రితాముద్రిత గ్రంథముల నన్వేషించి చూడగా రెండువేల వరకు వచ్చుట కవకాశమున్నది. ఇందుకు విరుద్ధముగా విశిష్టాద్వైత తత్త్వకావ్యములు అల్పసంఖ్యాకములు. కేవలము గద్యకావ్యములు కొన్ని. కేవలము పద్యకావ్యములు కొన్ని. గద్య పద్యోభయ కావ్యములైన చంపువు రచనలు కొన్ని. ప్రబంధము లన్నియు ఈ కోవలోనికే వచ్చును. ఇచట ఇంకొక విషయము. కావ్యములను పరిశీలించు నపుడీ క్రింది విషయములను దృష్టిలో నుంచుకొనవలయును.

1. కేవలము విశిష్టాద్వైత సంబంధము గల గ్రంథములేనా?

2. ఒకే సంపుటిలో నున్న జీవిత చరిత్రలు గల గ్రంథములేనా? లేక విడివిడి గ్రంథములా?

3. విశిష్టాద్వైత తత్త్వములను గర్భీకరించుకొన్న గ్రంథములా?

4. ఏ కావ్య ప్రక్రియకు సంబంధించినవి? కవితలు, వచన కవితలు, పద్యములు, గేయములు, హరికథలు, బుఱ్ఱకథలు, పాటలు, జానపదములు, శతకములు, చంపువులు మొదలగునవి.

5. రచయిత లేదా కవి మతము, ప్రతిభాపాండిత్యములు, పదవి, వృత్తి[1]

6. అనువాద రచనయా? స్వతంత్రమా?

తెలుగులో వెలువడిన ప్రసిద్ధమైన విశిష్టాద్వైత తత్త్వకావ్యములు కొన్నింటి పేర్లు :

---

1. గమనిక : కవివ్యక్తిత్వమును బట్టి రచన, పదవిని బట్టి రచన సాగును. రాయలు రాజు గాన రాజ్యాంగ విషయములు ఆ.మా.లో కన్పట్టును. ఇట్లే ఊహించునది.

3. పద్యపరమయోగి విలాసము - సిద్ధిరాజు తిమ్మరాజు
4. ఆముక్తమాల్యద - శ్రీకృష్ణదేవరాయలు
5. ద్వాదశసూరి చరిత్ర - గద్యకావ్యము - గోదాగ్రంథమాల
శ్రీ కె. టి. యల్. నరసింహాచార్యులు
6. దివ్యమునిత్రయము - గోదాగ్రంథమాల
7. ముముక్షుజన కల్పనము - అచ్చి రామానుజా చార్యులు

: వ్యక్తిగతములు :

8. సకలజీవ సంజీవనము - సాయపనేని వేంకటాద్రి
9. యతిరాజీయము - శ్రీ కుంటిమద్ది శేషశర్మ
10. వైజయంతీ విలాసము - సారంగు తమ్మయ్య
11. చెళ్ళపిళ్ళరాయ చరిత్రము - ఆసూరి మరింగంటి వేంకట
నరసింహాచార్యులు
12. రామానుజాభ్యుదయము - " " "
13. గోదావధూటీ పరిణయము - " " "
14. యామున విజయవిలాసము - శ్రీనివాసాచార్య పుత్రుడు వేంకట
కృష్ణమాచార్యులు
15. శ్రీకృష్ణ చరిత్ర.కథాకావ్యము - డా॥ ఎం. కులశేఖరరావు
16. విప్రనారాయణ చరిత్ర - చదలవాద మల్లన

ఇంకను పెక్కులు గలవు. ఈ గ్రంథములలో ప్రథమ స్థానము నాక్రమించునది ఆ. సూ. ముక్తావళి. ఆముక్తమాల్యద పంచకావ్యములలో నొకటి గదా! పెద్దపీట దానికే లభించుననుట కవకాశములున్నవి అనవచ్చును. ఇట్లే పరమయోగివిలాసము - వైజయంతీ విలాసములు గలవందురు. పై గ్రంథములన్నియు కావ్యగుణ శోభితములే. ఐనను విషయబాహుళ్య వైశాల్య పరిధిలోనిది పెద్దది. కావ్యగుణముల తనరారునట్టిది. వాస్తవ జీవిత చరిత్రలను వాస్తవములుగా కన్నులకు కట్టినట్లు, జనులకుపయోగకరములగు వేలకొలది విషయముల నుగ్గడించినది, సులభమైన శైలి హృద్యమైన రచనము. ఇక సకలజీవన సంజీ

వనమను కావ్యము భగవద్రామానుజుల చరిత్ర. ప్రౌఢరచనము. ఇట్లే కవి కర్ణ రసాయన గ్రంథము విశిష్టాద్వైత తత్త్వమును గర్భీకరించుకొనినట్టిది

**ఈ సందర్భమున ఒక ప్రశ్న ఉదయించకమానదు : అ. సూ. ము. యను ప్రబంధమును గూర్చి మీకు తెలియునా?** అని ప్రశ్నించినచో పాఠకుల నుండి జవాబు దొరుకుట కష్టము. ఆయాసకరమైనది. ఇదేవిధముగా అనేక గ్రంథములను గూర్చి అనేకులకు తెలియదు. తెలియకపోయినంతమాత్రమున వాటివిలువ వాటికుండక పోదు. ఎవరో ఒకరు సహృదయ విమర్శకులు మఱుగున పడియున్న సూక్తిమౌక్తికముల వెలికితీయుదురు. అంత గ్రంథము ప్రకాశము నంది నలుగురి నోటిలో, హృదయపేటికలలో నిమిడిపోవును. కొన్ని గ్రంథములు విషయ మహిమాతిశయముచేత ప్రత్యేక స్థానమునాక్రమించును. గ్రంథస్థ విషయమనగా ఇతివృత్తము, కథావస్తువు, వ్రాసిన విధానము, శైలి, భాష మొదలగునవి. కొందఱు కవులు కమ్మని కథావస్తువు నెన్నుకొని కమ్మగా వ్రాతురు. మత విషయముల, సంప్రదాయముల పట్టించుకొనరు. చప్పటి కథా వస్తువునైనను చవులూరించు విధముగా వ్రాయువారుందురు. వాటి ననేకులు చదువుదురు.

కొందఱు కథావస్తువునకు ప్రాధాన్యమిచ్చుచు మత సంప్రదాయముల జోడింతురు. వీటిని చాలమంది చదువరు. ఆముక్తమాల్యద సార్థకమైన కథలుగల ప్రబంధము. మతవిషయము విశిష్టాద్వైతము. ఐనను పాఠకుల (జనుల) గుండెలలో ప్రవేశించినది. ఎందుచేత? రచనాసౌందర్యమట్లున్నదిగనుక. సంప్రదాయమును బోధించినను సంప్రదాయ గ్రంథమనిపించదు గనుక. పరిమిత సంఖ్యగల పద్యములు, మనోహరమైన, (నారికేళపాకమైనను) గభీరార్థములతోడి వర్ణనము లున్నవి గనుక. ఇట్లే మరికొన్ని కావ్యముల నీయర్థములో పరిశీలింపవచ్చును. నిర్ణయముల గావింపవచ్చును.

**ఇచట గమనింపవలసిన ఒక విషయము:** ఒక గ్రంథము యొక్క ప్రశస్తిని కేవలము రచయిత యొక్క వ్యక్తిగత జీవితము, ఇతర కారణముల వల్ల కలిగిన గొప్పదనము వల్ల, రచయితపై గల యభిమానముచేత నిర్ణయించుట ప్రశస్తముగాదు. వ్యక్తి సౌశీల్యాది గుణములు ప్రశంసనీయములే. ఐనను ఆ గ్రంథ ప్రశస్తిని అంచనా వేయుటకు—

1) గ్రంథకర్త ఎన్నుకొన్న కథావస్తు విషయాంశములు. అనగా, కవి ఎవరి గూర్చి చెప్పినాడు? ఏమి చెప్పినాడు? ఇంతకుమించి,

2) కవి ఎట్లు చెప్పినాడు? వ్యక్తీకరణ విధానము. చదివింపజేసే రచన, చవులుగొలువు మాటలమూటలు. భాష - శైలి, అలంకారాదులు; ఇంకను సహృదయులనెట్లు మెప్పించినాడు? కావ్య ప్రయోజనముల నెంతవరకు సమాజీకరణము గావించి, ఆశించిన ఫలితముల సిద్ధింపజేసినాడు (Hypothesis) అనునవి.

**ఆచార్య సూక్తి ముక్తావళి విషయమును గమనించినచో—**

1) కవి సంప్రదాయబద్ధుడు, సహృదయుడు, కావ్యతత్త్వ వేదాంత తత్త్వమర్మజ్ఞుడు, నియమనిష్ఠలు, క్రమశిక్షణ గలవాడు.

2) ఈ గ్రంథము విశిష్టాద్వైత సిద్ధాంతముల రంగరించుకొని, కావ్య లక్షణముల మేళవించుకొని, ప్రభుసమ్మితమై సుహృత్ సమ్మితమై, కాంతా సమ్మితమై, ఆచార్య సమాశ్రయణ సమ్మతమై, శిష్యవాత్సల్య ప్రపూరితమ్మై, వైభవకావ్యమై అవతరించిన అద్భుత గ్రంథరాజము.

3) కేవలము విశిష్టాద్వైత మతమును స్థాపించు తెలుగు ప్రబంధములు కొన్ని మాత్రమే. అట్లు వెలువడిన గ్రంథములలో ఆళ్వారుల, ఆచార్యుల జీవిత చరిత్రల నొకే సంపుటములో చిత్రించిన బృహత్ గ్రంథరాజ మిదొక్కటియే.

**తెలుగులోని విశిష్టాద్వైత సాహిత్య గ్రంథములలో ఆ.సూ.ము.కే అగ్ర తాంబూలము నీయవలయును :**

**గమనిక :**

1. వివరణకై దీని బృహత్ స్వరూప పట్టికను పేర్కొన్నాను.

2. కావ్యానుశీలనలోని వర్ణనాదికముల, ఇతర విషయముల జూడవచ్చును.

**గ్రంథప్రశస్తి :**

I. ఉపోద్ఘాతమునుబట్టి దీని ప్రశస్తి :

పుణ్యశేషులు తంజనగరం దేవరాజ సుధీగారు 1911 సం॥ ప్రతిలో వ్రాసిన ఉపోద్ఘాతములోని కొన్ని పంక్తులు : "వినోదార్థము కేవలం కథవలె నయ్యైచరితలను వర్ణించు మాత్రమునకుబోక, ముముక్షు - వైష్ణవులుజ్జీవించుటకై తెలుపగూడినన్ని విశిష్టాద్వైత సిద్ధాంతములను భగవద్భాగవత విషయ సంప్ర

దాయ రహస్యములను నందందు మధురమైన యౌషధమువలె భవరోగములు వాయబొందువలుచి యున్నాడు.

ఇందొక శ్రుతిగాదు. ఒక స్మృతిగాదు. ఒక శాస్త్రముగాదు. పురాణము గాదు; మహత్సుబాల నారాయణ తైత్తిరీయ ఛాందోగ్య బృహదారణ్యకాదులైన యుపనిషత్తులును, వారాహ మార్కండేయ,నృసింహ, బ్రహ్మకైవర్త స్కాంధ, మాత్స్య, పాద్మ, నారదీయ,భాగవతాది పురాణములును, పాంచరాత్రాగమమును, మను, పరాశర, యాజ్ఞవల్క్యాది స్మృతులును, బెక్కు సంహితలును, భాగవతమును, ఇవి, యవి యననేల? సర్వదర్శన స్థాపకములై, స్వసంప్రదాయ నిరూపకములైన సమస్త ప్రమాణ గ్రంథములను, విశేషాకారమున క్రోడీకరించి శాస్త్ర పరిచయము లేనివారికిని సుసుబోధముగాను, అతిమనోజ్ఞముగాను, స్వరుచి విశేష మకరందఝురిందేనియ లొలుకునట్లు దోచి, స్వకీయాధ్యవసాయ పటిమచే స్ఫుటముగా నాటునట్లు రచించి యున్నాడు. కాన,శ్రీవైష్ణవ సిద్ధాంత నిష్ఠాతులగు శిష్టజనులకు గూడ పఠన పాఠన శ్రవణ శ్రావణాదులకు మిక్కిలి యర్హమని చెప్ప నొప్పియున్నది." ఇట్లే ఈ పీఠికా రచయిత గ్రంథవస్తు వైలక్షణ్యమును, "చక్రాంకణ స్వభావము, శిష్యలక్షణము, భాగవతలక్షణము" మున్నగువానిని తెలిపినాడు.

1922 సం॥ము రెండవ కూర్పుకు విన్నపము వ్రాసినవారు శ్రీ పురాణం సూర్యనారాయణ తీర్థులు ఇట్లు వ్రాసినారు: "శ్రీ మద్విశిష్టా ద్వైత మతస్థులకే కాక తన్మత సంప్రదాయములను తెలిసికొనగోరు నితర మతస్థులకును వరమాదరణీయంబగు నీ యాచార్య సూక్తి ముక్తావళి యొక్క మొదటి కూర్పు ప్రతులన్నియు ముద్రించిన కొలది కాలముననే చెల్లిపోవుట చేత నీ రెండవ కూర్పు 1919 సం॥ముననే ప్రారంభింపబడినది."

1972 సం॥ ప్రతి ప్రకటనకర్త శ్రీ జమిలి నమ్మాళ్వారులు. ఇందులో "దేవరాజు సుధీగారి యుపోద్ఘాతము", "ఇంకొక యుపోద్ఘాతము" గలదు. గ్రంథము పూర్తి చివరిపేజీ 632లో కుండలీకరణములో చిలకల ప్రెస్సును ప్రస్తావన గలదు. "ఇందు ప్రకటించిన రెండు యుపోద్ఘాతములవలన యీ గ్రంథ ప్రాశస్త్యము నెఱుంగవచ్చును" అని ఇందులో వ్రాసినారు.

లోకములో దీని వ్యాప్తి, ప్రచార ప్రాశస్త్యము [illegible]

II ఆయా గ్రంథ రచయితలు రిఫరెన్సుగా (Reference) ఇందలి పద్యములను వాడుకున్నారు. ఉపయుక్త గ్రంథముగా, సంప్రదించిన గ్రంథముగా పేర్కొన్నారు. ప్రశంసా వాక్యములను గూడ వ్రాసినారు.

III దేశ చరిత్రలు, జీవిత చరిత్రలు వ్రాయుటకు సీస పద్యముల నెన్నుకొనుట, అస్పష్టత, అన్వయక్లిష్టత లేకుండుట, భాష సరళ సుందరముగా, సంస్కారయుతమై యుండుట, వైష్ణవ పరిభాషను పుణికి పుచ్చుకొనుట ఇందలి ప్రత్యేకతలు.

IV కావ్యరసాలంకార లక్షణాదులు చక్కగా పోషింపబడినవి. శైలి ధారాళము. వర్ణనలు బహుళము. రచన కుంటుపడలేదు. ఔచితి భంగము లేదు.

V సందర్భమునుబట్టి వేదశాస్త్ర ప్రమాణములు, న్యాయములు, తొంబది తొమ్మిది పాళ్ళు వచనభాగములోనే రూపొందించుట ఇందలి విశేషము.

కవి తాను విన్నట్టి, కన్నట్టి, స్వానుభవ వృత్తాంతములను తాను చదువుకొన్న రీతిగనే, ఆచార్యోపదేశములు, హితముల ననుసరించియే రచన సాగించినాడు. స్వకపోలకల్పనలచేత తాను నేర్చుకున్న దేశచరిత్రకు భంగము వాటిల్లనీయలేదు. ప్రబంధ-కావ్యకథా కల్పనలున్నవి. బినను దేశచరిత్ర క్షేత్రముల వర్ణన, ప్రకృతి-వర్ణనలు అవాస్తవికములుగావు. ఈనాటి విద్యార్థుల, అధ్యాపకుల వలె నాటి వారు దేశచరిత్ర-భూగోళముల నధ్యయనము జేయలేదు గాన, కొన్ని లోపములుండ వచ్చును. కావ్యధారకవి ఆటంకములు గావు. ఉదాహరణము రామానుజుల వైభవములోని చారిత్రక పురుషుల పేర్లు ఔరంగజేబు - కాకరుద్రుడు, ఢిల్లీ పాదుషా మున్నగునవి.

VI ఈ గ్రంథము మనలో వైష్ణవత్వ సమాచార సంపదను పెంపొందించి. పఠనాసక్తిని గల్గించుననుటలో సందియము లేదు.

VII ఈ గ్రంథమును జదువునపుడు పరిశోధనాసక్తి, ఇతర గ్రంథములలో నేమి గలదో తెలిసికొనవలయునను కుతుహలము గల్గును. ఆలోచింపదగిన

నున్నవి. ఇందుకు మకుటాయమానమైన నిదర్శనము ''మణవాళ మహాముని వైభవము" లోని సుదీర్ఘ వచన విభాగము.

VIII ఇందలి సూక్తులు మానవత్వమునూ సూచించునవి. శిరోధార్యములు.

IX నిజానిజములు తేల్చుటకు సహృదయ విమర్శకుల ప్రార్థింతును.

X వేయేల? తెలుగు విశిష్టాద్వైత సాహిత్యములో దీని స్థానమద్వితీయము. ఇంటి స్వంతగ్రంథాలయములోనే గాదు - హృదయపేటికలో దాచుకొనదగిన ఉత్తమ ప్రబంధమిది.

## "తెలుగు సాహిత్య చరిత్రలో ఆచార్య సూక్తి ముక్తావళిని గూర్చిన ప్రసక్తి" ఇతర గ్రంథములలోను, వ్యాసముల లోను కానవచ్చు సందర్భములు :

గ్రంథము పేరు : ఆచార్య సూక్తిముక్తావళి

గ్రంథకర్త : శ్రీమాన్ నంబూరి కేశవాచార్యులు.

గ్రంథ ప్రప్రథమ ముద్రణము - 1875

,, ద్వితీయ ,, - 1911

,, తృతీయ ,, - 1922

,, చతుర్థ ,, - 1972

తాళపత్ర ప్రతులు గలవు.

తెలుగు సాహిత్య చరిత్రలో ఆ.సూ.ము. గ్రంథ ప్రసక్తి గలదా? యని ప్రశ్న వేసికొన్నచో! లేదనియే చెప్పవలసి యుండును. తెలుగు కవుల చరిత్రను వ్రాసినవారుగాని, వాఙ్మయ చరిత్రకారులుగాని, సాహిత్యకోశ నిర్మాతలుగాని, విశ్వసాహితి నిర్వాహకులుగాని, దేశచరిత్ర - సంస్కృతి - మతగ్రంథ సంపాదకులుగాని ఈ గ్రంథమును, రచయితను పేర్కొనలేదు. ఉదాహరణమునకై క్రింది గ్రంథముల పరిశీలించ వచ్చును.

1. విశ్వసాహితి - 6 వ సంపుటము. తెలుగు భాషా సమితి.

2. తెలుగు సాహిత్యకోశము - 1, 2 సంపుటములు. తెలుగు అకాడమి

3. ఆంధ్ర సాహిత్య చరిత్ర - సంగ్రహము - ఖండవల్లి.

4. ఆం. వా. చరిత్రము - కె. వెంకటనారాయణరావు.

5. సమగ్రాంధ్ర సాహిత్యము (ప్రాత - క్రొత్త ప్రచురణలు) 1 - 10 సంపుటాలు - ఆరుద్ర.

6. తెలుగు సాహిత్య సమీక్ష - జి. నాగయ్య.

7. ఆంధ్రకవుల చరిత్ర - కందుకూరి వీరేశలింగం పంతులు.

8. ,, ,, ,, - గురజాడ శ్రీరామమూర్తి.

9. ఆంధ్ర రచయితలు - మధునాపంతుల సత్యనారాయణశాస్త్రి.

10. ఆంధ్రకవి తరంగిణి - చాగంటి శేషయ్య.

ఇట్టి కవుల చరిత్రలకు సంబంధించిన ఏ గ్రంథమునందైనను గ్రంథ పరిచయము, కవి పరిచయము లేదు. సాహిత్య చరిత్రలో ఈ పరిచయముండుట అవసరము గదా! కాని, ఆంధ్ర వాఙ్మయచరిత్రలో శ్రీ దివాకర్లవారు సందర్భవశాత్తులో గ్రంథము పేరు పేర్కొనిరేగాని కవి ప్రస్తావన చేయలేదు. వందం కొలది గ్రంథము పేర్లు, కవుల పేర్లు కాలాదికములను పేర్కొను సాహిత్య చరిత్రకారులెందుకో దీనిని మరచినట్లున్నారు. ఒక్క "ఆంధ్ర విజ్ఞాన సర్వస్వము 4 వ భాగము, తెలుగుచరిత్ర-సంస్కృతి-2"లో ఆ-సూ.ము.ని గూర్చిన సంగ్రహ వ్యాసమున్నది గాని, అది సాహిత్య చరిత్ర గాదు.

సుమారు 1762 సంఖ్యకుపైగా పద్యములు, అతి దీర్ఘములైన వచనములతో గూడుకొని, ధారాళమైన శైలిగల ఈ మహాప్రబంధమును సాహిత్యచరిత్ర పుటలలోని కెక్కించుట జరుగలేదెందుకు? అలభ్య గ్రంథము కాదు గదా! ఇది అత్యంతాశ్చర్యకరమైన విషయము! వారు ఈ గ్రంథమును కన్నులార చూచి యుండలేదేమో! వారి దృష్టి కిది రాలేదో! ఎవరైనను చెప్పియుండలేదో! చెప్పినను, తెలిసినను దీనిని కాగితముపై బెట్టుట కిష్టములేదేమో! మొత్తముమీద ఈ పేరు కనబడదు. ఇట్లు కారణ మనూహ్యము.

సాహిత్య టరిత్రకేమిగాని - ఈ గ్రంథమును గూర్చిన, కవిని గూర్చిన వ్యాసములును (సంకలన గ్రంథములలోను, పత్రికలలో గూడ) అలభ్యములుగా

నున్నవి. లేనేలేవన్నచో అతిశయోక్తిగాదు. అట్లైన మరి చేయునదేమన్నచో-ఇట్లు చేయుట కవకాశము గలదు.

కొందఱు పరిశోధక రచయితలు, వ్యాస రచయితలు, ఇంకను లబ్ధ ప్రతిష్ఠులు, సంప్రదాయజ్ఞులు, విశిష్టాద్వైత సిద్ధాంత మర్మజ్ఞులు తమ తమ గ్రంథములలోని ఉపయుక్త గ్రంథ సూచికలలోను, వ్యాసభాగములలోను పేర్కొన్నారు. పీఠికలలోను, ఉపోద్ఘాతములవంటి వానిలోను, దీని ప్రసక్తి కానవచ్చుచున్నది. ఇట్టి ప్రసక్తులను అన్నింటిని ఒకచో క్రోడీకరించినచో దీని ప్రశస్తిని అంచనా వేయవచ్చును. ఇంకను దీని ప్రాశస్త్యమును సంపూర్ణముగా లెక్కించుటకు ఈ గ్రంథము నామూలాగ్రముగా సహృదయ విమర్శక దృక్పథముగా అధ్యయనము చేయవలయును.

''ఆచార్య సూక్తి ముక్తావళి'' గ్రంథ ప్రస్తావనము:

1. ఉపయుక్త గ్రంథముగా, ఉపజీవ్య లేక తోడ్పడిన గ్రంథముల పట్టికలలో; సంప్రదించిన గ్రంథముల పేర్ల జాబితాలలో.

2 పీఠికలలో, ఉపోద్ఘాతములలో, గ్రంథాంతర్భాగములలో, పత్రికలలో దీని ప్రసక్తి - కొన్ని వాక్యములు.

I. **సిద్ధాంత** వ్యాస గ్రంథములు, ఇతరముల ఉపయుక్త గ్రంథ పట్టికలలో నున్న పేర్లు:

| గ్రంథము పేరు | రచయిత | వివరములున్నచో |
|---|---|---|
| 1. వైష్ణవాంధ్రవాఙ్మయము | డా. వేటూరి ఆనందమూర్తి | పుటలు 339. అ. సూ. ము. |
| 2. తాళ్ళపాకవారి సాహిత్యము పరిశీలనము. | ,, ,, ,, ,, | అ. సూ. ము. 219. |
| 3. అచ్చ తెలుగు కృతుల పరిశీలనం | డా. కె. వి. సుందరాచార్యులు | 317 అ. సూ. ము + కవి |
| 4. ఆంధ్రశబ్ద రత్నాకరము | శ్రీ చెలమచర్ల రంగాచార్యులు | |
| 5. రంగనాథ వాల్మీకి రామాయణ తులనాత్మక పరిశీలనము | డా. గుండి వేంకటాచార్యులు | 581 అ. సూ. ము + కవి |

6. ఆంధ్రదేశ చరిత్ర - భూగోళ - ఆంధ్ర రచయితల సర్వసము - ముఖద్వారము  xv పుట సంఘం 1969 ఆ. సూ. ము + కవి

ఇతర గ్రంథముల పీఠికాదులలో :

7. తిరువాయ్‌మొళి, ఆంధ్రపద్యానువాదము - శ్రీ చెన్నమరాజు కొండనామాత్య దేశపాండ్య పీఠిక XVI
8. శ్రీ యామునాచార్య వైభవము - డా. మరిగంటిశేషాచార్యులు పీఠిక
9. శ్రీ వైష్ణవ ముక్తిమార్గము - శ్రీ పరాంకుశం మనోహరస్వామి పీఠిక-5
10. సకల జీవ సంజీవము - డా. బి. రామరాజు, టి.టి.డి. పీఠిక XVI
11. శ్రీరామానుజ చరిత్ర, చిరుతలగేయ కావ్యము - శ్రీ సౌమిత్రి నారాయణాచార్యులు పీఠిక
12. చూతపురీ విలాసము - సం. శ్రీ కపిలవాయి లింగమూర్తి పట్టిక XXII
13. ఆంధ్రకవి తరంగిణి III వభాగము (చాగంటి శేషయ్య) - శ్రీ నిడుదవోలు వేంకటరావుగారి పీఠిక ఆ సూ.ము. యందు కృష్ణమాచార్యుల చరిత్ర గలదు. 39 వ శీర్షిక
14. ముకుందమాల - శ్రీ చెలమచర్ల రంగాచార్యులు పీఠిక 9
15. రామానుజ శతకము - గోదాగ్రంథమాల వారి మనవిలో
16. పరతత్త్వ పరిశోధన - శ్రీ కిళాంబి కృష్ణమాచార్యులు పీఠిక
17. నరసింహ తాండవము - శ్రీ నల్లాన్ చక్రవర్తుల కృష్ణమాచార్యులు, నంబూరు కేశవార్యుని పేర పద్యము గలదు.
18. ఆళ్వారులు - దివ్య ప్రబంధములు - డా. ధనకుధరం వరదాచార్యులు పుటలు 66.
19. బ్రహ్మజిజ్ఞాస II - శ్రీ మట్టిబోయిన రామసుబ్బయ్య పుటలు 6 పట్టికలో
20. శ్రీ నృసింహప్రియ - మాసపత్రిక, వార్షిక సంచిక 1982
21. భక్తి నివేదన - మాసపత్రిక జూన్ 1990
22. సాహితీ మంజూష - కళాస్రవంతి, హైదరాబాదు పుటలు 274
23. తెలుగు సాహిత్యకోశము - I భాగము తెలుగు అకాడమి పుటలు 1027
24. తెలుగు సాహిత్యకోశము - II ,, ,, ,, 50
25. ఆంధ్ర వాఙ్మయ చరిత్రము - డా. దివాకర్ల వేంకటావధాని పుటలు 27
26. సాక్షి IV - శ్రీ పానుగంటి లక్ష్మీనరసింహారావు - పుటలు 76, 77

27. మరిగంటి కవుల సాహిత్యసేవ - డా. రంగాచార్య పుటలు 477
28. శ్రీ రామానుజ కీర్తికౌముది - శ్రీ ధనకుదరం వరదాచార్యులు పుటలు 134, 95, 96 VI VII భాగములు.
29. భగవద్రామానుజస్తుతి - గోదాగ్రంథమాల - శ్రీ కె. టి యల్ నరసింహాచార్యులు పుటలు VII
30. వకుల భూషణనాయకి - గోదాగ్రంథమాల " " పుటలు 18
31. శ్రీ రామానుజ చరిత్ర " " పుటలు 1, 41
32. ద్వాదశసూరి చరిత్ర " " 355, 356, 357 359, 360, 362, 364, 365, 454.
33. శ్రీ రామానుజ స్తోత్రము " " పుటలు V
34. రామానుజ చరితము - కృష్ణమాచార్య శతావధాని తొలిపలుకులు
35. శ్రీ రామానుజుల సమగ్ర చరిత్రము - శ్రీ గోపాలచార్య, నడిగడ్డపాలెం, పీఠిక IV
36. దేవాలయములు-తత్త్వవేత్తలు - శ్రీ టి. వి. శేషాచార్యులు టిటిడి 58
37. శ్రీనివాస మంగాపురం, మరియు మన ఆలయముల నిర్ర్త - శ్రీ గోపీ కృష్ణ టి.టి.డి. 216, 217 పుటలు
38. తెలుగు విజ్ఞాన సర్వస్వము 4 వ సంపుటము - తెలుగు భాషాసమితి 720 పుటలు
39. తిరునామములు-సమగ్ర పరిశీలనము - డా॥ కిడాంబి నరసింహాచార్యులు 133 పుట
40. విష్ణుభక్తి తత్పరుడు-విప్రనారాయణ - డా॥ ఎర్ల బాలక్రిష్ణారెడ్డి పు. 17
41. గోదాదేవి కథ-తులనాత్మక పరిశీలనము - శ్రీ కె. పెరుమాళ్ళాచార్యులు
42. ఆముక్తమాల్యద-పర్యాలోకనము - భూమిక - ఈయుణ్ణి వేంకటరాఘవాచార్యులు
43. తిరుప్పావై - సటీక - గార్ల - నైజాం 1914 ఇందులో "వాదిభీకర గురుడనె మోద మలర" అను మకుటమును మార్చి పాదపూరణ చేయబడినది.
44. శ్రీ మహాభక్త విజయము - ప్రచురణ వావిళ్ళ 1966 పుటలు 561

45. యామున విజయ విలాసము - తిరుమల చిగిలిరేవుల వేంకటకృష్ణమాచార్యులు పీఠిక 242, 245

46. తెలుగు సాహిత్య చరిత్ర - ఆచార్య కొర్లపాటి శ్రీరామమూర్తి పు. 495

47. తెలుగు తాళపత్ర గ్రంథముల వివరణాత్మకసూచి - ఉస్మానియా విశ్వవిద్యాలయ గ్రంథాలయం.

48. తపస్సిద్ధి-నవల - శ్రీ టి. బి. యం. అయ్యవారు పీఠికలో.

49. హిందూ మతముపై శ్రీరామానుజుని ప్రభావము - శ్రీ వి. టి. శేషాచార్యులు పుటలు 55

50. ఆంధ్రవాఙ్మయ సూచిక - కీ॥శే॥ కాశీనాథుని నాగేశ్వరరావు పంతులు పుటలు 17

51. కులశేఖర మహీపాల చరిత్రము - శ్రీ తట్టా లక్ష్మీనరసింహాచార్యులు పుటలు 158.

## ఆచార్య ప్రశస్తి :

## ఆచార్య సమాశ్రయణము :

## ఆచార్య సంప్రదాయం :

**సంగ్రహ వివరణములు :**

1. ఆచార్యుడు : సమానార్థకములు : విశేషాంశములు
2. విద్య : అందలి రహస్యములు : విశేషాంశములు
3. శిష్యుడు : సమానార్థకములు : విశేషాంశములు
4. ఇతర ముఖ్యాంశములు.

వేదాది శాస్త్రములలోను, గీతలోను, ఇతిహాస పురాణములలోను, ద్రావిడ ప్రబంధములలోను వీటిని గూర్చిన సార్థక వివరణములెన్నియో గోచరించును. (గ్రంథము పేరు ఆచార్య సూక్తిముక్తావళి యైనందున పైశబ్దములకు వివరణముల నాశించి చర్చించుట అప్రస్తుతమేమియుగాదు.) ప్రాచీనాధునిక విద్యావేత్తలు, విద్యాతత్త్వ విషయ రచయితలు విపులాతివిపులముగా వీటిని గూర్చి చర్చించిరి. మతత్రయకర్తలు, ఆచార్యులు తమ తమ మతముల కనుగుణ్యమగునట్లుగా శాస్త్ర విషయములతో సమన్వయించుకొని సమర్థనముల జూపిరి. అందరును చర్చించిన సామాన్య విషయములివి.

తలు - కర్తవ్యములు మొదలగునవి.

2. విద్య యనగా నేమి? పరవిద్య - అపరవిద్య; లక్ష్యములు - రహస్యములు, పాఠ్యాంశములు, విద్యాభ్యాసము, శిక్షణము, స్వభావము ప్రాచీనాధునికములు.

3. శిష్యుడు : నిర్వచనము - యోగ్యతలు - బాధ్యతలు - సదాచార్యుడు, సచ్ఛిష్యుడు, విధులు - కర్తవ్యములు, పరీక్షలు.

4. ఆచార్యసమాశ్రయణము, సంప్రదాయములు

5. ఆచార్యశిష్య అవినాభావ సంబంధములు జీవిత లక్ష్యములు.

"ఆచార్య సూక్తి ముక్తావళి" లో కన్పట్టు విద్యా సంబంధ పదములివి:

1) ఆచార్యుడు-గురుడు, దేశికుడు, సూరి, ఆర్యుడు, సద్గురుడు, పరమగురుడు, అధ్యాపకుడు, ఉపాధ్యాయుడు మున్నగునవి.

2) విద్య - రహస్యము, ఉపదేశము, తంజము, హితము, మంత్రము, చదువు, శాస్త్రము మొదలగునవి.

3) శిష్యుడు - అంతేవాసి, ఛాత్రుడు, దాసుడు, భృత్యుడు, బ్రహ్మచారి. (నిర్వచనములు కడు ప్రసిద్ధములు. ఒక సిద్ధాంత గ్రంథమే యగును. వివరణలకై అమరకోశాది ప్రసిద్ధ గ్రంథముల సంప్రదించగలరు.)

**ఆచార్య ప్రశస్తి:**

ఏ శబ్దములు విన్నయెడల మానసము ఆనందముతో పొంగిపొరలునో, ఏ మాటలు విన్నంతనే ఒక్కమారు భారతీయ సంస్కృతి కన్నులకు కట్టెదుట గోచరించునో, ఏ పదములు నుడివినంతనే 'అసతోమా సద్గమయ, తమసోమా జ్యోతిర్గమయ, మృత్యోర్మా అమృతంగమయ' అన్న పరమార్థ వాక్యములు స్ఫురించునో, ఏ యక్షర సంపుటిని పలికినచో చైతన్యస్ఫూర్తులు అంతరాంతరాళముల విజ్ఞానమయము చేయునో అట్టి విశిష్ట పదములే భారతీయ జీవనాడి యనదగినవి, జనుల రక్తనాళములలో కలిసిపోయినవి 1) ఆచార్యుడు 2) గురువు అనునట్టివి.

ఉత్తమ సంప్రదాయముల పునరుద్ధరించి, సంఘ సంస్కర్తలై, మత సిద్ధాంతగుణ గ్రహణ పారీణులై, మానవాళికి జీవిత లక్ష్యము బాటను జూపిన మార్గదర్శకులైనవారి కోవలోకి జెందినవా డాచార్యుడు, ఆచార్యులు. అందుకే ఈ శ్లోకములు వీరియెడల సార్థకములైనవి:

"ఏతద్దేశ ప్రసూతస్య - సకాశాదగ్రజన్మనః
స్వస్వం చరిత్రం శిక్షేరన్ - పృథివ్యాం సర్వమానవాః"
-మనుస్మృతి 2-20

"యద్యదాచరతి శ్రేష్ఠః స్తత్తదేవేతరోజనాః
సయాత్ప్రమాణంకురుతే-లోకస్తదను వర్తతే" -గీత 3-21

**ఆచార్యుడు శిష్యుడు విద్య: నిర్వచనములు:**

భారతదేశములో మతత్రయకర్తలు 1. శంకరాచార్యులు (8వ శతాబ్దము) 2 రామానుజాచార్యులు (11 వ శతాబ్దము) 3. మధ్వాచార్యులు (13 వ శతాబ్దము) ప్రసిద్ధాచార్యులై, భారతీయసంస్కృతికి ఆటపట్టువులై నిలిచినారు. ఇంకను మహామహోపాధ్యాయుడు, తత్త్వవేత డాక్టరు సర్వేపల్లి రాధాకృష్ణన్, మహర్షి వివేకానందస్వామి, మహాత్ముడు బాపూజీ వంటి మహనీయులెందరో యున్నారు. వివరణకిట స్థలము చాలదు.

హిందూమతోద్ధారకులలో నొకరైన రామానుజాచార్యులను గూర్చి-తత్సంప్రదాయమును గూర్చి అనగా విశిష్టాద్వైతత తత్త్వసిద్ధాంతము శ్రీవైష్ణవ మతవిషయ రహస్యములను గూర్చి తెలుపునట్టి చక్కటి తెలుగు ప్రబంధమే ఆచార్యసూక్తిముక్తావళి.

**ఆచార్యాది ప్రసిద్ధ శబ్దార్థములు : సంగ్రహవివరణము:**

ఈనాటి సమాజములో వరివ్యాప్తమై సమాజాంగములలో లీనమైపోయినట్టివి, సామాన్యజనుల మాటలలో గూడ కలిసిపోయినవి, పాఠశాలలలోను, విద్యాలయములలోను, విద్యాసంస్థలలోను తఱచుగా నుపయోగింపబడు సమానార్థకపదములు, పర్యాయపదములుగా వ్యవహారములో నున్నట్టి పదములను తెలుపుచున్నాను. ఆచార్యసూక్తిముక్తావళిలో ఈ పదప్రయోగము లసంఖ్యాకములు.

**ఆచార్యుడు :** గురువు ఉపాధ్యాయుడు, అధ్యాపకుడు, శిక్షకుడు, దేశికుడు, చదువు చెప్పేవాడు, బోధకుడు, పంతులుగారు, ఆంగ్లములో Teacher; Professor, Lecaturer మొదలగునవి.

**గమనిక :-** సందర్భమును బట్టి, స్థలకాలది సంప్రదాయములబట్టి అర్థములను సమన్వయము చేసికొనవలయును.

**ఉదా:** భీష్మాచార్యుడు వృత్తిపరముగాదు. గౌరవవాచకము

మహామహోపాధ్యాయ (బిరుదు, చదువుచెప్పువాడు) వేదం వేంకటరాయ శాస్త్రి.

నైఘంటికార్థములు : ఆచార్యునకు 1. గురువు 2. వడుగుచేసి వేదము చెప్పినవాడు 3. మతస్థాపకుడు, 4. యజ్ఞాది కర్మోపదేశికుడు 5. విద్వాంసుడు 6. వేదవ్యాఖ్యానము చేయువాడు 7. ద్రోణుడు.

వ్యుత్పత్తి : (చర=గతి భక్షయోః=ఆ+చర్+ణ్యత్) కృ.ప్ర.

అమరకోశము : 1. మంత్ర వ్యాఖ్యాకృదాచార్యః 2. ఆచారం గ్రాహయతీతి ఆచార్యః 3. ఉపనీయతుయః పూర్వం వేదమధ్యాపయేద్విజః సాంగంచ, సరహస్యంచ, తమాచార్య విదుర్బుధాః ఇతిమనుః.

ఇతరములు : 1. శాస్త్రములను మథించి (శాస్త్రార్థము నెఱిగి) తాను ఆచరించుచు, ఆచరింపజేయువాడు; 2. మతస్థాపకులైన శ్రీ శంకరులు, రామానుజులు మొదలగువారు 3. కల్పసూత్రాదులతోబాటు వేదము జదివించువాడు. 4. వేదమంత్రముల వ్యాఖ్యానించువాడు 5. సకల మంత్రోపదేష్ట 6. కర్మములగాని, మోక్షసాధనములగాని ఉపదేశించు సద్గురువు 7. పూజ్యుడు 8. ఉపాధ్యాయుడు 9. పండితుడు 10. ద్రోణాచార్యుడు 11 అధ్యాపకుడు 12. తెలుగులో పంతులుగారు 13. ఆంగ్ల ప్రసిద్ధ పరివ్యాప్తపదము Teacher, Lecturer, మున్నగునవి.

**ఆచార్యులకు నిర్వచనములు :**

1. "ఆచినోతిః శాస్త్రార్థాన్ - ఆచారే స్థాపయత్యపి,
స్వయమాచరతే యస్తు - స - ఆచార్య - ఇతిస్మృతః"
(శాస్త్రార్థ పరిజ్ఞానము, స్వయముగా ఆచరించి చూపించువాడు)

2. "స్వయమేవాచరేచ్ఛిష్యానాచారే స్థాపయత్యపి
ఆచినోతీహ శాస్త్రార్థా - నాచార్యస్తేన కథ్యతే"
"ఆచారము వశ మాపన్న మధ్యాపయతి"
(కులార్ణవ తంత్రము. 17)

3. ఆచార్యస్స హరిస్సాక్షాత్ - చరరూపీన సంశయః
మగ్నానుద్ధరతే లోకాన్ - కారుణ్యాచ్ఛాస్త్రపాణినా॥
(ప్రపన్నామృతము. 63 వ అధ్యాయము)

**ఆచార్యుడు - గురువు :**

పర్యాయ పదములుగా వాడబడుచున్నవి. (సందర్భమునుబట్టి నానార్థములున్నను) జగద్గురువు-జగదాచార్యుడు మెదలగునవి. గురువు శబ్దమునకు ఆచార్య శబ్ద నైఘంటికార్థములన్నియు సరిపోవును.

**గురువు వ్యుత్పత్తి :**

(గౄ = గిరణే - గౄ = శబ్దేగౄహే
గౄ + కు + ఉత్ + చ) కృ.ప్ర.

1. అజ్ఞానమును పోగొట్టువాడు
2. ధర్మమును పదేశించువాడు
3 మంత్రోపదేశమును చేసిన ఆచార్యుడు
4. తత్త్వమునుపదేశించువాడు
5. విద్య చెప్పినవాడు
6. ఉపాధ్యాయుడు
7. అధ్యాపకుడు
8. తెలుగులో పంతులుగారు
9. గౌరవ వాచకము.

**గురువు నిర్వచనములు :**

1. "గృణాతి ధర్మాది రహస్యమ్ ఇతి గురుః"
(అనగా ధర్మాది రహస్యముల నుపదేశించువాడు)
2. "గకారః సిద్ధిదః ప్రోక్తో రేఫః పాపస్యహారకః,
ఉకారో విష్ణు రవ్యక్త స్త్రితయాత్మగురుః పరః॥
(తంత్రసారము)
3. గుశబ్ద స్త్వంధకారస్యా ద్రుశబ్ద స్తన్నిరోధకః।
అంధకార నిరోధిత్వాద్గురురిత్యభిధీయతే ॥ (ప్రపన్నామృతము)
4 గురురేవ పరం బ్రహ్మ - గురురేవ పరాగతిః
గురురేవ పరా విద్యా-గురురేవ పరం ధనమ్॥ (ప్రపన్నామృతము)
5. అజ్ఞాన తిమిరాంధస్య - జ్ఞానాంజన శలాకయా,
చక్షురున్మీలితం యేన - తస్మై శ్రీగురవేనమః ॥

దేశికుడు-తంత్రానుసారము గురువు, ఆచార్యుడు, దేశికుడు అని పిలువబడును. ఆచార్యశబ్దము ప్రాచీనము. మరియు దేశిక శబ్దము సంప్రదాయములో ఉపలబ్ధమగును. కాని, ఉపనిషత్తులలో శిక్షాగురువనియే వ్యవహరింపబడును.

1. "దేవతా రూప ధారిత్వా చ్ఛిష్యానుగ్రహ కారణాత్
కరుణామయ మూర్తిత్వాత్ - దేశికః కథితః ప్రియే॥
(కులార్ణవ తంత్రము - 17)

2. దేవత } దే మూడింటి మొదటి అక్షరముల నొకచోట జేర్చిన
శిష్యుడు } శి దేశిక శబ్ద మేర్పడినది.
కరుణ } క

3. ''ధర్మాణాం దేశికః సాక్షాత్ - స భవిష్యతి ధర్మభాక్''
(మహాభారతము. 13-147-42)

ఉపదేశ కుశలుడే దేశికుడు.

**గమనిక :** ఆచార్యులకు గురువులకు అధ్యాపకవర్గ మందరకును వర్తించును.

**దేశికుని లక్షణములు :**

"శుచిర్వాచస్వ వర్చస్వీ
ధృతిమాన్ స్మృతిమాన్ కృతి,
నమ్రః ఉత్సాహి జిజ్ఞాసు
అభ్యాసీ దేశికో నవలక్షణాః"

ముఖ్యముగా ఆ సూ.ము. లోని ప్రసిద్ధాచార్య పురుషులందీ లక్షణముల గాంచనగును.

**కులపతి :**

"ఛాత్రాణాం దశసాహస్రమ్
యోఽన్న పానాదినా భరణ
అధ్యాపయతి విప్రర్షిరసౌ,
"కులపతిః స్మృతః"

''స్నాతకులకు సదుపదేశము చేయువాడు, దీక్షాంత సమారోహము-" ఇది ఈనాటి గురుకుల విద్యా పద్ధతి:

5 వ ఏట గురుకుల ప్రవేశము 12 ఏండ్ల వరకు నిరంతర అధ్యయనము 10, 000 మంది శిష్యులను అన్నపానాదికములచే భరించి శిక్షణ గరపించువాడు ''కులపతి" ఇది ఈనాటి విశ్వవిద్యాలయ పద్ధతికి ఆదర్శము.

**బ్రహ్మచారి :**

బ్రహ్మ వేదః తదధ్యయనార్థం వ్రతమపి, బ్రహ్మ తచ్చర-తీతి బ్రహ్మ చారీ."

బ్రహ్మమనగా వేదము. తదధ్యయనార్థమైన వ్రతంబును బ్రహ్మము. దాని నాచరించువాడు.

**ఛాత్రుడు :** "ఛత్రాదిభ్యోణః"

"ఛాదనాదావరణాచ్ఛత్రమ్। గురుకర్యేణావహితః।
ఛిద్రావరణ ప్రవృత్తశ్ఛత్రశీల: శిష్యచ్ఛాత్రః॥
"గురోర్దోషా మావరణం ఛత్రమ్,
తచ్ఛీలమస్యచ్ఛాత్రః, ఛత్రాదిభ్యోణః" (పాణిని 4-4-62)

,, గురువును ఛత్రము వలె కాపాడువాడు. వీరు అజిన కమండలములను ధరింపవలసి యుండును. పతంజలి ననుసరించి విద్యార్థియగు ఛాత్రుడు వేదములో అపవృతుడైన ఛాత్రుడు మాణవ - మాణవ్య అని పిలువబడును.

శిష్యుడు, శిష్యకుడు : "శిక్షామధీయధీయతేశైక్షా" శిక్షాగ్రంథము నధ్యయనము చేయువాడు, గురువు నొద్ద విద్యగరచువాడు. ఛాత్రుడు. మంత్రోవదేశము నొందువాడు. శిక్షణీయుడు. శిక్షింపయోగ్యమైనవాడు.

**వ్యుత్పత్తి :**

(శాసు ( = అను శిష్టౌ) + శ్యప్ ) కృ. ప్ర.
"శాసితుం యోగ్యః శిష్యః—పాణిని. 3-1-101

**అంతేవాసి :**

"అంతే గురుసమీపే వసతి తచ్ఛీలః :
శయ వాస వసిష్వకాలాత్"(పాణిని 6-6-18)
= (శిష్యుడు) వ్యు = (అంతే + వస + ణిని) కృ. ప్ర.
= చెంతనుండువాడు; గురువు దగ్గర గురువు ఇంటిలో నుండువాడు.
పాణిని : 4-3-130.

1. ఛాత్రుడు, 2. శిష్యుడు, 3. అంతేవాసి = శిష్యులనబడుదురు.

1. గురోరపచరిత్రం ఛాదయతీతి ఛాత్రః ఛద అవవారణే = గురువు యొక్క అసచ్చరిత్రమును కప్పువాడు.

2. గురోర న్తేనికటే వసతీ త్యన్తేవాసీ - వసనివాసే = గురువు యొక్క సమీపమున నుండువాడు.

3. శాసనీయః శిష్యః - శాసు అనుశిష్టౌ = శిక్షింపదగినవాడు.

(అమరకోశమునుండి)

**విద్య** : "అమృతం హి విద్యా"

"విద్య యామృతమశ్నుతే" (ఈశోపనిషత్-మనుస్మృతి)

**విద్య-అవిద్య**
**పరవిద్య-అపరవిద్య** } "దేవిద్యే వేదితవ్యే పరాచైవాపరాచ"

(ముండకోపనిషత్తు 1-1-4-5)

అన్న శ్లోకములో విద్యల రకములు తెలుపబడినవి.

పరమాత్మ బోధకము విద్య లేదా పరవిద్య యనబడును.

వేదవేదాంగములన్నీ దేహయాత్రా, లౌకిక నిర్వాహకము.

ఇవి అవిద్యలు, అపరవిద్యలు.

మోక్షసాధక ముపనిషత్ విద్య. దీనిని బోధించువా డాచార్యుడు.

(ఆచార్య సూక్తిముక్తావళి గ్రంథ ప్రధాన లక్ష్యమిదియే)

విద్యకు ప్రధాన లక్ష్యము అమృతప్రాప్తియే.

"విద్యాంచాఽవిద్యాంచ యస్తద్వేదో భయం తతః
అవిద్య యామృత్యుం తీర్త్వా-విద్యయాఽమృతమన్నుతే"

(ఈశావాస్యోపనిషత్-11)

**బ్రహ్మవిద్యలు** 32 గలవు. వీటిని గూర్చియు అధ్యయనము చేసినచో ఆధ్యాత్మిక గ్రంథము లర్థములగును.

**శిక్ష** : "శిక్ష విద్యోపదానే" (భ్వా-ఆ-సై) ధాతువు నుండి 'అ' ప్రత్యయము చేసి (కర్) 'టాప్' చేయుటవల్ల శిక్ష శబ్దమేర్పడినది. "శిక్ష్యతే విద్యోపాదీయతేఽనయేతి శిక్షా" ప్రాణి ఏ సాధనవల్ల, ప్రణాళికలవల్ల జ్ఞానము సంపాదించునో దాని పేరే శిక్ష.

**శాస్త్రము** : శాస = అనుశిష్టౌ + ష్ట్రన్ కృ ప్ర.

చట్టము; ఆయా విషయముల సమగ్రముగా చర్చించి తత్త్వమును నిరూపించు నిబంధము; జ్ఞానము; ఆజ్ఞ; పాత కథ.

**షట్శాస్త్రములు :** 1. శిక్ష - వ్యాకరణము - ఛందస్సు - నిరుక్తము - జ్యోతిషము - కల్పము.

2. తీర్థము - వ్యాకరణము - ధర్మశాస్త్రము - మీమాంస - వైద్యము - జ్యోతిషము.

**పంచయజ్ఞములు :** వేదపాఠము, వైశ్వదేవాదిహోమము, అతిథిపూజ, పితృతర్పణము, భూతబలి.

విద్యనుగ్రహించుట బ్రహ్మవిద్య : పరమ తత్త్వోపదేష్టయే గురువు. జిజ్ఞాసువు శిష్యుడు "గురువు" అను పదమే సర్వత్ర వ్యాప్తిలో నున్నది. తాంత్రిక ప్రధాన ధర్మ సంప్రదాయ మధ్యలో, ఆధ్యాత్మిక సాధనా క్షేత్రములో గురువు తప్పనిసరి.

1. ''తస్మాత్ సర్వప్రయత్నేన గురుణాదీక్షితో భవేత్'' (కులార్ణవ తంత్రము 14).

2. తస్మై విద్యానుప పన్నాయ - సమ్యక ప్రశాంత చిత్తాయ;
శమన్వితాయ, యే నాక్షరం పురుషం, వేద సత్యం
ప్రోవాచతాం తత్త్వతో విద్యామ్

(ముండకోపనిషత్తు 1.2.13.)

1. ఉపాధ్యాయుడు : "ఉపేత్యాధీయతే తస్మాదితి ఉపాధ్యాయః''
(సమీపమును బొంది యతనివలన నధ్యయనము చేయుదురు.)

2. అధ్యాపకుడు : "అధ్యాపయతి అధ్యాపకః"
(అధ్యయనము చేయించువాడు)

3 గురువు : ''గృణాతి ఉపదిశతి గాయత్రాదికం గురుః"
(గృశబ్దే గాయత్ర్యాదుల నుపదేశించువాడు)

1), 2), 3)=అమరకోశమునుండి.

**ఆచార్య సూక్తి ముక్తావళిలోని శ్లోకములు: 431వ పుట.**

"ఆచార్యదేవోభవ, దేవమివ ఆచార్యముపాసీత॥ (శ్రుతి)

స హరిసాక్షాత్ చరరూపి న సంశయః

హ్మ గురుర్దేవ పరాగతి॥

ష్మ గురుర్దేవ పరాయణమ్॥

**గురు స్వరూపము - లక్షణములు :**

ఆచార్య సూక్తి ముక్తావళిలోని ప్రసిద్ధాచార్య పురుషులలోను పీఠస్థుల లోను, సదాచార్యులలోను ఈ క్రింది లక్షణములలో అధికాంశము కన్పట్టును. భగవద్రామానుజులవారి లక్షణములన్నింటిని గలిగియున్నవాడు. ఇంకను విశిష్ట లక్షణములను గలిగియున్నవాడు గూడ అది వారి చరిత్రను పఠించినచో తెలియనగును.

(గమనిక : ఇవి 1988 వార్షిక సంచిక 'శిక్షాంక్' (హిందీ) పుట 259 లోనివి) రుద్రయామలము ఉ. 4-2 అనుసరించి.

1. శాంతుడు
2. జితేంద్రియుడు
3. కులీనుడు
4. శుద్ధ వేషధారి
5. పవిత్ర ఆచార్య సంపన్నుడు
6. సుప్రతిష్ఠుడు
7. శుద్ధుడు
8. దక్షుడు
9. సుబుద్ధి
10. గృహస్థుడు (ఆశ్రమమునవలంబించినవాడు)
11. ధ్యాన నిష్ఠుడు
12. మంత్రార్థ జ్ఞానమునిచ్చువాడు
13. నిగ్రహానుగ్రహ సమర్థుడు
14. మంత్రతంత్ర విశారదుడు
15. రోగహీనుడు
16. యజ్ఞవిధానము చేయువాడు
17. పురశ్చరణ (జపహోమ తర్పణ అభిషేక బ్రాహ్మణభోజనాదులు సంపాదకుడు
18. సిద్ధహితుడు మరియు అహిత వర్జితుడు
19. అహంకార రహితుడు
20. నిర్వికారుడు
21. మహాపండితుడు
22. వ్రాకతి
23. శ్రీసంపన్నుడు
24. అన్ని సుందర లక్షణములు గలవాడు
25. విశిష్ట వ్యక్తులచే సమాదరింప బడువాడు
26. ప్రాణాయమాది సిద్ధుడు
27. జ్ఞాని
28. మౌని
29. వైరాగ్య సంపన్నుడు
30. తపస్వి
31. సత్యవాది
32. సదాధ్యాన పరాయణుడు
33. ఆగమార్థముల విశేషజ్ఞుడు
34. స్వధర్మాచరణ తత్పరుడు
35. ఇష్టదేవతా చిహ్నముల ధరించుట

36. భావుకుడు
37. కళ్యాణకరుడు
38. దాసపరాయణుడు
39. లక్ష్మీవాన్
40. ధైర్యసంపన్నుడు
41. ప్రభుత సంపన్నుడు

ఇట్లే సమ్మోహనతంత్రము, కులార్ణవతంత్రము, తంత్రరాజతంత్రము మొదలగు వానిలో గురుస్వరూపము వర్ణితము.

**గురుతంత్రములో నిట్లు గలదు:**

1. శిష్యుని ధనమునపహరించు గురువులు చాలమంది గలరు. కాని
2. శిష్యుని హృదయ సంతాపమును దూరము చేయువారు దుర్లభులు

కాబట్టి

3. శిష్యుని అభ్యుదయము, యోగము మరియు నిశ్రేయము మోక్ష ప్రదానము చేయు గురువు మాత్రమే శ్రేష్ఠుడు.

**అమరకోశములోని ఈ క్రింది పదముల కర్తృడై యుండవలయును** (పుట 439.)

''విద్వాన్విపశ్చిద్దోషజ్ఞస్సన్సుధీః కోవిదోబుధః
ధీరోమనీషీజ్ఞః ప్రాజ్ఞసంఖ్యావాన్ పండితఃకవిః
ధీమాంత్సూరిః కృతి కృషిర్లబ్ధవర్ణో విచక్షణః॥''

**గురుశిష్య సత్సంప్రదాయము : సంబంధము :**

విశిష్టాద్వైత సంప్రదాయములో గురుశిష్య సంబంధము సత్సంప్రదాయము పెట్టనికోటవలె కనిపించును గమనింపుడు

''శిష్యార్పితేన శుచినా ద్రవిణేన తుష్టాః
శ్శిష్టాముకుంద శరణాగతి ధర్మనిష్ఠాః
సత్సంప్రదాయ నియమ ప్రయతాస్సదాయే
తేభ్యోనమాంసికరవై వరవైష్ణవేభ్యః[1]

గురుపరంపరత నియన్లు :తిరునక్షత్ర, నిత్యతనియన్‌లలోని విశేషణము లలో ఈ సంబంధమెంత గాఢముగా నిబద్ధింపబడినదో మనము చూడగలము.

# ఆచార్య సంప్రదాయము

"అస్మద్దేశిక, మస్మదీయ పరమాచార్యాన, శేషాన్ గురూన్
శ్రీమల్లక్ష్మణ యోగిపుంగవ, మహాపూర్ణౌ, మునిం యామునం,
రామం, పద్మవిలోచనం, మునివరం నాథం, శఠద్వేషిణమ్
సేనేశం, శ్రియ, మిందిరా సహచరం నారాయణం, సంశ్రయే."

అని శ్రీవైష్ణవ సంప్రదాయజ్ఞులు, ఆచార్య సమాశ్రయణమును బొందిన వారు, విశిష్టాద్వైతమత సంబంధులు, దీక్షగైకొన్నట్టివారు, పంచ సంస్కారపరులైన పిమ్మట అనుసంధించే శ్లోకగురుపరంపరమిది. ఆచార్య ప్రాధాన్యతకిది మూలకందము. సంప్రదాయమునకు ప్రాణాధారము.

శ్రీవైష్ణవ ధర్మములో మనకు తఱచుగా కన్పించు శబ్దములు "ఆచార్యుడు-ఆచార్యపరంపర - గురుపరంపర - ఆచార్య సంప్రదాయము, ఆచార్యనిష్ఠ - ఆచార్య సమాశ్రయణము - ఆచార్య శరణాగతి - ఆచార్యాశ్రయము-ఆచార్యావతారము - (ఇట్లే గురుశబ్దమునకు పైవివరణముల నన్వయించి చెప్పుట) ఆచార్య సంభావన - ఆచార్యానుగ్రహము - ఆచార్యాభిమానము-ఆచార్య శిష్యసంబంధము-ఆచార్యుల సేవించుకొనుట - విద్యలను, శ్రీ భాష్యాదుల - దివ్య ప్రబంధముల నధికరించుట - ఆచార్యుల కాలక్షేపములు, ఆచార్యోపదేశములు" మున్నగునవి.

ఆచార్య సూక్తి ముక్తావళిలో పైవిషయములన్నియు సందర్భాను సారముగ కవి ఉటంకించుచు వలసిన తావులలో వివరణల నొసంగినాడు. గ్రంథము పేరును సార్థకపఱచునట్టి సమర్థనములు మనకెన్నియో గోచరించు చుండును. ప్రమాణములకు సాధికరమైన ఉపపత్తులు విదితమగును. ఆచార్య సంప్రదాయములో చేరునట్టి కొన్ని ముఖ్యాంశముల నిట వివరించుచున్నాను:

**ఆచార్యుని ఆవశ్యత - విశిష్టత - మంత్ర ప్రాధాన్యత :**

1) మత సంబంధమైన మంత్రమును, మంత్రార్థమును ఉపదేశించినవాడే ఆచార్యుడు. ఎందుకనగా మంత్రము:
"మంతారం త్రాయతే ఇతి మంత్రః"
మననము చేయువారిని రక్షించును అని మంత్రమున కర్థము.

2) "గురుం ప్రకాశయేత్ ధీమాన్ మంత్రం యత్నేన గోపయేత్"

ఇచట మంత్రము అమూల్యమైనది. రత్నమును పెట్టెలో భద్రపరచి నట్లు మంత్రమును దాచియుంచవలయునుగానీ వెల్లడి సేయరాదు. ఆ మంత్రము నుపదేశించినవానిని ఆ మంత్రార్థమును సుబోధకమొనర్చిన ఆచార్యులను భక్తితో నారాధించవలయును. ఆచార్యానుగ్రహమున దీనిని బడయగల్గితినని అతనిని ప్రకటించవలయును.

3) మంత్ర మహిమను నోటిమాటలలో నుడువలేము. అందులో మంత్ర రాజ (పరమ మంత్రము) (ఓం నమో నారాయణాయ) మహిమ వర్ణనాతీతము, మోక్షప్రదము, అతి రహస్యమైనది. అర్హతగల ఆచార్యుని ద్వారానే దీని నుప దేశము పొందవలయును. తా నింకొకరికి చెప్పరాదు. ఈ నిబంధన సంప్రదాయ బద్ధము. కాని, రామానుజులు వెల్లడి చేసినారు. గోష్ఠిపూర్ణులు రామానుజుల కుపదేశించిన మంత్రమిది. వీరి సంభాషణ ఘట్టము ఆ సూ.ము.లో చక్కగా వర్ణింపబడినది.

**గోష్ఠిపూర్ణుల రామానుజుల సంవాదము, పుటలు 172, 173**

"గురునాజ్ఞమీరిన కుమతికే గతియన్న-నరకమేయని యతినాథుడనియె.
"నతిగుహ్యామీ మంత్రమన్యులకెవరికి జెప్పరాదని నీకు జెప్పినపుడె
యట్లాచరించెదననిపోయి మంత్రము గొల్లబెట్టితివిది ఘోర నరక
హేతువని తెలిసియుండియు నేలయిట్లు సాహసము జేసితివి నీవు
సత్యనిధివి తెల్పుమన;"

**రామానుజుల సమాధానము :** "సర్వజ్ఞ నీ యాజ్ఞ సలుపని కతన పీనికి నొక్కరునికి పోసిరయ బాధ భవదుపదిష్టమౌ పరమంత్రము విన్నవారు వారిని జెందువారు ముక్తులై వైకుంఠమున సుఖించెదరిదె తగు"నను నా మహౌ దార్య నిధిని.

**ఎంబెరుమానారు అను బిరుదు :** "ఎంబెరుమానారె, యిందురమ్మని పిల్చి యనంబి కౌగిటనప్పళించి సద్గురుడవె నీవెపో జనుల కెల్ల - మా కొఱం తలు దీరె నీ మహిమ కతననుచు బల్కెను యతిపతికప్పుడనుచు" వాదిభీకర గురుడనె మోదమలర.

ఈ సంఘటన జరిగిన స్థలము :

గోష్ఠిపురము - తిరుక్కోట్యూరు - శ్రీ నరసింహస్వామి దేవాలయము - శ్రీవైష్ణవసమూహము.

ప్రపన్నామృతములో గూడ చక్కగా వర్ణింపబడినది.

గోష్ఠీపూర్ణు లాతని నాశీర్వదించియిట్లు ప్రకటించెను : జగద్గురువని సంబోధించెను.

**శ్రీవైష్ణవ సిద్ధాంతము; వైష్ణవ సిద్ధాంతము; రామానుజార్య సిద్ధాంతము; రామానుజ సిద్ధాంతము; వైష్ణవదర్శనము. దీనినే రామానుజ సంప్రదాయము, ఆచార్య సంప్రదాయము అనవచ్చును.**

"ఇత్యుక్త్వా లక్ష్మణాచార్యం - గోష్ఠీపూర్ణః ప్రహృష్టధీః మన్నాథ! ఇతి హర్షేణ తంతదాపరిషస్వజే, తత్రత్యాంస్తాం త్సపూర్ణార్య - వైష్ణవానిదమబ్రవీత్"

"అయం వైష్ణవసిద్ధాంతో హ్యస్మాభిః త్వద్యవైష్ణవాః రామానుజార్య సిద్ధాంత ఇతి సర్వత్ర కీర్తితః ఏతదారభ్యలోకేస్మిన్ శ్రీమద్వైష్ణవ దర్శనం, రామానుజార్య సిద్ధాంతం - ఇతి సత్యం భవిష్యతి.

తతః ప్రభృతిలోకేస్మిన్ ఇదం వైష్ణవ దర్శనం రామానుజార్యసిద్ధాంతం- ఇతి సర్వత్ర ప్రకాశితః."

ప్రపన్నామృతములోని శ్లోకము - ఏకవింశోధ్యాయః - పుటలు. 61.69.

సంప్రదాయములో మార్పులు జరుగుచుండును:

లోకము నుజ్జీవింజేయుటకై రామానుజులు గుర్వాజ్ఞను ధిక్కరించిరి. మొదటి గురువైన యాదవ ప్రకాశకుల బోధనలోని వాక్యములకు వేరొక సరియైన అర్థమును చెప్పి అతని వదలివేసిరి. సంప్రదాయములో సంస్కరణలు చేసి కులమత భేదములను నిరాకరించిరి. సదాచార్యావశ్యకతను నొక్కి వక్కాణించారు.

3) లౌకిక విద్యలున్నవి. అవి అవిద్యలు, అపరవిద్యలు, సంసార నిర్వాహణమును తెలుపునట్టివి. వీని నెవ్వరైనను బోధించవచ్చును. కాని, అలౌకిక విద్యలు అనగా నిజమైన విద్యలు, సారతమార్థవిద్యలు (పేయాళ్వారులు తిరుమళిశై యాళ్వారుల కుపదేశించినట్టి విద్యలు) పరవిద్యలు అనగా పరమాత్మ విషయమును, భవతరుణోపాయమును తెలుపువాడే ఆచార్యుడు.

"మంత్ర వ్యాఖ్యా కృదాచార్యః" అమరము

4) వేద వేదాంగములన్నియు లౌకిక యాత్రా నిర్వాహకములు. కాని మోక్షోపాయ సాధకమగు విద్య ఉపనిషత్ విద్య. దీనిని బోధించువా డాచార్యుడు. లౌకిక విద్యలకే గురువు కావలయునన్నచో పరవిద్య విషయము వేరుగా చెప్పవలసిన పనిలేదు.

''ఆచార్యవత్తమయా మోక్షమామనంతి - స్మరంతిచ -
ఇహా ముత్రచ తత్పాదౌ శరణం దేశికా విదుః॥''

అని, ఆచార్యుడు గల్గుటచేతనే మోక్షము.

**ఆచార్యావతారము :**

లోకోజ్జీవనమునకై భగవంతు డెన్నియో అవతారములు దాల్చినాడు. అవతారములు గుణములు ప్రవహించు తూములవంటివి. ఒక్కొక్క అవతారములో ఒక్కొక్క కల్యాణ గుణము ప్రకాశించును.

(1) శ్రీ రామావతారమున శరణాగత పరిత్రాణము గలదు.

(2) శ్రీకృష్ణావతారమున ఆశ్రిత సౌలభ్య ప్రకాశము గలదు.

ఈ యవతారములకు ప్రధాన విభాగములు ఐదు.

ఇవి వరుసగా : (1) పర (2) వ్యూహ (3) విభవ (4) అంతర్యామి (5) (5) అర్చావతారము. ఇదిగాక ఆఱవ విభాగము (6) ఆచార్యావతారము.

రామకృష్ణాద్యవతారములతో పని పూర్తి కాలేదు. జనుల నుజ్జీవింపజేయవలసియున్నది. ''సంభవామి యుగే యుగే'' మళ్ళీ పునరావృత్తి కావలెను. శ్రీ మన్నారాయణుడు తన ఆయుధవిశేషములకు, నిత్యసూరులకు, చిహ్నములకు ద్రవిడభూభాగంబున బుట్టవలసినదిగా నాజ్ఞాపించినాడు. వారు భూలోకములో జన్మించిరి. (ఆ. సూ. ము. పుటలు. 2,3) ఇంకను పనిమిగిలియున్నది. అందుకే నాథమునులనుండి రామానుజులు ఇంకను బాపితరము వరకు గల ఆచార్యులలో తన అంశలను ప్రవేశింపజేసి ఆచార్యావతారముల దాల్చినాడనుట సర్వాంగీకార్యమైన విషయము; చరిత్ర ప్రసిద్ధము.

2. "చరమస్యావతారస్య, గురురూపస్యమేసదా" అనియును,

"...

నారాయణుడు మనుష్య దేహమును (ఆచార్యునిగా) దాల్చి, శాస్త్రమును చేతినూతగా నొసంగి చేతనుల నుద్ధరించును.

**ఆచార్యుని ప్రాధాన్యతను తెలుపు శ్లోకములెన్నియో గలవు :**

1. బ్రహ్మవిద్యోప నిషత్తు 'గురురేవ హరిస్సాక్షాత్
నాన్యఇత్య బ్రవీత్ శ్రుతిః'
2. 'శ్రుతివాక్యమ్ 'ఆచార్యదేవోభవ'
3. యోగశిక్ష 'గురుర్బ్రహ్మ గురుర్విష్ణుః గురుర్దేవస్సదాచ్యుతః,
నగురోరధికః కశ్చిత్ త్రిషులోకేషు విద్యతే'
4. శ్రీ వేదాంత దేశికుల రచన 'అధ్యాసీన తురంగ వక్త్రవిలసజ్జిహ్వాగ్ర సింహాసనా దాచార్యాదిహ దేవతాం సమధికామన్యాన్న మన్యామహే
యస్యాసా తనుతే కదా చిదజహద్భూమా స్వయం, భూమికాం,
మగ్నానాం భవినాం భవార్ణవ సముత్తారాయనారాయణః'
5. ముముక్షుజన కల్పకము (తెలుగు) అఖిలవేదాంత రహస్య ప్రవర్త కాచార్య పరంపరా జన్మభూమి చేతనా చేతనశేషి వరవ్యూహ విభ వాంతరాత్మార్చ్య వేషధారి అతడు లక్ష్మీశుడు.'

6) ప్రపన్నామృతములోని ఆచార్యవైభవమునం దెన్నియో దృష్టాంత ములు గలవు (63 వ అధ్యాయము 181, 182 పుటలు.)

"హరిణా జ్ఞాపితోనంతో లోకరక్షణాయసః
అవతీర్ణోభవద్భూమ్యాం సర్వలోకైక దేశికః
రామానుజాభిద శ్శ్రీమాన్ భగవాన్ కరుణార్ణవః"
"పాపిష్ఠ క్షత్రబంధుశ్చ - పుండరీకశ్చ పుణ్యకృత్
ఆచార్యవత్తమయాముక్తా - తస్మాదాచార్యవాన్ భవేత్"
"ఆచార్యస్సహరిస్సాక్షాత్ - చరరూపేన సంశయః
మగ్నానుద్ధరతేలోకాన్ - కారుణ్యాచ్ఛాస్త్రపాణినా॥"

7) ఆచార్య సంభావన శ్రీ వేదాంతదేశికుల రహస్యత్రయసారము : గురుదక్షిణను గూర్చి ఇందులో విపులాతి విపులమైన విశేషాంశములు గలవు.

The Path of spiritual Tradition : "ఆచార్యుని ఉపదేశమును భరనిన పిమ్మట దక్షిణ సమర్పించినాను బాకీ తీరిపోయినది" అని ఊరుకోరాదు.

రామాయణాది గ్రంథములలో కన్పించును.

రహస్యత్రయ సారము: (అధ్యాయములు 30, 31 : 1) ఆచార్యవిధులు, 2) ఎవరికి విద్య గరపవలెను? ఎట్లు? విద్యా స్వభావమేమి? 3) శిష్యుని విధులేమి? 4) అతని ఆచార్య సంసేవన మెట్లుండవలయును? గురు పరంపర ధ్యాన ప్రాధాన్యత మున్నగునవి సోదాహరణముగా చర్చించబడినవి.

ఆచార్య సంప్రదాయము- Acharya Sampradayamu : The true Acharya collects together the meanings of the three great secrets (మంత్రములు) whose delighful flavour cannot like the milk of Lioness be appreciated by strangers. He makes a brief summary of rhem and then meditates on them."

ఇట్లెన్నియో వివరణలు గలవు. అనువాదము : M. R. Rajagopal Ayyangar.

**ఆచార్యుడే అంతిమోపాయము : ఆచార్యనిష్ఠ,**
**ఆచార్య సమాశ్రయణము : ఆచార్యాభిమానము:**

ఇట్లెన్నియో సంప్రదాయ బద్ధములైన పదములు కన్పించుట గలదు. అన్నింటిని మూల్యాంకనము (Evaluation) చేయగా తేలునదేమన- ఆచార్యుడే అంతిమోపాయము.

**మహానారాయణోపనిషత్తు :**

ఇందులో విషయములు స్పష్టముగా గలవు.
"సకల వేదశాస్త్ర సిద్ధాంత రహస్యం"1

శ్లో॥ జన్మ జన్మాంతరాభ్యస్త మహత్తర సుకృత
పరిపాక వశాత్ సద్భిస్సంగో జాయతే।
తస్మాత్కర్తవ్యాకర్తవ్య వివేకో భవతి
తతస్సదాచార ప్రవృత్తిర్జాయతే॥
సదాచార దఖిల దురితక్షయాద్భవతి
తస్మాదన్తః కరణమత్యంత నిర్మలం భవతి,

తతస్సద్గురు కటాక్షమన్తః కరణ మాకాంక్షతి
సద్గురు కటాక్షలేశ విశేషేణ - సర్వసిద్ధయ
సిద్ధ్యంతి సర్వాణి శ్రేయాంసి స్వయమేవ
అయాన్తి, యిధా జాత్యన్ధస్య రూపజ్ఞానం
నజాయతే, తథాగురూప దేశేన వినా, కల్ప
కోటి శతై రపితత్త్వ జ్ఞానం నజాయతే
తస్మాద్గురు కటాక్ష విశేషేణ తత్త్వజ్ఞానం
భవతితథా భగవత్కథా శ్రవణధ్యానాదౌ
శ్రద్ధాజాయతే॥ ఇత్యాది........

**అర్థ వివరణము :**[2]

అనేక జన్మలలో గొప్ప సుకృత పరిపాకమువలన సత్పురుషులతో సహవాసము లభించుచు, దానివలన చేయదగిన వాని, చేయరానివాని మంచి చెడ్డలు తెలియును. దానివలన మంచి పనులయందే ప్రవృత్తి కలుగును. ఆ సదాచారము వలన సమస్త పాపములును హరించి, అంతఃకరణము నిర్మలమగును. దానిచే సకల సంసిద్ధులకును మూలమైన గురుకటాక్షము బడయవలెనను కోరిక జనించును.

అట్టి ఆచార్య సమాశ్రయణమువలన సకల బంధములును సమూలముగా నశించును. మోక్షమార్గమున కడ్డువచ్చు పాపములన్నియు పోవును. సకల శ్రేయస్సులును తమంతతామే వచ్చి చేరును.

పుట్టుగ్రుడ్డికి ఎంత వెలుగున్నను వస్తువు యొక్క రూపము తెలియనట్లే గురూపదేశములేక కోటికల్పములు గడచినను తత్త్వజ్ఞానము ఉదయించదు. కావున గురుకటాక్షమేమాత్రమున్నను తత్త్వజ్ఞానము వెంటనే పుట్టును. అంతట భగవత్కథలను వినవలెననియు, భగవంతునికి నమస్కరించవలయునని శ్రద్ధ, త్వర జనించును.

అని యీ విధముగ నీ యంతిమోపాయమగు ఆచార్యనిష్ఠ నీయుపనిషత్తు విధించుచున్నది.

దీనిని ఆధారముగ తీసికొనియే మన శ్రీ వరదమిత్రులు-

''సత్సంగాత్ భవనిస్పృహోగురు ముఖాత్

---

1, 2. విశిష్టాద్వైత విశిష్టత - శ్రీ గోపాలాచార్య, పుట - 27.

శ్రీశం ప్రపద్యాత్మవాన్'' అను శ్లోకమును రచించి శేషపూర్ణమును (మిగిలిన పైన చెప్పవలసిన దానినంతను) చెప్పివేసిరి.

స్తోత్రరత్న భాష్యమందుగల వేదాంతదేశికుల వ్యాఖ్యానము ఆచార్య ప్రభావమును - ఆచార్యాభిమానమును తెలుపును.

**ఆచార్యుని అధికత్వము భగవంతునికన్న ఆచార్యుడే అధికుడు:** ఎన్నియో నిదర్శనములు గలవు.

1. మధురకవుల "కణ్ణినున్‌శిరుత్తాంబు" ఆచార్యస్తుతియేగదా(ఆ.సూ.ము పుట 76.)

2. శ్రీమన్నాథమునులు 12,000 సార్లు కణ్ణినున్ శిరుత్తాంబును అనుసంధించి శఠకోపులను ప్రత్యక్షము చేసికొనిరి. 81,82.

3. రామానుజుల ప్రభావమును భగవంతుడు మొదలుకొని ఎందరో ప్రకాశిత మొనర్చిరి.

4. తిరునక్షత్ర తనియన్లు నిత్య తనియన్లు ఇందులకుదాహరణములు.

5. ఆచార్యుల స్తోత్రములను పరిశీలింపనగును.

**శిష్యసంచారము :** ఆచార్యులు తమ శిష్యులున్న గ్రామములకు వెళ్లుట అనగా శిష్య సంచారము - యాత్ర - రామానుజుల కాలమునుండి నేటివరకు కొనసాగుచునే యున్నదని ఈ కథ వలన గ్రహించగలము. గురువులను గౌరవించు పద్ధతులున్ను తెలియనగును.

విశిష్టాద్వైత దర్శన సంప్రదాయములో ఆచార్య సమాశ్రయణము, ఆచార్య ప్రపత్తి, ఆచార్య నిష్ఠల కెనలేని ప్రాధాన్యత గోచరించును. ఇట్టి ప్రత్యేకత, విశిష్టత, ఇంత గాఢముగా ఇతర గ్రంథములందు కన్పట్టదేమో! "నభూతో నభవిష్యతి" అన వచ్చును.

1. ఆశ్రయించిన శిష్యులకు మొదట పంచసంస్కారములు గావించుట, అటు పిమ్మట కాలానుసారము హితబోధనాది కార్యక్రమములు క్రమపద్ధతిలో నిర్వహింపబడును.

2. శ్రీపాదతీర్థమును సేవించుట - మంత్ర మంత్రార్థముల నవగతము చేసికొనుట - దివ్యప్రబంధానుసంధానము, ఆచార్య సంసేవ - తిరువారాధన క్రమము - భగవద్భాగవతాచార్యుల సంపూజనము, తదీయారాధనము - ఇట్లెన్నియో విశేషాంశములున్నవి. వీటిని కావ్యపరిశీలన విభాగములో సందర్భాను

3. ఆచార్యుని నారాయణ స్వరూపునిగా భావించి "ఆచార్య తిరువడిగళే శరణం" అని జీవితాంతము నమ్మకొని ఆదర్శముల నాచరణలో పెట్టువారు ఇప్పటికిని గలరు. ఆళ్వారుల స్తుతులేగాక ఆచార్య పరంపరాస్తుతులు, స్వాచార్య స్తుతులు చేసిన తెలుగు కవులెందరో గలరు. వేలకొలది స్తుతిపద్యములున్నవి. నేను 100 కి పైగా గ్రంథముల పేర్లు సేకరించినాను. ముందు ముందు కొన్నింటిని గూర్చి అతి సంగ్రహముగా వివరించగలను.

**ఆచార్య శిష్యసంబంధము - విద్య :** ఈ గ్రంథమంతయు దీనికుదాహరణ ప్రాయమే యగును. ఇందలి సదాచార్య - సచ్ఛిష్య సంబంధములు సమస్త మానవాళికాదర్శశోభితములు ఉదా॥ రామానుజులు - కూరేశుల సంబంధమును చదువుకొనవచ్చును. "సచ్ఛిష్యునకు - సదాచార్యునకొక తారతమ్యము లేదని తలచిరపుడు" (ఆ.సూ.ము. పుట 331).

విశ్వవాఙ్మయములో గురుశిష్య సంబంధము అనాదియైనదిగా, ఆత్మీయమైనదిగా సాగుచు సార్వజనీనమై, సార్వకాలికమై సారత మార్గమైనదిగా గాంచగలము.

**సంప్రదాయ శబ్ద వివరణము** — సంప్రదాయ పదమునకు నైఘంటికార్థములు గలవు. ఇక వివరణములు, నిర్వచనములు రకరకములు. బహుళము. ఆంగ్లములో సమానార్థకము= TRADITION అనునది.

**తెలుగు నిఘంటువులలో :** 1. గురు పారంపర్యము.

2. వంశాది పరంపరగా లభించిన జ్ఞానము.
3. ఆయా దేవతామూర్తులను పూజించుట కేర్పడియున్న ఒక విశిష్ట విధానము.
4. పాదుకొన్న ఆచారము.
5. కానుక - బహుమతి - సంప్రదానము.

**వ్యుత్పత్తి :** (సమ్ + ప్ర + ధా + ల్యుట్ ‌ యుక్) కృ. ప్ర.

సంప్రదాయములో మార్పులు చేర్పులు కాలానుగుణ్యముగ జరుగుచునే యుండును. ప్రతిభామూర్తులు, శిష్టజనులా పని గావింతురు. శాశ్వత సత్యముల విడనాడకయే నూతనత్వము నాపాదించి సంస్కర్తలుగా ఇతరులకు మార్గదర్శకులగుదురు. ఒక్క సాహిత్యమునందేకాదు-

"యద్యదాచరతి శ్రేష్ఠస్తత్ర దేవేతరోజనః
సయత్ర్పమాణం కురుతే లోకస్తదనువర్తతే" —గీత 3-21.

**వాక్యముల రూపములో, తనియన్‌ల రూపములో గురుపరంపరల ననుసంధించు సంప్రదాయము:** నాథమునుల కాలమునుండి నేటివరక కవిచ్ఛిన్నముగా కొనసాగుచునేయున్నది. ఆ.సూ.ము.లో 74 వ్యక్తుల (ఆచార్యుల) తనియన్‌లు గలవు. తనియన్ అనగా ప్రత్యేకతను తెల్పునదని భావము. ఇందు ప్రతిపాద్యాంశము, కథావస్తువు, గుణప్రతిభా విశేషణములు గోచరించును కవితాశిల్పమున్ను ద్యోతకమగును. నిత్యానుష్ఠాన క్రియలలోను, దివ్య ప్రబంధానుసంధాన సమయమందు వీటిని శ్రీవైష్ణవులు తప్పక సాయించుదురు. ప్రారంభములో "సాయిత్తృశాపసాయించవలె" అని సేవాకాలమందనుసంధింతురు. సంస్కృతములోను, తమిళములోను తనియన్లు గలవు. తిరునక్షత్ర తనియన్లు, నిత్య తనియన్లు గలవు. ఆచార్యప్రశస్తి గురుశిష్యసంబంధము, చారిత్రకాంశముల జోడింపుల నిందు కాననగును.

**సంప్రదాయ నిర్వచనములు వివరణములు :**

రామానుజుల జీవితములోని ప్రసిద్ధ ఘట్టముల కన్వయము చేసికొనవచ్చును. రామానుజ సిద్ధాంతము. ఇదియే రామానుజ సంప్రదాయమైనది. మార్గదర్శకుడు రామానుజులు. విశిష్టాద్వైత దర్శనమును గాఢముగా పుడమియందు నాటుకొనునట్లు సుప్రతిష్ఠము గావించినాడు.

1. "పారంపర్యముగా, అనుశ్రుతముగా, తరతరాలుగా, అనుస్యూతముగా వచ్చే కొన్ని నమ్మకాల యొక్కగాని, కర్మలయొక్క గాని సమూహానికి సంప్రదాయమని చెప్పవచ్చును."

2. "మానవుని జీవితములోని సమస్తాంగములయందు సంప్రదాయము పూసలలోని దారమువలె నుండును. జాతి జీవిత సౌధమున కది పునాదివంటిది. సత్ సంప్రదాయ మెల్లప్పుడు జీవనదివలె ప్రవహించుచుండును. సాంఘిక జీవన క్షేత్రమునగాని, సాహిత్యాదిరంగములలోగాని సంప్రదాయమే ప్రబల శక్తిగా దేశ కాల పరిస్థితుల దృష్ట్యా సామాజిక పరిణామమునకు ఏ సంప్రదాయము మాత్రమే స్వీకరింపదగినది."

3. సంప్రదాయావతరణము :- "ప్రతి నూత్న మార్గము (సిద్ధాంతము) కొన్ని నాళ్ళకు సంప్రదాయమైపోవును. క్రమముగా నడచువారి సంఖ్య అధికము కాగా ఆ బాట అరగిపోయి, అగమ్యమైపోవును మరల ఒక శ్రేష్ఠుడు బయలు దేరి, ప్రక్క నుండి క్రొత్త బాట ప్రారంభించును. ఈ బాట కూడ నేలపై వేసినదే కావున అదియు సంప్రదాయమైపోవును. నేలపైగాక గాలిలో వేసిన బాట సంప్రదాయము కాజాలదు."

శంకరుడు, రామానుజుడు, వివేకానందుడు మున్నగు ప్రవక్తలు కొన్ని సంప్రదాయములను ప్రతిష్ఠించిన మహానుభావులు. వారు నాటిన సంప్రదాయములు నేటికి చెక్కుచెదరక నిలిచియున్నవి.

(ఆచార్యావతార మహిమనుగూర్చి): ప్రాధాన్యతను గూర్చి: ఆ.సూ.ము. లోని ఒక ఘట్టము: పరిత్తికొల్లైనాచ్చియారు వైభవములో గాంచనగును.

**54 వ పద్యము:**

"తొలి జన్మములయందు దొడ్డపుణ్యంబేమి సలిపితిమో యెట్టి సత్తపంబు"

**55 వ పద్యము:**

"తమ పూర్వ కర్మబందములచే జీవుల
గములు సంసారచక్రమున దగిలి,
పుట్టుచు గిట్టుచు భూరి దుఃఖములచే
వ్యాకులపడగ నవ్యాజ కృపను
వారిని క్రీగంట నారాయణుడు చూచి,
అచార్యరూపియై యవతరించి,
జ్ఞానాంజనశలాక జక్షురున్మీలన
మొనరించి వారల నుద్ధరించె,

గాన గుర్వర్థమయ, పశుకాయ విత్త
ధాన్యవస్త్రు గృహాదుల దాల్చునెవ్వ
డతడె శిష్యుడది యెంచె నబల యనుచు
వాది భీకర గురుడనె మోదమలర!"

ఈ శ్లోకము స్ఫురించును: "అజ్ఞాన తిమిరాంధస్య జ్ఞానంజనశలాకయా, చక్షురున్మీలితం యేన తస్మై శ్రీ గురువే నమః"

1.2.3. : ఆధునికాంధ్ర కవిత్వము - సంప్రదాయములు - ప్రయోగములు: 1989

**57 వ పద్యము:**

"పొలుపారు నాల్గు విభూతులుగలవేని
యతీశ్వర దయ మలరునేని........"

ఈ సందర్భమున వరదార్యుడు తన భార్యను ప్రశంసించుచు అన్నమాటలు:

**66 వ పద్యము:**

"ఏ వృత్తిచేనైన నిల ధనమార్జించి
తత్త్వబోధకుడైన తన గురునకు
స్థితియొనర్చినవాడె యంతే నివాసి
యన్యు డాచార్యవంచకుడనుచు సతిని
చాల మన్నించి పలికె నా సౌమ్యుడనుచు
వాది భీకర గురుడనె మోదమలర!"

ఇట్లు "ఆచార్య సంప్రదాయము" నాటికుండి నేటివరకు కొనసాగుచనే యున్నది.

## తెలుగుసీమలో ఆళ్వారాచార్యులకుగల గౌరవస్థానము

**తెలుగు సాహిత్యములో ఆళ్వారాచార్యులను గూర్చిన సంస్తుతుల వైభవము: (ఆళ్వారుల - ఆచార్యుల విశిష్టాద్వైత సిద్ధాంత ప్రశస్తిని తెలుపునట్టి యుదాహరణములు కొన్ని : )**

ఆళ్వారుల - ఆచార్యుల ప్రసక్తిని, ప్రశస్తిని నిరూపించుటకుగాను (ఎందు కనగా ఆ.సూ ము. శీర్షిక తత్సంబంధి గనుక) 70 గ్రంథముల వరకు పరిశీలించనైనది. దీని వలన శ్రీవైష్ణవ మత పరివ్యాప్తి అర్థమగుటయే గాక, సంఘములో ఆళ్వారుల - ఆచార్యుల కెట్టి ఉత్కృష్టమైన, ఉన్నతమైన, గౌరవప్రదమైన, పవిత్రమైన స్థానము గలదో అర్థము చేసికొనవచ్చును. రాజుల ...ండి ప్రజాస్వామిక యుగము వరకు ఈ ఆచార్య సంభావనమును ...ను.

ఇట్టి ఆళ్వారుల, ఆచార్యుల జీవిత చరిత్రల వైభవములను భగవద్గుణాను భవముగల భక్తుల పాలిటి కొంగుబంగారముగా, రసరమ్యమైన, మృదుమధుర మైన, సలలితమైన శైలిలో చిత్రీకరించి మహాకావ్యముల నిర్మాణము గావించిన వారెంతో ధన్యజీవులు.

అట్టి కొందఱిలో ఒకరైనవారు శ్రీ నంబూరి కేశవాచార్యులవారు. వారు రచించిన గ్రంథరాజమే ఆ. సూ. ము. ఇది ఒక గొప్ప సంస్తుతి కావ్యమే యన నొప్పను. మరి సంస్తుతులను పరిశీలించుట ద్వారా తేలునట్టి విషయమేమని ప్రశ్నవేసికొన్నచో - చారిత్రకాంశములతోబాటు ఆచార్యుల గొప్పదనము, ఆచార్య ప్రపత్తి, ఆచార్య పరంపరా ప్రభావము మొదలగు విశిష్టాంశములు వెల్లడియగును. ఇట్లే ఆ.సూ.ము. రచింపబడుట సార్థకమే యని నిరూపిత మగును. శ్రీవైష్ణవ ధర్మముల తెలిసికొనుట కాధారములు లభించును. ఆంధ్ర ప్రదేశ్‌లో శ్రీవైష్ణవ మత ప్రభావమును, పరివ్యాప్తిని అంచనా వేయవచ్చును. ఆచరణాత్మకముగా ఆచార్లు లెట్లు గౌరవింపబడిరో తెలియనగును.

**తెలుగు సాహిత్యములో ఆళ్వారాచార్యులను గూర్చిన సంస్తుతులు :**

**పరిశీలింపబడిన గ్రంథములు :**

1. పద్య సాహిత్యము, గద్యసాహిత్య గ్రంథములు = 61
2. జానపద సాహిత్య గ్రంథములు = 11
3. అముద్రితములు, ఇతర ప్రక్రియాలలో లభ్యమగునట్టివి కొన్ని.
4. కావ్య, శతక రూపములు దాల్చిన స్తుతులు = ఎన్నియో గలవు.

గమనిక : అన్వేషణ కొనసాగించినచో ఎన్నియో గ్రంథములు లభించును. పరిశీలించవలసినదిగా సవినయ ప్రార్థనము.

**గ్రంథముల పేర్లు :**

1. ఆముక్తమాల్యద
2. సకలజీవ సంజీవనము
3. మనుచరిత్ర
4. ప్రబంధరాజ వేంకటేశ్వర

9. భోజరాజీయము
10. పాండురంగ మాహాత్మ్యము
11. మూర్తిత్రయోపాఖ్యానము
12. పరమయోగి విలాసము (ద్విపద)
13. పరమయోగివిలాసము (వృత్త)
14. అష్టమహిషీ కల్యాణము
15. రామాభ్యుదయము
16. క్షత్రబంధూపాఖ్యానము
17. శ్రీ రాధికామనోహరీయ ప్రబంధము
17/1. పద్మపురాణము (మడికి సింగన)
17/2. వాసిష్ఠ రామాయణము (మడికి సింగన)
18. అముద్రిత పద్యములు
19. శ్రీయతి రాజీయము
20. దివ్యపాదుకలు
21. పంచామృతము
22. కవితాశారద
23. ద్వాదశసూరి చరిత్ర
24. ఆండాళ్ వైభవము
25. శ్రీ శఠకోప చరిత్రము
26. శ్రీ రామానుజ శతకము
27. దివ్యముని త్రయము
28. ఆంధ్ర తిరువాయి మొళి
29. రైతు రామాయణం
30. సింహగిరి వచనములు
31. శ్రీకృష్ణ చరిత్ర
32. నారాయణ శతకము
33. జీడికంటి రాఘవోత్తమ శతకము
34. దాశరథీ శతకము
35. శ్రీరామ శతకము
36. శ్రీ ముకుంద శతకము
37. కృష్ణ శతకము
38. నరసింహ శతకము
39. రామానుజ స్తుతి రత్నావళి
40. భక్త రామదాసు
41. ముక్తా ప్రవాళము
42. తిరువాయి మొళి
43. చాటుపద్య రత్నావళి
44. మందరము
45. గోవింద రామాయణము
46. యతిరాజ విజయము
47. పోతన చరిత్ర
48. సీతారామాయణము
49. వైజయంతీ విలాసము
50. నల చరిత్రము
51. చిత్ర భారతము
52. మన్నారుదాస విలాసము
53. దాశరథి చరిత్ర
54. పంచ తంత్రము

55. కకుత్స్థ విజయము
56 కువలయాశ్వ చరిత్రము
57. రాధికా సాంత్వనము
58. శశాంక విజయము
59. లంకా విజయము
60. హంసల దీవి శతకము

జానపద సాహిత్యములో :

61. సెలయేరు
62. స్త్రీల పాటలు
63. తిరుమంత్ర కీర్తన
64. మేలుకొలుపులు
65. మంగళహారతులు
66. గేయ రామానుజచరిత్ర(చిఱుతల)
67. తిరునామములు

యక్షగానములలో :

68. చూతపురీ విలాసము
69. నాచ్చారు పరిణయము
70. మన్యమాదిగ

బుఱ్ఱ కథలు :

71. రామానుజులచరిత్ర

హరికథలు :

72. నరసింహ తాండవము
73. అన్నమయ్య కీర్తనలు

7 వ సంపుటి 138 వ కీర్తన

ఉదాహరణముగా రెండు పద్యములు :

1. ఆముక్తమాల్యద : కడు ప్రసిద్ధమైన పద్యము ఆళ్వారుల స్తుతి

"అల పన్నిద్దఱు సూరులందును..........."(1-10)

2. మనుచరిత్ర : గురుస్తుతి.

"కొలతున్ మద్గురు విద్యా
నిలయున్ కరుణా కటాక్షనిబిడ జ్యోత్స్నా
దళితాశ్రిత జనదురిత
చ్ఛల గాఢ ద్వాంత సమితి "శఠకోపయతిన్."

తెలుగు కావ్యములతో ఆచార్య - శిష్య సంబంధ చిత్రణము ఎన్నియో గ్రంథముల నుండి వెలికి తీయవచ్చును.

1. ఆచార్య సూక్తి ముక్తావళి గ్రంథమంతయు ఇందులకు ప్రబలమైన ఉదాహరణము.

2. నన్నయభట్టు : ఆదిపర్వము - (1-120)

"గురు కార్యనిరతులగు స
త్పురుషుల కగుటరుదె యధిక పుణ్యఫలంబుల్
గురులకు శిష్యులు పుత్రులు
పరమార్థము లోకపథమది .."

3. పానుగంటి : విప్రనారాయణ చరిత్ర :

"శిష్యునాత్మకు భక్తి విశేష్యమిచ్చి
పరమదయ దాని బోషింప గురుని భార
మధిక భక్తిని గురుదేహ మాచరించి
రక్షణము సేయ శిష్య భారమ్మసుమ్మ."

4. వేమన :

"గురుడనగా పరమాత్ముడు
పరగంగా శిష్యుడనగ పటు జీవుడగున్
గురు శిష్య జీవసంపద
గురుతరముగ నెరగువాడు గురువగు వేమా!"

5. పోతన : (10-1414) శిష్యులు బలాఢ్యులైన విశేష్యస్థితి నొంది గురువు జీవించును.

6. మడికిసింగన : పద్మపురాణములో (1 ఆ - 11 ప)

"ధర నిహపరములకును గురు
చరణంబులె యూత యగుట జర్చించి మదిం
బరవాది భద్రవారణ
హరిముఖ్యుల తిరుమలయ్యలార్యుల గొలుతున్."

ఈ గ్రంథములో ఏమున్నది?

## ప్రతిపాద్య విషయము

ఆ. సూ. ము. గద్యపద్య సమ్మిశ్రిత మహాకావ్యము.
"గద్యపద్యోభయమయం చంపూరిత్యభిధీయతే"

**ప్రధాన జీవిత చరిత్రలు - ఇతర ముఖ్యాంశములు:**

I. ఆళ్వారులందఱి జీవిత వైభవములు

II. పూర్వాచార్యుల వైభవములు

1. నాథమునులు 2 పుండరీకాక్ష శ్రీరామమిశ్రులు 3. యమునాచార్యులు 4. రామానుజాచార్యులు 5. మహాపూర్ణుల (శ్రీ పరాంకుశదాసుల) జీవిత విషయములు, శ్రీశైలపూర్ణులు మొదలైన ప్రసిద్ధుల గూర్చి ఉదయవరుల వైభవములో వివరములు లభించును.

III. రామానుజుల అనంతరము ఆచార్యులు :

1. పరాశరభట్టరు
2. నంజీయరు
3. నంబిళ్ళ
4. పిళ్ళలోకాచార్యులు
5. కురుకేశులు
6. మణవాళమహామునులు
7. వేదాంతదేశికులు
8. ప్రతివాది భయంకర అణ్ణంగారు
9. నయనారు దేశికులు
10. సందర్భము ననుసరించిన వ్యక్తులు

IV. ఇతరములు : 1. శ్రీవైష్ణవలక్షణము 2. వ్రతములు, జయంతులు 3. ఆళ్వారాదుల జన్మస్థల ప్రబంధాదులు 4. సూక్తులు, మహిమలు, 5. వర్ణనలు, వాదోపవాదములు మొదలగునవి; తీర్థక్షేత్రముల మాహాత్మ్యములు పెక్కులు.

**నేర్చుకొనునదేమి?**

1. కావ్యోద్దేశ్యములన్నింటి ఫలితములు - జగద్ధితకాంక్ష
2. ఆచార్య సమాశ్రయణము, హితోపదేశములు
3. వివిధశాస్త్ర విషయ ప్రాపంచిక జ్ఞానము
4. అహంభావ రహిత దాసత్వ భావన
5. శ్రీవైష్ణవుడుగా జీవింపనిచ్చు మొదలగు సల్లక్షణములు.

# ప్రతిపాద్య విషయ నిరూపణాంశములు - సమర్థనము

**ఆ.సూ.ము. నందలి ప్రతిపాద్యాంశము :**

"శ్రీశఠకోప పరకాల నాథయామున యతీంద్రాది పూర్వాచార్య మాహాత్మ్యం"బని ఈ కవి వ్రాసికొన్నాడు. అట్లే ఈ గ్రంథము పూర్తిచేయబడినది.

ప్రతిపాద్య విషయములను సంపూర్ణము గావించినాడని యర్థము. ప్రతిపాద్య విషయము షడ్విధములని వాడుక. అవి:

"ఉపక్రమోప సంహారావభ్యాసోఽపూర్వతా ఫలం
అర్థవాదోప పత్తీచ లింగం తాత్పర్య నిర్ణయః"1

ఆఱువిధములచే ప్రతిపాద్యవిషయము సమర్థింపబడును. 1. గ్రంథాది 2. గ్రంథాంతము 3. గ్రంథమధ్యము (అభ్యాసము) 4. అపూర్వము 5. ఫలము 6. అర్థవాదయుక్తులు.

వివరణము :

1 గ్రంథాది : గ్రంథమును మొదలుపెట్టు విధము—ఉపక్రమము

2. గ్రంథాంతము : గ్రంథమును ముగించు పద్ధతి—ఉపసంహారము

3. గ్రంథమధ్యమము (అభ్యాసము) : తెలిసినది మరువకుండ తిరిగి తిరిగి, మాటిమాటికి జ్ఞాపకము చేయుట.

4. అపూర్వము : ఇతరమైన ప్రమాణములచే తెలియరానిదానిని తెలుపుట - ప్రత్యక్షానుమాన ప్రమాణములచే తెలుపుట.

5. ఫలము : ఫలశ్రుతి. భగవత్సేవకు ఫలము.

6. అర్థవాదయుక్తులు : 1) అర్థవాదము : స్తోత్రములు, ప్రశంసా వాక్యములు. ఇవి దేవతా మంత్రకర్మలయందు ప్రీతి కల్గించును. 2) ఉపపత్తులు : ఉపబలకములు. ఖండన కసాధ్యమైన విషయములు.

**1. గ్రంథాది : ఉపక్రమము :**

ఆ.సూ.ము. గ్రంథారంభ పద్యము :

1. కృతిభర్తయైన రామానుజుల స్తుతి. శార్దూలవృత్తము, శ్రీకారముతో ప్రారంభమైనది. సర్వశుభప్రదము.

---

1. ప్రేరణము : రంగనాథ వాల్మీకి రామాయణములు - తులనాత్మక

"శ్రీమద్భూత పురీశ! కేశవనివేశీభూత హృత్పద్మ! ని
ష్కామావేశ! పరాశరాదిక మునీశ శ్రేష్ఠవాగ్వంశ! ని
స్సీమ ప్రాభవ! రంగరాజపదసుస్థేమ ప్రకాశా! యతీ
శా! మాణిక్యమయ త్రిదండకరదేశా! కేశవార్యాత్మజా!"

ఇందలి కథావస్తు సూచన, ఉభయపరుల వైభవమును వర్ణించుట - రామానుజుల కార్యక్రమ నిర్వహణ ప్రణాళికలు - బాధ్యతలు సూచనప్రాయములుగ నున్నవి.

2. "ఆ వెంటనే కథారంభ పద్యము" గలదు. ఇదియును శ్రీకారము ప్రారంభమున గలదియే. ఇందు శ్రీమన్నారాయణుని నిండు పేరోలగము, మంత్రోపదేశక్రమము. పదుగురార్యుల స్మరించవలయునను ప్రసక్తి వర్ణించ బడినవి.

"శ్రీదేవి యురమున చెన్నొంద భూనీళ
లిరుగెలంకుల దన కింపు గొలుప,
.... .... .... .... .... .... .... .... ....
పదుగురార్యుల దలపు మీ భక్తిననుచు
వాది భీకరగురుడనె మోదమలర!"

పిమ్మట వైకుంఠసభాభవన వర్ణనము. శ్రీమన్నారాయణుడు శ్రీదేవితో ముచ్చటించుట - తన యుద్దేశముల బయల్పుచ్చుట. కార్యక్రమమునుగూర్చి తెలుపుట. తన పరివారమునకు ఆళ్వారుల రూపములో ద్రవిడ భూభాగమునందు జన్మించుటకు కాజ్ఞ యొసంగుట.

ఇట లోకోపకారార్థమే కావ్యోద్దేశమగును.

పిమ్మట ముదలాళ్వారుల చరిత్ర ప్రారంభించబడినది.

ఇట్లు గ్రంథారంభ విధానము సుసంగతము, హృదయంగమమునై యున్నది.

**2) గ్రంథాంతము - ఉపసంహారము :**

ఆళ్వారుల, పూర్వాచార్యుల, తర్వాతి ఆచార్యుల వైభవములు వీటితో నొప్పారు నీ గ్రంథము ప్ర.భ. అణ్ణంగారి వైభవముతో సమాప్తమగును. గ్రంథ

ప్రతిపాద్యకథావస్తు విషయము(ఇతివృత్తము) ముగిసినది. చివరికథ (వైభవము) ప్ర.భ. అణ్ణంగారి చరిత్రను పేర్కొనుట సమంజసమే. ఎందుకనగా, ప్రతివాది భయంకరం బిరుదునందిన ఈ యణ్ణంగారు కృతివక్తకు మూల పురుషులు. వీరి చరిత్రలో ముగింపు పద్యము—

"వరగుణ రత్నవార్ధియగు వాది భయంకర దేశికేంద్రుడా
కరణి శతాబ్దముల్ గడపి, కారుణికుండగుటన్ సుతాదులం
దరునిజతేజ మ్మాశ్రిత జనోద్ధరణంబునకుంచి, సుం
దరవరయోగి రాజపద తామర సద్వయమొందె భక్తితోన్."

**కావ్యోద్దేశము సాఫల్యము :** నాటకము నందలి భరతవాక్యమును దలపించునట్లున్నదీ పద్యము. భావిసంతతిని ఆశ్రిత జనోద్ధరణంబునకై నియమించుట విశ్వశ్రేయస్సును సూచించుచున్నది.

ఈ పద్యము పిమ్మట మొదటి అణ్ణంగారి తనియ, అతడు మొదలుకొని కృతివక్త వరకు గల వంశవృక్షము పేర్లుగలవు. గ్రంథము చివర కవి గ్రంథ కర్తృ వృత్తాంతమును వ్రాసికొన్నాడు. తనకు రామాయణాది గ్రంథములు ప్రసాదించిన గురువుల పేర్లు ప్రకటించినాడు.

**ముగింపు :**

"పరవాది భీకరగురుచరణారంబురు
హాశ్రితుడనుచు నన్నాదరించి
మంగళగిరి యందు మంచెళ్ళ వేంకటే
శార్యుడు రామాయణాదులొసగె,
ఘనుడు కౌండిన్య వేంకటన్నృసింహగురుండు
ద్వారక తిరుమల వచనభూష
ణాది రహస్యార్థ మడియేని కెరిగించె
గురువరుడగు నేల కొండపల్లి
జియ్యరీ దాసునకు భద్ర శిఖరియందు
గొఱితవడకుండ తెలిపెను గురుపరంప
రాప్రభావార్థ మగ్గురు రాజకృపను
గ్రంథమంతయు పరిపూర్తిగనియెనిట్లు.

దీని తర్వాత—కృతికర్త స్తుతి పద్యములు నాల్గు గలవు. గ్రంథము చిట్టచివరి గద్య తర్వాత స్వాచార్యుల తనియ, వైష్ణవోత్తముల స్తుతిశ్లోకములు గలవు.

**ఆచార్యస్తుతితో గ్రంథము ముగింపుగాన ఆ. సూ.ము. పేరు సార్థకము. గ్రంథమధ్యమము (అభ్యాసము) :**

తెలిసిన విషయములు అనగా చెప్పి విషయములను జ్ఞాపకము చేయుచు రచన సాగించుట.

1. మొదట ఆళ్వారుల చరిత్ర గలదు. పిమ్మట ఆచార్యుల చరిత్ర గలదు. వీటిని ఆళ్వారాచార్యుల జన్మవృత్తాంత విభాగంలోను, మణవాళ మహామునుల వైభవములోను సంగ్రహముగా మరల మరల తెలిపినారు (పుటలు 402 - 502 539 - 559.)

2. వైష్ణవధర్మ సంబంధ విషయములెన్నియో పునరావృత్తి చేయబడినవి. ప్రతి వైష్ణవుడు తెలిసికొనదగిన విషయములు : ప్రథమోల్లాసము : మధ్యభాగము : ఉదయవరుల వైభవము. (పుటలు 157, 158.)

''శ్రీభాష్యమాచార్య సేవచే పఠియించి'' ద్వాదశోల్లాసము.

వచనములో : రామానుజుల హితబోధలో ఇదే భావము గలదు "శ్రీభాష్యంబధికరించి ప్రవచనంబొనర్చుటయు.........'' (పుటలు. 345, 346.)

3) మంత్రోపదేశక్రమము, ఆచార్యోపదేశక్రమము పరంపర తెలుపునట్టి పద్యములు :

''నారాయణుడు నిండు పేరోలగంబుండి
మంత్రరత్నంబగ్రమహి కొసగె,
ద్వయమది సిరియు విష్వక్సేనులకు నిచ్చె
నమ్మంత్ర మతడు శఠారికిచ్చె" (పుట I.)

ఇట్లే 157 వ పుటలో ఆచార్య పరంపర పేర్లు అలంకారయుక్తముగా సాగినవి.

శ్రీమన్నారాయణుడు

|

పుండరీకాక్షులు

|

రామమిశ్రులు

|

యామునులు

|

మహాపూర్ణులు

|

రామానుజులు

|

ఆచార్యులు క్రమముగా

"శ్రీ సఖ జలధి సుస్థిర కృపాసలిలంబు
గ్రోలిశఠారాతి కాలఘనము
నాథమునీంద్రుడన్నగము పై వర్షింప
నదిరామ పుండరీకాక్షులనెడు
ఝరముల యామునాచార్య మహానది
పూరించి పొరలి యిబ్బవి యతీంద్ర
పద్మాకరేంద్రంబు పరిపూర్ణ మొనరింప
దేశికాళిమములు దిశలయందు...."

**4. అపూర్వము :** ఈ గ్రంథములో ప్రామాణిక గ్రంథముల పేర్లనేకములు. ఆయా సందర్భములను బట్టి ప్రతిపాదించిన అంశముల నిరూపించుటకు అనేక ప్రమాణముల పేర్కొన్నాడీకవి. ఏకాదశీనిర్ణయము, జయంతీనిర్ణయము మొదలగునవి.

**5. ఫలము :** అసలు గ్రంథరచనోద్దేశ్యము లోకోజ్జీవనపరులైన వారి చరిత్రల నందించుట. పెరుమాళ్ళకైంకర్యము- ఆచార్యసంసేవ, తేటతెల్లములు ఎంబెరుమానరు దివ్యతిరువడిగళే శరణము. "ఇతని యంఘ్రులుపాయము పేయములు" పుట. (161)

**6. అర్థవాదయుక్తులు: 1.** స్తోత్రములు, ప్రశంసావాక్యములు ఎన్నియో గలవు. వేదాంత దేశికుల వైభవము గలదు.

**2.** ఉపనిషత్తులు (యుక్తులు)

పుటలు 436-503 వరకు— మణవాళమహామునుల వైభవములో గలవు.

పుట 97— ఆళ్వందారుల వైభవము, "యుష్మన్మాతవంధ్యగాదు."
ఇట్లు పెక్కింటిని జూపవచ్చును.

## ఇది ప్రబంధమా?

ఆ. సూ. ము. గ్రంథకర్త తన గ్రంథమును మహా ప్రబంధమనియే పేర్కొనుటనుబట్టి ప్రస్తుతము ప్రబంధ శబ్దమును గూర్చిన కొన్ని విషయములను చర్చించుట కవకాశమేర్పడినది.

1. గద్యలో: ఇందలి 24 గద్యలలోనిట్లే-

"ఇది శ్రీ భగవద్రామానుజ కరుణా కటాక్ష కవితావైభవ........ విబుధ వైష్ణవ విధేయ ప్రణీతంబైన 'ఆచార్య సూక్తి ముక్తావళి' యను **'మహా ప్రబంధంబు'** నందు.... సర్వంబును.... ఉల్లాసము.

2. గ్రంథ కర్తృ వృత్తాంతములో :

"అట్టి పరవాది భీకరగురుండీ దాసచేతను నొక నిమిత్తంబుగా జేసికొని, యస్మదీయ జిహ్వాగ్ర సింహాసనాసీనుండై యానతిచ్చిన యీ ఆ. సూ. కి.... మహీతలంబునగల శ్రీ మహాభాగవతులందఱీ **'ప్రబంధంబు'** పరిగ్రహించి.... ........నన్ననుగ్రహింపవలయు."

పై రెంటిలో ప్రబంధశబ్దము కన్పట్టుచున్నది. ఐనచో నిది ప్రబంధమేనా? అన్నచో-

ఇది ప్రబంధమే ఎట్లన :

1. నాలాయిర ప్రబంధములకు ద్రవిడ ప్రబంధములనియు, దివ్య ప్రబంధములనియు నామాంతరములు గలవు. వైష్ణవులీ గ్రంథమును వేద తుల్యముగ స్వీకరించి గౌరవింతురు. తమిళ దేశమునందేకాక ఆంధ్ర దేశమునందును, వైష్ణవ మత ప్రచారము చెందిన యితర ప్రాంతములందును వీనికి ప్రామాణ్యమున్నది.

(వివేచన: ఉస్మాని యూనివర్సిటీ మూడవ సంచిక, 1978). వ్యాసము ఆముక్తమాల్యద ప్రథమ ప్రబంధమా? పుట. 34. డా॥ ఎం. కులశేఖర రావుగారు.)

ఇట్లే గౌరవభావముచేత విశిష్టాద్వైత సంబంధరచయితలు తమ గ్రంథములకు (పద్య - గద్య - ఉభయ) ప్రబంధములనియే పేర్లు బెట్టిరి. అందు ఆముక్తమాల్యద మొదటిదిగా కన్పించును. తర్వాతి రచయితలు దీని ననుసరించి ఈ పదమును వాడుకొనిరి.

అట్లే ఆ. సూ. ము. గ్రంథకర్త ఈ శబ్దము నుపయోగించెను.

2. ఇది అనువాద గ్రంథము కాదు. స్వతంత్ర రచన. కథాంశము కెట్టైన మూలధారములుండును గదా! కథావస్తువు పరమ రమణీయముగా నుండుటకు కవిత్వకల్పనలు తప్పనిసరి.

3. ఇందలి కథావస్తువు ఆళ్వారాచార్యుల జీవిత చరిత్రల చిత్రణము. మరి ఏక కథాసూత్రము గలదా? యన్నచో-

ఆళ్వారుల నాలంబనముగా చేసికొని వెలసిన ఆచార్యుల పరంపర (మొదటి వరుసక్రమములో Serial Nos. ఆళ్వారుల చరిత్రలు, తరువాతి వరుస నెం. లలో ఆచార్యుల జీవితములు) సంబంధము చెడక అతుక్కొన్నట్లుగా (link) ఏక సూత్రతచే బిగించివేయబడినది.

4. నాయకుడన్నచో : రామానుజులను పేర్కొన్నవచ్చును. మరియొక విధముగ ఎవరి జీవితచరిత్రలకు వారు నాయకులగుదురు. రామానుజులు ఉద్యమములు నిర్వహించి ప్రధాన నాయకు డనిపించుకొనుట ఆయన జీవితమును తడివినచో తెలియును.

5. వర్ణనలు బహుళము. సందర్భోచితములైన అష్టాదశ వర్ణనములున్నవి. శైలి ధారాళముగ సాగినది. కావ్యరసాలంకారములు పోషింపబడినవి. భాష సంప్రదాయబద్ధము సంస్కారవాసనావిలసితము. "శ్రీవైష్ణవ శైలి'' ఇట్లే యుండునని తెలిసికొనుటకు ప్రధానలక్ష్యభూత గ్రంథముగా నుపకరించునట్టిది.

6. గ్రంథములో పద్యములు, సంఖ్య పరిమితమా? యన్నచో ప్రత్యేక వ్యక్తులను విడ దీసినచో పరిమితమే. భగవద్రామానుజుల జీవితఘట్ట విషయములు, సంఖ్య సంగతి వేరు.

7. ఎన్నియో ప్రమాణములను, న్యాయములను, శాస్త్రములను ఉటంకించి పేర్కొను సందర్భమున నిది శాస్త్ర ప్రబంధమగును.

8. భక్తి - ప్రపత్తినిబట్టి ప్రపత్తి ప్రబంధము.

9. వైష్ణవ ధర్మ విలక్షణములున్నవి గనుక వైష్ణవ ప్రబంధము.

10. ఇందు ఛందో వైవిధ్యము గలదు.

11 ఆచార్యుల, శిష్యుల, ఇతరుల సంభాషణములు జూచినచో నిది నాటకీయతను స్ఫురింపజేయును.

12. కావ్య ప్రయోజనముల దృష్ట్యా జూచినచో నిది ఉత్తమమైన ఉజ్జీవనోపేతమైన మహాప్రబంధము

**ప్రబంధశబ్దవివరణము :-** ప్రకృష్టమైన బంధము ప్రబంధము

1. ప్రబంధస్యకల్పనా - ప్రబంధము యొక్క రచించుట, కథ్యత ఇతి కథా - కథ, వాక్యప్రబన్ధే - రచింపబడునది. (అమరకోశము పుట. 127)

2. ప్రబధ్యతే ఇతి ప్రబన్ధః = రచింపబడునదిగాన ప్రబన్ధము. ఇట ప్రబంధమనగా రచనా విశేషమని మాత్రమే తెలియుచున్నది. కాని యీ రచనము కావ్యమే కావలయునను నియమేమియునులేదు. ఈ ప్రబంధ శబ్దము సంస్కృతమున కడు ప్రాచీనము.

**ప్రబంధమను పేరు పెట్టుకొను ఆచారము పరిపాటి యగుట సంప్రదాయము :** డా. ఎం. కులశేఖరరావుగారు 'వివేచన' మూడవ సంచికలో ప్రబంధ శబ్ద విచార మొనర్చుచు దక్షిణభారతమున ఆళ్వారుల చరిత్రములు దివ్యప్రబంధములుగా పిలువబడెనని తెలిపిరి. వానిని చూచి అట్టి విష్ణు భక్తుల కథలనే కూర్చి శ్రీకృష్ణదేవరాయలు అముక్తమాల్యదను ప్రబంధముగా పేర్కొనెననియు, ఆ వరుసలోనే ఆ కవిరాజు ననుసరించి ఇతర కవులు కూడ తమ కావ్యములను ప్రబంధములని చెప్పుకొనుట జరిగి యుండవచ్చునని విపులంగా చర్చించి తుదకు "ఏది యెట్లైనను అముక్తమాల్యదా రచనము నుండియే పదునారవ శతాబ్దము నందలి కావ్యములను, తత్సన్నిభములైన తర్వాతి కావ్యములను ప్రబంధములనుట పరిపాటియైనది. అదియే ఒక సాహితీ సంప్రదాయమైనది.''[1]

---

1. ''కనుపర్తి అబ్బయామాత్యకృతుల పరిశీలనము'' పుట 6. శ్రీ వారణాసి వీరనారాయణశర్మగారు.

2. దయాశతకము పీఠిక TTD ప్రచుర 1982 పుటలు I - కోశియాళం శఠకోపాచార్యులు.

3. ''అభినవ దశావతారములలో, భగవద్భక్తి పరీవాహరూపములైన ద్రవిడ దివ్య ప్రబంధముల ద్వారా ప్రాచీనమైన విశిష్టాద్వైత సంప్రదాయమును ప్రపంచమునకు వెల్లడించెను ''[2] (శ్రీ వేదాంత దేశికుల గూర్చి : శ్రీ దేశికావతారము.

4. సర్వేశ్వరుడు మొదట మత్స్యకూర్మాది దశావతారముల ధరించెను. పిమ్మట ఆళ్వారులు ఆచార్యుల రూపములో అవతరించెను. పదుగురాళ్వారులే అభినవదశావతారములోని వారుగ పీఠికాకర్త అభిప్రాయము.

**ఆ. సూ. ము. లో దివ్య ప్రబంధ పద ప్రసక్తులు :**

ఈ కవికి కావ్య శబ్దముకన్న ప్రబంధ శబ్దముపై అభిమానము మెండు:

1. ''ద్రవిడ సంహితా రూపంబులగు వేదంబులు సారెసారె కస్మద్భక్త పరిపాలితంబులగును.'' (అనగా దివ్య ప్రబంధములు) పుటలు 491, 492.

''ప్రతి సంవత్సరమును నాలాయిర ప్రబంధము ననుసంధింతురు. అదియే ప్రపన్నోత్సవమనంబరగు''.

2. ''వేద రూపంబైన యీ దివ్య ప్రబంధంబు ద్విజ శ్రేష్ఠుల కద్యేతవ్యంబు.'' పు. 495.

3. ''పరాంకుశ మునీంద్రుడు పరమ పావనామ్నాయ స్వరూప దివ్య ప్రబంధంబు లుదాహరింప నా ప్రబంధములన్నియు.'' పు. 499.

4 ''కొండొక కాలంబు కద్దివ్య ప్రబంధంబు ఖిలంబైన శ్రీమన్నాథ మునీంద్రుడు మరల నుద్ధరించు.'' పు. 499.

**దివ్య ప్రబంధములలోని కవితా గుణము :**

''అప్పరాంకుశ మునీంద్రుడును గంగా ప్రవాహంబు పోలిక స్వముఖ పద్మానర్గళ వినిర్గళత్పరమ పావనామ్నాయ స్వరూప దివ్య ప్రబంధంబు లుదాహరింప.'' పు. 499.

''రమణీయ వృత్తగద్యాత్మకయు, చతుర్వేద స్వరూపిణియునగు నీ ద్రవిడ వేద సంహిత దేవగానంబుచే బాడుచు నానందింపజేయుదురు'' పు. 492.

ప్రబంధ రచన: ఉపదేశములు :

1. ముదలాళ్వారులు : "సర్వాధికారంబులగు మూడు ప్రబంధంబులానతిచ్చి, ముష్వురమ్మహాత్ములిట్లు లోకానుగ్రహంబు నొనర్చిరంత." పు. 5.

2. తిరుమళిశైయాళ్వారులు : "అలనాన్ముగం తిరువందాదియును తిరుచ్ఛంద విరుత్తమనియెడు రెండు దివ్య ప్రబంధంబులంజేసి, వైష్ణవులకు జెప్పి." పు. 16.

3. కులశేఖరాళ్వారులు : "భగవత్స్వరూప రూపగుణ విభూత్యుపపాదక దివ్య ప్రబంధములను జేసి, ఆశ్రితులకు జెప్పి." పుట. 18.

4. పెరియాళ్వారులు : "పంచశతగాధ దివ్య ప్రబంధ మరలజేసి వైష్ణవులకు జెప్పి." పుట. 25.

5. ఆండాళు : "చేసె తిరుప్పావు వాసిగా నాచ్చారు తిరుమొళియను రెండు దివ్య కృతులు." (ప్రబంధములు) పు. 26.

6. తొండరడిప్పొడి యాళ్వారులు : "తిరుమాలై, ప్రాబోధకి యను రెండు దివ్య ప్రబంధము లానతిచ్చి, స్వకీయ కృపచే సర్వచేతనోజ్జీవనం బొనర్చి." పు. 45.

7. తిరుప్పాణి యాళ్వారులు : "తదనుభవ ప్రీత్యతిశయంబుచే తానను భవించిన యనుభవంబు 'అమలనాథపిరాన్', అనునొక దివ్య ప్రబంధముచే నానతిచ్చి, సకల చేతనోజ్జీవనం బొనర్చి." పు. 55.

8. తిరువరంగత్తముదనార్ : "రామానుజనూత్తందాది"ని రచించగా, అళ్వార్ తిరువరంగ పెరుమాళరయరు ఇట్లనెను: "అనన్య ప్రపన్నులకు నీ దివ్య ప్రబంధంబనవరతాను సంధేయంబగు." పు. 145.

ఇతరుల గ్రంథములను కూడ దివ్యప్రబంధములని పేర్కొన్నాడు :

ఉపదేశములు, వ్యాఖ్యానాదులలో గూడ ప్రసక్తి :

1. "శ్రీభాష్య ప్రముఖ ప్రబంధ విలసత్ సిద్ధాంత సంస్థాపనా" పు. 196.

2. మణవాళ మహామునులు : "శ్రీ శఠకోప పరకాల భట్టనాథాదిక పరమ యోగితతియందు తత్ప్రబంధముల యందట్లు." పు. 441.

3. వానమామల జియ్యరు : ''ఈడు మొదలగు దివ్యప్రబంధ వ్యాఖ్యానంబులన్నియు ప్రసాదించె.'' పు. 535.

4. వరవరమునిస్తుతి: ''ఘనపరాంకుశ పరకాలాది దివ్యసూరి ప్రబంధార్థ నిర్దేశనిపుణ.'' పు. 586.

5. పద్మనాభగురుడు అపిళ్ళారునకు "సకల వేదశాస్త్రముల్ ప్రీతితో చదివించి, దివ్యప్రబంధములన్ని యాపగిది జెప్పి. పు. 338.

6 వేదాంత దేశికులు: సమస్త శాస్త్రంబులు, నాలాయిర ప్రబంధంబులు తక్కిన విద్యలన్నియు 20 సం॥లో నభ్యసించిరి. పు. 586.

7. వేదాంత దేశికులు తన కుమారుడగు నయనారు దేశికులకు "సకల రహస్యములను, తిరువాయిమొళి మొదలగు దివ్యప్రబంధములను, తద్వ్యాఖ్యానంబులన్నియు ప్రసాదించె. పు 593.

8. వేదాంత దేశికులు పాదుకా సహస్రము "ఆలోకగురునకు సమగ్ర ప్రబంధంబు జూపంగని, లోకార్యగురున్ గన్గొని లోకార్యునితో నిట్లనిరి. మీరు వ్రాసిన పంచశతశ్లోక ఘటితంబగు ప్రబంధంబులో సాటియగునే. పు. 589.

9. మధురకవి పలుకులు ''అమ్మహాత్ముం డానతిచ్చిన దివ్యప్రబంధంబులందొక్క సూక్తి వహించెనేని.'' పు. 77.

10. నాథమునులు వైష్ణవులతో: "మీరీ యాయిర ప్రబంధబంధురంబగు శ్రీకోశం బిప్పింపుడు." పు. 80

11 నాథమునులకు వైష్ణవుల సమాధానము : "గాథా సహస్ర సంఘటిత శతాదిప్రబంధమందీ పదిపాశురము లధికరించతిమి మేము." పు 81.

12. మధురకవి శిష్యుడు నాథమునులతో: తిరుమొళి మొదలైన దివ్య ప్రబంధము లఖిలములు, ఖిలంబులయ్యె. పు 81.

13. నాథమునులు నమ్మాళ్వారులను ప్రార్థించుట : "భవదీయ దివ్య ప్రబంధములన్ని సాంగోపాంగముగా వీని కొకసారి వివరించవలసినదిగా కోరగా

నాళదట్లొనర్చెను. ''పరగు పల్లాండు దివ్యప్రబంధములకు" (పల్లాండును మొదట పలికెను. పు. 82.)

"నాథమనీషికి నాలాయిర ప్రబంధంబులట్లు క్రమముగా దయనొసంగి "

14. నాథమునులు నాలయిర ప్రబంధమును దివ్యదేశంబులందు దివ్య గాన రూపంబుగా బాడించిన, ''నద్దివ్య ప్రబంధంబులన్నియు శిష్యాచార క్రమంబున'' పు. 85.

15. శిష్యులు నాథమునుల దివ్యపాదాబ్జంబు లాశ్రయింప, నాతండు వారికి తిరువాయిమొళి మొదలైన దివ్యప్రబంధంబులన్నియు'' పు. 85.

16. నాథమునులు పుండరీకాక్షులతో ''వత్సా! నీవీ దివ్యప్రబంధము లన్నియు ప్రవర్తింపజేయు'' మనెను. పు. 86.

17. తిరుమంగై యాళ్వారులు: 'పెరియతిరుమొళి, తిరుక్కురుందాడగమ్, తిరునెడుం దాండగము, పెరియవెళుక్కూర్ తిరుక్కై, సిరియ తిరుమడల్, పెరియతిరు మడల్, అనియెడు ఆరు దివ్యప్రబంధములు'' పు. 68.

18. నమ్మాళ్వారులు: తిరువిరుత్తంబు, తిరువాశిరియంబు, పెరియతిరు పందాది, యను మూడు ప్రబంధంబులొనరించి, మరియు సామవేదసారంబగు 'తిరువాయిమొళి' యను చరమప్రబంధం బొనతిచ్చి పు. 76.

19. మధురకవి యాళ్వారులు: 'కణ్ణినున్ శిరత్తాంబు' అనునొక దివ్య ప్రబంధంబుచే నమ్మహాత్ముని ప్రభావంబు సాత్వికాగ్రగణ్యులకూ తెలియ జేసి. పు. 76.

20. కృతిభర్తను ''గూర్చి: శ్రీ భట్టనాథ గోదాశోభిత దివ్యప్రబంధ జుష్ట మనస్కా'' పు. 46.

**ప్రబంధమునకు పర్యాయపదము కావ్యము :**

"ప్రాచీనాంధ్ర వాఙ్మయంలో కొన్ని రూఢ్యర్థాలతో ప్రయుక్తమైన సాంకేతికశబ్దాలను మన సాహిత్యకారులు తమకు తోచిన అర్థంలో వాడుకుంటు న్నారు. ప్రబంధశబ్దమున కీగతే పట్టినదని డా. ఎస్. వి. రామారావుగారిట్లు వ్రాయుచున్నారు.''

(డా. ఎస్. వి. రామారావుగారి "అన్వీక్షణం'' నుండి పుటలు. 32,33 "ప్రబంధములను గూర్చి'')

ప్రబంధం : ప్రబంధం అంటే స్వతస్సిద్ధమైన అర్థం కావ్యం. సంస్కృత లాక్షణికులు నిర్వచించిన సర్గబంధమనే మహాకావ్యమే తెలుగులో సుమారు ప్రబంధం అయింది. 16 వ శతాబ్దానికి ముందటి తెలుగు కవులందరూ, నన్నె చోడుడు, పాల్కురికి, తిక్కన, ఎఱ్ఱన శ్రీనాథుడు మున్నగువారు తమ కావ్యా లను ప్రబంధాలుగా పేర్కొన్నారు. వీనిలో ఇతిహాసాలూ, ద్విపదకావ్యాలూ, క్షేత్రమాహాత్మ్యాలూ మొదలైనవి ఉన్నాయి. కావ్యానికి పర్యాయపదంగా ప్రబంధ శబ్దం ఇంత సుస్పష్టమైన అర్థంలో వాడుకలో నుండగా - 16 వ శతాబ్దంలో వెలువడిన కావ్యాలకు మాత్రమే ప్రబంధాలు అని ఎవరు ఏ వేళలో నామకరణం చేశారోగాని ఆ ముహూర్తం నుంచి ఆ శబ్దానికి ఉన్న సహజమైన అర్థం పోయి, అంతకు ముందులేని అర్థం వాడుకలోనికి వచ్చేసింది. తర్వాతి విమర్శకులందరూ ఆ అర్థాన్ని రూఢిచేసి, ప్రబంధానికి కొన్ని లక్షణాలను ఆపా దించారు.

అవి : ఏకనాయకాశ్రయము, వస్త్వైక్యము, స్వతంత్ర రచన, శృంగార రసము, ఆలంకారిక శైలి, అష్టాదశ వర్ణనలు మున్నగునవి.

"నిజానికి పైన చెప్పిన లక్షణాలలో చాలవరకు అంతకుముందున్న కావ్యాలకు వర్తించేవే''...... "ప్రబంధములలో కథా చమత్కారమున్న వర్ణనా సాహిత్యమే ప్రధానము'' అని గురజాడ రామమూర్తిగారు నొక్కి చెప్పినా తర్వాతివారు దాన్ని అంతగా గమనించలేదు.''

సారంశమేమన - "మహాకావ్యము - ప్రబంధము : ఇవి రెండు పర్యాయ పదములు. మహాప్రబంధము అనిగూడ పేర్కొనుచున్నారు. మహా యనునది ప్రత్యేకతను, విశిష్టతను తెలుపు విశేషణము. గంభీరతను సూచించును. వర్ణనల వైభవము ప్రధానము. కథాచమత్కృతి అంతగా అవసరము లేదు."

**తెలుగు ప్రబంధ లక్షణములు :**

"సంస్కృత సాహిత్యమున కావ్యమనియు, తెలుగున ప్రబంధమనియు తలచు వ్యవహారము." తెలుగుభాషలో ప్రత్యేక లక్షణ గ్రంథము లేదు అని డా. పల్లా దుర్గయ్యగారు తమ 'ప్రబంధ వాఙ్మయ వికాసము'లో పేర్కొన్నారు. విషయసమన్వయము చేయుచు ప్రబంధనిర్వచనముతో పదకొండు లక్షణములు పేర్కొన్నారు.

1. పురాణములోని ఏకదేశకథ ఇతివృత్తమై 2. దివ్యాదివ్యనాయకమై 3. తద్గుణ ప్రశంసనము ద్వారా కాంతాసమ్మితోపదేశయుతమై 4. సద్యః పర నిర్వృతి సాధారణ ఫలమును 5. మోక్షసిద్ధియు పరమ ప్రయోజనమై 6. భక్తి - శృంగార (వీరము)లో నొకటి ప్రధానరసమై 7. దృశ్యాదృశ్య కావ్యలక్షణ సమ్మిళితమై 8. అష్టాదశ వర్ణనాలంకృతముగ 9. తత్సమ శైలిలోగాని, అచ్చతెలుగులోగాని 10. చంపూపద్ధతిని 11. నాతివిస్తరముగ కూర్చబడిన : మిశ్రమబంధము. (ప్రబంధవాఙ్మయ వికాసము. పుట. 86.)

**సారాంశము :** ప్రబంధమును మహాకావ్యలక్షణముల నిముడ్చుకొన్నది. రెండును పర్యాయ పదములే.

**తెలుగు ప్రబంధ ప్రత్యేకత :** ప్రపంచ సాహిత్య చరిత్రలో తెలుగు ప్రబంధములు ప్రత్యేక విలక్షణముల కలిగియున్నవని చెప్పుట సత్యదూరము గాదు. "కావకన్యక ప్రబంధలక్ష్మి. ఇట్టి సాహిత్యస్వరూపము సంస్కృతమున గాని, మరియే ఇతర భాషలలోగాని లేదు. దీనికిదియే సాటి. సంస్కృతములో కావ్యమును ప్రబంధముగా రాజశేఖరుడు పేర్కొన్నాడుగాని ఆ దినుసులు వేరు. ఇది తెలుగు సాహిత్యముననొక అపూర్వరూపమును సంతరించుకొన్న వివిధ లక్ష్య లక్షణ సమన్వితమైన చంపూరచన."

(ఉషఃకిరణాలు : శ్రీ యండమూరి సత్యనారాయణ, పుట. 112.)

**ప్రబంధకావ్యము - ఖండకావ్యము :**

ప్రబంధకావ్యము - ఖండకావ్యమును గూర్చిన యభిప్రాయములు పలు రకములుగా కన్పించుచున్నవి. ప్రస్తుతాంశమునకు సరిపోవు ఈ క్రింది విష యములు గమనింపదగినవి:

"ప్రబంధకావ్యములలో ఏదేని ఒక కథా వస్తువు ప్రధానముగా నుండును. అందు పూర్వాపర సంబంధము విధిగా నుండును ప్రధాన కథాకథనములో - ప్రకృతి వర్ణనమునకు, దేశకాల చిత్రణమునకు సముచితమైన స్థానముండును. ఇట్టి ప్రబంధకావ్యము విషయ ప్రధానముగల దగుటచే ఆ విషయమునకు వివిధ వర్ణనములు అంగములై శోభిల్లుచుండును. ఇది 1. మహాకావ్యము 2. ఖండ కావ్యమని ఇట్టు తెఱంగులుగా నుండును. మహాకావ్యములో ఏదేని ఒక జీవిత వృత్తాంతము సమగ్రముగా వర్ణింపబడును. ఖండకావ్యములో జీవిత వృత్తాంతము నందలి ఏ యంశమో ఒకటి మాత్రము వర్ణింపబడును. ఇందు చరిత్రాంశములు సమగ్రముగా వర్ణింపబడకున్నను ఇందలి కథా భాగమునకు మాత్రము ఔచిత్య భంగము కలుగదు. ఇందు ప్రాసంగిక కథలు మిక్కిలి తక్కువగా నుండును. ఇట్టి ఖండకావ్యములలో-కథాత్మకతతోబాటు గీతాత్మతకును ప్రాధాన్యముండును. ఆండాళ్ రచించిన "తిరుప్పావై" నమ్మాళ్వారుల "తిరువిరుత్తమ్" తిరుమంగై యాళ్వారుల 'పెరియ తిరుమడల్' దివ్యప్రబంధములు ఈ ఖండకావ్యకోవకే చెంది యున్నట్లు తెలియనగును."

"సన్నిధ్ధరాళ్వారులలో ఏ యొక్కరును మహా కావ్యమును రచించి యుండలేదు. ఏ యొక జీవిత వృత్తాంతమునుగాని ప్రతిపాదించుట, ఏ యొక మహా సందేశమును గాని ప్రతిపాదించుట వారి లక్ష్యము గాదు. వారి హృదయములు కృష్ణ లీలలయందే చాలవఱకు కేంద్రీకరించబడినవి. మహాకావ్యములో కవికి వస్తు పరిచయము, సమన్వయ దృష్టి అవసరములు. కవి హృదయమున గల భావనా పరంపరలు మహాకావ్యములో ప్రతిబింబింపనేరవు."*

### ద్రావిడ వేదమే ప్రబంధము :

ప్రబంధము లెన్నియున్నను ఆ పదము ద్రావిడ వేదమునకే చెల్లునను యభిప్రాయములు గలవు. ఈ క్రింది పద్యము గమనింపదగినది.

---

* "ఆళ్వారులు - దివ్య ప్రబంధములు. డా॥ ధనకుధరం వరదాచార్యులు పుటలు : 208, 210.

''వేదము వేదమే? ద్రవిడ వేదము వేదమునున్ ప్రబంధమున్
వేదసమూహసారమును, వేద శిరోర్థనిరూపకంబు, లో
కాదర భాజనంబగు సమంచిత కావ్యమునయ్యె, నిట్లుగా
నేది కొఱంత? యద్ది పఠియించి నవారికి శ్రీ పరాంకుశా!''

—శ్రీ పరాంకుశ శతకము.

**సమన్వయము : నిర్ణయములు :**

ఇది ప్రబంధకావ్యముగా ప్రత్యేకతను గల్గిన మహాప్రబంధము, వైభవ కావ్యము, వైభవ ప్రబంధమున్నూ.

1. ఉడయవరుల వైభవము - మహాకావ్యము. రామానుజులవారు నాయకులు. కావ్యలక్షణములైన వర్ణనాదులన్నియు గలవు. (శృంగార నాయకుడు గాదు) ఉపదేశ సౌందర్యము గలదు.

2. మిగతా వారి వైభవములను ఖండకావ్యముల జాబితాలోనికి చేర్చవచ్చును. ఇవి జీవిత చరిత్రలోని కొన్ని అంశములను తెలుపునట్టివి.

3. తొండరడిప్పొడి యాళ్వారుల వైభవములో శృంగార రస మధికము ఐనను జీవిత లక్ష్యము, గమ్యము సార్థకములైనవి.

4. తిరుమంగై యాళ్వారుల వైభవములో వీరరసమధికము.

5. మణవాళమహామునుల వైభవము కాలక్షేపములతోను, సిద్ధాంత ప్రతిపాదనలతో నలరారినది.

6. భట్టరు - నంబిళ్ళ వైభవములలో సంశయ విచ్ఛేదములు గలవు

7. వేదాంత దేశికుల వైభవము అతి గంభీరముగా విజయ దుందుభుల ప్రమోగించుచు సాగినది.

8. ప్రతివాది భయంకరం అణ్ణంగారి వైభవము వ్రతములు, జయంతులు మొదలగు విషయ నిర్ణయములతో నిండియున్నది.

9. వైభవముల శీర్షిక : ఇందలి జీవిత చరిత్రలకు వైభవములను శీర్షిక (పేరు) పెట్టబడినది. శ్రీ వైష్ణవ సంప్రదాయములో వైభవము పదము విరివిగా ప్రయోగింపబడుచున్నది. పెరుమాళ్ళ, ఆచార్యుల వైభవములు - ఇట్లు దీని వల్ల గౌరవము, హుందాతనము, గంభీరత్వము, శ్రీమంతమును తెలుపునట్టిదిగా అర్థము చేసికొనవచ్చును. జీవిత చరిత్రల వైభవమును దెలుపు కావ్యముగాన దీనిని వైభవకావ్య మనవచ్చును. కావ్యలక్షణముచేత ఈ గ్రంథము గొప్పది. అనగా వైభవము గలది. కావ్యవైభవము గలది గాన కావ్యవైభవమును ప్రదర్శించునట్టి వైభవకావ్యము.

**సారాంశము :**

ద్రావిడ దివ్య ప్రబంధముల పేర్లననుసరించి కవి తనకిష్టమైన పదముగా మహాప్రబంధమును వాడుకున్నాడు. కాన ఈ గ్రంథము ప్రబంధము. మహాకావ్యలక్షణములు గలవుగాన మహాకావ్యము. ఖండకావ్యములిందంతర్భూతములు. ప్రబంధము, మహాకావ్యములను లక్షణముల ననుసరించి వ్యవహారములో సమానార్థక పర్యాయ పదములుగా వాడుకున్నను, ద్రవిడవేద సంప్రదాయము ననుసరించి, తేడాలను గమనించి, ప్రత్యేకతను తెలుపునట్టిదిగా నుండుటకై, సులభముగా, ద్రావిడ వేద సంపర్క దృక్పథముగా, ప్రత్యేకముగా వెంటనే గుర్తించుటకై ఈ గ్రంథమును "**ప్రబంధకావ్య**"మనవచ్చును.

దీనిని మహాకావ్యమని పేర్కొన్నచో నష్టములేదు. కాని, దివ్యప్రబంధములదృష్ట్యా మహాప్రబంధమని నుడువుటయే సమంజసము. కుందలీకరణముతో ప్రబంధకావ్యమని వ్రాసికొనవచ్చును.

ఇట్లు ఆచార్య సూక్తి ముక్తావళి విశిష్టాద్వైత తత్త్వ మహాప్రబంధము; (ప్రబంధకావ్యము) వైభవకావ్యము ; వైభవ ప్రబంధము; శ్రీవైష్ణవ మహా

# ఆళ్వారులు, ఆచార్యులు అవతరించుటకుగల కారణములు

## ద్రావిడ వేదావతరణ గాథ

"శ్రీమద్భూతపురీశ! కేశవ నివేశీభూత హృత్పద్మ! ని
ష్క్రామావేశ! పరాశరాదిక మునిశ్రేష్ఠవాగ్వంశ ని
స్సీమ ప్రాభవ! రంగరాజ పద సుస్థేమ ప్రకాశా! యతీ
శా! మాణిక్యమయ త్రిదండకరదేశా! కేశవార్యాత్మజా!"

శ్రీమాన్ నంబూరి కేశవాచార్య లీవిధముగా కృతినాయకుని సంబోధించి గ్రంథ రచన కుపక్రమించినారు. నాటకమునందలి నాందిని తలపించునట్లున్నదీ స్తవరాజమైన, సారతమార్థమైన పద్యము. పిమ్మట ఈ క్రింది పద్యముతో కథారంభము:

"శ్రీదేవి యురమున చెన్నొంద భూనీళ
లిరుగెలంకుల దనరింపు సలుప,
అహమన్న మహమన్న మనచు సూరులు గొల్వ,
పరమపదమునందు పరమగురుడు,
నారాయణుడు ముందు పేరోలగంబుండి,
మంత్రరత్నం బగ్గ మహిషి కొసగె,
ద్వయమది సిరియు విష్వక్సేనులకు నిచ్చె
సమ్మంత్రమతడు శఠారి కొసగె,
అమ్మహాత్ముని చరితామృతాబ్ధియందు
చిత్తమా నీవు నోలాడిచెంది సుఖము
పదుగురార్యుల దలపుమీ భక్తి ననుచు
వాదిభీకర గురుడనె మోదమలర!"

ఇందు శ్రీమన్నారాయణుని నుండి శఠకోపులవరకు గల గురు పరంపర, మంత్రోపదేశ క్రమమును తెలుపబడినది. కృతివక్త వాదిభీకర గురుడు తన చిత్తమును సంబోధించుకొని (అనగా సంసారి చేతనుల కందఱకు వర్తించునని అనుకొనవలెను) ప్రపన్న జన కూటస్థులైన శఠకోపుల దివ్య చరితామృతాబ్ధి యందు నోలలాడి, తదనుభవ జనితమైన సుఖమును బడసి పదుగురు ఆళ్వారుల (ఆర్యుల)ను భక్తితో స్మరింపుమని యనుచున్నాడు.

ఈ పద్యము పిమ్మట కవి దీర్ఘమైన, మనోహరమైన శైలిలో ఆళ్వారాదులు అవతరించుటకు గల కారణములను తెలిపినాడు. ఇందు సర్వేశ్వరుని వైకుంఠపుర వర్ణనము, సభా వైభవ వర్ణనము, పరివార ముక్త పురుషుల, నిత్యసూరుల వర్ణనము పదగుంఫనములతో నలరారుచున్నది. తర్వాత ప్రజలను (సంసారి చేతనులను) గూర్చిన తలంపు, వారి అహంభావాది కార్యములతో కూడుకొనియున్న విషయములను గూర్చి వర్ణింపబడినది.

అటు పిమ్మట భగవంతుడు శ్రీవత్స కౌస్తుభ వైజయంతీ వనమాలా పంచాయుధానంత గరుడ విష్వక్సేనాదులగు నిత్యసూరులకు ద్రవిడ భూభాగంబులలో కావేరీ తీరంబున, తామ్రపర్ణీ తటంబున, వేగవతీ కూలంబున, బాహుదా సమీపంబున, అభిమత వర్ణంబులం దవతరించుమనియు, సర్వచేతనోద్ధారణంబు సేయుండని నియోగించెను. అట్లే వారు ఆళ్వారులయి యవతరించి, సర్వాధికారంబుగా ద్రవిడ వేదంబుల సాంగోపాంగంబుగా రచియించిరి.

ఈ వచన రచనలోని శైలి ప్రసన్న గంభీరమైన నడకలో హుందాగా పొగినది. శ్రీవైష్ణవత్వమును స్ఫురింపజేయు పదములధికములు. ఈ కవి వచనములన్నియునింతే. వచనములేగాదు, పద్యములును అట్లే గలవు. గ్రంథమును చదువుచున్నపుడిది వైష్ణవ గ్రంథమని ఇట్టే చెప్పుట కవకాశమున్నది.

ఆళ్వారులను అభిమత వర్ణములం దవతరించుమని భగవదాజ్ఞ. అట్లే ఎన్నోకులాలవారుగా వీరు జన్మించుట జీవితచరిత్రను పఠించినచో తెలియును. కులమతభేదములు కూడవను విశాలభావ మేర్పడును.

కావ్య ముఖ్యోద్దేశ్యములు : 1. ఆనందము ఆళ్వారాదులు కవులుగాన వారి గ్రంథములానందమును గూర్చును.

2. ఉపదేశము సకల హితముల నుపదేశించును. ఇట్లు ఆళ్వారాచార్యుల వైభవములను హృద్యముగా చిత్రించిన ఆ. సూ. ము. గ్రంథ రచనోద్దేశ్యములును ఆనందోపదేశములే.

ఈ వచనము ముగించిన వెంటనే కవి ముదలాళ్వారుల జీవిత వైభవముల వ్రాయుట కారంభించినాడు.

ఇచట ఒక సందేహము : ఆళ్వారులందరి రచనలు అనగా దివ్యప్రబంధములు ద్రావిడభాషలోనే ఏల వ్రాయబడినవి? వాటికంతటి ప్రాధాన్యత

**ఈ ప్రశ్నలకు సమాధానములీ గ్రంథములో గలవు :**

కాని, అవి గ్రంథ మధ్యభాగము ముగిసిన పిమ్మట ఉత్తర భాగములో జొప్పించబడినవి. మణవాళ మహాముని జీవిత వైభవములో మనకు దర్శన మొసంగును. సామాన్యముగా రచయితలందఱును గ్రంథారంభములో దేవతాది స్తుతుల పిదప కారణభూత విషయములను ఒక క్రమ పద్ధతిలో "అనగా అనగా" వంటి కథా కథన శైలిలో ముందునకు సాగిపోవుదురు. కొన్ని సంప్రదాయ గ్రంథములును ఇట్లే చిత్రించినవి. ఇట్టి ప్రసక్తి-

1. ప్రపన్నామృతము—నడిగడ్డపాలెం వారి ప్రచురణ 1984. 1.25 పుటలలో (సంస్కృతము)

2. తెలుగులో ద్విపద పరమయోగి విలాసము—TTD వారి ప్రచురణము 1938. 5 వ పుట. 22, 23 పేజీలలో గూడ.

3. తెలుగులో ద్వాదశసూరిచరిత్ర గోదాగ్రంథమాల 1973. 14-24 పుటలలో గలదు.

ఇట్లు కథాంశములనుగాని, వృత్తాంతములనుగాని గ్రంథాదిని గాకుండ గ్రంథము నందలి ఆయాభాగములలో సందర్భోచితముగా ప్రవేశ పెట్టుట ఒక పద్ధతి. చెప్పేవిధానమునుబట్టి పాఠకునిలో కౌతూహలము జనించుట కవకాశ మున్నది.

**ద్రావిడ వేదావతరణ గాథ :**

**సందర్భము :** ఒకానొకప్పుడు మణవాళమహామునులు తిరునగరి యందు ఆళహియమణవాళనామాభిరామంబై, మనోజ్ఞ రత్న ఖచితంబైన, కమనీయ కాంచన మంటపంబును ఆదేశాధిపతి (రాజు)చే నిర్మింప జేయించి, శ్రీ వరాంకుశ మునీంద్రుల సేవించుకొని కురంగనగరాపరాభిదానంబగు తిరుక్కురుంగుడికి వెళ్ళి ఒకచోట విశ్రమించెను. ఆ సమయమున తిరువేంగడముడయాను అను బ్రాహ్మణుడచటికి వచ్చి. భక్తి పూర్వకముగా సాష్టాంగ ప్రణామం బాచరించి కొన్ని ప్రశ్నలడిగెను. ఏడు ప్రధాన ప్రశ్నలు గలవు. 7 వ ప్రశ్న జవాబు నందీ కథ గలదు.

ఈ సూక్తము పుటలు 487, 489, 489, 502

ప్రశ్న : శ్రీపరాంకుశ పరకాలాది దివ్యసూరులు యవతార రహస్యం బును, తదీయ దివ్యప్రబంధ మాహాత్మ్యంబును సవిస్తరంబుగా నానతిండు.

జవాబు : శ్రీమణవాళ మహామును లానతిచ్చినది:

సందర్భము : అంతర్గత ప్రశ్నలు, పార్వతి పరమేశ్వరుని ప్రశ్నించుట.

ఆధార గ్రంథము : బ్రహ్మ కైవర్తక పురాణము, శ్రీ మంగళాద్రి క్షేత్ర మాహాత్మ్య ఖండమునందు 29 వ అధ్యాయము.

అంతర్గత ప్రశ్న : ప్రపన్నోత్సవంబు వినవేడ్క పొడమె. తద్వైభవమును వర్ణింపుడు.

జవాబు : పరమేశ్వరుని సమాధానములో ఈ క్రింది విషయములు గలవు.

పూర్వ కాలములో పార్వతీ పరమేశ్వరుల కల్యాణ మహోత్సవమును తిలకించుటకు హిమాచలంబునకు బ్రహ్మాది దేవతలు, మునులు, జనములు వచ్చిరి. అపుడు భూమి ఒక వైపునకు క్రుంగెను. దక్షిణ భాగము పైకి లేచెను. భూమి కంపంబుదయించెను. బ్రహ్మ ఆజ్ఞను బడసి విశ్వకర్మ దీనికి కారణ మును తెలిసికొనెను. అగస్త్య మహా మునీంద్రుల శారీరక మహిమాతిశయమైన బరువే దీనికి హేతువని నుడివి, అతనిని వేరుచోటికి పంపుమని బ్రహ్మను కోరెను. అగస్త్యుడు తన సంతోషమును భంగపరచిన విశ్వకర్మను శపించెను. విశ్వ కర్మయు మగిడి, "ఓ మునీంద్రా! నీ వేద విద్యయు భగవద్భక్తి పవిత్రీకృత వైభవయగు ద్రవిడ సంహిత" యగునని ప్రతిశాపమిచ్చెను.

అపుడగస్త్యుడు వింధ్యపర్వతములను దాటి దక్షిణ దిగ్భాగమునగల మలయాచలంబున కరుగుదెంచి, సంతప్త హృదయుడై శ్రియఃపతి నుద్దేశించి తపంబొనరించిన సర్వేశ్వరుడు ప్రత్యక్షమై యిట్లు పలికెను:

"మునీంద్రా! నీకు శుభంబగు. ద్రవిడ సంహితా రూపంబులగు వేదంబులు సారెసారెకు అస్మద్భక్త పరిపాలితంబులగును గావున నీవు చింతింపవలదు."

ఇచటినుండి విపులముగా కృతయుగము మొదలుకొని కలియుగము వరకు వరుస క్రమముగా ఆళ్వారుల, ఆచార్యుల అవతారముల పేర్లు, దివ్య దేశముల పేర్లు తెలుపబడినవి. "ప్రతి సంవత్సరము నాలాయిర ప్రబంధంబు ననుసం ధింతురు. అదియే ప్రపన్నోత్సవ మనంబరగు"నని శివుడు నుడివెను.

మరల ఇచటి వచనమునుండి అంతర్గత ప్రశ్నలు. సమాధానములు గలవు. సనత్కుమారుని ప్రశ్నలకు విష్వక్సేనుని సమాధానములు, ఇంకను ఇతరుల సందేహములును, సమాధానములును గలవు.

సారాంశము :

1. వర్తమాన భక్తులయందు శఠకోప మునీంద్రుడు శ్రేష్ఠతముడు.

2. పరాంకుశ మునీంద్రుల ద్రావిడ గాథాసహస్రము బ్రహ్మవిద్యయే. ఎందుకనగా, శ్రుతులకు శిక్షావ్యాకరణాద్యంగంబులు ఋషులొనరించునట్లు భగవంతుడైన అగస్త్య మునీంద్రుడు శిక్షావ్యాకరణ వృత్త లక్షణాదులన్నియు తానే రచియించెను.

3. అమ్నాయంబు పగిది ఇది స్వతః ప్రమాణము. అపౌరుషేయముగాన బ్రహ్మవిద్యయే.

4. ప్రతి యుగ చక్రమున, ప్రతికర యుగమునందు శ్రీ శఠకోపులు దీనిని ప్రకాశింపజేతురు.

5. విష్ణుండు సమస్త భూతాశ్రిత వత్సలుడుగాన శఠకోపాది భక్త స్వరూపంబు ధరియించి విశ్వజనుల రక్షించును.

6. ద్వితీయ పరార్థంబున, ప్రథమ దివసంబున, సప్తమ వైవస్వత మన్వంతరంబునందు 28వ మహాయుగమున కలియుగాది మకాలంబునందు శ్రుతిని ద్రావిడ వేద సమ్మతము గావింప శఠకోప మునీంద్రుడుగా విష్ణువు జన్మించును.

సూత్రవతి నుద్దేశించి శ్రీదేవి చెప్పినది :

7. భగవదాజ్ఞచే అనంతగరుడ విష్వక్సేన సుదర్శన పాంచజన్యాది నిత్యసూరులందఱును కలికాలంబున "వీడు శూద్రుడు, వీడుత్కృష్టుడు, వీడు ప్రాజ్ఞుడు" అని విశేషవిచారము సల్పక యందఱకు స్వరూపజ్ఞానంబు బోధింటకు ద్రవిడ దేశమునందవతరించ గలరు.

8. ద్రావిడ ప్రబంధ పఠనమునకు నియమములు గలవు.

సమాధానములన్నియు ముగిసిన పిమ్మట చివరగా నా విప్రునకు అనగా తిరువేంగడముడయానునకు "తిరువేంగడ దాసుండని" దాస్యనామమిడి మణవాళ మహామునులు శ్రీరంగమునకు బోవదలంచెను.

"భక్తామృతం, విశ్వజనానుమోదనం
సర్వార్థం, శ్రీశఠకోప వాఙ్మయమ్,
సహస్ర శాఖోపనిషత్ సమాగమం,
సమామ్యహం ద్రావిడవేద సాగరమ్."

ద్రావిడ వేదావతరణ గాథను గూర్చిన విశేషాంశములను ఇంత విపులముగా చెప్పిన చంపవు రచనలుగల గ్రంథములు తెలుగు వాఙ్మయమున అరుదు.

సూచన : అ. సూ. ము. లో వాళి తిరునామములు లేవు. నిత్యానుసంథానాది గ్రంథముల సంప్రదించగలరు.

## పూర్వభాగము - ప్రథమోల్లాసము :

**అతి ప్రధాన కథాంశములు :**

సంఖ్యావివరములు : ఈ యుల్లాసములో -

42 సీసములు, 1 కందము, 2 శార్దూలము, 1 మాలిని పద్యములు గలవు. మొత్తం 46 పద్యములు; వచనములు=7. వచన పంక్తుల సంఖ్య=198. తనియలు=4. గద్య విషయ సూచికాంశములు 24 గలవు.

**అతి ప్రధాన కథాంశములు :**

1) పొయిగై, పూదత్త, పేయాళ్వారుల వైభవములు, జీవిత విశేషములు గలవు. ఈ మువ్వురయోనిజులు.

2) తిరుమళిశై యాళ్వారుల,

3) కులశేఖ లాళ్వారుల వైభవములు గలవు.

ముదలాళ్వారుల గూర్చి : 6 సీసములు, 4 పంక్తుల వచనము గలవు. గద్య విషయ పంక్తి ఒకటి మాత్రమే. వీరు మువ్వురను 3500 సం॥లు జీవించిరి.

**జన్మాదిక విశేషములు :** అందరిది పల్లవదేశము. తిరునక్షత్ర తనియన్‌లు గలవు. తొండమండలము.

**1) పొయిగై ఆళ్వారులు : (సరోయోగి)**

సత్యవ్రత క్షేత్ర సంజ్ఞచే నొప్పారునట్టి "కాంచీపురి"లో అతిపావనంబైన సరోవరము నందలి వికచహేమ సరసిజమునుండి పాంచజన్యాంశమున తులా

**2) పూదత్తాళ్వారులు : (భూతయోగి)**

ఆ మరునాడే మల్లాపురవరములో సముద్రతీరము నందు గల మాధవీ కుసుమము నుండి కౌమోదకి అంశమున తులాశ్రవిష్ఠాతార యందు జన్మించిరి.

**3) పేయాళ్వారులు (మహాయోగి)**

ఇదే నెలలో మయూరపురమున ఒక సరసిలోని కైరవ ప్రసవంబునుండి నందకాంశమున శతభిషగాఖ్య నక్షత్రమునందు జన్మించిరి.

**కథాకథన విశిష్టత : కథాసంవిధానము :**

**ఈ మువురాళ్వారులు అయోనిజులు.** పుష్పములయందు దివ్యాంశములచే బుట్టి తేజరిల్లినవారు. భగవదనుగ్రహ ప్రాప్త దివ్యజ్ఞాన సంపన్నులై, ఒకరి నొకరెఱుంగక, ఈ యుర్వియందు పవలున్నచోట బహువాసరములుండ రాదని గ్రామైక రాత్రులగుచు సంచరించుచు ఒకనాటి రాత్రి తిరుక్కోవలూరను గ్రామములో కలిసికొనిరి. వీరి కలయికను కవి నాటకీయ పద్ధతిలో వర్ణించినాడు. అదియొక అపూర్వ సంఘటనము:

మొదట సరోయోగి ఒక యింటి తిన్నెపై పరుండి యుండెను. పిమ్మట భూతయోగి ప్రవేశించెను. ఇరువురును మీరెవరు? మీరెవరు? అని ప్రశ్నలు వేసికొని, హరిసేవకులము, హరిదాసులము అను సమాధానములకు పొంది, ఊరు పేరేమియు నడుగుకొనక, దాస్యధర్మమున్నది తమ్ముతాము తెలుపుకొనిరి. స్థలము చిన్నదైనందున ఇరువురును కూర్చుండిరి.

ఇంతలో మూడవ వ్యక్తి ప్రవేశించెను. వారే మహాయోగి. తనను విష్ణుదాసుడనని పరిచయము గావించుకొనెను. స్థలాభావమువల్ల మువ్వురును నిలబడి యుండిరి. వీరిసంబోధనలు : "హరిసేవకులము మేమయ్య, మీరెవ్వరో?" యని సరోయోగి అడుగగా, భూతయోగి తనను "హరిదాసుడనని" పేర్కొనెను.

ఆ వెంటనే అపూర్వమైన, అకస్మాత్సంఘటన మరియొకటి జరిగినది. ఆ తిరుక్కోవలూరి ఆయనార్యాశ్రితవత్సలుండగు శ్రీహరి వారి నడుమజొచ్చి కనబడక తన సురుచిరాంగములతో నొరపిడి గావించెను. అది వారెరింగిరి. 'ఉన్నవారము మువ్వరము ఒరులెవ్వరును ఇటలేరు. ఈ వింత యేమొకో?!' యని ఆశ్చర్యపడుచుండగా వారికపుడు అప్రాకృత, అద్భుత దివ్యమంగళ మూర్తి యగు దేవదేవుడు అక్షిపదగోచరుండయ్యెను. అంతట ఆ మహాభాగవతులు, ఆ దేవదేవు ప్రణుతులొనరిచి, భూరివేదాంత సూక్తులచే పొగడిరి.

వీరి జీవితకాలం : 3025 సం॥లు భూసంచార మొనర్చిరి.

వీరి రచనలు : క్రమముగా-

పోయిగై యాళ్వారులు : ముదల్ తిరువందాది 100 పాశురములు.

పూదత్తాళ్వారులు : ఇరండామ్ తిరువందాది 100 ,,

పేయాళ్వారులు : మూన్డామ్ తిరువందాది 100 ,,

వీరు భగవంతుని స్తుతించిన విధము ఈ గ్రంథములో వివరింపబడలేదు సంగ్రహముగా నిట్లు సూచింపబడినది.

ఇట్లు సన్నుతించి ఈ ముప్వురు మహాత్ములు వయ్యందగళియా అనియు, అన్బేదగళియా యనియు, తిరుక్కండేన్ పోన్మేనిక్కండేన్ అనియు నుపక్ర మించి సర్వాధికారంబులగు మూడు ప్రబంధంబు లానతిచ్చిరి.

## శ్రీ భక్తిసారుల వైభవము

**ప్రధాన కథాంశము :**

భక్తిసారులనంబడు **తిరుమళిశై యాళ్వారుల ప్రభావము** : వీరి జీవిత చరిత్రలో 27 సీసములు, వచనములు నాల్గు 148 పంక్తులు గలవి, గద్య పంక్తులు 17, తనియలు 2 గలవు.

**జన్మాదిక విశేషములు :**

మహీసారపురమున, సౌదర్శనాంశవల్ల, మఖతారకను, పుష్యమాసము నను, పిండ రూపమున జన్మించిరి. పల్లవ దేశము. తొండ మండలము. తల్లి దండ్రులు : భార్గవముని, అతని ధర్మపత్ని. పిదప పంచశక్తి మయాంగు డయ్యెను. పెంచినవారు : మేదరవాడగు "తిరువాళరు" అతని భార్య పంకజొచ్చొల్లియారు. కులము : ఇట్లీతని కులము శూద్రవర్ణము క్రిందికి వచ్చి వ్యాప్తినందినది.

**జీవితములోని సంఘటనలు :**

**బాల్యదశ :** ఈ యాళ్వారులు శిశుదశలో తల్లి స్తన్యమును గ్రోలలేదు. కాని చతుర్థకులజులగు వృద్ధ దంపతులు తెచ్చి యిచ్చిన గోక్షీరమును గ్రోలుచు బాలుడుగా వృద్ధి నొంది, క్షీరదాతలకు కుమారుడు కలుగునట్లు వరమిచ్చెను. ఆ వృద్ధ దంపతులు నవయౌవనులై సంసారమును కొనసాగించి, ఒక సుతుని

**బాల్యదశానంతరము :** ఈ యాళ్వారులు ఋషి పుత్రులు గావున భగవదనుభవ ప్రాప్త యమ, నియమాసన ప్రాణాయామ ప్రత్యాహార ధ్యాన ధారణ సమాధి రూపాష్టాంగ యోగ సంపన్నుండయ్యెను. శైవ, మాయావాద, శాక్యోలూక మతసిద్ధాంతములలో ప్రవేశించి అరసి చూచెను. వానియందు సారముగానక 700 సం॥ తపస్సుచేసి నారాయణుని అనుగ్రహమున శ్రీవైష్ణవుడయ్యెను.[1] కృతజ్ఞతా సూచకముగా శ్రీమన్నారాయణుడే పరతత్త్వమని నిర్ణయించెడు రెండు ప్రబంధముల రచించెను.

రచనలు : 1. నాన్ముగం తిరువన్దాది 96 పాశురములు
తిరుచ్ఛంద విరుత్తమ్ 120 ,,

పిమ్మట కైరవిణీ తీరమున 700 సం॥లు భగవదనుభవపరుడై కాలము గడిపెను.

**ఇతని ప్రభావమును తెలియుజేయు సంఘటనలు కొన్ని :**

1. లోకసంచారమును చేయుచున్నట్టి పార్వతీ పరమేశ్వరు లితని కడకు వచ్చిరి. రుద్రుడు వరమిత్తుననెను. ఆళ్వారులు వలదనెను. ఐనను అతడు బలవంతము చేయగా నితడు సూదిలో దారము చనునట్లు వరమిమ్మనెను. అవమానముగా భావించి వామదేవుడు ఫాలాగ్నిని పంప, నా దివ్యసూరి తన కాలిబొటన వ్రేలగల నయనమును దెరచి ఫాలాగ్ని నణంచెను. రుద్రుడు తిరిగి ధారావృష్టి కురిపించెను. కాని ఈ మునికుమారుడు నిశ్చలముగా నుండెను. ఇందులకాశ్చర్యపడి పార్వతీపతి యితనికి "భక్తిసార" నామము నొసంగెను.

2. శుక్తిహారుండను ఖేచరుం డితనికి కవచమును, రత్నహారము నీయబోగా నితడు తన శరీరమును, ఇంకను ప్రకాశవంతమైన వానిని జూపించెను,

---

1. ఇతడు ప్రథమమున శైవుడై యుండుటచే "శివక్కియార"నియు వైష్ణవుడైన పిమ్మట భక్తిసారుడనియు నాబడెను. (సర్వసిద్ధాంత సౌరభము VII భాగము, 128 వ పుట).

**గమనిక :** చారిత్రకాధారముల కనుగొనవలయును,

3. ఇట్లే కొంకణ సిద్ధుడిచ్చిన రసగుళికను స్వీకరించక తన చెవి గులిమిని గుళికగాజేసి, యిది కోట్ల బంగారమును సృష్టించునని చెప్ప వాడీతనికి ప్రణుతి గావించి వెడలిపోయెను.

4. యథోక్తకారి వృత్తాంతము :

సత్యవ్రత క్షేత్రమున పోయ్గ సరస్తీరమున 700 సం॥లు యోగ ధారణ తత్పరుండై యున్నంత కణికణ్ణరను సాత్త్విక పుంగవుడీతని నాశ్రయించెను. భక్తిసారు లితనికి అఖిల హితము లుపదేశించి కాలము గడుపుచుండెను. తనను నిత్యము సేవించు ఒక ముసలి యవ్వకు యౌవనము నొసంగెను. ఆ పడతి నా దేశపు రాజు వల్లవరాయలు మోహించి తన పట్టమహిషిగా జేసికొనెను. సంసారమును సాగించుచు, ఆమె నిత్య యౌవన కారణమును తెలిసికొని, కణి కణ్ణరను శిష్యుడటకురాగా, రాజతనితో భక్తిసారుల రాజ భవనమునకు రప్పింపు మనెను. తన గురువు రాజుల నాశ్రయించునట్టివాడుగాడనగా, రాజాతనికి దేశ బహిష్కార శిక్ష వేసెను.

ఈ వృత్తాంతమును తెలిసికొని భక్తిసారులు శిష్యుని అనుసరించుటకై సిద్ధపడి, అచటి దేవదేవుండగు శ్రీమన్నారాయణుని సపరివారముగా తనతో రమ్మనెను. అట్లందఱా రాజ్యము వీడిపోవగా, సకల దేవాలయములందలి దేవతా విగ్రహముల దృశ్యములయ్యెను. అపుడు రాజు మంత్రులతో విచారించి, తన తప్పులను తెలిసికొని, భక్తిసారుల శిష్య నాశ్రయించెను. అతడు తన గురువును ప్రార్థించెను. అట్లందఱును తిరిగి నగరమునకు చేరుకొనిరి.

భక్తిసార మునీంద్ర ప్రార్థితుండై శ్రీమన్నారాయణుండట్లొనర్చెను గావున నా దేవునకు నాటి నుండి "శొన్నవణ్ణం శెయద పెరుమాళ్" అనియు, "యథోక్తకారుండనియు" పేర్లు ప్రసిద్ధమయ్యెను.

5. కులము ప్రధానముగాదను దృష్టాంతము :

భక్తిసారులు సత్యవ్రతక్షేత్రము నుండి కుంభకోణ దివ్య దేశమునకేగుచు మార్గమధ్యముగల "పెరుంబులి యూరియందు" నొక్కయెడ పంచతిన్నెపై నుండెను. అచటనే వేదమును చదువునట్టి బ్రాహ్మణులీతనినిగాంచి, శూద్రుండని తలంచి వేదప్రవచనముల నిలిపివేసిరి. ఇంగితజ్ఞానులైన మునీంద్రులచటినుండి లేచిపోవసమకట్టగా విప్రులు తిరిగి వేదము నారంభింపదలచిరి. కాని వరుసలు

కృష్ణవ్రీహిచ్ఛేదనము గావించెను. అపుడా బ్రహ్మణులకు "కృష్ణానాం వ్రీహీనాం నఖ నిర్భిన్నం" అనియెడు వాక్యములు గోచరించెను. వెంటనే వారు మునీంద్రుల నాశ్రయించి క్షమాపణ వేడుకొనిరి.

జ్ఞానమునకు కులము ప్రధానముగా దను విషయము వారికి తెలిసెను.

"భగవద్భక్తులగువారు శూద్రులుగారనియు, వారలే విప్రసత్తములనియు, సకల వర్ణంబులయందు భగవద్భక్తి లేనివారే శూద్రులనియు పంచమవేదంబగు శ్రీ మహాభారతంబున జెప్పంబడెను." (అ. సూ. ము. పుట. 14)

6. 'పెరుంబులియూరు'నకు బాహ్యప్రదేశమున నున్న యాగంబుసేయు బ్రాహ్మణోత్తములితని మహిమను మొదట గ్రహింపరైరి. కాని, యజ్ఞదీక్షితుడు మునీంద్రుల ప్రభావము నరసి, అర్ఘ్యపాద్యాదివిధులచే నగ్రపూజ యొనర్చెను. కొంద అసూయపరులు దీని నధిక్షేపించిరి. వీరికన్నులు తెరపించుటకై ఆళ్వారులు శ్రీమన్నారాయణుని స్వరూపము నచట ప్రత్యక్షమగునట్లు చేసెను. వారు సంత సించి అతనికి బ్రహ్మరథము పట్టిరి. వారికితడు తత్త్వజ్ఞానోపదేశము సేయ వారు కృతార్థులై చనిరి.

రచనలు :

పిమ్మట వీరు కుంభకోణమునకు చేరుకొని అచటి అపర్యాప్తామృతాభి ధానుండగు హరిని సేవించుకొనిరి. అచటి వారికి 1. నాన్ముగం తిరువందాది 2. తిరుచ్చంద విరుత్తం అను రెండు ప్రబంధముల రచించి విన్పించెను.

ఇట్లచట 2300 సం॥లు క్షీరసీరాహార సేవియై కాలము గడిపెను. పిమ్మట శ్రీహరిని ఉత్తానశయత్వమొందునట్లుగా చేసి ఇలలో 3700 సం॥లు జీవించి శ్రీసుదర్శన భావమును జెందెను.

ఇందలి సాహిత్య వైభవము :

భగవద్భక్తులను జూచి మాటాడలేవా? యను ప్రశ్నకుపవ్వళించి యున్న శ్రీహరిలేవబోవుచున్నట్టి పద్యము కన్నులకు గట్టినట్లుగా నున్నది.

''శ్రీకవేరకుమారి సేమంబునకు నిందు
బవ్వళించితిగాని భక్తజనుల
గని లేచి మాటాడగా లేవా? యన హరి
లేవనుద్యోగింప, భావ మలరి,
'భక్తిసారుండట్లు పవళింపు' మన నేటి
కైన నుత్తానశయత్వమొంది,
హరియుండె'' నమ్ముని వరుడంత మూడువే
లేడునూటేలీ యిలవసించి

పరమ సాత్త్వికులై ప్రపన్నులకుచు,
దానుజేసిన గ్రంథముల్ దగ నొసంగి
శ్రీ సుదర్శన భావము జెందెననుచు
వాదిభీకర గురుడనె మోదమలర!"

ప్రధాన కథాంశము :

## కులశేఖరరాళ్వారుల వైభవము

ఇందు 8 సీస పద్యములు మాత్రమే గలవు. గద్య ఒక పంక్తియే. జన్మ వృత్తాంత విశేషములు :- తిరునక్షత్ర తనియ భావముగల పద్యము :

"కుంభే పునర్వసూజాతం, కేరళేచోళపట్టణే
కౌస్తుభాంశం ధరాధీశం - కులశేఖర మాశ్రయే."

"మాఘ పునర్వసు మహి గొల్లె నగరియం
దవతరించిన కౌస్తుభాంశుడెవడు....''

వివరణములు : కేరళ (చేర) దేశమునందలి : కొల్లెయను నగరిలో జన్మించిరి. కౌస్తుభాంశము. తండ్రి : దృఢవ్రతుడను మహారాజు. కులము క్షత్రియులు, రాజులు.

రచనలు : సంస్కృతము. ముకుందమాల. 40 శ్లో.
పెరుమాళ్ తిరుమొళి. 145 పాశురములు.

ఇది భగవత్స్వరూప గుణవిభూత్యుపపాదక దివ్యప్రబంధము. జీవిత కాలము : 67 సం॥ క్రీ.శ.

కథాసంవిధానము :- ముకుంద మాలకుగల తనియశ్లోకమునందలి భావాను గుణ్యముగా వీరి జీవిత చరిత్ర మొదటి పద్యము వ్రాయబడినది.

తనియ : "ఘుష్యతే యస్యనగరే - రంగయాత్రాదినేదినే''

అ. సూ. ము. :- "శ్రీరంగరాజ నిస్సీమ కృపోదిత
జ్ఞానభక్తి విరక్తిజలధియెవ్వ
డనిశము శ్రీరంగ యాత్ర యెవ్వనిప్రోల
జాటింపబడును నిస్సంశయముగ....''

ఈ మహనీయుని ఘనత :

1. "సరస వేంకటగిరి స్థావర జంగమాన్యతర జన్మకాశ పడినవాడు."
2. "సకల పురాణైకసార ముకుంద మాలజేసి చదువువాడు"
3. "ఇతిహాస రత్నమౌ వితత రామాయణమున నిశమాలించువాడు"
4. "క్షోణి శ్రీవైష్ణవుల్ చోరులు గారని నమ్మువాడు."

వీరి భక్త్యావేశము :

1. రామాయణంబు బౌరాణికుండొకనాడు" చెప్పుచు, అసురేంద్రుడు శ్రీరామ లక్ష్మణుల వంచించి "సీతనపహరించె" నని నుడివెను వెంటనే కుల శేఖరులవారు సీతను దెచ్చుటకై దివ్యాసిపాణియై దివ్యాశ్వముపై నెక్కి ప్రయాణ సన్నద్ధుడై కదలిపై వేగజన, శ్రీరామ లక్ష్మణ రూపియగు శౌరి పుడమిసుతను ఈ చక్రవర్తికి జూపి మగుడ నగరికి దోడ్కొని వచ్చెను.

2. రాజు మందుండైనాడని అమాత్యులు వేసిన పథకము. పెరుమాళ్ళ పెట్టెలోని మౌక్తికహారమును దాచిపెట్టి, శ్రీవైష్ణవులే దానిని దొంగిలించినారని రాజునకు తెలిపిరి. అంతనా రాజు "క్షోణి శ్రీవైష్ణవుల్ చోరులు గా"రని ప్రతిజ్ఞ సేసి తార్కాణముగా కృష్ణ సర్పము నోటిలో తన హస్తమునుంచ అతని కేమియు బాధ కలుగదయ్యెను.

రాజ్య త్యాగము : విష్ణుచింతన సేయువారి నితడు చూడదలంచక రాజ్య మును కుమారున కప్పగించి, శ్రీ రంగధామము జొచ్చి అచట తన యాశ్రితుల కొరక ప్రబంధమును రచించి విన్పించెను.

"గంగపై కాళిందిగతి శేషశయ్యపై
రంజిల్లు శ్రీరంగరాజ మూర్తి
గనుగొని పెన్నిధిగన్న దరిద్రుని
పగిది సంతోషించి పరమభక్తి...."

**కులశేఖరుల సాహిత్య పరివ్యాప్తి :**

1. ముకుందమాల కసంఖ్యాకముగ టీకాతాత్పర్యములు వెలువడుటయే గాక పెక్కు అనువాదములు వెలసినవి. పద్యానువాదముల సంఖ్య=41 ని దాటినవి.

(ముకుందమాలకు శ్రీమాన్ చెల్లమచర్ల రంగాచార్యులవారి పీఠిక, పద్యానువాదమును జూడనగును. పుటలు. 31, ప్రచురణ 1973.)

2. పెరుమాళ్ తిరుమొళికి టీకా తాత్పర్యములు గలవు. గోదాగ్రంథమాల

3. విష్ణుభక్తి సుధాకరమను పేర కులశేఖరాళ్వారు చరిత్రము రచయిత: పూసపాటి విజయరామరాజు.

4. కులశేఖర మహీపాల చరిత్ర—శేషం రంగనాథాచార్యులు.

5. పరిశోధన సిద్ధాంత గ్రంథము : ఎం. ఫిల్. మద్రాసు 1984. రచయిత : టి. ఎస్. నరసింహాచార్య

ఇదే ప్రకరణము నందలి యాశ్వాసాంత పద్యములో గల కథాంశములు:

కాసారభూత మహిమ
హానంయమి భక్తిసార హరిపర భక్తి
శ్రీసంయుత కులశేఖర
వ్యాసహృదబ్జా! యతీంద్ర! వరగుణ సాంద్రా!
(ఇందు నల్గురు ఆళ్వారుల పేర్లు గలవు.)

## పూర్వభాగము - ద్వితీయోల్లాసము :

**సంఖ్యావివరములు :** సీసములు=82, కందములు=2 శార్దూలము=1, మాలిని=1, వచనములు=15 - 192 గద్యలు=3, తనియలు=3 గలవు.

**ప్రధాన కథాంశములు :**

1. పెరియాళ్వారుల వైభవము
2. శూడికొడుత్త నాచ్చియారు వైభవము
3. తొండరడిప్పొడి యాళ్వారుల వైభవము.

# పెరియాళ్వారుల వైభవము

## (విష్ణుచిత్తుల వైభవము)

ఇందు సీసములు=6, గద్య=1, వచనములు=1 - 65, తనియలు=1 గలవు.

వీరి జీవితకాలము : 85 సం॥లు జీవించిరి.

జన్మాదిక విశేషములు : విల్లిబుత్తూరని ప్రసిద్ధిగల నగరము. దీనికే ధ్వనిపురమందురు. ఇచటి నివాసియైన ఒక పరమవైదికుడైన బ్రాహ్మణునకు జ్యేష్ఠమానము నందు, స్వాతి నక్షత్రమున, గరుత్మంతుని యంశవల్ల విష్ణు చిత్తులవారు జన్మించిరి. పుట్టుకచేతనే శౌరికృపను వైష్ణవుడయ్యెను.

కులము : బ్రాహ్మణుడు. దేశము : పాండ్యమండలము. తండ్రి పేరు : ముకుందాచార్యులు.

కథాసంవిధానము : ఇతడు సహజదాస్యైక రతుడుగాన విల్లిబుత్తూరి ''వడపెరుంగోయిలుడయాన్'' అను శ్రీకిరిక పుష్పమాలాకైంకర్యము సేయు వృత్తిగలవాడయ్యెను. ఇందుకుగాను త్రియోజనాయామ విస్తారంబగు తిరునందన వనంబొనర్చి, నిరంతరంబును శ్రీ తులసీ పుష్పమాలా సమర్పణము సేయు చుండెను. ఒకానొక సందర్భమున ఆ పాండ్య దేశమునకు రాజైన వల్లవరాయ డను వాడు స్వానుభవసంఘటనమును పురస్కరించుకొని (నగరీ శోధనార్థ సమయమున "వర్షార్థమష్టౌ" అను శ్లోకమును వినిపించుకొని) విద్వాంసుల సమక్ష మున పరతత్త్వ నిర్ణయము చేయింపదలంచి, తన పురోహితుల, హితోక్తుల ప్రకారము బహుద్రవ్యంబు విద్యాశుల్కంబుగా ముల్లెగట్టి, యొక తోరణ స్తంభమునం గట్టించి, ప్రకటన గావించి, పండితుల నాహ్వానించెను.

నాటి రాత్రి "వడపెరుంగోయిలుడయ్యాను" భగవంతుడు, శ్రీవిష్ణుచిత్త సూరికి స్వప్నంబున పొడసూపి, అతనిని, విద్వత్సభయందు పాల్గొని, పరపక్షవిక్షేపణ పూర్వకంబుగా, సర్వ వేదాంత ప్రతిపాద్యంబగు పరతత్త్వంబు స్థాపించి, విద్యాశుల్కంబు గ్రహించవలసినదిగా యాదేశించెను.

విష్ణుచిత్తుని సందియము : "సర్వవేదాంత ప్రతిపాద్య వేదశాస్త్రాధ్యయ నాది జనిత జ్ఞాన వాసనాహీనుండనగు నేను విద్యాశుల్కంబైన యద్ధనంబు

పుష్పవన ఖనన జనిత స్వపాణితల కిణగణంబు జూపి తేవలయుగాని, వేరొక యధికారంబునం గొనలేననిన," శ్రీహరి తానే సర్వభార నిర్వాహకుడనని చెప్పి విష్ణుచిత్తుని విద్వద్గోష్ఠికి పంపెను.

**విష్ణుచిత్తుల దిగ్విజయము :**

సభలో వాద ప్రతివాదములు జరిగినవి. శ్రీధన్వీపురీ నిత్య నివాసుడైన శ్రీనివాసుని యనుగ్రహంబుచేత శ్రీభట్టనాథులవారు సాంగోపాంగసశిరస్క-సర్వవేదార్థాభిజ్ఞుండై, సప్రమాణ పూర్వకంబుగా శ్రీమన్నారాయణుడే పరతత్త్వమని నిర్ణయించి సిద్ధాంతము చేసెను. అంత విద్యా శుల్కపుమూట ఆయన పాద సమీపమున బడెను.

జయసూచకముగా పాండ్యదేశాధిపతి అతనికి భట్టనాథుడని పేరిడి ఘన సన్మానమొనరించి, ఊరేగింపు నేర్పాటు చేసి, ఆ సందర్భమున విష్ణుచిత్తులను భద్రగజము పైకి కేలూతనిచ్చి యెక్కించి, సపరివారుడై, మంగళవాద్యము లొప్పారగా, నాతనికి బ్రహ్మరథము పట్టెను. ఈ ఘట్టమును కేశవాచార్యుల వారు కన్నులకు గట్టినట్లుగా వర్ణించినారు. "శ్రీహరి లక్ష్మీ సమేతుడై, గరుడ వాహనారూఢుడై, విను వీధినుండి చూచుచుండెను. వేల్పులంద నుసరించిరి. అది గాంచి విష్ణుచిత్తులవారు భక్తిని శ్రీహరికి బహువిధంబుల పల్లాండు పాడిరి."

వీడుకోలు పిమ్మట వీరు తిరిగి విల్లిబుత్తూరనకే తెంచి, తొంటిక్రమమున పుష్పమాలా కైంకర్యపరుడయ్యెను. అచటి వైష్ణవులకు పంచశత గాథా దివ్య ప్రబంధమును జెప్పెను.

వీరి రచనలు : 1. తిరుప్పల్లాండు = 12 పాశురములు

2. పెరియాళ్వారు తిరుమొళి = 461 పాశురములు

సాహిత్య పరివ్యాప్తి :

1. తిరుప్పల్లాండునకు పద్య, గేయానువాదములు చాల గలవు.

2. పెరియాళ్వార్ తిరుమొళికి టీకాదులు గలవు. (గోదా గ్రంథమాల) భాగవతసారమను పేర శ్రీమాన్ మాడభూషి గోపాలాచార్యుల పద్యానువాదము గలదు.

ప్రధాన కథాంశము :

## శూడికొడుత్త నాచ్చియారు (ఆండాళ్) వైభవము

ఇందు సీసములు=14, గద్య=1, తనియ=1 గలవు.

జన్మాదిక విశేషములు :-

శ్రీవిల్లిబుత్తూరుననే శ్రీవిష్ణుచిత్తులవారు తులసీవనమున త్రవ్వుచుండగా భూదేవ్యంశన బుట్టిన యొక బాలికామణి కన్పించెను. జనకునకు సీత లభించిన విధముగా కవి వర్ణించినాడు. కాన విష్ణుచిత్తుడు పెంపుడు తండ్రి యయ్యెను. లభించిన శుభసమయము కర్కాటమునందు పూర్వ ఫల్గుణీ నక్షత్రము.

కథాసంవిధానము : విరుల సరుల కథ.

జనకునింట జానకి విధముగా విష్ణుచిత్తునింటనీ బాలిక విమలపక్ష చంద్ర రేఖ వలె సంతత పరివర్ధమాన దివ్యాంగి యయ్యెను. ఒక సందర్భమున విష్ణు చిత్తగురుడు వటపత్ర శాయికై విరుల సరుల గట్టి యుంచెను. దానిని మఱుగు నుండి చూచి ఆ కన్నియ తాను స్వయముగా పుష్పమాలికలను దాల్చి ఆదర్శము (అద్దము) లో వీక్షించి, హర్షించి ఎప్పటి యట్లుంచెను. ఈ విషయమును తండ్రి కనిపెట్టి అలిగినవాడై ఆ విరిదండను పూజాసమయమున హరికి సమర్పింపలేదు.

నాటి రాత్రి అతనికి హరి కలలో కనబడి "యీవేళ మాల్యములందవయ్యె నేమికరణమని" ప్రశ్నింప విష్ణుచిత్తులు "మత్పుత్రి యెఱుగక మాల్యములివి దాల్చెనవి మీ కొసంగ రాదని తలంచి యర్పింపనైతి" ననెను. అపుడు శ్రీహరి యిట్లనెను: "ధన్యుడవు నీవు నీతనయ దాల్చిన పుష్పమాల్యము లన్నియు మాకవి ప్రియములతి భోగ్యములవి సౌరభములగుగాన మా కవియిమ్ము గణ్య సుగుణ" అని అగోచరుడయ్యెను.

అంత విష్ణుచిత్తులవారు తన కుమార్తెను "సీశయో, భూమియో, నీరధి కన్యయో" యని తలంచి 'శూడికొడుత' యని ఆమెకు పేరిడెను. నాటినుండి ఆ దివ్యనామము నిరూపకమై వైష్ణవ స్త్రీలకు శిరోధార్యమయ్యెను.

ఈమె రచనలు : 6 వ పద్యములో చక్కగా వర్ణింపబడినవి. ఈ చూడి కొడుత "శౌరిని గోపికలట్లు తావారల ననుకరించి, 'తిరుప్పావును' చేసెను. మఱియు వానిగా "నాచ్చారు తిరుమొళిని" రచించెను. పాశురముల సంఖ్యలు:

ఇంకొక కథ : వివాహ విషయము : ఈ కథ గోదా కల్యాణమను పేర జగత్ప్రసిద్ధము. అందరకును ముచ్చటగొలిపే శుభసన్నివేశ మీ కథావస్తువు.

తన కుమార్తె వివాహోచితవయస్కయైనదని తండ్రి గ్రహించి, వరుని గూర్చి విచారించగా, శూడికొడుత తన నిర్ణయమును దెల్పెను:

"కలుముల జవరాలు కాంక్షించెనెవ్వాని
వాడెయల్లుడు నీకు వరగుణ" యనెను.

అపుడు తండ్రి అర్హైన హరి అర్చారూపియై 108 దివ్యదేశములందు న్నాడు. వారిలో నీకిష్టమైన వాని నెన్నుకొమ్మని, అర్చామూర్తులు, వారి ప్రభావ ముల నభివర్ణించెను. అన్నియు విన్న పిదప, "శ్రీరంగశౌరి" తనకు భర్తయని తండ్రి కలలేక దెల్పెను. దీనిని స్వయంవర పద్ధతి యందురు.

అపుడు విష్ణుచిత్తుడు ''మత్పుత్రికభిమతమేమాడ్కి'' సమకూడునని చింతింప, నతనికి కలలో శ్రీహరి కన్పించి, ''నీ పుత్రి మత్ప్రాణతుల్యయౌ మహిషి మాకు'' అని పలికెను.

ఆ వెంటనే శౌరి తన సన్నిధి వారికి "శతశతాకచ్ఛత్రచామర తాళవృంత పతాక భవ్య వాద్యములతో" భట్టనాథ సుతనిటకు తోడితెండని యాజ్ఞాపింప, వారలట్లే ధ్వనినగరికరిగి, ఆమెను స్వర్ణశిబిక యందుంచి, విష్ణుచిత్తులతో సహా "నృత్యగీత రవంబు, నిఖిల వాద్యధ్వనుల్. దిఙ్మండలముల పొగరదంప" శ్రీరంగధామము చేరుకొనిరి. అచటి వనితలీమెను జూచి కొనియాడు ఘట్టము :

"ఈ పిన్నపాపచే యిల భట్టనాథుడు,
తులసీవనము ద్రవ్వ వెలసి యుండె,
ఈ ముద్దుగుమ్మచేయట సూరి వరులకు
వదుగుదుకిని ముద్దుపట్టిమయ్యె
నీ మందయానచే తా ముందుగా దాల్చి
విరులదండల హరి కొఱకొసంగె,
నీ ముద్దురాలచే యిచ్చచే తాగొల్ల
పడతియై కృష్ణానుభావ మొందె
తగును శ్రీరంగభర్త యీ తరుణికతని
కీ శుభాంగియు దగునని యింతులనగ,
భావమలరంగ వినియె నద్దేవి యనుచు
వాది భీకరగురుడనె మోదమలర!"

లయము జొచ్చి,

"శ్రీ లలనాకాము, నీలమేఘశ్యాము,

రమ్యగుణస్తోము, రంగధాము," కనుంగొని కడువేడ్క కర పద్మముల మోడ్చి "శేషతల్పంబెక్కి, చింతదక్కి, మగని శ్రీపాద పద్మము లాలించుచు" నదృశ్యమయ్యెను పుత్రిని గానక భట్టనాథుడు బోరన నేడ్వ, శౌరి యాతని కిట్లు బల్కెను:

''మామవైతివి దుగ్ధాబ్ధి మాడ్కి మాకు

నీదు సుతతోడ నేను గన్పింతు నీకు"

చింత వలదని చెప్పి, మగిడి యాతనికి బహుమతు లొసంగ, నాతడు తిరిగి, స్వదేశము చేరుకొని హరికి సుగంధప్రసూనదామములను సొబగుమీరగట్టి యర్పించుచు యున్నకాలమంత గడిపెను.

గమనిక : ఈ గ్రంథములో గోదాకల్యాణఘట్ట మతి సంగ్రహము.

ఇతర విశేషాంశములు : అదనపు సమాచారము.

గోదాదేవి కథ బహుళ ప్రజాదరణ పొందిన విశేషము. తెలుగు సాహిత్యములో ఈ యమ జీవితచరిత్ర, కల్యాణఘట్టముల గూర్చి వివిధ ప్రక్రియలలో గ్రంథములు వెలువడినవి. ఈమె సాహిత్యము ప్రజలలో వ్యాప్తిజెందినదనుటకు నిదర్శనములు ప్రతి యేట దేవాలయాదులలో జరుగు ''తిరుప్పావై" కాలక్షేపములు ముఖ్యములు.

గోదా సాహిత్య పరివ్యాప్తి :

1. ''తిరుప్పావై'' పద్యానువాదములు బహుళము.
వ్యాఖ్యానము లెన్నియో గలవు.

2. ఆ సూ.ము లోని పద్యములను కీ. శే. తిరునగరి కృష్ణయ్యాచార్యులు గారు గద్యములోని కనువదించిరి.

3. ''నాచ్చియారు తిరుమొళి'' పద్యానువాదములు, వ్యాఖ్యలు గలవు.

4. పరిశోధనా వ్యాసములోను గలవు. ఉదా॥ ఎం.ఫిల్. సిద్ధాంత వ్యాసము, రచయిత డా॥ కె. పెరుమాళ్ళాచార్యులు.

5, స్వప్న ప్రభావ గ్రంథములు గలవు.

6. కొన్ని చక్కని కావ్యములు, నాటికలు, యక్షగానములు, వ్రత గ్రంథములు గలవు

7. "తిరుప్పావై-సటీక: శ్రీ వేంకటేశ్వర గ్రంథమాల-గార్ల-నైజాం. 1924 ప్రచురణ. ఈ గ్రంథము మొదట ఆ.సూ.ము.లోని ''శూడికొడుత్త నాచ్చియార్ వైభవము'' గలదు. కాని "వాది భీకర గురుడనె మోదమలర'' అను మకుటమును మార్చి తగిన పాదపూరణము నెవరో చేసినారు, పరిశోధకులు పరిశీలింపగలరు.

ప్రధాన కథాంశము :

## తొండరడిప్పొడి యాళ్వారుల వైభవము

ఇందు సీసములు=62, వచనములు=13-68, గద్య=1, తనియ=1 గలవు.

జన్మాదిక విశేషములు : వ్యాప్తినొందిన పేరు : "విప్రనారాయణుడు." వీరు మండంగుడి యను పురములో శ్రీధనుర్జ్యేష్ఠయందు, దేవేశు వైయంతీ వన మాలికాంశముచే జన్మించిరి.

కులము : విప్రుడు; పాండ్య మండలము.

జీవితకాలము : 80 సం॥లు జీవించిరి.

విద్య : శౌరి కటాక్ష వీక్షాలబ్ధ సాత్త్వికతాస్తికతాది గుణములు గల్గి, విష్ణు కృపాపాత్ర వివిధ సాంగోపాంగ సశిరస్క వేద విజ్ఞాన ఘనుడయ్యెను అవివాహితుడు.

కథా సంవిధానము :- మండంగుడి నుండి విప్రనారాయణులు శ్రీరంగ ధామము చేరుకొనిరి. విష్ణుచిత్తులవలె వీరును పూదోట నేర్పరించుకొని కస్తూరి రంగని కనిశము పుష్పమాలా కైంకర్యము గావించు వృత్తిని చేపట్టిరి. ఒకానొక సందర్భమున వీరు తన పూదోట కేతెంచిన "దేవదేవి"యను అపురూప సౌందర్య వతి యగు వేశ్యకాంతకు, ఆమె వేడుకోలు ననుసరించి పుష్పవనరక్షణ, గృహ శుశ్రూషణ జేయు నిమిత్తము మాత్రమే ఆశ్రయ మొసంగిరి. ఆ దేవదేవి ఎందుల కాశ్రయించినదో, తన అక్కయగు మధురవాణితో నేల పంతగించి వచ్చినదో పాపమీ అమాయక విప్రనారాయణులకు ఏమాత్రమును తెలియదు.

తొండరడిప్పొడి యాళ్వారుల చరిత్రలో ''దేవదేవి కథ'' ప్రధాన స్థానము నాక్రమించినది. ఈ వేశ్యకాంత నాలంబముగా జేసికొని కవిగారు కథను రస వత్తరము సేయదలంచి, హృద్యమైన వర్ణనలచే శృంగార రసపోషణమున తెలుగు ప్రబంధకవుల త్రోవ ద్రొక్కినాడు.

**శృంగార రసమును చిత్రించుట కాళ్వారుల, ఆచార్యుల చరిత్రలలో అవకాశములుండవచ్చునా? యను సందేహమందఱకును కలుగవచ్చును :**

కొన్నివేళల కవులు నిరంకుశులు, ''నిరంకుశాఃకవయః'' కావ్యములలో శృంగార రసమును పోషింపని కవి కన్పించడు. భగవత్కథలలో గూడ శృంగార రసము సమాదరణీయమే. ఇందులకు తార్కాణము:

''కల్యాణం భగవత్కథాగ్రథవతః కావ్యం విధాతుః కవేః,
తస్యైవాంగతయా క్వచిద్రచయత శ్శృంగార వీరాదికమ్,
కోదోషో భవితా యదత్ర కవితా శీలైస్సమా శ్రీయతే,
పంథావ్యాస వసుంధరా శ్రుతిభవ గ్రంథాదిమ ప్రేక్షితః॥''

అని వ్యాసమహర్షి 709 వ శ్లోకమున చెప్పబడి యున్నది. (విశ్వగుణా దర్శనము: పుట : 665, శ్లోకసంఖ్య=877.)

ఈ కవి శృంగార రసము నధికముగనే చిత్రించినాడు. ఐనను మూలాధారమైన గమ్యమును మఱువక "భగవంతుని సర్వతంత్ర స్వతంత్రతను, ఆశ్రితవాత్సల్యమును, శరణాగత రక్షణంబును నిరూపించుకున్నాడు.

**గమనిక :** వర్ణనలను గూర్చిన ప్రత్యేక శీర్షికను జూడనగును.

**కథాగమనము :** ఋష్యశృంగుని బోలిన నిర్వికారస్వామి విప్రనారాయణుడు. దేవదేవిని కొత్తమ సానిగా భావించినాడు. ఆదరించినాడు. కాని దేవదేవి పథకము వేరుగదా! ''గడువు దాటుచున్నది. తనకాతడు చిక్కలేదని, ఇక లాభము లేదని ఆ వేశ్య శ్రీరంగ శౌరిని శరణు బొందినది. భగవంతుడొక సన్నివేశమును గల్పించినాడు నాటిరాత్రి దొడ్డవర్షము హరి కృపను కురిసినది. ఆమె వర్షములో తడిసినది. విప్రనారాయణుడు ధౌతవస్త్రము నందించినాడు. ఆమె

అతని పాదసేవ కాశపడినది. అత దంగీకరించినాడు. వేళావిశేషము నిశీధియే. స్మరుడింతకన్న సమయములేదని, యాలీఢ పాదముల నిలిచి, తనవాడి తూపుల దాటి చూప, ఆ విప్రవరుడు సద్ధైర్యము విడిచి, సంతాపమొంది, తన దృష్టిని ఆ దేవదేవి సరస ముఖ గుళుచ్ఛముల యందు నిలిపి, ఆమెను వలచినాడు." ఆమె వలలో చిక్కినాడు. నాటిరాత్రి సుఖించినాడు. ఆమె పంతము నెగ్గినది. ఆ భాగవతోత్తముడు విధిలాసమున మోసపోయినాడు. కాముకుడైనాడు. ఆమెను వీడి క్షణముండుట లేదు. ఆటపాటలతో కొన్నిరోజులు గడచినవి (ఇచట వారి వనవిహార వర్ణనలు, శృంగార రసమతిశయించి వర్ణించబడినది.)

అతడు వేశ్యాలోలుడై విత్తము సర్వస్వము గోల్పోయినాడు. (వేశ్యా సంబంధీకులు, ముఖ్యముగా వేశ్యమాతలు చూపెడు మొదటి యాదరణ మెట్లుండునో, ధనము గోల్పోయిన పిమ్మట నెట్లుండునో యిట పేర్కొన బడినది. నాటి వేశ్యల గృహములు, వైభవములు, ఆచారములు మొదలగునవి కథా సందర్భమున తెలుపబడినవి.) విప్రనారాయణు నితో నికపనిలేదని అర్ధరాత్రి వేశ్యమాత అతనిని తన యింటి నుండి గెంటివేసినది. పాపమా విప్రోత్తముడు చేయునదిలేక తదీయ బహిర్ద్వార వితర్దికపై పవళించి శ్రీరంగనాథుని దలంచినాడు.

ఇచట మరొక విచిత్ర సన్నివేశము : ఈ భక్తునిపై చౌర్య మాపాదింప బడు విషయము సారాంశమేమన:

శ్రీరంగశౌరి బ్రహ్మచారి వేషమున దేవదేవి యింటికి వెళ్ళి, తాను అళహియమణవాళదాసుడను పేరుగలవాడనని, విప్రనారాయణులకు శిష్యుడ నని పరిచయము గావించుకొని, తన గురువొక బంగారు పాత్రను వారికై పంపినాడని దానినిచ్చెను. దేవదేవి దానిని తన తల్లికిచ్చెను అదియు మిక్కిలి సంతసించి ఆ విప్రవర్యుని రప్పించుకొని, తిరిగి స్వాగత సన్మానములు జరిపెను. నాటిరాత్రి ఆ వేశ్యతో నాతడు సుఖించెను. (ఇచటను తిరిగి శృంగార వర్ణన మధికముగా చేయబడినది.)

ఆ మరునాడు జరిగిన సంఘటనము : అంత ఉషః కాలమాయెను. శ్రీరంగేశుని అర్చక పరివారకాది బుధులు గుడికేతెంచి, సుప్రభాత మంగళవాద్యములు మ్రోగుచుండ, రంగనాథ దివ్యభవన కవాటముల దెఱచిరి. బంగరు

పురాధీశుడు) తెలిపిరి. రాజు దండనాథుని పిలిపించెను. అన్వేషణము ప్రారంభింపబడెను. చివర కాపాత్ర దేవదేవి తలగడమెత్త క్రింద నున్నదను సమాచారము వానికందెను. దండనాథుడా పాత్రను గైకొని, ఆ పాత్ర అచటికెట్లు చేరినదను విషయమును తెలిసికొని, తన రాజున కావిషయ మెఱింగించెను. అంతట నా రాజు దోషులను రప్పించుకొని దేవదేవి వద్ద అపరాధ రుసుము గైకొని, ఆమెను పంపివైచెను. దొంగతనము చేసినందులకు విప్రనారాయణులకు శాస్త్రోక్త శిక్ష విధించి, అంతఃపురమున కేగెను.

అంతట నాటిరాత్రి పుడమిజేనికి శ్రీరంగనాథుడు కలలో కనబడి, విప్రనారాయణుడు నిర్దోషి యనియు, అతనిని సత్కరించి, పూజించి పంపవలసినదిగా నాజ్ఞాపించెను. ఇట్లు ఆ సత్త్వజలధియగు విప్రనారాయణుడు తిరిగి తన పుష్పవనమును చేరుకొనెను.

**అతని శేష జీవితము : రచనలు :**

ఇంటికి వచ్చి, ఆత్మవిహీన కృత్యముల దలంచి, మిగుల ననుతపించి, విషయ విరక్తుడై ప్రాయశ్చిత్తముగా :

1. అర్థపంచకాభిజ్ఞత్వ పంచ సంస్కార సంస్కృతత్వాకారత్రయ సంపన్నాత్వాది లక్షణలక్షితులగు శ్రీ మహాభాగవతుల పాదంబు లుజ్జీవించి, పరమ పవిత్రుండనయ్యెదనని తలంచెను.

2. భగవంతుండగు నారాయణునకు ప్రార్థనీయంబై, పరమ పవిత్రంబగు శ్రీవైష్ణవాంఘ్రిరజోవ్రజంబు తనకు నిరూపక నామంబుగా—

"భక్తాంఘ్రిరేణువనియును,

తొండరడిప్పొడి యాళ్వారనియు" దివ్యనామము ధరించెను.

3. ధారక, పోషక, భోగ్యత్రయంబు భగవంతుండనియే విశ్వసించెను.

4. రచనలు : 1. తిరుమాలై = 45

2. తిరుప్పళియెళుచ్చి = 11

5. అను రెండు దివ్య ప్రబంధంబులానతిచ్చి వైభవము చాలించి అర్చారూపమును ధరించి యుండెను.

ఆశ్వాసాంతపద్యము

"శ్రీ భట్టనాథ, గోదా శోభిత దివ్య ప్రబంధ జుష్టమనస్కా-

శ్రీ భూత నగర భాగ్యప్రాభవ భక్తాంఘ్రిరేణు పదకమలాత్మా!"

(ఇందులో ముగ్గు రాళ్వారులపేర్లు గలవు.)

**ఇందలి వర్ణనాంశములు : శీర్షికలు :**

1. శ్రీరంగపుర వర్ణనము
2. శ్రీరంగని వర్ణనము
3. పూదోటవైభవము - వర్ణనము
4. ఆ పూదోట దేవదేవికి కనబడినరీతి : వర్ణనము
5. విప్రనారాయణుల ఆకారవేషభూషణాలంకారముల వర్ణనము
6. దేవదేవి ఆకార వర్ణనము
7. వారి విలాస శృంగార కేళి
8. వేశ్యల యిండ్ల వర్ణన
9. వృద్ధమాత (వేశ్యమాత) వైఖరి వర్ణనము
10. స్వప్నవృత్తాంతము
11. వైష్ణవధర్మ సంబంధ వేదాంత విషయముల వర్ణనము.

**సాహిత్య పరివ్యాప్తి :** తెలుగు సాహిత్యములో తొండరడిప్పొడి యాళ్వారుల గూర్చి బహు గ్రంథములు వెలువడినవి. 20 కి పైగా లభ్యములు.

1. పద్యకావ్యములు : వైజంతీ విలాసము.
2. నాటకాలలో - విప్రనారాయణ చరిత్ర, సువర్ణపాత్రికము.
3. వచనగ్రంథములు, యక్షగానములు, హరికథలు, కూచిపూడి నృత్యములు, నవలలు, రేడియో నాటికలు, దూరదర్శన్ సినిమాలు, సినిమాలు గలవు.
4. పరిశోధనా వ్యాసములును గలవు.

ఎం.ఫిల్. సిద్ధాంతవ్యాసము. ''విష్ణుభక్తితత్పరుడు - విప్రనారాయణ" - రచయిత. ఎల్ల బాలకృష్ణారెడ్డి.

## పూర్వభాగము : తృతీయోల్లాసము

**సంఖ్యావివరములు :**

సీసములు = 60, కందములు = 2, శా = 1, మాలిని = 1 గలవు. వచనములు = 12 - 281, గద్యలు = 3, తనియలు = 2 గలవు.

ప్రధాన కథాంశములు :

1. ధర్మవరుడను రాజుకూతురు శ్రీరంగరాజును పెండ్లాడుట.
2. తిరుప్పాణి యాళ్వారుల వైభవము..
3. తిరుమంగై యాళ్వారుల వైభవము

## ధర్మవరుడను రాజు కూతురు వైభవము

ఇందు సీసములు = 15, వచనములు = 4 పంక్తులు, గద్య = 1 గలవు.

కథాసంవిధానము :

చోళవసుధాధిపతి పేరు ధర్మవరుడు. నీళాంశమున అతనికొక కొమార్తె జన్మించినది. (కుమార్తె పేరు ఇందు పేర్కొనబడలేదు. నిగమశర్మ అక్కవలె భాసించు చున్నది.) ఆమె చంద్రకళలను బోలి దినదిన ప్రవర్ధమానయైనది. శ్రీరంగరాజ కళ్యాణ విగ్రహమును దలచి ఆటపాటలలో అతని గూర్చియే పలికినది. క్రమముగా యౌవనవతి యైనది. ఉద్యాన వన విహారము సేయుచు రంగరాజటకు వేటకు రాగా తద్దివ్య విగ్రహంబుజూచి మ్రొక్కినది. అతనినే వలచినది, కందర్పకర విముక్తపుష్పనారాచవేదనను బొందినది. తండ్రి యా విషయము నెఱింగి శ్రీరంగభర్తతో మొఱబెట్టుకున్నాడు. అపుడు రంగరాజనితో "నీదు పుత్రి మన్మనోరమ, యిక వేయి మాటలేల? పొమ్ము. తోడ్కొనిరమ్ము. మాకిమ్ము సుతను, చేయు మీ పెండ్లి'' అన్నాడు.

ఇక ఆలస్యమేమి? నిచులాపుర రాజాగదా అలంకరణ పటాటోపము లన్నియు జరిగినవి. వేదశాస్త్రోక్తాను సారము పెండ్లిని జరిపించినాడు. జనకుడు సీతను శ్రీరామచంద్రున కిచ్చినట్లుగా నున్నదట యాదృశ్యము. కట్నముల, కానుకల నెన్నియో నొసంగియును వర్యాప్తి గనుక తనదు సర్వస్వమారంగ ధామునకు భక్తి నర్పించినాడట ఆ ధర్మవర ప్రభువు.

కవి యీ వివాహ వైభవమును కన్నులకు గట్టినట్లుగా వర్ణించినాడు. తెలుగువారి వివాహ సంప్రదాయములు, దేవతా కళ్యాణోత్సవ చిత్రణములు కవి స్వానుభవమును తెలుపును.

ఉదా॥ ఊరేగింపు వైభవము : (పుట 49)

"అమ్నాయములు వైష్ణవాగ్రణుల్ నుడువంగ
నుజనులు చూచి సంస్తుతులు సలప,
వందిమాగధ సూత బృందముల్ పొగడంగ,
కన్నుమోల సొంపుగా గణికలాడ,
మహనీయ కల్యాణ మండప మధ్యస్థ
సింహాసనము నందు జెలువు మిగుల,
బేరోలగంబున్న పెండ్లి కుమారుని
గస్తూరి రంగని కన్నులార,

జూచి సంతసమంది యా చోళ నృపతి
వేగనిచుళాపురంబున కేగి యందు
దేవికా కృత్యమంతయు తెలిపెనను
వాది భీకరగురుడనె మోద మురల!

## తిరుప్పాణి యాళ్వారుల వైభవము

ఇందు 76 పంక్తులు గల ఒకే దీర్ఘవచనము గలదు. గద్యాంశమును ఒకటే. తనియ=1 గలవు.

జన్మాదిక విశేషములు : స్థలము=నిచుళాపురము (తిరువయూరు). కార్తీకమాసంబున, రోహిణీ నక్షత్రమున శ్రీవత్సలాంఛనమున జన్మించిరి. క్రీ. శ. 841 ప్రాంతము. 80 సంవత్సరములు జీవించిరి. కులము = పంచమ వర్ణము. శాలిశూకమున (వరిపైరు, వరిముల్లు) జన్మించినవారు.

కథాసంవిధానము : కథయంతయు హృద్యమైన శైలిలో సాగినది. విద్య : "పరమపురుషార్థలక్షణ మోక్షైక ప్రయోజనుండై, నిర్హేతుకజాయమాన భగవత్కటాక్షవీక్షణంబులచే పరమ సాత్త్వికుండై, భగవదనుగ్రహ ప్రాప్త తత్త్వజ్ఞాన సంపన్నుడగు నారదుని మాడ్కి, పరమ భాగవతుడై, భగవద్గాన విద్యాసార్వభౌముండై శ్రీ పరమాత్ముడగు నారాయణునిం బ్రక్రమించుచు, సామగానసడిబు సల్పుచుండును."

శ్రీపాణి యోగీంద్రు డుభయకావేరీ మధ్యదేశమును తన పాదముల ద్రొక్కగూడదని తలంచినాడు. కావేరీ దక్షిణతీరంబునందుండియే స్వవర్ణోచితం బుగా శ్రీరంగనాథమందిర ద్వారమున కెదురుగానుండి ఒకచేత వీణ మీటుచు, ఒకచేత తాళంబు గిలించి వాయించుచు, భగవంతుడగు నారాయణుని దివ్య కల్యాణగుణ చేష్టితంబులం బాడుచు, ఒడలు మఱచుచుండువాడు. ఇదే అతని దైనందిన కార్యక్రమము.

శ్రీ రంగనాయకి ప్రార్థన ననుసరించి శ్రీ రంగనాయకుడా పాణియోగిని ఒకనాడు తన సన్నిధికి రమ్మనెను. కాని, అతడు తన పుట్టువు కులము ననుస రించి భగవదాలయమును ప్రవేశింప సాహసించలేదు. ఈ విషయము నరసి భగవంతుడు తనకు తిరుమంజన కైంకర్యము సేయు లోకసారంగ మునీంద్రులకు కలలో కనబడి, "మహాత్మా! జన్మజాతి వైషమ్యంబును మాని, నీ భుజస్కంధ పీఠంబున నెక్కించుకొని, వేగ" రమ్మనెను. ఇట్లే జరిగెను. మొదట పాణియోగి రా నిరాకరించినను, పాదముల స్పర్శలేమి, భగవదాజ్ఞ యున్నదని గ్రహించి, మునివాహనుడై శ్రీరంగనాథుని సాన్నిధ్యమునకు వచ్చి, దివ్యమంగళ విగ్రహం బును గాంచి, అనుభవించి; తదనుభవజనిత ప్రీత్యతిశయంబుచే నొక గ్రంథంబు రచించెను. అదియే :

"అమలనాదిపిరాన్" పాశురములు = 10.

వర్ణనములు : ఈ వచనభాగమందలి శ్రీ రంగనాథుని దివ్యాకృతి వర్ణన మతి మనోజ్ఞము.

సాహిత్యపరివ్యాప్తి : తిరుప్పాణాళ్వారు పేర వివిధ పత్రికలలో వ్యాస ములు ప్రచురితమైనవి. మునివాహనుడను పేర నాటికలు గలవు.

## తిరుమంగై యాళ్వారుల వైభవము

ఇందు సీసములు = 45 వచనములు = 7-203,

గద్య = 1, తనియ = 1 గలవు.

**జన్మాదిక విశేషములు :**

స్థలము : చోళదేశమునందలి "తిర్కుకొరయలూరు" అను గ్రామము.

కులము : మ్లేచ్ఛ కులము, శూద్రవర్ణము.

అంశ : శ్రీహరి శార్ఙ్గాంశ.

తిరునక్షత్రము : కార్తిక మాసము, కృత్తికా నక్షత్రము.

జీవిత కాలము : క్రీ. శ. 776 ప్రాంతము,

నామము : తండ్రి ఇతనికి నీలవర్ణుండని పేరొసగెను.

**కథాసంవిధానము**

వాసరక్రమమున వర్ధిల్లుచు నీలవర్ణుడు నవయౌవనదశను జేరుకొని (అపీచ్య వయస్కుడై) జారవిద్యల ప్రౌఢుపుచ్చుచుండ, నీతని నొకనాడు చోళ భూపతి చూచుట తటస్థించెను. ఈతని భీకరాటోప రూపమును జూచి, వీడు అసహాయశూరుడని యెంచి తన సభకు రావించి, రాజాతని కొక దేశమును (గ్రామము) ఇచ్చి సామంతునిగా నొనర్చెను. ఆ నీలవర్ణునకు "పరకాలుడని" పేరుంచెను.

**ఈతని వివాహ వృత్తాంతము :**

నీలునిలో అనూహ్యమైన మార్పు కలిగి, అద యొక మహోత్తమ భాగవ తోత్తమ భక్తుడుగా, శ్రీవైష్ణవ సమారాధకుడుగా, భావియాళ్వారులుగా రూపొం దుట కాతని వివాహసందర్భమున జరిగిన అపూర్వ సంఘటనయే కారణము. ఈయన భార్య పేరు కుముదవల్లి. ఈ యమ తిరుణాంగూరను దివ్యదేశ నివాసి యైన ఒక భిషగ్వర భాగవతోత్తమునకు "తిరువాళి త్తిరునాడను" దేశమున గల సరస్సు తీరమున లభించినది. ఈ వృత్తాంతము నంతయు నీ కవి అతి మనోహ రముగ వర్ణించినాడు.

**వివాహకాలమునందలి వాగ్దానములు :** మొదట పరకాలుడు కుముద వల్లిని భిషగ్వరుని మందిరంబులో ఆమె తిరుగుచుండగా చూచినాడు. తద్దివ్య సౌందర్య- సౌకుమార్య, లావణ్య, యౌవన, చాతుర్య, గాంభీర్యాది గుణంబు లన్నియుంజూచి, విస్మితుండయి, తద్వృత్తాంతమునంతయు తెలిసికొని, అక్కన్య కామణిని తనకీయ వలసినదిగా కోరినాడు. ఈ విషయమును తెలుసుకొని కుముదవల్లి, "పంచసంస్కారవరుండగు నరవరునకే భార్య నగుదునని" తెలిపెను. అతడట్లే గాపించిరాగా, ఆమె, "ఒక సంవత్సర కాలము ప్రతిరోజు అనగా అశ్రాంతము అష్టోత్తర సహస్ర శ్రీవైష్ణవ సమారాధనం బాచరించి, తదీయ శ్రీపాద తీర్థంబును, తళిహ ప్రసాదంబును, స్వీకరింపక కాని నిన్ను భర్తగా గైకొననొల్ల" నని యన, నతడు "అట్లే చేసెదనని" శపథము చేసినాడు. ఇట్లు వారి వివాహ మతి వైభవముగా జరిగినది.

**తదీయారాధన వైభవము - వివిధ రంఘటనలు :**

ఇచటి నుండి పరకాలుని తదీయారాధన కార్యక్రమ మతి రమ్యముగా వర్ణింపబడినది. వంటకముల వర్ణనము :

"మంచి శాల్యన్నములంచిత ముద్గ సూ
పములు, హైయంగవీనయములు, మేలి
కూరగాయలును, జిగురులొప్ప పచ్చళ్ళు,
పొడి చారు, పలుచని పుళి, మరీచి,
సురభిహింగూజీరశోభితమగు పుళి,
చారు, మోదకములు, షాడబములు,
వడ అతిరసములు, గుడ పాయసాన్నముల్
లవణ విశ్వైలావి లలిత దధియు
వలసినట్లు సమర్పించి వైష్ణవులకు,
బుష్ప చందన తాంబూలములనొసంగి
పాద తీర్థములను గ్రోలు ప్రాజ్ఞుడనుచు
వాదిభీకర గురుడనె మోదమరల!"

ఇట్లు శ్రీ వైష్ణవ సమారాధనము సేయుచుండగా; చోళభూపతి గూఢచారుల ద్వారా ఈ వృత్తాంతమును విని, తరువుకాంద్రను పరకాలుని కడకు పంపించి, కప్పము చెల్లించవలసినదిగా నాజ్ఞాపించెకు. అతడు రేపు మాపని జరుపుచు రాగా వారాతని ద్వారము నరికట్టినారు. పరకాలుడు వారిని మెదబట్టి గెంటింప, భటులు రాజునకా వృత్తాంతమును తెలిపినారు. వెంటనే రాజు పరకాలుని బట్టి తేవలసినదిగా సైన్యపాలున కాదేశ మొసంగినాడు. వాడు చతురంగ బలములతో రాగా నీలు దెఱింగి తానును వారినెదుర్కొన దలంచెను.

**యుద్ధము - వీరరస వర్ణనము :**

ఇచటి నుండి యుద్ధవర్ణన మతి దీర్ఘముగా సాగినది. ఈ విషయమునకై కవి **27** సీసములను, ఒక సుదీర్ఘ వచనమును వ్రాసినాడు. మొదట సాధారణ సైన్యము, సైన్యాధిపతులు పోరు సలిపిరి. చివరకు పరకాలుడును, చోళరాజును స్వయముగా తారసిల్లినారు.

యుద్ధరంగమునంతయు భీకరదృశ్యముగా కవి వర్ణించినాడు. శస్త్రాస్త్ర ప్రయోగములు, యుద్ధనైపుణ్యములు, వీరుల పరాక్రమోదంతములు మహా యుద్ధముల విధానములను తలపించునట్లున్నవి. కారణము స్వల్పము. యుద్ధము ఘోరము.

యుద్ధరంగ వర్ణనమున కుదాహరణముగ నొక వాక్యము : "అంత నబ్బంద నోర్వీమండలంబునం బ్రచండ వేదండ, శుండాదండ మండిత పరకాల దోర్దండ మండనాయిత మండలాగ్ర శితధారా ఖండితంబులయి పడియున్న యేనుంగుల పీనుంగులును, హీనాంబులగు తురంగంబులును..........."

యుద్ధము చివర వరకాలుం డజేయుండగుటయు చోళభూపతి యతనిని నారాయణ స్వరూపునిగా గుర్తించి సన్మానించుటయు జరుగును. అపుడు పరకాలుడు రాజుతో నిట్లనును: "నీకు ప్రతిపక్షినయి పరాక్రమ ప్రకటనార్థంబిట్టి బీభత్సం బొనర్పం బ్రవర్తించిన వాడగాను. మీ కర్పింపదగు ధనం బిచ్చెద. విజయశీలుండవయి మగిడి పురికి విచ్చేయందగును."

కరిగిరీశుని కృపవల్ల నీలునకు శేవధికడ ధననిధి దొరకినది. తన వెంట నున్న చోళ మంత్రికి రాజ ధనం బిచ్చి పంపించినాడు. రాజా మహాత్ముడు మూడు రోజులు పస్తున్న సంగతిని తెలిసికొని మగిడి నీలుని రావించి బహుమతులొసంగి, బ్రాహ్మణులకు భూరి దానము లొసంగెను.

**నీలుడు చోరవృత్తిని చేపట్టుట :** రాజసేవవల్ల లభించు ధనమును తదీయారాధన కుపయోగించుట కంటె పశ్యతోహరవృత్తి బహు దనంబు దెచ్చి భాగవతుల నర్చించుట మంచిదని తలంచి, భార్యయైన కుముదవల్లి యంగీకారము బడసి, నిజదేశంబు విడిచి వన దుర్గంబుల కాలము గడుపుచుండెను.

సంశయము : చోరవృత్తి సమర్థనీయమెట్లు?

జవాబు : కాదు. కాని, ఇచట చోరవృత్తి స్వార్థపరమైనది గాదు. భక్తి సంబంధము. తదీయారా ధనము పరమార్థము.

ఈతడు వైష్ణవులయింట దొంగతనము చేసినవాడుగాడు. ధనము సరిపోక తన భృత్యులతో గలిసి అర్ధరాత్రి ధనవంతుల యిండ్లజొచ్చి ధనమపహరించి, బాటసారులదోచి, తదీయారాధన సేయుచుండువాడు, ఒకనాడేమియు దొరకలేదు. సర్వేశ్వరుడాతని కటాక్షింపదలంచెను, పరకాలుడుండు మార్గము దెస నొకానొక పెండ్లికుమారుడై, నిజపత్నితో సపరివారంబుగా పల్లకిలో

తీయబోవ నది రాలేదు. ఆ పరమాత్ముడితని నపుడు "కలియనోయని" సంబోధించెను. ఇదంతయు పురోహితుని మహిమయని దలంచి యాతనిపై గవిసిన నాత డది పెండ్లికుమారుని మహిమ యనెను. అపుడు పెండ్లికుమారుడు పరకాలుని బిలిచి, మంత్రబోధ సేసెదనని అతని కుడిచెవి యందు తిరుమంత్ర ముపదేశించి నిజస్వరూపమును జూపెను.

**రచనలు :** ఇట్లు శ్రీమన్నారాయణుడు ప్రత్యక్షముకాగా, తత్ప్రసాదలబ్ధ దివ్యదృష్టిచే అతనిలో కవిత యుప్పొంగి ప్రవహించెను.

| | | | |
|---|---|---|---|
| షట్ప్రబంధములు | 1. పెరియ తిరుమొళి — | 1084 | పాశురములు |
| | 2, తిరుక్కురుందాండగమ్— | 30 | ,, |
| | 3. తిరునెడుందాండగమ్— | 30 | ,, |
| | 4. పెరియ పెరుక్కూళ్— | 1 | ,, |
| | 5. శిరియ తిరుమడల్ — | 148½ | ,, |
| | 6. పెరియ తిరుమడల్ — | 77½ | ,, |

(ఇవి తిరువాయ్మొళికి షడంగముల వంటివి. చిత్రమాధుర్యాది రస పరిపూర్ణంబులు. సర్వాలంకార సంయుతంబులు.)

**ఇతని బిరుదులు :** షట్ప్రబంధ కృతికర్త - చతుష్కవి శిఖామణి,

**ముందుకు ప్రయాణము :**

ఇట్లు చతుష్కవిశిఖామణి యని జగత్ప్రసిద్ధ బిరుదమును బొందినవాడయి, దివ్యదేశములన్నింటిని సేవించి, చివరిసారిగా తిరుమల నుండి చోళదేశమునకేగుచు, మార్గమధ్యమున సత్యవ్రతక్షేత్రమున అష్టభుజ నృసింహుని సేవించుకొని, అతని స్వరూపమును గాంచి ధన్యుడయ్యెను. ఇంకను ముందుకు ప్రయాణము సాగించుచు "కార్తికేయాంశసంభవుండగు సంబంధిపెరుమాళ్‌ను" కవితావాదమున నోడించెను.

**శ్రీరంగనాథ దేవాలయోద్ధరణము :**

పరకాలమునులు శ్రీరంగమునకు వేంచేసి, శ్రీరంగరాజ విమాన ప్రాకారాది కైంకర్యమును సేయదలచెను. పరిజనుల సలహా ననుసరించి నాగపట్టణమునకు వెళ్ళి, మహోన్నతమైన బుద్ధవిగ్రహమును పెకల్చి తెచ్చి, సానుకూలముగా

దానిని కరిగించి, బంగారమును విక్రయించుచు, లభించిన ద్రవ్యముచే ప్రాకారాదినిర్మాణముల గావించు చుండెను.

వీరి సమకాలికులుగా తొండరడిప్పొడియాళ్వారులని ఈ కవి పేర్కొన్నాడు. వీరు తన పుష్పమాలాకైంకర్యమునకుపకరణంబైన ఆయుధవిశేషమునకు "కరుళ్మారి" యని పేరిడిరి.

ఇట్లు తన భార్యయగు కుముదవల్లియు, తానును భగవత్కైంకర్యము సేయుచు, భద్రాశ్రమంబున భద్రాసనాసీనుండై యోగమార్గంబుచే భగవంతుని సాక్షాత్కరింపజేసికొని నిజస్వరూపము నందెను.

**తిరుమంగైయాళ్వారు సాహిత్య పరివ్యాప్తి :**

1. షట్ప్రబంధముల కన్నింటికి టీకా తాత్పర్యములు గలవు.
2. నాటకములు, జీవిత చరిత్రలు, పద్యకావ్యములు గలవు.

చోరచరిత్రము : నాటకము :

రచయిత : శ్రీ కేసిరాజు వెంకటసుబ్బారాయకవి.

పరకాల విలాసము : పద్యకావ్యము.

కవి : శ్రీ న.చ. కృష్ణమాచార్యులు.

పరకాల వైభవం : (పద్య)

కవి : శ్రీ అద్దంకి తిరుమల నరహరి.

కుముదవల్లీ విలాసము : (పద్య)

కవి : శ్రీ పొనుగోటి జగన్నాథరావు.

మచ్చునకు స్తుతి పద్యమొకటి : (పుట. 70)

''జయ జయ పరకాల శంఖచక్రాంకిత!
భుజమూల లసదూర్ధ్వ పుండ్రఫాల!
కుముదవల్లీ రమా కుచ కుంభ కాశ్మీర!
విరచితోరస్థల విజయ శీల!
కల్యాణ గుణధామ, కవిలోక సుత్రామ!
వినుత భుజస్తోమ విజితకామ!
సకల దిగంత విశ్రాంత కీర్తి వితాన!
కరపద్మ ధృతఖేట వర కృపాణ!

గురువరేణ్య మదీయ వాగ్ఘోషములను
దలవబోకుమి మదిని మా తండ్రియనుచు
వాదిభీకర గురుడనె మోదమలర!"

## పూర్వభాగము : చతుర్థోల్లాసము

**సంఖ్యా వివరములు :**

సీసములు = 83, కందములు = 2, శార్దూలము = 1, మాలిని = 1,
గద్యలు = 2 + 4 = 6, వచనములు = 20-412, తనియలు = 6.

**ఇందలి ప్రధాన కథాంశములు :**

1. నమ్మాళ్వారుల వైభవము
మధురకవి యాళ్వారులు
2. శ్రీమన్నాథమునుల వైభవము
3. పుండరీకాక్షుల వైభవము
4. ఆళవందారుల వైభవము

## నమ్మాళ్వారుల వైభవము : మధురకవి యాళ్వారులు

ఈ యిరువురాళ్వారుల జీవితములను కవి సంగ్రహముగా నుడివినాడు.
సంఖ్యా వివరములు : సీసములు = 11, వచనములు = 3-123
గద్యలు = 2, తనియలు 2 గలవు.

**నమ్మాళ్వారుల జన్మాదిక విశేషములు :**

స్థలము : తామ్రపర్ణి నదీతీరమున గల "కురుకానగరము"

అంశ : విష్వక్సేనాంశ ; కురుకానగర దేవుడు = ఆదినాథుడు.

తండ్రి : కారి (కారిసూరి); తల్లి : నాథనాయిక. ''కురంగనగరంబు'' నందుగల తిరుక్కురుంగడినంబి (కురంగనగరీ పూర్ణాఖ్యుండను శ్రీపతి) యను నారాయణుని వరప్రసాదము వల్ల జన్మించెను.

కులము : చతుర్థకులము.

జీవితకాలము : జననము : కలియుగాదియందు 43 దినములు గడిచిన పిమ్మట. (438 దినములని ఆముక్తమాల్యదాసౌరభ పీఠికలో గలదు.) క్రీ. శ. నెవ్వరును పేర్కొనలేదు. తిరునక్షత్రము : బహుధాన్య సంవత్సరమున, వైశాఖశుద్ధ పూర్ణిమను, శుక్రవారము, విశాఖ నక్షత్రంబున కర్కాటలగ్నంబున జన్మించిరి. 35 ఏండ్లీపుడమి నుండిరి.

### నమ్మాళ్వారుల వంశవృక్షము

తిరువళిధినాడరు

(ఇతడు కురుకాపురి నిర్వాహకుడు)

|

ఆరత్తంగియార్

|

చక్రపాణి

|

అచ్యుతసూరి

|

నేరందారు

|

శుక్కిణర్

|

శందామరక్కియ్యర్

|

పొర్కారియారు

|

కారి

(ఇతడు "తిరువాళ్ మార్బరు" అను శ్రీవైష్ణవోత్తమునికుమార్తె యగు నాథనాయిక (ఉదయనంగయార్)ను వివాహమాడెను. వీరి కుమారుడే "మారుడు" నమ్మాళ్వారు)

|

నమ్మాళ్వారులు

## మధురకవి యాళ్వారులు

**జన్మాదిక విశేషములు :**

నమ్మాళ్వారు లవతరించక పూర్వమే వీరు జన్మించిరి.

స్థలము : తిరుక్కోవళూరు; అంశ : శ్రీకుముదగణేశాంశ.

తిరు నక్షత్రము : చైత్ర మాసము; చిత్రానక్షత్రము.

కులము : [illegible]

జీవిత కాలము : క్రీ.శ. 797. 90 సంవత్సరములు జీవించిరి.

విద్య : ఇంటివద్దనే. "అధీతసాంగ సశిరస్క సరహస్యామ్నాయ" సముదయుడు.

దినచర్య : వృత్తి: దివ్యదేశముల సేవించుచుండును.

(గమనిక :- వీరిరువురి జీవిత చరిత్రల కథలకు పూర్వపీ యంశములిదే వరుసలో నీ కవి వ్రాసినాడు.)

**కథా సంవిధానము :-**

ఆత్మజుడుదయించెనని కారిసూరి, నాథనాయిక దంపతులు కడుసంతసించిరి. కాని, బాలుడు పుట్టిన నాటగోలె పది దినములవరకు కన్నుల దెరువలేదు. ఏడ్వను లేదు. చనుబాలు గుడువలేదు. శయనించియే యుండెను. ఐనను శుచి పక్ష వర్ధమాన ద్విజరాజు పోలిక వాసర క్రమమున వృద్ధిబొందుచు విష్ణువిన్యస్త ధరుడయ్యెను. ఇట్టిబాలుని గనుగొని మదిని దుఃఖము పెనుంగ, నా తలిదండ్రులు తమ కుమారుని అచటి ఆదినాథ దేవునకు జూపించిరి. అంత నా దేవుని యాజ్ఞచే నా శిశువును అచటగల చింతచెట్టు (తింత్రిణీ మూల ప్రదేశము) చెంత బంగారు గొలుసుల రంగుగా జూపట్టు పసిడిడోలిక యందు నుంచిరి. ఆ బాలుడు శిశు చేష్టితము లేమియు సేయక ఒక యేడాదిపాటు తొట్టెలలో నుండెను. తర్వాత తొట్టెలనుండి దిగివచ్చి తలిదండ్రులు నూచుచుండ రమ్యచించాకోటరము జొచ్చెను. ఇట్లీ బాలుడు అందులోనే (16 సం॥) షోడ శాబ్దమాత్మారాముడై యుండెను.

కథ క్రింది రీతిగా ముందునకు సాగినది :

మధురకవి సూరి ఉత్తర బదర్యాశ్రమాది దివ్య దేశముల సేవించి అయోధ్యను జేరెను. ఇచట నుండగా నాతని కర్ధరాత్రి దక్షిణ దేశమునందు సూర్యమండల మొక్కటి కన్పించెను. ఇట్లు నాల్గు దినముల ల్కారోదయమును ప్రతి అర్ధరాత్రియు గనుంగొని విశేషమును తెలిసికొనగోరి దక్షిణ దిక్కునకు ప్రయాణమును రాత్రి పూటయందు మాత్రమే సాగించుచు శ్రీరంగధామమును చేరుకొనెను. అచటినుండి శ్రీపురికి (కురుకాపురి) చేరుకొనగా, నా మహోదయము కనబడదాయెను. అంత నాతడు అచటి తీర్థ ఘట్టములందు నాథనాయిక సుతుని జన్మ వృత్తాంతమును తెలిసికొనెను.

యుచట వరమ పరమణీయముగా వర్ణించబడినది.

"తామ్ర వర్ణినదీ దక్షిణ తటమున, శంఖ తీర్థాంతిక క్ష్మాతలమున, తింత్రిణీమూల తరుకోటరమున, పద్మాసనాసీనుడై యున్నవానిని, భవ్యబోధ ముద్రాభిరాముని, ముకుళితనయనుని, షోడశవార్షికుండై, షోడశకళా పూర్ణుండగు సుధాకరుని చందంబున విలసిల్లుచున్న పరమాచార్యుని జూచి," చైతన్య సంశయ శాంతికై పొగడుచు కరతాళధ్వని గావించెను.

వెంటనే పరాంకుశముని మధుర కవిని కటాక్షింప, నిత డాతనికి మ్రొక్కెను. మునీంద్రుల సాష్టాంగ ప్రమాణ పూర్వకంబుగా తదీయాంఘ్రి కమలముల నాశ్రయించెను.

ఆ సమయంబున శ్రీమన్నారాయణుడు ప్రత్యక్షమయి, మునీంద్రులకు సకల జ్ఞాన నివర్తకంబగు దివ్యజ్ఞానము నొసంగెను. ఇట్లు పరాంకుశ మునీంద్రునిలో కవితా ప్రవాహ ముప్పొంగెను. ఇదియే వీరి రచనా స్రవంతి.

**నమ్మాళ్వారుల రచనలు :**

1) తిరువృత్తము → ఋగ్వేదసారము → 100 పాశురములు
2) తిరువాశిరియము → యజుర్వేదసారము → 7 ,,
3) పెరియతిరువందాది → అథర్వవేదసారము → 87 ,,
4) తిరువాయిమొళి → సామవేదసారము → 1102 ,,

ఈ ప్రబంధములను అనన్య ప్రపన్నులగు శ్రీమధురకవి సూరి ప్రముఖ దేశికోత్తముల కర్థానుభవ పూర్వకంబుగా నుపదేశించిరి. సర్వచేతనోజ్జీవం బొనర్చిరి.

**నమ్మాళ్వారుల వైభవము :**

ఈతని కటాక్షింపగోరి దివ్యదేశ నివాసులందఱును, అర్చామూర్తులందఱును తింత్రిణీ వృక్షమును చేరుకొనిరి. అనంత, గరుడ, విష్వక్సేనాదులగు నిత్యసూరులును వచ్చిరి. ఇతడు వారందఱికిని మంగళాశాసనం బాచరించి, మహా ప్రభావసంపన్నుండై, ప్రపన్న జనకూటస్థుండై, సర్వలోకోజ్జీవనార్థంబుగా నర్చారూపమును ధరించెను.

**నమ్మాళ్వారుల అర్చావిగ్రహము :**

పరాంకుశమునుల ప్రథమ శిష్యులు - మధురకవులే. ఈ సూరిసత్తముని రచన : "కణ్ణినుణ్ శిరుత్తాంబు."

ఆచార్య ప్రపత్తి యిందు తేటతెల్లము.

ఇతడు అర్చారూపంబగు వకుళాభరణ విగ్రహమును కురుకాపురియందు ప్రతిష్ఠించి, యగ్గురు శిఖామణికి నిత్య-పక్ష-మాస.అయన, సంవత్సరోత్సవంబుల జేయించుచు, తద్బిరుదాంకితగాథల బొగడుచు, విజయకాహళంబు నూదించు చుండువాడు. ఒకప్పుడు కంబనాథుండను కవీంద్రుడు వీరి నధిక్షేపించుటయు, చివరకు శ్రీ పరాంకుశ మునీంద్రుల సూక్తిచే నోడింపబడుటయు నిందు వర్ణిత మైనది.

ఇట్లు మధురకవులు తన గురు ప్రభావ మఖిల ప్రాణులెఱుంగునట్లు జేసి విభవంబు చాలించి అచటనే అర్చారూపము ధరియించెను.

**సాహిత్య పరివ్యాప్తి :**

వీరి ప్రబంధములకు బహుళ సంఖ్యలో టీకా తాత్పర్య వ్యాఖ్యానాదులు గలవు. తిరువాయిమొళికి ఐదారు పద్యానువాదములు వెలసినవి. కణ్ణినున్ శిరుత్తాంబునకు పద్య, గేయానువాదములు గలవు. శ్రీ పరాంకుశ శతకము గలదు. జీవితచరిత్రలు పద్య-గద్య రూపములలో వెలువడినవి. విద్యార్థుల పాఠ్య పుస్తకములలోను వీరి జీవితముల చిత్రీకరించిన రచనలు గలవు ఉదా॥ ఒక స్తుతి పద్యము. (పుట : 71.)

"త్రైవిద్య వృద్ధమస్తక విభూషణమెద్ది, సంపత్తి యెయ్యది సాత్త్వికులకు
నశరణ్యజన శరణ్యంబయ్యె నెయ్యది, పుడమి కెయ్యది భూరి పుణ్యరాశి
తల్లియు దండ్రియు తనయులు దైవత, మఖిలమెయ్యేది వైష్ణవాన్వయులకు
వకుళ సౌరభ నిత్యవాసితమెయ్యది, తామ్ర వర్ణీతీర్థధామమెద్ది,

ప్రధాన కథాంశము :

## శ్రీమన్నాథమునుల వైభవము

ఇందు సీసములు = 29, వచన పంక్తులు = 202, గద్యాంశము = 1, తనియ = 1 గలవు.

**జన్మాదిక విశేషములు :**

గమనిక : (తిరునక్షత్ర తనియభావములు పద్యములలో జూపబడలేదు.)

జన్మ : జ్యేష్ఠమాసము, అనూరాధ నక్షత్రము.

స్థలము : వీరనారాయణపురము.

ఇచటి దేవుని పేరు : మన్నారు రాజగోపాలుడు.

అంశ : విష్వక్సేనమంత్రియైన గజాస్యుని అంశ.

జీవితకాలము : 130 వర్షములు, క్రీ.శ. 823-918.

పరమపదము : మాఘ వళర్ష పక్షమున విష్ణుదినము.

తండ్రి : ఈశ్వరభట్టు; కుమారుడు = ఈశ్వరముని, కుమార్తె లిరువురు.

మనుమడు = కుమారుని కుమారుడగు "యామునమునులు"

సమకాలిక రాజులు = చోళరాజు, ప్రాంతము = చోళరాజ్యము.

రచనలు : 1. న్యాయతత్త్వము 2. యోగరహస్యము 3. పురుష నిర్ణయము.

**కథాగమనము : కథానంవిధానము :**

మొదటి నుండియు వీరు పరభక్తి, పరిజ్ఞాన, పరమభక్తి ఘనులు, వీరి జీవితకథ మొదటనే కవి వీరికి వాడిన విశేషణములు - యమనియమాసనాద్యష్టాంగ యోగసాక్షాత్కృతుడు;హృత్పద్మసద్మ దహరగగన రూపాంతరాత్ముడు; కలితనిఖిలవేద్యుడు.

వీరి పనులు : శ్రీహరి కైంకర్యము; ఛాత్రులకు పాఠములను సెప్పుట.

**నాలాయిర ప్రబంధ సంకలన గాథ :**

ఒకమారితడు స్వకుటుంబసహితుడై, అచటి మన్నారు రాజగోపాలు నాజ్ఞగొని, యమున, మధుర, ద్వారవతి మొదలగు ఉత్తర దివ్యదేశములను, పిమ్మట దక్షిణ దివ్యదేశము లన్నింటిని సేవించుకొని తిరిగి స్వస్థానము జేరి, నిత్యము నిఖిల కుసుమ మాల్యముల గూర్చి మన్నారు కృష్ణున కర్పించుచుండెను.

ఒకప్పుడు మేల్నాటియను ప్రదేశమునుండి ఇరువురు శ్రీవైష్ణవులు శ్రీరాజగోపాలుని సన్నిధికేతెంచి "ఆరావముదే" యను తిరువాయిమొళి ననుసంధించిరి. నాథమును లది విని తనకా కోశము నిప్పింపుడని వారి నడుగ, వారు "మాకా కోశం బెక్కడ కనబడలే"దనిరి. నాథమునులు ఎటులైన దానిని సాధింపవలెనని శఠకోపముని యవతారస్థలమైన కురుకాపురికేగి, మధురకవి శిష్యుడైన "పరాంకుశ దాసు"డను వాని నాశ్రయించి, తిరువాయిమొళి మొదలైన ప్రబంధములు ఖిలములైనట్లు తెలిసికొని, దానిని సాధించు నుపాయముల బడసెను.

మధురకవిశిష్యుని సూక్త్యానుసారము నాథముని పరమనియతిని ఆ సత్కృతియగు కణ్ణినున్శిరుత్తాంబును (12000) పన్నెండు వేలమార్లు ఆవృత్తి సలిపెను. అంతశఠవైరినాథమునికి ప్రపదన మొనరించెను. దివ్యదృష్టియొసగి, ద్వాదశాత్మని గతి, ద్వాదశసూరిస్వరూపుడై సాక్షాత్కరించి, "నీదు వాంఛితమును దెల్పు"మనిన, నాథముని "భవదీయ దివ్యప్రబంధంబులన్నియు సాంగోపాంగమును, సంప్రదాయ విజ్ఞానపూర్వకముగా నాన'' తిమ్మనెను

అట్లేయని సమ్మతించి, నాథమునిని తెఱబైట నుండుమనియు, తాను చెప్పెడి విషయములను తెలివిగా వ్రాసికొనుట కాజ్ఞయిచ్చెను.

శఠకోపులు పల్లాండు మొదట పలికి మిగిలిన వానిని క్రమముగా వ్రాయించెను. శ్రుతులకు ప్రణవమువలె దివ్య ప్రబంధములకు నాంది యందు పల్లాండు పలుకు సంప్రదాయ మిట్లేర్పడినవి. నాథమునుల ప్రార్థన ననుసరించి నమ్మాళ్వారు లిట్లనిరి: "ఇక మీద తిరువాయిమొళి నభ్యసించు ముముక్షువులకు వారి జీవిత కాలమంతయు పూర్తియైన పిమ్మటనే మోక్షమిత్తు"నని బల్కెను. మఱియు నీ యాదేశ మొసంగెను: "నాథార్య! నీ శిష్యతతికి ద్రవిడ వేదము లివి చెప్పి ధరణి యందు వృద్ధి బొందింపుము."

విశిష్టాద్వైత సిద్ధాంత ప్రచారమునకు 'నాంది' పలికినవారే "నాథమునీంద్రులు."

ఇట్లు నాథముని దివ్యప్రబంధములను బడసి, ఇంటికి వచ్చి, ఉత్తరోత్తర వీనిని వృద్ధిబొందించుట కాలోచించి, మన్నారు కృష్ణుని యాజ్ఞచే "కీళహత్తాళ్వాన్", "మేలెహలత్తాళ్వాన్" అను నిజపౌత్రుల సాహాయ్యంబుగా కూర్చుకొని ఆ ప్రబంధములను గాన జ్ఞాన యోగ్యంబులగునట్లుగను, క్రమబద్ధమొనర్చెను.

ఈ విధముగా విశిష్టాద్వైత సంస్థాపనకు, ప్రచారమునకు ఉద్యమ రూప మిచ్చి, భావి ఆచార్యులకు, యామునాచార్యులకు, రామానుజాచార్యులకు మూల స్తంభములై నిలిచిన వారిలో మొదటి చారిత్రక పురుషుడు "శ్రీమన్నాథ మునీంద్రుడు".

**దివ్య ప్రబంధములను క్రమబద్ధ మొనర్చిన రీతి :**

1. నమ్మాళ్వారుల నాల్గు ప్రబంధములు - నాల్గు వేదములుగా నేర్పరించెను.

2 పరకాల మునీంద్రుల షట్ప్రబంధములు—వేదాంగములుగా నేర్పరించెను.

3 మిగతా ప్రబంధములు—ఉపాంగములుగా నేర్పరించెను.

"వీటిని సర్వ చేతనోజ్జీవనార్థంబొనర్చి, సాత్త్విక తాన్త్రిక తాదాత్మ్య గుణ పరిపూర్ణులగు శ్రీ వైష్ణవులచే తత్తద్దివ్యదేశములయందు దివ్యగాన రూపంబుగా బాడించిన, తద్దివ్య ప్రబంధంబు లన్నియు శిష్యాచార్య క్రమంబున, క్రమంబు దప్పక యిప్పటికైన నిప్పుడమిం ప్రసిద్ధంబులై వర్ధిల్లుచుండె."

(అ. సూ. ము. పుట 83)

ఒకమారు నాథముని చోళభూపతి సభలో వివాదపడిన వారవిలాసినుల దేవగాన, మానవ గానములందు దేవగానమే శ్రేష్ఠతమమని, స్వానుభవ నిదర్శన పూర్వకముగా నిరూపించెను. ఇతనివద్ద మంత్రార్థ దివ్యప్రపంధాదుల రహస్యార్థ ముల నెఱింగిన శిష్యులు8 మంది.

గమనిక :- (ప్రధాన ఆచార్యులు, శిష్యవర్గము పట్టిక జూడనగును.)

నాథమునీంద్రులు కురహావలప్పన్ అను శిష్యశేఖరునకు అష్టాంగయోగ రహస్యక్రమ మెఱింగించెను. పుండరీకాక్షులకది సాధ్యము గానందున దివ్య ప్రబంధముల ప్రవర్తింప జేయవలసినదిగా నాజ్ఞాపించెను.

తన కుమారుండైన ఈశ్వరముని నవలోకించి, ''నీకస్మత్సమానుండైన కుమారుండుదయించును. అతనికి 'యమునత్తురవరు' అని తిరునామంబొనర్చి వృద్ధిపొందింప జేయవలసినదిగా నానతిచ్చి. ''కురుహావలప్పను ఉయ్యక్కొండారులను''శిష్యులనుద్దేశించి: ''మీకు నుపదేశించిన దర్శన తాత్పర్యయోగ రహస్యార్థ విశేషముల యామునాచార్యులకుపదేశింపు''దని నియోగించెను.

**అవసానదశ :**

ఒకనాటి సందర్భమున నాథముని కుమార్తెలిరువురు తండ్రితో నిట్లనిరి: "అయ్యా! నెయ్యంబొప్ప నతిసుందరాకృతు లిరువురు విలుకాండ్రు, నింతి యొకతె- వారి పిమ్మట బాల వనచరుండొక్కడు మన యింటికేతెంచి మమ్ము గాంచి, శ్రీనాథమునులేమి సేయుచున్నారని యడిగి పోయిరి."

అపుడు నాథముని తన మనమున వారలు జానకీరామ-లక్ష్మణ, సమీర సూనులని యెంచి, వేగమే వారు పోయినద్రోవ వెదకుచు బోయిబోయి, పరిచ యాదుల నితరుల నడుగుచు, చివరకు చోళ పట్టణ ద్వారము కడనున్నవారి నడిగెను. వారును మేమట్టి వారిని జూడలేదనిరి. ఆ వెంటనే నాథముని:

"హరిపదాబ్జయుగళమని యాత్రిపడి" నేల కొఱిగెను. ఇచటినుండి కవి దీర్ఘ వచనమును వ్రాసి, నాథమునుల యవతార సమాప్తిని వర్ణించినాడు. ఇందు ప్రధానాంశములు :

1. యోగశాస్త్ర క్రమము
2. వైకుంఠ ప్రవేశమున కనుగొన్న వింతలు
3. తిరుమామణి మంటప వైభవము
4. నారాయణుని దివ్యరూప వైభవము
5. నాథమునులు వైకుంఠమున శ్రీమన్నారాయణుని అంకముజేరుట.

చివర ఈశ్వరమునులు తన తండ్రికి బ్రహ్మమేధ సంస్కారమును గావించిరి.

ఈ సందర్భమున విశిష్టాద్వైతతత్వ సిద్ధాంత ప్రచారమునకు నాంది వచనములు పలికిన శ్రీమన్నాథమునీంద్రుల తనియన్‌ను స్మరించుట సంభావ్యము. నిత్యతనియన్ :—

"నమోఽచింత్యాద్భుతాఽక్లిష్ట జ్ఞానవైరాగ్యరాశయే।
నాథాయమున యేఽగాధ భగవద్భక్తి సింధవే॥"

## ఉయ్యకొండారనబడు పుండరీకాక్షుల వైభవము

**శ్రీరామ మిశ్రులను గూర్చియు :**

ఇందు సీసములు=4, వచన పంక్తులు=3 గద్యలు=2, తనియలు=2,

పుండరీకాక్షులు : అంశ :- శౌరిసేన్యాంశ.

వివరణము : శ్రీమన్నాథ మునీంద్రుల పిమ్మట శ్రీ పుండరీకాక్షులు దర్శన స్థాపక దక్షుడయ్యెను. నాథమునుల పదాశ్రితులతో నుభయ - వేదాంత కాలక్షేప మాచరించు చుండిరి. ఇతనికి ఐదుగురు శిష్యులు. ఇరువురు పుత్రికలు గలరు. రామమిశ్రులు ప్రధాన శిష్యుడు.

ఒకనాడు శ్రీరామమిశ్రులీ పుత్రికలను స్నానార్థమై వెంబడించెను. తిరుగు ప్రయాణమున అడ్డుగానున్న నొక కాలువనా స్త్రీలు దాటలేకున్న, వారికి తన మూపు నాధారముగా నుంచి కాల్వను దాటించెను. దీనినెఱింగి పుండరీకాక్షులు రామమిశ్రులకు మంత్రరత్నమొసంగెను. తన పిమ్మట నీ దర్శన భావము వహించుచు ఈశ్వరమునికి కలుగబోవు పుత్రునకు "యమునత్తురవరు" అని పేరుబెట్టి, ఆ బాలున కఖిల హితముల నుపదేశించి, అతని ననుసరించుమనెను. ఇట్లు శ్రీ పుండరీకాక్షులు శ్రీమదార్యాంఘ్రి పద్మము కెందిరి.

వీరు 105 సంవత్సరములు జీవించిరి.

శ్రీరామమిశ్రులు : వీరినిగూర్చి ప్రత్యేక జీవిత చరిత్ర లేదు. వీరి అంశ: కుముదాంశ. 105 సంవత్సరములు జీవించిరి. యామునాచార్యులకు గురువులైరి. యామునాచార్యుల చరిత్రలో గూడ వీరి వృత్తాంతము సాగిపోయినది.

## ఆళవందారుల వైభవము

(యామునాచార్యుల చరిత్రము)

ఇందు సీసములు = 39, వచన పంక్తులు = 85, గద్యాంశం = 1, తనియలు = 3 గలవు.

జన్మాదిక వంశ విశేషములు : (తిరునక్షత్ర విషయ పద్యము గలదు)

స్థలము : వీరనారాయణపురము, చోళరాజ్య ప్రాంతము.

జన్మ : ఆషాఢమాసము. ఉత్తరాషాఢ నక్షత్రము.

జీవిత కాలము : 120 సంవత్సరములు. క్రీ. శ. 918 1047.

శ్రీరామమిశ్రులు వచ్చి "యమునత్తురవరని" అఖ్య జేసిరి. తండ్రి సుతున కన్నప్రాశన చౌలోపనయనాదుల నుచిత కాలములందు జేసెను. యామునులు ఏకసంతగ్రాహి. తండ్రికడనే వేదములను, అర్థశాస్త్రత్రయము నధికరించెను. మహాభాష్యభట్టరు కడ పాతంజలి భాష్యాదుల నేర్చెను.

ఈతని కల్యాణము గావించి తండ్రి శ్రీ వైకుంఠము జేరుకొనెను.

కథాగమనము : కథాసంవిధానము :

1. యామునాచార్యులు రాజగుట, ఆళవందారను పేరు గల్గుట.

2. తిరిగి సన్యాసము స్వీకరించి దర్శన స్థాపకాచార్య పీఠమునలంక రించుట ఇందలి అంశములు.

రాజగుట : రాజగు వృత్తాంతమీతని బాల్యదశలోనే జరిగినది. ఈతడు మహాభాష్యభట్టరుకడ "పాతంజలోక్తి ప్రపంచమంతయు శాంతిసలుపుచుండ" ఒకనాడు నాటి చోళదేశపు రాజ పురోహితుండగు "అక్కియాళ్వాన్" అనువాడు తన తరువుకాని కొక ఆజ్ఞాపత్రమిచ్చి తనకు దశబంధము (పన్ను) కట్టవలసిన దిగా భట్టరుకడకంపెను. అంత నాచోటనే యున్న బాల యామునులు ఆ పత్రి కను చించివేసి, సమాధానముగా నొక శ్లోకమును రచించి, పురోహితునికి తిరుగ బంపెను.

శ్లో॥ "న వయం కవయస్తు కేవలం
నవయం కేవలం తంత్ర పారగాః।
అపితు ప్రతివాది వారణ
ప్రకటాటోప విపాటనే క్షమాః॥"

ఈ సంగతి రాజునకు దెలిసెను. ఆ బాలుండు నాథమునుల పౌత్రుండని సకల సజ్జనసభా సంభావ్యుండని తన సభకు గౌరవ పూర్వకముగా రప్పించు కొని పురోహితునితో వాదించుటకు సమ్మతించెను. ఇవ్విషయమును రాజు వైష్ణ వాభిమాని యగు రాణికి తెలిపెను. ఇరువురును వాదజయాపజయ ఫలితములను గూర్చి ముందుగనే పందెముల వేసికొనిరి. యామునులు గెలిచినచో రాజు అర్ధ రాజ్యమిత్తుననెను. రాణి ఓడినచో దాసిగా నుండుదునని తెలిపెను.

ఇట్లే పండితులిరువురి పందెము లేమన :

పురోహితుడు తాను గెలిచినచో ఓడినవారి శిర
యామునుడు మూడు మాటల కాఱు తప్పులు తీయ

వాదప్రారంభము :- విద్వాంసుల నిర్ణయాన
అభిమతానుసారమే ప్రశ్నలువేయు అధికారము ము

ప్రశ్నలు :

1) వసుధ యుష్మన్మాత వంధ్యగాదు.

2) ఈ రాజు ధర్మాత్ముడు.

3) ఈతని ధర్మపత్ని పరమ పతివ్రత.

వాద ఫలితము :

ఈ ప్రశ్నలకు బదులు పల్కలేక పురోహిత
లాతనిని శిరస్తాడనము చేయ నిరాకరించి గౌరవించె
ఆ బాల కవిని—

''నన్నైయాళవందారివరు'' అని పలికి ఎత్తు

రాజగుట : మాటప్రకారము రాజీతని కర్త
తన భార్యను పిలిపించుకొని రాజ్యపాలన సేయుచుం
సంసారమును సాగించి రాజ్యపాలన సేయుట కెక్కు

పదమున కరిగి"రన్నాడు. గీతను బోధించినాడు.
మునిలో మార్పు గలిగినది. రామమిశ్రులను వెంబడి
నాథుని దర్శించుకొన్నాడు. అపుడు రామమిశ్రగు
మహాలబ్ధ మీనిధి" యన్నాడు. వెంటనే యాముని
హరిపదాబ్జములాత్మ నిలిపి సన్యసించినాడు. తాత
వహించినాడు. సుతులకు రాజ్య మప్పగించి నాటినుం

యామునాచార్యుల శిష్యవర్గము : సంఖ్య 21.

(పట్టిక జూడనగును. అనుబంధములో గలద

మొదటి శిష్యుడైన పెరియనంబికి పరాంకు
(తొల్లి తిరునగరియందు శ్రీ పరాంకుశదాసుడు నా
రంబును దలంచి)

దర్శనప్రవర్తకుడైన పిదప జరిగిన సంఘట

శ్రీరామమిశ్రులు యామునాచార్యులను కుర
అష్టాంగయోగ రహస్యముల నెఱుంగవలసినదిగా
చెప్పెను. ఇందు నిమిత్తము యామునులు ప్రయాణ
మిశ్రులు తన గురు పాదపద్మముల దలంచి ముక్తి
వారికి బ్రహ్మమేధాది సంస్కారముల జేసిరి.

శ్రీరామమిశ్రుల శిష్యవర్గము : సంఖ్య 5

యోగ రహస్యక్రమము ఖిలమగుట :

సరియైన వేళకు యామునులు కురుహోవలప్పని కడకు జేరుకొనలేక పోయిరి. రహస్యోపదేశక్రమమును పొందలేకపోయిరి.

పూర్వాచార్యోపదేశ పరంపరా ప్రాప్తమార్గము :

"అష్టాంగ యోగ రహస్యోపదేశక్రమ కలనంబు ఖిలంబైన నాటినుండి శ్రీయామునేయగుపడు: పూర్వాచార్యోపదేశ పరంపరాప్రాప్త మార్గంబనర్గళంబుగా నుత్తరోత్తరాభివృద్ధినందునట్లు ప్రవర్తింపజేసెను.

గమనిక : యామునుల జీవితచరిత్ర ఈ యుల్లాసముతో ముగింపబడలేదు. పూర్వభాగము 5 వ యుల్లాసములో గలదు.)

## శ్రీ రామానుజాచార్యుల జీవితచరిత్ర

ఆ. సూ. ము. ప్రకారము రామానుజులను గూర్చి చదువుకొనుటకు ముందు గమనింప వలసిన విషయములు :

పూర్వభాగములోని ఐదవ, ఆఱవ యుల్లాసములు, మధ్యమభాగములోని అన్ని (12) యుల్లాసములలో -

ఉదయవరుల వైభవము

(రామానుజాచార్యుల సంపూర్ణ జీవిత చరిత్రము గలదు.)

(ఇందులో కొంత అదనపు సమాచారమును ఆ.సూ.ము.లో లేనిపి గూడ ఈ క్రింద పొందుపరచుచున్నాను.)

**విషయవైశాల్య గద్యపద్యముల సంఖ్యల వివరములు:**

1. కృతికర్తగా : కందములు=45, శార్దూలములు=19, మాలినులు=23, ఇతర విశేష వృత్తములు=8, సీసములు లేవు.

2. జీవిత చరిత్ర : పుటల సంఖ్య=248.

అన్నియు సీసములే=809.

వచనములు=64 - 1134.

గ్రంథాదివిషయ సూచికాంశములు=38.

గ్రంథాంత (ఉల్లాసముల చివరి) గద్యల విషయాంశములు=220.

మొత్తము 1+2 పద్యముల సంఖ్య=904.

సీసపద్యములలోని మొదటి భాగమును, రెండవ భాగమైన తేటగీతిని ప్రత్యేకపఱచి లెక్కించినచో, "వాదిభీకరగురుడనె మోదమలర" అను మకుట లెక్కలోనికి తీసుకొనకున్నచో $= 809 \times 3 = \frac{2427}{4} = 607 + 809 = 1416.$

నాల్గుపాదముల పద్యము లేర్పడును.

సౌకర్యము : జీవిత చరిత్ర రచనకు సీసపద్యముల నుపయోగించుటలో గల సౌకర్యమును కవి వినియోగించుకున్నాడు, ఎక్కువ విషయములను చెప్పుటకి పద్యములు కథాత్మికముగాను, సంభాషణాత్మకముకాగా నుపయోగపడును. వృత్తములట్లు కాదు.

ప్రాముఖ్యత : గ్రంథములో సగముభాగము రామానుజులను గూర్చిన పద్యము లాక్రమించినవి. మొత్తము పద్యముల సంఖ్య=1762. రామానుజులకు వర్తించునవి. 904 లేదా 809.

గ్రంథ వచన పంక్తుల సంఖ్యనుబట్టి ఇతనికి తక్కువ పంక్తులు వాడబడినవి. పాఠకునకు విసుగు కలుగదు. ఇందులో నిరూపణార్థ విషయములను క్రోడీకరింపలేదు.

ప్రముఖుల నిత్య తనియలు, తిరునక్షత్ర తనియలు = 27 గలవు.

**రామానుజుల పరివార పరిచయము :**

1. సంయమీంద్రులు (ఉత్తమాశ్రమస్థులు) - 700
2. ఆచార్య పీఠస్థులు (సింహాసనాధిపతులు) - 75
3. ఏకాంత సేవకులు (ఏకాంగులు) - 12, 000
4. కొత్తెపమ్మలు - 3, 000; ఇతర స్త్రీలును గలరు.
5. ఆచార్య పురుషులు - 173
6. చాతని దాసులు - అసంఖ్యాకులు
7. శిష్యవర్గము - అసంఖ్యాకము
   (రాజులు, ప్రభువులు, అందఱును) (కులభేదములేక)
8. ఆచార్య పురుషుల పట్టికలో స్త్రీలును గలరు.
   (అమ్మెంగార్లు, దేవియార్లు, నాచ్చియార్లు)

ప్రసన్నామృతము :

శ్లో॥ ఏకాంతి భిర్ద్వాదశభిస్సహస్రైః
పీఠైశ్చతుస్సప్తతి భిస్సమేతః
అన్యైరనంతైరపి విష్ణుభక్తైః
శ్రీరంగ ఆస్తేయతి సార్వభౌమః॥ (పుట. 168)

జన్మాదిక విశేషాంశములు : పుటలు 107, 543, 544 లలో గలవు.

చారిత్రక కాలము : క్రీ.శ 1017 - 1137; శకము 939.

సంపూర్ణ జీవితకాలము : 120 సంవత్సరములు.

జన్మస్థలము : భూతపురి, అంశ : ఆదిశేషుడు.

తిరునక్షత్రము : శేషుని అంశచేత ''మేషార్ద్ర'' యందు జన్మించెను. (పుట. 107) ఆయుష్మాన్నామ యోగము. భద్రవాకరణము. పింగళనామ సం॥ర, చైత్రశుద్ధ పంచమి. ఆర్ద్ర, గురువారము, కర్కాటకలగ్నము, హారితస గోత్రము, ఆపస్తంబ సూత్రము, యజుశ్శాఖ.

తండ్రి ఆసూరి కేశవాచార్యుడు. (ఇతడు దేవసముడు, శతక్రతుదీక్షితుడు)

తల్లి భూమిపిరాట్టి (కాంతిమతి). ఈమె శ్రీశైలపూర్ణుల (తిరుమలనంబి) మొదటి చెల్లెలు. (ఇతని రెండవ చెల్లెలు పేరు పెరియపిరాట్టి. (ద్యుతిమతి) ఈమెను మధుర మంగళ గ్రామమునందుగల కమలనయన భట్టారున కిచ్చెను.

జాతక కర్మాదులు : శ్రీశైలపూర్ణులే గావించిరి.

పెద్ద చెల్లెలు కుమారునకు ''లక్ష్మణాచార్య''దని, చిన్న చెల్లెలు కుమారునకు ''గోవిందుమిశ్రు''డని పేరిడిరి.

రామానుజుల కుటుంబసభ్యులు - ఆత్మబంధువులు:

1. తల్లిదండ్రులు, 2. మేనమామయగు శ్రీశైలపూర్ణులు, 3. భార్యపేరు తంజమాంబ, 4. అక్క - చెల్లెండ్రు, 5. మేనల్లుడు, 6. పినతల్లి - పినతండ్రి (తల్లివైపునుండి), 7. పినతండ్రి కుమారుడు (తల్లివైపునుండి).

8. తల్లివైపునుండి తాత, ముత్తాతల సంబంధము :

యామునాచార్యుల కంటగట్టబడినది. కొన్ని గ్రంథములు పేర్కొన్నవి.

**మాతృభాష :** తమిళము. ఇతని తలిదండ్రులు తెలుగువారని, తెలుగు దంప

1. శ్రీశైల పూర్ణులు (పెరియ తిరుమలనంబి) వీరి మేనమామ.

2. మహాపూర్ణులు (పెరియనంబి, పరాంకుశదాసులు)

3. గోష్ఠిపూర్ణులు (తిరుక్కొట్టియూరు నంబి)

4. మాలాధారులు (తిరుమలైయాండార్)

5. వరరంగార్యులు (యామునుల కుమారుడు)

6. కాంచీపూర్ణులు (తిరుక్కచ్చి నంబి)*
(ఇతనిని అధికముగా కొందఱు చేర్చిరి. ఉదా॥ యతిరాజీయ పీఠికలో: "రామానుజులు కాంచీపూర్ణుని ఆచార్యునిగా భావించి గౌరవించుచుండిరి." కాంచీపూర్ణులు గురువుగా నుండుట కంగీకరించలేదు. (ఆ.సూ.ము.)

రామానుజుల విద్యాధ్యయనము : మంత్ర రహస్య సంప్రదాయముల నెఱుంగుట : (సంగ్రహ వివరణము)

1. గోష్ఠి పూర్ణులవద్ద మంత్రరాజ రహస్యముల నెఱింగెను.

2. మాలాధార్యులవద్ద తిరువాయిమొళి నధ్యయనము జేసెను.

3. ఆళ్వందాన్ ఆళ్వార్‌వద్ద (యామునుల శిష్యులు) తిరువాయి మొళి, స్తోత్రము, ప్రాచీన సంప్రదాయముల నేర్చెను.

4. తిరుమలైనంబి పాదాశ్రితుడై రామాయణమును బడసెను.

5. ఆళవందార్ కుమారులైన వరరంగార్యులు (తిరువంగప్పెరుమాళరైయార్) వద్ద సర్వ వేదాంత విషయముల నభ్యసించెను. పెరియ తిరుమొళి, కణ్ణినున్ శిరత్తాంబుల వ్యాఖ్యానమును బొందిరి.

6. తిరుక్కచ్చినంబి ద్వారా షడ్వార్థలు తెలిసికొనిరి.

7. పెరియనంబిగారు మధురాంతకమున శ్రీరామసన్నిధిలో పంచసంస్కారముల కృపజేసిరి. వరదరాజ విగ్రహమూర్తినిచ్చిరి. కాంచీపురమున ఇయఱ్పా, మొదలాయిరమును సాధించిరి.

---

* అభిప్రాయ భేదములు గలవు. కాని గౌరవదృష్టి వేరు. మంత్రోపదేశము చేయలేదు గాన, బోధన సేయలేదు గాన గురువు కాడు.

8. మొట్టమొదట యాదవప్రకాశుల వద్ద చదువుకొనుటకై చేరి, సరిపడక అతని గురుత్వమును నిరాకరించిరి.

**పెరుమాళ్ళతో చుట్టరికము - గురు మంత్రి బంధు సంబంధములు :**

1. గోదాదేవికి - అన్న.
2. సంపత్కుమారులకు - తండ్రి.
3. శ్రీవేంకటేశ్వరునకు - గురువు, మామ.
4. శ్రీరంగనాథునకు - మంత్రి.
5. తిరుక్కురుంగుడినంబికి - గురువు.

**రచనలు :** 1. వేదాంతసారము, 2. వేదాంతదీపము, 3. వేదార్థ సంగ్రహము, 4. గద్యత్రయము : శ్రీరంగగద్య = శిరియగద్య, శరణాగతి గద్య = పెరియగద్య, వైకుంఠగద్య, 5. శ్రీభాష్యము, 6. గీతాభాష్యము, 7. నిత్యగ్రంథము, 8. తర్కభాష్య, న్యాయామృత, నారదీయపాంచరాత్ర, రంగనాథ స్తవములును, 74 వార్తలును గలవు. 9. కొన్ని తనియన్‌లు తమిళ ములో గలవు.

**రచనలను తెలుపు శ్లోకము :**

"వేదాంతదీపో, వేదాంతసారో - వేదార్థసంగ్రహః
గద్య-గీతాభాష్య-సూత్రభాష్య-నిత్యక్రమా ఇతి"

**రామానుజులు దర్శించిన 16 దివ్యక్షేత్రములు :**

శ్లో॥ "శ్రీరంగం, కరిశైలం, అంజనగిరిం, తార్క్ష్యాద్రి, సింహాచలం,
శ్రీకూర్మం, పురుషోత్తమంచ, బదరీనారాయణం, నైమిషం
శ్రీమద్వారవతీ ప్రయాగ మధురా అయోధ్యా, గయా, పుష్కరమ్
సాలగ్రామగిరీం, నిషేవ్య నమతే రామానుజోయం మునిః"

"శ్రీనృసింహప్రియ, జులై. 1990" నుండి.

**"ఉడయవరు" బిరుదు :**

శ్రీరంగనాథునకు గద్యత్రయ రచన విన్పించగా నతడు రామానుజులకు విభూతిద్వయ మొసంగెను. అపుడు ఉడయవరులను తిరునామము గలిగెను

నపుడు. (అ. సూ. ము. పుట. 322)

''అముదల్వానివన్'' యమునాచార్యులు ప్రవథమమున రామానుజుల దివ్యాకృతిని జూచినపుడు, తిరుక్కచ్చినంబి ఇళయాళ్వారితడే యని చూపించి నపుడు తన మనంబున సంతసించి ''అముదల్వానివన్'' అని తన మనంబున నిర్ణయించుకొనెను. (అ. సూ. ము. పుట. 117)

భార్య:- శ్రీరంగనాథులకు మంత్రియై విభూతియుగము నందెను. (243 పుట)

భాష్యకారబిరుదు :- వాగ్దేవి యతిరాజుల గనుకొని-

''భాష్యకారులు, మత్ప్రియ భాష్యమిదియె'' యన్నది. (అ. సూ. ము. పుట 215)

**ఎవరెవరేయే తిరునాంబులిడిరి?**

1. ఇళయాళ్వారులు : పితృకృతము.

2. రామానుజ దాస్యనామము : పంచసంస్కార కాలమున "శ్రీవరద రాజాఖ్య భగవద్విగ్రహము" నిత్యారాధనీయముగా : ఆచార్య ప్రసాద లబ్ధము.

3. యతిరాజు : తుర్యాశ్రమానంతర కాలమున "దేవరాజ" ప్రసాద లబ్ధము.

4. లక్ష్మణముని : తిరువరంగ గురు ప్రసాద లబ్ధంబు.

5. శఠకోప పొన్నడి : శ్రీ కూరమాలాధర గురు కరుణాలబ్ధంబు.

6. కోయలణ్ణా : శ్రీ మద్రామాయణాధ్యయన కాలంబున ''శ్రీశైలపూర్ణ" గురు కరుణాలబ్ధంబు.

7. శ్రీభూతపురీశుడు : ఆదికేశవ ప్రసాద లబ్ధము.

8. దేశికేంద్రుడు : శ్రీ వేంకటేశానుగ్రహ ప్రాప్తంబు.

9. శ్రీ రామానుజనంబి : కురంగనగరిపూర్ణ ప్రసాదలబ్ధము.

జీవితకాలము : 120 సం॥లుండి. లీలావిభూతినలంకరించిరి.

# మధ్యమ భాగము - దాని ప్రత్యేకత

ఈ గ్రంథము మూడు భాగములుగా విభజించబడినది. 1. పూర్వ 2. మధ్యమ 3. ఉత్తర భాగములు ఈ మూడు భాగములలోను మధ్యమభాగము నందలి ప్రత్యేకత గమనింపదగినది. మానవ శరీరమును మూడు భాగములు జేసినచో హృదయ స్థానమీభాగము క్రిందికి వచ్చును. ఎందుకనగా, గుండె రక్తమును శుభ్రపరచి శరీరాంగములకు రక్త ప్రసారమునుజేయు ప్రచార గుణమును గలిగియున్నది గదా! అట్లే మహీకంఠహార తరళ స్ఫూర్తిని తలపింపజేయునట్టి కావ్య సూక్తి ముక్తావళి యనెడు రత్నహారమునకు నాయకమణివలె వెలుగొందునట్టిదీ మధ్యమభాగము.

ఎందుకనగా, ఇందులో ఉదయవరుల వైభవము చిత్రీకరింపబడియున్నది. పూర్వాపరభాగములను, మధ్యమ భాగము అనుసంధించు, (Link) కలుపునట్టి గుణమును గల్గియుండునుగదా! అట్లే రామానుజులవారున్ను.

వీరి జీవిత చరిత్ర పూర్వభాగములోని ఐదవ, ఆఱవ యుల్లాసములతో ప్రారంభమై, మధ్యమ భాగములో సంపూర్ణాంశములతో నిండుకొనియుండి, ఉత్తరభాగమునకు సందేశవాహికయై అలరారునట్టిది. ఎందుకనగా పరాశరభట్టరు వారి జీవిత చరిత్రాంశములు పూర్వభాగమునందలి ఆ ఆఱవయుల్లాసములోను, సందర్భానుసారముగా మధ్యమభాగములోను గలవు.

పూర్వాచార్యులకు, తర్వాతి ఆచార్యులకు రామానుజులు మధ్యస్థులు, "లక్ష్మీనాథ సమారంభాం" అను శ్లోకములోని మధ్యస్థులు నాథయామునులు పిమ్మట పరాంకుశ దాసుల తర్వాత రామానుజులవంతు గదా. విశిష్టాద్వైత సిద్ధాంతమునకు వంతెన వంటివారు రామానుజులు. నాయకస్థానము వీరికే దక్కును గాన ఈ మధ్యమ భాగము అ.సూ.ము.లో ప్రత్యేక స్థానము నాక్రమించుచున్నది ఈ వాక్యము (ఆంగ్ల) గమనార్హము:

"Ramanuja is the Central Gem in the precious necklace made up of gems of Vaishnavite Acharyas."

—Bhavanis journal. April 1950. page 30.

''లక్ష్మీనాథసమారంభాం"నుండి మణవాళ మహామునులు, వేదాంత దేశికుల వరకుగల ఆచార్య పరంపర వాక్యములను లెక్కించినచో తెలియనగును:

శ్రీధరాయ నమః
శ్రియై నమః
శ్రీమతే విష్వక్సేనాయ నమః
శ్రీమతే శఠకోపాయ నమః
శ్రీమన్నాథమునయే నమః
శ్రీపుండరీకాక్షాయ నమః
శ్రీరామమిశ్రాయ నమః
శ్రీమద్యామునమునయే నమః
శ్రీపరాంకుశదాసాయ నమః
శ్రీమతే → రామానుజాయ నమః

| వడగల శాఖ | తెంగల శాఖ |
| --- | --- |
| పిళ్ళాన్ | ఎంబార్ |
| చిట్టాంబిఆచ్చాన్ | పరాశరభట్టరు |
| వరదవిష్ణ్వార్య | నంజీయరు |
| అప్పిళ్ళాన్ | నంబిళ్ళ |
| వేదాంతదేశికులు | వడక్కు-తిరువీధిపిళ్ళ |
| నయనారుదేశికులు | పిళ్ళలోకాచార్య |
| | శ్రీశైలేశులు |
| | మణవాళమహాముని |
| | వానమామలజీయర్ |

## ఆచార్య రత్నహారము

(ఆచార్య సూక్తిముక్తావళి)

"స్ఫారగురుపంక్తి మౌక్తిక, హారతరళ దివ్యరత్న! హతకలియత్నా! ధీరోదార! గభీరవిచారా! శ్రీశైలనాథ సన్నుతచరణా!" (అ.సూ.ము. గద్యము లోని స్తుతి. పుటలు 434.)

విషయ వైశాల్యమునుబట్టి, ప్రబంధ వర్ణనలనుబట్టి, చారిత్రక, సాంఘి కాచార సంప్రదాయములనుబట్టి యీ భాగము ప్రత్యేక స్థానమును గల్గియున్న దని చెప్పుట కవకాశములు గలవు.

దీనికి గల విశిష్టస్థానమును గ్రహించుట కిందలి ప్రథమోల్లాస కథా భాగములోని మొదటి పద్యమును జూడనగును.

ఇచట కవి ఆచార్య సంప్రదాయ ప్రవంతిని కడుంగడు మనోహరముగా

గమనిక : అటనట ఈ పద్యము పలుతావుల వాడినాను. చదువుకొన గలరు.

రామానుజుల జీవితచరిత్రను సులభముగా అర్థము చేసికొనుటకై అ.సూ. ము.లోని ఆయన జీవితచిత్రణమును మూడు ఘట్టములుగా విభజించినచో-

1. జననమాదిగా సన్యాస స్వీకారమువరకు.

ఈ సమయమందు జరిగిన ప్రధాన సంఘటనల వివరణము.

2. యతిరాజులై శ్రీరంగమున పీఠాధిపత్యము వహించుట.

చాల కాలమువరకు ఈ సమయములో చేపట్టిన, సాధించిన కార్యక్రమములు :

a) శ్రీభాష్య రచన చేయువరకు జరిగిన విషయములు.

b) శ్రీభాష్య రచన మొనర్చుట, భాష్యకారులైన పిమ్మటి దిగ్విజయ యాత్రలు.

c) ఇతర ప్రధాన విషయములు - ఢిల్లీ విజయ ఘట్టము.

d) యతీంద్రులు యామునుల ఆశయములను, తాను గావించిన శపథమును సఫలీకృతము సేయుట.

e) యతీంద్రుల ప్రభావము.

3. అవసానదశ - అంతిమ సందేశము.

ఇట్లేర్పాటు గావించుకొనవచ్చును.

(గమనిక : ఇది ''శ్రీరామచరిత్రము" మధ్యగల కాళిదాస రఘువంశము వంటి ప్రణాళిక.)

రామానుజుల జీవిత చరిత్రలోని ప్రసిద్ధ ఘట్టములను, చారిత్రక కాల నిర్ణయ పట్టికను తయారుచేసికొనుటకు తగిన ఆధారములు గలవు. పరిశోధకులు గమనింపవలసినదిగా ప్రార్థనము.

## తెలుగులో రామానుజులను గూర్చిన సాహిత్య సంపద :

తెలుగులో ఈ మహనీయుని గూర్చిన రచనలు అన్నిరకాల సాహిత్య ప్రక్రియలలో అసంఖ్యాకముగా వెలువడినవి. ప్రసిద్ధములైనవాటిని కొన్నింటి నిట పేర్కొనుచున్నాను.

**వచన విభాగము :**

జీవితచరిత్రలు, వ్యాసములు, గ్రంథములు, గద్యకావ్యములు, అనువాదములు:

1. ద్వాదశ సూరిచరిత్ర - గోదాగ్రంథమాల
2. రామానుజ కథాసాగరం ,,
3. శ్రీ రామానుజచరిత్ర - పార్థసారధి (జాచార్యులు)
4. శ్రీ రామానుజచరిత్ర - గోదాగ్రంథమాల
5. శ్రీ రామానుజ దివ్యవైభవం - టి. రాఘవయ్య
6. శ్రీ రామానుజులచరిత్ర - జి. మంగమ్మ (**Life of Ramanuja**)
7. శ్రీ రామానుజుల చరిత్ర - పి. తులజ
8. శ్రీ రామానుజకీర్తి కౌముది సంపుటములు - డా. ధనకుధరం వరదాచార్యులు నవలలు, కథలు

1. రామానుజుల ప్రతిజ్ఞ - ఎమెస్కో ప్రచురణ
2. విశాలనేత్రాలు ,, ,,

నాటకము:

1. శ్రీ యతిరాజ వైభవం - మాడభూషి వేంకటాచార్యులు

రూపకభేదము:

2. శక్తి రామానుజము

చిఱుతల నాటకము:

3. శ్రీ రామానుజ చరిత్ర - సౌమిత్రి నారాయణాచార్యులు

సినిమాలు టి. వి. ప్రసారితములు, రేడియో ప్రసారితములు: తమిళ సినిమా అక్టోబరు 1989 7-10-89. సందర్భానుసారము రేడియో ప్రసంగములు.

పాఠ్య పుస్తకములలో, తత్త్వ శాస్త్ర గ్రంథములలో దేశ సంస్కృతి - చరిత్రలలో విజ్ఞాన సర్వస్వములలో వీరి జీవితము గలదు.

పత్రికలలో : చిత్రపటముల క్రింద కథా వాక్యములు "ఈనాడు" దిన పత్రిక. ఇతర పత్రికలలో వ్యాసములు ఎన్నియో గలవు.

చిత్రపటముల గ్రంథము. జీయ్యర్ ఎడ్యుకేషనల్ ట్రస్టు వారి గ్రంథము.

బాల సాహిత్యము: టి. టి. డి. వారి ప్రచురణములు.

**కవితా శాఖ :**

చంపువులు, కేవల పద్య కావ్యములు, గేయములు, జానపదములు, శతకములు, బుఱ్ఱకథలు, దండకములు, స్తోత్రములు, స్తుతులు, కీర్తనలు మంగళ హారతులు, ఉదాహరణ కావ్యములు, స్త్రీల పాటలు, వచనములు, తిరునామములు, విన్నపములు, లోకోక్తులు, జాతీయములలో కృతికర్తగా, పద్యములలో కృతికర్తగా పద్యములు, హరికథలు:

1. సకల జీవ సంజీవనము. ప్రౌఢకావ్యము.
2. రామానుజాభ్యుదయము. మఠింగంటి వేంకటనరసింహాచార్యులు(ద్వి)
3. యతిరాజీయము. కుంటిమద్ది శేషశర్మ
4. శ్రీ మద్రామానుజుల చరిత్ర. గోపీనాథ వేంకటకవి
5. ఆ. సూ. ము. లో సగభాగము.
6. దివ్య మునిత్రయము. గోదా గ్రంథమాల
7. శ్రీ రామానుజ చరిత్ర (శతకము) తి. న. చ. తిరువేంకటాచార్యులు
8. యతిరాజ విజయం. బుఱ్ఱకథ. గుదిమెళ్ళ రామానుజాచార్యులుగారు
9. రామానుజోదాహరణము. చెలమచెర్ల రంగాచార్యులవారు
10. శ్రీ హయగ్రీవ యతిరాజ దండకములు. తిరుమల బుక్కపట్నం వేంకటాచార్యులవారు
11. స్త్రీలపాటలలో జీవిత చిత్రణ గలదు.
12. రామానుజ విజయము హరికథ. కవి శ్రీ అమరవాది నరసింహాచార్యులు
13. పురుషకారము, స్తుతిరత్నావళి శ్రీ వేముగంటి నరసింహాచార్యులు

## పూర్వభాగము - ఐదవ యుల్లాసము

ఇందు 79 సీసములు, ఆశ్వాసాద్యంత పద్యములు 3 గలవు.

శ్రీశైలపూర్ణులు(తిరుమలనంబి) తిరుమల నివాసి ఇతనికి చెల్లెండ్రిరువురు. పెద్ద చెల్లెలి పేరు భూమిపిరాట్టి (కాంతిమాతి) అమెను. భూతపురి నివాసియైన అసూరి కేశయజ్వకిచ్చి వివాహము గావించెను. రెండవ చెల్లెలగు పెరియ పిరాట్టిని మధురమంగళ నివాసియగు కమలనయన భట్టరునకిచ్చి పెండ్లి చేసెను.

భూమిపిరాట్టికి పుత్రుడుదయించినాడని విని శ్రీశైల పూర్ణులు కేశవార్యుని ఇంటికి వచ్చెను. శిశువునకు లక్ష్మణార్యుడని పేరిడెను ("మేషార్ద్రయందు శేషుని అంశచే జన్మించినవాడు") తండ్రియే తగిన వేళల అన్న సంస్పర్శ చౌల ప్రతాదులనొనరించెను. క్రమముగా పెరిగి పెద్దవాడగుచు "సకృచ్ఛ్రవణాధీత వేదవేదాంగుడాయెను." షోడశాబ్దములకు బ్రహ్మచర్యము విడిచి సువిహితో ద్వాహుడయ్యెను.

## 2. గోవిందమిశ్రుల జన్మవృత్తాంతము :

తిరుమలనంబి రెండవ చెల్లెలగు పెరియ పేరాట్టికి (ద్యుతిమతి) కమలనయన భట్టరునకు కలిగిన సంతానమే గోవిందమిశ్రుడు. (క్రోధన సంవత్సరము, పుష్యమాసము, పూర్ణిమాతిథి, సోమవారము, పునర్వసు నక్షత్రము.

రామానుజుల ననుసరించి ఇతడును మొదట యాదవ ప్రకాశులకడ విద్యాభ్యాసము చేసెను.

## 3. రామానుజాచార్యుల విద్యాభ్యాసము, అంశములు :

మొదట ఏకదండియగు యాదవ ప్రకాశులను అద్వైతి వద్ద చదువును సాగించుట; అభిప్రాయ భేదములు - కొన్ని సంఘటనలు జరిగిన పిమ్మట రామానుజులు గురువును వదలి పెట్టుట; చివరకు కరిగిరి వరదులకు తీర్థము దెచ్చు కైంకర్య మాచరించుట.

వివరణములు: అ.సూ.ము. పుటలు. 108. ప్రకారము:

a) యాదవ ప్రకాశుడు కొండొక కారణాంతరంబున తీర్థయాత్రా వ్యాజంబుచే రామానుజులను తోడ్కొనిచని వింధ్యారణ్యంబున విడిచి తాను ముందునకు సాగిపోయెను. గోవిందమిశ్రుడు గురునితో త్రివేణీ సంగమము చేరెను. అంత కరిగిరి వరదుడు పెరుందేవితోగూడి వచ్చి, వనచర మిథున రూపంబున ప్రసన్నుండై లక్ష్మణసూరిని కాంచీపురంబునకు తోడ్కొని వచ్చెను.

b) శ్రీరంగమునకు వచ్చిన శ్రీవైష్ణవులు యామునులకు రామానుజుల చదువును గూర్చి తెలిపిన ప్రకారము: (పుటలు - 115, 116.)

1. 'సత్యం జ్ఞాన' మిత్యాద్యుపనిషద్వాక్యంబునకు రామానుజులు చెప్పిన యర్థమును విని యాదవ ప్రకాశుడు రోషారుణిత నేత్రుండాయెను.

2. ఒకనాడు "తస్యైథాకప్యాసమ్" అను ఛాందోగ్యోపనిషత్ వాక్యంబునకు గురుండపార్థంబు చెప్పగా రామానుజులు దానిని ఖండించి,సముచితార్థమును చెప్పగా గురుండాతనికి అపకృతులొనర్చెను.

c) యాదవ ప్రకాశులకడ విద్యాభ్యాసమును మానుకొనుట:

పుట. 118. ఇది నాల్గవ సంఘటనము:

గురుడు అద్వైత వాక్య ప్రజంబద్వితీయ బ్రహ్మపరంబుగా నన్వయింప, రామానుజులు దానికి విశిష్టాద్వైతపరముగా నన్వయము చెప్పెను. అపుడు యాదవసూరి అలిగి, ఇట్లనెను:

"మాకడ చదువింకమాని, నీకు తగినయట్లు వచించు మేధావికడ జదువుకొమ్ము."

**రామానుజుల ఉద్యోగము, వృత్తి :**

గురుని మాటలు విని సంతసించి లక్ష్మణార్యుడు తన యింటికి వెళ్ళి తల్లికావార్త నెరింగించెను. ఆ కాలమునాటి వైష్ణవ కుటుంబముల వృత్తి ఉద్యోగములు ప్రధానముగా "శ్రీహరి కైంకర్యము" గావున తల్లి సూచన మేరకు, "తిరుకచ్చినంబి యాదేశించిన ప్రకారము కరిగిరి వరదునకు శాలికూపమునుండి జలఘటంబు దెచ్చి యనిశము తీర్థకైంకర్యము సేయుచుండెను."

**4. గోవిందమిశ్రుని వృత్తాంతము :**

"గంగలో మునుగంగ లింగమొకటి వచ్చి కలిసి ఇతని చేతిలో బడెను యాదవప్రకాశులిది చూచి శివలింగమునర్చనసేయుమనెను. క్రమముగా నితడు కాళహస్తికి వెళ్ళి "ఉళ్ళంగై కొండనయనారని" శైవనామము బడసెను. దీనిని తెలిసికొని తిరుమలనంబి ఇతని కడకు వచ్చి, అతనిలో మార్పు గలిగించుటకు ప్రయత్నము చేసి విఫలుడయ్యెను. రెండు మూడు తడవలిట్లు వచ్చుచు పోవుచు అతి ప్రయత్నముచేత తిరిగి గోవిందమిశ్రుని వైష్ణవునిగా నొనర్చెను.

5. శ్రీశైలపూర్ణుని భక్తికి మెచ్చుకొని శ్రీ వెంకటేశ్వరుడు ఇతనికి "పితామహ ప్రపితామహుండని" పేరిడెను.

**6. రామానుజుల చరిత్రలో మకుటాయమానమైన ఘట్టము యామునుల అంత్యకాలమున అతడు చేసిన శపథము:**

మొదట యామునులు సత్యవ్రతక్షేత్రమున కేతెంచి, యాదవప్రకాశునితో గూడివచ్చు లక్ష్మణార్యుల జూచెను. అతనితో మాట్లాడుటకు వీలు చిక్కలేదు. అతడు దర్శనస్థాపకుడు గావలయునని వరదు నుద్దేశించి ప్రపదనము చేసెను. పిమ్మట యామునులవారు పరమపదించుటయు, అతని కుమారుడు ''పిళ్ళైకరశునంబి'' చరమకైంకర్యము సేయుచున్నప్పుడు పెరియనంబితో సహా రామానుజులు శ్రీరంగము చేరుకొనిరి. అచటే యామునుల ''అకుంచితాంగుళీ త్రయంబు నీక్షించి'' అమ్మహాత్ముని యభిప్రాయంబు దెలిసి, ''మహాత్మా! మీరు దలంచిన కార్యంబులు మూడు దేవరవారి యనుగ్రహంబుచే సమర్థించెదను'' అని శపథము సేయగా, మూడంగుళీయములు ప్రసారితములయ్యెను.

గమనిక : (ఈ యుల్లాసములో శపథముల వివరములు లేవు.)

**7. పరిత్తికొల్లైనాచ్చియారు వైభవము:**

ఈమెను కార్పాసారామలక్ష్మి యందురు. భర్త పేరు వరదార్యులు. వీరి పేర తనియన్‌గూడ గలదు. కడు బీదవారు. రామానుజులకు గావించిన అతిథి సత్కార గురుసమారాధన లోకోత్తరము. తన శరీరము నమ్ముటకు సిద్ధపడి తదీయారాధన గావించినది. శీలము రక్షింపబడినది. ఇందులో ఆచార్యప్రవత్తిని గూర్చిన సూక్తులెన్నియో గలవు. మొదట ఆదరించని యాజ్ఞేశుడను ధనవంతుడు చివరకు పశ్చాత్తాపముజెంది రామానుజుల నాశ్రయించెను.

ఈ కథలోని అతిథి సత్కారవర్ణనాదికములు, వంటకములు తెలుగువారి విందులను తలపింపజేయును.

8. పెరియనంబి కుమార్తె అత్తుళాయమ్మ భక్తురాలు. తన తండ్రిపై బడిన నిందకీమె కస్తూరి రంగనిపై యానబెట్టెను. పంచముడగు 'మారనేరి నంబికి' చరమకైంకర్యము చేసినందులకు పెరియనంబిని స్వాములు కొందఱు సంఘము నుండి వెలివేసిరి. పిమ్మట రంగని యాదేశము మేరకు నింద తొలగెను.

9. తిరుక్కచ్చినంబి (కాంచీపూర్ణుడు) కరిగిరి వరదునితో ప్రత్యక్షముగా మాట్లాడు భక్తుడు. దేవదేవుడితనితో "ప్రారబ్ధకర్మానుభవ మించుకైన జెందు మనును" బంగారు గిన్నె దొంగతనమితనిపై బడెను. శిక్షింపబడిన పిమ్మట వరదుడు బ్రహ్మచారియై వచ్చి ఇతనిని కాపాడెను. ఇట్టివి కాంచీపూర్ణుల కథలు ఆ క్షేత్రవాసులు చెప్పుకొందురు.

10. తుండీరమండల పాలకుడగు విఠలరాయడు రామానుజుల నాశ్రయించి శిష్యుడై బహుధనమీయగా నది గ్రహించి, అంజనాచలమున కామడ దూరమున ముప్పది వృత్తుల నొప్పారు "మండియమ"ను అగ్రహారము నేర్పాటు చేసి ఆశ్రితుల కొసంగెను.

11. కూరేశుడు రామానుజుల శిష్యుడు. ఈ కూరేశునియెడ నపరాధము గావించిన విలాస పురుషుడగు వైష్ణవుడొకడు యమపురికేగి, శిక్షను బొందకయే వారలచే భూలోకమునకు బంపబడి, పక్షిరూపములో (పావురము) ప్రవేశించి కూరేశుల పాదములపైబడు వృత్తాంతము విచిత్ర సన్నివేశము. భాగవతాపచారము తగదని తెలుపును. ఇట్టి అపరాధులను యమభటులు శిక్షింపరు. "పరమ భాగవతుని శరణొందుమని'' యమభటులు చెప్పిన మాటలు.

గమనిక (Note) : కొన్ని ముఖ్య వివరణములు :

యాదవప్రకాశులకు, రామానుజులకు గల అభిప్రాయ భేదములను తెలుపు ఘట్టములు :

1. అ. సూ. ము: పుట. 116.

"తస్యయథా కప్యాసం పుండరీకమేవ మక్షిణీ" - ఛాందోగ్యోపనిషత్తు. I అధ్యాయము. 7 వ మంత్రము.

2. అ. సూ. ము: పుట. 115.

"సత్యం జ్ఞానమనంతం బ్రహ్మ'' - తైత్తరీయోపనిషత్తు.

3. అ. సూ. ము. పుట. 118.

శ్లోకములేదుగాని పద్యము గలదు.

"అద్వైత వాక్యవ్రజం బద్వితీయ బ్రహ్మపదముగా నన్వయింప''

ఈ క్రింది యుపనిషత్తుల భావముగావచ్చును.

"సర్వం ఖల్విదం బ్రహ్మ'' - ఛాందోగ్యోపనిషత్తు.

"నేహనా స్తికించన'' - కఠోపనిషత్తు.

ఆశ్వాసాంత పద్యములో ఈ ప్రకరణమును గూర్చిన అంశములు గలవు.

''శ్రీరామానుజమునివర!
కారుణిక మహాత్మ! కలిదోషహరా!
చారుశ్రీభూతపురా
గార నిరంతర విహార! కల్యాణకరా!" పుట. 162.

(ఇది ప్రథమోల్లాసము, మధ్యమభాగములోనిది.)

పూర్వభాగము - పంచమోల్లాసము :

"శ్రీయామున మునిశరణా!
మాయావశ జీవలోక మంగళశరణా!
న్యాయవిదార్యాభరణా!
భూయః శ్రేయోనిదాన పుణ్యవిహారణా!" పుట. 138.

## పూర్వభాగము షష్ఠోల్లాసము

ఇందు 47 సీసములు, 4 ఆశ్వాసాద్యంత పద్యములు,
వచనములు 13-151, గద్యలు 15 గలవు.
కథా సంవిధానము - వరుస క్రమములో నిట్లుండును:

1. శ్రీవైష్ణవుల లక్షణము :

ప్రత్యక్ష వైకుంఠ పదమగు శ్రీరంగములో యతిరాజుల నొకప్పుడు ఒక సాత్త్వికు డడిగిన ప్రశ్న:

''వైష్ణవు డెట్లుండవలయును?''

రామానుజుల సలహా : ''తిరుమల నంబిని తెలియుమనెను.''

అంత నా వైష్ణవుడు తిరుమల కరిగి, శ్రీశైల పూర్ణుల నాశ్రయించెను [1] శ్రీశైలపూర్ణులు పంక్తి భోజనముల నేర్పాటు చేసి ఆ వైష్ణవునకు వివిధ స్థానము లిచ్చిరి.

a) మొదట బ్రహ్మచారుల పంక్తిలో కూర్చుండబెట్టెను.

b) రెండవ రోజు అధ్యాపకుల పంక్తిలో భోజనమిడెను.

c) బ్రహ్మవిత్తముల పంక్తిని మూడవ రోజు భోజనము నేర్పాటుచేసెను.

తిరుమలసంబి సమాధానము : పిమ్మట అతని వినయమునకు, సౌమ్యతకు శ్రీశైల పూర్ణు లిట్లు నుడివిరి. వైష్ణవుడు :

''సైంధవ - ఘనబక - చరణాయుధములట్లు, వత్స! నీవలె'' నుండ వలెనని చెప్పెను. ఇట్టి ధీర సూక్తులకు రామానుజు లర్థ వివరణము చెప్పిరి. (ప్రత్యేక శీర్షికను జూచునది.)

ఆ.సూ.ము.లోని పద్యము: పుట. 139.

"వరకృపారసపూర్ణ వాఙ్మనఃకాయుడై
సైంధవమట్లుండు సాత్త్వికుండు,
ఒక దివ్యదేశమందుండి యుజ్జీవించు
సరసిని బకమట్లు సజ్జనుండు,
సారతమార్థైక సంగ్రహంబొనరించు
చరణాయుధమునట్లు సత్తముండు,
దురభిమానాత్యంత దూరస్థితిని జెందు
వసుధ నీపోలిక వైష్ణవుండు."

2. కూరేశ-దాశరథులకు చరమోపదేశము :

కూరేశులు మాసోపవాసియై సేవించుచురాగా, యతిపతి అతనికి చరమోపదేశము చేసెను. అట్లే దాశరథియు గోష్ఠిపూర్ణుల యింట ఆఱు నెలలు సేవకావృత్తి సేసిరాగా, రామానుజు లతనికి చరమ తాత్పర్య మొసంగెను.

---

1. కీ శే. బుక్కపట్నం నరసింహాచార్యుల వ్యాసములో నిట్లే గలదు' శ్రీనృసింహ ప్రియ పత్రిక - ఏప్రిల్ 1990.

శ్రీ వేంకటాచలేతిహాసముల T.T.D. వారి పీఠికలో : పరాశర భట్టరు వారు వైష్ణవ లక్షణములను తెలిసికొనుటకు ఒక సాత్త్వికుని అనంతాచార్యులకడ కంపను.

3. జలజంతు మోక్షప్రదానము :

ఒకనాడు లక్ష్మణయోగీంద్రుడొక పుష్కరిణిలో నీరాడి వచ్చుచుండగా, ఆశ్రితుల కోరికననుసరించి అందలి జలజంతువులన్నింటికి మోక్షమును ప్రసాదించెను.

4. శ్రీరంగామృత కవీంద్రుడను "తిరువ రంగ త్తముదనార్" చరిత్రము :

ఇతడు శ్రీరంగ నివాసి. అభిజనవిత్త విద్యా మదాన్వితుడు, సంగీత శాస్త్రార్థ సరసమతియును. ఇతనిని సాత్త్వికుని గావించు పనిభారమును యతిపతి కూరేశుల కొసంగెను.

"సకల విద్యలకు జన్మభూమి" వంటి కూరేశ డాతని కడకేగి, ఆయన ప్రశ్నలకు యుక్తములైన సమాధానములిచ్చి యతిపతుల నాశ్రయింపజేసెను. (సామాన్యులకు గూడ కలుగు సందేహము లీ ప్రకరణములో తీర్చబడినవి.) శ్రీరంగామృత కవీంద్రుడు శ్రీవైష్ణవశ్రేష్ఠుడై రామానుజ దివ్యనామాంకితముగా ''ప్రపన్న గాయత్రి'' యను నూత్తందాదిని రచించెను. నాలాయిర ప్రబంధములో దీనికి సముచితస్థానమిచ్చిన సంగతి ఈ ప్రకరణములో గలదు. (ఆ.సూ.ము. పుట 145.)

5. క్రిమికంఠ జన్మనిమిత్తము :

ఇతడు చోళదేశపు రాజు రామానుజుల సమకాలికుడు. శైవమతాభిమాని. వైష్ణవద్వేషి. పురాణ కథల వంటి జన్మనిమిత్త మిట్లున్నది: "దేవతల కోర్కెననుసరించి హిరణ్యాక్ష ముఖ్యదైత్యులలోనొకని క్రిమికంఠుని చోళదేశమునకు రాజగునట్లుగా శ్రీరంగేశు డాతని నుద్భవింపజేసెను. అట్లే ఇతర మతముల కలుగజేసెను. బ్రహ్మేంద్రాది దేవతలకు పని కల్పించుట కీ యేర్పాటు జరిగినది. ఎందుకనగా, శ్రీవైష్ణవ లక్షణ లక్షితులు మోక్షమును బడయుచున్నారు."

6. పరాశరభట్టరు - వ్యాసభట్టరుల బాల్యవృత్తాంతము;

పరాశరభట్టరుల వివాహము:

కూరేశుల కవలకుమారుల పేర్లు:

1. పెదవాడు : శ్రీ పరాశరభటరు

వీరి జన్మవృత్తాంత మీ ప్రకరణముతో లేదు. బాల్యవృత్తాంత సంఘటన గలదు:

పరాశరభట్టరు యోగ్యకాలమునందు ఉపనయనాది సంస్కార సంస్కృతుండై వేదవేదాంగముల నేర్చెను. ఇతని కాచార్యుడే గోవిందమిశ్రులు.

వివాహోచితమైన వయస్సు రాగా పరాశరునకు తండ్రి యగు కూరేశుడు తనకు దీటైన వంశములో జన్మించిన శ్రీవైష్ణవ కన్యకతో వివాహము గావింప నిశ్చయించుకొని, కన్యకకై వెదకుచు యతిపతి నాశ్రయించెను. యతిపతియు తన గురువైన మహాపూర్ణుల వంశ్యుడగు నొక శ్రీవైష్ణవుని కిరువురు పుత్రికలు గలరని విని సంబంధమును నిశ్చయించెను. మరియు వీరు "బృహచ్చరణు"లని (కూరేశుల వంశముకన్న తక్కువస్థాయి గల వైష్ణవులు) విచారించదగదని చెప్పెను.[1] (ఆ. సూ. ము. పుట. 149.)

ఆ బాలికల పేర్లు : అక్షచ్చి, మన్ని యనువారలు పిల్లల తండ్రి మొదట సందేహించినను, చివరకు శ్రీ రంగనాథుని ప్రేరణమువల్ల ఆ బాలికలను శ్రీ పరాశరభట్టరులకిచ్చి వివాహము గావించెను.

7. అత్తుళాయమ్మగారి వైభవము :

ఈ యమ పెరియనంబి కుమార్తె అత్తవారిపోరు భరించలేక యతిపతులకు దెల్పుకొనగా నాతడు దాశరథిని వారింట పనిచేయుటకేర్పాటు గావించెను. ఒక సందర్భమున వీరియింటి వాకిట ఇరువురు వైష్ణవులు బ్రహ్మవాదము సల్పుచుండగా నీతడు మధ్యవర్తివలె నిలిచి సమాధానమిచ్చెను. అత్తుళాయమ్మ మామగారు తమ తప్పును తెలిసికొని దాశరథిని గౌరవించి పంపివేసిరి.

---

1. "Kurrattalvan coud not find a suitably spritual (namely Srivaishnava) girl for parashara from among his own relatives, and Ramanuja had trouble canvacing both sides to arrange a match between Parashara and a girl from periaNambi" family, since the latter was a different Bramhan subcaste. (Brhacearanas = బృహచ్చరణులు) The Theology of Ramanuja Page..46.

8. కూరేశులు శ్రీరంగమును చేరుకొనుట :

కూరేశులు తన గ్రామమును విడిచి, భార్య తనవెంట తెచ్చుకున్న బంగారు గిన్నెను పారవేయుమని చెప్పి శ్రీరంగమునకు చేరుకొనెను.

9. దాశరథి తండ్రి పేరు అనంతదీక్షితుడు. కుమారుని పేరు కందాడయాండాను. ఈ కందాడయాండాను భూతపురియందు భగవద్రామానుజార్చావిగ్రహప్రతిష్ఠ చేయించెను.

10. గోష్ఠిపరిపూర్ణపత్ని పుత్రీవై భవము :

సంగ్రహముగా నున్నది. ఇతని భార్య స్వాములకు విత్తులపురిదీసి, దంపించి వండి తదీయారాధనము గావించెను. ఇతని పుత్రిక సంయమీంద్రుని పదాబ్జంబులు ఉపాయోపేయమ్ములని నమ్మెను.

11. ఆశ్వాసాంత పద్యములోగల కథాంశములు :

''రామానుజ కార్చాసా
రామ రమారాధితాంఘ్రి రాజీవయుగా
శ్రీమద్యజ్ఞేశబుధ
గ్రామణి వినుతప్రభావ కలిరిపు దేవా!

12. చారుభవిష్యదాచార్యుడు : అ.సూ.ము.కి హృదయమువంటి పద్యము ''భువినేగురుని తిరుముడి .... చారుభవిష్యదాచార్య నెవ్వని తొల్లి సాక్షాత్కరించెను శఠవిరోధి.''

ఇతర గ్రంథములలో : మధురకవులు నమ్మాళ్వారుల అర్చావిగ్రహము సేయబోగా అతనికి రామానుజుల అర్చావిగ్రహము గోచరించెనట. స్వప్నములో అతనికి నమాళ్వారులు కనబడి ఈ రామానుజులే భవిష్యదాచార్య లగుదురని నుడివెనట.

నాథమునులు నాలాయిర దివ్య ప్రబంధమును సంకలనము చేయునప్పుడును నమ్మాళ్వారుల కృపచే రామానుజుల అర్చాశరీరము కనబడెనట.

## మధ్యమభాగము - ప్రథమోల్లాసము

ఇందు 21 సీసములు, ఆశ్వాసాద్యంత పద్యములు 4 గద్యాంశములు 10, వచనము 1 పంక్తి గలవు.

కథాంశములు - కథాగమనము - కథా సంవిధానము - అన్నియు స్తుతి పద్యములే.

1. కృతి భర్తను గూర్చిన సంబోధన పద్యము రామానుజుల వైభవమును తెలుపునది మచ్చునకొకటి - ఆశ్వాసాంత పద్యము:

"సుకవినుత చరిత్రా! శోభితస్వర్ణగాత్రా!
వికసదమిత విద్యా! వేదవిత్సూరి హృద్యా!
ప్రకటితబుధషండా! పాణిపద్మత్రిదండా!
వికలితఖలకాండా! శ్వేతమృత్స్నోర్ధ్వపుండ్రా!"

2. ఈ భాగములో మొదట ఆచార్య పరంపర రూపకాలంకార స్వభావోక్త్యలంకారములతో రసవత్తరముగా చిత్రింపబడి యున్నది.

"శ్రీ సఖజలధి సుస్థిర కృపాసలిలంబు,
గోలిశతారాతి కాలఘనము
........"అను పద్యము జూడనగుచు

3. "ఎంచనెంచెద రాచార్యులెల్ల నవని
నాయతీంద్రుని సంబంధులయినవారె" మున్నగు వాక్యములలో యతీంద్రుల - ఆచార్యుల సంబంధము వర్ణింపబడినది.

4. వైష్ణవులు తెలిసికొనదగిన విషయములు, వారి నిత్య పఠనాదులు 4, 5 పద్యములలో గలవు.

5 రామానుజులవారు సభదీర్చి గోష్ఠిలో నున్నప్పుడాయన పరివార వైభవము తెలుపబడినది. సంఖ్యల వివరములు గలవు.

"ఏడునూటులయతు - లీరాఱువేలు...." 6 వ పద్యము.

5) రామానుజుల దివ్యాకృతి వర్ణనము, తలిదండ్రులను గూర్చి, జన్మస్థలమునుగూర్చి, ఆయన అవతారోద్దేశ్యములను గూర్చి, యతీంద్రుల ప్రభావమును గూర్చి కవి హృద్యముగా వర్ణించుచు, భూతపురిని కలియుగ వైకుంఠముగా నుడివినాడు.

ఇందలి సాహిత్య వైభవము : 21 పద్యములు అన్నియు అలంకార శోభితములే.

1) "బాలభాస్కరునైన బవరాన దూవించు
తిరుమేని చాయలమేని వాని,
పూర్ణేందు బింబంబు పోలిక మీఱిన
మొలక నవ్వుల ముద్దుమోము వాని
... .... .... ... .... ...." 7 వ పద్యము
(ఇది పోతన గారి పద్యమును బోలి యున్నది.)

2) "అల కేశవార్యోదయాచలేంద్రము లెల్ల
కాంతిమతీ ప్రాచి గర్భమందు,
నుదయించి, భూతపుర్యోమ స్థలిని మించి
యతిరాజ భాస్కరు డలరుచుండ,
నజ్ఞానతిమిరేషముల్లనల్లన జెడె
విజ్ఞాన దీప్తులు విస్తరించె
.... ... .... .... .... ...."

ఇట్లు సూర్యోదయ వర్ణనముతో యతిపతుల కైక్యమును పోల్చుట రూపకము. "కాషాయశోభి" శ్లోకమునందలి 'ఉద్యద్దినేశనిభమ్' అనుదానికి సార్థక్య నిరూపణమువంటివి పద్యములోని మొదటి రెండు పాదాలు.

గమనిక : ఆ.సూ.ము. పుట 348 లో రామానుజుల చరిత్ర విశిష్టత గలదు. "చరమ దశయందు స్వాభిమత చరమాధికార స్పర్శ విశేషంబును, పూర్వాపర గురుపరంపరాహారయష్టి మధ్యగత నాయక రత్నంబగు శ్రీ రామానుజ మునీంద్రులకె చెల్లు."

## మధ్యమ భాగము : ద్వితీయోల్లాసము ;

ఇందు సీసములు = 30, ఆశ్వాసాద్యంత పద్యములు = 4, గద్యాంశములు = 15, వచనము = 1 పంక్తి గలవు.

ఇతడు అద్వైతాచార్యుడైన యాదవ ప్రకాశులకడ పూర్వమీమాంసాది శాస్త్రముల నైపుణమెలర్ప నధికరించుచుండెను. అపుడొక అద్భుత సంఘటనము జరిగెను. అదియే-

### 1. బ్రహ్మరాక్షస వృత్తాంతము :

రామానుజుడున్నది చోళదేశము. ఆ దేశపు రాజకుమార్తె (పేరు లేదు. చారిత్రక సమకాలికుల సంగతి ప్రత్యేకముగా తెల్పనైనది) యౌవనవతి. కాని బ్రహ్మరాక్షసుడు పూనినాడు. యాదవ ప్రకాశుడు రాజగురువు. ఆతనిని పిలువ నంపిరి. యాదవుని మంత్రము పనిచేయలేదు. బ్రహ్మ రాక్షసుడే ఆతని పూర్వ జన్మ వృత్తాంతమును తెలిపి, ఆతనికడ చదువు లక్ష్మణాచార్యుని పిలిపింపు మనెను. అట్లే రామానుజులు వచ్చి రాక్షసుని తలపై తన పాదద్వయమునుంచి, తన శ్రీపాదరేణువా తరుణి నుదుట బొట్టుపెట్టెను. రాక్షసునికి మోక్షము లభించెను. రమణికి శరీరము నయమయ్యెను.

### 2. "కప్యాస పుండరీక సంఘటనము"

రామానుజుల జీవితములో మహత్తర పరివర్తన కలిగించిన సంఘటనమిది.

ఒకప్పుడు రామానుజులు యాదవప్రకాశకుల కభ్యంజనము సేయించు చుండిరి. ప్రస్తావనలో "కప్యాస" ఉపనిషద్వాక్యమున కర్థము గురువుగారు అసత్యముగా వర్ణించిరి. అపుడు రామానుజుల కన్నీరు గురువుగారి తొడపై బడెను. గురువు కారణమడుగ, ఇతడుచితమైన, సంతృప్తియైన సమాధానము నిచ్చెను. ఆ. సూ. ము. లో కవి ఆ శ్లోకము నిట నుదహరించలేదు. పద్యము లోనే తెలిపినాడు గాన, సంస్కృత శ్లోకముల నిట వ్రాయుచున్నాను:

శ్లో॥ "తస్య యథా కప్యాస పుండరీకమేవ మక్షిణీ"

(ఛాందోగ్యోపనిషత్ 1, 6, 7.)

దీనికి యాదవప్రకాశకులు చెప్పిన యర్థము:

"తస్య యథేత్యాద్యుదార శ్రుతికి
వానరాసనాక్షుడు హరి యర్థమనిన"

(ఆ.సూ.ము. పుట. 165, 10 వ పద్యము)

శ్రీ రామానుజార్య ప్రతిపాదిత వేదవాక్య స్వారస్యార్థ క్రమవర్ణనము:

శ్లో॥ "కపిస్త్వాదిత్యః కంపిబతి కిరణైరిత్యపి కపిః
గభస్తీత్యామ్నా తస్స కపిరమునాస్తు యదిహతత్
ప్రతీమః కప్యాసం దివసకర తేజో వికసితం
సుపద్మం శ్రీమత్త్వాదగణి భగవచ్చక్షురుపమా."

పరమయోగి విలాసములోని అర్థసూచిక. పుటలు 5, 2
తిరుమల దేవస్థానం వారి ప్రచురణము-1938.

ఈ శ్లోకము నెక్కువగా కవి యనుసరించలేదు. ప్రపన్నామృతమునే సంపూర్ణముగా యనుకరించినాడు. గమనింపుడు.

రామానుజులు "శారద"కు వివరించిన ప్రకారము :

శ్లో॥ "కం జలం పిబంతీత్యస్మాత కపిరిత్యుచ్యతే రవిః
తేన సంస్ఫుటితం పద్మం కప్యాసమితి కథ్యతే।
తత్తుల్యే లోచనే విష్ణోదిత్యర్థోస్యాశ్శ్రి తేర్మతః
తచ్ఛృత్వా శారదాహృష్టా శ్రీభాష్యం తత్కృతంమహత్॥"

(ప్రపన్నామృతము. 34వ అధ్యాయము. ప్రాచీన ప్రతి. పుట 97. తెలుగు లిపిలో.)

"జలము గ్రోలుటచే కపి సవిత యతని
వలన వికసించు నెత్తమ్మి వంటి కనులు
కలపు హరికన" యాదవుడలిగె ననుచు
వాదిభీకర గురుడనె మోదమలర!"

(అ.సూ.ము. 11వ పద్యము. పుట 165)

**3. యాదవప్రకాశుడు రామానుజుల నంతమొందింప దలపెట్టుట :**

గురువు గంగాతీర్థావగాహనమను మిష కల్పించెను. గోవింద మిత్రుడిది కనిపెట్టి రామానుజుల కెఱింగించెను. ప్రయాణములో అరణ్యమధ్యమున రామానుజు డాగిపోయి, రహస్యముగా వేరొకచోట నిలిచి రాత్రి గడుపుచుండ, కరిగిరి వరదుడు, పెరుందేవియును వృద్ధ వనచర దంపతుల రూపమున వచ్చి అతనిని కాపాడి తిరిగి కంచికి చేర్చిరి. ఇంటికి వెళ్ళిన నాటగోలె రామానుజులు "శాలికిణరు" నుండి జలకలశము దెచ్చి వరదునకర్పించు కైంకర్యము సేయుచుండెను.

4. రామానుజుల ప్రతిజ్ఞ :

యామునులు రామానుజులతో కలిసి మాట్లాడలేక పోయెను. విధి అందుల కవకాశము కల్గనీయ లేదేమో! యామునుల అంత్యదశను గూర్చి రామానుజులు విని, పెరియనంబితో సహా పరుగెత్తుకొని శ్రీరంగమునందలి ఉద్యానవనమును చేరుకొనెను. వెంటనే అచట అతనికి కనిపించిన దృశ్యము "యామున చరమ దివ్యాకృతి." ప్రణతు లాచరించి, "తత్కరాకుంచి తాంగుళీత్రితయంబు జూచి" ఇమ్మహాత్ముని కొఱకు తానేమి చేయవలెనని అచటివారిని ప్రశ్నించెను. వారు మాకేమి తెలియదన తాను ప్రతిజ్ఞ నొనరించెను.

ప్రతిజ్ఞ : అ. సూ. ము. పుట 167, 18 వ పద్యము.

"బ్రహ్మ సూత్రములకు భాష్యంబు రచియించి
దెసల జాటించెద ధీరులార!
వ్యాస పరాశర వరనామధేయుల
జేసెద నిరువుర సిరులు మెరయ,
కురుకాపురీశుని తిరునామ మొక్కరి
కొనరించి పిలిపింతు నూర్జితముగ"
ననుచు లక్ష్మణముని యానతి యిచ్చిన
యొక్కొక్క వార్త కొక్కొక్క వ్రేలు
సాచి యెప్పటి యట్లుండ సకల జనులు
కనిరి యామున చరమ విగ్రహమచటన
టనుచు పెద్దలు చెప్పగా వినుదుమనుచు
వాది భీకర గురుడనె మోదమలర!

5. "యామునాచార్యులతో మాట్లాడినచో!" - రామానుజుల తలంపు స్పృహణీయము.

"ఆళవందారితో నఱగడెయైన సం
భాషింప గలిగిన పరమనిలయ
పర్యంత సోపాన పంక్తి దీర్పింతును
రంగేశుడీవేడ్క భంగపఱచె."

(అ. సూ. ము. పుట 167, 19 వ పద్యము.)

పిమ్మట లక్ష్మణార్యులు కంచికి వెళ్ళి వరదునంఘ్రిపద్మ సేవధిగాంచెను.

### 6. కాంచీపూర్ణులు విన్పించిన షడ్వార్తలు :

తిరుకచ్చినంబి (కాంచీపూర్ణులు) కంచి వరద దంపతులకు చామర సేవ సేయుచు, దేవునితో ప్రత్యక్షముగా మాటలాడుననీ, ముచ్చటించువాడని రామానుజులు వినెను. తన మనస్సులోని సందేహములకు ప్రత్యుత్తరముల వరదునడిగి తెలిసి తన కానతిమ్మని కాంచీపూర్ణుని కోరెను.

ఈ కవి పద్యములోనే వార్తల వివరములు స్పష్టపరచినాడు.

(ఆ.సూ.ము. పుట 168, 20 వ పద్యము.)

"పరతత్త్వమే నట్లుపాయంబు న్యాసంబు,
దర్శనమట్లు భేదంబు నిజము ;
ఆ మహాపూర్ణుడే యాశ్రయనీయుడు,
దేహాంతరమందు నీ దేహులకును
మోక్షమంత్యస్మృతి పోషణం"బీ యాఱు
ప్రత్యుత్తరములు నీ ప్రశ్నములకు!

ఇదే యర్థమును తెలియజేయు సంస్కృత శ్లోకమును ఇట గమనించదగినది :

"అహమేవ పరం తత్త్వం దర్శనం భేదమేవచ,
ఉపాయేషు ప్రపత్తిఃస్యాత్, అంతిమస్మృతివర్జనమ్,
దేహావస్యా మోక్షంచ, మహాపూర్ణం సమాశ్రయః॥"
(పరమయోగివిలాస అధఃసూచిక TTD ప్రచురణ 1938. పుటలు 509.)

### సంగ్రహ వివరణ :

1. నేనే (వరదుడు) పరబ్రహ్మను, పరతత్త్వమును
2 శరీరమునకు, శరీరికి భేదము గలదు.
3. మహాపూర్ణులనే గురువుగా నాశ్రయించుము.
4. భక్తులకు దేహావసానముననే మోక్షమిత్తును.
5. భక్తుల కంతిమస్మృతితో పనిలేదు.
6 "ఉపాయంబున్యాసంబు"=ప్రపత్తినిమించిన్ మోక్షోపాయము లేదు.

7. రామానుజులకు పెరియనంబి పంచ సంస్కారాదులను జేయుట హిత ముపదేశించుట :

రామానుజులకు కరిగిరీశుడు కలలో కనబడి పెరియనంబి వద్దకు వెళ్ళు మనెను. (యామునుల యాజ్ఞచే పెరియ నంబి రామానుజులను శ్రీరంగమునకు తోడ్కొని పోవుటకు ప్రయాణమై వచ్చు సందర్భము ఈ గ్రంథములోని పూర్వభాగమున ఐదవ యుల్లాసమున గలదు. పుట 119. ప్రస్తుత భాగ మున లేదు.) అతనిని కలిసికొనదలంచి రామానుజులు జనుచుండ పెరియ నంబియే రామానుజుల కెదురయ్యెను. ఇరువురును మధురాంతక తటాకమును జేరుకొనిరి. రామానుజులు తనను శిష్యునిగా చేకొనుమని ప్రార్థింప, పెరియనంబి "జాగు తగదని లక్ష్మణాచార్యులకును పంచ సంస్కారములు, అర్థ పంచకాది పరమ హితముల కృప జేసి" పనిచెను. (పుట 168, 22 వ పద్యము- ఆ.సూ.ము.)

8. ఒక మూక బాలకుడు రామానుజులవారి ప్రభావమును ప్రకాశము సేయుట :

ఒక పుట్టు మూగ (మూక) బాలకుడు సంవత్సరమువర కెవ్వరికిని కనబడకుండబోయి, తిరిగి వచ్చి విచిత్రముగా నిట్లు పలికెను. "శేషుడీ యిల యాళ్వారి వేషమంది - యఖిల చేతనుల బ్రోవ నవతరించె''— (ఆ. సూ. ము. పుట 168, 23 వ పద్యము).

9. రామానుజుల సన్యాస స్వీకార సందర్భము :

ఇందు రామానుజుల భార్య పేరు పేర్కొనబడలేదు. (తంజమాంబ లేదా రక్షకాంబ) ఈయమ మూడు తప్పులను గావించినది. పద్యములలోనే వివరణము గలదు. సంగ్రహముగా: 1. మహాపూర్ణుల భార్యను గూర్చి దురుక్తులాడుట.

2. కాంచీపూర్ణులు సాపడగా నతని ఉచ్ఛిష్టభాజనమును పరిహరించి సచేల స్నానము చేయుట.

3. తనకభ్యంజనము సల్పు బ్రహ్మచారికి పట్టెడన్నము పెట్టలేక పోవుట.

(ఆ. సూ ము. పుట 168, 25 వ పద్యము.)

"వెదకి తప్పులు మూడు విడిచెద నిన్నని, మునుపు చెప్పితిని నా మూడు వినుము" అని పై యంశముల తన భార్యకు తెలిపి,

(పుట. 169, 27 పద్యము.)

"తగినయట్టులర్థమిచ్చెదను నీకు, యావదాయుష్యము పుట్టినింటనుండుమీ పొలుపుజెందియనుచు" ఆమెను త్యజించెను.

**10.** కరిగిరివరదు **నాజ్ఞచే** రామానుజులు శాస్త్రోక్తముగా సన్యసించెను:

(ఆ. సూ. ము. పుట. 169, 29 పద్యము.)

"తద్దత్త దివ్యత్రిదండ కాషాయ వస్త్రముల ధరించి, శాస్త్రక్రమంబుసల్పి ''సర్వంమయా సన్యస్తమని"పల్కి, యా వరదుని చరణాబ్జములకు, భక్తిప్రణమిల్లి యితరవిరక్తిజెంది, సర్వదేశదశాకాల సర్వశేష తార్థ కృత్యములొనరించె నచట ననుచు...."

**11.** యామునాచార్యుల పిమ్మట రామానుజులు శ్రీరంగము కేంద్రముగా దర్శనస్థాపక పదవిని స్వీకరించు సందర్భము :

రంగమందిర సభారంగమందు గల దేశికేంద్రులు సమాలోచనముల జేసి లక్ష్మణముని దర్శనస్థాపన దక్షుడని, అతనిని పిలుచుకొని రావలసినదిగా మధుర దివ్యగాయకుడగు ''తిరువరంగప్పెరుమాళరయరుల'' కంచికి పంపిరి. అతడును కంచికి వచ్చి దేవుని మెప్పించి లక్ష్మణార్యుల కోరుకొనెను. ఈ పద్యము గమనార్హము:

''తిరువరంగగురుండు దేశికప్రార్థన, గాంచీపురము జెంది కరిగిరీశు
ఘనలతావేష్టితరూపము, దేవీసమాశ్లిష్ట దివ్యదేహు
వరదునిగన్నిమ్రొక్కి వరనృత్త గీతవాద్యముల మెప్పింపనాహరియుమెచ్చి
యిల్లాలిదక్క నీవేమివేడిన నిత్తునన, "నిలయాళ్వారిన"డుగ మొదట
నాలి, లక్ష్మణమునిదక్క నడుగ మనక-యిప్పుదన్నృతంబు బల్క మాకెట్లు
చెల్లు"నని యొసంగెను లక్ష్మణమునుల ననుచు -
వాదిభీకరగురుడనెమోదమలర!"

(ఆ. సూ. ము. 170. పుట. 30 పద్యము,

# మధ్యమభాగము : తృతీయోల్లాసము

(ఇందు సీసములు = 95, అశ్వాసాద్యంత పద్యములు = 4, గద్యాంశములు = 25, వచనము = 1 పంక్తి గలవు.)

**కథాంశములు - కథాగమనము - కథాసంవిధానము :**

1. కరిగిరివరదుని యాజ్ఞగొని ''తిరువరంగప్పెరుమాళరయరు'' రామానుజార్యులను దెచ్చి రంగపతికి సమర్పించిరి.

2. ఇట్లు రామానుజులు రంగేశు కైంకర్యమను దొడ్డ కలిమిజెంది, యతికులసార్వభౌములై శ్రీరంగదివ్య సభాస్థలిని దిన దినము దివ్యగోష్ఠి సలుపుచుండిరి. కూరేశ ముఖ్యాదులమలమతులు డెబ్బదినల్గురితనికి శిష్యులయిరి.

శిష్యులగు సందర్భము : ఆ.సూ.ము. పుట 178, 2వ పద్యము :

''గురునాజ్ఞమీరి యందఱువిన మంత్రము జాటనాలించి యాచార్యపురుషులయిరి డెబ్బదినాల్గు సింహాసనాధిపతులు, మంత్ర ప్రవర్తకులు వారె.''

3. మంత్రరాజలాభము : ''ఎంబెరుమానారు'' తిరునామము.

గమనిక : (ఆ.సూ.ము. గ్రంథ రచయిత ఈ కథ నతి సంక్షిప్తపఱచినాడు. రామానుజులు నృసింహ దేవాలయము శిఖరము నెక్కి మంత్రమును వెల్లడి చేసినాడను వాక్యములు లేవు) శ్రీరంగమునకు వెళ్ళిన పిదప రామానుజులు మంత్రరాజమును బొందుటకై ''తిరుక్కొట్యూరు'' అను గ్రామమునకు వెళ్ళి, తిరుక్కొట్యూరునంబిగారిని ఆశ్రయించి మంత్రరాజము నుపదేశింపగోరిరి. మొదట అసఫలీకృతుడయ్యెను. ఎట్లయినను దీనిని సాధించుటగాను 17 మార్లు గురు నింటికి వెళ్ళిరి. 18వ సారి మాత్రము ఆతని ద్వారా మంత్రరాజమును, చరమమును బడసిరి. దానిని అందఱు వినునట్లుగా చాటెను. గురు శిష్యుల సంవాదమిట్లున్నది:

''అతి గుహ్య మీ మంత్ర మన్యుల కెవరికి జెప్పరాదు. గురు నాజ్ఞమీరితి వేల?" యని గురుడు ప్రశ్నింప రామానుజు లిట్లు బదులిచ్చిరి:

'''సర్వజ్ఞ నీ యాజ్ఞ సలుపనికతన - వీనికి నొక్కరునికి బోనిరయబాధ,

ఎంబెరుమానారు : గోష్ఠిపూర్ణులు, "ఎంబెరుమానారె! యిందు రమ్మని పిల్చి యానంబి కౌగిట నప్పళించి, సద్గురుండవు నీవె పో జగతికెల్ల మా కొఱంతలు దీరె నీ మహిమ కతన!" ఇనుచు బల్కెను.

(ఎంబెరుమానారు = నాకు నాథుడవని ఈ మాట కర్థము. ఇందు రామానుజుల విశాలహృదయము, స్వార్థత్యాగము, సంఘహితము ద్యోతకములగును.)

4 రామాయణార్థమునకై శ్రీశైలపూర్ణులకడకు ప్రయాణము సాగించుట; తిరుపతికి మొదటిసారి వెళ్ళుట:

రామానుజులు శ్రీశైలపూర్ణుల సేవించుకొని, రామాయణార్థము బడయుటకై తిరుపతికి వచ్చిరి. శేషాద్రి శేష స్వరూపముగా కన్పించుటచే దానిని కాలిచే ద్రొక్కి నడువరాదని యెంచి క్రిందనే యుండగా, తిరుమలనంబి ఆతని కడకే వచ్చెను. వృషాద్రి ఉపత్యకోర్వి నొక్క తింత్రిణి క్రింద నుండెను. అచటనే ఒక సంవత్సరము వరకు రామాయణార్థమును తెలిపెను. ఇచటనే రామానుజులకు తొండమాన్ చక్రవర్తి జన్మవృత్తాంతమును* ఆశ్రితులు తెలిపిరి, శంఖ చక్రముల నీ చక్రవర్తికి శ్రీ వేంకటేశు డిచ్చుటవల్లను, సిరి యురము నుండి తొలగినందువల్ల ఆ దేవుని శైవుడని కొందఱు కొల్చుచుండిరి దీనిని వారింప వలసినదిగా కోరిరి.

రామానుజులు శేషాద్రికి మోకాళ్ళపై నడచి అచటినుండి కాలినడకన ముందునకు సాగిపోయెను యతిపతిచే అనుభూతసారమై ఆతడు కాలిడినచోట నొక ఫలవృక్షము (మామిడి) జనించెను. ఇచటనే వీరి అర్చావతారము గలదు.

**5. శ్రీ వేంకటేశునికి రామానుజులు గురువు - మామ - పెద్దతనము గలవాడగుట :**

శ్రీ వేంకటేశుని సన్నిధిని గల శైవులతో ఒప్పందము గావించుకొని విష్ణుచిహ్నములగు శంఖచక్రముల నా దేవుడు ధరించెనని సాక్ష్యములతో ఋజువు

---

* తొండమాన్ చక్రవర్తులు : వీరు ఆంధ్రులు కారు. ఐనా ఆంధ్రకవి పండితుల నాదరించిరి. (1730-1886) పుదుక్కోట రాజులకు తొండమాన్ అను బిరుదు గలదు. తెలుగు సాహిత్య సమీక్ష II, డా॥ జి. నాగయ్య, పుట 30.

యయ్యేను

6. తిరుమల నుండి క్రిందికి దిగుట :

తిరుపతిలోగల తిల్లగోవిందరాజ దేవాలయమును పునరుద్ధరించి, విగ్రహమును తిరిగి ప్రతిష్ఠింప జేయించి, పదుగురాళ్వారులకు, ఆండాళునకు ప్రత్యేక గృహముల నెలకొల్పి, గోవిందరాజులకు, శ్రీ భూమినీళాదినీమంతిని రత్నముల నిచ్చి పరిణయముగావించి, క్రమముగా ఉత్సవములు జరుగునట్లేర్పాటు గావించెను.

7. తిరిగి శ్రీరంగమునకు చేరుకొనుట :

గోవిందమిశ్రుడు శ్రీశైలపూర్ణుని కడనుండ, యతిపతి ఆ యువకుని తన వెంట నుండవలసినదిగా యాచించి, శ్రీరంగమునకు తీసికొని వెళ్ళెను. గోవింద మిశ్రులకు పెండ్లియైనను తన భార్యపై కామవాంఛ లేకుండుట తెలిసికొని, రామానుజులా తనికి సన్యాసదీక్ష నొసగింరి. శ్రీరంగదేవాలయాధికారిని కూరేశులు తనకధికారిగా గాక యనుకూలునిగా జేసికొని గుడిబీగముద్రికలు యతిపతికి సమర్పించెను. ఇట్లు యతిపతి శ్రీరంగ కైంకర్య సామ్రాజ్యమేలుచుండెను.

8. యజ్ఞమూర్తి యను పండితుడు రామానుజుల శిష్యుడగుట :

రామానుజుల కీర్తిని సహింపక అచటనున్న నొక పండితుడు "యజ్ఞమూర్తి" యనువాడు పండిత వాగ్వివాదమునకు తలపడెను. 17 రోజులు వాదములు జరిగెను. 18 వ రోజున రామానుజులు తమ స్వస్వరూపమును శేషుని ఆకృతిని జూపిరి. కరిగిరి వరదుని కృపచే నిట్లైనది. కవి ఇతని ఆకృతిని అత్యంత మనోహరముగా వర్ణించినాడు:

"అమృతాంశు బింబ సుధాసారముల మాడ్కి
ముఖముల దరహాసములు వెలుంగ,

.... .... .... .... .... .... ... .... .... ....

సభను వెలుగంగ యతిలోక చక్రవర్తి
మూర్తి వీక్షించె నా యజ్ఞమూర్తి యనుచు." -ఆ సూ. ము పుట 181.

"జీవేశ్వరాభేద చిన్మాత్ర సత్యత్వ - తదితర సకల మిథ్యాత్వములను" స్థాపించు యద్వైత శ్రుతుల కన్నింటికి తాను ప్రత్యుత్తరముల నొసంగెదనని రామానుజులు వచింప వెంటనే యజ్ఞమూర్తి ఆతని పాదముల నాశ్రయించి సకల హితముల నుపదేశముల బడసెను రామానుజు లతనికి "అరుళాల ప్పెరుమాళ్ ఎంబెరుమానారు" అను దాస్య నామ మొసంగెను ఒక సందర్భమున ఆగంతుకులకు పదము ఒక వ్యక్తిని సూచించుపట్ల సందేహములకు తావివ్వ యజ్ఞ మూర్తి ఆ పదము తనకు వలదని, "అరుళాలప్పెరుమాళ్"నే ధరించెను.

వీరి రచనలు : 1) జ్ఞానసారము 2) ప్రమేయసారము.

9. ఒకతఱి యతికులపతి భైక్ష్యము సలుపువేళ పెరియనంబి కుమార్తె యత్తుళాయమ్మను జూచి, నప్పిన్న పిరాట్టి యనుకొనెను. (సందర్భము: రామానుజులు తిరుప్పావులోని ఉందుమదకళిత్తు అను పాట జదువదొడగి తిరవాయి యను పదమందు కొనగనే అత్తుళాయమ్మ తలుపుగడియ దెఱచెను.) పు. 183

10 అత్తుళాయమ్మ విధానమును కనుగొనిన ప్రక్కయింటి సాధ్వి యొకతె యతిపతుల నాశ్రయించి మంత్రోపదేశముకు బడసెను. అర్చార్థమతని పాదుకలను బొంది, తన పైటకొంగులో ధరించెను ఈమెయే కొంగు పిరాట్టి (చేలాంచలాంబ) యని ప్రసిద్ధిగాంచెను.

(గమనిక : మధ్యమభాగము, 7 వ యుల్లాసములో పుటలు 252, 253, 254 లలో ఈయమ రామానుజుల కాతిథ్యమిచ్చిన వృత్తాంతము గలదు)

## 11. విషాన్నము : విషతీర్థము :

యతిపతిపై గల కోపమునే అలయాచ్చలకులతని కొకతూఱి విషతీర్థ మివ్వగా నాతడది గ్రోలెను. హాని కలుగలేదు.

ఒకమారొక యింటిసాధ్వి తనకు సమ్మతము గాకున్నను భర్త బలవంతము చేత యతిపతికి విష సంయుతాన్నమును బెట్టి మ్రొక్కగా నాతడది గ్రహించి దానిని పారవేసెను.

12. విషాన్నపు వార్తలు శ్రీగోష్ఠీపూర్ణులెఱింగి, యతిపతి కడకు వేగ వచ్చుచుండిరి. వారు కావేరినది యిసుకలో కాలూని నిల్చొన, నపుడే యతిపతు లెదురై తన గురువు పాదములపై బడిరి. క్రింద యిసుక కాలుచుండ అతని దేహము

కిడాంబి వరదాచార్యుడను శిష్యుని భక్తి: గోష్ఠిపూర్ణులు యతిపతిని కూర్చొనమనలేదు. ఇది కనిపెట్టి "కిడాంబి వరదాచార్యుడను" యతిపతి శిష్యుడు యేడ్చి, గురువు నెత్తుకొని తాను క్రిందబడెను. గురువు వరదాచార్యులను మెచ్చుకొని యతిపతితో "ఈతడిడు యన్నమునే ఇకముందు గైకొనవలయు"నని హెచ్చరించి వెడలిపోయెను.

## 13. ఏకలవ్య శిష్యుడు :

రామానుజులు "తిరుమాలె యాండాను"కడ తిరువాయిమొళిని గ్రహించుచు ఒక సందర్భమున తాను వేరొక యర్థమును చెప్పెను. గోష్ఠిపూర్ణులు తిరుమాలె యాండానును సమాధానపరచిరి. అంత యతిపతి తాను "ఏకలవ్యుండగానో నేనెన్నటికిని యామునార్యులకని" పలికెను. సురల తిరుమాలె యాండాను అతనికి తన వైశ్వామిత్రభావమును విడిచి, ద్రవిడోపనిషదర్థ తత్త్వమంతయు దెల్పెను.

## 14. అంతిమోపాయమును బడయుట :

రామానుజులు ''తిరువరంగప్పెరు మాళరయరు''ను అశ్రయించి సకల శుశ్రూషలు సలుపుచు ''అతని కొకనాడు తలయంటి యంగములకు, కుసుమ సుకుమారచూర్ణము కూర్మిదెచ్చి, నలుగుబెట్టి'' ప్రసన్నుని గావించుకొనెను. అంత నాగురుడు సమ్మదము జెంది, రామానుజులచేత ముందు శఠకోపసూక్తుల జదివించి, ''అంతిమోపాయ'' మెఱింగించెను.

## 15. ఉడయవరు బిరుదు : విభూతిద్వయము :

గద్యత్రయ రచనచేసి విన్పింప శ్రీరంగనాథులు సంతుష్టులై వరము కోరుకొమ్మనిరి. అపుడు యతిపతి ఇట్లు కోరుకొనెను:

''దయనిమ్ము మోక్షమ్ము ధరగల్గు మావారి, వారి జెందిన వారి వారి కెల్ల.'' అంత శౌరి తన "విభూతిద్వయ'' మాతని కొసంగెను గాన, యతిపతికి ''ఉభయవరు'' లను తిరునామ మేర్పడెను.

## 16. ధనుర్దాసు వృత్తాంతము :

గ్రంథకర్త యిచటినుండి ధనుర్దాసు వృత్తాంతము నతి విపులముగా చిత్రీకరించినాడు.

ధనుర్దాసు డొక మల్లవిద్యా విశారదుడు. ఐనను కాముక సార్వభౌముడు. భార్య పేరు హేమాంగి. ఆమె కన్ను లతి విశాలములైనవి. సుందరములైనవి.

రామానుజుల వారొకనాటి అరుణోదయపు వేళ కావేరియందు స్నానమొనరించి తిరిగి వచ్చుచు త్రోవలో నొక వింత దృశ్యమును జూచిరి. అదేమన, ఈ కాముక సార్వభౌముడు తన భార్య ముఖమున కడ్డముగా సూర్యుని కిరణములు సోకకుండ ఒక చేలము నుంచి నడచుచుండెను. యతిపతులు కారణ మడిగిరి, ఆతడును "ఈ లేమ కనుదోయి రవిప్రభ సోకిన బడలునేమోయని భయముజెంది యిట్లొనర్చెద" ననెను. అపుడు రామానుజులు "ఎచ్చట సరి లేని సొబగు కన్నుల నీకు" జూపగలనని ఆ రసికుని రంగనాథుని కడకు గొంపోయి "అహిశయాను అక్షియుగమిది కన్గొను"మనెను. ఆ నయనారవింద దర్శనభాగ్య సుఖమును గాంచి వెంటనే ధనుర్దాసు యతిపతి యంఘ్రుల నాశ్రయించెను. అతని భార్యయు ఆశ్రయించినది. అతనికి ధనుర్దాసుడని, ఆమెకు హేమాంబయని నామకరణములు సేసి విష్ణులక్షణలక్షితులుగా నొనర్చెను.

యతిపతికి ధనుర్దాసు డాంతరంగిక శిష్యు డాయెను. ఈ కవి ఇచ్చట రెండు మూడు సంఘటనల వర్ణించినాడు. అవి వ్యాప్తి జెందిన కథలు. ప్రసిద్ధ ములు. ధనుర్దాసును ద్రష్టలు "పిళ్లైయురంగాద వెల్లిదాసు" అనియు, నాతని భార్యను "పొన్నాచ్చియారు" అనిరి. (ధనుర్దాసుని పేర తనియన్ గూడ గలదు. పుట : 351)

యతిపతి ధనుర్దాసున కాధిక్యమిచ్చి ఆదరించుట జూచి ఇతర వైష్ణవుల సూయపడిరి. ధనుర్దాస దంపతుల గురుభక్తి యెంతటి నిస్వార్థమో జూపలంచి ఇతర వైష్ణవులకు గుణపాఠములు నేర్ప సంకల్పించినాడు.

**దృష్టాంత కథ :** యతిపతి ప్రణాళిక ననుసరించి కత్తిరించి వేయబడిన తమ కౌపీనముల జూచి కొందఱు వైష్ణవులు పరస్పరము నిందించుకొని కల హించిరి. ఇట్లే యతిపతి ఇంకొక పథకము ప్రకారము ధనుర్దాసు భార్య నగలను దొంగిలించుట యనునది. తాను పరున్నపుడు ఒక ప్రక్క గల నగలను వచ్చిన స్వాముల పహరించిరి. రెండవప్రక్క.నగల నగలను తీసకొని పోగలరను నమ్మకముతో ఆయమ అటు పొర్లెను. ఆమె లేచినదని వారు పారిపోయిరి. ధను ర్దాసువచ్చి నగలన్నియు దోచుకొనకుండగ శరీరమునేల కదల్చినావని ఆమెపై కోపించి తత్సంగ సౌఖ్యమును మానుకొనెను. ఈ విషయము యతిపతి గ్రహించి,

కలిపెను.

నీతులు : ఇచట వైష్ణవులందఱకు రామానుజులు నీతుల నేర్పెను. "ధను ర్దాసు శూద్రవర్ణమువాడు. చదువురానివాడు. ఐనను గుణవంతుడు. ఇతడే పూజ నీయుడైన వైష్ణవ పుంగవుడు.'' "ఆత్మతత్త్వానభిజ్ఞుల యభిజనాదు లడవిగాచిన వెన్నెలలు.''

**ఆత్మకాచార్యులెందరు? :**

ఇదే కథలో శిష్యులు వేసిన ప్రశ్న : ఆత్మకాచార్యులెందరు?

రామానుజుల సమాధానము : ధనుర్దాసు భార్య నడిగి రండు.

శిష్యులు వెళ్ళి ఆమె నడిగిరి.

ఆమె సంకేతముల నిట్లు జూపినది :

**సంకేతములు :**

''కొప్పు విప్పి విదిర్చి, యొప్పుగా ముడిగూర్చి
తొగరు దారము జుట్టి, ద్యుమణి జూచి -
మ్రొక్కి, యిలు జొచ్చి, వాకిలి తలుపు మూసి, 'దాసి
కేమి తెలియును? గురుడే మీకెరుక పరచు' ననెను.''

(ఆ. సూ. ము. పుట 189, 81 వ పద్యము)

**రామానుజులిట్లా చిక్కును విడదీసిరి :**

వివరణ పద్యమిందే గలదు. (పుట 190, 82 వ పద్యము.)

''ఆచార్యులీయాత్మ కఖిల వైష్ణవులని
చెప్పెను సిగదుల్పి కొప్పు ముడిచి,
యా పూర్తి యొక్కరికేయని తెల్పె నతనిగా
మము జూపె దొగరు దారమున మీకు,
గురుదెగతియని తెల్పె నర్కునకు మ్రొక్కి
యింతకంటేమి లేదని యిల్లు జొచ్చి
మూసె తలుపని యనె నార్య ముఖ్యుడనుచు.''

1. కొప్పు విప్పుట=సిగ దులుపుట-అఖిల వైష్ణవు లీయాత్మకాచార్యులు.

2. ముడి గూర్చుట=కొప్పు ముడుచుట - ఆ పూ_ర్తి యొకరికేయని తెలిపినది.

3. తొగరు దారము జుట్టి అతనిగా మము జూపె (రామానుజులను)

4. ద్యుమణి జూచి మ్రొక్కి=అర్కునకు మ్రొక్కి గురుడె గతియని తెలిపినది.

5. ఇలుజొచ్చి, వాకిలి తలుపుమూసి - ఇంతకంటెనేమియు లేదని ఇంటిలో ప్రవేశించి తలుపులు మూసినది.

(గమనిక : అనుశీలన విభాగము, సంఖ్య 13లో గూడ సంకేతముల గూర్చి తెలుపనైనది.)

## 17. యాదవప్రకాశులు రామానుజుల శిష్యుడగుట :

యాదవప్రకాశులు తన తల్లి ప్రోత్సాహముచేత వృద్ధాప్య దశలో రామానుజుల నాశ్రయించి శిష్యుడాయెను. రామానుజు లతనికి "గోవింద జియ్య"రను తిరునామముంచెను. సకల హితముల నుపదేశించెను. వైష్ణవుడైనపిమ్మట ఇతని రచనలు : "యతిధర్మ సముచ్చయము."

ఇంతకు పూర్వము వేరే గలవు : వైజయంతీ నిఘంటువు.

## 18. రామానుజులు శ్రీభాష్యమును రచించుట :

శ్రీబాష్యమొనరింప చింతించి యతిపతి కూరనాథ సద్గురులగూడి సరస్వతీ పీఠముకడ కేగెను. అచటివారిని బోధాయనవృ_త్తి* నడిగెను. వారిట్లనిరి : "ఆ గ్రంథమునిచట జూడవచ్చును గాని వ్రాయనియ్య మర్యాద లే"దనిరి. కూరేశుడా నియమము ప్రకారము ఆ గ్రంథమునచటనే జూచి, ఏకసంథాగ్రాహి గావున మేధస్సులో పదిలపఱచుకొనెను. ఇందులో 6,000 సూత్రములు గలవు.

---

* **బోధాయనుడు :** (క్రీ. పూ. 400) ఈతని పేరున ఉన్న ధర్మసూత్రముల కర్త. విశిష్టాద్వైతమతమున కాకరమగు వృ_త్తిని బోధాయనుడు రచించినట్లు, అందులోని విషయములనే తాను సంక్షేపించి వ్రాసినట్లు (శ్రీభాష్యమును) రామానుజులు చెప్పిరి — మే. వ. న. తెలుగు భాషా సమితివారి విజ్ఞాన సర్వస్వము VII భా. పుటలు 557.

"అరుళాళముని" సహాయకుడు. బోధాయన వృత్తిని ధారణ యందుంచుకొన్న వాడు గాన కూరేశుడు లేఖకుడయ్యెను.

ఇతర రచనలు : శ్రీభాష్యము పూర్తియైన పిమ్మట నితడు వేదాంతసార, దీప, సంగ్రహముల వ్రాసెను. నిత్యగ్రంథ ప్రసక్తిని కవియిచట తెలుపలేదు.

## 19. కూరేశుల పెండ్లి సంఘటన :

రామానుజు లానతిచ్చిన గ్రంథములన్నియు కూరేశుడు వ్రాసిన పిదప ఒక విచిత్ర సన్నివేశము జరిగెను.

ఒక పర్యాయము రామానుజు లడవి కేగిరి. ఒక మ్రాకుకడ నొక వైష్ణవు డేడ్చుచుండుట జూచి అతని దుఃఖమును బాపుమని కూరేశుల కాజ్ఞాపించెను. అతడు తన దుఃఖకారణము నిట్లు తెలిపెను:

''మత్సుత నెవడైన మహి పెండ్లియాడ, వా
డా వేదికను డిగ్గినపుడె ద్రెళ్ళు.''

వెంటనే కూరేశుడు ''ఈయదగునేని సుతను మాకిమ్మని'' యడుగ, కూరనాథునకతడు తనకూతునిచ్చెను. ఆ కన్యకను కూరేశుడు శాస్త్రోక్త విధిని అగ్నిసాక్షిగా పెండ్లాడి, ఆ పెండ్లి వేదిక దిగకనే 'కోరి వనస్థుడై' పెండ్లి కూతురుతో పెండ్లి యరుగుదిగి, అత్త మామల, బంధుల వీడ్కొని, శ్రీరంగ ధామముచేరి, రామానుజులకా వృత్తాంత మెఱింగింప నాతడు సంతోషించెను.

ఇట్లు కూరేశులు తనయింటిలో భార్యతో కాలముగడుపుచు, ఉచిత వృత్తి ఉపాదన మొడిసితెచ్చి కాలయాపన మొనరించి ప్రసిద్ధుడయ్యెను.

## 20. కూరేశులకు కవల సంతానము :

కూరేశుల భార్య పేరు ఆండాళమ్మ. శ్రీరంగేశుని పాయసాన్న మహిమచే వీరికి కవలు జన్మించిరి. 1. పెద్దవాడు పరాశర భట్టరు 2. రెండవవాడు వ్యాసభట్టరు. (రామపిళ్ళ.)

**21. గోవిందమిశ్రులీకవల బాలురకు గురువగుట :** గోవిందమిశ్రుడు శిశురక్షణకై ద్వయముచ్చరించెగాన యతిపతి ఇతనిని పిల్లలకు గురువుగా నియమించెను.

## మధ్యమభాగము - చతుర్థోల్లాసము

ఇందు 67 సీసములు, ఆశ్వాసాద్యంతాది పద్యములు=4, గద్యాంశములు=3, వచనము=1 పంక్తి గలవు.

**కథాగమనము - కథాంశములు - కథాసంవిధానము :**

ఈ భాగములో యతిరాజుల వైభవము, పరివార వర్ణన పిమ్మట దిగ్విజయయాత్రా ప్రారంభములు గలవు. అతని వైభవ వర్ణనము కడుంగడు మనోజ్ఞముగా చిత్రించినాడీ కవి : ఉదా॥

''గురుచతుస్సప్తతి, గూడియేకాంగులు
పంద్రెండువేల, సప్తశతి యతులు,
చిత్రగుప్తులకైన జెప్ప శక్యముగాని
సాయుధసూరి నిత్యవ్రజంబు,
లారీతి కొత్తెపుటమ్మలు గొలువ, ల
క్ష్మణముని వెడలెడు సమయమందు,
విష్ణుసేనల రాజా! విహగరాజా! రథాంగ
రాజా! పన్నగరాజా! రంగరాజా!
దెసల గెల్వగ యతిరాజు తెఱగు దాల్చి
చనియెనని ద్రష్టలూహింప సర్వగురుడు,
నరిగె శ్రీరంగరాజ దివ్యాజ్ఞననుచు,
వాదిభీకరగురుడనె మోదమలర!''

(ఆ.సూ.ము. పుట 196, 3 వ పద్యము)

## యతిరాజుల దిగ్విజయ యాత్రా వైభవము

రామానుజులు శ్రీరంగేశుని యనుమతిని బడసి, ''అన్ని దెసల గెలువ'' ప్రయాణ సన్నద్ధుడయ్యెను. అతనిని జూచి ప్రజలును, స్వాములును ఏమనుకొనుచుండిరో యిందు మనోహరముగా వర్ణింపబడినది:

''ఇతడు దత్తాత్రేయ యతియని తలతురు

యితడు విష్వక్సేనుడిది నిజమందురు
తద్వాస సైనిక ధాటి జూచి,
.... .... .... .... ....
గరళ పానాదికము దల్చి గరుడు డందు
రుడయవరుగాన హరియండ్రు వెడలు వేళ."

(ఆ. సూ. ము. 197 పుట 6వ పద్యము)

**యాత్రాప్రారంభము : మొదట శ్రీరంగము నుండి బయలుదేరి దక్షిణ దివ్య దేశములను, ప్రసిద్ధ స్థలములను, క్షేత్రముల దర్శించుకొనుట :**

1. తిరుక్కొడందను దర్శించి శ్రీ భాష్యమానతిచ్చెను.

2. అళగిరి తిరుమల : దేవుని పేరు. మాలిరుంజోలె నంబిని సేవించెను. ఇందలి ఉద్యానవర్ణనము మనోజ్ఞము.

3. పిమ్మట సముద్రతీరము వెంబడి తరలుట : దక్షిణాంభోనిధి. ఇట దర్భశయన శ్రీ రామచంద్రమూర్తి ఆర్చాకృతి గలదు. తిరుప్పుళ్ళానిలో అశ్వత్థ వృక్షమును (లక్ష్మణుడు అశ్వత్థ వృక్షమగుటను) తర్వాతను సేతువును జూచెను.

4. ఆ తర్వాత తిరునగరికి ప్రయాణమయ్యెను. వర్ణనములు :

మార్గమధ్య వన వర్ణనము, తామ్రవర్ణి నది వర్ణనము, తిరునగరిలో ఇతనికి జరిగిన ఘన స్వాగతముల వర్ణనము; మొదట తామ్ర పర్ణినది స్వాగతము పలికిన తీరు, పిదప వృక్ష సంపద స్వాగతించిన విధము, తదనంతరము ప్రజలు స్వాగతము లిచ్చిన తీరులు, పురవీధుల వర్ణనము, అలంకార వైభవముల వర్ణనములు గలవు.

ఆదినాథుని దివ్యాలయమున కునికిపట్టయినదీ కురుకా నగరము. ఈ సందర్భమున నమ్మాళ్వారులకు శఠకోపుడను పేరుగల్గు కథ వర్ణింపబడినది.

**శఠకోపుడను పేరు లభించుట :-** వైకుంఠమున తిల్లవాసుదేవుడు సింహాసనముపైనుండ, "శఠనాము"డను రక్కసు డచటికి రాగా, హరి తన పాదుకాద్వయమునా రాక్షసుని పైకి పంపెను. అవి రక్కసుని గూల్చినవి గాన శ్రీహరికి పాదుకలకు శఠకోపమను పేరు గల్గెను. పర, వ్యూహ, విభవార్చలందీ

"శ్రీహరిశ్రీపాదుకామూర్తిగనుకను,
శఠమారుతజయంబు సలుపుకతన,
శఠకోపమునియని చక్కని తిరునామ
మొందెనేసూరి యీ యుర్వియందు
నా నమ్మయాళ్వారులాత్మచిత్తమున........"
(ఆ. సూ. ము. పుట. 201, 26 వ పద్యము.)

పిమ్మట రామానుజులు ఆదినాథుని దర్శనము చేసికొని, ఆ దేవుని స్తుతించిరి.

ఆ పిమ్మట తింత్రిణీమూలమున నున్న శ్రీ పరాంకుశుల దర్శనము చేసికొనిరి. "శ్రీ పరాంకుశుల జూచి చేర్వ (చేరువ) జెంది, యాత్మజీవాతువగు తత్పాదాబ్జయుగము మస్తకంబున ధరియించి, మధురకవుల సూక్తిచే నుతించెను.* దీవెనలను బడసెను. "మహనీయచరిత మహిమముకతనుర్వి - శ్రీవైష్ణవ సమృద్ధి జెందుననుచు - నతిమృదుమధురోక్తు లాదంచుచు" నమ్మాళ్వారులు పెక్కు బహుమతులొసంగిరి.

5. తర్వాత ప్రయాణ సన్నద్ధుడగుచు తనచెంత కదలకయున్న నొక బాలికామణిని "తిరుప్పుళుంగుడి యెంతదూర"మని యడిగిరి. ఆ బాలిక తిరువాయ మొళి పాశురభాగములనుదహరించి కూత పెట్టు దూరమని నుడివెను. యతిరాజు సంతసించి ఆ బాలికను తన శిష్యుడైన "తిరుక్కురుహుప్పిరాన్ పిళ్ళాన్" అని వానికిచ్చి వివాహము గావించు యేర్పాటు జేయించెను.

---

* ఈ సందర్భమున రామానుజు లాతనిని ఆశుకవితచే స్తుతించెను. ఈ శ్లోకము ఆ.సూ.ము.లో లేదు.
"వకుళ ధవళమాలా వక్ష సంవేద బాహ్య
ప్రబలసమయ వాదచ్ఛేదనం పూజనీయం
విపులకురుకనాథం కారిసూనుం కవీశం
శరణముపగతోహం చక్రహస్తైక చక్రమ్."
(ద్వాదశసూరిచరిత్ర. గోదాగ్రంథమాల. పుట. 345.)

6. పిమ్మట రామానుజులు తిరుక్కురుంగుడికి చేరిరి. గుడనంబికి మంత్రోపదేశము జేసిరి. (అనగా శ్రీహరి యగు కురంగనగరీ పూర్ణశేషికి.) శ్రీహరి రామానుజుల కున్నతాసనము నొసంగెను. మంత్రరత్నోపదేశమును బొందెను. రామానుజాలీ దేవునకు 'వైష్ణవనంబి' యని పేరిడెను.

7. అటు పిమ్మట 'తిర్వణ్బరిశార'మను తిరుపతిని, తిర్వాట్టారముల దర్శించిరి.

8. పిమ్మట తిరువనంతపురము చేరిరి. ఇచటి దేవాదిదేవుడు అనంత శయనుడు = అనంతపద్మనాభస్వామి.

గమనిక : ఈ సందర్భమునందలి పురవర్ణనము, నాలుగు వర్ణముల వారి ప్రజల వర్ణనము, స్త్రీల వర్ణనము, ప్రబంధ రచనా నైపుణ్యమును దలపించు పద్మనాభస్వామి వర్ణనము ఇట్లెన్నియో అంశములు గలవు.

## మధ్యమభాగము - పంచమోల్లాసము

ఇందు 72 సీసములు, ఆశ్వాసాద్యంత పద్యములు = 3, గద్యాంశ ములు = 14, వచన పంక్తి = 1 గలవు.

ఈ ప్రకరణములో రామానుజులు దక్షిణ భారతము నుండి ఉత్తర భారత యాత్ర చేయుట వర్ణింపబడినది.

1. గత ప్రకరణములో చెప్పబడిన తిర్వాట్టారము ప్రదేశములో ప్రతి వాదుల జయించి, ఆశ్రిత వర్గముతో అచటినుండి మళయాళ దివ్యదేశములకు మంగళా శాసనముల గావించెను.

ఇచటి నుండి ఈ క్రింది విధముగా ప్రయాణము గావించెను. కవి వర్ణ నము మనోజ్ఞము.

**దక్షిణ భారతము నుండి ఉత్తర భారతము :**

(గ్రంథాంశములలోని వరుస క్రమ మిట్లున్నది:)

| **స్థలము - పుణ్యక్షేత్రము** | **దేవుడు** |
|---|---|
| 1. పాండురంగ క్షేత్రము | విఠలేశ్వరుడు |
| 2. ఉత్తర మధురాపురము | బాలకృష్ణుడు |
| 3. వ్రేపల్లె | బృందావనము, కృష్ణుడు |

| | | |
|---|---|---|
| 5. | ద్వారకాపురము | బలరామకృష్ణులు |
| 6. | శ్వేత వరాహ పుష్కర క్షేత్రము (పుష్కరాటవి) | యజ్ఞవరాహస్వామి |
| 7. | అయోధ్యాపురము(సరయూతీరము) | సీతారామ లక్ష్మణాంజనేయులు |
| 8. | ప్రయాగ | మాధవుడు |
| 9. | గయ (వటవృక్షము) | విష్ణుపాదము, గదాధరుడు |
| 10. | సాలగ్రామనగము (ఆమడ పొడవు, అంతేవెడల్పు) | గండకీనది |
| 11. | వైకుంఠపదము | వాసుదేవుడు |
| 12. | నైమిశాటవి | రమానాథుడు |
| 13. | హరిద్వారము | హరి |
| 14. | కాశ్మీరదేశము | సపాదలక్ష పర్వతము |
| 15. | వసుధార గ్రామము | సరస్వతీ తీర శమ్యాకాశ్రమము గలదు |

(రామానుజులచటచట దాసులను నిల్పుచు వచ్చిరి.)

17. **కాశ్మీర ప్రాంతము : భారతీ భవన భండారము. సరస్వతీదేవితో సంభాషణము : "భాష్యకార" బిరుదు :**

ఈ ఘట్టము రామానుజుల దివ్యచరిత్రలో సువర్ణాక్షరములతో లిఖింప దగినది.

రామానుజులు భారతీ భవన భండారమును ప్రవేశింపగనే అతని కభిముఖముగా నొక తరుణి యాద్వారశాఖల హస్తాబ్జములనూని నిలిచెను. ఆ యతి నతముఖుడై త్రోవ యిమ్మనెను. అంత నాలతాంగి: ''ఒక్క శ్రుతికర్థ మడిగెదను. ఉన్నయట్లు చెప్పగలిగిన త్రోవ యిచ్చెదను.''

ప్రశ్న : ''తస్య యదేత్యాదుదార శ్రుతికి (వేదవాక్యమందలి కప్యాస పుండరీక శబ్దార్థములను రెంటిని గూర్చి యొక్కటిసేసి గోవిందు కనులకు సాటి వర్ణింపుము) ''తస్యయథాకప్యాస పుండరీకమేవమక్షిణీ'' అనెను.

-ఛాందోగ్యోపనిషత్ 1,6,7 (అర్థములు ద్వితీయోల్లాసములోగూడ ప్రస్తావించినాను) ఆ.సూ.ము. పుట 165.

రామానుజుల సమాధానము: (ఆ.సూ.ము. పుట 215, 15 వ పద్యములో

"కమ్మన జలము లాకమ్ముల తనదగు
కరములచే గ్రోలు కతన సూర్యు,
డా కపి పదమున కర్థమై చెల్లున-
ట్లాస శబ్దము వికాసార్థ పరమ
యదిగాన శుభ గంభీరాంభస్సముద్భూత
వరిరూఢ దృఢనాళ బాలసూర్య
భానుసద్యస్స్ఫుటత్పావన పుండరీ
కముల బోలెడు వాలు గన్నులమర
నంతరాదిత్యవర్తికి హరికి ననుచ
యతిశిఖామణి పల్కు, నాయతివ యతని
కతిముదంబున మరల నిట్లనియెననుచు
వాదిభీకరగురుడనె మోదమలర."

ప్రసన్నామృతములోని దీనికి దీటైన శ్లోకము :

"కంజలం పిబతీత్యస్మాత్ కపిరిత్యుచ్యతేబుధైః
తేనసంస్ఫుటితం పద్మం కప్యాసమితి కథ్యతే,
తత్తుల్యేలోచనే విష్ణోరిత్యరోధిఒస్యాశ్రుతేర్మతః."

వివరణము : కం=జలము, పి = గ్రోలువాడు = సూర్యుడు (అనగా సూర్యుడు తన కిరణములచే జలమును గ్రోలును), ఆసమ్=వికాసము, పుండరీకము=తామర.

ఇట్లు "సూర్యకిరణములచే వికసించిన తెల్లతామర వంటి కన్నులు గలవాడు హరి'' యని నుడువగా-

అపుడా తరుణి, వాగ్దేవి, "రామానుజా! శంకరుడీ వాక్యమునకు భాష్యార్థమై వచ్చినపుడు ఈ శ్రుతికి 'కపి పదములబోలు కన్నులవాడు కమలాక్షు' డని అర్థము చెప్పెను. నీవు చెప్పిన అర్థము విని నా శోక ముపశమించినదని తెలిపి అందరక్కజపడ; "భారతీ శోకనాశను''డని నామమొనరించినది.

వెంటనే భవనమందాసీనురాలైన వాగ్దేవి (ఈ యమ కూర్చొను స్థలము : భట్టభవన మంటపము=సరస్వతీ భండార భవనము. ఎవరైనను తన కర కమలములలో కావ్యమునుంపగా దోషములుండెనా దూరము చిమ్మి, కృతి లెస్స

యైనచో నంగీకరించునట్టిది గాన) చేతికి యతిరాజులు శ్రీభాష్యమీయగా ఆమె చేతబూని, తిరిగి ఆతనికిచ్చివేసి యిట్లనెను:

"శ్రీభాష్యమిచ్చిన చేతబూని" సరస్వతి తానె తలదాల్చి యిచ్చి "యీ ధరణి మీరె భాష్యకారులు- మత్ప్రియ భాష్య మిదియే" యనెను. ఆరాధ నార్థమై హయగ్రీవ విగ్రహము నిచ్చెను.

ఈ పదమే యతిరాజులకు "భాష్యకార" పదము యౌగిక రూఢమై నొప్పారుచున్నది. అచటి వారును ఆశ్చర్యపడి "భారతీశోకనాశనుడని" పేరిడిరి.

ఈ బిరుదుకోర్వక ఇచటి కుమతు లభిచార హోమము గావింప, రామానుజులును ప్రతిక్రియ గావించిరి.

ఆ ప్రాంతమునేలు కాశ్మీర దేశాధిపతి (పేరులేదు) రామానుజుల శిష్యుడాయెను. రెండు రోజుల వరకీరాజు యతిపతులతో ప్రయాణము గావించి మరలి పోయెను. రామానుజులు ముందునకు సాగిపోయెను. ఆ క్రమమిది:

18. సరస్వతీభవన భండారము పిమ్మట నీలశైలమును గాంచెను.

19. శ్రీపురుషోత్తమ క్షేత్రము : దీనినే పూరీ జగన్నాథ మందురు, ఈ ప్రాంతములో మత్స్య - కచ్ఛప - ఇంద్రద్యుమ్న జలధి - మార్కండేయ. రోహిణీకుండ చక్రతీర్థములు, మహానదీ శ్వేత గంగలు గలవు. వటపత్రశయన కృష్ణవటము గలదు.

స్వామి : చక్రధర జగన్నాథస్వామి గలడు. ఇతడు శ్రీ సుభద్రా బలభద్ర సహాయుడగు నీలాద్రిధాముడు. రామానుజులు దీనిని పాంచరాత్రాగమ ప్రకారము దివ్యదేశము గావింప బూనుకొనెను కాని, ఆ ప్రయత్నము ఫలించలేదు. జగన్నాథుడు వద్దనెను. పిమ్మట శ్రీకూర్మమును చేరుకొనెను.

20. శ్రీకూర్మము=శ్రీ కూర్మనాథస్వామి (శ్రీ కూర్మమూర్తి) :

శ్వేతకుండాంతిక క్షేత్రమందుండు దేవుడు. ఋషికుల్యకడ పూర్వము శ్రీహరి ఆదికూర్మ కృతిని జూపెను. దేవుని గూర్చిన వివాదములో శైవులను రామానుజు లోడించిరి. శైవులకు తన దివ్యాకృతిని జూపెను. ఇచటి వర్ణన మతి మనోజ్ఞము

"తిరుపవిత్రంబులు - తిరుమణి త్రావళంబులు బ్రహ్మసూత్రము బోర

ఇట్లు శ్రీకూర్మము మొదలుకొని శ్రీకాకుళము చివరివరకుగల శైవులను వాదములో నోడించి, ముందుకు సాగిపోయి, రామతీర్థమును దాటి, పద్మనాభ గిరికడ గోస్తనీనదిని దాటి సింహగిరిని జూచెను.

ఇచటి వర్ణన లత్యంత మనోహరములు.

21. శ్రీ సింహగిరిని దర్శించుట :

ఇది సింహస్వరూపము గలది. దేవుని పేరు వరాహనృసింహస్వామి. కవి ప్రకృతి వర్ణనల నింపారజేసినాడు. సరస్సు వర్ణన, పర్వత వర్ణన ముఖ్యములు. రామానుజులు శ్రీ మద్వరాహ నృసింహుని సేవించుకొని ప్రసాదము లభియించినవారై దేవాలయము నుండి వెల్వడి ఆస్థానమంటపమును జేరుకొనెను. ఇచట జరిగిన సంఘటనము :

**సింహగిరి వచనములకర్త కృష్ణమాచార్యులతో ప్రసంగము :**

ఇందు 24 సీసములు గలవు. కవి యీ సన్నివేశమును విపులాతి విపులముగా, రసవత్తరముగా చిత్రించినాడు. కృష్ణమాచార్యుల మొదటి యహం భావముపోయి యతిపతుల నాశ్రయించుట ఇందలి కథావస్తువు.

కృష్ణమాచార్యులు విష్ణుభక్తాగ్రేసరుడు. తన మధురగానముచే శ్రీహరిని నాట్యము చేయించినట్టి ప్రతిభాశాలి, మహానుభావుడు. కాని, కొంత యహం భావము గలవాడు. (సంతూరులో జన్మించినను సింహగిరి నృసింహుని సేవించుచు ఇచటనే యుండువాడు) అహంభావ రహితుడైన పిమ్మట యతిపతులు వీరికి "కృష్ణదాస" దాస్యనామముంచిరి.

**కథా సందర్భము - మోక్షమును గూర్చిన చర్చ :**

రామానుజులు కృష్ణమార్యులను "ఈ యతిపతికి మోక్షము గలదా? హరినడిగి తెలిసికొని రమ్మ"నిరి. అట్లే కృష్టమాచార్యులు (అదెంతపనియను అహంభావమున) తన గానముచే నరహరిని వశము గావించుకొని ప్రశ్నవేయగా ఆ నరహరి "అతనికి కలుగగా నాతడిచ్చిన వారికి కలుగు"ననెను. మరల రామానుజులు అతనితో "మీకు మోక్షము గలదా? హరి నడిగి రమ్మ"నెను. అప్పుడు కృష్ణమాచార్యులు "హరిని కన్నులు మోల నాడింపగల మాకు సంశయ మేమి మోక్షము లభింప" యని నరహరినడుగ, నా శ్రీహరి "ముక్తి యతిపతుల యధీనమనెను."

వెంటనే కృష్ణమాచార్యులు శ్రీహరి నాక్షేపించెను. దానిపై చర్చ జరిగి, దేవుడతనిగాన కవిత్వము "నిత్యులపాలగు"నని శపించెను. కృష్ణమాచార్యులును ప్రతిశాపమిచ్చిరి. ''నీదు విమానము నేల కూలును గాక! యేడు దినములట్లేక రీతియు, గాలియు గోవెల కదల కూర్జితమగు, మరల విమానంబు మహిత మగును.''

హరి భక్తుని శాపము నాదరించెను గాన ''కృష్ణమాచార్యుల కీర్తన లన్నియు నిత్యభోగ్యములయ్యె నేటికైన.''

పిమ్మట ''మలికనేబను'' మ్లేచ్ఛాధిపతి దండయాత్ర వర్ణింపబడినది. ఇతడు దివ్యవిమానమును దెగటార్చెను. కోవెలను గాల్పించెను. ఇట్లేడు దినములు కాలినను భక్తోక్తిదే కోవెల చెక్కు చెదరలేదు. ఇది చూచి కృష్ణమాచార్యుడు పశ్చాత్తప్తుడై సింహాద్రినాథుని పాదములపై బడెను. ''నాదురుక్తుల మఱచి నన్ను బ్రోవు'' మనుచు ప్రార్థించెను. అపుడు సింహాద్రిపతి కృష్ణసూరిని కనికరించి రామానుజుల నాశ్రయింప వలసినదిగా నాదేశించెను. అట్లే ఇతడు యతిపతుల నాశ్రయించెను. రామానుజులు వీరికి హితముపదేశించిరి, ఈ పద్యము గమనింపుడు: (ఆ.సూ.ము. పుట : 227, 67 వ పద్యము.)

''పుట్టు దరిద్రుడు భూరిసేవధి బంగి,
జాత్యంధకుడు నిరీక్షణము మాడ్కి,
ధన్వాధ్వనీనుడు ధారాసలిలమట్లు
వికలపాదుండంఘ్రి విహృతికరణి,
నాకృష్ణమార్యుడు యతిపతి సన్నిధి
జెందియానందించి సిరి వహించి,
దండప్రణామాబు దగ జేరి యున్నంత
నతని కటాక్షించి యతివరుడు,
పంచసంస్కారములు, నర్థపంచకంబు, సాకృతిత్రయ మాదిగా నఖిల హితము లాచరించి వచించెనిట్లతని కనుచు........''

ఇట్లు కృష్ణమార్యుని పంచ సంస్కారపరునిజేసి సింహగిరియందే యుండ నియమించెను.

"అహహ సింహాద్రి విభవమెంతైనగలదె
యందు మావాడవై యుండు మెల్లకాల
మనుచు బలికెను యతిపతి యతనికనుచు,
వాదిభీకర గురుడనె మోదమలర!"

గమనిక : **రామానుజులు, కృష్ణమాచార్యులు సమకాలికులా? :**

ఆ సూ.ము. ప్రకారము సమకాలికులు. కాని, చారిత్రకముగా కారని కొందఱి యభిప్రాయము. కొన్ని విశేషాంశములు :

**1.** "కృష్ణమాచార్యుల జన్మస్థలము సంతూరను" గ్రామము. ఇతడు కాకతీయ రెండవ ప్రతాపరుద్రుని (**1296 - 1323 A.D.**) దర్శించినాడు గాన **1265, 1270 A.D.** ప్రాంతమున జన్మించి యుండవచ్చునని డా. ఎ. కులశేఖరరావుగారు తెలుపుచున్నారు. (సింహగిరి వచనములు, ఆం.ప్ర.సా. ఎకాడమి, **1980**. పుటలు xx)

**2.** మలికనేబను మ్లేచ్ఛాధిపతి అల్లావొద్దీన్ ఖిల్జీసేనానియగు మాలిక్ కాఫరు అగుటకు వీలున్నది. ఓరుగల్లుపై **1390 A.D.** లేదా **1309** ప్రాంతమున దండెత్తెను.

**3.** రామానుజుల కాలము (**1017 - 1137 A.D.**) గాన ఇరువురు సమకాలికులనుట పొసగదు.

**23. యతిపతులు అహోబలము చేరుట : సింహగిరిని వీడ్కొని** యతిపతి గౌతమిని, కృష్ణవేణిని గడచి వెడలి "శ్రీకరాహోబలస్థలికి వచ్చెను ఇచట గల నారసింహుల సేవించుకొనెను. (వరాహ-యోగానంద, సచ్ఛత్రవటనృకేసరి జ్వాలానృసింహ, క్రింది యహోబల, ఎగువ నహోబల, భార్గవ నారసింహులు)

**24. పిమ్మట వృషాద్రికి జనిరి :** సోమవరపు కనుమదాటి, తిరుపతికి వెళ్ళి తిల్లగోవిందరాజుల సన్నుతించి వృషాద్రికి జనిరి....

## మధ్యమభాగము - షష్ఠోల్లాసము

ఇందు 64 సీసములు, ఆశ్వాసాద్యంత పద్యములు=4, గద్యాంశములు=26, వచనపంక్తులు=17 గలవు. ఈ భాగములోను యాత్రాంశములే గలవు.

వేంకటశైల వర్ణనముతో ఈ యుల్లాసము ప్రారంభమైనది. శ్రీ రామానుజులు శేషాద్రికి చేరుకున్నారు. ఈ ప్రాంతములో 'ఏడు' అద్రులు, పలు

తీర్థములు గలవు. పుష్కరిణీ తీర్థములో స్నానమాచరించి, వారాహ దేవునికి మ్రొక్కి, క్రమముగా మహనీయరథ మంటపాదులను దాటుచు, ముందునకు సాగిపోయిపోయి, మార్గమధ్యన "మేయాన్" హరిని సేవించి, సూత్రవతీశునకు నమస్కరించి, కులశేఖరుల కడపదాటి, శ్రీవేంకటేశుని గాంచెను, నాల్గు పద్యములలో శ్రీవేంకటేశుని వైభవ వర్ణనము గలదు. అంజనాద్రీశుని సేవించుకొని, మంగళాశాసనము గావింప, నాహరి సంయమీంద్రుని కార్యసాధనలను, భారతిని మెప్పించుటను గూర్చి ప్రశంసించి, ఉభయవిభూతు లొసంగెను.

ఇట్లు శ్రీశఠకోపము, చెలువొందు తీర్థప్రసాదులగొని, అంజనాద్రీశుని, అలమేలుమంగను, స్వగురుని పీడ్కొని, కొండదిగి, తిల్లగోవిందుని తిరువడి సేవించి, ఆత్మీయులతో అచటినుండి తిరుగు ప్రయాణ మారంభించెను.

**తిరుపతి నుండి శ్రీరంగమునకు తిరుగు ప్రయాణము :**

1. చోళ సింహపురము ప్రవేశించెను.

2. పిమ్మట ఘటికాద్రి నృహరిని గాంచెను.

3. గృధ్ర పుష్కరిణీ తీరగృహ నివాసుడైన విజయరాఘవుని గని మ్రొక్కెను.

4. పిమ్మట కూరేశ దాశరథులతో గూడుకొని : కాంచీపురమునకు అనగా సత్యవ్రత క్షేత్రమునకు చేరుకొనెను.

పురవర్ణనాదికములు, ప్రకృతి దృశ్యముల వర్ణనములు, ఆళ్వారాదులను, భవన మంటపాదములను పదునాల్గు పద్యములలో కవి వర్ణించినాడు.

ఇట్లు రామానుజులు కరిగిరివరదుని సేవించుకొని, అష్టాదశస్థాన హరి విగ్రహములను గాంచి నుతించెను.

5. కంచినుండి భూతపురికి చేరుకొనెను. ఇచటి శౌరిపేరు కేశవుడు.

6. తాపనాశినీ తీరమందు (వీక్షారణ్యపదము) సీతతో శేష తల్పము జెందియున్న వీర రాఘవుని సేవించుకొనెను.

7. భక్తారామములో భక్తవత్సలుని జూచెను.

8. పిమ్మట మహీసారపురమును దర్శించెను. ఇచటి మాధవుని నుతించి, భక్తిసారుల సేవించుకొనెను.

**9.** రామానుజులు తన భాగినేయుని (గోవింద మిశ్రుని) జన్మ స్థలమగు మధుర మంగళమును దర్శించెను.

**10.** పిమ్మట మయూరపురములో కైరవిణి పుష్కరిణి చెంత శ్రీ రుక్మిణీసహిత పార్థసారథిని సేవించి, అచటగల మహాయోగికి మ్రొక్కెను.

**11.** పిమ్మట మల్లపురికేగి, అచటి అచ్యుతుని సేవించి, ''పూదత్తాళ్వారుల'' సేవించుకొనెను.

**12.** ఆ పిమ్మట మరల భూతపురికేగి, అచటినుండి మరల ''కాంచి'' కేగి, వరదుని సేవించుకొని, ''మధురాంతకమును'' జూచెను.

**13.** పిమ్మట రామానుజులు విల్లిబుత్తూరును సేవించుటకై వచ్చెను.

ఇచటి తరుపుష్పలతాదులు, పక్షులు, భ్రమరాదికములు, సరస్సులు యతీంద్రులకు స్వాగతములు పల్కుచున్నట్లు కవి మిగుల వైభవముగా చిత్రీకరించినాడు.

ఇచటి విషయముల వర్ణనము పన్నెండు పద్యములలో గలదు. రామానుజులిచటనున్న "పదుగురు సూరుల" దర్శించుకొనెను. అపుడందరాళ్వారులకు ముద్దుపట్టియగు గోదాదేవికి మ్రొక్కగా నాదేవి యిట్లనెను:

''పంచదారయు తేనెపండ్లు మంచివి గూర్చి, నూఱు బానలవెన్న నోటి చవికి సిరికాట పట్టైన తరుమాలిరుంజోలెనంబి కర్పించితి నాదుమదిని, ఆ నా మనోరథమన్నా! యొనర్చితివని'' పొగడి బహుమతులొసంగెను.

పిమ్మట యతీంద్రులు అచటి దేవుడగు ''వడపెరుంగోయిలనుడయాను గోపరూపు హరిని'' సేవించుకొనెను. అచటి సూరులకు భాష్యార్థమొసంగెను.

**14.** తర్వాత శ్రీముష్ణము చేరుకొని, అచటి శ్వేతయజ్ఞవరాహ స్వామి సేవ జేసెను.

**15.** పిమ్మట చాంపేయవనమందు వీరనారాయణ పురిలో గల మన్నారు రాజగోపాలుని, శ్రీరుక్మిణీగోపాలుని సేవించుకొనెను.

**దిగ్విజయ యాత్ర పిమ్మట కార్యక్రమములు :**

రామానుజులు "తీవి జీవేశ ఖిదను జాటించి దెసల జయము జేకొని శ్రీరంగశాయి కడకు" వచ్చెను.

ఇచట రెండు పద్యములలో శ్రీరంగని వర్ణనము గలదు. రంగేశుని జూచిన పిదప రామానుజుల మార్గాయాసమంతయు తీరిపోయెను. రంగనాథులకు పల్లాండు పాడి, ఆపాదమస్తకము శ్రీరంగనాథుని చెలువును శ్రీపాణయోగీంద్రుల వలె జూడగ, నాదేవుడు రామానుజుల కార్యసాఫల్యతలను వర్ణించి పొగడెను.

"భాష్య రత్నమును రచించితివి. బాహ్యకుదృష్టుల భంగపరచితివి. భారతిచే చాల బహుమతుల బడసితివి. దివ్య దేశముల తీరుపరచితివి. మంద చేతనులను మాకు భవ్యుల జేసితివి. అస్మజ్జయ ధ్వజమైతివి. నా ప్రాణప్రద మైన మంత్రివి నీవు కనుక" 'నిచ్చితి నీకు భూతియుగ'మనెను. రామానుజులు మహాప్రసాదమని వినయముతో నంగీకరించి, బహూకృతుడై తన వసతికి వెళ్ళెను.

**తిరువాయి మొళికి శాశ్వత వ్యాఖ్యానము వ్రాయుట కాజ్ఞ యొసంగుట- "తిరుక్కురు హప్పిరాణ్ పిళ్ళాను" అను శిష్యుడు 'ఆరాయరప్పడి' జేయుట:**

సందర్భము : ఒకపరి మార్గమధ్యములో కొందఱు బాలురు ఆటలాడుచు 'తిరువాయిమొళి' లోని పదములను వాడుకొని అపార్థములు కల్పించి వాకొనుట రామానుజులు గాంచెను. హాస్య చిత్రీకరణము గలదు. ఇచటి అపార్థముగల పద్యము గమనింపదగినది. 'ఆడియూడనిన' ప్రత్యాషాథమున దృష్టి-రహియగం గృహము కర్రైందు కరగి............ (ఆ.సూ.ము. పుట 243)

ఈ అపహాస్యార్థములను విని, రామానుజులు మిగుల వగచి స్వాములందఱు వినుచుండగా 'తిరుక్కురుహప్పిరాణ్' అనెడు నిజాభిమాన పుత్రునిం గటాక్షించి, భవిష్యత్తులో తిరువాయిమొళి కపార్థములు కల్పింపబడకుండా దానికి నొక వ్యాఖ్య సలుపుమని యాదేశించెను.

అట్లే నతడు వ్యాఖ్యాన రత్నముజేసి ఎంబెరుమానారు యెదుటబెట్టెను. అప్పుడా యతిపతి హర్షించి 'ఈ వాఖ్యభాష్యంబుతోడు ప్రవచనంబుసలుప నియోగించెను. ఇట్లు భయ వేదాంత పరంపర ప్రచారములోనికి వచ్చెను.

**ద్రవిడోపనిషదర్థతత్త్వవ్యాప్తి పరంపర :**

రామానుజులు "తిరుక్కురుహప్పిరాన్"కు చెప్పినది. (ఆ.సూ ము. పుట 244 లో గలదు.)

"నారాయణుడు తన నాభి పద్మంబున
బ్రహ్మను బుట్టించి ప్రాజదువుల
.... .... .... .... .... ...."

అను పద్యమునకు వివరణము :

సంస్కృత వేదము : నారాయణుడు బ్రహ్మను బుట్టించి ప్రాజదువుల నొసంగినట్లు తన నమ్మయాళ్వారుల బుట్టించి అతనికి ద్రవిడోపనిషదర్థతత్త్వమును దెలిపెను. అతని ద్వారా వ్యాప్తినందిన విధమిట్లున్నది:

1. నమ్మాళ్వారులు
|
2. నాథమునులు
|
3. పుండరీకాక్షులు
|
4. రామమిశ్రులు
|
5. ఆళ్వాందారులు
|
6. కూలమాలాధరుడు
| ఇంకను సద్గురులకు
7. రామానుజులు

తిరుక్కురుహప్పిరాన్ పిళ్ళాన్ రామానుజుల యాదేశము మేరకు "విష్ణుపురాణ సంఖ్య చెలగ ఆరాయిరప్పడి''ని జేసెను.

## మధ్యమభాగము - సప్తమోల్లాసము

ఇందు 58 సీసములు, ఆశ్వాసాద్యంత పద్యములు = 4, గద్యాంశములు = 19; వచనము = 1 పంక్తి గలవు.)

**రామానుజుల ప్రథమ దిగ్విజయానంతరరము జరిగిన కథ :**

ప్రధాన కథాంశము : రామానుజులు శ్రీ రంగశుని యాజ్ఞమేరకు దుష్టుడైన చోళుని బారిన బడకుండ దాశరథ్యాదులతో చోళరాజ్యమునుండి ఇతర దేశములకు వలస వెళ్ళుట.

**కథాగమనము - కథాసంవిధానము :**

చరిత్ర ప్రసిద్ధమైన వృత్తాంతమిది. అందఱకును తెలిసినట్టిది. ఈ ప్రక రణములో చోళరాజు పేరివ్వలేదు. (క్రిమికంఠచోళుడు.)

అతి వైభవముగా దిగ్విజయయాత్ర ముగించుకొని శ్రీరంగములో భగవ ద్రామానుజులు శ్రీభాష్యాది సద్గోష్ఠి కాలక్షేపము సేయుచుండగా, చరిత్ర మలుపు తిరుగునట్టి అకస్మాత్సంఘటన జరిగెను. రామానుజులు దాదాపు పన్నెండేండ్లు శ్రీరంగనాథునకు దూరముగా నుండవలసిన ప్రసిద్ధమైన సన్నివేశమిది. ఇది యొకందుకు యతిపతులచే సత్కార్యముల జేయించినట్లయినది.

1) శైవతముండైన ''నాథూరాం'' అను పురోహితుని ప్రేరేపణచే నాటి చోళరాజు శైవమతవ్యాప్తిని జేయుటకై ఒక ప్రణాళిక వేసికొనెను. అదేమన వైష్ణవులచే బలవంతముగా ''శివాత్పరతరంనాస్తి" అని వ్రాయించుట. అందఱచే నెందులకు, వైష్ణవాచార్యుడైన రామానుజునిచేత వ్రాయించుమని పురోహితుడు రాజునకుపదేశింప రాజట్లే చేయించనెంచి రాజభటుల శ్రీరంగమునకు బంపెను.

2) ఈ వృత్తాంతమును యతిపతికి తిరుమంజనము నేయుచున్న కూర నాథులు తెలిసికొని, యతిపతి దుస్తులతో అతనికి తెలియకుండ పెరియనంబి, అత్తుళాయమ్మలతో చోళనగంకి చేరుకొనెను.

3) పరిస్థితులు గమనించిన రామానుజుల శిష్యులు ఆ స్థలము విడిచిపోవ యతిపతిని ప్రార్థించిరి. శ్రీరంగేశుడును ఇది అసమయము గనుక వెళ్ళి పొమ్మనెను. కురేశుని దుస్తులతో శిష్యసమేతముగా రామానుజులు బయట పడిరి. అడవిమార్గము పట్టిరి.

4) పురోహితుడది గమనించి, వచ్చినవాడు రామానుజుడుగాదని రాజునకు చెప్పి, రాజభటుల వెంబడింపజేయ, రామానుజుల దివ్యసూక్తి పఠనముచే భటులు వెంబడించలేక పర్మాఙ్ముఖులై రాజుకడ కేతెంచెరి.

5) తిరుమల నల్లానుసంబంధులగు నిషాదజాతివారు (శబరులు) రామా నుజుల నాదుకొనుట, ఆతిథ్యమిచ్చుట:

ఈ వృత్తాంతమును కవి విపులముగా వర్ణించినాడు. అది నిషాదులకు విషాదమును గల్గించినవార్త. ఏమన- ఒకమారు వైష్ణవుడొకరుండు చోళభూపతి దుడుకుపని, రామానుజులు తెల్లని దుస్తులతో రాజ్యమును వీడుట, పారిపోయి వచ్చుట మొదలగు విషయములను పొలములో పనిచేసికొనున్న నిషాదులకు తెలిపి వెళ్ళిపోయెను. ఆ నిషాదులీ వార్త విని ఐదురోజులవర కాహారమును తినుట మానుకొనిరి. పనులు చేయలేదు.

ఆఱవనాటిరాత్రి వానకు తడియుచు రామానుజులశిష్యులు ముందువచ్చి గురువురాకను వారికి తెలిపిరి. తడిసిన వారికి అగ్నిని ప్రజ్వలింపజేసిరి. ఎంబెరు మానారెట్లుండిరని నిషాదులు ప్రశ్నించిరి. తిరుమలనల్లాను గురువు "ఎంబెరు మానారు పాదారవిందముల శరణువేడుమని చెప్పినా"రనిరి. వెంటనే శిష్యులు "ఎంబెరుమానారితడే"నని పరిచయముచేయ, వారి యానందములకవధి లేకుం డెను. రాత్రి వారి క్షుద్బాధా నివారణమునకై అటుకులు, గంటెకంకులు, జుంటి తేనియలు, క్రొత్తచట్లు ఇచ్చిరి.

మరునాడు పరస్పర క్షేమ సమాచారముల లేఖను రామానుజులు ఒక నిషాదవార్తాహరుని ద్వారా శ్రీరంగమునకు బంపిరి.

**కొంగు పిరాట్టి కథ :** పద్యముల సంఖ్య = 28.
(ఆచార్య ప్రపత్తికి ప్రతీకయైనట్టిదీ రమణీయమైన గాథ.)

నిషాదులదొర యాజ్ఞచే రామానుజుల భోజనాదికముల నిమిత్తము బోయవారు వీరిని చెంత గల బాపనపల్లిలోని "కట్టళవారి" యనియెడి బ్రాహ్మణుని యింటికి తీసికొని వెళ్ళిరి. వైష్ణవులందఱుకును తళిగ ప్రసాదము లకు తగిన సంబారముల నమర్చిరి.

ఆ సమయమున గృహ యజమాని యింటిలోలేడు. అతని భార్యయే గలదు. వైష్ణవ భక్తురాలు. వచ్చిన వారిని ఆమె ప్రశ్నించుటయు, ఎవరి సంబం ధులని అడుగుటయు, వారు సమాధానము సెప్పుటయు జరిగినది. "ఎందు యతిపతి నాశ్రయించితి"వని వారడుగగా, ఆ సాధ్వి శ్రీరంగములో యతిపతి తనకు మంత్రముపదేశించిన సంఘటనమును చెప్పినది. భద్రముగా దాచి యుంచిన పాదుకలదెచ్చి వారికి జూపినది.

భోజన సందర్భమునకు ముందుగా పాదుకలద్వారా యతిపతులను గుర్తించి సాష్టాంగ పడినది. తిరుమంత్రోపదేశమును పొందినది. (ఇదివరలో రామానుజులుపదేశించిన మంత్రమును మరచిపోయినది.) అందరి భోజనములైన పిదప నాసాధ్వి తన భర్త వచ్చువరకు తాను తినక, అట్లేయుండి, భర్తను ఒప్పించి, యతిపతుల నాశ్రయింప జేసిన పిమ్మట, సాపడినది. గురువుల తళిగ ప్రసాదములను భుజించి, పాదతీర్థ మున్గ్రోలుటవల్ల వ్యక్తులలో మానసికమైన మార్పు కలుగునను విషయమునకీమెపతి యొక్క తార్కాణము.

వంటకములను గూర్చిన వర్ణనము లిందు కన్నులకు కట్టినట్లుగా నున్నవి. ఐదారురోజులు యతిపతులు తమ శిష్యవర్గముతోనిట వసించిరి.

ఇందు ఆతిథ్య వృత్తాంతముగలదు. "ఎంబెరు మానారు సంబంధులను" పదము వినబడగనే కొంగు పిరాట్టి ఎంత సంతసించినదో చక్కగా వర్ణింప బడినది. ఆమె గురుభక్తికి నిదర్శనము యతిపతి పాదుకలకు సరిపోవు పాదములను గుర్తించు స్పర్శజ్ఞానముతో గూడిన జ్ఞాపకశక్తియు, ఏకాగ్రతయును.

(గమనిక : "వర్ణనావైభవము" లను ప్రత్యేక శీర్షికను గమనించాలి).

ఇచట మచ్చుననొక పద్యము. గురువురాక-సుప్రభాతము: పోలికలు.

"భక్త సంగతిలేని పాపికజ్ఞతగతి - నానిశీథ ధ్వాంతమతిశయించె,
గురు పరాయణుల గన్గొన నా నిశీధినీ-తరుణి కన్నులనంగ తారలొప్పె,
నంతనతర్వాత మడచు గురుజ్ఞాన - దీపంబుగతి సుధాదీప్తి పొడమె,
సద్గురూపాసకు షడరివర్గము బోలె, దీపర్షతతితొంటి తెలివి దప్పె,
గురుని పదపాణితలచేల కరములట్లు -
తూర్పుదెస రక్తకాంతులు దొంగలించె,
పరమశోభనమా సుప్రభాతమనుచు, వాది భీకరగురుడనె మోదమలర"
(ఆ.సూ.ము. పుట 256)

యతిరాజుల స్నానానంతర దివ్యాకృతి ఇట కడుంగడు మనోహరము. ఆ గృహమేధి యతిరాజులకు ఘనముగా ఎదురుకోలు జరిపెను. బ్రహ్మ ఘోషము, భవ్యబహువాద్య ఘోషణంబులు, నృత్యగీత రవంబులు సెలంగెను. పిమ్మట "వేత్రమయ పీఠమందుండి ఛాత్రులకును, రమ్యభాష్యార్థి మగ్నార్థ రత్న వితతి, నూర్జితంబుగ కృపసేయుచుండె" నా యతిపతి మరియు కొంగుపిరాట్టి భర్తకును పంచసంస్కారములు గావించెను.

6 అట్లచట రామానుజులు 5, 6 దినములుండి, కులదైవతంబగు కంచి వరదుల స్వామి సన్నిధినుండి నవ్య కాషాయత్రిదండములు తెప్పించుకొని తొల్లింటి యట్లు దాల్చెను.

7. కొంగుపిరాట్టి గ్రామమునుండి వహ్నిపుష్కరిణి యను స్థలము చేరుకొని, అట కొన్ని రోజులుండి, మిథిలాపురమును ప్రవేశించెను. ఇచటివారధికులు శైవులు. వీరి నను గ్రహించుటకై ప్రతిరోజు వారు మంచినీరు త్రావు రేవులో దాశరథిని కొంతసేపు తన పాదములుంచుమని యతిరాజులు చెప్పిరి. అట్లే దాశరథి తన పాదముల నుంచెను.

అట్లు దాశరథార్యుని శ్రీపాదతీర్థమును గ్రోలుట కతన నాయూరివారు సాత్త్వికులై ఎంబెరుమానారు నాశ్రయించి వైష్ణవులయిరి.

8 పిమ్మట యతిరాజులు తొండనూరను ప్రదేశమును చేరుకొనిరి.

## మధ్యమభాగము - అష్టమోల్లాసము

ఇందులో 40 సీసములు, ఆశ్వాసాద్యంత పద్యములు=4, వచనము=1 పంక్తి, గద్యాంశములు=8 గలవు.

కథాంశములు :

1. విఠ్ఠలదేవరాయడను మిథిలాపుర ప్రాంతరాజును వైష్ణవునిగా నొనర్చు సందర్భము.

2. యాదవాద్రి తిరునారాయణస్వామిని పునరుద్ధరించుట (బహుధాన్య సం॥న యదుగిరిపై కెక్కెను. రామానుజుల వయస్సు 80 సం॥)

కథాగమనము : కథాసంవిధానము :

**విఠ్ఠలదేవుని కథ** : మిథిలాపురము (ఇది కర్ణాటక ప్రాంతము. తొండనూరిచటనే గలదు. దీనినే ఆంధ్రగ్రామమందురు.) నేలు రాజు పేరు విఠ్ఠలదేవుడు (బిట్టిదేవుడు, విష్ణువర్ధనమహారాజు), (క్రీ.శ. 1117). ఇతని కుమార్తె నొక బలవద్గ్రహము పట్టి పీడించు చుండెను. ఆ గ్రహముపై మంత్ర తంత్రములు పని చేయలేదు. ఆ సమయమున అక్షయపాత్ర కచటి కేతెంచిన "తొండనూరు నంబి" (ఇతనినే భక్త గ్రామపూర్ణుడందురు. రామానుజుల శిష్యుడు) రాజుతో, రామానుజులను పిలిపించినచో అతడు గ్రహబాధ నివారణ చేయగలడని నుడివెను. రాజు భార్యకు నమ్మకముగలిగి, పతితో, రామానుజుల రప్పింపుడని

కోరెను. యతిపతిని పిలిపించి, రాజాతని నర్ఘ్యపాద్యాదివిధులు పూజించెను. అంత రామానుజుల శ్రీపాదతీర్థమును రాజు కుమార్తె శిరముపై ప్రోక్షించి, ముమ్మారు త్రావింపగా, నా కుమార్తె ముందటి చిత్తవిభ్రమముంటుడిగి, స్వస్థయైనది. కనకాంబరము గట్టి, కవిత రత్నభూషణ మాల్యాదులు గలదియై, సంయమీంద్రుని సేవించి జనని కడకు వెళ్ళెను. ఇట్లు విఠ్ఠల దేవుడు రామానుజుల నాశ్రయించి, హితముల బడసి, విష్ణువర్ధన రాయడను పేర ప్రసిద్ధుడయ్యెను.

**12,000 మంది (పండ్రెండు వేలు) రాజగురువులు శిష్యులగుట :**

ఇట్లగు రామానుజుల మహత్తును జూచి ఆచటగల 12,000 మంది రాజ గురువులు సహింపక, తమతో వాదము సలుపవలసినదిగా రామానుజులకు సవాలు (Challenge) విసరిరి. వీరందఱును శుష్కతార్కికులు. శిష్యుల కోరిక మేరకు రామానుజులు తెఱచాటున కూర్చొని, తన స్వస్వరూపమగు శేషావతారమును జూపి, వేయి పడగలతో వాదింప, వారందఱును భయవిహ్వలులై ఓడిపోయి, శరణు బొంది "ఆచార్య రూపివై యవతరించిన శేషమూర్తి వీవె" యనిరి. ఈ 12,000 మంది వైష్ణవశిష్యులైరి. (ఏకాంత సేవకులు, ఏకాంగుల సంఖ్యయును 12, 000.) ఇట వర్ణన గంభీరము.

ఆ నగరములోనున్న దేవాలయము "సింగరి కోవెల" అనునది. యతిపతి ఆచటి హరికి "తంబిరానను" పేరిడెను.

**రామానుజులకు స్వప్నములో యదుగిరీశుడు కన్పించి తెలిపిన వృత్తాంతము - దేవాలయ పునరుద్ధరణము :**

మిథిలాపుర నృసింహాలయములో గడపుచు, శ్రీభాష్య మాశ్రితులకు బోధించుచు, ధరియించుటకు శ్వేతమృత్తిక తక్కువైనదని చింతించుచు పండు కొనిరి. అంత స్వప్నములో "యాదవాద్రినాయకుడగు తిరునారాయణస్వామి" కన్పించి ఇట్లు పలికెను:

"నీవు రామానుజుడవు. నేను రామ ప్రియుడను నీ రాక కెదురుచూచు చున్నాను. యాదవాద్రి శిఖరిపై శ్వేతమృత్తిక వలసినంతగలదు. మాకు 'వల్మీక కాననావరణ బంధమును' బాపుము." ఇట్లు రామానుజులు తన స్వప్న వృత్తాంతము రాజున కెఱిగించి, అతని సాయమును గొని, ప్రయాణించెను. అడవిని

యాదవాద్రి మహిమను, ప్రభావమును కవి యిచట చక్కగా వర్ణించి నాడు. అట క్రూర జంతువులు గూడ అన్యోన్య మైత్రితో నుండునట. యాదవాద్రి నుండి హరి కదలడుగాన యతిపతి పైవరకు సోపానములు కట్టించెను. త్రోవను బాగుచేయించెను. ఇట్లు అర్చిరాదిక మార్గము పెంపొందెను.

ఇచటి నుండి 6 పద్యములలో వనసంపద వర్ణన గలదు.

**రామానుజులు యదుగిరి నధిరోహించుట :**

(వీరి వయస్సు 80 సం॥ దాటి యుండును) రామానుజులు బహుధాన్య సంవత్సర పుష్యమాస, శుక్లపక్షమున యదుగిరిపై కెక్కిరి. ఎంత వెదకినను తిరునారాయణస్వామి మంగళమూర్తి కన్పించలేదు. నాటిరాత్రి స్వామి యతిపతి కలలో కనబడి, "నేను పుట్టలో నున్నాను'' అని చెప్పెను. అట్లే పుట్టకప్పును రామానుజులు విప్పించిరి. అందులో నున్న పసిడి కోవెలలో తిరునారాయణ స్వామి కన్పించెను. వెంటనే అతడా విగ్రహము నభిషేకము గావించి, వరుసగా మూడు దినములు పూజించెను. శ్వేతమృత్తికను గ్రైకొనెను. పిమ్మట కోవెలకు ప్రాకారాదుల, మంటపముల కట్టించి పైన పురము నేర్పాటు గావించెను. శ్రీపాంచ రాత్ర ప్రసిద్ధ క్రమంబున సంప్రోక్షణాదులా శార్ఙ్గపాణి కాచరించెను. శఠారి సత్కృతులలో నొకటి "యెరునాయిగంబను" తిరువాయిమొళిని నారాయణున కర్పణము జేసెను.

ఇందలి వర్ణములు : (వర్ణనా వైభవము ప్రత్యేక శీర్షికను జూచునది)

ఒక యుదాహరణము పురుషసూక్తోక్త పురుషుడీ గిరీశుడు :

"శిఖరములన్నియు శిరములుగా దోప
        శైవాల మేఘ కేశంబులొప్ప
సాళి పద్మములన్ని - సాక్షిముఖంబులు
        చాంపేయ కోశనాసలు దలిర్ప
బహుదీర్ఘ సర్పముల్ బాహుశాఖ లెలర్ప,
        ఘన గహ్వరములు వక్త్రంబులమర,
ప్రత్యంతగిరులన్ని పాదములట్లుండ
        వృక్షరోమంబులు విస్తరింప,

పురుషసూక్తోక్త పురుషుడీ గిరిశిరిరి
యనుచు నెమ్మది దలచెద ననుచు' యాద
వాద్రి పైకేగుచుండె నయ్యార్యుడనుచు
వాదిభీకరగురుడనె మోదమలర!''
(ఆ.సూ.ము. పుట 267)

## మధ్యమభాగము - నవమోల్లాసము, దశమోల్లాసము

88 + 61 = 149 సీసపద్యములుగల విపుల వర్ణనాంశములు గల, ఒకే కథావస్తువుగల ప్రణయ ప్రబంధము.

ix వ యుల్లాసము: ఇందు 88 సీసములు, ఆశ్వాసాద్యంత పద్యములు 4, వచనములు = 2 పంక్తులు, గద్యలు = 20 గలవు.

x వ యుల్లాసము : ఇందు 61 సీసములు; ఆశ్వాసాద్యంత పద్యములు 4, వచనములు 71 పంక్తులు, గద్యలు = 27 గలవు.

ఈ రెండు ప్రకరణములలోను ఒకే కథ సాగినది. అది : సంపత్కుమారుని (రామప్రియుని ఉత్సవ విగ్రహమును) యదుగిరికి ఢిల్లీ నుండి తీసికొని వచ్చుట, యదుగిరిలో పున. ప్రతిష్ఠించుట. ఈ ప్రకరణములో ప్రధాన శీర్షిక "ఢిల్లీవిజయము" అని గలదు.

1. ఒక రాజు ఇంకొక రాజుపై దండెత్తినట్లుగా వర్ణింపబడినదీ ఘట్టము.

2. సుల్తాను కుమార్తె విరహవేద వర్ణనము. రామప్రియుడు రామప్రియుల తొడపై గూర్చుండుట, బీబీనాంచారు రామప్రియుల వివాహ వైభవము, మోహనాంగి అర్చారూపము, యతిపతి జగన్నాథుల దర్శించుట గలవు. పెక్కు ప్రబంధ వర్ణనము లిందు గలవు.

ix. కథా గమనము కథాసంవిధానము : (నవమోల్లాసము) రామానుజులు ఢిల్లీ చేరుట :

యాదవాద్రీశునకు కళ్యాణ మహోత్సవమును జరిపింపతలపెట్టి రామానుజులు ఉత్సవ విగ్రహమునకై వెదకెను. అది దొరకలేదు. అంత శ్రీపతి అతనికి కలలో కనబడి:

"మామకోత్సవబేర రామప్రియుండు
నల్ల ఢిల్లీశునినింట రంజిల్లుచుండె"

అనగా యతిపతి సంతోషించి ఉత్సవ విగ్రహమును దెచ్చుటకై ఢిల్లీ ప్రయాణమునకు సంకల్పించి, ఆశ్రితులకును, రాజునకుదెల్ప వారందరంగీక రించి, సన్ముహూర్తమునందు ప్రయాణమైరి.

రామునకు కోట్లాది వానరసైన్యము సాయపడగా, తరలి వచ్చినట్లే రామానుజుల ననేక ప్రాంతపు రాజులును, వీరులును కూడిరని కవి ఘనముగా వర్ణించినాడు.

సకలాయుధములతో నిత్యులు, త్రైవర్ణికులు రామానుజుల వెంట నుండిరి. విష్ణువర్ధనుడనుగమించెను. చతురంగబలము శంఖవాద్యాది ధ్వనులతో, రామానుజులకు బహుపరాకులు చెప్పుచు శుభశకునము లెదురుకాగా ప్రయాణ మైరి. ప్రయాణమును సాగించునపుడు నిత్యులును, ఇతరులును, రామాయణ మందలి సీత - రావణుడు - చెరసాల వంటి ఘట్టములను ముచ్చటించుకొనుచు జనుచుండిరి.

అట్లు కర్ణాటక, మహారాష్ట్రములను, దేశములను, నదుల, పర్వతముల దాటి ఢిల్లీని చేరుకొనిరి.

**ఢిల్లీకి చేరిన పిదప :**

రామానుజుల సైన్య మసంఖ్యాకము. యమునా తీరమునందలి ఉద్యాన వనములో విడిది చేసిరి.

అంత ఢిల్లీ సులతాను గూఢచారులీ విషయమును కనిపెట్టి సులతానున కెఱింగింప, నాతడు తన చారులను "రామానుజుల సైన్యమెంతయున్నదో? ఎందుకు వచ్చినవారో?" తెలిసికొని రమ్మని పంపెను. ఇరువురు గూఢచారులను రావణుని చారులైన శుకసారణులతో కవి పోల్చినాడు. బ్రాహ్మణ వేషధారులైన వారిని రామానుజుల సైన్యాధిపతులు కనిపెట్టి వారిని శిక్షింతుమనిరి. యతిపతి వారిని దండించగూడదనియు, తమ సైన్యసంఖ్య బలమెంతగలదో జూపుదని యాదేశింప, సైన్యాధిపతులు సైన్యమునంతయు పరిచయముసేయుచు జూపిరి.

చారులు తమ సులతాను వద్దకు వెళ్ళి ఈ సైన్యవృత్తాంతమును, రామాను జుల జన్మవృత్తాంతమును తెలిపిరి. ఆ సైన్యమసంఖ్యాకము: వివరములు:

3. పాండ్యుని వంశీయులు
4. నిషాదులు
5. తుండీర మండలమువారు
6. ఆంధ్రులు
7. కళింగాధిపతి
8. ఉత్కళరాజు
9. కిరాతాధిపతులు
10. వింధ్యాద్రి నిలయులు

ఇతరులు :

11. భట్టమంటపమందున్న బ్రాహ్మణులు చేరిరి.
12. రామానందయోగీంద్రుడు శిష్యగణముతో చేరెను.
13. శ్రీపురుషోత్తమ క్షేత్ర సాలగ్రామ వాస్తవ్యులగు నాగాలు.
14. నిత్యచేతనులు.

ఈ కవి యిట్లు రామానుజులను వెంబడించిన బలమును అతిశయము చేసి చెప్పినాడు. వారి నివాస స్థలములను గూడ పేర్కొన్నాడు. దీనికై చారిత్రక, భౌగోళిక పరిజ్ఞానమెంతో అవసరమై యుండును.

సులతాను సభ : వెంటనే సులతాను సభను సమావేశపరచి, తాను హాటకరత్న సింహాసనాధిరూఢుడై అందఱి యభిప్రాయముల నడిగెను. ఇందులో సులతాను సామంతులు, వజీరులు, ఉమ్రాలు, ఫకీరులు, సరదారులు, సూరమానులు పాల్గొనిరి. (ఈ పదములు మహమ్మదీయ సంప్రదాయములకు సంబంధించినవి.) పెక్కురు యుద్ధము సేయవలయుననియు, దోషులను శిక్షింపవలసినదనియు నుడివిరి. ఈ సందర్భములో యుద్ధనీతి, రాజనీతి, యుక్తిప్రయుక్తులు చర్చించబడినవి. కఫీరుదాసు (కబీరుదాసు[1]) అను రాజకుమారుడు పిన్నవాడైనను ఉచితమైన సలహా నొసంగెను. యతీశ్వరుడూరక రారు, బలమైన కారణముండును. రాజ్య సంపాదనకాంక్ష వారి కుండదనెను. మంత్రులీతని బల

1. ప్రసిద్ధ హిందీకవి "కబీరు దోహాలకర్త," భక్తుడు, 14 వ శతాబ్దమువాడు, "కబీరుదాసనువాడు" ఈ రాజ కుమారుడు కాడు.

పరచి, రామానుజుల కడకు "పండితరాయడు, భగవంతరాయడ"ను నిరువురు పండితులను రాయబారులుగా పంపుటకు నిశ్చయించిరి.

ఢిల్లీశుడు[2] రామానుజుల నాహ్వానించుట : అట్లే పండితరాయలు, భగవంత రాయలు రామానుజుల కడకు వెళ్ళిరి. ఆతడు వారికి స్వాగతము చెప్పి వారి రాకకు కారణమడిగి, తన రాకకు కారణము తెలిపెను. ఢిల్లీశుడది విని సంతోషించి, రామానుజుల కెదురేగి స్వాగతించెను. పిమ్మట రామానుజులిట్లనిరి: "ధరణీశ ! మా కిష్టమైన హరి విగ్రహము (ఇష్ట దైవతము) భవదాలయమున నున్నది. దాని మాకొసంగుము."

రామానుజులు విగ్రహములను పరిశీలించుట : సులతాను సరేయని యతిపతిని అంతఃపురమునకు తోడ్కొనిపోయెను. (ఇచటి వర్ణనము కడు హృద్యము). చెరసాలలోని విగ్రహము లన్నింటిని దెప్పించి చూపించినాడు. ఈ విగ్రహములను పూర్వము ఔరంగజేబు తెప్పించి పడవేసినవన్నాడు. (మొగలాయి రాజు ఔరంజేబు ప్రసక్తియిట చారిత్రక సత్యములకు నిలువదు) రామానుజులన్ని విగ్రహములను పరిశీలించి వెదకగా రామప్రియుని విగ్రహము కనబడలేదు.

రామప్రియుని ఆదేశము : అంత రామానుజులు విగ్రహము కనబడనందులకు చింతించుచు పవళించెను. ఆ రాత్రి రామప్రియుడు అతని కలలో కనబడి, తాను మోహనాంగి యను సులతాను ముద్దుపట్టి వద్ద నున్నాననియు, వచ్చి పరిగ్రహింపుమని బలికెను. ఈ పద్యమును గమనించుడు:

"మోహనాంగిని సుల్తాను ముద్దుపట్టి
గూడి వేడుకతో క్రీడలాడుచున్న
నన్ను గొనుమని పలికె నా వెన్నుడనుచు"

(అ.సూ.ము. పుట 291, 86వ పద్యం)

గమనిక : ఇచట రామానుజులు ఢిల్లీశుని భవనమున కేగునపుడు ప్రజల స్వాగతోత్సాహము, తలంపు ఆంధ్రుల సంప్రదాయము, సంస్కృతుల దెలుపును. మంగళ హారతులిడుట, ముత్యాలు రచియించుట వంటివి ప్రజల తలంపు:

---

2. రామానుజుల కాలము 1017-1137 లో ఢిల్లీని మహమ్మదీయ ప్రభువులు పరిపాలించలేదని దేశ చరిత్రలు తెలుపుచున్నవి.

"ఇతడటే మును రాచయింతి బూనిన బ్రహ్మ
రాక్షసోత్తమునకు మోక్షదాత
.............. ..............                    (ఆ.సూ.ము. పుటలు 290)
ఇతడటే రంగరాజున కిష్టమంత్రి
యతని దలచిన సమకూడు నిహపరంబు
లని పరస్పరమనుకొనిరవి వలనుచు'
..............................

X. దళమోల్లాసము :

(రామానుజులు సంపత్కుమారుని రప్పించుకొనుట, బీబీ నాంచారుతో సహా తిరునారాయణపురము చేరుట.)

1. ఆ మరునాడు యతీంద్రులు మేల్కాంచి, కార్యముల నెరవేర్చి, రాజును కనుగొని, "అస్మదీప్సిత విగ్రహము యుష్మదంతఃపురమున''నున్నదని చెప్పెను. అట్లే సులతాను తన ముద్దుపట్టి వద్దకు వెళ్ళి ఆ యమ హంసతూలికా తల్పమున కేళికా విగ్రహమును కనుగొని, ఆమెను ''హిందూల బొమ్మ నీకెందు కమ్మ''యని ప్రశ్నింప నా కుమార్తె ''ఈ ప్రాణప్రదమైన ప్రతిమను వదలజాల'' ననెను. అపుడు రాజు రామానుజులతో, ''అతడు మీ దైవతమైన, మీరలిచ్చటి నుండి పిలిచినచో, నది జరిగి వచ్చి మీకడనిల్చిన మీరు గైకొనవచ్చుననెను.''

2. రామానుజులు విగ్రహమునిట్లు పిలిచిరి: ''నిన్ను నెడబాసి యదుగిరి చిన్నబోయి యున్నదదిగాన రమ్మనన్నన్న తండ్రి!'' ''లక్షణాఢ్యను యదుగిరి లక్ష్మినిచ్చి పెండ్లిచేసెద, నీవింత, పెద్దతనము తెచ్చుకొమ్మ"నెను.

3. అట్లు పిలువగా రామప్రియుడు పంచవార్షిక బాలుని పగిదివచ్చి యతి శిఖామణి కుడి తొడ నధివసించెను. చూడుడు:

''తల్పమధ్యమునుండి ధరణిపై కుప్పికిన
ముజ్జగంబులు తన బొజ్జగదల,
మణినూపురములామ్నాయముల్ మొరయంగ,
గంటలు, మొలనూలు ఘల్లుమనగ,
గుండలంబుల కాంతి మండలం బొకదొడ్డ
మండనంబై యలునిండి మెఱయ,

మొల్క నవ్వుల చిన్నిమోము ముద్దులు గుల్క-
దనరత్నమకుటము తళుకులొత్త,
పంచవార్షిక బాలుని పగిది వచ్చి
యతిశిఖామణి కుడితొడ నధివసింప
జూచియక్కజపడె రాజుసోముడనుచు
వాదిభీకరగురుడనె మోదమలర!''          (ఆ.సూ.ము. పుట 295)

గమనిక : (ఇది పోతనగారిపద్యము ''కుప్పించి యెగసిన కుండలంబుల కాంతిని'' స్ఫురింప జేయునట్లున్నది. అచట వీరత్వము, ఇచట సుకుమారత్వ, బాల్యత్వ శృంగారముల తీరు గలదు.)

ఆ వెంటనే రామానుజులు రామప్రియుని కౌగిటనప్పళించి, శిరము మూర్కొని, చిన్న చెక్కిళ్ళు దువ్వుచు, పెన్నిధి గన్నట్టి పేద పగిది హర్షించి, ''సంపత్కుమారుడీ'' స్వామి యని తిరు నామముంచి తన వెంట విగ్రహమును తీసికొనిపోయి వసతిని చేరుకొనెను:

4. ఇచటినుండి కవి సుల్తాను కుమార్తె తలంపులను, మనోవ్యథలను, చెలికత్తెలతో రాజకుమార్తెలు రహస్యములాడుకొను విధమును, విరహవేదనాదుల నతి మనోహరముగా వర్ణించినాడు. శృంగారరసము పతాకస్థాయిని చేరినట్లున్నది. ఇందు : 1) సంధ్యావర్ణనము, 2) చంద్రోపాలంభనము, 3) మన్మథ దూషణము, 4) ఏడ్పు వర్ణనము, 5) శైత్యోపచారములు, 6) ఉదయ కాల వర్ణనము, 7) పెండ్లికార్య వైభవాలంకరణములు గలవు.

**బీబీనాంచారు - సంపత్కుమారుల పెండ్లి ముచ్చటలు - వివాహ వైభవ వర్ణనములు మొదలగునవి :**

5. సులతాను కుమార్తె తండ్రితో తన నిశ్చయమును తెలిపి, రామప్రియుడు తన ప్రాణ నాథుడని ఖండితముగా నుడువ, నారాజు కలలో గూడ సంపత్కుమారస్వామి కన్పించి, ''పద్మ నీ పుత్రి, హరి యేను, పాలకడలి నీవు, గావున నీ సుతనిమ్ము'' మాకని పల్కెను. ఈ విషయమును రాజు యతిరాజులకు తెలిపి, వివాహ కార్యక్రమములు కొనసాగించెను. ఇది వట్టి విగ్రహమే, బొమ్మయే, ఎట్లని తలంచు రాజునకు ఉదయ వరులు తొల్లి అక్రూరునకు హరి మాడ్కి స్వస్వరూపమును జూపి, సందేహమును బాపెను. ఇట్లు చెల్వపిళ్ళ

రాయనికి (సంపత్కుమారునకు) తన కుమార్తె నిచ్చి సులతాను వైభవముగా వివాహము జరిపించెను.

వివాహ కాలమునందు జరుగు సంప్రదాయములను, తంతులను కవి చక్కగా వర్ణించినాడు. అల్లున కరణమిచ్చుట, కట్నములు, కానుకలు, ఇట్లే అప్పగింతల సందర్భములు తెలుగు వారిండ్ల జరుగు వివాహములను బోలి యున్నవి.

రామానుజులట్లు క్రొత్త దంపతులతో గూడుకొని, అతి వైభవముగా తిరునారాయణ పురమును జేరుకొనెను. పురప్రవేశ సందర్భమున గ్రామమంతయు అలంకారములతో నిండిపోయినది. ఊరేగింపు సాగినది. కోవెల జొచ్చి, తెచ్చిన స్వామికి సంప్రోక్షణాది కార్యక్రమములు చక్కచేసి, ఆ రాజపుత్రికి "యాదగిరి లక్ష్మి'' యని తిరునామ మిడెను. ఈమె సహోదరుడు కఫీరుదాసు గూడ వీరి ననుసరించెను.

యాదవాచల సమీపంబున ''నా మోహనాంగి, యదుగిరి లక్ష్మి, బీబీ నాంచారు'' అని పేర్లుగల రాజకుమార్తె రత్నమయంబగు నిజదివ్య చతురంత యానంబునందు స్వకీయ దివ్యరూపంబు ధరియించి, రామప్రియునితో కలిసిపోయి, అదృశ్యమయ్యెను. అర్చావతార రూపిణియగు నద్దేవిని రామప్రియుని శ్రీపాద సాన్నిధ్యంబులో ప్రతిష్ఠించి, ఉత్సవములు జేయించెను.

పిమ్మట సులతాను కుమారుడగు కఫీరుదాసు మోక్ష వృత్తాంతము గలదు.

ఈ సందర్భమున ఈ ప్రాంతమునకు యాదవాచలము, నారాయణాద్రి, వేదగిరి, యతిశైలము మున్నగు పేర్లు గలుగుటకు కారణములు తెలుపబడినవి.

ఈ ప్రకరణము నందలి కథాంశములు గలవు:

ఆశ్వాసాంత పద్యము:

''శ్రీరామానుజ యోగిరాజ!
    నిజపుత్రీభూత రామప్రియా!
పారావారగభీర! యాదవ
    గిరిప్రాసాద మధ్యస్థల
క్ష్మీరామా! కుచకుంభదురు
    కాశ్మీరాంచితోరస్థల

# మధ్యభాగము - ఏకాదశోల్లాసము

(ఇందు 41 సీసములు, ఆశ్వాసాద్యంత పద్యములు 4, వచనములు 125 పంక్తులు, గద్యాంశములు = 11 గలవు) తనియులు = 6.

కథాంశములు : కథాగమనము : కథా సంవిధానము :

1. యాదవగిరిలో రామానుజులు 12 సంవత్సరముల వరకు వసియించిరి. ఒక పరి "శ్రీభాష్య"మాశ్రితచేతనులకు బోధించుచుండగా, శ్రీరంగము నుండి వైష్ణవోత్తముడొకడరుగుదెంచి రామానుజులకు నమస్కరించి, కూరేశ, మహాపూర్ణుల వృత్తాంతమునిట్లు వివరించెను. జరిగిన కథ యిది :

చోళరాజుకడకు రామానుజుల దుస్తులతో వెళ్ళిన కూరేశులు "శివాత్పరతరం నాస్తి" యను వాక్యము వెంట "ద్రోణమస్తితతఃపరమ్" అని అదనముగా వ్రాయగా, రాజు కోపించి, అతని కండ్లూడి బెరుకుటకాజ్ఞ యొసంగ, కూరేశులు తన చేతికొనగోళ్ళచే కండ్లను పెరకివైచి కొనెను. మహాపూర్ణుల కండ్లను ఐటులూడ బెరకిరి.

ఇట్లు భంగపడిన కూరేశులు, మహాపూర్ణులు అత్తుళాయమ్మలతోసహా చోళనగరమునుదాటి కొంతదూరము (చెలికదూరము) ప్రయాణించిరి. పెరియనంబికాయాస మధికమయ్యెను. అచటనే వారు ఆళ్వందారి దివ్యాంఘ్రులందిరి. ఇతర వైష్ణవులు కొందఱు తోడుకాగా, కూరేశులు వారికి బ్రహ్మమేధ సంస్కారగావించిరి.

కూరేశులు అత్తుళాయమ్మతో సహా రాత్రిప్పు ప్రయాణించి శ్రీరంగ నామము చేసుకొనిరి. ఈ మధ్యన గోష్ఠిపరిపూర్ణులు గూడ పరమ పదించిరి.

**కూరేశులకు తిరిగి నేత్ర ప్రాప్తి :**

రామానుజుల యాజ్ఞమేరకు కూరేశులు వరదరాజు స్తవమును రచించి, సేవించుకొనెను. కరిగిరిలోని వరదుడు ప్రత్యక్షమై దృష్టిని ప్రసాదించి అతని కోరిక మేరకు చోళరాజ పురోహితుడటు నాలూరానునకు గూడ అభీష్టమొనర్చెను. *

---

* కూరేశుల నిస్వార్థత, త్యాగనిరతి కిది రెండవ తార్కాణము. మొదటిది యతిరాజుల గాపాడుటకై తన కండ్లను పోగొట్టుకొన్నవాడు. తిరిగి కండ్లను బడయుటకై వరదరాజస్తవమును రచించి, యతిపతి కైదండ యిడగా, ఇరువురు దానిని విన్పించుటకై కరిగిరికి చేరుకొనిరి. కూరేశుడు స్తోత్రమొనరింప, వరదుడు వరము కోరుకొమ్మనెను. అతడు నాలూరానునకు దృష్టినిమ్మనెను. అనుడు యతిపతి కూరేశులను హెచ్చరించి, నీ కింత స్వాతంత్ర్యము కూడు నాయని చెప్పి, తాను వరదుని ప్రార్థింప కూరేశులకు తిరిగి నేత్ర ప్రాప్తి కలిగెను.

ఇచటి వరదుడు ప్రత్యక్షమగు ఘట్టము పోతన పద్యము, "మెఱపు చెంగటనుండు మేఘంబు కైవడి" యను వర్ణనమును దలపించును. చూడుడు: కూరేశుల స్వప్నములో:

"కాల దేహము బోలు నీల దేహమువాడు,
కరుణా రసము జిల్కు కనులవాడు,
హాటక రత్న కిరీట శిరమువాడు
మొల్క నవ్వులు గుల్కు మోమువాడు
........................................................"

(అ.సూ.ము. పుట 321)

(వరదరాజస్తవమును రచింపదలపెట్టు సమయమందలి సందర్భమున.)

2. రామానుజులు తన బసయగు యాదవాద్రి మఠము నుండి తనకాప్తుడైన "మారొన్నిల్లా మారుదిచ్చి యాండా"నను నొక మహాత్మ వైష్ణవుని రావించి కూరేశాదుల క్షేమ వృత్తాంతమును తెలిసికొని రమ్మని శ్రీరంగమునకు బంప నాతడు కూరేశులను దర్శించెను. కూరేశులు క్రిమికంఠ చోళుని మరణ వృత్తాంతమును తెలుపుచు తన పరిస్థితిని చెప్పెను. "భువనములకు ప్రాణ భూతుడౌ యతిరాజు మేలుగా నుండుటే చాలు మా''కనెను.

3. యతిపతులకు కూరేశుల క్షేమ వృత్తాంతములను తిరిగి వచ్చిన మారుధిసికి యాండాను మరియు అమ్మంగి యమ్మాళులు వచ్చి నివేదింప నాతడు సంతోషించి వారిరువురకు ''ద్వయ'' ముపదేశించెను. తిరునారాయణ స్వామి కైంకర్య విధులకై 52 మంది సూరులను నియమించెను.

4. తిరిగి శ్రీరంగమును జేరుట - గురుశిష్యుల కలయిక :

రామానుజులు సంపత్కుమారులను వీడలేక వీడలేక వీడుకొని, సెలవంది శ్రీరంగమును చేరుకొనెను.

(ఇచట వర్ణన వీడుకోలు సమావేశముల దలపించును.)

అంత రామానుజులు కావేరీ తీర్థావగాహనం బొనర్చి ఉచిత కార్యక్రమాదుల ముగించుకొని ''శ్రీరంగధాముని, శేషశయనుని, శ్రీ భూమి నీళాది సేవ్య

గాంచి కన్నుల పండువుగా సేవించి, కూరేశుల యింటికి బోయెను. కూరేశుడు సాష్టాంగ ప్రమాణముగావింప, నాతని గ్రుచ్చి యెత్తి కౌగిట జేర్చెను.

**5. గోదాదేవి యభీష్టము పూర్తియగుట :**

కూరేశులకు దృష్టి వచ్చినది. తిరిగి శ్రీరంగమునకు గురుశిష్యులు వచ్చిరి. ఒకనాడు రామానుజులు కూరేశులకు గోదాగాథాతిశయము చెప్పు సందర్భమున "రమ్యమౌ నారునరంబొళి"లను పాటలకర్థ మెఱిగి, అట్లాచరించుటకై అళగరి తిరుమలకు వెళ్ళి, "ఘృతప్లుత పాయస నవనీత భాండశతమును" శౌరి కర్పించి, విల్లిపుత్తూరునకు వెళ్ళి, "వడపెరుంగోయిలుడయాను" వరదుగాంచి, గోదాదేవిని గాంచి మ్రొక్కెను. అపుడు గోదాదేవి యతిపతిని "అణ్ణా" యని పిలిచెను.

అచటినుండి యతీంద్రుడు తిరునగరికి వెళ్ళి, శఠారిని దర్శించుకొని, తిరిగి శ్రీరంగము చేరుకొని, అచట "శ్రీరంగేశుని, తద్దేవిని" గని మ్రొక్కి తన మఠములో కాలము గడపుచు సుఖించుచుండెను.

6. ఇచటినుండి యీ ప్రకరణములో రామానుజుల అంతేవాసుల పేర్లు, చతుస్సప్తతి సింహాసన స్థితులగు నాచార్య పురుషుల పేర్లు గలవు. (అనుబంధములో జూడనగును.)

7. రామానుజుల కాపులైనవారి పేర్లు, అతి ప్రసిద్ధులైనవారి పేర్లు, వారు చేయవలసిన నిత్యజీవన కార్యక్రమ విధులు, వడుగనంబి గురుభక్తి వర్ణింపబడినవి.

8. ఈ ప్రకరణములో నివ్వబడిన పరివారము : (పుట : 325)

1) సప్తశతి (700) సంయమీంద్రులు 2) చతుస్సప్తతి (74) సింహాస్య స్థితులను నాచార్య పురుషులు 3) ద్వాదశ సహస్రంబు (1200) ఏకాంతులు 4) అసంఖ్యాకులు దాతనిదాసులు 5) శతత్రయ సంఖ్యాకులు (300) కొత్తెపమ్మలు 6) అగణితరాజ సమూహములు.

1. కూరత్తాళ్వాను
2. ముదలియాండాను
3. ఏళాధూరాళ్వాను
} అనవరతము అవలంబన దండస్థానులు.

4. అరుళాళ ప్పెరుమాళెంబెరుమానారు — భగవదారాధనము చేయుట

5. కిళాంబిప్పెరుమాళ్
6. కిళాంబియాచ్చాన్
} తిరుమడపల్లి కైంకర్య నిర్వాహకులు

7. వడుగనంబి — అభ్యంజన కైంకర్యము.
8. గోమఠచ్చిరియాళ్వాను — శ్రీపాదుకాసమర్పణోత్థాన కైంకర్యము
9. పిళ్ళైయొరంగావెల్లిదాసర్ (ధనుర్దాసు) — కైదండ
10. అమ్మంగి — క్షీరసక్తు సమర్పణము
11. ఉక్కమ్మాళ్ — తిరువాలవట్ట కైంకర్యము
12. ఉక్కళాళ్వాను — భుక్తపాత్రోత్థాన కైంకర్యము
13. మారుధియాండాన్ — తిరుక్కావేరీ కైంకర్యము
14. మారొన్నిల్లామారుధిచ్చిరియాండాను — మఠంబునకు తండుల, సూపశాక, ఘృత క్షీర, దధ్యాది సమర్పణ కైంకర్యము
15. తుయ్యముని — తిరుమంజన కైంకర్యము
16. తిరువరంగమాళిగైయార్ — శ్రీ భండార కైంకర్యాసక్తులు
17. వందరుం శుందరుం — రాజసేవాలబ్ధంబగు ధనంబుదెచ్చి శ్రీమఠ కైంకర్యమునకు సమర్పణము
18. రామానుజవిళక్కారల్ — తిరుమేనిరక్షణ తత్పరులు
19. లంకనాట్టాళ్వాన్ — ప్రతిపక్షనిరసనాసక్తబుద్ధులు.

## మధ్యమభాగము - ద్వాదశోల్లాసము

(ఇందులో 43 సీసములు; 4 ఆశ్వాసాద్యంత పద్యములు, వచనములు 13-387, గద్యాంశములు = 7, తనియలు = 21 గలవు.)

ఉదయవరుల వైభవములోని చివరి ఘట్టము : కథాంశములు : కథాగమనము : కథా సంవిధానము :

### 1) వడుగనంబి గురు భక్తి :

మధురకవికి నమ్మాళ్వారు లెట్లో ఈ వడుగనంబికి రామానుజు లట్టివారు. తిరువీధుల నేతెంచు హరిని గూడ దర్శింపక, గురు కార్యమును నెరవేర్చువాడు. రామానుజుల నాజ్ఞగొని, మేలునాటికేగి యచటి సాలగ్రామ నగరిలో నొక బావి త్రవ్వించి, గురుని శ్రీపాదతీర్థమందులో నుంచి, అతని శ్రీపాదుక లట నిలిపి, ఒక కోవెల గట్టించి, నిత్యమర్చించుచు, తన తదనంతరము దానిని పూజింప వలసినదిగా తన శిష్యుల కానతిచ్చి పరమపదించెను.

### 2) అనంత దేశికులు శ్రీవేంకటాద్రి కరుగుట :

రామానుజులొకనాడు వేంకటేశున కఖిల కైంకర్యములు సేయుటకు సాత్త్వికుడొకడు కావలయుననగా, శ్రీమదనంతదేశిక శిఖామణి ముందుకు వచ్చి తనకాజ్ఞ యిమ్మని యడిగెను. గురువు సరేయనెను. ఇట్ల నంత దేశికులు (అనంతార్యులు) శ్రీ వేంకటేశుని సేవించుచు సమీప ప్రాంతమున ఒక చిన్న చెఱువును సకుటుంబముగా త్రవ్వుచుండెను. పిల్లలు చిన్నవారు. భార్య గర్భిణి. శ్రీ వేంకటేశు డొక బాలకుని రూపములో వచ్చి తట్టలు మోయుటలో సాయవడెను. ఇట్లే ఇతని విశిష్టతను గూర్చిన రెండుమూడు సంఘటనలు గలవు.

### 3) శ్రీ కూరేశులు పరమ పదమున కేగుట :

కూరనాథునొక పరి రామానుజులకు తెలియకుండగా, శ్రీ రంగేశుని జూచి యుప్పొంగి పొగడగా, నా దేవుడు వరమును కోరుకొనుమని బలవంతము సేయ, కూరేశులు "ప్రకృతి బంధముబావి భవదుదార సతతానుభవము నొసంగు" మన, హరియు, "నీకు, నీ వారికి, నీవారివారికి నపవర్గ మిచ్చితి" ననెను. ఆ వార్త విని రామానుజులును సంతోషించిరి. తన ఆశ్రితులకు, "సచ్ఛిష్యులకు, సదాచార్యులకు" "తారతమ్యము లే"దని వచించి కూరేశుని చెవిలో ద్వయ మూదెను. అపుడు కూరేశులు రామానుజులపై తనియ నొకటి వ్రాసి చదివెను.

"యో నిత్యమచ్యుత పదాంబుజ యుగ్మరుక్మ,
వ్యామోహత స్తదితరాణి తృణాయమేనే,

అస్మద్గురోర్భగవతోస్య దయైక సింధో,
రామానుజస్య చరణౌ శరణం ప్రపద్యే॥''

అనునది. (ఆ.సూ.ము. పుట: 332)

పిమ్మట తన భార్య తలంపు నడిగి, శ్రీ పరాశర భట్టారకుని, శ్రీ రామ పిళ్ళను పిలిపించుకొని, హితముపదేశించి, ఎంబెరుమానారు తిరువడిత్తామరల ధ్యానించుచు, పరమ పదంబునకు చనియెను. (ఇచట కూరేశుల తనియ* గలదు.) జ్యేష్ఠపుత్రుడు బ్రహ్మమేధ సంస్కారాదికముల గావించెను.

4) రామానుజులు భట్టరును శ్రీరంగేశుని కడకు తీసికొనిపోయి, స్వామిని దర్శింపజేసి, ఊరడింపజేసి, విద్యాభ్యాసమునకు "ఎంబారు" కడకు గొంపోయి తాను మఠమున ప్రవేశించెను.

5) ఇచటినుండి యతీంద్రుల ప్రభావమును బయలుపుచ్చినవారు, ప్రకాశింప జేసినవారు, ప్రకాశింపజేసిన తిరుతెన్నులు విపులాతివిపులముగా వర్ణింపబడినవి.

1. అర్చావతారమూర్తులు ప్రకాశింపజేసిన విధము. వారి సంఖ్య = 7 - ఏడుగురు.

2. రామానుజుల పూర్వీకులు, గురువులు = 7 గురు.

3. 74 మంది ఆచార్య పీఠ సింహాసనము.

4. బ్రహ్మరాక్షసుడు, మూక వైష్ణవుడు.

5. ఇతర స్వాములు - మొదలగువారు.

గమనిక : (ప్రత్యేక శీర్షికలో పేర్ల పట్టిక నిచ్చినాను.)

6. రామానుజుల చరమ దశ :

రామానుజులు శ్రీరంగశాయి కడకు బోయి, తాను జీవితకాలము 100 సం॥ల కన్న అధికముగా 20 సం॥లు జీవించినాననియు, "నీ పదాబ్జంబుల నీడ

---

* కూరేశుల తిరునక్షత్ర తనియ - ఆశ్రితు లాన తిచ్చినది:
"మకరే హస్త నక్షత్రే - సర్పనేత్రాంశ సంభవమ్।
శ్రీమత్కూర కులాధీశం - శ్రీవత్సాంకముపాస్మహే॥"

నన్ను జేర్చుకొమ్మని'' ప్రస్తుతి సలుప, శ్రీరంగనాథుడు ''నేటి కేడవనాడు నీవీ శరీరముడిగి నన్నొందుము" అని బహుమతులొసంగి పంపించెను.

యతీంద్రుల విషయమెఱింగి ఆశ్రితులందఱును ఆవేదన పడుచుండ, రామానుజులు వారికి హితము లుపదేశించెను.

ప్రశ్న : యతీంద్రా! ఈశ్వరాధీనంబైన యాత్రయందు, కర్మాయత్తం బగు దేహ యాత్రయందు చేతనున కన్వయంబు లేదని యానతిచ్చితిరి. ఇంక వీనికి కాలయాపనంబెట్టిది?

**సమాధానము :** ఉపాయత్వబుద్ధి మాని పరమప్రాప్యంబగు భగవత్కైంకర్యంబునందు అన్వయించి యుండవలయును.

గమనిక : రామానుజు లుపదేశించిన "74" వాక్యముల శీర్షిక "యతీంద్రోపదిష్ట చతుస్సప్తతివాక్యని" ఇందులో లేదు. ప్రసన్నామృతములో గలదు.

**కైంకర్యం బెట్టిదనగా? :-** ఏడు అంశములలో గలదు.

మొదటి కైంకర్యము చేయ నశక్తుడైనచో రెండవ కైంకర్యము చేయవలయును. ఈ క్రింది వరుస క్రమము ననుసరించి గుర్తించుడు. (గమనిక : ఈ విషయములు అ. సూ. ము. పుట 158 లో గూడ కలవు.)

1. శ్రీభాష్యంబధికరించి ప్రవచనం బొనర్చుట. ఇందుల కశక్తుడైనచో -

2. శ్రీ శఠగోప సూక్తు లధికరించి ప్రవర్తింపజేయుట. ఇందుల కశక్తుడైనచో -

3. శ్రీరంగాది దివ్యదేశముల నిత్యనివాసము, దుష్టపదార్థముల పరిత్యజించుట, పరిశుద్ధ ద్రవ్యములతో ఆరాధనము చేయుట. ఇందుల కశక్తుడైనచో -

4. సర్వకాలంబు మంత్ర రత్నార్థ మననముచేయుట. ఇందుల కశక్తుడైనచో :

5. శ్రీ యాదవాచలముల నివసించుట. ఇందుల కశక్తుడైనచో -

6. ''వీడు మదీయుండని యభిమానంబు గల్గు జ్ఞానాధికుండైన శ్రీవైష్ణవుని యందభిమానంబు నందొదిగి వర్తించుట". ఇందుల కశక్తుడైనచో -

7. ఇట్లు ప్రవర్తించు అధికారులకు ముందెఱింగి వర్తింపందగు విషయములు మూడు :

1) అనుకూలాత్మలు - ఎవరనగా : శ్రీవైష్ణవులు.

2) ప్రతికూల ప్రాణులు - ఎట్టివారనగా : భగవద్వేషులు.

3) అనుభూయచేతనులు - ఎవరనగా : సంసారులు.

వివరణ : అనుకూలాత్మలం జూచిన సంతసింపవలయును, ప్రతికూలాత్మలం జూచిన దూరంబుగా వర్తింపవలయును. అనుభూయులం జూచిన తృణీకరించి వర్తింపవలయును. వీరనుకూలించిరేని వీరి కాత్మజ్ఞానంబుపదేశింపవలయును. అనుకూలించనిచో కటకటాయని కృపాదృష్టి నవలోకింపవలయును. ప్రతిబంధకములు : అర్థ కామములు. వీటిని పరిత్యజింపవలయును.

**రామానుజులు పరమపదమున కేగుట :**

(తిథి : దశమి. శశి (సోమ) వాసరము. ఆర్ద్రతారయందు.)

పిమ్మట రామానుజులు పరాశరభట్టరును శ్రీరంగనాథుని చెంతకు తోడ్కొని వెళ్ళి, తిరుమాల శఠకోప తీర్థప్రసాదాది బహుమతులన్నియు నిప్పించి అచటి దేశికేంద్రులతో "ఇకముందు దర్శన స్థాపన దక్షుడీత"డని ప్రకటించెను.

''మేలునాటగల మేటి పండితుడగు వేదాంతిని జయించి, అతనిని దర్శన దూర్వహునిగ జేయుమని భట్టరున కానతిచ్చెను.''

రామానుజులు తన అవతారమును చాలింపనెంచి, అచటివారికి తనగూర్చి దుఃఖింపగూడదనియు, భయపడవలదని చెప్పెను. తానచట అర్చాత్మకుండనై వసింతుననెను. "భయపడవలదు మిమ్ము బ్రోవ నర్చాత్మకుండనై నే వసింతునిచట.'' (పుట : 347)

పిమ్మట ఎంబారు తొడపై శిరముంచి, ఆంధ్రపూర్ణుల తొడపై అంఘ్రులుంచి, కరపద్మముల మోడ్చి శ్రీరంగధాముని జెందెను.

ఇట్లు రామానుజులు 120 ఏండ్లు జీవించి, వైభవమును జూపించిరి.

శ్రీరామానుజ మునీంద్రుల దివ్యచరితము శ్రీరామకృష్ణ చరితంబుల మాడ్కి శ్రీవైష్ణవులకు సదా అనుసంధేయము.

తర్వాత ఈ కవి రామానుజుల పిమ్మట పరమపదమును జేరినవారి పేర్లు, వారొనర్చిన హితోపదేశములను క్రమముగా వర్ణించినాడు.

1) మారొన్నిల్లా మారుధిచ్చిరియాండాను

2) మరుదూర్నంబి

3) ధనుర్దాసు

4) పొన్నాచ్చియారు (ధనుర్దాసు భార్య)

5) నంబితిరువళిధినాదాసుండు

6) గోవిందమిశ్రులు (ఎంబారు) - ఇతని తమ్ముడగు శిరియగోవిందునిచే బ్రహ్మమేధ విధానము శ్రీ పరాశరభట్టరులు చేయించిరి.

ఈ యుల్లాసము చివర వాదిభీకరుం డానతిచ్చిన విషయము :

ఈ క్రిందివారికి తీర్థదివస మాచరింపరు:

1) శ్రీ వకుళభూషణులకు 2) నాథమునులకు 3) యామునులకు 4) యతీంద్రులకు 5) ప్రముఖ పూర్వాచార్యులకు.

ఎందుకనగా - వీరందఱు కాలతత్త్వస్థితి పర్యంతం బాశ్రితచేతన సంరక్షణార్థంబుగా లీలావిభూతి నలంకరించియుందురు.

అశ్వాసాంత స్తుతిపద్య పద్ధతిలో చేరని, రామానుజస్తుతి ఈ యుల్లాసము చివర సీసపద్యములో గలదు. (స్తుతి సీసపద్యము లింతకుముందు లేవు.) "శ్రీ భూతపురినాథ - సేవ్యేభగిరినాథ" అనునది.

**భూలోకములో భగవద్రామానుజుల అవతార సమాప్తి పద్యము:**

"తలప పంచాదశ దుత్తరనవశతశక, విభవ వత్సర చైత్ర విమల షష్ఠి గురువారమున, భూతపురినార్ద్ర, గేశవ, క్షితిదేవునకు, కాంతిమతికిబుట్టి, చేతన రక్షకై క్షితి నూటయిరువది సంవత్సరములుండి, శకము వేయి డెబ్బది యేండ్లచే తీవిగా విలసిల్లు మతి విభవ తపస్వి మాసమునను దశమి శనివారమున నార్ద్ర తారయందు, శేషమూర్తి యతీంద్రు డశేష రక్షజేసి, శ్రీరంగధాముని జెందె ననుచు, వాది భీకరగురుడనె మోదమలర!"

రామానుజుల అర్చా విగ్రహములు : అ.సూ.ము.లోని ప్రసక్తి, సందర్భములు (పుటలు : 153, 175, 347, 348.)

1. పూర్వభాగము : షష్ఠోల్లాసములో గలదు. (పుట : 153.)

ముదలియాండాను పుత్రుని పేరు కరిదాడయాండాను. ఈ మహాదేశికుడు శ్రీభూతపురి యందు భగవద్రామానుజార్చా విగ్రహమును ప్రతిష్ఠాపించు సమయంబున శిల్పకార కరధృత సువర్ణశలాకచే నేత్రోన్మీలన మహోత్సవంబు చేయించు కాలంబున శ్రీరంగధామంబున యతిరాజులుండిరి. అపుడు, "కరపద

యుగముచే కన్నులించుక మూసె, సర్వజ్ఞుడా యతి చక్రవర్తి" వెంటనే ఆశ్రితులిదేమని ప్రశ్నించిరి. ఆతడిది కందాళయాండాను కార్యమని తెలిపెను. కొన్ని దినములకు శ్రీభూతపురి నుండి శ్రీవైష్ణవులు వచ్చి అచటి విగ్రహ ప్రతిష్ఠా వృత్తాంతమును తెలిపిరి.

2. మధ్యమ భాగము, తృతీయోల్లాసము : (పుట : **175.**)

భగవద్రామానుజులు తిరుపతికి చేరుకొని, మెత్తలు పొదిగిన మోకాళ్లపై అద్రులు దాటి తిరుమల అంజనాద్రిని చేరెను. పిమ్మట -

"శేషాద్రిపతి యాజ్ఞజెంది, కాల్నడనేగె,
నచటినుండి యతీంద్రుడతని కడకు
నా యతీశ్వరునిచే ననుభూతసారమౌ
ఫలమొక వృక్షమై పరిఢవిల్లె,
గురుభుక్త శేషంబు గొనవలెనని వండు
టాకులు గొనిపోదు రార్యులచట,
అర్చావతారమై యచట యతీశ్వరు
డెల్లవారికి దోచునిప్పటికిని."

3. మధ్యమభాగము : ద్వాదశోల్లాసము : (పుటలు : **347, 348.**)

యతిరాజులు తన అవసానదశలో ఆశ్రితుల కభయమిచ్చి, తాను శ్రీరంగ ధామమున "అర్చాత్మకుండనై నే వసింతు"నని తెలిపెను. అర్చావతారములు దాల్చిన స్థలములు కొన్ని ఇట వర్ణింపబడినవి.

**రామానుజార్యుల చరమ విగ్రహము :**

"రామానుజార్య చరమ విగ్రహము రంగ
పతికడ నర్చగా పరిఢవిల్ల,
నలభూతపురి, వేంకటాద్రి, యాదగిరి,
శ్రీరంగములయందు శ్రీయతీంద్రు
డాది మధ్యాంతి మార్చాత్ముడై వసించె,
ధరణినిప్పటికైనను ధన్యులైన
వారు సేవింపగలవారు వారి ననుచు
వాదిభీకర గురుడనె మోదమలర!"

యతీంద్ర ప్రభావ ప్రకాశకులు : (పుట : 335) ఉడయవరుల వైభవము, పన్నెండవ యుల్లాసములో : అతివిపులముగా వర్ణింపబడినది. ఈ గ్రంథకర్త అస్మదాచార్యానుగ్రహంబుచే, "బుద్ధి గోచరంబైన యంత యీ క్రమంబు వర్ణించితిననియు, యీ దాసచేతనుని యందనుగ్రహంబు సేయం దగుదు"రని శ్రీ మహాభాగవతుల ప్రార్థించుచున్నాడు.

**రామానుజుల గొప్పతనము :**

"చరితమ్ రఘునాథస్యశతకోటి ప్రవిస్తరమ్"* అను న్యాయముగా భగవద్రామానుజ చరితంబంతయు నెవ్వండెఱుంగునని కవి నుడివినాడు. "భగవదవతారములందు రామకృష్ణాద్యవతారములకు ప్రాధాన్యత గలుగుకొలది, హార వల్లియందు నాయకరత్నంబువలె పూర్వాపరాచార్య మధ్యంబున ప్రాధాన్యం బవ్యాహతంబై విరాజిల్లువాడును, ఇట్లు భగవద్భాగవత ప్రకటీకృత ప్రభావుండగు సంయమిసార్వభౌముడును, ఉత్తారకత్వ కృపామాత్ర ప్రసన్నాచార్యుండైన యమ్మహాత్ముని విషయంబుగా జేయు కైంకర్యంబు పరమప్రాప్యంబగును. అది గాన నగ్గురు శిఖామణి యర్చితుండై సంతసించెనేని యష్టోత్తరశత దివ్యదేశా విష్కృత దివ్యమంగళ విగ్రహుండగు శ్రీమన్నారాయణుం డారాధితుండై మిగుల సంతోషించును."

**ఎంబెరుమానారుల** (యతీంద్రుల) (రామానుజాచార్యుల) **1.** ప్రభావమును బయల్పుచ్చినవారు (పకాశకులు) **2.** ప్రభావమును బయల్పుచ్చిన విధానము.

**1. యతీంద్ర ప్రభావ ప్రకాశకులు :**

యతీంద్రుల ప్రభావమును, మహిమాతిశయమును ప్రపంచమునకు తెలియజేసినవారిలో ముఖ్యులు:

---

* యథారామస్యచరితం, శతకోటి ప్రవిస్తరమ్
తథారామానుజస్యైద మవాఙ్మానస గోచరమ్,
అలంతర్తుం ప్రయత్నేన బాహుభ్యాం వాపిసాగరమ్
యతిరాజస్యచరితం సాంతం వక్తుంనశక్యతే."
("ప్రపన్నామృతమ్" ప్రాచీన ప్రతి. 64 వ అధ్యాయము 185 వ పుట) తెలుగు లిపి.

3. కరిగిరి వరదుడు

4. యాదవాద్రీశుడు

5. నళహరిస్వామి

6. తిరుక్కురుంగుడి నంబి

7. శ్రీ శఠకోపసూరి

8. శ్రీమన్నాథమునులు

9. శ్రీ యామునాచార్యులు

10. పెరియనంబి

11. తిరుక్కొట్టియూరునంబి

12. తిరుమలనంబి

13. కూరమాలాధరగురుడు

14. ఆళ్వారు తిరువరంగప్పెరు మాళరయరు

15. ఇంకను 74 సింహాసనాధిపతులు, బ్రహ్మరాక్షసుడు, మూకవైష్ణవుడు మున్నగు స్వాములు.

**2. వారు ప్రకాశింపజేసిన విధానము :**

క్రమ సం. పేరు విధానము

1. రంగనాథుడు — విభూతి ద్వయంబు దయవరులకు స్వాధీనంబుగా నొసంగు కతన.

2. వేంకటేశుడు — రామానుజుల లేఖ గొనివచ్చిన గొల్లచానకు మోక్షమిచ్చిన కారణంబున.

3. కరిగిరివరదుడు — యజ్ఞమూర్తిని రామానుజులు జయించినందున.

4. యాదవాద్రీశుడు — సంపత్కుమారుడగుట వలన.

5. అళగిరిస్వామి (నళహరి స్వామి) — పెరియనంబి తిరువంశ స్వాములకు హితము, పుత్రప్రవృత్తి కలుగుటజేయుటవలన.

6. తిరుక్కురుంగుడి నంబి (కురంగ నగర దేవుడు) గుడిపేరు తిరుక్కురుంగుడి — రామానుజుల ద్వారా మంత్ర రహస్యమును తెలిసికొనెను. రామానుజులితనికి వైష్ణవ నంబి యని పేరిడిరి.

7. శ్రీ శఠకోప సూరి — రామానుజులకు ప్రత్యక్షమయి "కండోమనుచు" పాడెను. (పొలిక పొలిక పాశురము) "చారు భవిష్యదాచార్యు నెవ్వని తొల్లి సాక్షాత్కరించెను శఠవిరోధి" (పుట 155.)

8. నాథమునులు, 9. పుండరీకాక్షులచే, 10. రామమిశ్రులచే, 11. యామునులచే — శఠజిదాత్త భవిష్యదాచార్య విగ్రహార్చ క్రమార్చితంబెయ్యెను.

12. పెరియనంబి — యతిరాజులకు సాష్టాంగపడెను.

13. తిరుక్కోట్టి యూరినంబి — రామానుజులను "ఎంబెరుమానారు" అనెను.

14. తిరుమల నంబి — ఎంబారులను రామానుజుల కొసంగెను (గోవిందుని కథ).

15. కూరమాలాధరుడు (తిరుమల యాండాను) - తిరువాయి మొళి కర్థము - "యామునుల కేకలవ్యుండగానో" అను సందర్భము.

16. తిరువరంగప్పెరు రామానుజులితని కభ్యంజనము సేయించుట, (హరిద్రాచూర్ణము పూయుట) ఇతడు సంతసించి "పంచమోపాయనిష్ఠ" నుపదేశించి, తన కుమారుని ఆశ్రయింప జేసెను.

17. బ్రహ్మరాక్షసుడు యాదవ ప్రకాశులకు రామానుజుల గూర్చి చెప్పెను.

18. మూకబాలకుడు - ఇతడయిదేండ్ల మూగ బాలకుడు. ఒక సంవత్సరము కన్పడక, తిరిగివచ్చిన పిమ్మట మాట్లాడి, శేష డవతరించినాడనెను.

**ఇతర ముఖ్యులు :**

19. వడుగనంబి ఎంబెరుమానారు తిరువడిగళే శరణమనెను.

20. కణియ నూరిసిరియాచ్చాను - ఎంబెరుమానారు తిరువడిగళే శరణమనెను. తన ఆశ్రితుల కుపదేశించెను.

21. అరుళాళప్పెరుమాళెంబెరుమానారు. (యజ్ఞమూర్తి) - తన శిష్యులైన ఆచ్చానునకు, అనంతాళ్వానుకు, తొండ నూర్నంబికి, మరుదూర్నంబికి హితోపదేశము చేసెను. ఎంబెరుమానారు తిరువడిగళే శరణమని నుడివెను.

22. పుళ్ళ పుళ్ళ యాళ్వాను తన శిష్యుడగు ఎళివిలాల్వానునకు - మానసికాపరాధమును జయించుటకు "ఎంబెరుమానారు తిరువడిగళే శరణ"మని చెప్పెను.

23. దాశరథి ఇళహాళ్వానను వాని వాదములో జయించి, ''ఎంబెరుమానారు పాదపద్మములే శరణము ప్రాప్యప్రాపకము''లని చెప్పెను.

24. పరాశరభట్టరు గోవిందు లీతనికి, ''ఎంబెరుమానారు తిరువడిగళే శరణము'' అని హితముపదేశించెను. ఇతడు నంజీయరుకు శరణము అని హితముపదేశించెను.

25. నంజియ్యరు ఇతడు నంబిళ్ళకు శరణము అని హితముపదేశించెను.

26. నంబిళ్ళ ఇతని శిష్యుడు శివక్కురపిళ్ళకు (ఇచట ఒక చిన్ని సంఘటనము. వైష్ణవుడు నిద్రించు ఘట్టము గలదు) పిమ్మట ''ఎంబెరుమానారు తిరువడి గళే శరణమ్'' అని నుడివెను.

27. శ్రీ కురుకేశగురుడు సిరిభుత్తూరు అగ్రహారములో సోమాసియాండానునకు సంయమీంద్రుని చరణారవిందములే ఎంబెరుమానారు తిరువడిగళే శరణము అని చెప్పెను.

28. గోమఠత్తాళ్వాను శిష్యుడు కాకంపాటి యాచ్చాంబిళ్ళకు - సంయమీంద్రుని చరణారవిందములే'ఎంబెరుమానారు తిరువడి గళే శరణము.' అనెను.

29. అంగళాళ్వాను - వీరు ఒక్కంపాటి యాచ్చాంబిళ్ళనిట్లు ప్రశ్నించిరి. "శ్రీరంగడు కోపించినచో ఏమి తలంతువు?" అతని జవాబు : ఎంబెరుమానారు తిరువడిగళే శరణమని తలంతును.

30. నెళాదూరి యమ్మాళు తన నాశ్రయించిన 12 మంది వైష్ణవులకు "ఎంబెరుమానారు తిరువడి గళే శరణమని" హితముపదేశించెను.

31.

32. వేదవ్యాస భట్టారకులు రామానుజుల యెదుటనే పన్నెండుగురికి శ్రీభాష్యార్థం బుపన్యసించెను. వారది దురవగాహమనిరి. అపుడు భట్టారకులు వారికి "ఎంబెరుమానారు తిరువడిగళే శరణమని" చెప్పెను.

33 నడువిల్ తిరువీధిపిళ్ళ రామానుజుల యెదుటనే పన్నెండుగురికి శ్రీభాష్యార్థంబుపన్యసించెను. వారది దురవగాహమనిరి. అపుడు భట్టారకులు వారికి ఎంచెరుమానారు తిరువడిగళే శరణమని" చెప్పెను.

34. వడుగనంబి - "ఎంబెరుమానారు తిరువడిగళే శరణమ్, నంబెరుమాళ్ తిరువడిగళే శరణమ్'' అని అనుసంధించు కూరేశ, దాశరథులజూచి, "ఇరుకరయరు'' అని వ్యాకుచ్చెను.

ఆశ్వాసాంత పద్యములో లోక కల్యాణ భావనము : (పుట - 353.)

"శ్రీమద్రంగపతి ప్రధాన సచివా! శ్రేయోనిదానోత్సవా!
నామోచ్చారణ మాత్ర పాపరహణా! నారాయణ ప్రీణనా!
కామక్రోధ భవాంధకార తపనా! కల్యాణ సంస్థాపనా!
హైమప్రోల్లసిత త్రిదండకర! భక్తారామ! రామానుజా!"

రామానుజుల స్తుతి పద్యము : పుట 352 లో కవి ప్రత్యక్షముగా (Driect) స్తుతించుచున్నాడు. హృద్యమైన పద్యము ఇందు శరణాగతి కోర బడినది.

"శ్రీభూతపురనాథ! సేవ్యేభగిరినాథ! రాజద్వశీకృత రంగనాథ!
వేంకటాచలవాస! వేదవిన్నిజదాస! రమణీయ తరహాస! రవివికాస!
భవ్యగుణాధార! పరమతత్త్వ విచార! యఘగిరీశ శరీరయఘ విదూర!
కల్యాణనిభకాయ! ఖండిత హరిమాయ! కరుణావిధేయ! సత్కవిసహాయ!
సంయమీశ్వర! లక్ష్మణాచార్యధుర్య! కూరరాడ్దాశరథ్యాదిగురుసమర్చి
తా''త్మ పద్మపద్మముల జూపవయ్యయనుచు
వాదిభీకరగురుడనే మోదమలర.

## ఉత్తరభాగము - ప్రథమోల్లాసము

(ఇందు సీసములు=73, కందములు=2, శార్దూలము=1, మాలిని=1, 344 పంక్తులుగల 25 వచనములు, తనిలు = 1, గద్యాంశములు=26 గలవు. ఇవన్నియు భట్టరువారికే చెందినవి - (కృతిభర్త పద్యములు తప్ప).

ప్రధాన కథాంశము : భట్టరువారి ప్రభావము.

జన్మాదిక విశేషములు :

స్థలము : శ్రీరంగము.

తిరునక్షత్ర పద్యమును కవి వ్రాయలేదు. తనియ గలదు.

వైశాఖ మాసము. అనూరాధా నక్షత్రము.

తలిదండ్రులు : కూరేశులు, ఆండాళమ్మ దంపతులు. వీరికి కలిగిన కవల కుమారులలో—

వీరిరువురు శ్రీరంగనాథున కభిమాన పుత్రులు : 1. పెద్దవాడు శ్రీ పరాశరభట్టరు. 2. రెండవవాడు శ్రీ రామపిళ్ళ=వ్యాసభట్టారుకుడు.

(గమనిక : వీరి జన్మ, బాల్యవృత్తాంతతములీ ప్రకరణములో లేవు.

జన్మ : 193 వ పుటలో : మధ్యమభాగము, ఉదయవరుల వైభవము తృతీయోల్లాసములో గలదు.

కూరేశుల వివాహము : 192 వ పుటలో ,, ,, ,, ,,

బాల్య వృత్తాంతము : 147, 148 పుటలలో : పూర్వభాగము, ఉదయవరుల వైభవము, షష్ఠోల్లాసములో గలదు.)

జీవితకాలము : క్రి.శ. 1063,

వీరి దత్తపుత్రుడు : ఉద్దండ భట్టారకుడు (శ్రీరామపిళ్ళ కుమారుడు).

వీరి కేంద్రస్థానము : శ్రీరంగము.

పదవి : ఆచార్య పీఠము నధివసించిన దర్శన స్థాపకుడితడు.

వీరి ఆచార్యుడు : ఎంబారు (గోవిందయతి).

పరాశరభట్టరును "ఇరింబప్పా" యని గూడ పేర్కొందురు.

"అల 'యిరింబప్పా' మహాత్ముదష్టళ్లోకి
నెవ్వని మహిమము లేర్పరించె" (పుట 158)

వీరి రచనలు : 1. రంగరాజస్తవము. 2. శ్రీగుణరత్నకోశము. 3. సహస్రనామ భాష్యము. 4 క్రియాదీపము. 5. అష్టశ్లోకి. 6. ద్వయశ్లోకి. 7. తనిశ్లోకి.

వీరి శిష్యవర్గము : అసంఖ్యాకము. ముఖ్యులు : వేదాంతి. ఇతనినే నంజీయరందురు. భట్టరువారి తరువాత వీరే నిర్వాహకులయిరి.

**కథా సంవిధానము :**

ఆ.సూ.ము. గ్రంథకర్త భట్టలువారిని గూర్చి విపులముగా వ్రాయుటకు 73 సీసముల నెన్నుకొన్నాడు. అధిక ప్రాధాన్యత నిచ్చినాడు. గద్య విషయ సూచికాంశములును ఎక్కువగనే యున్నవి. వీటిని చదివినచో జీవితకథ వరుస క్రమములో తెలియగలదు.

వేదాంతిని జయించు ఘట్టము : (ఇతనిని రామానుజ దర్శన ప్రవిష్టునిగా జేయు బాధ్యత భట్టరువారి కప్పగించబడెను ఇది రామానుజులు తొల్లి భట్టరు కానతిచ్చిన విధము. పుట : 357.)

శ్రీ పరాశర గురుశేఖరుడు శ్రీరంగధామమున సాత్త్వికసంఘముతో గోష్ఠి సలుపుచుండ, తీర్థముల సేవించు కొనుచున్నట్టి బ్రాహ్మణుడొకడేతెంచి గురునితో "మేలునాటను మీవంటి మేటి పండితుడు వేదాంతి" యనువాడొకడున్నాడని విన్నవించి, అతని పాండిత్య ప్రతిభల నుగ్గడించెను. ఎట్లయినను వేదాంతిని జయించి దర్శనోన్ముఖునిగా జేయదలంచి భట్టరు ఆ బ్రాహ్మణుని ద్వారా వాద ప్రతివాదములు సేయుటకై వర్తమానమంపిరి.

ఇచటినుండి భట్టరువారు శ్రీరంగని యాజ్ఞగొని జైత్రయాత్రా సన్నాహులై వెడలు ఘట్టమును కవి చక్కగా వర్ణించినాడు. ఇతడు ప్రయాణమై మార్గ మధ్యమున లక్ష్మీపురము కడ అనంతాళ్వారుల స్వాగతముగొని, అతనితో గూడ తిరునారాయణపురమును జేరుకొనిరి. వేదాంతి యున్న గ్రామంబున కనతి దూరమున విడిది జేసికొనిరి. ఇచటి కాతడు తరలివచ్చు ఘట్టము, శిబికారూఢు డగుట, బిరుదావళి పఠనము రాజుల కాలమునాటి 'బహుపరాకు'ల సందడిని, సంప్రదాయముల దలపించును.

కొందఱు బ్రాహ్మణులు చెప్పిన ఉపాయము ప్రకార మాతడు వేదాంతి

వేషములో ప్రవేశింపబోవుట జూచి వేదాంతి పలుకరించి "దారక! అన్న సత్రపు త్రోవ యదె చనుమన" భట్టరు "నేనన్న భిక్షార్థినై రాలేదు. వాదభిక్షం బిమ్మనెను." వేదాంతియు నిజాసనంబునుండి దిగి క్రింద నతనితోపాటు సుఖాసీనుండాయెను. తర్కము సేయుటకు సమ్మతించెను. ఇట్లు 9 రోజులు వాద ప్రతివాదములు సెలంగెను. చివరిరోజున భట్టరు విజృంభించి, "అబాధితంబులైన బహుయుక్తి ప్రమాణంబులుపన్యసింప" నా వేదాంతి నిరుత్తరుడై "మహాత్మా! శ్రీరంగనాథుండు భవద్రూపంబున వచ్చి నన్ను జయించెగాన వీనిని నిజచ్ఛాత్రునిగా స్వీకరింపుడని" సాష్టాంగ ప్రణామంబులు గావించెను. అంత భట్టరు వారాతనికి పంచ సంస్కారములు గావించి, హితము ఉపదేశించి, దివ్య ప్రబంధముల నధికరింపుమని యానతిచ్చి నెమ్మదిగా శ్రీరంగమును చేరుకొనిరి.

**వేదాంతికి "నంజీయ్యరు" అను నామమేర్పడుట :**

వేదాంతి కొంతకాలము తదీయారాధనలతో కాలము గడుపుచు, సంసార సుఖముల యెడ రోసి, పశ్చాత్తాపముజెంది, తన యిరువురు భార్యల సంగతిని వదలుకొని, ధనకనకాదులను వారి కొసగి, తాను తురీయాశ్రమము స్వీకరించి, మార్గమధ్యమున అనంతాళ్వానుల దీవెనల బడసి, శ్రీరంగధామము చేరుకొని, భట్టరు పాదములపైబడెను. అపుడు భట్టరా సన్యాసిని గ్రుచ్చి కౌగిట గొనుచు, "నంజీయ్యరే! కుశలమా!" యని సంబోధించెను. నాటినుండి వేదాంతికి నంజీయ్యరను నామ మేర్పడెను.

ఇచటి నుండి నంజీయ్యరు గురుభక్తి, గురుసేవలను గూర్చిన విషయములు చెప్పబడినవి.

**పిమ్మట జరిగిన సంగతులు :**

1. ధనుష్కోటికి స్నానార్థమై భట్టరువారు సపరివారముగా పాథిరుక్కుడి యను పల్లెలో రాత్రిపూట గనుక నొక యేనాదివాని యింటికేగ, వాడాశ్చర్యపడి వీరికి స్థలమును జూపించెను ఇచట నంజీయరుకు భట్టరువారు ప్రపదనమును గూర్చి చెప్పిరి. "దేశకాలాది నియమంబులు లేక, అవ్యవధానముగా ప్రపదనం బెట్టివారికైన ఫలించు, నిది ప్రమాణసిద్ధంబని" యానతిచ్చి, మరునాడు శ్రీరంగధామము చేరుకొనిరి.

పిళ్ళనూరి యాలయ మాటంకముగా నున్నదని దానిని భట్టరువారు కూల్చగూడ దన్నను కూల్చివేయించెను. అంత భట్టరువారా దుష్టునియొక్క రాజ్యమున నుండ గూడదని యెంచి గోష్ఠిపురమునకు బోయి వసించెను. ఆ రాజు మరణించిన పిమ్మట తిరిగి శ్రీరంగధామమును చేరుకొనెను.

3. ఇచటి నుండి భట్టరువారి ప్రభావములు, బోధనలు, ఉపదేశములు, విచిత్రమైన సంఘటనలు వర్ణింపబడినవి.

4. పిమ్మట భట్టరువారవతారమును చాలించుటను గూర్చి, నంజియ్యరు గారికి భట్టరుయెడ భర్తృభావ దృష్టాంతమును గూర్చి చక్కగా వ్యక్తీకరింప బడినది.

**ఈ యుల్లాసమునందలి సాహిత్యవైభవము :**

**గమనిక :** వర్ణనలను గూర్చిన ప్రత్యేక విభాగమును జూచునది. కొన్ని అంశములు సంగ్రహముగా నిట్లున్నవి - సంఘటనలు :

1. వేదాంతి ప్రతిభ వర్ణనము - పుట. 355.

2. భట్టరు జైత్రయాత్ర వర్ణనము - పుటలు. 356, 357.
(మేల్నాటికి బోవుట, మూర్తిమత్వ వస్త్రాలంకార వైభవములు, తరలి పోవుచున్నప్పటి ఊరేగింపు వర్ణనములు)

3. మార్గమధ్యమున దృశ్యముల వర్ణనము - పుట. 357.
(నిరిభుత్తూరులో అనంతాళ్వానుల కలిసికొనుట, స్వాగతాదరములు)

4. తిరునారాయణపురమును జేరుకొనుట. యాదవాద్రిమహిమ-పుట 358.

5. అచటి కళ్యాణపుష్కరిణిలో స్నానము జేయుట, ఊర్ధ్వపుండ్ర ధారణము. అచటి ద్విపంచాశద్దేశికోత్తములితని కెదురేగి స్వాగతముల జెప్పిరి. పిమ్మట సంపత్కుమారుని కన్నులపండువుగా సేవించుకొనిరి. మంగళాశాస నముల జేసిరి.

6. భగవన్మందిరము నుండి వెడలి వేదాంతి సమీపగ్రామమున విడిది చేసిరి ఇచటి బిరుదావళి పఠనము గంభీరము - పుట : 358.

7. వేదాంతితో వాదము సేయుట వర్ణనము, పుట 361.

8. దిగ్విజయము పిమ్మట భట్టరు మూర్తిమత్వవస్త్రాలంకార వర్ణనములు యదుగిరిపై నృహర్యక్షనిలయరంజిత ద్వార మణిగోపుర వర్ణనము, తిరునారాయణ పురవర్ణనములు గలవు. ఇచటి సప్తక్షేత్రముల, సప్తతీర్థముల దర్శించి భట్టరువారు తిరిగి శ్రీరంగధామమును చేరుకొనిరి. పుట 362.

9. వేదాంతి సన్యాస స్వీకార ఘట్టము, సంఘటనలు. పంచయజ్ఞములు: బ్రహ్మయజ్ఞము, భూతయజ్ఞము, అతిథి భోజనస్వరూపమగు స్వయజ్ఞము, పితృయజ్ఞము, నివిహుతాహుతాప్రహృత ప్రాసితబలిదానములు పుట - 364.

**భట్టరువారి ఉపదేశములు - ప్రశ్నలకు సమాధానములు :**

కొన్ని సంఘటనలు, పుటలు 372 నుండి.

1. అమ్మణి యాళ్వానెడు సూరి ప్రశ్న:

ఆత్మ కెయ్యది తంజము?

జవాబు : హరి నెఱుంగుట అనగా తదీయుల నెఱుంగుట, భాగవతుల భగవత్స్వరూపులుగా దలంచుట.

ఇది విని ఆళ్వాను "తదీయశేషత్వ సంపదయందు సకలార్థలాభము సంభవించు"నని తలంచుచు వెళ్ళిపోయెను.

2. వీరశిఖామణి పల్లవరాయని ప్రశ్న: రాజకృత్యములతో తీరిక లేదు. మనమున్కిపట్టుగానుండు నుపాయము?

సమాధానము: దక్షిణ సింధు తీరమున నీ చిత్తము నుంచుము.

విపులీకరణ : శ్రీరామచంద్రుడు సేతువుకడ నుండురీతిని యుదాహరణముగా బేర్కొనిరి.

3. త్రిభువన వీరదేవరాయ నృపాలుని ప్రార్థనము, తన మందిరమునకు రమ్మని. భట్టరువారు నిరాకరించిరి. సమాధానము నిచ్చిరి.

4. కోవెల యర్చకుడు భట్టరుపై పరుషవాక్యములాడుట. భట్టరు శిష్యు లెదుర్కొనగా భట్టరు వారించిరి.

5. సోమయాజియను వైష్ణవునకు తిరువారాధన క్రమమునకై ఉదయవరుల నిత్యమొసంగిపంపెను. మరల కొన్నాళ్ళ కాతని ప్రశ్న "జాము తడవగు నట్లారాధన క్రమము మాకేల? అతిలఘుక్రమముగా మీ రర్చచేసితిరేల?

సమాధానము : నీ కింతకంటె తక్కువ విధిగాన నైతిని.

బోధన రీతి : "జ్ఞానానుగుణముగా ఛాత్రుల కుపదేశ మాచార్యులొనరింతురు."

6. ఒక చేతనుడు వేసిన ప్రశ్న :

శ్రీవైష్ణవు లితర దేవతల నేల అనుసరింపరు?

జవాబు : ప్రమాణ విరోధంబున్న యెడగదా సందేహంబుదయించు?

7. భక్తులలో మార్పు : శ్రీ రంగనాథు మంటపస్తంభమున నొక స్వర్ణకారుడు నిజ భుక్తావశేషమును నాగవల్లీ దళమునందుంచి చెక్కుట. దానిని ఒక యౌవనసుందరుడు చూచి, ఆ చూర్ణమును తినుట తదనుభవంబున జీవితక్రియలలో నటవిట గాయకుల జేరుట. దేవదాసిని గోరుట. చివరకు భట్టార్యుడాతని బట్టి తెప్పించి కౌగిలించుకొనుట. అతనిలో కలిగిన మార్పు గురు నెడబాయకుండుటయే.

8. నంజియ్యరు భట్టరెరుంగకుండగ పల్లకిని మోయుట.

9. సిరియాచ్చాను సందేహము.

10. కాళబత్తుని వృత్తాంతము.

11. సారమేయము, ముక్తాత్మను కటాక్షించుటను గూర్చిన వివరములు గలవు.

12. ప్రతివాదుల అపజయములు. వారికి భట్టరునంత మొందింప తలంపు గల్గుట. ఘటములో పామునుంచుట. భట్టరందులో తెల్లగొడుగున్నదని చెప్పుట.

13. తిరువరంగ త్తముదనారులకిచ్చిన సమాధానము : పుట. 378. ప్రశ్నయేమనగా : మహాత్మా! నీవకూరేశ గురున కౌరసపుత్రుండవు. అమ్మహాదేశికుండు విద్యవలన నన్ను బుట్టించె. గాన మజ్జన్మంబభ్యర్హితంబు.

జవాబు : "ఆ వాక్యంబతి సమీచీనంబైనను తానిట్లును సంధించుటంజేసి స్వరూపానుచితంబుగా దోచంబడు."

14. సంధ్యావందన సమయ మతిక్రమించినందులకు దోషము గలదా?

సమాధానము : తదీయ (భగవత్) కైంకర్యనిరతులగు వారికి సంధ్యావందనాది కర్మవైకల్యదోషంబు సంభవింపదు.

15. పిమ్మట భట్టరువారు పరమపదము చేరుకొనుటను గూర్చిన వివర

ఆశ్వాసాంత పద్యము :
"శ్రీద! పరాశర గురువర!
వేదావ్యాసాద్యవినుత విశ్రుతచరితా!
గోదాగ్రజ! రామానుజ!
యాదవ గర్వాపహార! యదుశైలవరా!"
(ఇందు భట్టరు వైభవము సూచితము.)

## ఉత్తర భాగము - ద్వితీయోల్లాసము

(ఇందులో సీసములు = 93, కందములు = 2, శా = 1, మాలిని = 1, తనియలు = 2, గద్యాంశములు = 2, వచనములు 41 - 285 గలవు.)

ఇందలి ప్రధాన కథాంశములు :

1) నంజియ్యరు గారి ప్రభావము
2) నంబిళ్ళగారి వైభవము

**1) నంజియ్యరు గారి ప్రభావము :**

(18 సీస పద్యములలో వివరణము గలదు.)

జన్మాదిక విశేషములు :

పద్యములు లేవు. తనియలలోనే వివరములు గాంచనగును. భట్టరుగారి ప్రభావములోనే వీరిని గూర్చి విపులముగా తెలుపబడినది.

తనియనుబట్టి : ఫాల్గుణమాసము, ఉత్తరఫల్గుణీ నక్షత్రము.

జన్మస్థము : మేలునాట

కుటుంబము : ఇరువురు భార్యలు గలరు.

వివరములు : ఇతని మొదటి పేరు వేదాంతి. మహా పండితుడు. శ్రీమంతుడు. భట్టరువారిచే వాదములో జయింపబడి, నంజియ్యరను తిరునామ మునుబడసి వారి నాశ్రయించినవారు.

కథా గమనము : కథా సంవిధానము :

పెరియ భట్టరార్యుని పిమ్మట నంజియ్యరు దర్శన స్థాపన నిర్వాహ కత్వమును బడసెను.

నంబూరి వరదరాజు (నంబిళ్ళ) తోడి పరిచయము :

అతని కాశ్రయ మొసంగుట :

నంజియ్యరుగారు ఒన్బదునాయిరప్పడిని పట్టెడాకులపై వ్రాసెను. దానిని తిరుగ అందముగా వ్రాయు వానిని గూర్చి విచారించెను. తన అంతరంగచ్ఛాత్రుని ద్వారా నంబూరి వరదరాజు అను విప్రుడు లిపుల నెఱింగినవాడు, లేఖకుడు, విద్యార్థులకు శాస్త్ర పాఠములు చెప్పువాడని తెలిసికొని, అతని రప్పించి, ఆశ్రయ మిచ్చి, పంచ సంస్కారాదికముల గావించి, తన గ్రంథమును లిఖియించుట కాజ్ఞాపించెను అతడు తన యూరికి బోవుచు, గురుడిచ్చిన రెండు పుస్తకములను నెత్తిపై నిడుకొని కావేరీనదిని మధ్య ప్రవాహమున క్రిందబడిపోయెను. ఎట్లో అవతలిగట్టును జేరెను. కాని గ్రంథములు లేవు. ఇంటికి వచ్చి ఆ రాత్రిచే కుందుచు, హరి కృపను తెలివి బొంది, గ్రంథమును ఇదివరకు గురుడానతిచ్చిన విధముగా వ్రాసి, తీసికొనిపోయి గురునకు జూపెను. గురువుగారు లెక్కించుకొని, మొదటి దాని కన్న గ్రంథనవళలి యధికముగని, యిదేమని యడుగ, వరదరాజు వాస్తవమును జెప్పెను. ఇది విని, నంజియ్యరీతనిని "నంబిళ్ళయో" యని సంబోధించెను. నాటినుండి వరదరాజునకు "నంబిళ్ళ" యను ప్రసిద్ధ నామము గల్గెను. దాస్య నామము కలివైరిదాసుడని యుంచెను. వీరు 100 సం॥లు జీవించిరి.

ఇచటినుండి నంజియ్యరుగారు నంబిళ్ళ యడుగు ప్రశ్నలకు, ఇతరుల సందేహములకు సమాధానము లిచ్చుట వర్ణింపబడినది. ఇందులో 9, 10 అంశ ములు గలవు.

## నంబిళ్ళగారి వైభవము

(ఇందు 75 సీసములు, 280 పంక్తుల వరకు వచనములు గలవు. పద్య ములో తిరునక్షత్ర విషయములేదు. శ్లోకము గలదు.)

జన్మాదిక విశేషములు :

స్థలము : ఆర్యావర్తదేశీయుడు. (నంబూరు)

జన్మ : కార్తికమాసము. కృత్తికా నక్షత్రము.

ఆచార్యుడు : నంజీయరు. వేదాంతి.

కులము : అఱువేల నియోగి. (షట్సహస్రద్విజుడు) కణ్వవంశము.

అసలు తిరునామము : నంబూరి వరదరాజు.

గురుడొసంగిన తిరునామము : నంబిళ్ళ

,, ,, దాస్య ,, : కలివైరిదాసుడు,తిరుక్కలిహన్నదాసుడు.

మొదటి వృత్తి : విద్యార్థులకు పాఠములు చెప్పుట.

పిమ్మటి వృత్తి : నంజియ్యరు తరువాత దర్శనస్థాపకత్వము.

కుటుంబము : ఇరువురు భార్యలు. రెండవ భార్యకు కలిగిన సంతానము కుమారుడు - పేరు దూనియంబిళ్ళ.

బిరుదనామము : కందాడ తోడరప్పరుచేత "లోకాచార్య" బిరుదము నందెను.

కథాగమనము : కథాసంవిధానము :

(గమనిక : నంజియ్యరు జీవితచరిత్రలో నంబిళ్ళగారు అతనికి శిష్యుడగుటను గూర్చి ప్రస్తావింపబడినది)

నంబిళ్ళగారికి నంబియ్యరుయందు ఆచార్య ప్రతిపత్తి నిరుపమానము. నంబియ్యరు పీరికి నూఱు మారులు తిరువాయిమొళికి అర్థమానతిచ్చెను. నంబిళ్ళయు తన ఆచార్యునకు నూరుమార్లు అభిషేకముల జేసెను. విద్యార్థ్యతల అహంకారము కూడదనియు, రామానుజుల పాదపద్మములే తంజమను స్వాచార్యోపదేశమును ఆచరణలో జూపినవాడితడు.

గ్రంథకర్త నంబిళ్ళ వైభవమునకు విపులములైన దృష్టాంతముల జూపి, తేటతెల్లముగా అర్థమగునట్లు 75 సీసముల వ్రాసినాడు. మణవాళ మహామునుల పిమ్మట ఇతనిని గూర్చియే కవి ఎక్కువ పద్యముల వాడుకొన్నాడు. స్వాచార్యుని ద్వారా ఇతడు సందేహముల తీర్చుకొని, అట్లె వైష్ణవధర్మ విషయములను వివరించుటలో ప్రశ్నించువారికి ఉచితములైన సమాధానము లొసంగుట, తద్వారా ఈ గ్రంథమును చదువువారికిని సంశయములు తొలంగుట కవకాశము కల్పించినాడు.

**నంబిళ్ళగారి నాశ్రయించిన శిష్యులు :**

1. పెరియ వాచ్చాంబిళ్ళ
2. పిన్‌బళగియ పెరుమాళ్ జియ్యరు

3. ఈయుణ్ణి మాధవుడు

4. వడక్కు తిరువీధి పిళ్ళై

5. ఎంగలాళ్వాను

6. మొదలియార్ దేశికుడు

**వీరి మహిమలు :**

గురుభక్తి మహిమను గూర్చిన కొన్ని కథలిందు గలవు. 1. రామానుజుల వలె వీరును ఒక లేఖ శ్రీహరికి వ్రాసి, ఒక సాధ్వీలలామకు మోక్షమిప్పించెను. శ్రీలక్ష్మణార్యుల సిద్ధాంతము నిర్వహించునపుడు నంబిళ్ళ యుపన్యాసమును విన్నదీ వనిత.

2. ఒకమాఱు తనకాతిథ్యమును సలిపిన మఱ్ఱిచెట్టును కౌగిలించుకొని దానికి పరమపదము నొసంగెను.

4. సందేహములు - సమాధానముల రీతిని వీరి గోష్ఠి సాగెడిది. ఉదా॥ శ్రీవైష్ణవుండెట్లు బహుమతుండగును? దీనికి చిన్న కథ చెప్పి "పరగోష్ఠి యందుపేక్ష యతుల బహుమతి యగు వైష్ణవునకని'' సమాధానము.

5. వీరి యనుగ్రహ విశేషము చేతనే 'వడక్కుతిరువీధిప్పిళ్ళ' యను శిష్యునకు సంతానము కలిగెను. (శిష్యుని భార్య ఋతుస్నాతయై నంబిళ్ళకు మ్రొక్కగా నితడామె యుదరమును దువ్వి "అమ్మ! నీవు కదగి ననుబోలు పుత్రుని గాంతువనుచు" దీవించెను.) ఈ దంపతులకు మొదట పిళ్ళైలోకాచార్యదని ప్రసిద్ధ నామముగల వారును, పిమ్మట అళహియమణవాళ పెరుమాళ్నైనారను ఇరువురు సుతులుదయించిరి.

సందేహములు, ప్రశ్నలు, జవాబులు, సంఘటనలు నంబిళ్ళగారొసగినవి 388వ పుటనుండి 412వ పుటవరకు 23 పుటలలో గలవు. ఇందులో 29 అంశములు గలవు.

**గమనిక :** వైష్ణవధర్మ సంబంధ విషయముల ప్రత్యేక శీర్షికలో ముఖ్యాంశముల వివరించినాడను.

ఆశ్వాసాంత పద్యములో కథా సూచనము :

"కలివైరిదాస గురుహృ
జ్జలజ సుఖాసీన! పంచశక్తిమయాత్మా!
విలసిత మంగళగిరి నృహ
రిల సద్గుణ "జాలలోల శ్రీయతిపాలా!"

## ఉత్తర భాగము : తృతీయోల్లాసము

(ఇందు 46 సీసములు, 212 పంక్తులుగల 16 వచనములు, 9 తనియలు గలవు. గద్యాంశములు=6 గలవు.)

ఇందలి ప్రధాన కథాంశములు:

1. పెరియ వాచ్చాంబిళ్ళగారి వైభవము.

(ఇందు సీసములు=15 వచనపంక్తులు=50, తనియ=1.)

2. అళహియ మణవాళ ప్పెరుమాళ్ నైనార్ వైభవము.

(ఇందు సీసములు=3, వచనపంక్తులు=52, తనియ=1.)

3. పిళ్ళలోకాచార్యుల వైభవము.

(ఇందు సీసములు=4, వచనపంక్తులు=11, తనియ=1.)

4. పిళ్ళ లోకాచార్యుల తర్వాతి వృత్తాంతము.

(ఇందు సీసములు=24, వచనపంక్తులు=92 గలవు. ఇంకను ముఖ్యులైన ఆచార్యుల చరిత్రలు ప్రస్తావించబడినవి. తనియలు గూడ గలవు.)

1. వాదికేసరి యళహియమణవాళ జియ్యరు.
2. నైనారాచ్చాంబిళ్ళ.
3. వడక్కు తిరువీధిపిళ్ళ.
4. ఈయుణ్ణి మాధవప్పెరుమాళ్.
5. ఈయుణ్ణి పద్మనాభప్పెరుమాళ్.
6. నాలూరాం పిళ్ళ.

## పెరియ వాచ్చాంబిళ్ళగారి వైభవము

నంబిళ్ళ పిమ్మట వీరు సిద్ధాంత నిర్వాహదక్షులై యుండిరి. వీరి ఇంకొక పేరు "అభయప్రదరాజార్యుడు." ఆశ్రితులడిగిన ప్రశ్నలకితని సమాధానములు గలవు.

అందు ముఖ్యాంశములు 9 గలవు.

గమనిక : ప్రత్యేక శీర్షికను జూడుడు. వైష్ణవ ధర్మ సంబంధములు.

ఇతని కుమారునిపేరు నైనారాచ్చాంబిళ్ళ. ఇతని పినతల్లి పెద్దకుమారుడు ఆచ్చాంబిళ్ళ.

**రచనలు :** దివ్య ప్రబంధములన్నింటికి వ్యాఖ్యానములు.

**శిష్యవర్గము :** అనేకులాశ్రితులు గలరు. అందు ముఖ్యుడు "వాదికేసరి" యనువాడు. సార్థక నామధేయుడై "వాదికేసరి మళహియ మణవాళయోగి" (జియ్యరు) అను తిరునామమును బడసెను పూర్వమితడు తన్ను పరిహసించిన 'సూరి' యను నొక విద్వాంసుడాడిన మాట "ముసల కిసలయము" అను పేరు గల కావ్యమును వ్రాసెను. మఱియు తిరువాయమొళికి పన్నిరాయరప్పడి యను వ్యాఖ్య రచించెను.

పెరియవాచ్చాంబిళ్ళ పిమ్మట దర్శన ప్రవర్తకుడు, అతని కుమారుడు "నైనారాచ్చాంబిళ్ళ" మహా విద్వాంసుడు. "జ్ఞానాధిరాజ" సంజ్ఞచే నొప్పిన వాడు. శ్రీరంగరాజ దీక్షితులని ఖ్యాతిగలవాడు. వీరి రచనలు : 1. తత్త్వ సంగ్రహము 2 ముక్తభోగావళి 3. శారీరము.

## అళహియమణవాళప్పెరుమాళ్ వైభవము :

ఇతడు వడక్కు తిరువీధి పిళ్ళైగారి రెండవ కుమారుడు పిళ్ళలోకాచార్యుల తమ్ముడు. వీరిరువురును రామలక్ష్మణులవలె, కూరేశపుత్రులవలె అన్యోన్య సౌభ్రాత్ర మతిశయిల్ల పెరుగుచుండిరి. పిళ్ళలోకాచార్యులు ప్రాణప్రదుడు. దక్షిణబాహుసముడైన తమ్మునితో దర్శనార్థముల నిర్వహించుచుండిరి. పెక్కు గ్రంథముల రచించిరి. అందులో నొకటి "శ్రీ వచనభూషణము." దీని ప్రశస్తిని శ్రీరంగ రాజసన్నిధిని స్థిరీకరించిన కీర్తి తమ్మునికి దక్కినది. మఱొక గొప్ప గ్రంథము ఆచార్య హృదయము.

అళహియమణవాళప్పెరుమాళ్ నయనారు "తిరుప్పావు" మొదలైన కొన్ని గ్రంథములకు వ్యాఖ్యానం బొనరించెను. అన్నగారితో సహా తురీయాశ్రమమును స్వీకరించెను. అచిరకాలములోనే పరమపదము నలంకరించెను.

## పిళ్ళ లోకాచార్యుల వైభవము

జీవితకాలము : క్రీ శ. 1213-1327.

జన్మ : ఆశ్వయుజ మాసము శ్రవణ నక్షత్రము నంబిళ్ళగారి దీవెన ఫలితముగా జనించినవాడు.

ఆచార్యుడు : తండ్రియగు 'వడక్కు తిరువీధిపిళ్ళ'

ఇతని శిష్యులు : పెక్కురు గలరు. ముఖ్యులు :

1. తమ్ముడగు "అళహియమణవాళ ప్పెరుమాళు నయనారు"
2. కూరకులోత్తమదాసుడు
3 మణల్వాకనంబి
4. కొల్లిహావలదాసుడు
5. కెట్టారణ్ణ
6. వేలాంజోలై పిళ్ళ
7. తిరుమలై యాళ్వారు
8. కొందఱు అమ్మ యారులు = తిరుత్తాయారు. ఇట్టి కొందఱు

ఇంకను ఇతని నాశ్రయించినవారు :

1) మణవాళ మహామునుల కాచార్యుండగు ''తిరువాయిమొళిపిళ్ళ."

2) మణవాళ మహామునుల తండ్రి యగు ''తిహాళిక్కిడందార్ తిరుణావుడయపిరాన్."

పిళ్ళలోకాచార్యుల రచనలు:* ఆ. సూ. ము. పుటలు : 421, 422 లో ఇట్లున్నవి : 1 తత్త్వత్రయము 2. రహస్యత్రయము 3 అర్థపంచకము

---

* అష్టాదశ రహస్య గ్రంథములు : 18. ప్రసిద్ధ శ్లోకము :
"ముముక్ష్వాది తన్యాది, తత్వాది సాదన్
చతుస్త్రి ద్వికద్విత్వ సంఖ్యాన్ క్రమేణ
ప్రాదీ, నవాదీ, తథాశ్యాది మాదీ
జగుఃకార్ష్ణపాది ప్రణీతాన్ ప్రబంధాన్॥"

నాల్గు - 1. ముముక్షుప్పడి 2. పరన్దపడి 3. శ్రియఃపతిపడి 4. యాదృచ్ఛికపడి.

మూడు - 5. తనిద్వయము 6. తనిచరమము 7. తనిప్రణవము.

రెండు - 8. తత్త్వత్రయము 9 తత్త్వశేఖరము. 10. సారసంగ్రహము 11. సంసారసామ్రాజ్యము 12. ప్రమేయశేఖరము 13. ప్రపన్న పరిత్రాణము 14 నవరత్నమాల 15 నవవిధ సంబంధము 16 శ్రీవచనభూషణము 17. అర్థపంచకము 18. అర్చిరాది.

(సేకరణ : శ్రీవచన భూషణసార సంగ్రహము, టి.టి.డి. 1951)

4. శ్రీవచనభూషణము 5. మాణిక్యమాల 6. నవరత్నమాల 7. కురుహూరు రత్నమాల 8 వార్తామాల 9. ముముక్షుప్పడి 10. పరందపడి 11. శ్రియఃపతిపడి 12. యాదృచ్ఛికపడి 13. నిగమనప్పడి 14. ప్రమేయశేఖరము 15. అర్చిరాది 16. తత్వశేఖరము 17. ప్రపన్నపరిత్రాణము.... మొదలగునవి. 18. సంసార స్సామ్రాజ్యము (ఆ.సూ.ము. లో లేదు).

**సంఘటనలు :** పుట 424 లోని అంశములు.

తురుష్కాధిపతి యొక డశ్వాదిబలముతో శ్రీరంగనాథ ప్రాకారముల నాక్రమించెను. అచటి భక్తులు కస్తూరి రంగని గైకొని రాత్రులందు ప్రయాణమును సాగించిరి. పిళ్ళలోకాచార్యులును కదలిరి (ఇచట అరణ్య వర్ణనము కడుంగడు మనోహరము.) శ్రీరంగనాథుని వెంట నితడు లక్ష్మణునివలె నడచెను. స్వామి భక్తులకు సర్వస్వదానము చేసెనను వార్త విని, ముందు నడచు తాను తిరిగి వచ్చి అచటి దానచేతనులకు సర్వస్వదానము చేసెను.

పిమ్మట జ్యోతిష్కుడి గ్రామము చేరుకొని శ్రీరంగని సేవించుచుండెను. ఆశ్రితులకు తంజమగు హితములు బోధించి, వేలాంజోలై పిళ్ళకాదేశ మొసంగెను. "నీవు తిరువనంతపురమునకు బోయి అచటి దేవుని సేవించుము." ఆ తర్వాత వీరు అర్చిరాదిక మార్గంబున పరమపదమును జేరుకొనిరి.

**పిళ్ళలోకాచార్యుల పిమ్మట జరిగిన విశేషములు :**

1. శ్రీరంగరాజునకు వనవిహారము సేయునిచ్ఛ. అళహరి తిరుమలకు బోవుట. మనోహరదృశ్యముల వర్ణనము.

2. పిమ్మట శ్రీరంగరాజు మలయాళదేశమున కరిగెను. అచటి దక్షిణ (దివ్యదేశాధిపతులు) అధిపతులు శ్రీరంగనాథుని దర్శించుకొనిపోయిరి. తర్వాత వకుళభూషణ మునియు వచ్చెను. దర్శించి బహూకృతుడై కర్ణాంబియనెడి యూరి కేతెంచెను.

ఆ పిమ్మట రంగనాథుడు యాదవాద్రికి, అచటినుండి అంజనాచలము చేరి, శ్రీ వేంకటేశుని యింట 12 సం॥ లుండెను.

అపుడు శ్రీరంగములో జరిగిన విశేషను - **దేవవేశ్య త్యాగతిరతి :**

సింగప్పిరాన్ అనెడి విప్రుడు యుక్తిచే తురుష్కపతిని స్నేహము గావించుకొని శ్రీరంగనాథప్రాకారమును బాగుచేయించెను. ఇచట "శ్రీరంగనాథ

మాణిక్యాభిధాన వేశ్య" తురుష్కపతిని తన చాతుర్య సౌందర్య విశేషములచే వలలో వేసికొని, అతనిని గోపురాగ్ర భాగము నెక్కించి క్రిందికి బడద్రోసి, అమలిన శరీరముతో తానును క్రిందికి దూకి పరమ పదించెను.

తమ పెరుమాళ్ళను రక్షించుకొనుటలో ప్రాణాలను సైతము లెక్కచేయక దేశమునకు, కోవెలకు అంకితమైపోయిన భక్తులున్నారనుటకీ కథ తార్కాణము. మహోన్నతమైన త్యాగతిరతికిది పరాకాష్ఠ.

3. గోపనాయడు, సింగప్పిరాన్ విప్రుడు తురుష్కులను పారద్రోలి సంప్రోక్షణాదుల సలిపి నిలిపిరి.

**శ్రీశైలేశుని (తిరువాయిమొళిపిళ్ళై) వృత్తాంతము :**

శ్రీశైలేశుడని ప్రసిద్ధనామమును బడసిన మణవాళ మహామునుల కాచార్యుడైనవారే తిరువాయిమొళిపిళ్ళై

బాల్యముననే తల్లి పరమపదింప, పినతల్లికడ పెరుగుచుండెను. ఇతడు కూరకులోత్తమ దేశికుని సేవించి, రహస్యార్థముల బడిసెను. పిమ్మట తిరుప్పుళ్ళిం గుడిజియ్యరార్యుకడ తిరువాయి మొళి కర్థము బడయగోరి వెళ్ళి నంతలో వారు మరణించిరి.

తర్వాత ఇతడు ''దేవరాజు గురుడ"ను పేరుగల "నాలూరాంబిళ్ళై" నాశ్రయించి భగవద్విషయముల నేర్చుకొనెను.

పిమ్మట "తిరుక్కణ్ణాంబి" యను నూర వలసగానున్న శ్రీ శఠకోపులను, అచటి నుండి ''తిరునగరి''కి తోడి తెచ్చి తింత్రిణీమూల సద్దివ్య ఆలయములో ప్రతిష్ఠింపజేసెను.

ఆచార్య ప్రపత్తి : 431, 432 పుటలలో ఆచార్య ప్రశస్తి వర్ణింపబడినది. ఇతడు కూరకులోత్తముని పూర్వపుటానతి ప్రకారము 'నారాయణ దాసాపరనామ ధేయుడగు 'వేలాంజోళప్పిళ్ళ' నాశ్రయించుటకు పుష్పోద్యానవనమును జేరుకొనెను. అచట శ్రీ వచన భూషణ ప్రతిపాదిత ధర్మంబుల బడసెను. వీరి పరమపదము పిమ్మట కురుకాపురిని జేరుకొనెను.

"దినదినం బెప్పుడు తిరువాయిమొళి యందు
  శబ్దార్థభావరసంబు లనుభ
వించుచు నా సొంపు పెంపార తదితర
  నిఖిల శాస్త్రాదుల తృణీకరించి,
వర్తించుటను తిరువాయిమొళి పిళ్ళ
  యను నిరూపక నామ మతని కయ్యె."

(ఆ. సూ. ము. పుటలు - 433).

శఠారాతి కైంకర్యమే యాత్రగా కాలమెల్ల గడుపుచుండెను. "వైష్ణవాన్వయవారిజ బాల సూర్యుడై, హృన్మల తిమిరేనుగుణచువాడు."

రచనలు : భట్టనాథ ప్రబంధ వ్యాఖ్య.

దాస్యనామము : శ్రీ శఠకోపదాసుడు.

ఇతని శిష్యులు : మణవాళమహామునులు.

నంబిళ్ళ యొసంగిన ముప్పత్తారాయిరప్పడిని వ్యాప్తి జేసినవారు : ఈడు వ్యాఖ్యాన పరంపర; సంప్రదాయ పరంపరా ప్రాప్తంబైన విధము : (పుట 420.) మొదటి నుండి క్రమముగా :

1. ఈయుణ్ణి మాధవగురుడు - కుమారుడు.
2. ఈయుణ్ణి పద్మనాభ పెరుమాళ్ - శిష్యుడు.
3. కోలెవరాహనైనారు (నాలురాం పిళ్ళ) - శిష్యుడు.
4. నాలూరాచ్చాంబిళ్ళ (దేవరాజ గురుడు, నల్లెమహనారన్) - శిష్యుడు శిష్యులకును.
5. తిరువాయిమొళిపిళ్ళ

**దర్శన నిర్వాహకులు :**

1. అభయప్రదరాజార్యుడను పేరుగల "పెరియ వాచ్చాంబిళ్ళ."
2. వడక్కుతిరువీధి పిళ్ళ ఇతని కుమారులు :
3. పిళ్ళలోకాచార్యులు,
4. అళహియమణవాళపెరుమాళ్ నయనార్.

**గమనిక :** పెరియవాచ్చాంబిళ్లగారి సమాధానములు = 9 అంశములు పుటలు : 416, 417.

వడక్కు తిరువీధిపిళ్ళ ఆత్మస్వరూపమును గూర్చిన సమాధానము = 1 అంశము, పుట 420లో గలవు.

**ఉత్తర భాగము :**

## చతుర్థోల్లాసము - పంచమోల్లాసము

IV. చతుర్థోల్లాసము : పుటలు : 435 - 513=79. ఇందులో సీసములు=84, కందము=1, మాలిని=1, తనియలు=3, వచనములు=26, పంక్తులు=1733, గద్యాంశములు=33.

IV. ఇందు ప్రధాన కథాంశము : పుటలు : 435-513=79.

**మణవాళ మహామునుల వైభవము :**

V. పంచమోల్లాసము : ఇందులో 52 సీసములు, 2 కందములు, పుటలు : 514-556=63, 1 శార్దూలము, 1 మాలిని, తనియలు=31, గద్యాంశములు=10, వచన పంక్తులు=46-485

V. ఇందు ప్రధాన కథాంశములు :

1) మణవాళ మహామునుల వైభవము - పుటలు 513-536=21

2) ఆళ్వారాదుల జన్మస్థల వంశ ప్రబంధాదులు - 539-556=17

3) భూగోళ, ఖగోళ, వైకుంఠాది దివ్యదేశముల ప్రసక్తి - 535-539=4

## మణవాళ మహామునుల వైభవము

ఇతని జీవిత చరిత్రను గూర్చిన పద్యముల సంఖ్య 125. రామానుజుల చరిత్ర తర్వాత ప్రాముఖ్యమతనికే గలదు. వచనములు=42, 2217 పంక్తులు గలవు. అతి పెద్ద పంక్తుల వచనము 1444 సంఖ్య గలది. మొత్తము పుటలు= 79+21=100.

**విచిత్రము :** ఈ సంఖ్య ఇతని జీవిత అంత్యకాలమునకు సరిపోవుట

జన్మాదిక విశేషములు :

తిరునక్షత్ర తనియగలదు. పద్యములో గూడ సూచితము.

జన్మ సంవత్సరము : సాధారణ సంవత్సరము.

సమయము : తులా సంక్రమణము, మూల నక్షత్రము.

స్థలము : కురుకాపురి, కుంతీనగరము, పాండ్యదేశము.

జన్మకారణము - తలిదండ్రులు - కుటుంబము :

శ్రీరంగపతి తన చిత్తమునందు మరల ప్రపత్తి శాస్త్రము తగ్గుపడినదని తలచి, దాని నుద్ధరించుటకై రామానుజాచార్యులతో సమానమైన వ్యక్తిని అవతరింపజేయుటకు 'అనంతున' కాజ్ఞనొసంగ, నాతడు కురికాపురికేగి 'శ్రీజిహ్వావాగధీశానదాసా' పరనామధేయుడగు 'తిహాళక్కిడందారు తిరునావుడయ ఫిరాన్ తాతరణ్ణయ్యరు' చిత్తములో ప్రవేశించి,యా బ్రహ్మవేత్తవలన అతని గర్భములో ప్రవేశించెను. ఈ యమ పేరు శ్రీరంగనాయకి. ఇట్లు మణవాళమహాముని లవతరించిరి.

(గమనిక : ఈమె తండ్రి ''పుళ్ళశిక్కిల్ కడారంబు'' అను గ్రామ వాస్తవ్యుడు. పేరు కొల్లి పావలదాసుడను పేర ప్రసిద్ధిగాంచిన అళహియమణవాళ ప్పెరుమాళ్ అనువారు, పిళ్ళలోకాచార్యుల శిష్యులు. పుట 433. ఉత్తర భాగము - తృతీయోల్లాసము.)

వంశము : గోమఠము.

దాస్యనామము : శఠకోపదాసు.

తండ్రియిడిన తిరునామము : ''అళహియమణవాళ ప్పెరుమాళ్ నైనారు.''

విద్య : వేదవేదాంగములను పఠియింపజేసినవారు తండ్రియే.

దివ్యప్రబంధముల నన్నింటి నధికరింపజేసెను. కృతజ్ఞతగా నితడు తండ్రి పేర బరగు నొక తనియన్ వ్రాసెను

వివాహము : మణవాళమహామునుల పదునాఱవయేట తండ్రి ఇతనికి పెండ్లి గావించెను. కొంతకాలముండి పరమపదించెను.

కుమారుని కుమారులు : మామునుల కిరువురు పౌత్రులు జన్మించిరి.

1. అళహియ మణవాళ ప్పెరుమాళ్ నైనారు = అభిరామవరులు.

2. పెరియాళ్వారులు.

పర్యాయపదములు : మణవాళ మహామునులకెన్నియో పేర్లు గలవు. సుందరజామాత, సుందరజామాతృడు, సౌమ్యజామాత, సౌమ్యజామాతృడు, రమ్యజామాత, వరవరముని, కాంతోపయంతృగురుడు, సూరి - సౌమ్యోపయంత, వరవరస్వామి, యతీంద్ర - ప్రవణులు, రామానుజం పొన్నడి.

మణవాళ మహామునుల కుమారుని పేరు : రామానుజయ్య.

**శ్రీశైలేశుని శిష్యుడైనట్టి వృత్తాంతము :**

శ్రీశైలనాథులు తన పిమ్మట దర్శన స్థాపకు డెవ్వరని ఆలోచించు చుండెను. ఇట్టి సమయమున మణవాళ మహామునులు తన మేనమామ యూరగు 'శిక్కిల్‌డార'మను గ్రామమునుండి తిరునగరికి ప్రయాణమై అచటికి చేరుకొనెను. పిమ్మట శ్రీశైలనాథుని దర్శించుకొని వినమ్రుడై నిలిచెను. ఎందుకు వచ్చితివను ప్రశ్నకు నాలాయిర దివ్య ప్రబంధమధికరించుటకు వచ్చితినని వచింప నా గురు వర్యు డితనిని శిష్యునిగా స్వీకరించెను.

శ్రీశైలేశులిట్లు మామునులకు ద్రవిడాగమ వ్యాక్రియా రహస్య పర మార్థముల నెల్ల బోధించుచుండెను. మామునులు సంయమినాథుల శ్రీపాదన ళినయుగములే గమ్యంబని నమ్మి కొలుచుచుండెను. ఇట్లు రామానుజులపై "యతిరాజవింశతి"ని రచించిచూప, శ్రీశైలేశు డాతనికి త్రిదండపాణి విగ్రహము నిచ్చెను. మణవాళమహామునులిట్లు 'యతీంద్ర ప్రవణు'లైరి.

**దర్శన నిర్వాహకత్వ బాధ్యతను బడయుట :**

ఇతడు శ్రీశైలేశుల పాదపద్మముల సాక్షిగా, "ద్రవిడోపనిషదర్థ తత్వ బోధకలనచే నాదు కాలము గడపెద"ననెను.

గురుడు మామునుల నొకసారి శ్రీభాష్యమును చదువుమనెను. రామా నుజాచార్యులకును, తనకును ప్రీతిగా నాలాయిర ప్రబంధములు, తద్వ్యాఖ్యలు, తద్రహస్యములు వచించుచు, తన శిష్యులకు తెలుపుచు, పూర్వదేశికులమాడ్కి రంగమందిరునకు హరికి మంగళాసనములు సలుపుచు నందుండుమనెను. ఆశ్రిత జనుల నయ్యళహియ మణవాళ మహామునుల కప్పగించి, శ్రీశైనాథదేశికేంద్రుడు పరమపద మొందెను.

పిమ్మట మణవాళమహామునులు తిరునగిరియందు దర్శనమును నిర్వహించునపుడు కొందరాశ్రయించిరి.

1) అళహియవరదగురుడు (ఇతడు సన్యసించి రామానుజ జియ్యరని పేరొందెను)

2) మొదలియారణ్ణరు.

3) ఇతరులు.

**మణవాళ మహామునులు శ్రీరంగవాసము చేయదలచుట :**

మొదసారి ప్రయాణము : శ్రీరంగమునకు :

1. తిరునగిరి నుండి బయలుదేరి శ్రీవిల్లిబుత్తూరు చేరిరి. మార్గమధ్య దివ్యదేశములకు మంగళాశాసనములను జేసిరి.

2. శ్రీరంగధామముజేరి కావేరి యందవగాహముజేసి, ద్వాదశచ్ఛిద్రోర్ధ్వపుండ్రముల ధరించి, పురప్రవేశమును జేసెను అచట "శ్రీ జగదార్యపదములాశ్రయించిన" కేట్టూరి యణ్ణగారి" యింటికేగి అతనితో కలిసి ఆలయాధికారియగు ''రంగరాజభట్టరు'' (వీరినే తిరుమలతంద భట్టారకుడందురు) సహాయమున శ్రీరంగనాథుని దర్శనము జేసికొనెను. (ఇచట శ్రీరంగేశుని వర్ణన గలదు. శ్రీరంగరాజు తన పనికై రప్పించుకొంటినని సెప్పుట, రంగరాజభట్టరు ఇంటిలో భోజనాదికములు గలవు.)

**శ్రీరంగేశుని యాదేశము - శ్రీరంగమున స్థిరనివాసము :**

శ్రీరంగధామముననే స్థిరనివాసము జేయుచు, తత్త్వబోధనల జేయుచు యామున, యతిరాజ, గోవింద, భట్టరు మొదలగు పూర్వగురువులవలె నుండుమనెను. మామునులీయాజ్ఞను తలదాల్చిరి. రంగనాథునకు సమ్మతి కలుగజేసిరి.

''ఉత్తమనంబి'' యనువాడు రంగనాథునకు తళిహయారాధనాధికారి. ''వానమామలయతి'' వచ్చి ఇతడు సంభారముల తగ్గించెనని చెప్పగా, మామునులాతని ననుకూలునిగా జేసికొనిరి.

**తిరుమలకుబోవు తలంపు - ప్రయాణము సాగించిన తీరు :**

1. సంశ్రితులతో 'కనకాపగా' నదిని దాటి మార్గస్థిత గ్రామముల దాటి నీలివనమును జూచెను.

అనెడు వారు.

3. వేంకటశైలమును చేరుకొనెను. స్వామి పుష్కరిణిలో స్నానముచేసి, సంబంధిత దైవతముల దర్శించి, వృషశైలనాథుని కన్గొనెను.

4. ఇచటి నుండి తిరుమల దిగి శ్రీరంగము చేరువరకు మార్గమధ్యమున గల దివ్యదేశముల జూచెను.

5. తిరిగి శ్రీరంగమును చేరుకొనెను.

సన్యాసాశ్రమ స్వీకారము జేసెను.

దాస్యనామము : శఠకోపదాసుడు.

తిరునామము : అళహియమణవాళ జియ్యరు, అళహియమణవాళ యోగీంద్రుడు.

**వల్లవరాయ మఠప్రవేశము :** ఉత్తమనంబి మామునుల నిట ప్రవేశింప జేసెను. వానమామలయతి (ఇతనినే తోతాచలాగారసంయమీంద్రు డందురు) మఠ పునర్నిర్మాణాలంకారముల జేయించెను. కాలక్షేపకూట మొకటి గట్టించి, దానికి "తిరుమల యాళ్వారి" పేరిడెను. శ్రీశైలనాథ మంటపము నా మట్టిచే అలికి పూయించెను.

**మణవాళ మహాముసుల కాలక్షేపములు :**

స్థలము : శ్రీరంగమున తిరుమలయాళ్వారి కాలక్షేపకూటములో వృద్వాసనాసీనుడై ద్రావిడామ్నాయార్థ తత్వనిరూపక వ్యాఖ్యాన వచన భూషణాది వేద శిఖర రహస్యాళిచే ప్రొద్దుపుచ్చుచుండెను.

ఇతని నాశ్రయించిన శిష్యులు పెక్కురు గలరు. ముఖ్యులు :

1. తోతాచలాగార సంయమీంద్రులు (వానమామల యతి).

2. పరవస్తు భట్టనాథుడు.

3. వాధూల గోత్రుడగు వరదనారాయణ గురుడు.

ఇతర విశేషములు : 1. ఇచట హేతువాది వృత్తాంతము గలదు. ఇతడు విఠలప్ప శిష్యుడు. మొదట మామునుల తిరస్కరించి, పిమ్మట తన గురుని వాక్యములు విని, భీతుడై వెళ్ళిపోయెను.

**ప్రతివాదిభయంకరం అణ్ణంగారిని పిలిపించుకొనుట :**

"మనకు విధేయుడై, మనతోడుపాటుగా
నుండగల్గిన దండి పండితుండు"

మనకెవ్వడని ఆలోచించి, శిష్యులెఱింగించిన వార్తప్రకారము మణవాళ మహామునులు కాంచిలో కరిగిరివరదు కడనున్న దండి పండితుడగు ప్ర.భ.అణ్ణం గారిని పిలిపించుకొనిరి. (పుట : 420 ) (నయనారు దేశికుల పిమ్మటగా వచ్చును. పుట 596 చూడుడు.) "పరగోష్ఠులను ప్రతివాద భయంకరుడను, వైష్ణవ గోష్ఠులందు దాసుడను" అని అణ్ణంగారు మామునుల నాశ్రయించిరి. అతనికడ ద్రవిడవేదాంతము నంతయు నధికరించిరి. యతిరాజునకు కూరేశులవలె అండగా నుండిరి.

**మణవాళమహామునుల, కుమారుల, పౌత్రుల వృత్తాంతము :**

మామునులకు పూర్వాశ్రమమున కలిగిన కుమారుని పేరు రామానుజయ్య. ఇతనికి ఇరువురు సుతు లుదయించిరి. 1. పెద్దవాని పేరు "అళహియమణ వాళ్ళ ప్పెరుమాళ్ నయనార్"దేశికులు.వీరినే "అభిరామవరు"లందురు.మామునుల తమిళ 'ఉపదేశ రత్నమాల'ను సంస్కృతీకరించెను. ఇతని పేర వైష్ణవులొక తనియ విన్నవించిరి. మామును లితనిని దర్శన స్థాపకుని గావించెను.

2. చిన్నవాని పేరు : విల్లిపుత్తూరునందుదయించినందున "పెరియాళ్వా" రని తిరునామముంచిరి.

**మణవాళ మహామునులు తిరునగరికి పోవదలంచుట -**

**ప్రయాణము సాగినతీరు - సంగతులు :**

మామునులు శ్రీరంగని యాజ్ఞను బొంది, తిరునగరికి చేరుకొని, శ్రీశఠగోపయోగీంద్రుని భజియించి, మధురకవీంద్రుల ప్రణీత ప్రబంధములచే కొనియాడిరి. శ్రీశైలనాథుని భవనమున కేగిరి. ఒక సందర్భమున దేవరాజను పేరుగల 'తిరునారాయణ పురత్తా'యను దేశికేంద్రుకడ సంశయముల దీర్చు కొనిరి.

2. విరోధు లితని మఠమును కాల్చివేయు ప్రయత్నము జేసిరి. అంత మామునులు తన మహిమను, శేషస్వరూపమును జూపి, అగ్ని జ్వాలల నార్పి, సమస్త ప్రాణుల కరుణించెను.

3. మామునుల వైభవము నాకర్ణించి అచటి దేశాధిపతి (రాజు పేరు తెలియదు) అతని నాశ్రయించి "శఠకోపదాస" నామము బడసెను. ఈ రాజు శఠకోపయోగీంద్రులకు ప్రీతిగా ''కాలమేఘాఖ్య" మంటపమును గట్టించెను. మరియు ''అళహియ మణవాళ నామా"భిరామంబగు కాంచన మంటపమును గూడ నిర్మింపజేసి, సకలవిధ కైంకర్యము లొనరించుచుండెను.

4. మామునులు పరాంకుశ మునీంద్రుల పీఠ్కాని కురంగ నగరమను పేరుగల 'తిరుక్కురుంగుడి'కి వచ్చి, ఒకచో నివసించి కాలక్షేపాదుల జరుపుచుండెను.

**ప్రశ్నలు - సమాధానములు - అతి దీర్ఘ వచనము - పంక్తులు 1444 గలది :**

మామునులు తిరుక్కురుంగుడిలో నివసించి యున్నపుడు బ్రాహ్మణుడొకడు వచ్చి భక్తితో ప్రణమిల్లి కొన్ని ప్రశ్నలడిగెను. ఇతని పేరు ''తిరువేంగడముడయాను." సమాధానములన్నింటిని విని శిష్యుడాయెను. ''తిరువేంగడదాస నామము"ను బడసెను. మామును లితని నిచటి మఠాధిపతిగా నియమించిరి.

ఆ.సూ.ము.లో అత్యంత ప్రాముఖ్యము గల ఘట్టమీ సందర్భమున జరిగిన విషయములు : పుటలు : 456—506 = 51.

బ్రాహ్మణుడు ప్రశ్నలు వేయుట, మామునులు సమాధానముల నొసంగుట, అంతర్గత ప్రశ్నలు, సమన్వయములు-ఇట్టి వచనము 1444 పంక్తుల వరకు వ్యాపించినది. అతి దీర్ఘములైన సమాధానములు గలవు. వైష్ణవులందరును తప్పక తెలిసికొనవలసిన విషయము లిందెన్నియో గలవు. ద్రావిడ వేదమవతరించుట, ఆళ్వారాదుల జన్మలకు గల హేతువు లిందు సప్రమాణముగా నిరూపింపబడినవి.

ఇందులో సామాన్యులకు గూడ గలుగు సందేహములు తొలగిపోవునట్టి వివరణములు గలవు. క్రొత్త విషయముల నెన్నింటినో తెలియనగును.

సంగ్రహముగా కొన్ని ప్రశ్నలు :

1. హరిహర, హిరణ్యగర్భులయందు నారాయణుండే అధికుండేల?

2. శ్రీరామచంద్రుడు శివలింగ ప్రతిష్ఠ చేల జేసెను?

4. అట్లు పరాత్పరుండగు హరి నెల్లవారేల ప్రార్థింతురు?

5. పాషండు లెట్టివారు? వారి చిహ్నము లెట్టివి?

6. శ్రుతి గర్హితంబగు కపాల, చర్మ, భస్మాస్థి ధారణంబు శివు డొనర్చుటకు కారణము?

7. తామస శాస్త్రము లేవి?

8. శంఖచక్రోర్ధ్వపుండ్రాది విష్ణుచిహ్న ధారణంబులకు ప్రమాణము?

9. ఆళ్వారాదుల కాలమును, దివ్య ప్రబంధములను తెలుపుడు.

10. చక్రధారణాది విషయమైన శ్రుతి ప్రమాణములు.

**శ్రీరంగధామము చేరుట :** తిర్క్కురుంగుడి నుండి ప్రయాణము: తిర్క్కురుంగుడి నుండి వెదలు సమయమున : ఇంతవరకు ఎన్నో ప్రశ్నల వేసిన తిరువేంగడముడయాను పరమానందభరితాంతరంగుండై మామునుల నాశ్రయించి శిష్యులై తిరువేంగడదాస నామమును బడసెను. పిమ్మట మామును లిచటగల పంచనంబులగు 1) నిన్నునంబి 2) ఇరుందనంబి 3) కిడందనంబి 4) మలమేల్‌నంబి 5) తిరుప్పార్ కడల్‌నంబి - వీరికి మంగళాశాసనములజేసి, గోపురప్రాకారాదుల గట్టించి, కైంకర్యోత్సవాదుల నేర్పాటుజేసి, కార్యనిర్వాహకునిగా, మఠాధిపతిగా తిరువేంగడదాసుని నియమించి శ్రీరంగధామంబునకు ప్రయాణించి తన మఠమున ప్రవేశించి యథాప్రకారము శ్రీరంగరాట్సేవ జేయుచుండిరి.

ఈ సమయమున నిట కొన్ని సంఘటనలు జరిగినవి.

## 1. దేవరాజాపరనామధేయుడగు ఇరుంబియప్పా:

ఇతడు గొప్ప పండితుడు. సూరియును. మామునుల మహోపన్యాసమును విని ముగ్ధుడైనను, అతని విందును స్వీకరించక తిరస్కరించి, పిమ్మట వారి దివ్యాకృతి వైభవముల జూచి తన తప్పును ("యతుల యన్నమును, సంయమి పాత్రసలిలములననుభావ్యములు గృహాధిపతికి'' యను న్యాయము) తెలిసికొని వారినే యాశ్రయించిరి.

ఇట్లే ఉత్తమనంబియు మొదట మామునుల తిరస్కరించి పిమ్మట క్షమా

మా మునులు తన కాలక్షేపమును ముగించుకొని ఒకనాడు తన మఠమున ఉచితాసనమున స్వస్వరూపము ధరించి వరుండెను. అతని సందర్శనార్థమై వచ్చిన ఒక సాధ్వి (పేరు "శఠకోపత్తి") తలుపు చాటునుండి "దళశతశిఖరాంచితంబగు రజత పర్వతంబుగతి, వికసిత సహస్రఫణామండల మండిత కుండలీంద్రాత్మకుండై విలసిల్లుచున్న యద్దేశికాఖండలునిం" జూచినది. మామునులు వెంటనే ఆ సాధ్వికడకు యథాపూర్వక వేషంబున వచ్చి, నీవేమి చూచితివని యడిగెను ఆ సాధ్వియు సాక్షాదనంతమూర్తివి నీవేయన, మామునులు, "నీవీ వృత్తాంతమును స్వరూపజ్ఞానహీనులకు తెలుపవల"దని యాదేశించెను. ఈ వార్త ఉపదేశపరంపరాప్రాప్తంబై ఆశ్రితలోకమున వ్యాప్తి నొందినది.

**"శ్రీశైలేశదయాపాత్రమ్" తనియ వృత్తాంతము :**

శ్రీరంగనాథుని తిరుపవిత్రోత్సవము : పుట : 509.

శ్రీ వరవరమునులు మంగళాశాసనము చేయుటకు రాగా, శ్రీరంగనాథుని యానతి : "మహాత్మా! ఈడు, ముప్పత్తారాయిరప్పడి మొదలుగాగల తిరువాయిమొళి వ్యాఖ్యానంబులెల్ల దును ప్రసాదింపవలయును." అట్లే జరిగినది.

స్థలము : శ్రీరంగనాథుని ఆస్థాన మంటపము నిండుసభ.

కాలక్షేపము చేసినవారు : శ్రీ మణవాళ మహామునులు.

వినినవారు : శ్రీ రంగనాథ భట్టార్యుడు, భగవంతుని నిజపరివారమంతయు, నిత్యసూరులు, ఉత్తమ నంబి, సభాసదులు.

కాలపరిమితి : ఒక సంవత్సరముపాటు.

**తనియ చదువు సందర్భము :**

ఉత్తర శాంతి నిమిత్తముగా శ్రీరంగనాథుడు తొంటి చందంబున సభ దీర్చియుండెను. అగ్గురుశిఖామణి విషయంబుగా నొక తనియ విన్నవించవలెనని శ్రీ రంగనాథ భట్టార్యుండును, ఉత్తమ నంబియు దలంచిరి. వారి బుద్ధియందు శ్రీశైలేత్యాది శ్లోకంబు దోచెను. వారది వచించుటకు ముందు అజ్ఞాత కుల గోత్రుండైన యొక 5 సం॥ల వైష్ణవబాలకుండొకడు వచ్చి హరిపురోభాగంబున, సౌమ్య జామాతృమునుల కభిముఖంగా నిలిచి పాణిపల్లవముల ముకుళించి—

శ్లో॥ "శ్రీశైలేశ దయాపాత్రం, ధీభక్త్యాది గుణార్ణవం।
యతీంద్రప్రవణం వందే, రమ్య జామాతరం మునిమ్॥"

అనుచు సమాక్షరపాదబద్ధంబైన యా పద్యంబందఱు విన మేఘ గంభీర స్వనంబుతో బలికి యాక్షణంబ యంతర్హితుండయ్యెను. అందఱతడు శ్రీ మన్నారాయణుడనియే తలంచిరి. అపుడు "శ్రీరంగ భర్తయు" నర్చారూపంబునేన యీ పద్యము వచించితినని తెలుపుచు, దీనిని దివ్యప్రబంధాధ్యయ నాధ్యాపనానుసంధానాది కాలంబులందు ముందుగా ననుసంధింపదగునని యాజ్ఞాపించెను.

ఇతర సంఘటనలు : ఒక సందర్భమున నొక ముముక్షుచేతనుడు ఉత్తర దివ్య దేశముల దర్శించి, తన స్వప్నములో బదరీనారాయణుని హితముపదేశింపుమన నా దేవుడు "శ్రీశైలేశ్యాది" పద్యం బతనికి చెప్పెను. అంతనా భక్తుడు తత్కర్తను వెదకుచు శ్రీరంగము చేరుకొని, వరవరయోగీంద్రుని గాంచి, ప్రణామంబాచరించి ఆశ్రయించెను.

**మణవాళమహామునుల రచనలు, వ్యాఖ్యానములు :**

1. శ్రీ వచన భూషణ వ్యాఖ్య 2. ప్రపన్న సావిత్రి వ్యాఖ్య 3. అరుళాళ ముని ప్రణీత జ్ఞానసార వ్యాఖ్య 4. తత్త్వత్రయ రహస్యత్రయ వ్యాఖ్య 5. ముప్పత్తారాయిరప్పడికి, ప్రమాణ తిరట్టు-భగవద్గీతలకు వ్యాఖ్య-తాత్పర్యము. 6. ఉదయవరుల నిత్యంబునకు సులభమైన ఆరాధన క్రమము 7. ఉపదేశ రత్న మాల (తమిళము) 8. తిరువాయిమొళి నూత్తందాది 10. యతిరాజ వింశతి 11. తనియలు మొదలగునవి.

**పంచమోల్లాస భాగములోని అంశములు :**

మణవాళ మహామునుల చరిత్ర కొనసాగును. పిమ్మట అళ్వారాదుల జన్మ స్థల ప్రబంధాదులు తెలుపబడును.

1) వంటశాల "తిరుమడపళ్ళి" పనుల రీతుల పర్యవేక్షణముగూడ జేయువారు.

2) వరుందరుం బెరుమాళ్ళ బియ్యరుకు ప్రసాదించిన విషయములు వైష్ణవాచారము, శ్రీవైష్ణవలక్షణత్వము :

48 పంక్తుల వివరణము గలదు. పుటలు : 525, 516.

3) మణవాళమహామునులు శ్రీ వేంకటాద్రి, కాంచీ ముఖ్య దివ్యదేశ యాత్రలు సేయుట : పుటలు 517 - 528 వరకు.

I. శ్రీరంగమునుండి బయలుదేరుట - ఎన్నియో వర్ణనలు, విపులముగా; ప్రదేశములు గలవు.

II. తిరుగు ప్రయాణము శ్రీరంగమును జేరుట - ఎన్నియో విశేషాంశములు గలవు.

4) ఆశ్రయించిన వారనేకులు.

5) **అష్టదిగ్గజములు** :

1) వానమామల జియ్యరు
2) పార్మంగ తిరువేంగడ ముని
3) పరవస్తు పట్టరపిరాన్ జియ్యరు
4) కోవెల కందాడయణ్ణన్
5) ప్రతివాదభయంకరమణ్ణన్
6 ఇరుంబియప్పా
7) అప్పిళ్లై
8) అప్పిళ్ళారు

**మహా దేశికులు** :

1. తిరుమల ఎంబెరుమానారు జియ్యరు 2. ఏట్టూరి సింగరాచార్యులు 3. ఇతరులు

ఇట్లు అష్టదిగ్గజములు, మహాదేశికులచే ననవరత పరిషేవ్యమాన చరణారవిందుండై నిజ మందిరంబున విలసిల్లుచుండిరి.

6. మణవాళ మహాముసులు మఠ నిర్వహణమును గూర్చి కొందరికి తగిన విధు లప్పగించెను.

7. పిమ్మట పరమ పదమునకేగ నిశ్చయించుకొనిరి.

8. ఇచట చరమ శ్లోకము గలదు.

9. పిమ్మట తిరువధ్యయనోత్సవము గలదు.

10. పౌత్రుడగు జియ్యరునయనారు మామునుల బాధ్యతను స్వీకరించిరి.

11. ఆచార్యాభిమానైక నిష్ఠులగు ఆశ్రితులందఱును తమ పుత్రులకు, శిష్యులకు ''మణవాళ మహాముని తిరువడిగళే శరణ''మని నమ్మియుండుడని యుపదేశించిరి. మణవాళ మహాముని గోత్రమునే పెట్టుకొనిరి.

**అదనపు విషయములు :** ఈ యుల్లాసములో భూగోళ, ఖగోళాది విషయ వివరణ గలదు. ముఖ్య దివ్యదేశముల పేర్లు గలవు.

ఆళ్వారాదుల జన్మస్థల వంశ ప్రబంధాదుల శీర్షిక క్రింద 29 తనియలు గలవు. పిమ్మట మఠాధిపత్యముల వివరణ గలదు.

ఆశ్వాసాంత పద్యము-కథా **సూచనము:**

"కాంతోపయంతృ గురురా
ట్స్వాంతోల్లసదబ్జ పూజ్య చరణ సరోజా!
సంతత సంశ్రిత చేతన
సంతోషకరా! యతీంద్ర సంయమిచంద్రా!"

## ఉత్తరభాగము - షష్ఠోల్లాసము :

ఇందు సీసములు = 49, తే.గీ = 13, ఆ.వె = 13,
కందములు = 32, శార్దూలములు = 24, మత్తేభములు = 25,
మాలిని = 1, ఇతర విశేష వృత్తములు = 5, వచనములు = 46-766
గద్యాంశములు = 7, తనియలు = 8 గలవు.

ఇందులోని ప్రధాన కథాంశములు :

1. వేదాంత దేశికుల వైభవము పుటలు 556-592 = 36
2. నయనారు దేశికుల వైభవము పుటలు 592-596 = 5
3. ప్రతివాది భయంకరం అణ్ణంగారి వైభవము = 596-620 = 25
4. గ్రంథకర్తృ వృత్తాంతము = 620-624 = 4

**షష్ఠోల్లాసము యొక్క ప్రత్యేకత :**

ఆ.సూ.ము. 624 పుటలు గల మహాగ్రంథము 554 పుటల వరకు పూర్వభాగ ప్రథమోల్లాసము నుండి క్రమముగా ఉత్తరభాగము పంచమోల్లాసము వరకు గల జీవిత చరిత్రల విశేషములు గల కథాభాగమంతయు కృతిభర్త

ఇక ఉత్తర భాగములోని చివరిదైన ఆశ్వాసము, షష్ఠోల్లాసమొక్కటి పూర్వోక్తోల్లాసముల వలె గాక 142 వృత్తములను, 49 సీసపద్యములను గల్గియున్న రచన ఇదిగాక విశేషచ్ఛందముల ప్రయోగములును గలది. ఇప్పటివరకు సీసపద్యములను చదివి, చదివి అలసిపోయిన వారు ఇప్పుడీ వృత్తముల క్రొత్తందనమును జూచి ఆనందించుట కవకాశమున్నది గదా! కవి యీ విషయము నూహించి యిట్లు ప్రతిజ్ఞ చేసినట్లుగా వాకొనుచున్నాడు.

"అదర మొప్ప నాదు రసనాగ్రశుభాసన మధ్యవర్తియౌ
వాది భయంకరార్యు డనవద్యకృపాతిశయంబుచేనికన్
మీదటి గ్రంథమంత రసమ్పృష్ట పదాక్షర వృత్తపద్య స
మ్మేదుర భావమొందుగతి మేలుదయింప రచించు నింపుగాన్."

ఈ పద్యము నన్నయగారి అక్షరరమ్యతను స్ఫురింపజేయుచున్నది. ఈ భాగమంతయు రసమ్పృష్ట పదాక్షర వృత్తపద్యములతో కూడుకొనియుండును. అట్లు రచించెదనని కవి ఆశయము.

ఇదియునుగాక, కృతివక్త పూర్వీకుడును, 'ప్రతివాది భయంకర' బిరుదస్థాపకుడునగు మొట్టమొదటి అణ్ణంగారి వైభవము నీ ప్రకరణములో జేర్చుట గమనార్హము.

## వేదాంతదేశికుల వైభవము

**వేదాంతదేశికుల జన్మాదిక విశేషములు :**

చారిత్రక కాలము — 1268 — 14-11-1369 క్రీ. శ.

స్థలము : సత్యవ్రతక్షేత్ర మనబడు కాంచీపురము.

జన్మ : తిరునక్షత్ర తనియ గలదు. పద్యముగూడ గలదు. పుట. 565.

భాద్రపద మాసము - సోమవారము.

వృశ్చిక - కృత్తికానక్షత్రము.

(విభవనామ సం॥ము 1268 A.D. పురట్టాశి నెల, శ్రవణానక్షత్రమున 'తూప్పిల్' అను దివ్య దేశమందు జన్మించిరి. దయాశతక పీఠిలో గలదు. T.T.D. ప్రచురణ 1982).

అంశ : శ్రీ వేంకటేశుని ద్వారమునకు గల ఘంట. "ఘంటకోద్భాసిత మూర్తి". శ్రీవేంకటేశావతారము. శ్రీరామానుజ పర్యాయావతారము అనంతసూరి

భగవంతుని స్తుతించుట 9 పద్యములలో వర్ణింపబడినది. తోతారమ్మకు శ్రీ వేంక టేశుడు బాలక వేషములో కనబడి సంతానమున కనుగ్రహించెను.

వంశవృత్తాంతము :

వడమకులము, తూప్పిల్కుడియును, విశ్వామిత్ర గోత్రంబును, అపస్తంబ సూత్రము, యజుశ్శాఖ విప్రుండునగు:

పుండరీక దీక్షితుడు : ఇతని కుమారుడు అనంతసూరి.

అనంతసూరి (ఇతని భార్య తోతారమ్మ) తల్లి గర్భమున 12 సం॥లుండి వేదాంతదేశికులు జన్మించిరి.

జాతకాదికర్మలు : వైదిక కర్మలన్నింటిని వయోనుగుణ్యముగా తండ్రి జరిపించిరి.

విద్యాభ్యాసము : తండ్రికడ వేదవేదాంగములు నిత్యసూరి భోగ్యనిత్యాను సంధానముల పఠించెను. మేనమామకడ నాలాయిర ప్రబంధంబులు, తద్వ్యాఖ్యా నంబులు, వేదాంత రహస్యంబులు, వైశ్యదేవక్రమము, చరమపర్వనిష్ఠ, శరణాగతి, కాణాదపాణినీయ పాతంజల పూర్వోత్తర మీమాంసాది సమస్త శాస్త్రంబులు, మరియు తక్కిన విద్యలన్నింటిని 20 ఏండ్ల వయస్సులోపుగనే నేర్చెను.

ఆచార్యుడు : మేనమామ యగు : ఆత్రేయ పద్మనాభాచార్యుడు. (వీరినే కిడాంబియప్పిళ్ళాన్, ఆత్రేయ రామానుజాచార్యులందురు.)

తిరువారాధన విగ్రహము: శ్రీ హయగ్రీవమూర్తి, శ్రీరంగరాజు.

సాక్షాత్కారము : శ్రీ పాణియోగీంద్రుడు, హయగ్రీవోపాసనయు, వైన తేయ సాక్షాత్కారమును గలిగియున్నవాడు.

వీరి సంతానము : కరిగిరినాథుని వరప్రసాదమువల్ల నయనారు దేశికులు జన్మించిరి.

ఆధిపత్యము : శ్రీభాష్యసింహాసనాధిపత్యము.

ఆచారశాఖ : వడగల యాచారపరులకు కూటస్థుడు.

బిరుదులు : అనేకములు - సర్వతంత్రస్వతంత్రుడు.

తిరునామములు : అనేకములు. మొత్తము 21 వరకు గలవు.

1. వేంకటాదార్యుడు, 2. తిరువేంగడత్తాన్, 3. వేంగడత్తురవరు 4. తిరువేంగడముడయాను, 5. ఘంటావతారస్వామి 6, దూప్పిల్‌పిళ్ళ 7. వేంకటనాథుడు, 8. కవితార్కిక సింహుడు, 9. సర్వతంత్రస్వతంత్రుడు, 10. వేదాంతాచార్యుడు, 11. నిగమాంతాచార్యుడు, 12. నిగమాంతదేశికుడు, 13. వేదాంతదేశికుడు, 14. శ్రుతిశేఖరాచార్యుడు, 15. శ్రుత్యంచలగురుడు, 16. నిగమమకుటసూరి, 17. ఆమ్నాయమకుటాచార్యుడు, 18. ఆమ్నాయ మౌళీంద్రుడు, 19. శతఘంటాకవిసురత్రాణి, 20 ఘటికాసహస్రసురత్రాణి, 21. ఘటికాసహస్రకవీంద్రుడు.

వేదాంత దేశికుల శిష్యవర్గము : అనేకులు. 15 వరకు ఈ గ్రంథములో పేర్లు గలవు. 1. కుమారుడగు నయనారుదేశికులు, 2. బ్రహ్మతంత్రజియ్యరు. మొదలగువారు.

వేదాంతదేశికుల రచనలు : పరశ్శతములు, పరస్సహస్రములు. ముఖ్య గ్రంథములు కొన్ని : "పరశ్శతంవాపి, వరస్సహస్రం శ్రీవేంకటాచార్యకృతాః" అన్నట్లనేకములున్నను కొన్నింటిని పేర్కొందును.

'గమనిక : సంస్కృత గ్రంథములును, తమిళ గ్రంథములును గలవు. ఈ గ్రంథములో విశ్లేషణ ప్రకారము పేర్ల పట్టిక లేదు. 100 కి పైగా పేర్లు గలవు.'

1. శ్రీరహస్యత్రయ సారము 2. రహస్య పదవి 3. తత్త్వ పదవి 4. రహస్యత్రయ చుళుకము 5. రహస్యమాతృక 6. తత్త్వమాతృక 7. తిరుచ్చిన్నమాల 8. అణుపత్తు 9. హస్తిగిరి మహాత్మ్యము 10. అధికార సంగ్రహ పాట్టు 11. అధికార సంగ్రహ శ్లోకము 12. ముప్పది రెండు రహస్యములు - మొదలగునవి.

**సమకాలికులు :** చారిత్రక ప్రసిద్ధిగన్న శ్రీవిద్యారణ్యుడు. సహపాఠి వేదాంత దేశికులకు ధనమిప్పించుటకై రాజదూతలను బంపెను. అంతట దేశికులవారు కనకధారాస్తవమును జేసి ధనరాసుల నాతనికే పంపించెను. ఇట్లు విద్యారణ్యుడు దేశికులను హరిగా దలంచెను.

1 ఒక రోగికి స్వపాద తీర్థమొసగి బాగుచేసెను.

2. విజయ ధ్వజస్తంభముపై తన సర్వతంత్ర స్వతంత్ర బిరుదు లిఖియించెను.

3. ద్రవ్యార్జనంబుకై రాజదర్శనము సేయనొల్లడు.

పలువురు విద్వాంసులను జయించి వైష్ణవులనుగా నొనర్చిరి :

1. సోమేశ్వర భట్టారకుడు.

2. కాశీ వాగ్విజయ భట్టారకుడు, ఇతరులు.

వీరి వాదనావటిమ నైపుణ్యములు చక్కగా వర్ణింపబడినవి.

**పర్యటనలు; యాత్రలు :** కంచి నుండి ప్రారంభము.

1. కరిగిరి వరదుని యనుమతిని బడసి, యాదవాచల సంపత్కుమారుని దర్శించుకొని, అచటి పండితులను జయించి, విజయ స్తంభములు నాటించెను.

2. శ్రీరంగధామము చేరుకొని శ్రీరంగేశుని బహు విధముల స్తుతించెను. 7 విశేష వృత్తములలో స్తోత్ర వైభవము వర్ణింపబడినది. పుట 571 ఉదా॥ ఒకటి భుజంగ ప్రయాత వృత్తము :

"మహాయోగి హృత్పద్మ మంతవ్యమూర్తి
మహిన్నిన్ను గన్గొన్న మర్త్యుండు ధన్యుం
డహోరాత్రముల్ నీ శుభాంగంబుఁ దల్చున్
రహిన్ వాడు మైమాని రంగాని నొందున్." (84)

3. తిరిగి కంచికి చేరుకొనెను.

**కొన్ని విశేషములు :** వేదాంత దేశికుల గొప్పదనమును జూచి కొందఱు వైష్ణవులు ఈర్ష్యచే ఆతని తండ్రి తిరువధ్యయనమునకు స్వాములుగా రాలేదు. అపుడు దేశికులు ఇష్ట దైవముల ధ్యానించిరి. స్వాములుగా 1. హయగ్రీవులు 2. యతీంద్రులు 3. శఠారులు విచ్చేసిరి.

**మరల యాత్రలు చేసిన విధము :** కంచి నుండి శ్రీరంగమునకు.

4. కంచి నుండి బయలుదేరి శ్రీరంగమును చేరి శ్రీరంగని సేవించుకొనెను. అపుడితడు తరుణవయస్కుడు.

కొనెను. తిరుచ్చానూరు అను దివ్య దేశము, శుక్రాశ్రమంబున పద్మ పుష్కరిణి గలదు.

ఇట్లు సేవించుకొనుచు క్రమముగా "మలయప్పని" దర్శించి, శ్రీ వెంకటేశునిగాంచి వినుతి నలిపి, తిరిగి "మలయప్ప" కల్యాణ మండపమున కేతించెను. అపుడు "మలయప్పడు" ఒడ్డోలగంబున నుండి బుధులు మెచ్చుకొనగా వేదాంత దేశికులకు బహుమతి సేయించి ఇట్లు పలికెను: (పుట - 582 )

"జీర్ణ శ్రుత ప్రకాశిక నుద్ధరించితివని చాల
నాహ్లాదమంది యిప్పు
డనఘ శ్రీభాష్యసింహాసనాధిపతిత్వ
మిచ్చితిమదిగాన యింక మీద
ధరణి భాష్య ప్రవర్త కుడవు గమ్మని
యతనిపై నొక పద్యమానతిచ్చి"

చాల బహుమతినిచ్చి సాగబనుపెను. ఆ పద్యము : ఉభయ ప్రపన్నుల కాదరణీయమైన తనియ - భగవన్ముఖోదితము :

శ్లో॥ శ్రీమాన్ వేంకటనాథార్యః కవితార్కిక కేసరీ।
వేదాంతచార్య వర్యోమే, సన్నిధత్తాం సదాహృది॥

ప్రపన్న జనైక దేశ నిషేవ్యమైన తనియ - కాలమేఘయతి చెప్పినది:

(వేదాంత దేశికుని అవతార సమాప్త్యనంతరమున)

శ్లో॥ "రామానుజ దయపాత్రమ్ జ్ఞానవైరాగ్యభూషణం।
శ్రీమద్వేంకటనాథార్యం, వందే వేదాంత దేశికమ్॥

**తిరిగి కంచికి చేరుకొనుట :**

తిరుమల నుండి దిగి తిరువహీంద్ర పురమున కరిగిరి. అచటి దైవనాయకుని స్తుతించి తన చేతులతో నట నొక సరస్సును త్రవ్వెను. తులసీవనాదుల పెంపొందింప జేయించెను.

గ్రంథకర్త తెలిపిన అదనపు వృత్తాంతము :

# జీర్ణశ్రుతప్రకాశికోద్ధారణక్రమము

శ్రీ పరాశరభట్టరు తమ్ముఁడగు శ్రీరామపిళ్ళ కుమారుని పేరు వాగ్విజయ భట్టారకుడు. ఇతని కుమారుని పేరే సుదర్శనాచార్యులు. ఇతనికి శ్రుతప్రకాశికాచార్యులు, వేదవ్యాసభట్టారకులను తిరునామములు గలవు. ఇతడు సంస్కృతమున వ్రాసిన గ్రంథమే "శ్రుతప్రకాశిక." శ్రీభాష్యమునకు షట్త్రింశద్గ్రంథ బంధురంబగు వ్యాఖ్యానమిది.

గ్రంథము జీర్ణమైన విధము : ఇతడు మొదట దీనిని పట్టుటాకులపై లిఖియించెను. తిరిగి తీర్చిదిద్ది వ్రాయుదమనుకొన్నవేళ అకస్మాత్తుగా నొక దుర్ఘటన జరిగినది. ఏమన—

యవన తురుష్కాదిబలములు శ్రీరంగమును ముట్టడించినవి. ఈ గ్రంథము నితని తల్లి యింటి లోపల ఎట్లో జాగ్రత్తగా భద్రపరచినది. ఈ దాడిలో శ్రీరంగనాథుడు 12000 మంది భాగవతులకు పరమపదమిచ్చెను. అపుడు శ్రీ వేంకటేశార్యులు అభీతిస్తవమొనర్పగా పరమాత్ముడు తురుష్కులతో "నిరపరాధుల, దాసరి బావల జంప నేమి ఫల"మని తెలుప, వారు శ్రీ బాలవృద్ధుల వదలివేసిరి.

పిమ్మట కొన్ని దినములకు సుదర్శనభట్టాచార్యుల తల్లి వేదాంత దేశికులను పిలిచి, తన పౌత్రుడు వేదాచార్య భట్టారకుని నాతని కప్పగించి "మా యింటి కడకువచ్చి శ్రీభాష్య వ్యాఖ్యానము సుష్ఠుపరచి వృద్ధి బొందింపుము, ఈ బాలునకు శ్రీభాష్య మీవె నుడువు"మనెను. సరే యని శ్రీ వేదాంతదేశికులు తాను వ్రాయు టీకకు ఆ వ్యాఖ్యానమునే గ్రహించి, ప్రామాదికంబుల పరిహరించి, చాల విమర్శించి "వేదాచార్య భట్టరు" కెరింగించెను. అతని ద్వారా అతని పుత్రాదులకు, శిష్యాళికా వ్యాఖ్య వ్యాప్తియయ్యెను. గాన వాది భీకర గురునితో శ్రీ భాష్య సంగతి జరుగలేదు.

ఇట్లు వేదాంత దేశికులకు "శ్రీ భాష్య సింహాసనాధిపత్య" మమరెను.

సవాలు విసిరెను. దేశికులవారు వాని సవాలు నెదుర్కొని పంతమునకు రమ్మనెను. చివరకు దేశికులవారే గెలిచిరి.

ఇచట మంత్ర శక్తులు, పరస్పర ప్రయోగములు 25 పద్యములలో విపులముగా వర్ణింపబడినవి పాములు బుస కొట్టినట్లుగా, సైనికుల యార్భాటము వలె, యుద్ధమువలె పద్యముల నడకసాగినది. (పుటలు 584 నుండి 588 వరకు.)

ఉదా॥ సుగంధి వృత్తము : 168 వ పద్యము.

''మాయదారి యైనవాని మంత్రశక్తి పాములా
ప్యాయనంబు జెంది, యమ్మహాత్ము సగ్గురూద్వహాన్
డాయలేక పుత్రిక్రియా విడంబ మాత్ర మొంద, వా
డాయెడన్ స్వశక్తి జూపి యార్యమౌళి కోడియున్.''

**పుత్రోదయము :**

కంచికి చేరుకున్న పిమ్మట కరిగిరీశుని వరప్రసాదమున దేశికునకు పుత్రుడుదయించెను. అతని పేరే నయనారు దేశికులు. వరదాచార్యులనియు తిరు నామము గలదు.

**పాదుకాసహస్ర రచనము : సంఘటనము :**

వేదాంత దేశికులపుడు శ్రీరంగమునకు రాగా, అచటనున్న జగదార్యు డాతని రంగనిసన్నిధిలో బలుకరించెను. "శౌర్యాంఘ్రిమాహాత్మ్యమును వ్రాయుట కొఱకై" ఇరువురము భాగస్వాములమగుదమను ప్రస్తావన దెచ్చెను. ఇరువురును స్వయముగా చేరి సగము పద్యముల వ్రాయుటకు నిర్ణయించుకొనిరి. కాలవ్యవధి ఒక రోజు గలదు. జగదార్యులు ప్రభాతమున మేల్కాంచి 500 పద్యముల వ్రాసెను. ఇపుడు వేదాంత దేశికులకు రాత్రిపూట వ్రాయు వంతు గలదు. కాని అతడు ఆలయములో నిద్దురజెందగా రంగశౌరి అతనిని నిదురనుండి మేల్కొలిపి మిగతా శ్లోకములను వ్రాయించెను. ఇట్లు మూడుమ్ముక్కాలు గడియలో పాదుకా సహస్రము సంపూర్తి యయ్యెను.

**గొప్పతనము - మధ్యవర్తిత్వము :**

ఒకమారు అక్షోభ్యమునులకు, విద్యారణ్యులకు "తత్త్వమసి" ఇత్యాద్యు పనిషత్ వాక్యములయెడ అభిప్రాయ భేదములు రాగా ఇతడు మధ్యవర్తి త్వమును వహించి సముచితమైన తీర్పు నిచ్చిరి.

**పాదుకల సంఘటన :**

ఒకప్పుడు కొందఱు సూయాపరులగు వైష్ణవులు రాత్రిపూట అతని యింటి ద్వారతోరణముగా చెప్పులు వ్రేలాడదీసిరి. అతడింటిలో ప్రవేశించునపుడవి తలకు తగుల నాతడీ క్రింది శ్లోకమును జదివెను. క్షమాసారగుణమునకిదితార్కాణము. పత్రికలలో గూడ ఉదాహరణముగా కొటేషనులలో (" ") వాడుకొనుచున్నారీ శ్లోకమును. చూడుడు 432 పుట. ఇదే వరుస.

"కర్మావలంబకాః కేచిత్, కేచిత్ జ్ఞానావలంబకాః।
వయన్తు హరిదాసానాం, పాదరక్షావలంబకాః॥"

**అవతార సమాప్తి :**

ఇట్లత్యంత వైభవముతో శిష్యాళికి ఉభయవేదాంత సంప్రదాయ రహస్యముల బోధించుచు జీవితమును కొనసాగించి, 102 సంవత్సరములు జీవించి తిరిగి శ్రీవేంకటేశ ఘంటా స్వరూపుండాయెను.

## శ్రీ నయనారు దేశికుల ప్రభావము

జననము : **11-8-1316 క్రీ.శ.**

ఈ గ్రంథమందితని జీవిత చరిత్ర అతిసంగ్రహముగ నున్నది. వేదాంత దేశికుల కుమారుడు. ఇతనికి హస్తిగిరీశుడు, వరదార్యుడు, నయనాచార్యుండని తిరునామములు గలవు. తండ్రియే సకల రహస్యముల నుపదేశించెను. హయగ్రీవ ప్రసాదలబ్ధ పయఃఫేన రూపామృతమును గ్రోలుటకతన నిరతిశయ, నిర్మలజ్ఞాన పరిపూర్ణుండయ్యెను.

చతుష్షష్టి కళాప్రవీణుడితడు. నానా దేశముల పర్యటించి పండితుల జయించెను. ప్రళయకాల ఝంఝామారుతాచార్యులని ప్రసిద్ధి గాంచెను దర్శన ప్రవర్తకుండై యున్న సమయంబున ఇతని ఆస్థానమున అష్టదిగ్గజములు, దేశికేంద్రులును విరాజమానులై యొప్పువారు.

శిష్యునకు బిరుదు : నయనాచార్యులు తన వృద్ధాప్యమున తనతో వాదించుటకు వచ్చిన నరసింహ మిశ్రుడను అద్వైతితో వాదించుటకు "ముడుంబనంబి - వత్సవంశమునకు" జెందిన అణ్ణగారిని పంపెను. అణ్ణంగారు వాదములో జయించి గురువునకు ప్రణామముజేయ, నతడు "ప్రతివాద్ధి భయంకరమణ్ణనే" యని సంబోధించెను. ఈ నామమే బిరుదురూపముగానుండి, ఇంటి పేరుగా స్థిరపడి, ఖావివంశము వారికందఱికిని వర్తించునట్టిదిగా సాగిపోయినది. 'ప్రతివాది భయంకరం' అను బిరుదు వీరికి సార్థకమయ్యెను. (మొదటి అణ్ణంగరాచార్యులకు.) గురు వీతనిని చిరకాలము దర్శన స్థాపకుండవై యుండుమని యనుగ్రహించిన

పిమ్మట పరమపదించెను. ఇట్లు నయనారాచార్యుని తిరువతార సమాప్త్యనంతరంబున కొంతకాలమునకు ప్ర. భ. అణ్ణంగారు శ్రీ మణవాళ మహామునుల నాశ్రయించిరి.

**నయనారు దేశికుల ఆస్థానములోని అష్టదిగ్గజములు :**

1. ప్ర.భ. అణ్ణన్ 2. పెరియ కందాడప్ప 3. ఎంబెరు మానారప్పన్ 4. పెరియశుద్ధ సత్త్వమణ్ణన్ 5. జియ్యర్ నైనారంతప్పన్ 6. పాళిపాక్కనయనార్ 7. కందాడప్ప 8 నిరుంబి కందాడ యణ్ణన్.

**ఇతర దేశికులు :** 9. పెరియ యతిరాజ జియ్యరు 10. కోవిలకహియ మణవాళదాసరు 11. పుల్లాణి రామానుజదాసర్ 12. తిరునగరి శఠకోపదాసరు 13. కణ్ణియమార్ తిరువేంగడదాసర్ 14. తిర్కకోటియూరు వకుళాభరనీదాసరు 15. మాలిరుంజోలె యతిరాజదాసర్.

## ప్రతివాది భయంకరం అణ్ణంగారి వైభవము

ఇందు పుటల సంఖ్య = 23, సీసములు = 10, ఇతలములు = 45, విశేష వృత్తములు = 4, వచనములు = 10.98, గద్యాంశములు = 4, తనియ = 1 గలవు.

**జన్మాదిక విశేషములు :** ఈ గ్రంథములో ఇతని తిరునక్షత్ర తనియగాని, పద్యముగాని లేదు. నిత్యతనియ గలదు.

**తనియ :** "వేదాంతదేశిక కటాక్ష వివృద్ధబోధం,
కాంతోపయంతృయ మినః కరుణైక పాత్రమ్।
వత్సాన్వవాయ మనవద్య గుణైరుపేతం,
భక్త్యాభజామి పరవాది భయంకరార్యమ్॥"

**జీవితకాలము :** 15 వ శతాబ్దము క్రీ. శ. 1350 - 1450.

**వంశవిశేషములు :** రామానుజులు స్థాపించిన 74 ఆచార్య పీఠములలోని మొదటి ఆచార్యపురుషుడు - ముడుంబనంబి, వత్సవంశమునకు చెందినవాడు. పట్టిక వరుస సంఖ్య 17. ఈ వంశపరంపరకు చెందినవాడు ఈ యణ్ణంగారు. "ప్రతివాది భయంకరం లేదా వాదిభీకర'' బిరుదస్థాపకుడు. ఆ.సూ. ము. కృతి వక్తకు మూలపురుషుడు.

ఇతని మొదటి ఆచార్యుడు : వేదాంతదేశికుల కుమారుడగు నయనారు దేశికులు.

రెండవ ఆచార్యుడు : మణవాళ మహామునులు.

**అష్టదిగ్గజ సింహాసనాధిపత్యము :**

1. నయనాచార్యుల కడ, కంచిలో, 2. మణవాళ మహామునులు కడ శ్రీరంగములో.

ఈ గ్రంథములోని మణవాళమహామునుల చరిత్రలో గూడ ఇతనిని గూర్చిన కొన్ని విషయములు గలవు. మామును లొకమారు తనకు తోడుగా నుండుటకై దండిపండితునికై అన్వేషించుటకాలోచించి ఇతనిని గూర్చి విని, తనకడకు రప్పించుకొనెను. (450, 451 పుటలు.)

**కథాప్రారంభము, బిరుదు లభించిన తీరు :**

ఇతడు నయనారుదేశికపాదనళినయుగళ మాశ్రయించి అతనికడ అఖిల సచ్ఛాస్త్రముల నభ్యసించుచుండెను. 'కంచి' వీరి కేంద్రస్థానము. నయనారు దేశికుల వృద్ధాప్యదశలో నొకమారు 'నరసింహమిశ్రు'డను అద్వైతి ముఖ్యుడు వాదము సేయుటకు రాగా అణ్ణంగారు తానతనితో స్వయముగా వాదించుటకు గురు నాజ్ఞను బడసెను. "గెలుపు - ఓటమి"లకు వారొప్పందము చేసికొనిరి : "కాంచన పీఠంబుపై గల నృసింహ విగ్రహము ఎవరి కభిముఖంబైన వారు గెలిచినట్లు.''

అణ్ణంగారు నారాయణుండే పరమ తత్త్వంబని సప్రమాణముగా నిరూపింప విగ్రహంబాతని కభిముఖంబాయెను. ఇట్లు జయించి, విగ్రహమును బడసి 'నయనాచార్యులకు' నమస్కరింప నాతడు ''ప్రతివాది భయంకరమణ్ణనే''యని సంబోధించి దర్శన స్థాపకుండవై యుండుమని నియమించెను. తదాదిగా వీరి సంతానపరంపరకీ బిరుదు ఇంటిపేరగుచు వచ్చినది.

అణ్ణంగారు నయనాచార్యుల తిరువవతార సమాప్త్యనంతరము శ్రీరంగ మునకేగి మణవాళ మామునుల నాశ్రయించెను. తత్సన్నిధిని ముప్పత్తారాయి రప్పడి మొదలుగా గల స్వరూప గ్రంథము లన్నియు నధికరించెను. తిరువారాధనకై ''వీధియూరవరవా"రను తిరునామంబు గల బాలగోపాల విగ్రహమును బడసి కొంత కాలము శ్రీరంగమందుండి పిమ్మట కంచి కేతెంచి, నిజ మందిరములో ఉభయ వేదాంత కాలక్షేపము సేయుచుండెను.

**కథా గమనము : కథా సంవిధానము :**

స్వప్న సాక్షాత్కారము : శ్రీ వేంకటాచలనాథుని యాదేశము

ఇట్లు కాలక్షేపము సేయుచున్న సందర్భమున, నొక నాటి రాత్రి ఇతని స్వప్నములో శ్రీ వేంకటేశుడు సాక్షాత్కరించి, శ్రీపురిలో నుండుటకై అభ్యర్థిం

చెను. ఇచటి వేంకటేశుని వర్ణన పోతనగారి "మెఱపు చెంగట నున్న...." అను పద్యమును స్ఫురింపజేయును. "అంజనపుంజమో, హరినీల శైలమో యనజాలు నీలకయంబువాడు" అనునది.

**తిరుపతికి ప్రయాణము : పుటలు 597-606.**

అణ్ణంగారు శ్రీ వేంకటేశుని యాజ్ఞను పాలించుటకై సకుటుంబముగా కంచి నుండి తిరుమలకు బయలుదేరెను. ప్రయాణము సాగిన తీరు - వర్ణనలు ఎన్నియో గలవు.

1. మార్గ మధ్యమునందలి దృశ్యములు, దివ్య దేశ స్థల వర్ణనాంశములు కడుంగడు రమణీయములు. ప్రాచీన ప్రబంధ కావ్య భాషా శైలి, వాల్మీకి చరిత్ర ననుసరించినాడు.

2. వేంకటాద్రిని చేరిన పిమ్మట శ్రీ వేంకటేశుని దర్శించుకొనునంతవరకు వింతలు, విశేషములు, స్తుతులు, స్వాగతములు అతి విపులముగా వరుస క్రమ పద్ధతిలో వివరించబడినవి.

ఈ పద్యములన్నియు భక్తులకు యాత్రా దర్శినివలె నుపయోగపడును. అంజనాద్రీశుని యాజ్ఞచే కోవెల యధికారులితనికి ఘనముగా స్వాగత సన్మానముల, ఊరేగింపుల జరిపించిరి.

శ్రీ వేంకటేశుని భండార స్థల వర్ణనము, వంటకముల వర్ణన విపులముగా నున్నది.

అణ్ణంగారు శ్రీ వేంకటేశుని సేవించుకొని, మంగళాశాసనముల జేసి బహూకృతుండై కొండ దిగెను. వర్ణన గలదు.

**కొండదిగిన పిమ్మట :**

వేంకటగిరి డిగ్గి గోవిందరాజుల కోవెల సన్నిధిలో నివాస మేర్పరచుకొని, ఆ వసతిలో తదీయారాధన సేయుచు, వేదాంత యుగమును సంశ్రితులకు బోధించుచు, రెండు గ్రామములను అగ్రహారములుగా బడసెను. ఇచటనే కొన్ని రచనల చేసెను.

రచనలు : 1) అష్టశ్లోకి వ్యాఖ్యానము
2) వృద్ధి స్తవము
3) సుప్రభాత స్తవము

4) మంగళాశాసన ప్రబంధము

5) జియ్యరుపడి ననుసరించిన తిరువారాధన క్రమము

**వేదాంత కాలక్షేపములలోని ముఖ్య విషయములు : 607 - 618 పుటలు.**

అచటి దాసుల ప్రార్థనము ననుసరించి ఈ క్రింది విషయములపై అతి విపులముగా ప్రామాణికముగా నుపన్యసించెను.

1) ఏకాదశీ నిర్ణయము

2) శ్రీ జయంతీ నిర్ణయక్రమము

3) ధనుర్మాస హరిపూజా విధానము

4. ఆచార్య జన్మనక్షత్ర నిర్ణయము

5. మణవాళ మహాములు రామానుజాపరావతారమని నిరూపించుట.

**వాదిభీకరగురుని భాగవత భక్తి:**

నిరుపమానమని చిన్ని దృష్టాంతమిట వర్ణింపబడినది.

ధనుర్మాస సందర్భమున నిత్యము వాదిభీకరగురుడు నిఖిల భాగవతార్చన సేయుచుండ వైదేశిక వైష్ణవుడొకనా డతని యింటిలో ప్రవేశించి వేత్రముపై వ్రేలాడుచున్న "అణ్ణగారి దోవతి"ని (అతని దోవతిని) గట్టుకొనెను. అణ్ణంగా రిదేమని ఆ వైష్ణవుని ప్రశ్నింప నాతడు,'' అణ్ణగారి యింటికవని వైష్ణవులంద రాఢ్యులగు'' ననెను. అపుడు అణ్ణగారిట్లనిరి:

"అవచారపడితిననఘా, కృపసేయుమటంచు మ్రొక్కి. కృతివరుడార్యుం
డుపచారమొదవి యాతని-నపరిశ్రమజేసి భోజనాదులదనిపెన్.''

ఇతని జీవితచరిత్ర ముగింపు - ఆ.సూ.ము. గ్రంథకథావస్తు వైభవముల ముగింపు:

ఈ యుల్లాసమే చివరిది. ఆళ్వారుల, ఆచార్యుల జీవితవైభవములు కవి వ్రాయదలచుకొన్న విధముగా సంపూర్తియైనవి. చిట్టచివరి పద్యమది. (కృతిభర్త పద్యములు దీని తర్వాత గలవు.)

"వరగుణరత్నవార్ధియగు వాదిభయంకరదేశికేంద్రుడా
కరణిశతాబ్దముల్ గడచి, కారుణికుడగుటన్ సుతాదులం
దురు నిజతేజమాశ్రిత జనోద్ధరణంబున కుంచి యంత సుం
దరవర యోగిరాజ పదతామరసద్వయమొందె భక్తితోన్.''

**శ్రీమతే రామానుజాయ నమః.**

# కావ్యానుశీలనము

ఈ ప్రకరణములో 18 అంశములను చేర్చినాను. 1, 2, 3, 4, 15, 17, 18 అంశములు సాహిత్యవైభవోద్దేశ్యములను, విషయపరిచయములను, విమర్శనాదికములను ప్రదర్శించునవిగనుండును. మిగిలిన అంశములు ఆ. సూ. ము. లో గల వేదాంతాది వివిధ విశేషాంశములను తెలుపును. కావ్యలక్షణముల కనుగుణ్యముగనే అన్ని విషయములను స్పృశించినాను.

**కవి కావ్యము, దృక్కోణము, వివరణము :**

కవి విశిష్టాద్వైతుడు. గ్రంథమును అట్టిదే కథ ఇతిహాసప్రసిద్ధమే. "ఇతివృత్తంతు కావ్యస్య శరీరంపరికీర్తితమ్" అని భరతమతము. ఒక మతమున కంకితమైన కవి కావ్యమును విమర్శకుడు దేశకాల సాంఘిక పరిస్థితులు, కవి జీవితానుభవములను గమనించి పరిశీలించవలయును. అట్లని దోషముల సమర్థించుట ఒప్పుకాదు. సహృదయులు కావ్యజీవితములో లీనమైపోవలయును. ఒక విషయమును అలంకారయుక్తముగా చెప్పి సిద్ధాంతస్థాపనమును జేయుట ఈ కవికి వెన్నతో బెట్టిన విద్యయే యగుచున్నది. కావ్య హృదయము నర్థము చేసికొనవలెనన్నచో అన్ని పద్యములను పలుమార్లు చదువవలయును. ఇచట మనకు కనబడునది మొదట పరమార్థదృష్టి. పిమ్మట సాహిత్యదృష్టి. ఆ పిమ్మట లోక కల్యాణదృష్టి, ఈ గ్రంథమున కాయువుపట్టు లివియే. ఒక విధముగా తత్త్వత్రయ భావన స్థాపనము. సమాజ శ్రేయస్సు.

**కవి చెప్పదలంచుతున్న విషయ వివరణా పద్ధతి -**
**కావ్య పరమార్థము లోక కళ్యాణమే :**

సందర్భమునుబట్టి అలంకారశోభితము గావించి గుండెలకు హత్తుకొనునట్లు సేయును. రసమృష్టపదాక్షర రచన కేవలము వృత్త పద్యములలోనే గాక సీస పద్యములలో గూడ గోచరించును. చెప్పు పద్ధతియు వరుసక్రమములో నుండును. ఉదా॥ **నమ్మాళ్వారుల స్తుతి :** (పుట. 72)

"భక్తిప్రభావ సంభావితాద్భుత భావ
బంధు సంధుక్షిత ప్రణయసార
రసమహౌఘ ప్రపూర్ణము, సద్వేదార్థ
రత్నాకరము, విష్ణు రమ్యపదము,
ద్రావిడ శ్రుతి సుధోత్పత్తి నిదానము
నుల్ల సత్ప్రి సదనేం దూదయంబు
శ్రీ వైష్ణవర్ధి లక్ష్మీ జన్మ హేతువు
సకలార్యనుత నదీ సంగమంబు,

నఖిల లోక హితోప దేశారవంబు
శ్రీ పరాంకుశ జలనిధి చేతనులకు
నిఖిల కల్యాణములనిచ్చు నిత్యమనుచు
వాది భీకర గురుడనె మోదమలర!"

రూపకాలంకారశోభితము. శ్రీ పరాంకుశ జలనిధి. దివ్యప్రబంధావతరణము అదియే ద్రావిడ వేదామృతము. దానిని గ్రోలవలయును. అదియే జనులకు హితము. లోక కళ్యాణప్రదమున్ను.

ఇట్లు పరిశీలించిన విషయములను. కావ్య విమర్శనాంశములను కొన్నింటిని పేర్కొందును. అవి శీర్షికల ప్రకారము మనవిచేసికొనుచున్నాను:- గ్రహించగలరు.

**'ఆచార్య సూక్తి ముక్తావళి' హృదయావిష్కరణము :**

(గ్రంథ సారాంశమనదగు సూక్తి పద్ధియములు)

శ్రీమాన్ నంబూరి కేశవాచార్యులవారు రచించిన ఆ.సూ.ము. యను మహా ప్రబంధములో, గ్రంథము పేరును సార్థకపరచునట్టివి, ప్రతిపాద్య కథావస్తువుల సమర్థించునట్టివి, అంతరార్థములు తెలుపునట్టివి, గ్రంథ లక్ష్యములకు పుష్టిని చేకూర్చునట్టివి, సూక్తిముక్తియములనదగు పద్యము లెన్నియో గలవు.

**కథావస్తువు - ఆశ్వాసాంత పద్యములు :**

కేవలము కథావస్తువును అవగతము చేసికొనదలచిన వారికి ఆశ్వాసాంత పద్యములు చాలును. ఇందు 24 ఉల్లాసముల పద్యములు గలవు. ఇవి కృతి కర్తను గూర్చి వ్రాయబడినవి. ఇందలి పద్యముల విశ్లేషించినచో ప్రతి ఉల్లాసములోని ఆశ్వాసాంత పద్యములలోని ఒక్క పద్యములో ఉల్లాసమునందలి కథా

వస్తువు గర్భితమై, సంక్షేపించబడి యుండును. ఉదాహరణమునకు - 4 వ ఆశ్వాసము 104 వ పుటలో **హృదయము వంటి పద్యము :**

[నమ్మాళ్వారుల, నాథమునుల, పుండరీకాక్షుల, ఆళవందారుల వైభవములు]

"శ్రీమత్కారి కుమార దివ్యపదరాజీవామృతాస్వాదనా!
కామక్రోధ విదూర! నాథముని ముఖ్యప్రీతి సంవర్ధనా!
స్వామిస్థిత పుండరీక నయనా! సన్మార్గ సంస్థాపనా!
రామార్యప్రియ! యామునేయ శరణా! రాజద్యతిప్రీణనా!
ఇది రామానుజుల స్తుతి పద్యము.

**గ్రంథాంతర్భాగ పద్యములు :**

మధ్యమభాగము ప్రథమోల్లాసములోని మొత్తము 21 పద్యములు గ్రంథమునకు హృదయభాగమువలె సంస్ఫుట మగుచున్నవి. రామానుజుల స్తుతి పద్యములివి. ఇట్లే గ్రంథమునంతయు వెదకిచూచినచో హృద్యమైన హృదయము వంటివైన పద్యరత్నములు గోచరించును.

నాకు తోచిన రీతిగా, ఈక్రింది పద్యములీ గ్రంథప్రశస్తికి ఆయువుపట్టు వంటివని, సార్థకాఖ్యగలవని మనవి చేయుచున్నాను. (పుట : 157)

**1. ఆచార్య పరంపర - సంస్మరణమును తెలుపునవి :**

"శ్రీ సఖజలధి సుస్థిరకృపా సలిలంబు
　　గ్రోలి శఠారాతి కాలఘనము
నాథమునీంద్రు డన్నగముపై వర్షింప
　　నది రామ పుండరీకాక్షులనెడు
ఝురముల యామునాచార్యమహానది
　　పూరించి పొరలి యిభ్భువి యతీంద్ర
పద్మాకరేంద్రంబు పరిపూర్ణ మొనరింప
　　దేశికాశ్రమములు దిశలయందు
ప్రాణి సస్యంబులన్నియు పసిమి మీఱ
చాల ప్రవహించుచున్నవి సరసులార!
నమ్మయాళ్వారి నెమ్మది నమ్ముడనుచు
వాదిభీకరగురుడనె మోదమలర!"
తాత్పర్యము : స్పష్టము.

**2. ఆచార్య సంసేవ—శ్రీవైష్ణవుని విధులు :**

"శ్రీభాష్య మాచార్యసేవచే పఠియించి
శిష్యముఖంబుగా జెప్పవలయు,
నది యొనర్ప నశక్తుడాయెనా శఠవైరి
శ్రీసూక్తులే విశ్వసింపవలయు,
నట్లు రంగాదులందమరి యా హరికి ప్ర
సిద్ధ కైంకర్యమే చేయవలయు
మంత్రరత్నార్థమే మననంబు సేయుచు
కలిగిన కాలంబు గడుపవలయు,
సతత వైష్ణవపూజలే సలుపవలయు
నొదిగి యదుగిరి చెంతల నుండవలయు
నేమమిది యని యతిపతి చెప్పెననుచు" (పుట : 158)

**3. జగదాచార్యుడు రామానుజులే—మనకు శరణాగతి అతడే మనదైవము :**

"సర్వభూతోద్ధర్త జగదేక గురువర్యు
లుడయవరే కాని యొరులుగారు
సత్యంబు సత్యంబు శపథించి పల్కెద
సందియంబులు మాని చెందు డితని
ననుచు బల్కిన విని నమ్మి యఖిలజనులు
నతని శిష్యప్రశిష్యుల నాశ్రయించి
ధన్యులైరా యతీంద్రుడే దైవమనుచు
వాది భీకర గురుడనె మోదమలర!"
(శ్రీరంగనాథుల చెంత నయనారు దేశికులు చేసిన ఉపన్యాసము.)

**4. చారు భవిష్యదాచార్యుడు :-**

**(రామానుజాచార్యులు కృతినాయకుడు - ఉభయ విభూతి)** (పుట : 155)

"భువినేగురుని తిరుముడి యన్వయము జెంది
పూర్వ దేశికులెల్ల ముక్తిగనిరి

'చారు భవిష్యదాచార్య' నెవ్వని తొల్లి
సాక్షాత్కరించెను శఠవిరోధి
యుభయ విభూతుల నొసగె నే సూరికి
దాస సమృద్ధికై శ్రీసఖుండు
ఇలను మత్కృతినాయకుడే ఘనుండు
అట్టి రామానుజాచార్యు లస్మదీయ
బుద్ధి గనిపించుగాక నేప్రొద్దుననుచు"

(పుట 167)

5. రామానుజుల శపథము (మహోద్యమ కార్యక్రమమునకు 'నాంది') :

"బ్రహ్మసూత్రములకు భాష్యంబు రచియించి
దెసల జాటించెద ధీరులలర!
వ్యాసపరాశర వరనామధేయుల
జేసెద నిరువుర సిరులు మెరయ!
కురుకా పురీశుని తిరునామ మొక్కరి
కొనరించి పిలిపింతు నూర్జితముగ
అనుచు లక్ష్మణముని యానతియిచ్చిన
యొక్కొకవార్త కొక్కొక వ్రేలు
సాచి యెప్పటియట్లుండ సకల జనులు"
(చూచిరి. తాత్పర్యము స్పష్టము)

6. రామానుజుల గోష్ఠి వైభవము : (పుట. 158)

"ఏడునూఱుల యతులేకాంగు లీరాఱు
వేలు, డెబ్బది నాల్గు పీఠపతులు
నాచార్యపూరుషు లఖిల వైష్ణవులును
శ్రీరంగమందున జెలగి కొలువ
గావి మడుంగులు గల మేనిపై ద్వాద
శోర్ధ్వపుండ్రద్యుతులుఓకి మెఱయ
వజ్ర దండత్రయ వ్యాఖ్యాన ముద్రల
నుభయ కరాబ్జముల్ ప్రభలుగుల్క

(ఇందు పరివారము సంఖ్య - యతిపతి ఆకృతి గలదు)

**రామానుజులకు ప్రణతి, ఆకృతి వర్ణన, జగద్ధిత భావన :** (పుట 623)

''స్వస్త్యస్తుతే యతిస్వామినే భూతపూ
ర్మణిమయ ప్రాకారమందిరాయ!
వందనమస్తుతే వరణీయ వజ్రత్రి
దండమండిత పాణికాండజాయ!
నతిరస్తుతే జగద్ధితకృతే కాషాయ
పరిధాన సంన్యాస భాసురాయ!
అంజలిరస్తు శివ్యేతరోర్ధ్వపుండ్రాయ
జ్ఞానముద్రా సమంచత్కరాయ!
కమలతులసీవలయ సక్తకంధరాయ!
బ్రహ్మసూత్ర శిఖాబంధ భాస్వరాయ!
విలసితోదయ భాస్కర విగ్రహాయ!
ప్రణతిశతమస్తు మత్కృతిపాలకాయ!"

**గమనిక :** ఈ కవి వ్రాసిన స్తుతి పద్యములలో సంస్కృతస్తోత్ర శ్లోకముల ప్రభావము అమితముగా కన్పించును.

ఉదా॥ రామానుజుల స్తుతి శ్లోకము : ప్రసిద్ధమైనది.

''కాషాయశోభి కమనీయ శిఖానివేశం
దండ త్రయోజ్జ్వలకరం విమలోపవీతం
ఉద్యద్దినేశ నిభముల్ల సదూర్ధ్వపుండ్రం
రూపంతవాస్తు యతిరాజ దృశోర్మమాగ్రే"

**కావ్య సందేశము - విశిష్టా ద్వైత దర్శన స్థాపనము - లోకకళ్యాణ సంస్థాపనము :**

1) శఠకోపుల అనతి : నాథమునులతో : (పుట : 83) ''ద్రవిడ వేదములివి చెప్పి ధరణి-యందు వృద్ధి బొందింపు"మని అనెను.

2) యామునులు కరిగిరివరదుని ప్రార్థించిన విధము : (పుట. 117) "ఈ లక్ష్మణాచార్యుండు దర్శన ప్రవర్తకుండగునట్లనుగ్రహింపుము."

3) శ్రీమన్నారాయణుడు ఆళ్వారాచార్యులను అవతరించుట కాజ్ఞయొసంగినది లోకకల్యాణార్థము. (పుట 3.) చివరగా ఈ **సూక్తి పద్దియముతో** ముగింతును.

"పదుగురార్యులదలపు మీభక్తి ననుచు
వాదిభీకర గురుడనె మోదమలర!" (పుట 1)

అని తలంచుకొని రామానుజుల నాశ్రయింతును (పుట 353).

"శ్రీమద్రంగపతి ప్రధాన సచివా! శ్రేయోనిదానోత్సవా!
నామోచ్చారణ మాత్రపాపహరణా! నారాయణ ప్రీణనా!
కామక్రోధ భవాంధకార తపనా! కల్యాణ సంస్థాపనా!
హైమప్రోల్లసిత త్రిదండకర! భక్తారామ! రామానుజా!"
శ్రీమతే రామానుజాయ నమః.

## I. సూక్తుల వైభవము :

**ఇందలి సూక్తిపద ప్రయోగపు రీతులు :**

(గ్రంథ నామౌచిత్యములో "సూక్తి "శబ్ద విచారమును వివరించినాను.)

ఈ కవి తన గ్రంథములో "సూక్తి" పదమును ఈ క్రింది రీతులలో వాడుకొన్నాడు.

I. గ్రంథపరముగా II సుభాషితములు, హితోక్తులు, విధులు, ఉపదేశములు, నీతులు మొదలగునవిగా.

I. **గ్రంథపరముగా :-** 5, 8, 18, 16, 24, 26, 45, 52, 53, 68, 76 **పుటలు జూడుడు.**

ఆళ్వారుల దివ్యప్రబంధములను, (ఆచార్యుల దివ్య రచనలను గూడ) అందలి పాశురములను, పాశురములలోని భాగములను సూక్తులనియే కవి పేర్కొన్నాడు.

"శఠకోప మునీంద్రుం డానతిచ్చిన దివ్యప్రబంధంబు లందొక్క సూక్తి లేశంబు గొనిపోయి, భవదీయ శంఖఫలకంబు నందుంచిన నా ఫలకంబా సూక్తిని వహించెనేని యస్మదాచార్యుం డేతెంచి భవద్గురుని జయించినట్లగునని 'కణ్ణన్ కలవిన' పాశురంబొక్క పత్రంబునందు లిఖియించి యిచ్చెను. ఆ పత్రమును శంఖఫలకంబునందుంచిన నది అగ్గురు సూక్తి భూషితంబగు తాళపత్రంబు వహించి ఇతర కవీంద్రుల క్రిందబడ ద్రొచ్చెను. అపుడు కంబకవీంద్రుడు పరాంకుశ మునీంద్రుల దలంచి యిట్లనెను :

"సర్వజగదాదరణీయంబగు భవత్ప్రబంధ సముదాయం బందొక
సూక్తి లేశంబునకైన ముజ్జగంబులంగల కృతిశతంబు సదృశంబుగాదు."

II. **సుభాషితములు, హితోక్తులు, మొదలగు కొన్ని అంశములు :**

1. హితోపదేశములు : ఆసతులు, బాధ్యతలు.
2 "ఎంబెరుమానారు తిరువడిఘళే తంజ"మను సూక్తి.
3. గురుభక్తి ఆచార్యవిశిష్టతను తెలుపునవి.
4. రామానుజులే జగద్గురువు.
5. రాజనీతి సూక్తులు.
6. భాగవతులయెడ భక్తి, భాగవత సమారాధనము.
7. వివిధ సందర్భములలోని సూక్తులు, వాటి సారాంశమైన ఉద్దేశ్యము.
8. స్తుతుల రూపములో సూక్తులు.

**సూక్తులు ప్రధానోద్దేశ్యము :**

ఆళ్వారాచార్యాదులు లోకోపకారార్థము సూక్తుల నానతిచ్చిరి. ఆళ్వారులు దివ్యప్రబంధముల నానతిచ్చిరి.

1. "వీడు శూద్రుండు, వీ డుత్కృష్టుండు, వీడు ప్రాజ్ఞుండని విశేష విచారము సల్పక యందఱికిని స్వరూపజ్ఞానంబు బోధించుటకు ద్రవిడ దేశముల యందాళ్వారాదులు- (మహాయోగులు) ఉదయించిరి." (పుట. 496)

2. "వేద రూపంబైన యీదివ్య ప్రబంధంబు ద్విజశ్రేష్ఠుల కధ్యేతవ్యంబు. స్త్రీ శూద్రాదులెవ్వరధికరించిన వారికి ముక్తి కరతలామలకము." (పుట 495)

I. **హితోపదేశములు :**

తత్త్వవ్యాప్తికి పూర్వాచార్యుల తహతహను తెలియజేయు సందర్భములు, సన్నివేశములు : శఠకోపుల ఆజ్ఞమేరకు (పుట 83) శ్రీమన్నాథమునులు

మొదలుకొని ఈ గ్రంథములోగల ప్రసిద్ధాచార్యులందఱును తమ జీవితకాలములోను, సందర్భమునుబట్టి అంతిమదశయందును హితము లుపదేశించిరి. రహస్యార్థము లుపదేశించుచు సంశయవిచ్ఛేదనముల గావించిరి. ఇవియును సూక్తులే యగును.

1. శ్రీమన్నాథమునీంద్రులు : అవతారము చాలించు సందర్భమున :

(అ) స్వపుత్రుండైన ఈశ్వరముని నవలోకించి - "నీకస్మత్స్వామి నుండైన కుమారుండొక్కండుదయించును. అబ్బాలకునకు 'యమునత్తురవరని' తిరునామంబొనర్చుమని" ఆనతిచ్చెను

(ఆ) ఉయ్యకొండారు, కురుహావలప్పనులను శిష్యులతో - "మీకు నే నుపదేశించిన దర్శన తాత్పర్యయోగ రహస్యార్థ విశేషంబులన్నియు యామునాచార్యున కుపదేశింపు" డని నియోగించెను.

దీనివల్ల నాథమునులకు తాను ఆళ్వారాదులవల్ల గ్రహించిన దివ్యప్రబంధ సంపదను భావితరములవారి కందించవలయుననే ప్రగాఢకాంక్ష ఎంతగలదో యర్థమగుచున్నది. ఇట్టిశ్లోకము :

"లక్ష్మీనాథ సమారంభాం - నాథయామున మధ్యమాం
అస్మదాచార్య పర్యంతాం - వందే గురుపరంపరాం."
సార్వకాల సార్వజనీనమై సార్థకమై యలరారుచున్నది.

2. ఉయ్యలకొండారులు తన చరమదశయందు రామమిశ్రులకు మంత్రరత్న మొసంగి, ఈశ్వరమునికి పుట్టబోయెడు యామునులకు సర్వ హితోపదేశములు చేయు బాధ్యత నప్పగించెను. (పుట : 92)

3. అట్లే శ్రీరామమిశ్రులు రాజ్యభోగము లనుభవించునట్టి యామునాచార్యుల మనస్సును మార్చి శ్రీరంగనిలయమున దర్శనస్థాపకుని గావించెను. ''యామునేయ త్రిదండపతికి నుర్విని గల నాథయోగిశేఖరునితో నుభయ సంబంధములుండునుగాన తత్పదాబ్జయుగంబె 'తంజ' మంచు తలంచి, ''నిను బోలు ఘనుని నొకని దర్శన స్థాపన దక్షుని గావింపుమని'' యామునులతో చెప్పి పుండరీకాక్షుల దలంచుచు ముక్తికిం జనియెను.

''యామునుల తర్వాత 'రామానుజాచార్యులు' దక్షులైరి'' అను అర్థము గూడ స్ఫురించును.

4. యామునాచార్య లష్టాంగ యోగరహస్యముల నందలేకపోయెను. ఐనను పూర్వాచార్యోపదేశపరంపరాప్రాప్త ప్రపదన మార్గం బనర్గళంబుగా నుత్తరోత్తరాభివృద్ధి జెంది ప్రసిద్ధంబగునట్లు ప్రవర్తింపజేసెను. అంత్యసమయమున ఆశ్రితులకు హితోపదేశము, అమూల్యాంశములు గలవు:

1. శ్రీ పాణియోగీంద్రు నాపాదమస్తకం బనుభవించుటే మీకు పరమ హితము.

2. ప్రపన్నులగు శ్రీవైష్ణవుల పాదపద్మంబు లెల్లప్పుడు ప్రాప్య ప్రాపకములుగా నమ్మియుండుడని తెలిపెను.

**II. ఎంబెరుమానారు తిరువడిఘళే తంజము[1] :**

ఈ సూక్తు లసంఖ్యాకములు యతీంద్ర ప్రభావ ప్రకాశకుల ప్రకరణములో చూడవచ్చు. (అ.సూ.ము. 333 - 344)

**1. కూరేశులు తన చరమదశలో బోధించిన హితము :**

తన కుమారులతో "శ్రీ రంగరాజానుగ్రహంబున జనియించి వర్ధిల్లుచున్నారము. అతండే మాకు రక్షకుండని తలంచి యుండక 'ఎంబెరుమానారు తిరువడిఘళే తంజ'మని విశ్వసించి యుండవలయును."

2. మణవాళమహామునులు తన చరమదలో—

"తిరువాయిశిపిళ్ళై తిరువడిఘళే శరణమ్" అని ఉచ్చరించిరి. పిమ్మట "ఎంబెరుమానారు తిరువడిఘళే శరణమ్" అని అనుసంధించిరి.

3. శ్రీ వేదాంత దేశికులును అంతిమకాలమున—

నిజాచార్యుండగు కిడాంబియప్పిళ్ళాన్ తిరువడిత్తామరల యందు మనస్సుంచి "ఎంబెరుమానారు తిరువడిఘళే శరణమ్" అని అనుసంధించుకొనెను.

---

1. అ.సూ.ము. మధ్యమభాగము, ప్రథమోల్లాసములోని పద్యములన్నియు ఈ సూక్తినే తెలుపునవిగ నున్నవి. పుటలు 157 - 162.

III. ఆచార్యుల విశిష్టతను గురుభక్తిని, ఆచార్య శిష్యసంబంధమును దెలుపు సూక్తులు :

అసంఖ్యాకములు గలవు. ఆచార్య రూపియే హరి; ఆచార్యావతారము: గురుభక్తి.

1. ఉదయవరుల వైభవము :

(8 వ యుల్లాసము, పుట 264)

విఠలదేవుని రాజ్యములోని 12,000 మంది ప్రతివాదులు రామానుజుల ప్రతిభకు లోబడి ఆశ్రయము కోరి ఇట్లు పలికిరి:

"భవమహాజలధి లోపలబడి హితవేమి
తెలియలేనట్టి యీ దీనజనుల
కాచార్యరూపివై యవతరించిన శేష
మూర్తి నీవే గతి కీర్తి వెలయ"

2. నంబిళ్ళసూక్తి :

"ఆచార్యులే దైవమనుచు నమ్మినవారి
నే ప్రొద్దు బ్రోచు లక్ష్మీశు డనుచు'' (పుట 395)

3) ధ్యేయము : అనుసంధేయము : గోష్ఠిపూర్ణులు చెప్పినది :

''ధేయంబాచార్య విగ్రహము - అనుసంధేయము
తదీయ దివ్యనామము." (పుట 153)

4) కొంగుపిరాట్టి గురుభక్తి : (పుట : 255.)

''మద్గురు డితండని నిశ్చయించి, యంఘ్రులంబడి యేడ్చి హర్ష
బాష్పధారల గురుని శ్రీపాదములను, కడుగ నాతడు హర్షమొంది.''

5) వడుగనంబి (ఆంధ్ర పూర్ణుడు) గురుభక్తి: (329 వ పుట.)
మధుర కవులను తలపింపజేయును.

''గురుని తళుకొత్తు కన్నులకోరి చూచి
యస్మదాచార్యామృతముగన్న యక్షియుగళ
మన్యమేమియుగన నొల్లదాయె''

(రామానుజులు రంగేశుని దర్శింపుమనగా వడగనంబి అన్న సందర్భము.)

6) వేలాంజోలై పిళ్ళ (నారాయణదాసుడు) తలంపు : శ్రీశైలేశు లీతని కడకు వచ్చు సందర్భము : పిళ్ళ తన గురుధ్యానము సేయుచుండెను.

ఆచార్య ప్రపత్తిని గూర్చిన భావనము :

"ప్రపన్నుండైనవానికి మంత్ర, మంత్రార్థారి పరమార్థోపదేష్టయైన గురుని కంటె పరమ ప్రాప్యంబును, ప్రాపకంబైన వేఱొక పరదైవతంబులేదు" (పుటలు 431, 432.)

**సదాచార్యుడు - సచ్ఛిష్యుడు :**

1) గోష్ఠిపూర్ణులు రామానుజులను 'ఎంబెరుమానారని' సంబోధించి, "సద్గురుండవు నీవెపో జనులకెల్ల" అనెను. (పుటలు : 173)

2. కిడాంబి వరదాచార్యులు రామానుజుల నెత్తుకొని తాను ఇసుకలో పరుండి ఇట్లనెను :

"స్వగురు శరీరపోషణము సల్పెడువాడె
సచ్ఛిష్యుడని శాస్త్రసమితి చెప్పె." (పుట : 185)

**IV. రామానుజులే జగద్గురువు - ఆచార్యుడు - దేశికుడు :**

రామానుజులయెడ ఈ పదములన్నియు సార్థకములు.

"నారాయణుడె శేషి నరసురగిరిముఖ
చేతనా చేతనసృష్టికెల్ల"- అతని దివ్య విగ్రహమే శఠారినేషము. శఠారియంఘ్రి పద్మమ్ములే రామానుజార్యులు.

"అమ్మహాత్మునియందే యాచార్యదేశిక
గురుపదంబులు దొడ్డకూర్మి జెందె" (పుట 159)

2. ఢిల్లీ విజయము : (పుట 287 లోనివి.)

ఢిల్లీ సులతాను రాయబారులగు పండితరాయలు, భగవంతరాయలు రామానుజులతో నిట్లనిరి: "ఎట్టి రహస్యమునైన శిష్యులకు చెప్పవచ్చును." (వీరిరువురు ఢిల్లీశునికడ ఉద్యోగస్థులు - రామానుజుల శిష్యులు.)

"శిష్యులమగు మాకు చెప్పందగు నెట్టి
గుహ్యమైన, జగద్గురుడ వీవు
వేదవైదిక ధర్మ విస్ఫూర్తికై హరి
వ్యాసదత్తాత్రేయులైనయట్లు"

చార్యులు రామానుజుల నాశ్రయించు వృత్తాంతము :

సింహాద్రినృహరి కృష్ణమాచార్యులతో నిట్లు పలికెను :

''ఆచార్యశబ్దము యతిపతికేకాని
తక్కిన వారికి తగదు గనుక''

పేరును మాత్రము అనగా ''కృష్ణమార్యుఖ'' అని తెలుపుకొనుమనెను. (పుట : 226)

V. రాజనీతి సూక్తులు :

(9వ యుల్లాసములోనివి) ఢిల్లీ విజయఘట్టము :

1) గూఢచారులను గూర్చిన విషయములు :

a) ఢిల్లీ సులతాను గూఢచారు లిరువురు రామానుజుల శిష్య సైన్యము చేతులలో చిక్కినపుడు, అతడు వారిని విడిచిపెట్టుమని తన శిష్యుల కిట్లు తెలిపెను :

''స్వామి కార్యములందు జాగరూకత గల్గు
చారులుత్తములు, సంశయము లేదు." (పుట: 276)

b) సులతాను గూఢచారులు రామానుజుల యనుగ్రహముచే బ్రతికి బయటపడి, తిరిగివచ్చి తమప్రభువు నభయము వేడుకొనుచు నిట్లనిరి : (పుట : 276)

''స్వపర రాష్ట్రములందు సర్వార్థములు చార
వరులవల్ల నెఱుంగవలయు రాజు,
కావున నృపతికి కన్నులు చారులు
వారవంచకులు గావలియు పతికి,
ప్రియవాక్య వక్తలు పెక్కండ్రు సులభుల
ప్రియ పథ్య వక్తలీ పృథివినరుదు."

2) ఉమ్రాలు సులతానుతో నిట్లనిరి : (పుట 282)

''సన్యాసితో పోరు సర్వార్థముల బాపు''

3) ఖాజీల నయోక్తులు : (పుట : 283)

''కడు విమర్శింపక కార్యము చేసెనా,
చేటు వాటిల్లు నేమేటికైన,
గాన విచారించి కార్యము చేసెడు
ఘనుని దానె వరించు కలిమివెలది''

(భారవి కిరాతార్జునీయశ్లోకము ''సహసావిదధీ తన క్రియా'' స్ఫురించును)

**VI. భాగవత భక్తి - తదీయారాధనము - కుల వర్ణ భేదములు కూడదు మన్నగు సూక్తులు :**

ఈ గ్రంథము నందెన్నియో దృష్టాంతరములు గలవు.

భాగవతభక్తి - తదీయారాధనము :

1. కుముదవల్లి తన భర్తయగు తిరుమంగయాళ్వారులతో అన్నమాటలు: (పుట : 56)

పెండ్లికిముందు పరకాలునితో (తదీయారాధన ప్రాముఖ్యత)

''ఒక్క సంవత్సరం బ్రకాంతం బష్టోత్తర సహస్ర శ్రీ వైష్ణవసమారాధనం బాచరించి, తదీయ శ్రీపాదతీర్థంబును, దశిహ ప్రసాదంబును స్వీకరింపక కాని నిన్ను భర్తగా గైకొన నొల్లను."

పెండ్లి తర్వాత పరకాలుని ఆలోచన:

"ఆరాధనంబుల కెల్ల భగవదారాధనంబు ముఖ్యం బంతకన్న తదీయారాధన ముఖ్యతరము'' అని తన కార్యక్రమముల కొనసాగించెను. పశ్యతోహార వృత్తివలన వచ్చు ధనము రాజసేవధనముకన్న గొప్పదని భావించెను. "పశ్యతోహరవృత్తి బహుధనంబు దెచ్చి, భాగతువల దినదిన మర్చించినను మంచిదని తోచె'' (పుట 65).

2. పరకాలుని సైన్యాధిపతి తన సైన్యముతో అన్నమాటలు :

"పరుల గెల్చితిమేని పరకాలుకడనుండి
పరమ భాగవతుల పాదసేవ
సలుపు చుండెదము.'' (పుట : 58)

4) భాగవత సమారాధన :

(రామానుజులు యజ్ఞేశునకు తెలిపిన విషయములు :) పుట 130

"వత్సా! ప్రపన్నుండగు చేతనునకు పంచసంస్కార సంపత్తియు, శ్రీ మహాభాగవతార్చనము, ఆచార్యాధీనవృత్తియు, అర్థ పంచకజ్ఞానము, తదీయానువర్తనము, శ్రీవైష్ణవ పూర్తి కరంబగు ధర్మంబులు." "సార్వకాలంబనన్య ప్రపన్నులగు మహాభాగవతుల సకలోపచారంబుచే నర్చించు చుండుము"

5) భాగవతులకు సేవజేయుటయే పరమధర్మము : పుట్టుక, కులము, జాతితో ప్రసక్తిలేదు : అస్పృశ్యత కూడదనుటకు నిదర్శనము.

(మారనేరనంబి వృత్తాంతము : పుటలు : 184, 185)

ఇతడు అంత్యకులమున బుట్టినవాడు, రాజవ్రణముతో బాధపడుచున్న సందర్భమున యతిరాజులితనికి పరమపదమును కృపజేసిరి. పెరియ నంబిగారితనికి అంతిమ సంస్కారములు చేసెను. ఈ వార్త విని స్థానికస్వాములీ మహాపూర్ణులను వెలివేసిరి. పిదప పశ్చాత్తాపమును చెంది బ్రహ్మరథము పట్టిరి.

యతిరాజుల వద్ద నీతడు తన పనిని సమర్థించుకొని భారతము నుండి ఉదాహరణముల జూపెను. సూక్తులు :

"భాగవతాగ్రగణ్యునకు చరమ కైంకర్యము నొనరించుటయే ఉత్తమ ధర్మము."

"క్షితిజటాయువునకు జేసె సంస్కారముల్
చక్రవర్తిసుతుండు జనులు మెచ్చ."

6. కులము, పుట్టుకతో పనిలేదు. చదువే ముఖ్యము గాదు:

(ధనుర్దాసు వృత్తాంతము : పుట 189.)

చింపబడిన తమ కౌపీనముల గూర్చి కలహించుకొనుచున్న వైష్ణవులకు రామానుజులిట్లు బుద్ధి చెప్పిరి:

1) ఎంచ ధనుర్దాసుదేమిచదివె, ఎందు జన్మించె? నీ తెలివెట్లు చెందె?

సూక్తి : ఆత్మతత్త్వానభిజ్ఞుల యాభిజనాదులడవిగాచిన వెన్నెల యనియె.

2) జ్ఞానమనుష్ఠానమే నరునకు గల్గు - వాడెపో పుడమిసద్వైష్ణవుండు

3) "అరయనాచార్య పారతంత్ర్యములేని యభిజనాదులగాల్పనే!" యని వైష్ణవులు ధనుర్దాసును పొగడిరి. తమ్ము తెగడుకొనిరి.

7. కులము పేరు - ఊరి పేరు విషదాసులు పటించుకొనరు :

సందర్భము : మొదట పొయిగై, పూదత్తాళ్వారులు తిరుక్కోవలూరులో ఒక ఇంటి (అరుగు) పంచన కలిసికొనిరి. హరిసేవకులము, హరిదాసులమను సమాధానములను బొంది ''దాస్యధర్మమున్నిడి తమ్ము తెలుపుకొనిరి వారూరి పేరేమి యడుగుకొనక.'' ఇంతలో పేయాళ్వా రచటికి వచ్చి విష్ణుదాసుడనని విన్నవింప అందఱును ఒకరినొకరు సేవించుకొనిరి.

VII. వివిధ సందర్భముల సూక్తుల వైవిధ్యము :

1. కాంచీపూర్ణుల కథలో సూక్తి : (పుట : 244)

ఇతడు వైశ్యుడు, కంచివరదునితో ప్రత్యక్షముగా మాట్లాడువాడు. ఒకనాడు కంచియందు శ్రీవరదు డిట్లనెను:

"ప్రారబ్ధకర్మానుభవ మించు కంతైన
జెందుము, మఱుమాట జెప్పబోకు"

(బంగారుగిన్నె దొంగతన మితనిపైబడ దండనాథు డితనిని శిక్షించును.)

2. ప్రేయసీ ప్రియులు : (పుట : 297)

రామానుజులు పిలువగనే రామప్రియుడు వెళ్ళిపోయెను. రామప్రియుని ప్రేయసియే ఢిల్లీ సులతాను కుమార్తె బీబీనాంచారు - తన చెలికత్తెతో నిట్లనును:

"మగువ! మగవారి నమ్మంగదగునె వారి
మాటలన్నియు వడగండ్ల మూటలరయ!"

3. అహంకారము కూడదు :

1) శ్రీపరాశర భట్టారకుండొక సమయంబున నంజియ్యరునీక్షించి : "నీవు వేదాంతియను విఖ్యాత నామధేయంబు గలవాడననియు, మమ్మాశ్రయించితి ననియు, మాకాచార్య దక్షిణగా బహు ద్రవ్యంబిచ్చితిననియు మోసమందక సర్వకాలంబులందు 'శ్రీరామానుజుల పదాంబుజములనే శరణముగా విశ్వసించు' మని" చెప్పెను. (పుట : 342)

2) సింహగిరి వచనముల కర్త కృష్ణమాచార్యులు మొదట రామానుజులను లెక్కసేయనప్పుడు హరి అతనితో : (పుట 224)

"వేయు పల్కగనేల వినుము నీ గర్వంబు
నిన్నింతచేసె నా నేరమేమి?

ప్రపదన పరులకు పరమపదంబబ్బు."

(పిమ్మట కృష్ణమార్యులు రామానుజుల నాశ్రయించిరి.)

5. విద్యాబోధనము (Education) : భట్టరు వైభవము (పుట : 374)

1) ''జ్ఞానానుగుణముగా ఛాత్రుల కుపదేశ మాచార్యు లొనరింతురు.''

2) బలవంతముగానైనను, శిష్యులు పారిపోవుచున్నను, పట్టి తెప్పించి భట్టరు హితము లుపదేశించెను. (పుట : 375)

(మొదటి ఆశ్రితుడు సాత్వికుడైన శిష్యుడొకడు తాంబూల సేవనమువల్ల కామాసక్తుడుగా మారినపుడు)

"గాఢ సంశ్లేష మొనరించి, గారవించి,
రమ్యబోధ మొనర్ప విరక్తిజెంది
భక్తి నతడాత్మ గురునెడ బాయడనుచు
వాది భీకరగురుడనె మోదమలర!''

6. నంబిళ్ళగారి సూక్తులు : అసంఖ్యాకములు. (పుట : 408)

**ఆహారశుద్ధి :**

"దృఢతరానుస్మృతి స్థిర హేతువగు సత్త్వ
శుద్ధి కాహారైకశుద్ధి బీజ
మని యుపనిషదుక్తము''

3) భాగవతాపచారము : (పుట : 412)

"బ్రహ్మవిత్తములగు భాగవతులయెడ
నపరాధ పడెనేని యతడు దగ్ధ
పటము గాలికిజెడు భంగిని''

7. మహాపూర్ణులసూక్తి : మోక్షమునకు దేశ కాల నిర్ణయము లేదు :

"గురుకృపచే న్యస్తభరులకు మొదటనే
సిద్ధమౌ మోక్షము చెందుటకును,
కాలము - దేశము కాంక్షింప దగదని
శ్రీ మహాపూర్ణులు చెప్పిరిట్లు." (పుట : 314)

8. ప్రపదనమును గూర్చి శ్రీ పరాశర భట్టరు సూక్తి : (పుటలు : 369)
"దేశకాల నియములులేక ప్రపదన మెట్టివారికైన లభించును."

9. కృతివక్త తెలిపిన సూక్తులు :

కృతివక్త వాదిభీకరగురుడు. ఇతడు కవినోట తెలిపిన ఉపదేశములు లేక సూక్తులు (అనగా కవి సంబూరికేశవాచార్యులు స్వయముగా మనవి చేసికొను నట్టివే యని గ్రహింపవలయును) కవి వినయసంపదకుదాహరణము గూడ.

భక్తాంఘ్రిరేణుల చరిత్ర చివర ఈ పద్యము గలదు. (పుట. 46)
ముఖ్యోద్దేశము : భాగవతుల పాదపద్మములే ఉపాయోపేయములు.

''సారెసారెకు మీ పాద సరసిజముల
నమ్మియున్నాడ నెమ్మది మిదమ్మిక క్క
వేరుపాయ ముపేయము వెదుకననుచు
వాది భీకరగురుడనె మోదమలర!''

VIII. ఆళ్వారాచార్యుల స్తుతి సూక్తులు : అసంఖ్యాకములు.

1 తిరుమళిశైయాళ్వారులు : (పుట 16)

ఇతడు ''ధారణాయోగ సాక్షాత్కృత స్వహృదయ
పుండరీకస్థ పురుషాను భూతియనుచు
వాదిభీకరగురుడనె మోదమలర!''

వరవర యోగీంద్రుల భృత్యులతో పొత్తు;

దాసాను దాసుల సేవించు భావము :

శ్రీ వైష్ణవులందర కాదర్శప్రాయములైన సూక్తులు శ్రీ మణవాళ మహా మునుల వైభవములో (పుట 536.)

''అపగత మదమాను లంతిమోపాయ ని
ష్ఠాగరిష్ఠులు సద్విచారపరులు
నధిగత పరమార్థు లర్థకామాన పే
క్షులు సర్వమిత్రులు క్రోధలోభ
వర్జితాత్ములు నగు వరవరయోగీంద్రు
భృత్యులతో పొత్తు పృథ్వి మాకు
సంభవించునుగాత స్వగురుని కృపవల్ల
సారెసారెకు వారి చరణకమల

సేవచేయుచు తదితర చింతలుడిగి
న్యస్తభరత వసించు నే యనఘుడతడె
ధన్యత ముదని తలచెద'' తథ్యమనుచు
వాది భీకర గురుడనె మోదమలర!

**రామానుజుల పాదముల నాశ్రయించుడీ!**

సకలపాతకముల సలుపు వారైన, కి
రాతాదిదుష్కుల జాతులయిన,
వర్ణాశ్రమ విరుద్ధ బహువిధదారుణ
వృత్తుల బ్రతుకు నున్మత్తులైన,
భూమి రామానుజముని పాదపద్మము
లాశ్రయించిన నాడె యఖిలలోక,
పూజ్యులై శ్రీసఖ పుణ్యవిమానాయ
మానమనస్కులై మనుదురెచట,
వారి పూర్వాన్వయ క్రియా వర్తనములె
యస్మదాద్యులకర్ణనీయంబులగును
వారెపో నిత్యసూరులీవసుధ యనుచు
వాదిభీకర గురుడనె మోదమలర!

**4. శ్రీ వేదాంతదేశికుల స్తుతి :** (పుట. 592)

''వేంకటేశార్య! శ్రీవేదాంత దేశిక! యంజనాద్రీశ ఘంటావతార!
తత సర్వతంత్ర స్వతంత్రమహాబిరుదాంకిత! శుభవిజయధ్వజాఢ్య!
యతి సార్వభౌమ సిద్ధాంత నిర్ధారణ చతుర! సంశ్రితలోకశరణ చరణ
తరుణాంబురుహ! కవితార్కిక మత్తమాతంగ కంఠీరవ! ధన్యచరిత!

## 2. ఆచార్య సూక్తి ముక్తావళిలోని గద్యలను గూర్చి :

తెలుగు సాహిత్య ప్రపంచములో నన్నయనుండి చిన్నయవరకు - మహా కావ్య నిర్మాణమునకు పూనుకొన్న సమయము నుండి గ్రంథము పూర్తి చేయు వరకు కొన్ని విలక్షణములైన ప్రత్యేకతలు గోచరించును. అంశములను విశ్లేషణ (**Analysis**) చేసినచో -

1) కావ్యము మొదట కావ్యావతారిక లుండును.

2) కావ్య కథావస్తు విషయ వివరణ సందర్భమున కొన్ని విభాగములుండును. వీటికే "సర్గలు - అధ్యాయములు - అశ్వాసములు - ప్రకరణములు, స్కంధములు, ఉల్లాసములు, భాగములు" అని పేర్లు గలవు.

3) ప్రతి ఆశ్వాసము చివర ఆశ్వాసాంత పద్యములు ముగిసిన పిమ్మట 'గద్య' అనుశీర్షిక కనిపించును. ఇది తెలుగు కవుల మనుగడను తెలుపు కావ్య నిర్మాణాచార చాతుర్యము

గద్యము లేక గద్యల అర్థమొకటే. పద్యము కానిది గద్యము. అనగా వచనము. వచన కవిత్వమనిగూడ ఒక అర్థమున్నది. పాదబద్ధము కాని పదముల కూర్పు అని మరొక అర్థము.

సామాన్యముగా 'గద్యలు' వచన రూపముతో కన్పించును. కాని, కృష్ణదేవరాయలవంటివారు ఇందు పేర్కొనబడవలసిన అంశములను పద్యములలోనే పేర్కొనిరి.

**గద్యలలోని అంశములు :**

కవి యభిరుచినిబట్టి గద్యలోని విషయాంశములుండును. సామాన్యముగా కవి తన పేరును తెలుపుకొనుటకు ముందు తనకు కవితాకళ ఎవరి వర ప్రసాదము లభించెనో వారి పేర ప్రశంసావాక్యములు, అటుపిమ్మట తన వంశీయుల విశేషణాదులు, ఆ పిమ్మట తనకు గల విశేషణములు, బిరుదులు తెలుపుకొనును. రచన సమాసబంధురమై కవితాత్మను తలపింపజేయునుగాన వచన కవితయని పిలిచిరేమో! (నేటి వచన కవితా లక్షణముల సంగతిగాదు.)

కవి తన పేరు పిమ్మట అనగా "నామధేయ ప్రణీతంబైన" అని చెప్పి తాను పూర్తిచేసిన ఆశ్వాసములోని అతి ప్రధానాంశములను విషయసూచికవలె తెలుపును. కొందఱు పెక్కు అంశములను వ్రాతురు. కొందఱు ఒకే వాక్యముతో సరిపెట్టుకొందురు. కొందఱు తమ గురించి తెలియపఱచరు. ఉదా॥ నన్నయ గారి గద్య : కవికి గల విశేషణములు, కథాంశములున్న గద్య ఇది.

"ఇది సకల సుకవిజనవినుత నన్నయభట్ట ప్రణీతంబైన శ్రీ మహాభారతమునం దాదిపర్వంబున 'నను క్రమణికయును, పౌష్యోదంక మాహాత్మ్యంబును, భృగువంశకీర్తనంబు' నన్నది ప్రథమాశ్వాసము."

**గద్యల ప్రయోజనము :**

1. కవి వంశ పరిచయాదులు గలుగును. (సంగ్రహముగా.)

2. గ్రంథారంభమున నున్న విషయసూచికను జ్ఞప్తియందుంచుకొని, ఆశ్వాసాంతమున గల గద్యను చదువుకొన్నచో కథా సంగ్రహవిషయాంశములు మనస్సులో బాగుగా నాటుకొనును. కథను ఒక వరుసలో చెప్పుటకు శక్తి గలుగును. ఒక విధముగా నిది పునశ్చరణ (Recaptulation) వంటిదగును. విషయమును మననము చేయుట, నెమరువేయుట యగును.

ఆ. సూ. ము. లోని గద్యలలో కొన్నిటియందు అధికాధిక విషయసూచికాంశములున్నవి. కొన్నిటియందు తక్కువగా నున్నవి. అతి ముఖ్యాంశములను పునశ్చరణ చేయుట జరిగినది. అంతగా ప్రాముఖ్యము లేనివాటిని విడుచుట జరిగినది.

ఇందు ఇరువదినాల్గు గద్యలున్నవి. పూర్వభాగములో = 6, మధ్యమ భాగములో = 12, ఉత్తర భాగములో = 6 గద్యలు గలవు. అన్ని భాగములలోను కవి వంశాదిక విషయపంక్తులు నాల్గయిదు సాగినవి.

**గద్యలన్నింటిలోని సామాన్య పంక్తులు :**

"ఇది శ్రీ భగవద్రామానుజ కరుణాకటాక్షకలిత కవితా వైభవ పరవాది భయంకరాచార్యాభిమతచ్ఛాత్రాపస్తంబ సూత్ర, కణ్వస గోత్ర, పవిత్రోభయ కవిమిత్ర వేంకటకృష్ణార్య పుత్ర, విబుధ వైష్ణవ విధేయ, కేశవ నామధేయ ప్రణీతంబైన ఆచార్య సూక్తి ముక్తావళి యను మహాప్రబంధము నందు ........ ............ అన్నది .... ఉల్లాసము."

గద్యల విశేష విషయ సూచికాంశములు :

అన్నింటి మొత్తము = $349 + 1 = 350 + 1 = 351$

| | | | | | |
|---|---|---|---|---|---|
| 1. పూర్వభాగము | = | 6 ఉల్లాసములు | = | 65 + 1 | అంశములు |
| 2. మధ్యమ ,, | = | 12 ,, | = | 191 | ,, |
| 3. ఉత్తర ,, | = | 6 ,, | = | 84 | ,, |
| | | | | 350 + 1 | |

సామాన్య పంక్తులలో తేలిన విషయాంశములు = 5.

1. శ్రీ భగవద్రామానుజ కరుణాకటాక్షమువల్ల అబ్బిన కవితా వైభవము గలవాడు. 2. పరవాది భయంకరాచార్యుల కభిమత ఛ్ఛాత్రుడు 3. పవిత్రమైన ఆపస్తంబ సూత్రుడు, కణ్వస గోత్రుడునైన, ఉభయ కవిమిత్రుడైన

వేంకట కృష్ణార్యుల పుత్రుడు 5. కేశవ నామధేయునిచే రచింపబడిన అ. సూ. ము. యను మహాప్రబంధములో........

(కృతికర్త జీవిత చరిత్ర వ్రాయుటకీ యంశములు తోడ్పడును.)

## 3. వర్ణనావైభవము

ఈ కావ్యము ఏకనాయక కథాశ్రయము గాదు. పెక్కురు ఆళ్వారాచార్యుల జీవిత చరిత్రల కథనము. అందఱి మధ్య భగవద్రామానుజులు నాయకమణిగా భాసిల్లుచుండును. ఐనను వర్ణనల రీతులలో వైవిధ్యము గోచరించును. ఇందులో అష్టాదశవర్ణనలు లేక అప్పకవి చెప్పిన ఇరువది రెండు వర్ణనములు క్రమపద్ధతిలో సాగవు. అదియును గాక లక్షణ గ్రంథములందు చెప్పబడిన కొన్ని వర్ణనములు లోపించి యుండవచ్చును. కొన్ని అదనముగా చేరవచ్చును. ఈ గ్రంథములో ఎన్నియో అంశములపై రమ్యములైన వర్ణనములున్నవి. సంగ్రహముగా పేర్కొందును.

**అ. సూ. ము. నందలి వర్ణనాంశములు :**

**అంశములు : 22 వర్ణనముల వరుస : పుటల సంఖ్య**

1. పురవర్ణనము : 10 కి పైగా గలవు.

1) శ్రీ వైకుంఠము - 1
2) శ్రీరంగము - 28, 242
3) శ్రీవిల్లిపుత్తూరు - 21
4) కురుకానగరము - 72
5) వీరనారాయణ పురము - 78
6) ఢిల్లీ నగరము - 274
7) అనంతపురి - 206
8) కాంచీపురము - 234
9) కరిగిరి శిఖరము - 540
10) తిరునారాయణ పురము - 204

2. ఋతుషట్కము : లేదు. వర్షకాలము గలదు. వర్షముపడిన తీరు, పుట 33.

3. ప్రయాణము : ఉదయవరుల దిగ్విజయ యాత్రా సన్నాహము. 272, 273 - 5 పద్యములు గలవు.

4. శైలము : పెక్కు పర్వతములు వర్ణనములు గలవు.

1) శ్రీ వేంకటాద్రి - 230, 597

2) శ్రీ యాదవాద్రి - 267, 569, 363

5. వేట : (ఒక సందర్భములో) - 113

6. సాగరము : సముద్రతీరము - 198 రామానుజుల యాత్ర

7. మౌనీంద్ర పుణ్యాశ్రమము :

1) బదరికాశ్రమము - 213

2) శమ్యకాశ్రమము - 214

8. మంత్రంబు : మంత్రాంగము.

1) వరకాలునిగూర్చి చోళరాజు సభ్యులతో నాలోచించుట - 60

2) ఢిల్లీసులతాను రామానుజుల రాక - గూర్చి - 284 - 286

9. ద్యూతము : ఇందు జూదమాడు ప్రసక్తి లేదు.

దౌత్యము : (అప్పకవి చెప్పలేదు) : రామానుజులకడకు రాయబారులుగా ఢిల్లీ సులతాను ఇరువురిని పంపుట - 287

10. అద్భుతరణము : ఒక పర్యాయము మాత్రమే జరిగినది. రామానుజుల దిగ్విజయ యాత్ర యుద్ధము సేయనుద్దేశించినది గాదు. 279

,, ,, తిరుమంగైయాళ్వారు నిజముగా కత్తిబట్టి రణమొనరించినాడు - 57 - 64 పుటలలో

11. విజయము : తిరుమంగైయాళ్వారులు. 57 - 64

12. మద్యపానజ వికారము : లేదు.

13. వనవిహారము : రాజుల వనవిహారము లేదు. కాని, తొండరడిప్పొడియాళ్వారులు దేవదేవితో కలిసి తిరుగుట గలదు. 38 వ పుట.

14. వారికేళి : తిరువాళి త్తిరునాడులోని అందమైన సరస్సులో రంభాద్యప్సరసల జలక్రీడ. పుట 54.

15. కన్యాంగ సౌందర్య కథనము : (శృంగార నాయికలవలె)

1. దేవదేవి సౌందర్యము - 35.

2. ఢిల్లీ సులతాను కుమార్తె (శ్రీ అదృష్టదేవత యను భావము)- 293.

16. హిమకరాభ్యుదయము (సంధ్యావర్ణనము) - 297.

17. విప్రలంభము : విరహావేదనలలో:

1. చంద్రుని దూరుట 2. మన్మథుని దూరుట

3. ఏడ్చుట 4. తడబాటు-భ్రమ

5. ఉపచారములు మొదలైనవి 298-301 పుటలలో.

18. పద్మమిత్రోదయము :

సూర్యోదయ వర్ణనము గలదు. 302 లో ఒక పద్యము, 256 లో రెండు పద్యములు.

19. పరిణయము: అలంకరణములు, అరణములు, అప్పగింతలు.

| | |
|---|---|
| 1. గోదాదేవి పెండ్లి | పుట 27 |
| 2. ధర్మవరుడను రాజు కుమార్తె పెండ్లి | పుటలు 49-50 |
| 3. ఢిల్లీ సులతాను కుమార్తె పెండ్లి | పుటలు 304-305 |

20. సురతము : సుతుని గూర్చిగాక సంభోగ శృంగారము తరహాకు చెందినవి మాత్రమే గలవు.

1. తొండరడిప్పొడి యాళ్వారులు- 36, 37, 42

2. ఢిల్లీ సులతాను కుమార్తె - 294

21. దౌహృదము : (సీమంతము గలదు)

వేదాంత దేశికుల తల్లి తోతారమ్మకు - పుట 564

22. సుతజననము : వృత్తాంతములుగా నున్నవి. కారణజన్ములు:

| | | |
|---|---|---|
| 1. రామానుజులు జన్మించుట | పుట | 107 |
| 2. పరాశరభట్టరు, రామప్పిళ్ళలు | ,, | 193 |
| 3. పిళ్ళ లోకాచార్యులు | ,, | 407 |
| 4. వేదాంత దేశికులు | ,, | 564, 565 |
| 5. నయనారు దేశికులు | ,, | 588 |
| 6 మణవాళ మహామునులు | ,, | 436 |

**అదనముగానున్న వర్ణనములు :**

1. భగవంతుని గూర్చిన వర్ణనలు :

| | |
|---|---|
| 1. శ్రీరంగని వర్ణనము | పుటలు 28, 443 |
| 2. శ్రీ పద్మనాభస్వామి, తిరువనంతపురం | ,, 209, 210 |

3. శ్రీ వేంకటేశుడు ,, 233, 446
4. కరిగిరీశుడు ,, 236, 237
5. తిరుక్కురుంగుడి దేవుడు ,, 204

2. భగవంతుడు ప్రత్యక్షమగుట :
1. తోతారమ్మకు శ్రీవేంకటేశుడు ,, 564
2. ప్ర. భ. అణ్ణంగారికి ,, ,, 596

3. భగవన్నుతులు : స్తోత్ర పద్యములు
1. వేదాంత దేశికుల వైభవము 18 పద్యములు - 562, 570

4. ఆళ్వారుల స్తుతులు : ఆళ్వారులను స్తుతించుట:
పుటలు. 70, 18, 16, 78, 72.

5. భగవద్దర్శనము, ఆళ్వారుల దర్శనములు :
రామానుజులు ఆదినాథుని, శఠకోపుల దర్శించుట - పుట. 202.

6. ఆచార్యులను గూర్చిన స్తుతులు : అసంఖ్యాకములు.
1. ఉదయవరుల వైభవము. మధ్యమభాగ ప్రథమోల్లాసము.
2. కృతిభర్త పద్యములన్నియు స్తుతులే.
ఇంకను, పుటలు. 119, 155, 257, 352
3. నంబిళ్ళ గొప్పదనము. పుట. 413

7. స్వాగతములు, సన్మానపద్ధతులు : ఎన్నియో సందర్భములు గలవు.
1. రామానుజులకు ప్రకృతితెలుపు స్వాగతములు. పుట. 199
2. రామానుజులకు జనులు, దేవస్థానములు -
పుటలు - 200, 288, 289, 264, 201
3. ప్ర.భ. అణ్ణంగారికి. పుట. 598
4. మణవాళమహామునులకు పుట. 444

8. ఊరేగింపులు : పెక్కులు గలవు.
1. మణవాళ మహామునులు. పుట. 523

9. ప్రజల తలంపులు :
1. గోదాదేవి కళ్యాణమున 27
2. రామానుజులను గూర్చి 290
3. విగ్రహము, రామప్రియుడు కదలిరాక 295

10. వివిధ ఉత్సవముల పేర్లు - సేవలు : 517

మేళతాళములు, దేవాలయములు 199

11. ఆళ్వారుల ఆకృతులు :

తొండరడిప్పొడి, తిరుమంగై యాళ్వారులు 31, 54

12. ఆచార్యుల స్వప్నరూపాకృతులు :

1) రామానుజుల ఆకృతి - పుట 181, 257

2) మణవాళ మహాామునుల ఆకృతి పుటలు 505

13. ఆచార్య పరంపర వర్ణనము. పుటలు 1, 157

14. యతిరాజ సభావర్ణనము. పుట 196

,, పరివారము. పుటలు 196, 157, 218, 325, 358

15. పెరుమాళ్ళ సభావర్ణనము. పుట 509

16. క్షేత్ర మహిమల వర్ణనము. పుటలు 3, 169, 206, 207, 216

కాంచీపురి. 3వ పుట

17. దేవుని వనవిహార వర్ణనము. పుట 424

18. ఉద్యానవనములు :

1) శ్రీరంగమునందు (తొండరడిప్పొడి యాళ్వారుల వైభవము) పుటలు 29, 30

2) ఉదయవరుల యాత్ర. పుటలు 197, 205

19. అడవుల వర్ణనము :

1) నైమిశారణ్యము. పుట 213

2) శ్రీరంగేశుని దాటించు సందర్భమున మార్గములో అడవి. పిమ్మట జ్యోతిమ్కుడి గ్రామము. పుట 424

20. వృక్షసంపద : 45 రకముల చెట్లు, పూలమొక్కలు వివిధ సందర్భములలో గలవు. పుటలు 238, 425

21. జంతుసంపద : వివిధ సందర్భములలో గలవు.

వేట సందర్భము. పుట 113

యాదవాద్రిలో. పుటలు 266, 267

22. పక్షులు : యాదవాద్రిలో పుట 267

57. జనులను గూర్చి :
   1) సాత్త్వికులు రామానుజులకు తిరునగరిలో కన్పించినవారు- 199
   2) నాలుగు వర్ణముల ప్రజలు; స్త్రీలు 206
   3) పల్లెజీవితము - నిషాదులు 250
   4) నిత్యులు 279
   5) త్రైవర్ణికులు 273
   6) విప్రులు 560

58. పోటీల వర్ణనము :
   1) కవిత్వపోటీలు : వేదాంతదేశికులు - జగదార్యులు 589
   2) విషవైద్యునితో వేదాంతదేశికులు 585
   3) వాదము- పెక్కు గలవు.
      వేదాంతదేశికులు విద్వాంసుల జయించుట 574

59. ఏడ్పు వర్ణనము : ఢిల్లీ సులతాను కుమార్తె ఏడ్పు పుట. 300

60. ఊరడింపులు.
   1. కూరేశుల చరమదశలో రామానుజులతనిపుత్రుల నోదార్చుట 335
   2. ఢిల్లీ సులతాను తన కుమార్తె నూరడించుట 301

61. వీడుకోలు : యాదవాద్రి నివాసులు రామానుజులకు 319

62. త్యాగములు : దేశమునకు, దైవమునకు, ఆచార్యునకు
   1. శ్రీ రంగరాజు మాణిక్యాభిధాన వేశ్యారత్నము 427
   2. కూరేశులు కన్నులూడదీయుట 314

63. పరమపదమునకేగు సందర్భముల వర్ణనము :
   1. శ్రీమన్నాథ మునీంద్రులు - అర్చిరాదిక మార్గము 87-89
   2. యామునాచార్యులు 119-123
   3. ఉదయవరులు 345
   4. నంజీయరు 392

ముఖ్య వర్ణనముల కుదాహరణములు - ఇరువది రెండు వర్ణనముల ప్రకారము :

1. పురవర్ణనము : శ్రీరంగ నగరము - పుట. 28

"కలితమరుద్వృథాగర్భ సంభృతమణి
ప్రాకారసప్తక పరివృతంబు
మహనీయ మణిమయ మండపగోపుర
ప్రాసాదసౌధాది పంక్తియుతము,
విపణి ప్రసారిత వివిధ రత్నవితాన
విక్రయ క్రయశాలి వివిధజనము,
సకల సాంగోపాంగ సశిరస్క వేదశా
స్త్ర విశారద భాసుర బ్రహ్మకులము,
చంద్ర పుష్కరిణీ తీర చారునగము
రమ్యరమణీ సముల్లసద్రంగ పదము,
విప్రనారాయణుడు జూచె వేడ్కననుచు"

2. ఋతుషట్కము : లేదు.

3. ప్రయాణము : రామానుజులు ఢిల్లీ నగరమునకు ప్రయాణమగుట.
పుటలు. 272 - 273

"కరటి ఘీంకారముల్ కలభ బృంహితములు
హయరత్న హేషిత హలహలములు....
చక్రనేమిధ్వనుల్ విక్రమోద్భట భట
క్ష్వేళితంబులు మత్తసింధురములు
ఘంటారవంబులు కాహళపటహ స్వ
నంబులు శంఖనినాదములును,
భేరీ మృదంగ గంభీరనాదంబులు
కలితపిఛావేణు కలరవములు

స్వస్తి విజయప్రబంధ ఘోషంబులన్ని
గలిసి బ్రహ్మాండమంతట వెలసి మెలసి
గురువిజయధాటి దెల్పె నందరకు ననుచు''

4. యాదవాద్రి వర్ణనము: పుట 363.

మేలునాటలో వేదాంతి యను పండితుని జయించి శ్రీ పరాశరభట్టరుల వారు తిరుగు ప్రయాణములో చూచిన దృశ్యములు:

"చనిచని శ్రీపరాశరభట్ట రీక్షించె
దుంగశృంగ సహస్ర మంగళంబు,
సర్వర్తుఫల పుష్పశాలి శాఖాగ్రస్త
పత్రచిత్రరుతాఢ్య ఖగానగంబు,
సురభి పద్మోత్పల శోభితహ్రదనదీ
వరమ పావనతీర భాసురంబు,
సంత్యాజితాన్యోన్య జాతి వైరమృగంబు
సిద్ధదేవర్షి నిషేవితంబు,
వనహుతాశన ముఖదోష వర్జితంబు,
నైన యదుగిరిపై నృహర్యక్షనిలయ
రంజితద్వార మణిగోపురంబు ననుచు''

5. వేట : శ్రీ వేంకటేశుడు మారువేషములో వనమునందు విహరించుట: పుట 113.

"వేటాడదగినట్టి వేషమొక్కటి బూని
మారాభ రాజకుమార లీల!''

6. సాగరము : రామానుజులు సేతువును జూచెను. పుట 198.

"దక్షిణాంబోనిధి తటముజెంది, మేర్వంతి కోర్విపై మెఱుగులతో
దోచు, నీలమేఘము బోలువేల కదను....''

7. మౌనీంద్రు పుణ్యాశ్రమము : బదరికాశ్రమమును రామానుజులు దర్శించిరి. పుటలు 213, 214.

"క్షీరాబ్ధిపతి సితాసితకేశములు రెండు,
నిల నెవ్వరై జగమేలు చంద్రు
భరత వర్షంబందు బహు వర్షములనుండి
వసియించిరెవ్వరీ వసుధ బ్రోవ
తమ యూరువునబుట్టు తరుణిచేతను రంభ
గర్వమడంచు నిష్కామ్యు లెవ్వ,
రాజేసి నెలలొక్కరని సల్పుచు సహస్ర
కవచుని గెలిచిరే ఘనులు ముందు

నా పురాణమహర్షుల కాదికవుల
కభిమతావాసమగు బదర్యాశ్రమేంద్ర
ముదయవరు చూచి సంతసమొందెననుచు"

8. మంత్రము : మంత్రాంగము : రాజకీయ విషయములు.

1) పరకాలుని గూర్చి చోళరాజు మంత్రాంగము. 60

2) ఢిల్లీ సులతాను రామానుజుల గూర్చి. 284-286

9. ద్యూతము : లేదు.

దౌత్యము : కలదు. ఢిల్లీ సులతాను రాయబారులు. 287

10. అద్భుతరణము } పరకాలుని పరాక్రమము విపులము. 57-64
11. విజయము } పిమ్మట పరకాలునికి విజయము చేకూరును.

"ప్రళయకాలోద్వృత్త జలధి నాది వరాహ
దేవుడు జొచ్చి మథించినట్లు
చోళభూపాలకరాళ చతుర్విధబలముల గాలునిపాలికనిచి
రక్తమాంసాది బహుళమౌరణధర్రితి బొసగ మృత్యువుకొక పాన
భూమి జేసె" - ఇట్లు రణము గావించినాడు.

12. మద్యపానజవిహారము : లేదు.

13. వనవిహారము : తొండరడిప్పొడియాళ్వారుల వైభవము. పుట 38

14. వారికేళి : రంభాద్యప్సరసల జలక్రీడ. పుట 54

15. కన్యాంగ సౌందర్య కథనము :

శృంగారనాయకలు : "స్త్రీ అదృష్టదేవత" భావము.

1. ఢిల్లీ సులతాను కుమార్తె. పుటలు 293.

"పదకఱ వింతలు బైల్పద నెఱకొల్పు
కళ్యాణమయ దీపకళిక యనగ
ననిశమౌ తన కోర్కులన్నియు సమకూర్ప
వచ్చి తోచిన కల్పవల్లియనగ''

2. దేవదేవి సౌందర్యము. పుటలు. 35

"నీల జీమూతాళి నిభమగు వేనవి
యమృతాంశు బింబమా యతివ మోము,....
కనకరంభా సమంబులా కాంత తొడలు''

ఇట్టి కాంతను దివ్యసూరి గాంచినాడు. ఇందు పోతన శైలి ప్రస్ఫుటము.

16. హిమకరాభ్యుదయము : (చంద్రోదయము) సంధ్యావర్ణన గలదు. పుట 297.

17. విప్రలంభము : ప్రియుని గూర్చి ప్రియురాలి విరహవేదన. రామ ప్రియుడు రామానుజుని వశుడయ్యెను. అంత ఢిల్లీసుల తాను కుమార్తె రామ ప్రియుని తలచుకొని పడు ఆవేదన కడు మనోజ్ఞము. పుటలు 298-301. ఇందు : 1) చంద్రుని దూరుట 2) మన్మథుని దూరుట 2) ఏడ్చుట 4) తద బాటు-భ్రమ 5) వేషభూషణాదుల తొలగించుట, ఆహారము మానుట 6) పరి చారకల ఉపచారములు మున్నగునవి గలవు.

1) చంద్రుని దూరుట : 5 పద్యములు గలవు.

''విరహిణీమారణావిర్భూత దురిత
పంక కళంకుడే మహాకలుషి వీడె,.......
రాహుదంష్ట్రోగ్ర విషమయ దేహివీడె
యభ్రపిత్రువని కొలవి దయ్యంబువీడె''

2) ఏడ్పు : "చెలియ! రాడాయె విభుడేమి సేయుదునని
కలితకలకంఠ కాకలీకలరవంపు
సొంపు పెంపార నేడ్చెనాసుదతి యనుచు
వాది భీకరగురుడనె మోదమలర!''

18. పద్మమిత్రోదయము : సూర్యోదయ వర్ణన. పుట 302

"ఈ హరిప్రియనెంతో యేచితినని శశి
వెలిచినట్లపరాద్రి మలుగు జొచ్చె........
త్వర మోహనాంగి చెల్వపిళ్ళయని
ప్రీతిగూర్చెడు పరంజ్యోతియనగ
బొడమె నుదయాద్రి నామ్నాయమూర్తియంత!"

19. పరిణయము : ఇందు : అలంకరణములు, అరణములు, అప్పగింతలు.

1. గోదాదేవి పెండ్లి 27 పుట
2. ధర్మవరుడను రాజకుమార్తె పెండ్లి పుటలు 49-50
3. ఢిల్లీ సులతాను కుమార్తె పెండ్లి పుటలు 304, 305

ఢిల్లీ సులతాను అరణమిచ్చుట : 50 వ పద్యము 304 వ పుట

"రత్న జాంబూనద రజత ధనౌఘము
లతిమృదుక్షౌమ దివ్యాంబరములు. ......
కర్ణాటరాజ్యము, గజరథాశ్వభటౌఘ
మాత్మజ కవియన్ని యరణమిచ్చి
యనుగుకోడలు నీకిది, హరికి పత్ని
యనుచు యతి భూపతికిజెప్పి యప్పగించె"

20. సురతము : (సుతునిగూర్చిగాక సంభోగ శృంగారము తరహాకు చెందినవి)

1. తొండరడిప్పొడి యాళ్వారులు పుటలు 36, 37, 42
2 ఢిల్లీ సులతాను కుమార్తె కేవలము తలంపు 294

ప్రాచీన ప్రబంధముల ననుసరించి ఈ కవియు శృంగార వర్ణనము చేసినాడు. విప్రనారాయణుడు, దేవదేవి యను వేశ్యతో క్రీడించుచుట్టము సందర్భము, సన్నివేశముల కనుకూలముగనే యున్నది.

"బాహుశాఖల జూచి పజ్జకు రావించి
యాత్మాంకమున నుంచి యనునయించి....
దేవితో పుష్పవనమున దిరిగెననుచు
వాదిభీకర గురుడనె మోదమలర!"

21 దౌహృదము : స్త్రీలు గర్భము దాల్చిరనుటకు చిహ్నములు వేవిళ్ళు ఇందులో లేవు. తోతారమ్మ సీమంతము గలదు. పుట. 564 (వేదాంతదేశికులు ఈమె గర్భములో 12 సం॥ లుండెను.)

22. సుతజననము : వృత్తాంతములుగా నున్నవి.

| | | |
|---|---|---|
| 1 రామానుజులు జన్మించుట | పుట. | 107 |
| 2. పరాశరభట్టరు, రామపిళ్ళ | ,, | 193 |
| 3. పిళ్ళలోకాచార్యులు | ,, | 407 |
| 4. మణవాళ మహామునులు | ,, | 436 |
| 5. వేదాంతదేశికులు | ,, | 564 |
| 6. నయనారుదేశికులు | ,, | 588 |

వేదాంతదేశికుల జన్మ : తోతారమ్మ "శ్రీహరి యస్మత్సుతుదయ్యేనంచు నాహ్లాదించినది" అపుడు శుభశకునములు :

"శాంతించెం గలిదోషముల్ పుడమి నంచత్పుణ్యముల్ మించె నా
శాంతాశాంత నిశాంత సద్యశు దనంతార్యుండు శ్రీకాంతునిన్
స్వాంతంబందు దలంచుచుండె విలసద్బాగ్రత్రయా దేవికిన్
వింతన్నంశయుగ్రైక పావన సుతావిర్భావ కాలంబునన్''

"శ్రీ వేంకటేశు ఘంటికోద్భాసితమూర్తియై యాసతికి తానుదయించెను."

ఇరువది రెండుగాక ఆదనపు వర్ణనలు : పెక్కులు గలవు.

గవంతుని వర్ణనము : ప్రత్యక్షమగునపుడు వర్ణనము :

కరిగిరీశుని వర్ణనము : రామానుజులు దర్శించుకొనుట. మూడు పద్యము రమణీయముగా వర్ణింపబడినది. పుటలు 236, 237.

"మఱియు, నార్తులకని మన్నింపబరుగిడు
కమనీయ జంఘా యుగంబు వాని,
శింజాన మంజు మంజీర జానులవాని
లలిత సత్పార్ష్ణి గుల్భముల వాని,
బ్రథిత కూర్మోపమ ప్రపదాబ్జములవాని
జక్కల నగు గోళ్ళ సొబగువాని
స్థల పద్మనిభ పాద తలములు గలవాని
దాసధనాంఘ్రి పద్మముల వాని

శ్యామసుందర సుకుమార నిత్యసత్య
దివ్యమంగళ విగ్రహదీప్తివాని
కరిగిరీశుని యతిరాజుగాంచెననుచు"

శ్రీ వేంకటేశుని వర్ణనము : తోతారమ్మకు బాలక బ్రహ్మచారి ప్రత్యక్ష
ంగుట : పుట 564.

"నీలాళిరుచి మించి నిగనిగ మెఱయుచు
నిగముడి శిరముపై చెన్నుగులుక,
చంద్రమండలమునఁజవి చాలుగతిముద్దు
మోమున చిరునవ్వు మొలకలెత్త
ద్వాదశాంగములందు ధవళోర్ధ్వపుండ్రముల్
శ్రీచూర్ణరేఖలు సిరివహింప,
బాలాశదండము పాణిపల్లవమున
దర్భ పవిత్రంబు దగిన వ్రేల
దాల్చి గళమున దిరువడిత్తావళములు
వరగ ధరియించి కైతవ బ్రహ్మచారి
క్షితి ననంతార్య దేవికి చింతలుడుప
గానబడియెను గన్నులగవకు నెదుట"

(శ్రీ వైష్ణవుల వేషము, ఆకృతి ఇందు స్వభావోక్తులుగ వర్ణింపబడినవి.)
పండితుల ఆకృతులు : శ్రీ పరాశర భట్టరు ఆకృతి అతిరమ్యము
(362 పుట)

"వెలలేని మానికంబులు గీలుకొల్పిన
తపనీయ మకుటము తలధరించి,
మహనీయ మణినద్ధ మకర కుండలములు
శ్రీ కారములబోలు చెవుల దాల్చి
ఘనరత్న తరళ ముక్తాహారములఁగంఖు

దివ్య దూర్మికలను గూర్చి దివ్య వస్త్రి
కలితకటితటి నవరత్న ఖచిత కనక
భవ్యకటి సూత్రముంచెను భట్టరనుచు''

**బహుపరాకులు :** రామానుజులకు వర్తించునవి. పుటలు 272-273.

''చార్వాక పర్వత శతకోటి సంకాశ
పాషండ ఖండన బహుపరాకు!
బౌద్ధమతధ్వాంత బాల దివాకర
పాపవిధ్వంసన బహుపరాకు!
పరుష మాయావాద ఫణిపన్నగాశన
భవరోగ భంజన బహుపరాకు!
బహుమతవ్యాఘాత పటుశుష్క తరుదావ
పావకమండల బహుపరాకు!
అనుచు సాతాని దాసులయ్యవసరమున
పసిడి బెత్తులు చేబూని పరమభక్తి
గురుని కన్నులమోల బొగడుచు జరిగిరనుచు."

**బిరుదుల పఠనము :** వేదాంతిని జయించుటకై పరాశరభట్టరుల వారు **మే**లునాటికి బోవుట. వేదాంతియున్న గ్రామసమీపమునకు బోవునపుడు ఆశ్రితులు, పరివారము చేయు స్తుతులు.

(వాద్యఘోషములు, రత్నశిబిక, ముక్తాతపత్రచ్ఛాయ, తాళవృంతములు **వందితాకృతి - ఊరేగింపుల** వైభవము తెలుపబడినది. పుట 359)

"అమూల్య రత్నఖచిత కుటీర హారకేయుర కటకాంగుళీయ కటిసూత్ర దివ్యమాలానులేపన క్షౌమోత్తరయ పరిధానాద్యలంకృతుడు."

జయజయ! శ్రీమద్వేదమార్గ ప్రతిష్ఠాపనాచార్యా! జయ!
ఉభయ వేదాంతాచార్యా! జయ! శ్రీ వత్సచిహ్నమిశ్ర
అభిమతసుతా! జయ! శ్రీరంగరాజకుమారా! జయ!
శ్రీరంగనాయక కమలాలాలిత దివ్యమంగళ విగ్రహా! జయ!
ఆదిమబ్రహ్మ సహోదరా! జయ! శ్రీరంగనాథ కృపాలబ్ధ
బ్రహ్మరథాధిరూఢా! జయ! అభంగమహోత్తుంగపతంగ
పుంగవతురంగారూఢ వీరనారాయణ బిరుదాంకా! జయ!

రణా! జయ! హారీన్వయపయః పారావార రాకాసుధాకరా! జయ! పరమవైదికలోకాగ్రేసరా! జయ! పరవాది మదహస్తి పంచాననా! జయ! శ్రీ పరాశర భట్టారకా!"

**2. రామానుజావతరణ చిత్రీకరణము :**

ఇది సార్థకమైన హృద్యమైన వర్ణనము. ఈ క్రింది పద్యములు పరిశీలింప నగును.

1. ఆదిశేషుడు శ్రీహరితో పంతములాడి రామానుజాచార్య భూమిక ధరియించెను. పుట: 161

''సర్వజ్ఞుడై, సర్వశక్తి సంపన్నుడై
సత్యసంకల్పుడై సర్వశేషి....
రామానుజాచార్య భూమిక ధరియించి
జ్ఞానాంజనమున మానవులకు
జూపె నచ్యుత పదదాస్య సులభధనము''

2. భూతపురి దైవము కేశవనాథుడు కేశవాచార్యుడగుట, లక్ష్మీదేవి కాంతిమతి యగుట : ఇరువురి స్వరూపమే రామానుజులు. పుట: 160

''కేశవాచార్యుడా కేశవ నాథుండు
కాంతిమతీదేవి కలిమికొమ్మ
యాదంపతులె లక్ష్మణాచార్యులైరని
తలచెద బహువిధ తర్కములను.''

3. నమ్మాళ్వారుల పాదపద్మమ్ములే రామానుజుల స్వరూపమగుట.
పుట: 157

''నారాయణుడె శేషినరసురగిరిముఖ
చేతనాచేతన సృష్టికెల్ల....
నతని కల్యాణ గుణాత్మకమగు దివ్య
విగ్రహంబు 'శఠారి' వేషమయ్యె
నతని కెంజాయల యంఘ్రి పద్మమ్ములె
రామానుజార్యుడై రంగుమీరె.''

క్రీడింపదలచిన కృష్ణ మొదటి
వ్యూహభేదం బంత్యమొక వర్ణ మలరింప
విశ్వంబు రక్షింప వినయ నియతి
వ్యంజితానుగ్రహవంతుడై "హరి సైన్య
నాథుండె" యీ "యతినాథు" డయ్యె
తద్వైతసారమే త్రిదండంబయ్యె
గాక యెట్లీశక్తి గలుగనేర్చు?
నిమ్మహాత్ముని వైభవం బెవ్వడెఱుగు
శేషుడో! సైన్యనాథుడో! శ్రీసఖుండో!
సదయుడై తోచె నిట్టుల సత్యమనుచు

5. ఇట్లు రామానుజులు చారుభవిష్యదాచార్యులైరి. పుట 155.

''చారు భవిష్యదాచార్యు నెవ్వని తొల్లి
సాక్షాత్కరించెను శఠవిరోధి''

6. రామానుజులు జలసమృద్ధిగల సరస్సు. సర్వప్రాణులను, పంటలను పండించుటకు భావితరములవారికి ఆచార్యుల నందించినాడు. దేశికులు మబ్బులుగా నలుదిశల వర్షింతురు. జీవులను సస్యములకు ప్రవాహములై పసిమి కలుగజేతురు. ఇట ఆచార్యపరంపర గలదు.

"శ్రీసఖజలధి సుస్థిరకృపా సలిలంబు
.... .... .... పుట 157
"యిబ్భువి యతీంద్రపద్మాకరేంద్రంబు.''
రూపకాలంకార శోభితమైన మనోజ్ఞవర్ణనము

గ్రంథ ప్రతిపాద్యము, ధ్యేయము, హితము :

7. రామానుజ కల్పవృక్షము : రూపకాలంకార చమత్కృతి.

"కేశవనామ లక్ష్మీవతి ప్రీతికై
భూతపూర్ణందన భూమి నడుమ
కేశవ ప్రభుడైన కేశవార్యుని వల్ల
కాంతిమత్యావాల కలన మొంది

బహు శాఖలు పాణిపాద పల్లవములు
మొలక నవ్వుల పుష్పములు వహించి
రంజిల్లుచున్నది రామానుజార్యుడ
న్పనిడివేల్పుల బెట్టు పలువిధముల
దెసలు పదియును దనఛాయ తెలివిదాల్చి
పెరుగు చున్నది లాసుర ప్రీతికొరకు
జెడక నరులార దాని భజింపుడనుచు
వాది భీకర గురుడనె మోదమలర!''

ఇచట వనిడి వేల్పుల బెట్టు - రామానుజులు. వర్ణనా చమత్కృతి హృద్యము.

4. శైలి - రసాలంకారములు, ఛందస్సు :

## శైలిని గూర్చిన వివరణము

శైలి - అర్థములు :

1. సూత్రార్థమును తెలిపెడి సంగ్రహటీక
2. ఒక విషయమును వివరించు పద్ధతి
3 కవి కావ్యరచనమున చూపెడి ఒక విశిష్టమైన మార్గము
4. నడవడి, చారిత్రము

వ్యు. (శిల + ష్యఞ్ - జీప్ - యలోపః) త. ప్ర.
ఇచట 2 వ, 3 వ అర్థమునే గ్రహించి కవిశైలిని గుర్తింపవచ్చును.

5 అమరకోశమునందు -

''శీల్యతే అభ్యస్యత ఇతి శిల్పం'' అభ్యసింపబడినది.

శిల్పం నిపుణ కర్మ.

''శిల్పం కర్మకళాదికమ్.''

శైలి - రకములు :

1. ఆఖ్యానశైలి - కథాకథనశైలి (Narratine Style)
2. నాటకీయశైలి (Dramatic Style)
3. వర్ణనాత్మకశైలి (Descritive Style)

సామాన్యముగా నీ మూడు శైలులు ప్రతికవిలో నుండవచ్చును. దేనికైనను ప్రాధాన్యమొసంగుట కవి యిష్టముమీద ఆధారపడి యుండవచ్చును.

శైలి - శయ్య : కొన్ని నిర్వచనములు* :

1. శైలి - శిల్పములు : ఇవి పర్యాయ పదములు

STYLE అన్న ఆంగ్ల పదానికి సమానార్థకములు.

2. 'శీల' ధాతుభవములే శైలీ శిల్పములు, శీలధాతువునకు ఆఖ్యానము - సమాధి అను అర్థములు గలవు.

3. STYLE is the Technic of expression.

(The problem of style. J. N. Murry, Page 7.)

4. భాషకు జీవనాడులు విశిష్టపదబంధాలు. అపూర్వ బంధురాలు, కవితా మూలకందాలు అయినట్టి పలుకుబడులు నుడికారాలు.

5. శయ్య యను పదము ఆంగ్లమునందలి Style అను పదముతో సంవదించును. ఒక రచయితకు ఒక ప్రత్యేకమైన శయ్య యుండును. Style is the Man. శైలి రచయిత ప్రత్యేక ముద్ర యగును. శయ్యయన పదమైత్రి. ఇది శబ్ద ధర్మము. "అల్లసానివాని అల్లిక జిగిబిగి."

6. మాలాకారుడు ఏ పువ్వు నే పువ్వుతో జోడించినచో బాగుండునో నిర్ణయించుకొనునట్లు రచయిత ఏ పదముతో నేపదమును సంధింపవలెనో తెలిసికొనవలెను.

7. శైలిని నిర్వచించుట కష్టము. సహృదయులే కవుల శైలిని గుర్తింపగలరు.

గమనిక : ఇందలి 1, 2, 3, 4 అంశములు "తెనాలి రామకృష్ణుని పదప్రయోగ వైచిత్రి" పుటలు 25-35 లోనివి. డా॥ కె. యస్. లక్ష్మారెడ్డి గారి అముద్రిత సిద్ధాంత వ్యాసగ్రంథము.

6 వ అంశము భామహునిది.

---

* ఇదే వరుస పేజీలోని గమనికను జూచునది.

**కావ్యానుశీలనము - శైలినిగూర్చి : శ్రీవైష్ణవశైలి :**

ఈ కవి కథా కథనశైలిని కొనసాగించుచు అవసరమైనచోట్ల వర్ణనాత్మక విధానము నవలంబించినాడు. జీవిత చరిత్రలు గనుక విషయమునకు, కథా గమనమునకే ప్రాధాన్యముండును. విశిష్టాద్వైతుడు గనుక, గ్రంథము తత్సంబంధమే గనుక శ్రీవైష్ణవ ప్రభావముద్ర ఈతని శైలిలో అడుగడుగున ప్రస్ఫుటముగా గోచరించును. మనము నేడు పరికించునట్టి శ్రీవైష్ణవాచార్యుల ఉపన్యాస కాలక్షేపములలో, గ్రంథములలో శ్రీవైష్ణవుల ప్రసంగములు, రచనలు, ధోరణులిట్లుండునని సులభముగా అంచనా వేయగలము. దీనిని 'శ్రీవైష్ణవశైలి' యన్న సుసంగతమే యగును.

ఇతని శైలిని సహృదయుడైన పాఠకుడే గుర్తింపగలడు. సంస్కారయుతమైన, సంప్రదాయబద్ధమైన, ఆచార్యరుచి పరిగ్రహీతమైన, శాస్త్రీయమైన పదముల సమీకరించి, కవితాగుణమును విడిచిపెట్టక, ప్రతిపాద్యాంశములను ధారాళమైన శైలిలో, మన కన్నులకు గట్టినట్లుగా ఈ కావ్యసౌధమును రచనా శిల్ప సంపన్నముగావించి మన కందించినాడు. పదగుంఫనముల సౌకుమార్య సౌందర్య సౌశీల్యాదులనుబట్టి ఇతనిది విశిష్టాద్వైతతత్త్వ మహాప్రబంధమని, శ్రీవైష్ణవ మహాకావ్యమని, శైలి శ్రీవైష్ణవ శైలియని నిర్ణయించుకొనవచ్చును.

**ధ్వనులు : గుణములు : రీతులు : వృత్తులు : శయ్యాపాకములు : ఔచిత్యపోషణము : స్పష్టత : మొదలగునవి :**

ఇది ధ్వని ప్రధానమైన కావ్యము గాదు.

మొత్తము మీద పరికించినచో ప్రతి కావ్యమున ధ్వనులు, రీతులు, గుణములు, శయ్యాపాకములు, అలంకారములు, రసములు ఏదో విధముగ కవితాధారలో ఎంతైనా కొంత పరిధి మేరకు ప్రవహించుచునే యుండును. కవి తనకిష్టమైన శైలీ సామగ్రికి ప్రాధాన్యమొసంగుచుండును.

ఈ కావ్యములో సందర్భమున కనుగుణ్యములైన వర్ణనములుండిసందున, ఔచితికి భంగము వాటిల్లలేదు. దేవతాసంబంధ శృంగారముండునెడల అది అమలిన శృంగారమే యగును.

రచన పాకములు : ద్రాక్షాపాకము, కదళీపాకము కూడా శాస్త్ర పారిభాషిక పదములకు నిఘంటువులను వెదకవలసియుండును. ఇవి అస్పష్టతకు దారి తీయునవిగా లేవు.

గుణములు : పది గుణములలో కొన్నింటి నిందు నిరూపింప వచ్చును. ప్రసాదము, మాధుర్యము, సమత, అర్థవ్యక్తి మొదలగునవి.

రీతులు : వైదర్భి తొంబది పాళ్ళు

గౌడి : కృతిభర్త స్తుతి పద్యములు

ఇంకను అటనట వచన భాగ సమాసములు ఐనను అస్పష్టత లేదు. కథ నుంటువడక ముందునకు సాగిపోవుచుండును

వృత్తులు : కైశికిని, భారతిని లెక్కింపవచ్చును.

ద్రాక్షాపాకమున కొకయుదాహరణము. నడక సాఫీగా సాగిపోయినది.

వేదాంతదేశికుల యాత్రలు : ఆ. సూ. ము. పుట. 578

''తరుణవయస్కుడైన కవి తార్కికసింహ గురుండు భక్తితో
వరుసగ సంయమీంద్ర, శఠవైరి ముఖార్యుల జూచి మ్రొక్కి, యిం
దిరకు ప్రణామమార్చి, జగతీ సుఖదాయిని రంగశాయినిన్
గురుని, హరిన్ భజించి, శఠకోపము, తీర్థమునందెబొందుగాన్''

శైలి : కావ్యాభాషాశైలి :

వచనరచన నుండి కొన్ని యుదాహరణములు :

1. పుట : 77. నమ్మాళ్వారుల వైభవము, కంబకవీంద్రుడు నమ్మాళ్వారుల స్తుతించుట.

''మహాత్మా! ప్రతిక్షణాక్షీణ స్వపక్ష విక్షేప ప్రక్షుభిత
ప్రతిపక్ష పక్షుండగు పక్షీంద్రుని యెదుట మక్షిక యాడగలదే!''

2. పుట : 110. పూర్వభాగము. 5 వ యుల్లాసము.

సందర్భము : పెరియతిరుమలనంబి తనభాగినేయుడగు గోవిందమిశ్రుని శ్రీవైష్ణవునిగా జేయుటకు కాళహస్తికి చేరుకొనును. అచటి ఆరామ వర్ణనము మనోజ్ఞము.

''అట్లరుగుదెంచి యగ్గురు వరుండప్పురపరిసర పరివర్తమాన పరిపూర్ణ నీరపూర విరాజమాన సువర్ణముఖీతీరంబున,తదూర్మి జాలాతి శీతలాంబుకణకలిత సమీర సంకలన సమాస్వాయిత పల్లవిత........ మాకంద మందార తాలతమాల హింతాల రసాల, సాలజంబు, జంబీర-ఆదిపరిమిత మహోన్నత ద్రుమాభిరామంబైన యొక్క యారామంబు బొడగాంచి.'' 3. పుట : 63. పూర్వభాగము

"అంత నఖండనోర్వీమండలంబునం బ్రచండ వేదండ శుండా దండి మండిత పరకాల దోర్దండ మండనాయిత మండలాగ్ర శితధారా ఖండితంబులయి పడియున్న యేనుగుల పీనుంగులును హీనాంగంబులగు తురంగబులును, విశకలితంబులగు రథంబులును...."

4. పుట : 361. ఉత్తరభాగము మొదటి యుల్లాసము.

భట్టరు వేదాంతిని జయించుట. వారి వాద యుద్ధము :

"అట్లావేదాంతి తన తలంపునం దలంప, మత్తమాతంగాధిష్ఠిత మందరాద్రి ప్రస్తరంబు పైకిం జౌకళించు నకుంఠిత కంఠీరవంబు చాడ్పున తద్విద్వదుషితంబగు మహోన్నత మంటప మధ్య కతిరయంబున నేతెంచెను.

శ్రీరంగ రాజాభిమాన పుత్రుడగు భట్టరు, అస్మద్వాక్యంబులు కొన్ని ముందర నాకర్ణింపుమని పల్కి, ప్రావృట్సమయ, సముద్వేల్లోల్లోల మహోత్తుంగ తరంగ రంగద్గంగా తరంగిణీ ప్రవాహంబు తెఱంగున నుపన్యసించనా వేదాంతి దానిని ఖండించెను.

ఇట్లన్యోన్య గ్రంథ ఖండన నిర్వాహణ పూర్వకంబుగా హరిహరియును, గిరిగిరియును బోరుతీరున పరస్పర విజిగీషచే బ్రహ్మతర్క ప్రమాణ శాస్త్రచ్ఛటలం బ్రబల వాదావహంబొనరించు వారికి తొమ్మిది వాసరంబులు గడిచె."

5. 604, 605 పుటలలో : ప్ర.భ. అణ్ణంగారు శ్రీ వెంకటేశుని దర్శించుట మనోహరము.

6 1 వ పుట గ్రంథారంభములో శ్రీవైకుంఠములో శ్రీమన్నారాయణుడు సభ దర్చియుండుట కడు గంభీరముగా నున్నది.

7. పుట : 457 ఉత్తరభాగము : చతుర్థోల్లాసము.

సందర్భము : శ్రీ మణవాళ మహామునుల కాలక్షేపములు.

శ్రీమన్నారాయణుండే సర్వాధికుండేల? జవాబిట్లు గలదు:

"భగవత్పరతంత్రులగు బ్రహ్మరుద్రు లతనికంటె నధికులు గారు. అదిగాన వారిరువురికి వేదాపహార గురుపాతక దైత్యపీడాద్యాపద్విమోచనుండును, సకల శ్రుతిస్మృతితీహాస పురాణాది సరస్వతీ ఘోషుష్యమాణ జగజ్జన్మాది కారణత్వ, సర్వాంతర్యామిత్వ, సర్వనియంతృత్వ, సర్వరక్షకత్వ, సర్వశక్తిత్వ, సర్వజ్ఞత్వ, సత్యసంకల్పత్వ, శుద్ధసత్త్వమయ, నిఖిలహేయ ప్రత్యనీక, కల్యా

జైకతానత్వ, నిరుపాధిక, నిఖిలవిధబంధుత్వ, నిస్సమాభ్యధికత్వాది శుభలక్షణోపలక్షితుండునగు శ్రీమన్నారాయణుండు సర్వాధికుండు.''

8. పుట : 463. ఇదే సందర్భములో నృసింహునకు శరభరూపియగు రుద్రునిచే పరాభవం బెట్లు సంభవింపనేర్చునని మాముసులు నృసింహుని మహిమను, ఉగ్రరూపమును గూర్చి వర్ణించిరి. గంభీరమైన శైలి గలదు.

**పోలికలు : అనుకరణములు :**

ప్రాచీనాంధ్ర కవులలో ముఖ్యముగా పోతన్నను, రాయలను ఎక్కువగా అనుకరించినాడీకవి. ఇట్టివి పద్యములలోను, వచనములలోను గలవు.

1. ఆముక్తమాల్యద ననుకరించుట : ఆ. సూ. ము. పుట 23 లోనిది: విష్ణుచిత్తు డిట్లనెను :

''సర్వవేదాంత ప్రతిపాద్య వేదశాస్త్రాధ్యయనాది జనితజ్ఞానవాసనాహీనుండనగు నేను విద్యాశుల్కంబైన యిద్ధనంబు పుష్పవన ఖననజనిత స్వపాణితల కిణతిణంబులం జూపి తేవలయుంగాని వేరొక యధికారంబునం గొనలేను."

ఇది ఆముక్తమాల్యదలోని : "స్వామీ, నన్ను ఇతఃపురాపఠితశాస్త్రజ్ఞాన" అనుదాని కనుకరణము.

2. పోతన వచనము : ప్రథమస్కంధము పుట. 36 సూతుండు నారాయణ కథాప్రశంస సేయుట :

''అని యిట్లు మహనీయ గుణగరిష్ఠులయిన శౌనకాది మునిశ్రేష్ఠులడిగిన, రోమహర్షణ పుత్రుండయి, యుగ్రశ్రవసుండను పేరనొప్పి, నిఖిలపురాణ వ్యాఖ్యాన వైఖరీ సమేతుండయిన సూతుండు.''

ఆ సూ ము వచనము: పూర్వభాగము, 5 వ ఉల్లాసము. పుట - 127. "కార్పాసారమలక్ష్మీ వైభవము."

"అట్లమ్మానినీ మణిని సన్మానించి, కార్యాసారామ వరదాచార్యుండఖిల ద్రావిడామ్నాయ వ్యాఖ్యాన వైఖరీ గరిష్ఠుండగు యతిశ్రేష్ఠునింగాంచి భక్తిపూర్వకంబుగా సాష్టాంగ ప్రణామం బాచరించి, కరకమలంబులు ముకుళించి యిట్లనియె."

(ఇందు వ్యాఖ్యానవైఖరి - గరిష్ఠ - శ్రేష్ఠ శబ్దములననుకరించినాడు. అని తెలిసికొనవచ్చును.)

పద్యముల శైలిలో పోలికలు:

1. పోతన పద్యము : భాగవతము. పుట - 12. కవి స్వప్నము.

''మెఱుగు చెంగటనున్న మేఘంబుకైవడి....
కన్నుగవకు నెదరగానబడియె

ఆ.సూ.ము. లో 4, 5 చోట్ల "కన్నులకు గనబడుట" వర్ణన గలదు.

ప్ర.భ. అణ్ణంగారికి శ్రీ వేంకటేశుడు కనబడుట. పుట - 596.

''అంజన పుంజమో హరినీల శైలమో
యనజాలుసీలకయంబువాడు.''

పోతన 'గజేంద్రమోక్షము'లోని "అటగాంచెం కరిణీవిభుండు" అనుదానికి ఆ.సూ ము. షష్ఠాశ్వాసము, పరవాదిభీకరగురుని యాత్రను గూర్చి : అటగాంచెం పరవాదిభీకరగురుండత్యంత సౌరభ్య సుస్ఫుట పుష్పౌఘ మరంద........''

(పుట. 601)

కవిసమయములు :

I. తామ్రపర్ణి నది యందే ముత్యములు లభించునట్లు వర్ణింపవలెను. ఇది కవిసమయము. (కావ్యాలంకార సంగ్రహము పుట 490)

ఆ.సూ.ము. లో తామ్రపర్ణి వర్ణన గలదు. పుటలు 198, 498.

ముత్యములకు జన్మస్థానము :

1. ''చారుముక్తాఫల జన్మనిదానము,
సమదగజాకీర్ణ సైకతంబు....

(ఇట్టి నదిని రామానుజులు గాంచిరి. పుట 198.)

2. మణవాళ మహామునుల వైభవములో, శఠకోపుల జననమును గూర్చి తెలుపు సందర్భము.

''ముజ్జగంబులయందు స్నానపానంబులచే ముక్తిదాయిని యనియు, మౌక్తికంబులకు జన్మస్థానమనియు, ప్రసిద్ధిగాంచిన తామ్రపర్ణి యని యొక నది గలదు.'' (పుట 498)

వడుగనంబి : ఆచార్యపదంబుదయ వరులకే ముఖ్య వాచకంబగుటచేసి "ఎంబెరుమానారు తిరువడిగళే శరణమని యానతిచ్చె." (పుట 341)

శైలి పదగుంఫనములు : ఈ కవికి మిక్కిలి ఇష్టమును గూర్చినవి : తఱచుగా వాడుకొనబడినవి.

1. తిరుమంగైయాళ్వారుల వైభవములో : పుట. 55.

సందర్భము : "కుముదవల్లి"యను భిషగ్వరుని పెంపుడు కుమార్తెను గాంచిన పరకాలమునీంద్రుడు:

"తద్దివ్య సౌందర్య సౌకుమార్య లావణ్య యౌవన, చాతుర్య గాంభీర్యాది గుణంబులన్నియు జూచి...."

2. ఉదయ వరుల వైభవములో పుట. 176.

సందర్భము : శ్రీ వేంకటాద్రికి చేరిన యతిపతికి అచటివారు చెప్పిన కథాంశములలో అలమేలుమంగ మగని కౌగిట జేరుటకు కారణము శ్రీవత్స లాంఛనుని సౌందర్యము. "విప్రాంఘ్రి హతిబోలె వెలసిన శ్రీవత్స చిహ్న మిప్పటికిని జెందియుండె" నైన సీతని, "సకలావయవౌజ్జ్వల్య సౌందర్య సౌగంధ్య సౌకుమార్య నిత్యయౌవన ముఖ్యనిర్మలా సంఖ్యేయ కల్యాణగుణముల కలిమిజేసి ..."

3. మణవాళమహాముని వైభవము, పుటలు. 446.

వృషశైలనాథుని వర్ణనము :

"సౌందర్య లావణ్య సౌకుమార్యోజ్జ్వల
        సౌగంధ్య సౌష్ఠవ సద్గుణాఢ్య,
మతనిపాదాది మూర్ధాంత దివ్యాంగ సం
        స్థానము దివ్యభూషణ వితానము"

(ప్రైవాటిలో గద్యత్రయములోని పదగుంభనము గలదు.)

**ఇంకను సమాసములు, పదగుంఫనములు సంగ్రహ రూపములో ఈ కవి కిష్టమనిపించినవి :**

1. ఆచార్యరుచి పరిగ్రహితము. పుట 392

2. విశిష్టాద్వైతసిద్ధాంతము, నిర్వహణము 196, 451

4 ప్రాప్యప్రాపకములు 119

5. ధ్యేయము, అనుసంధేయము 153

6. జ్ఞానప్రదీపము (202) 7. ధిష్ణ్యము (364)

8. అధీతసాంగ, సశిరస్క సరహస్యామ్నాయ సముదయుడు 74.

పూర్వవచన రచనాశైలి :

వాక్యనిర్మాణములలో సామాన్యములు, తఱచుగా కన్పించునవి :

1) లభించి : పుట 74 (లభియించి) 589వ పుట బహుమతి లభించి 581, లభించితిమి. 590, 145.

2) ఉజ్జీవించు, అధికరించు, సాపరాధచేతనుడు, దాసుడు గ్రంథమందెక్కువగా నున్నవి.

''సాపరాధచేతనుండగు నా సాహసంబోర్చి,నన్ననుగ్రహింపవలయును. దాసచేతనుడు'' పుట 623.

3) తప్పులెంచకుడు, క్షమింపుడను భావములు గలవు.

1) తిరుమంగైయాళ్వారుస్తుతి : ''గురువరేణ్యమదీయ వాగ్దోషములను, దలపబోకుమి మదిని మా తండ్రియనుచు.'' పుటలు 70.

2) తొండరడిప్పొడి యాళ్వారుల వైభవము. పుట 46.

''తప్పులెంచక పరమకారుణికులౌ పరమ భాగవతులు సాహసంబిది కృప క్షమియించ దగుదురు.''

3. వాక్యములు : పుట 593. 'నయనారుదేశికుల వైభవము'. "ఇట్లు పెద్దలవలన విన్నక్రమముగా పూర్వాచార్య గ్రంథంబుల వలన తెలిసినంత వ్రాయంబడియె, క్షమాసారులు, దీనవత్సలులునగు వైష్ణవులీ దాసచేతనుని సాహసం బోర్వదగుదురు. మఱియును."

4. మరణమునైనను అందముగా చెప్పువిధానము : భట్టరు పరమపదము·

1. "గోవిందుని దలచి యతని పాదపద్మములను జెందె" (పుట 379)

2. "ఉన్నాడు మిన్నంది, కన్నాడు మారుపు,'
మన్నాడతండిక మహికి రాడు." (పుట 380)

3. ప్ర. భ. అణ్ణంగారు : ''సుందర వరయోగి రాజపద - తామరసద్వయ మొందె భక్తితో౯.'' (పుటలు 618)

కళలలో నొక భాగము. అట్టి కవితాశిల్పము గూడ ప్రధానస్థానము నాక్రమించి నది. శిల్పి శిలను చెక్కి సౌందర్యమయ విగ్రహమును నిర్మించునట్లు కావ్యశిల్పి యైన కవి శబ్దార్థములను జోడించి కావ్యనిర్మాణము గావించును. అదియే కవితా శిల్పము. ఇదియును శైలికి సంబంధించినదియే.

నన్నయగారి ''అక్షరరమ్యత, నానారుచిరార్థ సూక్తినిధిత్వము, కవితా కలితార్థయుక్తి'' ఇవన్నియు కవితాశిల్పమునకు సంబంధించిన విషయములే.

ఇట్టి సాధన సంపత్తులతో జగద్ధితమైన ఆంధ్ర మహా భారతమను భవ నమును నిర్మించినాడు.

అచట అక్షర రమ్యతను నన్నయ వాడుకొనగా, ఇచట ఆ సూ ము.లో నంబూరి కేశవాచార్యులవారు రస మృష్ట పదాక్షరముల వృత్త పద్య రచన నెన్నుకొన్నాడు. ఇతని సాహిత్యోద్దేశమును జగద్ధితమే. లోకోపకారార్థమే.

ఉత్తర భాగములోని షష్ఠోల్లాసమునందలి మొదటి పద్యము :

''ఆదరమొప్ప నాదు రసనాగ్ర శుభాసన మధ్యవర్తియౌ
వాది భయంకరార్య్య దనవద్య కృపాతిశయంబుచే నికన్,
హృదటి గ్రంథమంత ''రసమృష్ట పదాక్షర వృత్త పద్య'' న-
మ్మేదుర భావమొందుగతి మేలుదయింప రచించు నింపుగాన్.''

ఇట్లు పద్యపు నడక చకచక సాగినది. అన్వయక్లిష్టత లేదు. ధారాళమైన శైలి. ఇట్లే ఈ భాగమంతయు చక్కని పద బంధములతో చిక్కగా సాగి పోయినది.

**అన్యదేశ్యములు :** ఈ కవి ప్రయోగించిన అన్యదేశ్యములవల్ల ఇతనికిగల బహుభాషాపరిచయము వెల్లడియగును. (భారతీయభాషలైన సంస్కృత - తమిళములేగాక మహమ్మదీయ దండయాత్రల వలన ప్రవేశించిన ఉర్దూ - పారసీక పదములు తెలియనగును. ఇందులో ఆంగ్లభాషా పదములు కానరావు :

కవికాలమునాటికి వ్యవహారములోనున్న పదములు - 19 వ శతాబ్దము.

1. తురుష్కలు పుటలు 274 - ఇంకను 424, 426, 427 లో ఈ పదము గలదు. మహమ్మదీయుల నుద్దేశించినవి

3. మ్లేచ్ఛులు ,, 274 - ,,

4. హూణులు - ఒకానొక మ్లేచ్ఛజాతి. గోమాంస భక్షకులు

5. యవనతురుష్కులు - 583

6. హిందూల - హిందువుల - పుటలు 293, 301

7. వజీరులు - మంత్రులు 282

8. ఉమ్రావులు (ఉమ్రాలు) - రాజకీయోద్యోగులు 282

9. పీరుజాదాలు - పీర్లు (మహమ్మదీయుల విగ్రహముల నిర్వహించు వారు - పీర్లపండుగ) 283

10. పకీరులు - మహమ్మదీయ భిక్షకులు 283

11. ఖాజీలు - న్యాయాధికారులు 284

12. శూరమానులు - వీరులు, శూరయోధులు 284

13. సరదార్లు - చిన్నప్రభువులు, దొరలవంటివారు 284

14. జప్తీచేయుట - లాగికొనుట 282

15. హజారము మొగసాల 290

16. పారసీక - పర్షియా, పార్సీవారు 290

17. ఔరంగజేబు - మొగలాయి చక్రవర్తి 290

18. సుల్తాను - ఢిల్లీశుడు, ఢిల్లీశ్వరుడు 294

గ్రామ్యములు : అచ్చతెలుగు పదములు : జనుల వ్యవహారములో నున్నవి : వాడుకలో నున్నవి, కొన్ని మాత్రమే.

1. తూటపుచ్చి : రంధ్రము చేసి, పుటలు 113, 587.

2. కొండదవుడ : కొండక్రింద 114

3. పటపట పగుల : ధ్వన్యనుకరణము 114

4. దొడ్డతప్పు : అపరాధము

5. కాళబత్తుడు : కాళహస్తీశ్వరుని భక్తుడు

6 దొమ్మిచేసి : అందరు కలిసి కలియబడుట 359

7. బాడబులు : బ్రాహ్మణులు 360

8 పలుగాడి : పశువుల దొడ్డి 508

9. తోడుకచని : తీసికొనిపోయి, తోడుకరండు తీసికొనిరండు 288

10. ముతరాచ ; ముదిరాజ్ కాపువారు 69

కొన్ని పదబంధములు : సంస్కృతము - తెలుగు - తమిళము :

1. సంయమినేత - యతిరాజులు, రామానుజులు 331

2. అళిగరున్నికరనీలాలకావళి - తుమ్మెదరెక్కల సమూహము వంటి నల్లని ముంగురులు 400.

3. తిరునోపు దాత్తుకొను - రోగము, నొప్పితో బాధపడు 401.

4. సారతమార్థము (కవికిష్టమైన సమాసము) 541.

5. రసనాగ్రశుభాసన మధ్యవర్తి - (వాదిభీకరగురునిగూర్చి)

6. రసమృష్ట పదాక్షర వృత్త పద్య సమ్మేదుర భావము - శైలినిగూర్చి 557.

7. 'ముసలకిసలయము' - కావ్యము పేరు, తిలకాష్టమహిష బంధము వంటి పదము, రోకలి చిగుర్చుట. దీనిని వాదికేసరి యళహియమణవాళయోగి వ్రాసిరి 418.

8. ఉన్మనీ భావదశ - ప్రపంచమును సాక్షిమాత్రుడుగా నుండి చూచుచు సంకల్పమును ఉన్మూలించుటచేత నేర్పడెడు యోగుల అవస్థ.

9. పల్లాండు పాడుట - తిరుప్పల్లాండు దివ్య ప్రబంధము ననుసరించుట- 443.

10. ఆచార్యపదపద్మమందుట - పరమపదమును జేరుట -

11. శ్రీముఖ పత్రము - తిరుముఖ పత్రిక - ఆజ్ఞాపత్రము - Memo.

12. సుధాధవళ నీహారధార - తెల్లని మంచునీటి ధార - 119.

13 భగవద్భాగవతాచార్య భుక్తావశిష్టము - పెద్దలు తినగా మిగిలిన ఆహారపదార్థములు - వారు తళిహలో విడిచినవి.

14. సుప్రసన్నాదిత్య సుషుమావృతాత్మీయ దివ్యమంగళమూర్తి } వరవరమునుల వర్ణన 505

15. భవ్యరత్నభాట్సురుచిర మందిరము - రత్నమందిరము 598

16. విద్వదీడ్యోత్పాత్రా! - రామానుజుల గూర్చి స్తుతి 624

17. శమదమాద్యనంత కళ్యాణగుణ పరిపూర్ణులు (భక్తిభావ ప్రకటన)

18. నిగమాంతగురుడు, శ్రుతిశేఖరదేశికుడు, వేదశిరోగురుడు - వేదాంత దేశికులు.

19. వేదశిఖర ద్వంద్వము, నిగమశీర్ష ద్వద్వంము- ఉభయవేదాంతములు

కొన్ని సామెతలు - జాతీయములు - లోకోక్తులు - న్యాయములు :

(సంస్కృతము - తెలుగు - తమిళము)

1. "పీనుగటుండగా పెండ్లి యొనర్పంగ దగునె
శరీరావసాన దశను." పుటలు. 100

2. "అడవిగాచిన వెన్నెల" 189.

3. "వరటగట్టు" రసజ్ఞ! (వరట - పిడక) 331

4 "రథసంధి సంధిలెగదా!" (గోడమీదిపిల్లి దశ. సంశయము) 295
(రామప్రియుని భావములో) (రెండును ఇష్టమైనట్టివే)

5. తత్పదాబ్జయుగంబె తంజము (పలుమార్లు వచ్చును)

6. ఎంబెరుమానారు తిరువడిగళేశరణము. ( ,, )

7. తిరునాడలంకరించు (పరమపదమునుజేరుట) 55

8 ఏకలవ్యుండగానో (ఏకలవ్య శిష్యరికమువంటిది) 180
(రామానుజులన్నమాట) 340

9. ఆలస్యమమృతం విషమ్ 182

10. వైశ్వామిత్రమేర్పరించుట : విశ్వామిత్రునివంటి వ్యతిరేకత. 185

సందర్భము : తిరుమారెయాండాను చెప్పిన యర్థమునకు రామానుజులు తిరువాయిమొళికి యామునులను కొన్ని అర్థమునే చెప్పగా నాతడు తన వద్ద చదువు చాలించుమని తెలిపెను.

11. పద్మినీ పాంచాల భావము : అనుకూల దాంపత్యము 187

శృంగారనాయిక - పద్మిని - నాయకుడు - పాంచాలుడు. ధనుర్దాసు రామానుజుల నాశ్రయించి భార్యను వదలగా, రామానుజులు పైమాటలని వారిరువురిని మరల కూర్చెను.

12 ''తెల్లావగింజన చెల్లు పుడమి'' - అరుదుగా కనబడుట.

పుట. 190

సందర్భము : యాదవప్రకాశులు రామానుజుల నాశ్రయించుటకై వచ్చి పలికిన మాటలు. నీవంటివారు కోటికొక్కరను భావము.

''అరయనెవ్వని 'తల లందొక్క తలపైని
తెల్లావగింజన చెల్లుపుడమి'

తతులు చెడునని పల్కెనా దాంతు డనుచు''

13. గోవత్సన్యాయము, ఆచార్యశిష్యసంబంధము, ప్రేమ. 365

పరాశరభట్టరును వేదాంతి అనుసరించెను. ఆశ్రయించెను.

14. వడిసుళ్ళు బెట్టించు- త్రిప్పిత్రిప్పి ముప్పుతిప్పలుబెట్టు. 358

వేదాంతికడనున్న పండితశిష్యులు క్రొత్తగా వచ్చిన పండితులను ఇంటి ద్వారము వద్దనే నిలిపి వడిసుళ్ళు బెట్టించి, దొమ్మిచేసి జయింతురట.

**బిరుదులు : సంబోధనలు : ఆచార్యులను గూర్చినవి**

(ఎన్నియో గలవు. కొన్నింటిని పేర్కొనుచున్నాను)

1. ఆళువందారులు : (యామునాచార్యులు) - ''నెన్నైయాళవందారి వరని పల్కె చోళరాట్పత్ని'' పుట 97.

2. పితామహపితామహులు (శ్రీశైల పూర్ణులు) - ఆకాశ గంగను గూర్చిన వృత్తాంతము. శ్రీ వేంకటేశుని అనుగ్రహము వల్ల : ''మహి పితా మహపితామహుండని తిరుమల నంబికి పేరయ్యె ,, (పుట 114)

3. రామానుజులను గూర్చినవి ఎన్నో కలవు. కొన్ని :

1. ''ఎంబెరుమానారె'' గోష్ఠిపూర్ణులు. (పుట 173)

''ఎంబెరు మానారెయందు రమ్మని పిల్చి గ్రుచ్చి కౌగిట చేర్చుకొనె''

2. భాష్యకారులు సరస్వతి పలికిన మాటలు. (పుట 215)

''భాష్యకారులు, మత్ప్రియ భాష్యమిదియె!''

4. నంజియ్యరు (వేదాంతి) పరాశరభట్టరు పిలుపు (పుట 367)

''గ్రుచ్చెత్తి కౌగిట గొనుచునంజియ్యరే కుశలమా! నీకని కూర్మినడుగ''

5. నంబిళ్ళ (నంబూరి వరదరాజు ''లోకాచార్య'') - నంజియ్యరు పిలుపు (పుట 386)

''సాగి మ్రొక్కెడి ముందు జరిగిన వృత్తాంత
మంత శిష్యుడు చెప్ప నాలకించి
నంబిళ్ళయోయని హర్షించి కౌగిట నప్పళించి''
తోడెరప్ప ఇచ్చిన బిరుదు (పుట 391)

వత్సా! యపుడు జగదేక గురుడవైతివి "

''నాటి నుండి భూమి లోకాచార్య నామము చెల్లెను నంబిళ్ళగారికి.''

6. వేదాంతదేశికులు, కవితార్కికసింహ, సర్వతంత్ర స్వతంత్ర (పదాంకిత విజయ ధ్వజము) - బిరుదు లసంఖ్యాకములు. కొన్ని : దీప ప్రకాశికదేవ దివ్యాలయ గోపుర ద్వార సమీపమున తన గృహ బహిర్ద్వారాంగణస్థలి స్తంభము నాటించి దానిపై తన "సర్వతంత్ర స్వతంత్ర మహా బిరుదాంకితమగు విజయ ధ్వజంబు" గట్టించెను. (పుట. 567)

7. ప్రతివాది భయంకరం అణ్ణంగరాచార్యులు - సందర్భము : నృసింహ మిశ్రుండను అద్వైత వేదాంతిని అణ్ణంగారు వాదములో నోడించి, తన గురువైన నయనాచార్యునికడ కేతెంచి ప్రణామం బాచరింప, ఆచార్యుం డణ్ణంగారిని గాఢాలింగనం బొనర్చి, శిరంబు మూర్కొని "ప్రతివాది భయంకరనే యణ్ణనే" యని సంబోధించెను. (పుట. 596)

8. ఎంబారు - గోవిందుడు, గోవిందమిశ్రులు (మహాచార్య ఎంబారు మహాకవి) -

"గోవిందమిశ్రులు గురునామమందున
ఆద్యంతపదముల నమరినట్టి
ఎంబారనెడు నామ మింపుగా ధరియించి" (పుట. 180)

9. అరుళాళప్పెరుమాళ్ (యజ్ఞమూర్తికి అరుళాళముని) - రామానుజు లిడిన దాస్య నామము.

"అరుళాళ పదమట్లు పెరుమాళ్ళనెడిపదము" (పుట. 182)

10. మణవాళ మహాముని (యతీంద్ర ప్రవణులు) -

"యతిరాట్ప్రద ప్రవణతజేసి యతని కా
యత యతీంద్ర ప్రవణాఖ్య చెల్లె." (పుట. 438)

**సంధులు : విశేషములు :** (పూర్వకవుల ప్రయోగములందిట్టి పదములు తఱచుగా కన్పించును.)

తెలుగు సందులలో ఈ క్రిందివి తఱచుగా కన్పించును. పదవిభాగము చేసిననే కాని అర్థము కావు. కొన్ని సూత్రములకు కట్టుబడవు.

2. గంగనుండేతెంచి గంగనుండి + ఏతెంచి, ఇకారసంధి 115

3. కత్తిగట్టేతెంచి కత్తిగంటి ఏతెంచి, ఇకారసంధి 286

4 క్రుచ్చెత్తి క్రుచ్చియెత్తి రావలయును క్రుచ్చి + ఎత్తి 367

5. కొన్నుహములు కొన్ని + అహములు ఇకారసంధి 317

6. చింతమ్రానీక్షించి చింతమ్రానున్ + ఈక్షించి నుగాగమము 524

7. నివాసమంచిలన్ నివాసమంచు + ఇలన్ ఉకారసంధి 602

8. అందెప్పటట్లు అందు + ఎప్పటి + అట్లు ఉకార, అకారసంధి 525

9. సూక్తులన్నిల సూక్తులన్ని + ఇల ఇకారసంధి 249

10. రహిన్మీరు రహిని + మీరు (సర్వనామము)

11. మాయయన్యవనిక మాయ యను + యవనిక 283

12. కొత్తెపుటమ్మలు కొత్తెము + అమ్మలు టుగాగము
కొత్తెమ శబ్దము మాత్రమే సరియైనది. కొత్తెమమ్మలు అకారసంధి కావలయును.

13. బైల్పుచు బయలు (బైలు) + పుచ్చు

14. సాధించుట కూరేలు కృతిగతి సాధించుటకు + ఊరేలు కృతిగతి ఉకారసంధి 418

15. భూతపూర్వ్యోమస్థలి (సంస్కృత సంధి) భూతపూర్ + వ్యోమస్థలి.

## అలంకార వైభవము

**ఆ.సూ.ము. అలంకారములు :**

గ్రంథము పేరు ఆ.సూ.ము. మొదటనే ఈ శీర్షిక (నామము) అలంకార శోభితమై పాఠకుల నాహ్వానించుచున్నట్లున్నది. ఇక కావ్యరచనా వైవిధ్యములో! అలంకార రస సంయుక్తములే. ప్రతి వాక్యమందును, ప్రతి పద్యమందును ఏదో యొక అలంకారము గోచరింపక మానదు.

ఈ గ్రంథకర్త పేరు సంబూరి కేశవాచార్యులు ఇందులోను అలంకార సంబరమే. ఇతడు తన కావ్యములు విరివిగా వృత్త్యానుప్రసాది శబ్దాలంకారములను ప్రయోగించినాడు. ఇక అర్థాలంకారములలో ప్రాచీనాధునికులందఱును తఱచుగా వాడుకొను అలంకారము లెన్నియో గలవు. కృతివక్త ''పద్యమకుట మున్ను'' అలంకారప్రసారమే.

ఉపమాలంకారములకు కొదువలేదు. అట్లే రూపకమున్నూ. మఱి ఉత్ప్రేక్షలు, అర్థాంతరన్యాసములు, స్వభావోక్తులు, అతిశయోక్తులు, క్రమాలంకారములు, సందర్భానుసారముగా వచ్చు ఇతర అలంకారముల గ్రహించుకొనునది. అలంకార నిర్వచనములందఱకును విదితములే.

1. వృత్త్యనుప్రాసము : అసంఖ్యాకములు ఉదాహరణము :

1) ''తద్దివ్య సౌందర్య సౌకుమార్య లావణ్య యౌవన
చాతుర్య గాంభీర్యాది గుణంబులు.'' (55)
(శ్రీవైష్ణవులకు ప్రీతిని గూర్చు వాక్యము)

2) ''అంతనబ్భండ నోర్వీమండలంబునం ప్రచండ వేదండ శుండా
దండ మండిత పరకాల దోర్దండ మండ నాయిత మండలాగ్ర
శితధారాఖండి తంబులయి.''

1. అంత్యప్రాస : ఎన్నియో గలవు. పుట 18

''ధరణి సుకవిగేయా! దర్శితానంతకాయా!
పరిహృతభవబాధా! భవ్యవేదాంత బోధా!
గురుకృతపరిచర్యా! ముష్టమంత్ర ప్రచర్యా!
దురిత తిమిరచంద్రా! దూరతంద్రా! యతీంద్రా!"

2. రూపకము : ఎన్నియోగలవు. ముఖ్యముగా మధ్యమభాగము - ప్రథమోల్లాసములోని పద్యముల జూడనగును.

1. ఆచార్య పరంపరను దెలుపు పద్యమంతయు పుట 157

''శ్రీనఖజలధి సుస్థిర కృపానమిలంబు
గ్రోవి శఠారాతికాలఘనము జూచునది.

2. ''అలకేశవార్యోదయాచలేంద్రము పల్ల
కాంతిమతీ ప్రాచిగర్భమందు"
నుదయించి భూతపూర్వ్యోమ స్థలినిమించి
యతిరాజభాస్కరుండలరుచుండ

3. అతిశయోక్తి : ఎన్నియోగలవు.

"అంబరచుంబి చిత్ర శిఖరాంచితమౌ-
ఘటికాచలంబుపై" (పుటలు 597)

**4. ఉపమాలంకారము :** అసంఖ్యాకములు.

1) "సజల మేఘమునందు శంపాలతిక **బోలె**
కలిమి చేడియ బొరగలుగువాడు" (పుట 156)

2) "పూర్ణచంద్రుని **బోలు** ముఖపద్మ మమృతసుందర
తర మందస్మితమున మెఱయ" (పుట 126)

**5. స్వభావోక్తులు :** పెక్కులు.

రామానుజుల ఆకృతి వర్ణన. (పుట 158)

"బాల భాస్కరునైన పవరాన దూలించు
తిరుమేని చాయల దేలువాని,
పూర్ణేందు బింబంబు పోలిక మీరిన
మొలక నవ్వుల ముద్దుమోమువాని."

**6. ఉత్ప్రేక్ష :** సూర్యోదయ వర్ణనము. (పుటలు 256, 256)

1) "పూర్వదిక్సతి కేల పొలుపొంద గీలించు
పద్మరాగంబుల బంతి యొకొ!....
పద్మినీ కాంత తొలినోము పంటయొకొ!
జక్కవల భాగ్యమో యని! జనులు దలప
భువనలోచను డుదయాద్రి బొడిచెననుచు"

2) "తిరునగరి పరమపదమట......." (పుట. 556.)

**7. అర్థాంతరన్యాసము :** "భట్టరు వైభవము" (పుట 373)

ముకుందమాలలోని "నాథేనః పురుషోత్తమే" అను శ్లోకము ననుకరించు

ఘట్టము :

కవులు కుందిరి. (సమర్థనము) సామాన్య వాక్యము :

"భువనత్రయేశుడు పురుషోత్తముడు దేవ
దేవుడు హృదయైక భావనీయు
డాత్మపదప్రదు డామ్నాయవేద్యుడు
నారాయణుడు నిజనాథుడుండ
గతిపయ గ్రామాధికారి నలార్థదు,

నొక పురుషాధము నుర్విలో సేవకై
వెదకుచునుంటిమి వెఙ్ఙివాంధ్ర
మైతిమని కుందుదురు కవులాత్మయందు,
పరమతత్త్వ విదగ్రణి భట్టరవని
కాంతు నామాడ్కి నను చేమి వింతయనుచు
వాదిభీకర గురుడనె మోదమలర!
భట్టరన్న మాటలు (ప్రతిపాదనము) విశేషము:
"శరణాగతత్రాణ బిరుదాంకితుడు హరి
నన్ను జేపిడిచిన నాటికైన,
నతని దివ్యాలయపు పంచటరుగు విడిచి,
రాజభవన వితర్దికి రాము సుమ్మ
టంచు భూమిపతికనియె నయ్యార్యుడనుచు
వాదిభీకరగురుడనె మోదమలర!"

## రసోల్లాస వైభవము

(కవి ఆశయము : రసమ్మృష్ట పదాక్షర రచన) పుటలు : 557.

ఆ.సూ.ము. ఉత్తర భాగములోని షష్ఠాశ్వాసమునందలి పద్యము:-

"ఆదరమొప్ప నాదు రసనాగ్రశుభాసన మధ్యవర్తియౌ
వాది భయంకరార్యుడనవద్య కృపాతిశయంబు చేనికన్
మీదటి గ్రంథమంత రసమ్మృష్ట పదాక్షర వృత్తపద్య స
మ్మేదుర భావమొందుగతి మేలుదయింప రచించు నింపుగాన్."

ఇది కవి ప్రతిజ్ఞయన్నను సమంజసమే యగును.

రసపోషణమును గావింపని కవి మనకు కావ్య ప్రపంచములో గోచరింపడు. ఏదోయొక రసము, ఏదోయొకచోట, ఎప్పుడో యొకప్పుడు, భావ ప్రవాహము గట్లుతెగి ప్రవహించునపుడు, ఉరకలు వేయుచున్నపుడు కథా సంవిధానములో ప్రవేశపెట్టుచునే యుండును.

| రసములు | స్థాయిభావములు | ఆలంబన విభావములు |
|---|---|---|
| 1. శృంగారము | రతి | తరుణులగు స్త్రీ పురుషులు |
| 2. హాస్యము | హాసము | వికృతచేష్ట - వేషభాషలు గలవారు |
| 3. కరుణము | శోకము | బంధునాశాదులు |
| 4. రౌద్రము | క్రోధము | అపరాధ మొనర్చినవారు |
| 5. వీరము | ఉత్సాహము | ధిక్కరింపబడినవారు |
| 6. భయానకము | భయము | భీతులగు శత్రువులు |
| 7. బీభత్సము | జుగుప్స | శవాదులు |
| 8 అద్భుతము | విస్మయము | ఆశ్చర్యకర వస్తువులు |
| 9. శాంతము | శమము | ప్రకృతి |

1. "విభావానుభావ వ్యభిచారి సంయోగాద్రస నిష్పత్తిః" యను భరత ముని నిర్వచనము సుప్రసిద్ధము.

2. **రసస్వరూపము :** భట్టుమూర్తి కావ్యాలంకార సంగ్రహము :

"పులకండంబులు గలిపిన
నలువగు సలిలము రసాయనంబగు పగిదిన్
లలిత విభావాదులచే
నలఘుతర స్థాయిభావ మమరున్ రసమై.''

3. **రసానందము :** రసానందము "బ్రహ్మానంద సహోదరము. లోకోత్తర చమత్కార భాజనము. విగళితవేద్యాంతరము. అనిర్వచనీయము, వాచామగోచరము" అని పెక్కు భంగుల వివరించినారు.

(ఒక మానవుడు పొందు అనందము మానుషానందము. ఇట్టి ఒక లక్ష కోటికోట్ల మానుషానందములు=
ఒక బ్రహ్మానందము 10,00,00,00,00,00,00,00,00,000)

4. రసానందానుభూతి : సుప్రసిద్ధోదాహరణము—

"రమ్యాణివీక్ష్య మధురాంశ్చ నిశమ్యశబ్దాన్
పర్యుత్సుకోభవతి యత్ సుఖితోఽపిజంతుః
తచ్చేతసాస్మరతి నూనమబోధపూర్వమ్
భావస్థిరాణి జననాంతర సౌహృదాని."

(అభిజ్ఞాన శాకుంతలము. అం.5-శ్లో.2)

అర్థము : సుందరరూపమును చూచినప్పుడును, మధురశబ్దములను విన్నప్పుడును సుఖముగానున్న ప్రాణిగూడ పర్యుత్సుకత్వమును పొందుట సహజము. మనస్సులో సుస్థిరములైన జననాంతర సౌహృదములను అతడు అనుకొనకుండ స్మరించుటయే దానికి కారణము.

5. రసమునకు వ్యుత్పత్తిచేత ఆస్వాదింపబడునదని యర్థము. ఈ యాస్వాదింపబడు అనుభూతి పాఠకుని మనస్సునుబట్టి, గ్రహించు యోగ్యతనుబట్టి, సహృదయతనుబట్టి వివిధ రకములుగా నుండవచ్చును.

**సమన్వయము :** రససిద్ధాంతమును గూర్చిన చర్చాగ్రంథము లసంఖ్యాకములు. పైవివరణములు సూచనాప్రాయములు మాత్రమే. వ్యాసవిషయ పరిమితినిబట్టి సంగ్రహముగా పేర్కొనుట జరిగినది. ఆ.సూ.ము.లో ఆయా తావులయందు కన్పట్టు రసవిశేషములనే కొన్నింటిని ఎన్నుకొనుట జరిగినది. ఇక రసానందానుభూతి విషయములో ఆళ్వారాచార్యుల రసానందానుభూతి ఆలంకారికులు నిర్వచింపలేనట్టివి. ఈ సందర్భములో అభిజ్ఞాన శాకుంతలోదాహరణము, A thing of beauty is a joy for ever" అను కీట్సు మహాకవి వచనములు ఈ యనుభూతిముందు సూర్యునిముందు దీపము వంటివి. వీరి ఆనందము నర్థము చేసికొనుటకు సహృదయుడైన పాఠకుడు కావలయును.

''లోకోత్తర చమత్కార ప్రాణైః కైశ్చిత్ప్రమాతృభిః
స్వాకారవదభిన్నత్వేనాయ మాస్వాద్యతేరసః॥''

—రసగంగాధరము.

అర్థము : ''లోకోత్తర చమత్కార ప్రాణులైన కొంతమంది ప్రమాతలచేతనే (Extra Ordinary beatiful Souls) (తెలిసికొనగలవారిచేతనే) ఆత్మ

**రసానందానుభూతి :** ఈ రసానందమును బ్రహ్మానందసబ్రహ్మచారి యందురు. బ్రహ్మానందము ఆలంబము నపేక్షింపదు. రసానందము ఆలంబనము లేక జరుగదు. (ఆచార్య పింగళి లక్ష్మీకాంతంగారి సాహిత్య శిల్ప సమీక్ష-పుట. 122)

ఇట్లు ఆళ్వారుల బ్రహ్మానందము ఇంకను అనిర్వచీనయమైనది. వారి కవితలను చదివినచో మనకది రసానందానుభూతుల గలిగించును.

ఇక ఆ సూ ము. కర్త ఈ రసానందానుభూతిని ఎట్లు కలిగించుచున్నా దనునది ప్రశ్న. దీనికి సమాధానము కావ్య మామూలాగ్రముగా చదివిననేగాని గోచరింపదు.

ఈ కవి తెలుగు ప్రబంధకవులననుసరించి కావ్యలక్షణముల ప్రకారము మామూలుగనే నవరసముల జూపినాడుగాని రసానందానుభూతిలో ప్రత్యేకతను నిరూపించుకున్నాడు. అది ఆళ్వారుల ఆనందమును చిత్రించుటలో జరిగినది.

ఈ గ్రంథంలో కవి 1) శృంగారము, 2) వీరము, 3) భయానకము, 4) రౌద్రము, 5) అద్భుతము, 6) హాస్యము, 7) శాంతము అను రసములను పోషించినట్లు ఆయా సందర్భములు తెలియజేయుచు కవి ఆశయమును ప్రతిఫలింపజేయుచున్నవి. (కరణరసమును కొంతయున్నది) సంగ్రహాముగా రసము పేరు-కథాంశముల గమనించుడు:

**1. శృంగార రసము :**

1. తొండరడిప్పొడి యాళ్వారుల వైభవము, స్థాయిభావము, రతి, ఆలంబన విభావములు, విప్రనారాయణులు, దేవదేవి.

2. ఢిల్లీశ్వరుని కుమార్తె మోహనాంగి వృత్తాంతము, స్థాయిభావము, రతి (ఇచట కేవలము ఊహ) ఆలంబన విబావములు, రామప్రియుడు, మోహనాంగి.

**2. వీరము :**

1. ప్రధానముగా తిరుమంగైళ్వారుల వైభవములో. 2. రామానుజుల ఢిల్లీ విజయము 3. వాదోపవాదఘట్టములలో, వేదాంతదేశికులు-విషవైద్యుల పోటీలో.

1. తిరుమంగైయాళ్వారుల వైభవము, స్థాయిభావము, ఉత్సాహము, పరకాలుని సైనికులు, చోళరాజు సైన్యము, ఆలంబన విభావము: ఇరువైపుల వారు (అపరాధమొనర్చినవారు).

**3. భయానకము :**

స్థాయిభావము భయము. పరకాలుని శత్రువులు. ఆలంబన విభావము పరకాలుని శత్రువులు (భీతులు), చోళరాజు సైనికులు.

**4. బీభత్సము :**

స్థాయిభావము జుగుప్స. ఆలంబన విభావము, శవాదులు, పరకాలుని వీరత్వము, రణభూమి వర్ణనము.

**5. రౌద్రము :**

తిరుమంగై యాళ్వారుల వైభవము స్థాయిభావము, క్రోధము, ఆలంబన విభావము, ధిక్కరింపబడినవారు, చోళరాజు సైనికులు, పదకాలుని పరివారము.

**6. అద్భుతము :**

ఆళ్వారాచార్యుల మహిమల ప్రదర్శనలలో : 1. తిరుమళిశై యాళ్వారుల వైభవములో రెండు దృష్టాంతములు 2. రామానుజాచార్యులు 3. భట్టరు 4. నంబిళ్ళ 5. మణవాళ మహామునులు 6. వేదాంత దేశికుల వైభవములలో కన్పించును. స్థాయిభావము: విస్మయము, ఆలంబన విభావములు: ఆశ్చర్యకర వస్తువులు.

**7. కరుణరసము :**

స్థాయిభావము శోకము, ఆలంబన విభావము బంధునాశనాదులు.

ఇందు ఆచార్యులు పరమ పదమున కేగునప్పుడు సూచన మాత్రముగా శోకము గలదు. బంధునాశనాదులు కలహములవల్ల సంభవించునట్టివి వర్ణింపబడ లేదు. వేశ్య శ్రీరంగని గూర్చి త్యాగ మొనర్చిన ఘట్టము మనకు దుఃఖమును గల్గించును పుట 427 రామానుజుల చరమదశ, గోవిందుల చరమదశ, భట్టరు చరమదశలలో; 345, 351, 380 పుటలలో ఆత్మీయుల వీడినందున గలుగు వేదన యర్థమగును.

**8. శాంతరసము :**

స్థాయిభావము శమము=శాంతి, కామక్రోధాదులు లేకయుండుట ఆలంబన విభావము ప్రకృతి సత్త్వాదిగుణ సామ్యావస్థ, స్వభావము ఆళ్వారుల, ఆచార్యుల స్వభావము లిందుకు నిదర్శనములు. నంబిళ్ళ చరిత్ర, వేదాంత దేశికుల చరిత్రలు 390, 591 పుటలు.

**9. హాస్యము :**

స్థాయిభావము; హాసము. ఆలంబన: వికృత చేష్ట వేషభాషలు రామానుజులు బాలురు తిరువాయిమొళిని వికృతముగా చదువుటను చూచుట: 243 244 పుటలు.

**శృంగార రసము :**

1 తొండరడిప్పొడి యాళ్వారుల వైభవములో శృంగార వర్ణన మాసక్తి దాయకముగ నున్నది బ్రహ్మచారియై, ఋష్యశృంగునివంటి అమాయకుడు విప్రనారాయణుడు. దేవదేవియను వేశ్య పంతగించి, చివరకు శ్రీరంగని శరణు వేడుకొని, అతనిని తన వలలో వేసికొని కాముకునిగా జేసినది. ఈ దృక్పథము తోనే శృంగారము నర్థము జేసికొనవలయును. ఇట్టి రసవద్ఘట్టము గలదగుట చేతనే వైజయంతీ విలాసమువంటి కావ్యములు వెలసినవనవచ్చును.

ఇందలి సంభోగ శృంగారమునకొక మచ్చుతునక : (పుట 42)

(సూచన :

తెలుగు కవులలో చాలమందికున్న జబ్బు వంటిదిది. ఇచటగూడ నున్నది. వేశ్యలైనను, ఎవరైనను ఇట్లు వర్ణించరాదని నా యభిప్రాయము.

"దరహాస సుధజిల్కు తరుణి ముఖేందుని
        జూడ్కు లానందింప జూచి జూచి,
మదనాహవోచిత మదవూర్తికాయింతి
        అధరబింబామృత మానియాని,
తన యనంగ జ్వర తాపమారగ ప్రియ
        జిగిబిగి కౌగిట జేర్చి చేర్చి,
రతికేళి తమిమీర, రమణి పాలిండ్లను
        పాణి పద్మములచే పట్టి పట్టి
మాటి మాటికి వలరాజు మనికి పట్టు
మేటి కోటకు పోటిచ్చె ధాటి మీద
విప్రనారాయణుడు కడువేడ్కమనుచు"

2 ఉదయవరుల వైభవము : ఢిల్లీ విజయము. పుట. 294

సందర్భము : ఢిల్లీసులతాను కుమార్తె బంగారుబొమ్మ రూపములోనున్న రామప్రియుని బొమ్మనుగూర్చి తండ్రికి చెప్పుటకు ముందు ఆమె ఊహాలోకమిట్లున్నది. పడకటింతలను బయల్పుచ్చు దీపకళికవంటి సౌందర్యముగలది.

"పూర్ణచంద్రుని బోలు ముఖపద్మమున
దరస్మిత మమృతపు జాలుచెలువుగలుక,
మంతనంబున తన మగని సొంపుదలంచి
మాటిమాటికి తన మదిసుఖింప.
రతిరహస్యములన్ని రామప్రియుని కడ
జదివిన ప్రౌఢిమ సందడింప,
సిగ్గు నిగ్గుల దేర శృంగార మలరంగ,
దనసెజ్జవజ్జ చేతనపు పసిడి
బొమ్మగతి నిల్చి యాముద్దుగుమ్మ."

**వీరరసము** (ఉత్సాహము) పరకాల మునీంద్రుల పరాక్రమము : వీరావతారము : పుటలు : 62-63.

"నిజయోధులకు గానీ నివ్వటిల్లగ జూచి,
ప్రళయార్క బింబంబు పగిదిమెరసి,
ఒఱజరాలున దూసి, కరవాల మలకాల
మృత్యు జిహ్వకు సరిమీఱ కేల
గీలించి పెఱకేల ఖేటము జిగి దాల్చి
గరుడ సన్నిభ తురంగంబు నెక్కి
కలియుగాంతము నందు మలిన చేతనులను
ఖండించు కల్కి యాతండెయనుచు
జనుల కూహింపదగినట్టి సాంద్రకీర్తి
చండ విక్రమ స్ఫూర్తి శార్ఙమూర్తి
కలిహరుడు కదనకేళికి గదలెననుచు"

స్వభావోక్తిగా, స్పష్టముగా నున్నది.

**హాస్యము :**

ఈ గ్రంథమునందొకటి రెండు తావులందే కొంతవరకు గలదు. 1) రామానుజులు దిగ్విజయయాత్ర ముగించుకొనిన పిమ్మట, శ్రీరంగములో

కల్పించురీతి వారికి బాధ కల్గించెను. కాని, వినువారికి నవ్వు. హాస్యము.

(పుటలు : 243, 244 )

**వచనములో అర్థము :**

"**ఆడియాడి** యన ప్రత్యాషాఢమాసమునందు,
నగంగరైందన మెండుగా గురియు దండివర్షముచే
విధ్వస్తంబులై గృహంబులు కరిగిపోవ,
**యిళప్పాడిపాడి** యన రోదనాత్మక గీతంబుల
సారెసారెకుం ప్రవర్తింపజేసి,
**కణ్ణీర్ మల్గి** యన, కన్నులవలన రుదితాశ్రు -
ధారలొలుకనేడ్చి,
**యెంగుంనాడియాడియన** శీతవాతాహతికోర్వ
లేక, నివసింపచోటువెదవెదకియొక
నృసింహాలయంబుపొడగాంచి, నరసింగా
వెన్నయన నరసింహాయనుచు,
**నివ్వారుదలే** యన ముఖలలాటాదులు మోదుకొనుచు
**వాడువాడుమన** ఆహారంబుగానక జనంబు మిగుల శోషించె

(ఇట తెలుగుబాలకులాడుకొను రీతియు, క్రొత్త విపరీతార్థముల కని పెట్టుటయు గూడ కవి అనుభవములోనిది గావచ్చును.)

**రసానందానుభూతి :**

పెరుమాళ్ళ దివ్యాకృతినిగాంచిన ఆళ్వారుల ఆధ్యాత్మిక రసానందానుభూతి అనిర్వచనీయమైనది. వారు చూచునది చూచుచున్నట్లుగా రసమ్పృష్ట పదాక్షరముల జొనిపి వర్ణించి కవి మనముందుంచినాడు. ఇట్లు మనము సాహిత్య రసానందము ననుభవింపవచ్చునుగదా! ప్రస్తుతమొక మచ్చుతునక :

**'తిరుపాణాళ్వారు' శ్రీరంగని దివ్యమంగళ విగ్రహమును గాంచుట :**

52, 53 పుటలు

"శ్రీరంగనాయకుండు నిత్యదర్శిదునకు పెన్నిధి గాన్పించిన చందంబున నిజమంగళ విగ్రహంబు నమ్మహాత్మునికిం కన్పింపజేసిన; నవరత్న ఖచితతప్త

చామీకర కిరీట కేయూర కుండలుండును, ప్రలంబమాన మౌక్తిక హారుండును, శ్రీవత్స లక్ష్మీకౌస్తుభాలంకృత విశాల వక్షుండును, వైజయంతీ వనమాలాలంకృతుండును, స్వర్ధునీ మృణాలతంతు సంతానాతి ధవళ యజ్ఞోపవీతుండును, కల్పశాఖోపమాన నిజభుజాకల్ప శంఖచక్రగదాసి శార్ఙ్గాద్యనేక దివ్యాయుధుండును, బాలభాస్కర ప్రభాభాసమాన పీతాంబరధరుండును, విచిత్రరత్నఖచిత తప్తకాంచన కాంచీదామోదర బంధన శింజానమంజు మంజీరాద్య పరిమిత దివ్యభూషణ భూషితుండునునై, యుగపదుదిత రాకాచంద్ర చంద్రికాతి ధవళంబయి, యనల్పంబగు శ్రీ మదనంత తల్పంబున స్వభక్త రక్షణ దక్షంబగు దక్షిణ హస్తంబుపధానంబుగా నుంచి ప్రసారితేతర దీర్ఘ భుజుండై హలకులిశాంకుశాది దివ్యలక్షణ లక్షితంబగు శ్రీపాద అరవింద ద్వయంబు సాచి, భూనీళాది దివ్యమహిషీ వర్గంబు శ్రీ పాదసేవ సలుపుచుండ, శ్రీ మదనంతగరుడ విష్వక్సేన - ఆదిత్యసూరినికర నిషేవ్యమానుండై పవళించియున్న పరమ పురుషునిం గాంచి, మిగుల హర్షించి పులకించి, స్తనంధయబాలకుండాత్మీయ జననియితరాదయనంబుల పేక్షింపక, స్వజీవనార్థంబు స్తనాగ్రంబునందు నిజాస్యంబుంచుగతి శేషిత్వ, భోగ్యత్వోపాయత్వ పరిపూర్తి వహించి మించు శ్రీపాదపద్మములాదిగా శిరఃపర్యంతంబులు శ్రీహరి దివ్యమంగళ విగ్రహంబనుభవించి తదనుభవజనిత ప్రీత్యతిశయంబుచే దాననుభవించిన యనుభవం "అమలనాదిపిరాన్" (అమలనాదిపిరాన్) అనునొక దివ్య ప్రబంధంబుచే నానతిచ్చి సకల చేతనోజ్జీవనం బొనర్చి యానందించుచుండ శ్రీరంగనాథుండు కురువేరు తన్మూలమ్మూర్తికతో నాదరించు నాలది నమ్మహాత్ముని దివ్యదేహంబుతో నంగీకరించిన భగవత్సన్నిధానవర్తను లందఱుం గనుంగొన నప్పరమ భాగవతసత్తముం డంతర్హితుండయ్యె."

ఇట్లీ సుదీర్ఘవచనములో ఆళ్వారుల దివ్యానందానుభూతిని రసప్రపంచపద గుంఫనములతో నింపింపజేసినాడు. ఆనందానుభూతికి ఫలితముగా కవితావతరణము. అదియును స్వార్థమునుగూర్చి కాదు, లోకోపకారార్థము. ఇదియును రసానందాశయముగదా. "విశ్వశ్రేయః కావ్యమ్" ఇట వీరి నిత్య తనియన్ "శ్రీపాద చూడమనుభూయ" స్ఫురించును.

శృంగార రస సమర్థనము : భక్తిగల భగవత్కథల కావ్యములలోన్

శ్లో॥ ''కల్యాణం భగవత్కథాగ్రథవతః కావ్యం విధాతుఃకవేః
తస్యైవాంగ త్వయాక్వచిద్రచయిత శృంగార పీఠాదికమ్
కోదోషోభవితాయదత్ర కవితాశీతై స్సమాశ్రయంతే
పంథావ్యాస వసుంధరాశ్రుతి భవద్గ్రంథావిమ ప్రేషితః''

(వ్యాసమహర్షి - 709వ శ్లోకము )

విశ్వగుణాదర్శము నుండి ఉద్ధృతము- పుటలు. 661.

## ఛందో వైవిధ్యము

అ. సూ. ము. లోని మొత్తము పద్యముల సంఖ్య 1762. ఇందులో అధిక భాగము సీసపద్యములే గలవు. ఇవి తేటగీతులతో కూడుకొని యున్నట్టివి. ఇట్టి పద్యముల సంఖ్య 1473. సామాన్యముగా అందఱు కవులు ప్రయోగించునట్టి పద్యముల సంఖ్య లిట్లున్నవి:

1. సీసములు (తే. గీ.తో కూడినవి) = 1473 గలవు.
2. తేటగీతులు (విడిగా ) = 13 ,,
3. ఆటవెలదులు (విడిగా ) = 13 ,,
4. కందములు = 72 ,,
5. శార్దూల వృత్తము = 42 ,,
6. మత్తేభ ,, = 25 ,,
7. మాలిని ,, = 23 ,,
8. ఉత్పలమాల వృత్తము = 21 ,,
9. చంపకమాల ,, = 16 ,,
10. మత్తకోకిల ,, = 5 ,,

ఇతర విశేష వృత్తములు = 59 గలవు. ఇవి కృతిభర్త స్తుతి పద్యములలో కొన్ని, ఉత్తర భాగములోని షష్ఠోల్లాసములో అధికముగా గలవు.

సంఖ్య 1. సుగంధి = 6, 2 ఉత్సాహ = 2, 3. పంచచామర = 2, 4. స్రగ్విణీ=3, 5. కవిరాజ విరాజిత=3, 6. స్వాగత=3, 7. తరళ=2, 8. భూతిలక=1, 9. చంద్రకళా=1, 10. అంబురుహ=1, 11. ఖచరప్లుత=1, 12. ప్రభాకలిత=1, 13. శాలినీ=2, 14. పృథ్వీ=3, 15. మందాక్రాంత=1, 16. స్రగ్ధరా=4, 17. విచికిలమానినీ=1, 18. భుజంగ ప్రయాత=3, 19.

కరిబృంహిత=2. 20. తోటక=3. 27. లయగ్రాహి=1 22. లయవిభాతి= =1 23. పద్మనాభ=3 24. భాస్కరవిలసిత=2 25. మానినీ 1 26. వసంత తిలక=2. 27. మహాస్రగ్ధరా=4.

పద్యముల పేర్ల సంఖ్య=27.

అసంఖ్యాకములైన పద్యములను వ్రాసినను ఈ కవి గణ, యతి, ప్రాసలకు భంగము వాటిల్లనీయలేదు. అప్రకవీయము, సులక్షణసారసమ్మతములుగనే యున్నవి ఒకచోయతిభంగమున్నది: పుట. 38 "జూపుచును జరించునయ్యింతితో చెలువుడనుచు — చు – చె యతి చెల్లదు.

**విశేషవృత్తములు :**

విశేషవృత్తముల కుదాహరణ పద్యములు : ఆ సూ. ము. పుటలు. 562, 571, వేదాంతదేశికుల వైభవములోనివి.

1. అనంతసూరి చేసిన స్తుతి : **కవిరాజవిరాజిత వృత్తము :**

"సురుచిర భూషణ, సుందర విగ్రహ, శోభిసుదర్శన, జాష్టకరా!
పరమపవిత్ర నభశ్చర భూచర భవ్యదనామతవన్వినుతా!
దురితనివారణ ధూర్జటికారణ దోర్బలనిర్జిత దుష్టగణా!
చిరము భవజ్జన సేవయొనర్చుచు సేమములందెద శ్రీనృహరీ!"

2. వేదాంత దేశికులు చేసిన స్తుతి : **కరిబృంహిత వృత్తము:**

"మూడుజగములు మూడు పదముల ముందు గొలిచిన వామనా!
వేడుకలరగ నీ సుచరితము వీనులకు వినవింపుగా
జాడగలిగిన వాడు పుడమిని జాతకములను జెందకే
గోడుగుడువక నీదుకరుణను గూడిసుఖియగు నెచ్చటన్."

3. ఆశ్వాసాంత పద్యము. కృతిభర్త స్తుతి. పుట 194. **సుగంధివృత్తము:**

"శాంతిపద్మ వేంక టేశ శంఖచక్రదాయకా!
శాంత దుర్మత ప్రచార సత్పథ ప్రవర్తకా!
సంతతాతికాంతరంగ శౌరిసన్మహోత్సవా!
చింతిత త్వదంఘ్రి పద్మజీవనౌషధీ సుధీ!"

—ఇట్లు కవికి ఛందస్సుపైగల అధికారమును అంచనా వేయవచ్చును.

(పుటలు : 537-539)

ఈ గ్రంథములోనికి అదనముగా చేర్చిన విషయమువలె నున్నది. ఈ విషయమును చేర్చుటవల్ల కవికిగల భూగోళ, ఖగోళ, సంప్రదాయ వేదాంతము లందుగల పరిచయము, పరిశీలనాసక్తి తెలియనగును.

సందర్భము : మణవాళ మహామునులు తమ వైభవమును చాలించిన పిమ్మట వాదిభీకరగురుడు తెలిపిన విషయములు.

కేంద్రస్థానము : శ్రీరంగములో నున్నపుడు.

విషయాంశములు:- "తదనంతరంబాభక్తానుగ్రహంబు."

1) భగవంతుండొనర్చు పర - వ్యూహ - విభవాంతర్యార్చా స్వరూప భేదంబులను;

2) మంత్ర మంత్రార్థోపదేష్టృ గురుపరంపరయు;

3) అద్దేశికేంద్రులు లీలావిభూతి నలంకరించియున్న సంవత్సరంబుల సంఖ్యయు;

4) తత్తదార్య ప్రణీత ప్రబంధాభి ధానంబులును "వివరించెద ఎట్లన్న?"

1. భూమండల స్వరూపము.
2. శ్రీ వైకుంఠలోకము.
3. పర, వ్యూహ, విభవ, అంతర్యామి, అర్చారూపములు.
4. దివ్యదేశములు.
5. ఆళ్వారాచార్యుల తిరునక్షత్రాది జన్మకాలాదులు తనియలు.

గమనిక:- దీర్ఘ వచనములోని విషయమును పటముల రూపములో, పట్టికల రూపములో వివరించినాను.

## బ్రహ్మాండముల వివరణము - శ్రీవైకుంఠము

(ఆ. స్మూ. ము. పుట 538)

అండము కొలత = 14 భువనములు + పంచీకృత పంచభూతములు + ప్రాకృతద్రవ్యాత్మకము + దశగుణితోత్తరావరణ సప్తకము.

శ్రీవైకుంఠ దివ్యలోకమును గూర్చి :

అండము లనంతములు, ఏకకాలోదిత జలబుద్బుదంబుల కొలది భగవత్సంకల్పితంబులై యుండు, ఈయండముల నతిక్రమించి—

విరజానదికి ఆవల శ్రీవైకుంఠలోకము గలదు.

ఇచట తిరుమామణి మంటపము మధ్యన—

1 అనంత 2. గరుడ 3. విష్వక్సేన 4. వరాంకుశ 5. పరకాలాది నిత్యముక్త నిషేవ్యమానుండై 6. శ్రీ భూనీళాదిదేవీ సహాయుడై 7. శేషపర్యంకమున వెలసిల్లువాడు శ్రీమన్నారాయణుడు పరస్మాత్పరుండు.

అండకటాహము విస్తీర్ణము = 1 కోటి యోజనములు లేదా 100 కోట్లందురు. ఇట్లు భూమండల విస్తీర్ణము అర్ధము, నిలువు=5 కోట్ల యోజనములు.

అండకటాహము

గర్భోదకము పైన

అంధతిమిరము పైన

సత్యలోకము పిమ్మట

తపోలోకము

జనలోకము

మహర్లోకము

↑ 1 కోటి యో.

ఈ దిగువ మొత్తము స్వర్లోకమందురు

↑

ధృవస్థానము

↑ 1 ల.యో.

నక్షత్ర, బుధ, శుక్రాంగారక, బృహస్పతి, శని

సప్తఋషుల మండలము

↑ 1 ల.యో.

చంద్రమండలము

↑ 1 ల.యో.

సూర్యమండలము (భువర్లోకమందురు)

↑ 1 లక్షయోజనముల దూరము.

భూమి పై భాగము = ఊర్ధ్వభాగము నుండి లెక్క.

# 6. వైష్ణవ ధర్మ సంబంధ విషయముల వివరణములు

ఆచార్యసూక్తి ముక్తావళిలో వైష్ణవధర్మ సంబంధ విషయములెన్నియో గలవు. ఇందు లక్షణములు, విధానములు, పద్ధతులు, విధులు, దినచర్యలు. శ్రీపాదతీర్థ మహిమలు, ఇతర మహిమలు మున్నగువానిని పేర్కొనవచ్చును.

ప్రస్తుతము ముఖ్యాంశముల శీర్షికలు, పుటల సంఖ్యలను సూచింతును. పిమ్మట కొన్నింటిని గూర్చి వివరములు వ్రాయుదును.

**ముఖ్యాంశముల శీర్షికలు : పుటల సంఖ్యలు:**

1. ఆచార్య పరంపరను తెలుపుట : గ్రంథప్రారంభములో, రామానుజుల వైభవములో; చారుభవిష్యదాచార్యులు రామానుజులు. పుటలు 1, 155, 157

2. తిలకధారణ ప్రస్తావనము, ఊర్ధ్వపుండ్రముల ధారణము, శ్వేత మృత్తికల వృత్తాంతము—

తిరుమళిశై ఆళ్వారుల, ఉదయవరుల, మణవాళమామునుల చరిత్రలలో. పుటలు. 10, 217, 269, 485.

తిరుమళిశై ఆళ్వారుల వైభవము : ఉభయ విభూతినాయకుడు హరి. పుట. 7.

3. శ్రీపాద తీర్థము లుజ్జీవించుట. భక్తాంఘ్రిరేణువు తొండరడిప్పొడి యాళ్వారుల వైభవములో : పుట 45.

4. భాగవత సమారాధనము - తదీయారాధనము. తిరుమంగై యాళ్వాలుల వైభవములో. పుట 56.

5. నాలాయిర దివ్యప్రబంధ వృత్తాంతము. పల్లాండు - మొదట పలుకుట. నాథమునుల వైభవములో. పుట 83.

6. స్వరూపహానిని గూర్చి :
ఆళవందారుల వైభవములో. యామనులు పుట. 103
గోష్ఠీపూర్ణులకు పెరియనంబికి హితముపదేశించుట - పుట 119

7. శ్రీ వైష్ణవుల లక్షణము ఉదయవరుల వైభవములో పుట 140

8. చరమోపదేశము (కూరేశ దాశరథులకు) ,, ,, 140

9. వైష్ణవులు శక్తి ననుసరించి (ఉదయవరుల వైభవము) 157
ఎప్పుడేమి చేయవలె? విధులు దినచర్యలు ,, ,, 158

10. తిరుమంత్రము గోప్యత (గోష్ఠి పూర్ణుల కడ) ఉదయవరుల వైభవము పుట. 173

11. పాంచరాత్రాగమ పద్ధతి ప్రచారము; దివ్య దేశముల జేయుట ఉదయవరుల వైభవము పుట 220

12. షడ్వార్థలు (కాంచీపూర్ణులు తెలిపినవి) ,, పుట 168

13. ఉభయ వేదాంతముల నధికరించు ఏర్పాటు ,, పుట 244

14. సింహగిరి కృష్ణమార్యులతో వాదము సేయకయే పెరుమాళ్ళద్వారా సమాధానములు "మోక్షము" ఉదయవరుల వైభవము పుటలు 222-226

15. వైష్ణవుల కసాధారణ ధర్మంబులు (గోవిందుల చరమదశలో) ఉదయవరుల వైభవము పుట 351

16. శ్రీ వైష్ణవులకు విధులు, కైంకర్యములు హితము లుపదేశించుట రామానుజుల చరమదశలో ఉదయవరుల వైభవము పుట 345

17. ప్రపదనమెప్పుడు లభించును? భట్టరు ఉ. వైభవము పుట 369

18. పంచ యజ్ఞములు భట్టరు ఉ. వైభవము పుట 364

19. ఆరాధనాక్రమము భట్టరు ఉ. వైభవము పుట 374

20. శ్రీ వైష్ణవు "లితర దేవతల ననుసరింపరు" భట్టరు ఉ. వైభవము పుట 374

21. వైష్ణవ ధర్మములు రామానుజులు యజ్ఞేశునకు జెప్పుట ఉదయవరుల భట్టరు వైభవము పుట 130

22. నంజియ్యరు సమాధానములు - నంజియ్యరు వైభవము
నంబిళ్ళ అడిగిన 6 ప్రశ్నలకు; నంజియ్యరు ఉ. వైభవము
పుటలు 386, 387

అవి : అంగన్యాస కరన్యాసములు ప్రపత్తికవి చాలవు పుట 386.

1) వైష్ణవు డెట్లుండవలె? 2) ఆరగింపు విధానము? 3) విగ్రహములు చాల యున్నచో ఆరాధన? 4) హరి యవతారములేల? 5) భాగవతాపచారము? 6) భగవద్గుణానుభవము? పుట 387.

శ్రీమార్గమహిమ. చక్రధారణ విషయమునకు శ్రుతి ప్రమాణములు పుట 502, 503.

3. దివ్యప్రబంధపఠన నియమములు నిగమము - ఉపక్రమము. పుట 501, 502.

4. శ్రీవైష్ణవాచారమును పెరుమాళ్ళజియ్యరుకు తెలుపుట. పుట 515.

5. శ్రీవైష్ణవ విలక్షణత్వము. పుట 515, 516.

29. శ్రీ వేదాంతదేశికుల వైభవము : విశిష్టాద్వైతమనగా, పుట 575.

30. ప్రతివాదిభయంకర అణ్ణంగారి వైభవము:

ఏకాదశీనిర్ణయము, ఆచార్య జన్మనక్షత్రనిర్ణయము, పుట 507.

ధనుర్మాసపూజావిధానం, మణవాళ మహామునులు రామానుజుల అవరావతారము. పుట 618.

31. చరమ సంస్కారములు :

1. తీర్థదివసమాచరింపగూడదు. సందర్భములు— పుట 352.

2. నాథమునులచరమదశ-విధానము. అర్చిరాదిమార్గము పుట 87, 91.

3. యామునుల చరమదశ వర్ణనము - ఖననాద్బ్రహ్మమేధసంస్కారము. పుటలు 120 - 123.

4. చరమతదీయానువర్తన విశేష ధర్మజ్ఞానానుష్ఠానంబులు పరమాచార్యుడగు యామునులకే చెల్లును. పుట 343.

5. మణవాళమహామునుల చరమదశ. పుట 533.

**ఇందలి మహిమలు-శ్రీపాదతీర్థ మహిమలు, ఇతర విశేషములు:**

ఈ గ్రంథమునందు ఆళ్వారాచార్యులు చూపిన మహిమ లెన్నియో గలవు. ఇవి లోకోజ్జీవనార్థము గావించినవే తప్ప స్వార్థమును, ఆధిక్యతను, అహంకృతిని ప్రదర్శించునవిగావు. పవిత్రములైనవి పరమభోగ్యములైనవి ముఖ్యములు కొన్ని:

1) పరమపద మిప్పించు సందర్భములు కొన్ని :

1. లేఖలు వ్రాసి మోక్షమిప్పించుట:-

అ) రామానుజులు శ్రీ వేంకటేశునకు లేఖవ్రాసి ఒక గొల్లచానకు మోక్ష
ప్పించెను. 336

ఆ) నంబిళ్ళగారు శ్రీరంగనాథునకు లేఖ వ్రాసి ఒక స్థూలాంగికి-సాధ్వికి
క్షమిప్పించెను. 395

2. జల జంతువులకు వృక్షాదులకు మోక్షమిచ్చుట:

అ) రామానుజులు జలజంతువులకు మోక్షమిచ్చిరి. 141

ఆ) నంబిళ్ళగారు మట్టికి మోక్షమిచ్చిరి. 398

ఇ) మణవాళ మహామునులు చింతమ్రాకుకు పరమపద మిచ్చిరి. 324

2) శ్రీపాదతీర్థ మహిమలు:- అనేకములు గలవు.

శ్రీరామానుజులే తన ఆశ్రితుడైన ఒక శ్రీవైష్ణవుని శ్రీపాదతీర్థమును
లెడు వాడన్నచో దీని మహిమ వర్ణనాతీతము. 154

వ్యక్తులలో మానసిక మార్పు గలుగును:-

పరిత్తికొ్క్లై నాచ్చియారు తనను కామించిన వైశ్యునికి రామానుజుల
హప్రసాద, శ్రీపాదతీర్థములనివ్వగా వాడు దానిని స్వీకరించి, వివేకమును
ంది ఆ సాధ్వీమణిని తల్లిగా బొగడెను. 129

యతిరాజుల ఆజ్ఞచే దాశరథి తన పాదముల మిథిలా పురములోని
మమునందలి చెరువులో నుంచి నిలబడగా, అచటి జనము ఆ శ్రీపాదతీర్థమును
లి యతీంద్రుల నాశ్రయించిరి. 258, 279

గ్రహబాధలు తొలగును :

విఠలరాయని పుత్రిక గ్రహబాధను శ్రీరామానుజులు తన శ్రీపాద తీర్థ
చ్చి గ్రోలింపజేసి నయమొనర్చెను. 263

వేదాంత దేశికులు ఒక దుఃఖితుడగు రోగికి తన శ్రీపాదతీర్థమొసంగి
పచేసెను. 557

**ఇతర విధములగు మహిమలు - పాశురభాగ మహిమలు:**

1. తిరుమళిశై ఆళ్వారుల వైభవము.

2. కొంకణసిద్ధుని రసగుళికకు తన చెవిగులిమి నీయ అది నూరు కోట్ల హేమమిచ్చెను. 9

3. తన్నాక్షేపించిన విప్రులకు నారాయణ స్వరూపమును జూపెను. 15

2 రామానుజులు విఠలరాయని గురువులు 12,000 మంది ప్రతివాదులకు తన స్వస్వరూపమును జూపెను. 263

3. మణవాళ మహామునులు కురుకాపురమున ఆసుర ప్రకృతులగు అభిజన విద్యా, విత్తమదాంధుల నెదుర్కొనుటకు తన శేషస్వరూపమును జూపెను. 455

4. వేదాంతదేశికులు విద్యారణ్యుడు పంపిన రాజభటుల యెదుట కనకధారా స్తవముగావించి ధనరాసుల కురిపింపజేసెను. 569

5. పాశురభాగముల మహిమలు :

1) తిరుమంగై యాళ్వారులు. 69

2) నమ్మాళ్వారుల సూక్తి - శంఖపలకము. 77

3) రామానుజులు గురుగాథ చదువుట. (విష్ణుచిత్తుల సూక్తి) 249

**ఇందలి మంత్రోపదేశక్రమములు : గురువు, శిష్యుడు, విద్యలు,**

**ఆచార్య పరంపరను సూచించు సందర్భములు :**

I పదుగుర్వారులకాచార్యుడు : శ్రీవిష్వక్సేనులు.

''పదుగురాళ్వారు లిమ్మహాత్ము నకంతేనివాసులు'' 540

1. మధురకవి యాళ్వారుల కాచార్యుడు నమ్మాళ్వారులు. 76

2. ఆండాళునకు విష్ణుచిత్తులాచార్యులనవచ్చును. (ఈ గ్రంథమునందీ విషయములేదు కాని ''మునుపటి విద్యలు మూర్తులు గొని వచ్చి ఈమె చెంత కొలువు సలుపుచుండె'') 25

3. ముదళ్వారులు మువ్వురు విద్యలను బడయుట: వీరు అయోనిజులు. ''భగవదనుగ్రహప్రాప్త దివ్యజ్ఞాన భక్తివైరాగ్య సంపత్తి గలిగి, స్వస్వరూప జ్ఞాన సంపన్నులైన వారు.'' 4

4. తిరుమళిశై ఆళ్వారులు మునికుమారుడు. పంచశక్తి మయాంగుడు. మేదరివాని యింటిలో పెరుగుచుండెను. శిశుదశలోనే సిరియు, హరియు అనుగ్రహించిరి. తర్వాతికాలములో హరియనుగ్రహముచే సర్వజ్ఞుడయ్యెను. 7

5. పెరియాళ్వారులు చదువుకొన్నవాడు గాడు. సహజ దాస్యైక నిరతుడు. సర్వవాగీశ్వరుండగు భగవంతుడు సర్వనిర్వాహకుడై ఇతనిచే పరతత్త్వ నిర్ణయము చేయించెను 23

6. కులశేఖరాళ్వారుల గురువును గూర్చి ఇతని జీవితవైభవములో లేదు. ఇతడు సూరిశేఖరుడు. 18

7. తొండరడిప్పొడి యాళ్వారుల గురువుపేరు లేదు. కాని ఇతడు "విష్ణు కృపాప్రాప్త వివిధ సాంగోపాంగ సశిరస్కవేద విజ్ఞానఘనుడు" 28

8. తిరుప్పాణియాళ్వారులు : "నిర్హేతుక జాయమాన భగవద్జ్ఞాన విద్యా సార్వభౌముండయ్యెను." 51

9. తిరుమంగై ఆళ్వారుల విద్యాగురువు ప్రసక్తిలేదు. కాని తిరువయూరి నంబివద్ద పంచసంస్కార పరుండయ్యెను మరియు భగవత్ప్రసాదలబ్ధ దివ్య దృష్టిచే ప్రబంధ రచనము గావించి చతుష్కవి శిఖామణి యయ్యెను. 56

10. ఆళ్వారుల సంఖ్యలో రామానుజులను చేర్చుట జరిగినది గాన అతని గురువులు పంచాచార్యులు. 65

**ఆచార్య పరంపర :**

ఈ గ్రంథములో ఆచార్య పరంపరను తెలియజేయు పద్యములు రెండు మూడు గలవు. ఇవి మంత్రోపదేశక్రమము గలిగియున్నవిగా మనము గ్రహింప వచ్చును.

1. "శ్రీదేవి యరమున జెన్నొంద భూనీళ
లిరుగెలంకుల తనకింపు గొలుప"....... పుట 1

ఇందులో క్రమముగా : నారాయణుడు, లక్ష్మీదేవి, విష్వక్సేనులు, శఠకోపులు పేర్కొనబడిరి.

2. "శ్రీ సఖజలధి సుస్థిర కృపాసలిలంబుగ్రోలి శఠారాతి కాల ఘనము..........." 157

ఇందులో వరుసగా శ్రీసఖుడు, శఠారాతి, నాథమునులు, పుండరీ

ఇందులో వరుసగా నారాయణుడు - నమ్మాళ్వారు - నాథముని - పుండరీకాక్షుడు - రామమిశ్రులు - యామునులు - కూరమాలాధరుడు - యతీంద్రులు మొదలగువారు.

**శ్రీ వైష్ణవ ధర్మ సంబంధ విషయములు -కొన్ని వివరణములు :**

**1. శ్రీ వైష్ణవుల లక్షణము :** (పుటలు : 139, 140)

సందర్భము : ప్రత్యక్ష వైకుంఠమనదగినట్టిది యతిరాజు మఠము. ఒక నాడొక సాత్త్వికుడు మఠము నందలరుచున్న సంయమీంద్రుని జూచి ఒక ప్రశ్న వేసెను. ఆ ప్రశ్న :

''వైష్ణవుడెట్లుండ వలయును?''

అపుడు రామానుజులవారు సమాధానమును బడయుట కతనిని అంజనాద్రిలో నున్న శ్రీశైలపూర్ణుల కడకు పంపెను అంత నాతడు అంజనాద్రిచేరి తిరుమల నంబి నాశ్రయించి తన సంగతిని విన్నవించుకొనెను. అంత శ్రీశైల పూర్ణులా సాత్త్వికునకు తెలియకుండగనే ఒక పరీక్ష వంటిది ఏర్పాటు గావించెను.[1] అదేమన? వ్యక్తి అర్హతనుబట్టి భోజనాదికముల జేయుటకు ఒక పంక్తిలో కూర్చుండబెట్టు నియమము.

1. మొదటిరోజున ఆ సాత్త్వికుని బ్రహ్మచారుల పంక్తిలో కూర్చుండ బెట్టెను. అతడలుగలేదు.

---

1. కొన్ని గ్రంథములలో : రామానుజులకు బదులుగా పరాశర భట్టరువారు, తిరుమల నంబికి బదులుగా అనంతాళ్వాను (ఆనందాళ్వాన్) కడకు తన సన్నిధి స్వాములలో నొకరిని శ్రీ వైష్ణవుల లక్షణములను తెలిసికొని రమ్మని పంపినట్లు గలదు. ఈ గ్రంథములో రామానుజులు అర్థవివరణ సేయగా వాటిలో భట్టరు వారే వివరణ చేసిరి. ఆ గ్రంథముల పేర్లు : 1. వార్తామాల. అనువాదము : శ్రీ కందాడై శేషాచార్యులు మద్రాసు 1926. 2. శ్రీ వేంకటాచలేతిహాసమాల : T T D ప్రచురణ, 1987. పీఠిక : ఎస్.సి వి. నరసింహాచార్య. 11.7.86.

3. మూడవ రోజున బ్రహ్మవేత్తల పంక్తిని గూర్చుండబెట్టెను అత డేమనకయే ఆరగించెను.

ఆ మరునాడు ఆ సాత్త్వికుడు తిరుమలనంబిని అదే ప్రశ్న వేసెను. అపుడు నంబి, "సైంధవ, బక, చరణాయుధములట్లు వత్స! నీవలె నుండ వలెను వైష్ణవుండు" అని చెప్పెను. ఆ వ్యక్తికి సందియమింకను దందడింపగా నతడు రామానుజులను జేరి వృత్తాంతమంతయు నివేదించుకొనెను. అపుడు రామానుజులు తిరుమలనంబి ధీరసూక్తుల కర్థమును వివరించెను. సంకేతముల ద్వారా అర్థము చేసికొను పద్ధతి యిది.

**సంకేతములు :**

"వరకృపా రసపూర్ణ వాఙ్మనః కాయుడై
 'సైంధవ'మట్లుండు సాత్త్వికుండు - సైంధవము
ఒక దివ్యదేశము నందుండి యుజ్జీవించు
 సరసిని 'బకమ'ట్లు సజ్జనుండు - బకము
సారతమార్థైక సంగ్రహం బొనరించు
 **చరణాయుధము** నట్లు సత్తముండు - చరణాయుధము
దురభి మానాత్యంత దూరస్థితిని జెందు
 వసుధనీ **పోలిక** వైష్ణవుండు - నీవు
అనుచు గంభీర పదముల నస్మదార్య
**డీ**యర్థముల జెప్పె నిదియెఱుంగు
మనుచు యతిపతి వాక్రుచ్చె నతని కనుచు
వాది భీకర గురుడనె మోదమలర." (పుట : **140**)

పై పద్యములో నున్న భావము మాత్రమే :

## 1. సాత్త్వికుడు, సైంధవము :

ఒక సాత్త్వికుడు సైంధవము (ఉప్పు)వలె మనోవాక్కాయ కర్మములలో (త్రికరణశుద్ధిగా) దయారసపూర్ణుడైయుండవలెను. సైంధవ మనగా గుణము. లక్ష్యశుద్ధికి చిహ్నము. సమన్వయమును చేసికొనవచ్చును.

**2. సజ్జనుడు బకము :**

ఒక సజ్జనుడు సరస్సులోని బకము (కొంగ) వలె ఒక దివ్య దేశము నందుండి (శ్రీ వైష్ణవ పుణ్యక్షేత్రములలో) ఉజ్జీవించవలయును.

**3. సత్తముడు, చరణాయుధము :**

ఒక సత్తముడు చరణాయుధము (కోడి)వలె సారవంతములైన అర్థమును మాత్రమే గ్రహించవలయును.

**4. వైష్ణవుడు - నీవు :**

ఒక వైష్ణవుడు నీవలె (ప్రశ్నించు సాత్త్వికునివలె) దురభిమానములకు దూరముగా తొలగవలయును. నీవలె ప్రవర్తన గలిగియుండవలెను.

**సంశిళ్ళ సమాధానములలోని అంశములు :**

(ఆశ్రితులడిగిన సందర్భములలో)

1. శ్రీ వైష్ణవులను పేరు గలుగుటకు కారణము : పుట 411.

"సిరికి శ్రీహరికిని వరపుత్రులైయుండ,
నెఱుక శ్రీపతి పీరికిచ్చుకతన
శ్రీధరు నెఱుగుట జేసి శ్రీ మత్పదం
బున బుట్టినందున, "పురుషకార"
భూతయై సిరి పీరిని బ్రోచుకతన
గలిగె శ్రీ వైష్ణవాఖ్య యీ ఘనుల కనుచు
వాదిభీకర గురుడనె మోదమలర!"

తాత్పర్యము స్పష్టము. ఇందలి విశేషాంశము పురుషకారము.

**పురుషకారము :** విశిష్టాద్వైత సాహిత్యముతో తఱచుగా వాడబడు పదము. పురుషకారమని లక్ష్మీదేవికి పేరు. ఆమెపట్ల సార్థకమైనది. "పురుషం కరోతీతి పురుషకారః" శ్రీమన్నారాయణుని పురుషునిగా జేయునది. అనగా పూర్ణుని జేయునది ("పూర్ణః పురుష ఉచ్యతే"). ఆయన "పూర్ణ మదః పూర్ణ మిదం" ఇత్యాది శ్రుతిసిద్ధ పూర్ణత్వము గలవాడు. పూర్ణుని చేయుట ఏమనః గుణములతో పూర్ణునిగా జేయునది. ఉదాహరణమున కిచట ఒక కుటుంబము. తండ్రికోపము, సంతానముపై తల్లికి గల ప్రేమ, పిల్లల తప్పులను క్షమించుట క్షామె తనభర్తకు నచ్చజెప్పు విధానము. చివరకు వారిని రక్షింపజేయుట. అట్లే-

సిరియు, హరియు వైష్ణవులందఱకు తల్లిదండ్రులు. హరి పాపముల జేసిన చేతనులపై కోపింప, సిరి అడ్డుపడి తన మృదూక్తుల, దరహాస లావణ్యాదులచే హరిని వశము గావించుకొని, అతని స్వామిత్వ సౌలభ్య సౌశీల్య, వాత్సల్య, క్షమాశీలత్వ గుణములను జ్ఞాపకముజేసి, ఈ గుణములను సార్థకము గావించుకొనుటకై నచ్చజెప్పి, "శ్రీమన్నారాయణ చరణౌ శరణం ప్రపద్యే" అన్నవారందఱను రక్షింపవేడుకొనును. మోక్షమిప్పించుటకు కారణభూతురాలగను. అందులకే పైపద్యములో—

"పురుషకార భూతయై సిరి వీరిని బ్రోచుకతన" అని గలదు. పురుషకారమును జేసిన ఆచార్యులను గూడ పురుషకారు లనవచ్చును.

ఉదా॥ 1) రామానుజులు శ్రీవేంకటేశునకొక లేఖ వ్రాసి ఒక గొల్లదానకు మోక్షమిప్పించెను. పుట 336

(శ్రీమాన్ వేముగంటి నరసింహాచార్యులు "పురుషకార"మను లఘు కావ్యమును వ్రాసినారు. కథ ఇట్టిదే.)

2) నంబిళ్ళగారును శ్రీరంగని కొక పత్రిక వ్రాసి ఒక సాధ్వికి మోక్షమిప్పించెదు. పుట 395.

3) తిరువరంగప్పెరుమాళరయరును పురుషకారంబుగాగొని గోష్ఠిపూర్ణులు, మహాపూర్ణులు యామునులను హితముపదేశించుమనిరి. పుట 119.

2. వైష్ణవులు విష్ణున కెట్టివారు? పుట. 411

"పంచపాండవులట్లు భగవంతునకు నిజ
ప్రాణసమానులు భాగవతులు,
సౌమిత్రి పగిది కోసలరాజ సుతునకు
బాహుసమానులు భాగవతులు
జానకిగతి రామచంద్ర పదచ్ఛాయ
బట్టి చరింతురు భాగవతులు,
నారాయణున కాత్మనయన జిహ్వాకల్ప
పాదాబ్జ సదృశులు భాగవతులు,
పద్మనాభాంఘ్రిరేఖలు భాగవతులు
హరుని కాయుధతుల్యులు భాగవతులు."

ఇందు భగవంతుడు - భాగవతుడు, వీరి సంబంధము రమ్యముగా ఉదాహరణల యుక్తముగా వర్ణింపబడినది. విశేషాంశములు :

**నవవిధ సంబంధములు :** విష్ణు సంబంధము గలది వైష్ణవము. అది తొమ్మిది విధముల నొప్పారును.

1. జన్యజనక సంబంధము (పితాపుత్ర సంబంధము), 2. రక్ష్య రక్షక సంబంధము, 3. శేషశేషి సంబంధము, 4 భార్యాభర్తృ సంబంధము, 5. జ్ఞాతృ జ్ఞేయ సంబంధము, 6 స్వత్వస్వామిత్వ సంబంధము, 7. ఆధారాధేయ సంబంధము, 8. శరీర - శరీరి (ఆత్మ) సంబంధము, 9. భోక్తృ - భోగ్య సంబంధము.

**3. వైష్ణవుల ముత్తెఱంగులు :** పుట. 412

1) సత్కార యోగ్యులు 2) సహవాస యోగ్యులు 3) సదానుభవ యోగ్యులు.

"శ్రీనివాసుని నామ చిహ్నముల్ గలవారు
సత్కారయోగ్యులు సజ్జనులకు,
స్వస్వరూపజ్ఞాన సంపన్నులగువారు
సహవాసయోగ్యులు సాత్త్వికులకు,
ఆర్త ప్రపన్నులై హరి సర్వమనువార
లనుభవార్హులు నిత్యమార్యులకును"

తాత్పర్యము స్పష్టము.

**4. వైష్ణవుండెట్లు బహుమతుడగును?** పుట. 400

**సందర్భము :** ఒక కథారూపములో.

ఒక పృథ్వీశుని యింట పెండ్లి. ఇళహోళ్వానుగారను వారు రాజసభకు వెళ్ళిరి. అందఱకును సంభావనలిచ్చుట జరిగెను. ఇతనికీయలేదు. సందేహపడగా నా రాజు : "నీవు సర్వజ్ఞుడవు. వైష్ణవుడవంచరని తెలిసి యిట్లు పేక్షించితి" ననెను.

అపుడు నంబిళ్ళగారిట్లు చిక్కును విడదీసిరి:

"వరగోష్ఠియందు పేక్ష, యతుల
బహుమతి యగు వైష్ణవాన్వయులకు."

వైష్ణవుడైనవాడితరుల గోష్ఠులకు వెళ్ళడు. ధనమున కాశపడడు.

4. వైష్ణవుడెట్లుండవలెను?

(నంబిళ్ళ ప్రశ్నకు నంజీయరు సమాధానము, పుట 386)

"వత్స! వైష్ణవుడైనవాడు శ్రీ సర్వావ
తామరమునందె సద్భక్తి గలిగి,
తన దారపుత్ర పౌత్రకులందు గల ప్రీతి
శ్రీవైష్ణవులయందు జేర్పవలయు,
భాగవతులు తన్ను పరుషవాక్యంబుల
పలికిరా, యోర్చి తత్పాదపద్మ
ములకు మ్రొక్కిడవలెగాని యలుగరాదు
వసుధ వైష్ణవు డిట్లుండవలె నటంచు
నార్యుడన విని నంబిళ్ళ యలరె ననుచు."

తాత్పర్యము - స్పష్టము.

5. సర్వస్వదాన మన నెట్టిది?

(నంబిళ్ళగారి సమాధానములు పుట 393)

"సర్వస్వదానము శౌరి చేయుట తన
యొడలెల్ల జూపుట ఉన్నయట్టు
(శౌరి తన శరీరమునంత జూపును)
ఆచార్యులాదాన మాచరించుట చర
మార్థ విశేషము లన్నియిడుట
(ఆచార్యుడు చరమార్థమును ఉపదేశించును)
ఆత్మకీశుడు నియోగార్హుడు గాడంట
ఫలిత చేతనునకు గలుగదనుట (ఆత్మ వినియోగము)
ఈశ్వర వినియోగ మీ యాత్మ యనుటయు
ఫలితాభిమానియు పరుడె యనుట (ఫలితాభిమాని)

ఆర్తుడుదృప్తుడగుట యనగా :

ఆర్తుడతి దృప్తుడగుట యిష్టార్థముడిగి
స్వతను రుచిమాని ప్రాప్తి నిశ్చయము చెంది,
సంతసించుట యనియెనా సభ్యుడనుచు - ఆర్త ప్రపత్తి. (ఆర్త ప్రపత్తి)
దృప్తుండార్తుండగుట : పుట 394.

''దృప్తుడు తన కిష్ట దేహితో నెడబాసి
యార్తుండయ్యును శరీరావసాన
పర్యంత మాత్మాంగ పటురుచి మానక
తుది కాయముడిగిన తుష్టి గనుట'' - (దృప్త ప్రపత్తి.)

విశేషాంశములు : ఇచట ప్రపత్తి తెగలను గూర్చిన ప్రసక్తి గలదు.

వివరణము : ప్రపత్తి :

ప్రకృష్టమైన 'పత్తి'=ప్రపత్తి. 'పత్తి' అనునది 'ప్ర' అను ఉపసర్గతోడి పద్ అను ధాతువుచే నేర్పడినది. దానికి గతియని అర్థము. గత్యర్థములన్నింటికి జ్ఞానమని అర్థము.

ప్రపత్తియన : శ్రేష్ఠమైన జ్ఞానమని యర్థము. భగవంతుడే సర్వరక్షకుడను నట్టి జ్ఞానము.

''పద్యతే అనేన ఇతి ప్రపత్తిః'' అన్న వ్యుత్పత్తి చేత ముక్తిప్రాప్తి సాధనకు ప్రపత్తి అని పేరు.

పర్యాయపదములు : రామానుజ మతానుసారము :

ప్రపత్తి, న్యాసము, భరన్యాసము, శరణాగతి, ప్రపదనము.

మోక్ష సాధనమునకు మార్గములు నాలుగు:

1. కర్మ. 2. జ్ఞానము. 3. భక్తి. 4. ప్రపత్తి.

సద్వారకములు : కర్మ, జ్ఞానములు భక్తిద్వారా మోక్ష ప్రదములు. గాన ఇవి రెండు సద్వారకములనబడును.

అద్వారకములు :- భక్తి సాక్షాత్తుగా మోక్షమును ప్రసాదించునదగుటచే అద్వారకము.

సద్వారక + అద్వారకము=ప్రపత్తి. ఇది స్వయముగను, పై యోగముల ద్వారముగను ఫలమునొసంగును గాన ప్రపత్తి : సద్వారక, అద్వారక ప్రపత్తియగుచున్నది.

ప్రపత్తి విధములు - చేయువారి అర్హతను బట్టి మూడు విధములు.

1) స్వనిష్ఠ :- తత్త్వమెరింగినవారు స్వయముగ చేయునది స్వనిష్ఠ

2) ఉక్తినిష్ఠ :- భగవంతునియందు విశ్వాసము. ఆచార్యుడు చెప్పినట్లు, అర్థముతో నిమిత్తము లేకుండ అనుష్ఠించుట. ఉదా॥ వటువు 'భిక్షాందేహి'యన్నపుడు గృహిణి ఇతని కర్థము తెలియునా తెలియదా అని ప్రశ్నించక భిక్షనిడుట.

3) ఆచార్యనిష్ఠ :- ఆచార్యుడు తాను భగవంతుని శరణుజొచ్చునపుడు తన్నాశ్రయించినవారిని వారి ప్రమేయము లేకుండ రక్షింపుమని భగవంతుని ప్రార్థించుట.

ఆర్తప్రపత్తి :- సంసారబంధంలో తానుండలేదని, స్వంతమైనది పరంధామమేనని, భగవత్కైంకర్యమే తన కృత్యమని, దానినెప్పుడు పొందుదునాయని తహతహలాడును. భగవత్సన్నిధి చేరునంత వరకు వాని కూరటలేదు. ఇట్లు ప్రార్థించుట ఆర్తప్రపత్తి.

దృప్తప్రపత్తి :- ''భగవంతుడు సర్వాంతర్యామి వైకుంఠములోను, ఈ లోకములోను మరణించునదొకసారే. ఎప్పుడైనను చావురానీ'' అంటూ గుండె నిబ్బరంగా యుండి ప్రపత్తి చేయువాడు. వాడు చేయునట్టి విధానమే దృప్తప్రపత్తి.

**6. శ్రీ వైష్ణవుడు తన శక్తి ననుసరించి ఎప్పుడేమి చేయవలెను?**
ఉదయవరుల వైభవము. యతిపతి చెప్పిన విషయము.

"శ్రీభాష్యమాచార్య సేవచే పఠియించి
శిష్యముఖంబుగా జెప్పవలయు.......... (157 పుటలో జూడుడు)

తాత్పర్యము : స్పష్టము. ఇదే భావమును రామానుజులు తన చరమదశ యందాశ్రితులకు తెలుపుచు ఇంకను కొన్ని విశేషాంశముల నధికముగా చెప్పిరి. పుటలు 345, 346.

సందర్భము : దేశికేంద్రులు కొందఱడిగిన ప్రశ్న :

యతీంద్రా! యీశ్వరాధీనంబైన యాత్మయాత్ర యందు కర్మాయత్తం బగు చేతనునకన్వయంబు లేదని యానతిచ్చితిరి. ఇంకను వీరికి కాలయాపన మెట్టిది?

7. శ్రీ వైష్ణవులితర దేవతల ననుసరింపకుండుట కేమి కారణము ?

ఒక చేతనుని ప్రశ్నకు పరాశరభట్టరు సమాధానము. పుటలు : 374

వచనములో గలదు : ప్రమాణ విరోధంబున్నయెడ గదా సందేహం బుదయించు? నీ యర్థంబునందు ప్రమాణంబులకు పరస్పర విరోధంబు లేనికతన సందియంబు వాటిల్లదు.

అదియెట్లంటివేని? :-

సత్త్వ ప్రచురులను రజస్తమః ప్రచురులను వర్తించుట విడిచి వారలు వీరినెట్లనువర్తింతురు? కావున నాలయస్థిత దేవతాంతరములను గుణదోష జ్ఞానంబుచే శ్రీవైష్ణవులనుసరింపరు.

8. నంబిళ్ళ వైభవములోను బట్టి సందేహమే గలదు (పుట. 397).

ప్రశ్న : వైష్ణవుడు వైదిక క్రియలలో ఇంద్రాది దేవతల నేల భజియించును?

"నారాయణునిదక్క వేఱొక్క వేల్పును
గొలువరు వైష్ణవుల్ గురుపరేణ్య!
అట్టివారితరులౌ నగ్నీంద్రులాదిగా
గలనిలింపుల వైదిక క్రియలను
భజియించుటేమని? బ్రాహ్మణుండొక్కడు
నంబిప్ప నడుగ" నా "నయవిదుండు"

**సమాధానము :**

"హరికన్యదేవత లంగములనుచు వి
శేష శాస్త్రోక్తులు చెప్పగాన
నిత్యనైమిత్తికములందు నిఖిలదేవ
తార్చ భగవదుపాసనమగుట జేసి,
యది విరుద్ధముగాదనియె ననుచు
వాది భీకర గురుడనె మోదమలర!"

9. "ప్రతివాది భయంకరం" అణ్ణంగారికి "ఆ బిరుదు లభించుటకుగల కారణము : వాదములో నతడు విశిష్టాద్వైతస్థాపన మొనర్చినపుడన్న మాటలు: పుట 595.

సందర్భము:- అద్వైతవాది యగు నరసింహ మిశ్రులతో నయనారు దేశికుల శిష్యుడగు 'అణ్ణంగారు' వాదించి వాదములో గెలిచిరి. వివరములు :

**అద్వైతి:-** "నిర్విశేష చిన్మాత్రమగు బ్రహ్మంబు పరమార్థంబగును. తదతిరిక్తంబంతయు మిథ్యాభూతము. ఆ బ్రహ్మము నిర్గుణంబు. తత్సాధన భూత ప్రమాణసహకృత తర్కసహస్ర ముపన్యసించెను.

**విశిష్టాద్వైతి:-** (అణ్ణంగారు) ఆ గ్రంథంబంతయు సునాయాసంబుగా ననువదించి యా ప్రతివాది నుద్దేశించి:-

1) ప్రత్యక్షాది ప్రమాణంబులన్నియు విశిష్టార్థ గ్రాహకంబులు గావున నిర్విశేషము ప్రమాణముగాదని పలికెను.

2) నిర్గుణవాక్యములన్నియు హేయగుణ రాహిత్య పరంబులుగా సాధించి, యద్వైత శ్రుతులన్నియు "విశిష్టాద్వైత పరంబులు"గా సమర్థించిరి.

3) నారాయణుండు పరమ తత్త్వము.

4) "దేవ తిర్యఙ్మనుష్యస్థావరాదిభేద భిన్నంబగు చేతనాచేతనాత్మక పరిదృశ్యమాన ప్రపంచంబంతయు తచ్ఛరీరము."

అని బలవత్ప్రమాణ సహకృత బ్రహ్మతర్క సహస్రోపన్యాసంబుచే నిశ్చయించెను.

పందెము గెలిచినందున అణ్ణంగారికి నృసింహ విగ్రహం బభిముఖం బయ్యెను. గురువుగారు శిష్యుని "పతివాది భయంకరనే యణ్ణనే" యని సంబోధించెను.

## 10. విశిష్టాద్వైతమును గూర్చి :

శ్రీవేదాంతదేశికుల యభిప్రాయములు : (575 వ పుట)

(ఈ గ్రంథములో విశిష్టాద్వైత పదము ప్రసక్తులు : పుటలు : 70, 118, 191, 196 : 450, 575, 595 లలో గలవు.)

సందర్భము : శ్రీరంగములోనున్న వేదాంతదేశికులకడకు కాశీవాగ్విజయి భట్టారకుడనెడు విప్రోత్తముడు వచ్చి వాదము సలిపెను. వాదివిజయార్థమంటవ

వేదాంత : బ్రహ్మతర్కముపన్యసించి, బలవదుపనిషదుక్త సంభావ్యమైన రీతిని చిదచిదీశ్వరసత్యత్వసిద్ధి పూర్వమతనిమతమంత ఖండించెను. ఆ క్రమ మిట్లున్నది:

"సకల ప్రమాణముల్ సవిశేషపరములు
నిర్విశేషము జెప్పనేరవెప్ప
దదిగాన, నిఖిలహేయ ప్రత్యనీక - క
ళ్యాణైకతాన నారాయణునకు,
శేషభూతములైన చిదచిత్తులంగముల్
సర్వముల్ నిత్యముల్ శాశ్వతములు
తద్విశిష్టార్థ బోధకము వేదౌఘంబు
గావున బ్రామాణికంబు నిర్వి
శేషచిన్మాత్రమెట్లగు చింతసేయ"

ఇట్లేడహోరాత్రములు వాదయుద్ధము జరిగెను. చివరకు దేశికులవారు జయించిరి. అతడు శిష్యుడాయెను.

వాదములు సేయుట, పరమతముల ఖండించుట, జయమునంది స్వమత స్థాపనము సేయుట నాటి యాచారము ఇందు శ్రీ వేదాంత దేశికులు విశిష్టాద్వైత మును స్థాపించుట తేటతెల్లముగా వర్ణించబడినది. చిదచిదీశ్వరుల సత్యత్వము స్థాపింపబడినది.

**విశేషాంశములు** : ఆ. సూ. ము. లో విశిష్టాద్వైతమును వివరించుట ఈ ఘట్టములోనే వ్రాయబడినది. నిర్వచన మీ విధముగనే గలదు. ఈ సిద్ధాంత మును గూర్చి అసంఖ్యాకములైన గ్రంథముల ప్రచురింపబడినవి. గాన ఇచట నే నుటంకించుట చర్వితచర్వణమే యగును ఐనను కొన్ని విషయముల పేర్కొందును.

విశిష్టాద్వైత నిర్వచనము - అంశములు :

1. "విశిష్టస్య విశిష్టరూపేణ అద్వైతం" అని న్యాయ సిద్ధాంత జనమందు వేదాంత దేశికులు వ్యుత్పత్తి చెప్పిరి. "విశిష్టయోః అద్వైతమ్ అస్మిన్"- బ్రప్రీ. ఆంధ్ర శబ్ద రత్నాకరము, పుట 1776

2. న + ద్వైతం = అద్వైతం; విశిష్ట + అద్వైతమ్ = విశిష్టాద్వైతమ్.
3. చిత్, అచిత్, ఈశ్వరుడు ఈ సిద్ధాంతమునందు ప్రధానాంశములు.
4. విగ్రహ వాక్యము : విశిష్టంచ విశిష్టే, విశిష్టయోరద్వైతమ్.

**తత్త్వత్రయము :**

5. చిత్తు :- అనగా జీవాత్మ అనగా జీవస్వరూపము.
6 అచిత్తు :- అనగా ప్రకృతి లేక జగత్తు.
7. ఈశ్వరుడు :- పరమాత్మ లేక శ్రీమన్నారాయణుడు = బ్రహ్మ, సత్.

సంబంధము :- అపృథక్సిద్ధ సంబంధము = విడదీయుటకు వీలులేనిది.

ఇందు సర్వాత్మయైన శ్రీమన్నారాయణుడే ముఖ్య తత్త్వము. అతనికి విశేషము లసంఖ్యాకములు. అశేషములు. అతనితో ఎల్లప్పుడు కూడియుండునవి 1. చిత్తు 2. అచిత్తు.

**ఏ కాలమందు సంబంధము? :**

పరమాత్ముడీ కాలములలో విశిష్టుడు—

1) కారణావస్థయందు : సృష్టికి పూర్వము, సృష్టిలేని కాలమున చిదచిత్తులు సూక్ష్మరూపములో నుండును.

2) కార్యావస్థయందు : సృష్టికాలమందు, సృష్టి పిమ్మట చిదచిత్తులు స్థూల రూపమునందును.

3 ప్రళయకాలమందు : చిదచిత్తులు తిరిగి సూక్ష్మములగును. పరమాత్మతో ఏకీభావమునందును.

కారణ కార్యావస్థలయందు విశిష్టుడైనవాడు పరమాత్మ, తత్పరుడు. ఇట్టి ఉభయవిధములైన పరమాత్మల కైక్యము = అద్వైతము బోధించుటచే విశిష్టాద్వైతమనబడినది సర్వము శేషము, పరమాత్ముడు శేషి.

లక్షణములు, గుణములు :

1) చిత్తు: జీవాత్మ, జీవస్వరూపము, శరీరేంద్రియాదులకన్న విలక్షణము నిత్యము, జ్ఞానానందమయము, అణుపరిమాణము. ఈశ్వరునికి నియామ్యము. శేషము, మోక్షసమయమందీశ్వర సాన్నిధ్యమును జేరును.

ఇది జడము. వికారాస్పదము. భగవదిచ్ఛచే నానావిధములుగా పరిణమించును. భగవంతునకు క్రీడాపరికరము సంసారమునకిదియే మూలము.

3) ఈశ్వరుడు : పరమాత్మ-సత్-బ్రహ్మ-ఈశ్వరుడు అని పేర్లు గలవు. ఇతడు శేషి. నిఖిల హేయప్రత్యనీకుడు, సకల కళ్యాణ గుణాకరుడు, జగత్సర్గ స్థితిసంహారకర్త చేతనా చేతనముల కంతర్యామి. చిదచిత్తులితనికి విడదీయరాని సంబంధము గలవి. ఈ జీవజగత్తులు పరమాత్మనుండి ఉద్భవించి, అతని యందే పరిణతచెంది, లయమగును.

**11. ఆ.సూ.ము.లో :** పరమాత్మ=శ్రీమన్నారాయణునికి గల విశేషణములు విశిష్టాద్వైత సిద్ధాంతములందు అందఱును పేర్కొనునట్టివి : (457 పుట)

సందర్భము :- మణవాళ మహాముని వైభవములోని అంశము. బ్రహ్మ రుద్రాదులకంటె శ్రీమన్నారాయణుడే అధికుడని మణవాళ మహామునులు నిరూపించిరి: బ్రహ్మరుద్రుల కిరువురికి వేదాపహార గురుపాతక దైత్య పీడాద్యాపద్విమోచనుండును; ఇంకను ఈ క్రింది లక్షణములు గలవాడు :- సకల శ్రుతి స్మృతీతిహాస పురాణాది సరస్వతీ జోఘుష్యమాణుడు :

1. జగజ్జన్మాది కారణత్వము1, 2. సర్వాంతర్యామిత్వము, 3. సర్వ నియంతృత్వము, 4. సర్వరక్షకత్వము, 5. సర్వశక్తిత్వము, 6. సర్వజ్ఞత్వము 7. సత్యసంకల్పత్వము, 8. శుద్ధ సత్త్వమయత్వము, 9. నిఖిల హేయ ప్రత్యనీక కల్యాణైకతానత్వము, 10. నిరుపాధిక నిఖిల బంధుత్వము, 11. నిస్సమాభ్యధికత్వాది శుభలక్షణోప లక్షితుండు నగు శ్రీమన్నారాయణుండధికుడు.

**12. తొండరడిప్పొడి యాళ్వారుల వైభవములోనివి :** పుట 45

సందర్భము : విప్రనారాయణులు భక్తాంఘ్రిరేణువనియును, తొండరడిప్పొడియాళ్వారనియును దివ్యనామములు ధరించుట, తిరుమాలై, ప్రాటోధకి యను రెండు దివ్య ప్రబంధములు వ్రాసి వైభవమును చాలించి అర్చారూపము

---

1. "యతోవా ఇమాని భూతాని జాయంతే
యేన జాతాని జీవంతి యత్ప్రయంత్యభి
సంవిశంతి తద్విజిజ్ఞాసస్వ తద్బ్రహ్మ॥
(విష్ణువే జగత్కారణుడు) - తైత్తిరీయ ఉపనిషత్తు భృగువల్లి - I

ంట, పిమ్మట దేవదేవి ఇతని పాదపద్మములయందు మనసుంచుట, శ్రీరంగ
డీమెను కటాక్షించుట.

ఈ ఘట్టములో గ్రంథకర్త వైష్ణవుల లక్షణములు, ధర్మములు మొదలగు
ములకు సంబంధించిన పదప్రయోగములను చేసినాడు. 1) ఆకారత్రయ
న్నత 2) మహాభాగవతులు 3) అర్థ పంచకాభిజ్ఞత్వము 4) పంచసంస్కా
5) భగవంతుని గుణవిభూతులగు పరవ్యూహాదిరూపములు.

**వివరణము :** శ్రీరంగనాథుని కటాక్షముచే దేవదేవి -

" 1) "స్వస్వరూప, విరోధిస్వరూప, ఉపాయస్వరూప, పురుషార్థ
ూప, రూపార్థపంచక జ్ఞానపతియై; (రూప = పరరూపము)

2) భగవదనన్యార్హ శేషత్వానన్య శరణత్వానన్య భోగ్యత్వ రూపాకార
యంబును;

ఇట్లు అవికలంబును, అచలంబులు, అకళంకంబునకు కలిమి లభించిన"

సాంసారిక బంధముల విడనాడి తన సమస్త ద్రవిణంబుల శ్రీరంగ భర్త
ంచి, "తదీయ దివ్యమంగళ విగ్రహోత్సవాద్యనుభవ జనిత ప్రీతికారిత
య మందిరానవరత సమ్మార్జనాది కైంకర్యము లొనర్చు, తదీయతీర్థ ప్రసా
ముల నుజ్జీవించుచు, గుణానుభవ కైంకర్య శ్రీ మహాభాగవతులం జూచి నిరు
క సకలవిధ బంధువులుగా దలంచుచు కొన్ని దినంబులుండి శ్రీ భక్తాంఘ్రి
మహాదేశిక ప్రాప్త మహోన్నత స్థానం లభించి సుఖించుచుండె."

విప్రనారాయణుల తలంపు : తాను విషయవిరక్తుడై అగమ్యాగమన
యశ్చిత్తార్థంబుగా "అర్థ పంచకాభిజ్ఞత్వ పంచ సంస్కార సంస్కృత
కారత్రయ సంపన్నాది లక్షణ లక్షితులగు శ్రీ మహాభాగవతుల శ్రీపాదంబు
వించి పరమ పవిత్రుండ నయ్యెదనని తలంచెను. గ్రామకులాది నిమిత్తాగమం
నామంబనర్థ హేతువగుట జేసి, భగవంతుండగు నారాయణునకు ప్రార్థ
ంబై పరమ పవిత్రంబగు శ్రీ వైష్ణవాంఘ్రి రజోవ్రజంబు తనకు నిరూపక
ంబుగా భక్తాంఘ్రిరేణు వనియదు, తొండరడిప్పొడి యాళ్వారని దివ్యనామ
ం ధరించెను. ధారకపోషక భోగ్యత్రయంబు భగవంతుడేయని విశ్వసించెను.
ప్రాసాద సాక్షాత్కృత పరవ్యూహ విభవాంతర్యామ్యర్చారూప చేష్టితుండయి,
వదనుగ్రహ ప్రాప్త పరభక్తి పరజ్ఞాన పరమ భక్తి సంపన్నుండై -

పరమ కృపచే సర్వచేతనో జ్జీవనం బొనర్చి వైభవంబు చాలించి యర్చారూపంబు ధరియించి యుండె."

సమన్వయము : ఈ ఘట్టము నందలి అంశములన్నియు వైష్ణవుల లక్షణములను తెలుపుచున్నవి. పరిభాషయు అట్లే యున్నది. దేవదేవి స్త్రీ. వేశ్య. ఐనను భాగవతుల శ్రీపాదము లాశ్రయించుట కర్హురాలైనది, ఇందుకు కుల మత వర్గ లింగ విచక్షణత లేదని తెలియుచున్నది. ఈ గ్రంథమునందలి స్త్రీ పాత్రలలో ఈమెను వైష్ణవలక్షణోపేతముగ వర్ణించుట గమనార్హము.

వైష్ణవ పదజాలము : ఈ ఘట్టములో కానవచ్చునవి :

1. ఆకారత్రయము :

1. అనన్యార్హ శేషత్వము 2. అనన్య శరణత్వము 3. అనన్య భోగ్యత్వము.

2. అర్థ పంచక జ్ఞానము :

1. పరస్వరూపము. 2. స్వస్వరూపము 3. ఉపాయ స్వరూపము 4. పురుషార్థ స్వరూపము 5. విరోధి స్వరూపము.

3. పురుషార్థములు :

1. ధర్మ 2. అర్థ 3. కామ 4. మోక్షము

మోక్షములో 1. ఆత్మప్రాప్తి 2. భగవత్ప్రాప్తి.

4. శరణాగతి : (ప్రపత్తి) దీనికి 6 అంగములు.

1. అనుకూల్య సంకల్పము 2. ప్రాతికూల్య వర్జనము 3. రక్షించునను విశ్వాసము 4. గోప్తృత్వ వరణము 5. ఆత్మ నిక్షేపము (అనన్య గతిత్వము) 6. కార్పణ్యము.

5. పంచ సంస్కారములు :

"తాపః పుండ్ర స్తథా నామ మంత్రోయాగశ్చ పంచమః."

1. తాపము 2. పుండ్రము 3 నామము 4. మంత్రము 5. యాగము.

6. శ్రీ మహాభాగవతులు : ఈ గ్రంథములో ఎన్నియో దృష్టాంతములు గలవు. "అర్థపంచకాభిజ్ఞత్వ పంచసంస్కార సంస్కృతత్వాకారత్రయ సంపన్నత్వాది లక్షణ లక్షితులు. పుట 44

గమనిక : పైన వివరింపబడినవి పంచసంస్కారములలోనిదే :

మంత్రము. మంత్రత్రయము :

1. అష్టాక్షరి : మంత్రరాజము - మూలమంత్రము :

"ఓం నమో నారాయణాయ"

2. ద్వయము : మంత్రరత్నము

"శ్రీమన్నారాయణచరణౌ శరణం ప్రపద్యే,
శ్రీమతే నారాయణాయ నమః॥"

3. చరమము :

"సర్వధర్మాన్ పరిత్యజ్య
మామేకం శరణం వ్రజ,
అహం త్వాసర్వ పాపేభ్యో
మోక్షయిష్యామి మాశుచః॥

మహాభాగవతుల ప్రశంస : ఎవరు భాగవతులనగా : పుట 44.

"అర్థపంచక తత్త్వజ్ఞాః పంచసంస్కార సంస్కృతాః
ఆకారత్రయ సంపన్నా మహాభాగవతాః స్మృతాః॥

మహాభాగవతుల శ్రీపాదతీర్థ ప్రశంస : పంచపాతకములు నశించును.

1. "ఏతత్పఞ్చ మహాపాప ప్రాయశ్చిత్తం మనీషిభిః।
నిర్ణీతం భగవద్భక్త పాదోదక నిషేవణమ్॥"

2. "త్రిస్రః కోట్యర్థకోటీచ తీర్థాని భువనత్రయే
చక్రాంకితస్య విప్రస్య పాదేతిష్ఠంత్య సంశయః॥"

3. "భగవంతునకు ప్రార్థనీయంబైనది వైష్ణవాంఘ్రిరజోవ్రజము"

(పుటలు 45)

"యస్యమూర్ధ్నిస్థితం యావద్వైష్ణవాంఘ్రిరజశ్శుభమ్,
గంగాది సర్వతీర్థాని తావత్తిష్ఠంత్య సంశయః॥

4. విప్రనారాయణులు భక్తాంఘ్రిరేణువను దాస్యనామము దాల్చిరి.

"నిరపేక్షం మునింశాంతం, నిర్వైరం సమదర్శనమ్,
అనువ్రజామ్యహం నిత్యంయో జయత్యంఘ్రిరేణుభిః॥

5. శ్రీరంగనాథుడు తన భక్తుల భక్తులను కటాక్షించువాడు :

విప్రనారాయణుని పాదపద్మములయందు మనసుంచిన దేవదేవిని, ఆమె వేశ్యయైనను, ఆమె కైంకర్యమును జూచి కటాక్షించెను.

''అనన్యదేవతా భక్తాయే,
మద్భక్తజనప్రియాః
మామేవ శరణం ప్రాప్తా
స్తే మద్భక్తాః ప్రకీర్తితాః॥''

''మమ, మద్భక్త భక్తేషు
ప్రీతిరభ్యధికాభవత్॥'' (పుట 45)

6. విప్రనారాయణుల భాగవతవేషము-ఆకృతి-వర్ణన (పుట 41)

''దీర్ఘశిరోరుహ దృఢబంధవిలసిత
శీర్షుని శ్మశ్రులాంఛిత ముఖాబ్జు,
రోమశాఖిలగాత్రు, రుచిరపక్ష్మలనేత్రు
ధౌతవస్త్రుని, పాణితలఖనిత్రు
ద్వాదశ స్థలధృత ధవళోర్ధ్వపుండ్రుని
తులసీనలినబీజ వలయధరుని
విమలోపవీతుని, సుమకుంజతరులతా
జలసేచనావాల కలనశీలు
విప్రనారాయణుని'' చూచినది దేవదేవి.

ఇది సంక్షిప్త సమన్వయ పరిచయము : ఇట్లే ఈ గ్రంథమునందెన్నియో వైష్ణవ ధర్మసంబంధ విషయములు గలవు.

**వైష్ణవ ధర్మంబులు :** రామానుజులు యజ్ఞేశునకు చెప్పినవి (పుట. 130)

వైష్ణవధర్మ పంచకము ప్రపన్నుడగు చేతనునకు—

1. పంచ సంస్కార సంపత్తియు, 2. శ్రీ మహా భాగవతార్చనము, 3. ఆచార్యాధీన వృత్తియు, 4. అర్థపంచక జ్ఞానము, 5. తదీయానువర్తనము వైష్ణవపూర్తికంబగు పరమ ధర్మంబులు.

**పరమ ధర్మము - అతిథి పూజ :** మార్గశ్రాంతుడై తన యింటి కేతెంచిన శ్రీవైష్ణవాతిథినిం జూచి, సాక్షాత్కృపుండగు పుండరీకాక్షునింగా దలంచుచు,

యర్ఘ్యపాద్యాది విధులం బూజించి, మృష్టాన్నదానాదుల సంతృప్తునిం జేసి, చందన, కుసుమ తాంబూలాది ప్రదానంబుచేత సంతుష్టునింజేసి, తద్భుక్తావశిష్టంబు నిజపుత్ర మిత్రకళత్రాదులతో భుజించుట పరమ ధర్మము.

**హితోపదేశము :** ముముక్షువులకు సార్వకాలం బనన్య ప్రపన్నులగు శ్రీ మహాభాగవతుల సకలోపచారంబులచే నర్చించుచుండుము. ముముక్షువులకు కింతకంటె పరంబగు హితంబు లేదు.

హరి ఆజ్ఞకన్న గుర్వాజ్ఞయే మిన్న ఆచార్య ప్రాధాన్యము.

**తార్కాణములు :**

1. మధురకవులు - పుట. 76.
2. కూరేశుల మాటలు - పుట 315.
3. వడుగనంబి - పుట. 328.
4. అనంతసూరి (అనంతాళ్వాన్) - పుట. 330

అనంతార్యు డన్న మాటలకు వివరణము : ఒకనా డితడొంటరిగా మణిమంటపమున సురభిపుష్పముల మాల గూర్చుచుండ శ్రీరంగ శ్రీ వేంకటేశుడు (శ్రీనాథుడు) మధ్యనే పిల్వనంప ఇతడు పోలేదు. కుసుమదామములన్ని గూర్చి తెచ్చి హరి నర్చించెను. అపుడు హరి 'నా యాజ్ఞ మీరితి వేమన" అనంతసూరి ఇట్లనును:

**అస్మదార్యాజ్ఞయే గొప్పది :**

"పరువు దప్పిన విరుల్ పరిమళింపవు, నీది
యానమీరిన భీతి నీని కేమి?
యిరువురము సంశ్రయించితి మిగ్గిరీంద్ర
మస్మదార్యాజ్ఞ, మీపనికైన నీని
కాజ్ఞపని యనియె నయ్యార్యుడనుచు"

**శ్రీ యామునుల హితోపదేశములు** చరమదశలో నుండగా: పుట. **119.**
స్థలము : శ్రీరంగము.

ప్రశ్నలడిగినవారు = హితంబొక్కటి ఆనతిమ్మని అడిగినవారు :
1. తిరుక్కొట్టియూరినంబి 2. పెరియనంబియ్యు

పురుషకారంబుగా (మధ్యవర్తి కార్యమును అనుకూలమగునట్లు చేయువాడు) - తిరువరంగ పెరుమాళరయరు, వచ్చిరి.

(గమనిక : ఈ గ్రంథములో పురుషకారశబ్దము 119 వ పుటలోను, 411 వ పుటలోను వాడబడినది. 411 వ పుటలో శ్రీలక్ష్మీదేవి కర్థము చెప్పబడినది.)

యామునుల సూక్తులు : 1. ఇద్దివ్యదేశంబు నెడబాయక వసియింపుడు. 2. శ్రీపాణయోగీంద్రు నాపాదమస్తకంబనుభవించుడు. 3. ఈ యనుష్ఠానమునకు ప్రమాణంబులు : 1) శ్రీ వెంకటేశుని భజించుచున్న కురుంబరుత్తనంబియు 2) కరిగిరి వరదుని సేవించుచున్న తిరుక్కచ్చినంబియు. 4. అనన్య ప్రసన్నులగు శ్రీ వైష్ణవుల శ్రీపాదపద్మంబులుగా నమ్మియుండుడు.

**వైష్ణవమతమును గూర్చి వివిధాభిప్రాయములు :**

సంప్రదాయజ్ఞుల, ఆధునికుల భావాలు.

(విశిష్టాద్వైతులు కాని వారివి గూడ. ద్రవిడవేద సంప్రదాయము నవలంబించని వారివిగూడ. వైష్ణవమత మవలంబించిన వారెవ్వరైనను సరే, లేదా అభిమానులైనను సరే, లేదా విమర్శకులైనను సరే. వీరి అభిప్రాయసేకరణ వలన, (లిఖితములైనవి) నూతనాంశములు తెలియుననియు, విశాల భావములు కలుగుననియు నా యభిప్రాయము)

భగవద్రామానుజుల (క్రీ శ. 1017-1137) వైష్ణవమత ప్రచారము వలన అసంఖ్యాకులైన భారతీయులు నాటి కాలానుగుణ్యముగ ఈ మతము నవలంబించిరి. ఉత్తర భారత పర్యటన వల్ల దేశమంతయు అతని ప్రభావమునకు లోనైనది. దివ్యప్రబంధముల చదువగలుగకున్నను (ఇవి తమిళములో నున్నవి గనుక) పరిచయము లేకున్నను రామానుజ మతము నవలంబించిన వారెందరో గలరు. రామానుజమత విషయములు తెలియకున్నను విష్ణు సంబంధమువల్ల వైష్ణవులైన వారును గలరు. ఈ క్రింది పేర్లు గలవారు ప్రసిద్ధ వైష్ణవభక్తి ప్రచారకులు - తమ భావముల ప్రకారము మతవాదముల స్థాపించిరి. వీరిలో కొందరు భాష్యములగూడ రచించిరి.

ఆధారగ్రంథములు :- సామాన్యముగా అందఱకును ఆధార గ్రంథము లొకటే. అవి: 1. ప్రస్థానత్రయము 2. స్మృతులు 3. పురాణములు 4. భారత భాగవతాదులు 5. ఇతర ప్రసిద్ధ గ్రంథములు

ఇందులో శ్రీవైష్ణవులకు 1) వైష్ణవాగమములు, 2) గీత, 3) దశోపనిషత్తులు, 4) వేదాంత సూత్రములు మరియు 5) ఆళ్వారుల దివ్యప్రబంధములు ముఖ్యములైనవి.

ప్రస్థానత్రయమనగా :

1. ఉపనిషత్తులు — శ్రుతి ప్రస్థానము

2. గీత — స్మృతి ప్రస్థానము.

3. వేదాంతసూత్రములు — న్యాయప్రస్థానము.

జీవుడు వీటి సాయమున ఇహలోకమునుండి ప్రస్థానమొనర్చునుగాన ఈ సంజ్ఞ.

వేదాంతసూత్రములు :- ఇందు 4 అధ్యాయములు, 16 పాదములు, 555 సూత్రములు గలవు.

వేద + అంత = వేదాంత = వేదముల తుది భాగము. అనగా ఉపనిషత్తులు. ఈ యుపనిషత్తులలో ఇతస్తతముగ చెప్పబడిన విషయములను సమన్వయించుటకై వేదాంతసూత్రములు యత్నించుచున్నవి.

వ్యాసునకు పూర్వమున్న ఋషులు వ్రాసిన గ్రంథములు వృత్తులనబడును. ఋషులపేర్లు :- 1. జైమిని 2. అశ్మరథ్య (విశిష్టాద్వైతి) 3. బాదరి (అద్వైతి) 4. బాదరాయణ. 5. ఔడులోమి (భేదాభేదవాది) కాశకృత్స్న— (అద్వైతవాది) 7. కార్ష్ణజని (అద్వైత) 8. ఆత్రేయ (పూర్వమీమాంసకుడు) 9. ఉపవర్ష. 10. ద్రమిడ. 11 బోధాయన మొదలగు వారి వృత్తులున్నట్లు తెలియుచున్నది.

బ్రహ్మసూత్రములకు రెండవపేరు వేదాంత సూత్రము లేదా ఉత్తర మీమాంస. వీటి రచయిత బాదరాయణుడు, బ్రహ్మసూత్రముల నాధారముగా చేసికొని వైష్ణవాచార్యులు తమ తమ మతవాదములను స్థాపించిరి.

వ్యాసులకు పిమ్మట భాష్యముల రచించినవారు -

"1 రామానుజులు (క్రీ శ. 1017 - 1137) విశిష్టాద్వైతము, 2. వల్లభాచార్యులు (క్రీ.శ. 16 వ శతాబ్ది) శుద్ధాద్వైతము, 3. నింబార్కుడు (క్రీ.శ. 720-1137 మధ్య) ద్వైతాద్వైతవాదము 4. భాస్కరాచార్యుడు (క్రీ.శ. 840-890) భేదాభేదవాదము, 5. విజ్ఞాన భిక్షువు (16 వ శతాబ్దము) సాంఖ్యమతము, 6. శ్రీకంఠాచార్యుడు (క్రీ శ. 720-1017 మధ్య) శివాద్వైతము

వీరు మతవాదముల పుష్టికి ఉపనిషత్తులతో బాటు విష్ణుభాగవతాది పురాణముల నుద్ధృతము గావించిరి.''

(హిందీ కల్యాణ్ పురాణ కథాంక్ 63 వ సంపుటి, పుట 53. 1989 వ సం॥ గోరఖ్‌పూర్.)

వివిధ భాష్యముల కర్తల పేర్లు : తమ మతవాదములను స్థాపించినవారు:

1. భారతీవిజయః 2 సంవిదానందః 3. బ్రహ్మఘోషః 4. శతానందః 5. ఉద్వర్తః 6 విజయః 7 రుద్రభట్టః 8 వామనః 9 యాదవప్రకాశః 10. రామానుజః 11. భర్తృప్రపంచః 12 ద్రవిడః 13. బ్రహ్మదత్తః 14. భాస్కరః 15. పిశాచః 16. వృత్తికారకః 17. విజయభట్టః 18. విష్ణుక్రాంతః 19 వాదీంద్రః 20. మాధవదాసకః 21. శంకరః.

ఎవడు వైష్ణవుడు? అనుదానికి క్రింది కవిత ప్రసిద్ధము. (హిందీ భాష, గుజరాతీ) ఇందులో విశాల దృక్పథము, సేవాభావము, మానవతావాదము, ఆధునిక భావములు గోచరించును.

కవి: నర్సీమెహతా, 15 వ శతాబ్దము, గుజరాత్ ప్రాంతము ''వైష్ణవ జనతో'' ను పరిశీలింపనగును.

''వైష్ణవ జనతో తేనె కహియె
జో పీడాపరాయే జాణేరే।
పరదుఃఖే ఉపకార కరే తోయే
మన్ అభిమాన్న ఆణేరే।

.................. ................

భణే నరసైయ్యో తేన దరసన్
కరతాం కుల్ ఏకో తేర్ తీర్థ్‌రే॥''

ఇందులో ప్రతి వైష్ణవుడు తప్పక పాటించవలసిన నియమములు సుమారు 16 గలవు. కాని, దివ్యప్రబంధ ప్రసక్తి లేదు. ఐనను, శ్రీ వైష్ణవ లక్షణములతో సమన్వయము చేసికొనవచ్చును.

**విశిష్టాద్వైతము : దాని విశిష్టత : వివిధనామములు :**

భగవద్రామానుజు లవతరించుటకు ముందు నుండియే భారతదేశములో వైష్ణవమతమున్నది. ఇందు విష్ణువే జగత్కారణుడైన ప్రధాన దైవము. కాని,

దీనికొక ప్రత్యేక స్థానము గల్గుటకు కారణము భగవద్రామానుజు లవతరించిన పిమ్మటనే. అతడే కారకుడు, విశిష్టాద్వైతమును ప్రచారము సేయుట, ఆళ్వారుల దివ్యప్రబంధముల ననుసంధించుటవలన, దర్శనస్థాపకాచార్య పీఠము నలంకరించుట వలన ఈ మతమునకు పర్యాయ పదము లేర్పడినవి,

**వ్యవహారములోనున్న పదములు :**

సామాన్యజనులకు గూడ తెలియునవి : వైష్ణవులు, శ్రీవైష్ణవులు, ఆచార్యులననుసరించి అయ్యవార్లు. మతము పేరు వైష్ణవమతము, రామానుజమతము. క్రోడీకరించినచో నిట్లు కనిపించునుడు : **మతమును కలిగియున్న పేర్లు :**

1. శ్రీవైష్ణవమతము, శ్రీవైష్ణవసిద్ధాంతము
2. వైష్ణవమతము, వైష్ణవసిద్ధాంతము
3. ప్రపత్తిమతము, శ్రీసంప్రదాయము
4. రామానుజమతము రామానుజసంప్రదాయము.

**దర్శనముగల పేర్లు ప్రచలితములో నున్నవి :**

1 శ్రీవైష్టవ లేదా వైష్ణవ దర్శనము
2. విశిష్టాద్వైతదర్శనము; సిద్ధాంతము
3. రామానుజ దర్శనము, సిద్ధాంతము
4. ప్రపత్తి దర్శనము, సిద్ధాంతము, శాస్త్రము
5, యతీంద్రసిద్ధాంతము, మతము.

**దర్శన స్థాపక పదవి :-** ఆచార్య పీఠము, నిర్వాహణ బాధ్యత - అ.సూ.ము.లో ఈ పదములు తఱచుగా కన్పించును. పూర్వాచార్యులు తమ తదనంతరము ఒకరిని తమ బాధ్యతను స్వీకరించునట్లుగా జేయుటకు, దర్శన ప్రవర్తకులుగా జేయుటకు ఆరాటము జెందువారు.

1. ఇది నాథ మునుల నుండిప్రారంభమైనది.*
2. రామమిశ్రులు యా మునులను జూచి అన్న మాటలు. పుట 100.

---

* శఠకోపుల ఆజ్ఞ: "ద్రవిడ వేదములివి చెప్పి ధరణియందు, వృద్ధిబొందింపుమని బ్రహ్మ విత్తమునకు వకుళ భూషణముని పల్కె" అ. సూ, ము, పుట 83.

దర్శన స్థాపక దక్షుని గావించి
కలకాల మీ రంగ నిలయమునను
జరుపుమని చెప్పి శ్రీరామగురువరుండు."

3. యామునులు శ్రీ కరిగిరివరదు నుద్దేశించి ప్రపత్తి జేసిన సందర్భము. పుట 117.

"ఇకమీద నీ లక్ష్మణాచార్యుండు దర్శన ప్రవర్తకుండగునట్లు
అనుగ్రహింపుమని ప్రపత్తిజేసి, మగిడి వరమునికిం,
పెరూదేవికిని మంగళా శాసనం బొనర్చి."

భగవంతునకు మంగళాశాసనంబొనర్చుట వైష్ణవమతములోని ప్రత్యేకత విశిష్టత.

4. యతిరాజులవల్ల సిద్ధాంత వ్యాప్తి జరిగినది రామానుజులను శిష్యులు ప్రార్థించుట. పుట 196.

"స్థిర విశిష్టాద్వైత సిద్ధాంత మీ బ్రహ్మ
సూత్ర భాష్యోక్తుల సులభమయ్యె
సకల దిగ్విజయంబు సల్పియీ సిద్ధాంత
మంతట వైష్ణవ సంతతులకు
తెలియ వివరించి, కుమతులు తేటజెఱపి."
ఇచటి నుండి వీరి దిగ్విజయ యాత్ర ప్రారంభమగును.

5. రామానుజుల పిమ్మట శ్రీ పరాశరభట్టరు నిర్వహణము (పుట.354)

"శ్రీ పరాశరగురు శేఖరుండంత శ్రీ
రంగధామమున మెఱంగుమీఱ
దర్శన స్థాపన దక్షుడై సాత్త్విక
సంఘముతో గోష్ఠి సలుపుచుండ."

6. భట్టరు పిమ్మట దర్శనస్థాపక పదవి. 'నంజియ్యర'గుట. (పుట 383.

"పెరియ భట్టార్యుని పిమ్మట దర్శన
స్థాపనమునకు త్రిదండపాణి
యెంబెరు మానారె యితడాయెగా బోలు
ననదగు నంజియ్యరార్యు నాజ్ఞ."

7. నంజియ్యరు పిమ్మట నంబిళ్ళ పిమ్మట పెరియవాచ్చాంబిళ్ళ సిద్ధాంత నిర్వాహ దక్షుడయ్యెను. (పుట 415)

8. పెరియ వాచ్చాంబిళ్ళ పిమ్మట ఇతని కుమారుడు నైనారాచ్చాంబిళ్ళ దీపోత్పన్న ప్రదీపంబుమాడ్కి దర్శన ప్రవర్తకుండయ్యెను (పుట 420)

9. వడక్కు తిరువీధిపిళ్ళగారి పిమ్మట అతని కుమారుడు పిళ్ళ లోకాచార్యులు తన తమ్మునితో దర్శనార్థముల నిర్వహించుచుండెను. "అట్లు దర్శన స్థాపనాచార్యుండగు లోకాచార్యగురుండు" (పుట 421.)

10. విశిష్టాద్వైతమునకు "ప్రపత్తిశాస్త్రము" అని పేరు. (పుటలు 435.)

11. శ్రీశైలేశుల చింత:- ద్రావిడామ్నాయములకెల్ల ధరణి నెవ్వడగు ప్రవర్తకుడికమీదననియు మదినిచింత" గలిగెను.

అపుడు వరవరమునులు : ద్రవిడోపనిషదర్థ తత్త్వబోధనే కాలము గడి పెదననెను. (పుటలు 439, 440)

12. తిరువాయిమొళిపిళ్ళై పిమ్మట మణవాళ మహామునులు పీఠస్థులు.
''తిరునగరి యందళహియమణవాళముని దర్శనంలు
నిర్వహించుచున్న సమయంబున'' (పుట 441)

13. శ్రీ భాష్య సింహాసనాధి పత్యము: శ్రీ వేదాంత దేశికులు (583వ పుట)

''జీర్ణమైన శ్రుత ప్రకాశికను మగిడి
యంచితంబుగ నిట్లుద్ధరించు కత్య
నవని శ్రీ భాష్య సింహాసనాధి పత్స
మమరె వేదాంతగురున కవ్యాహతముగ''

14. గోష్ఠీపూర్ణులు రామానుజులను ఎంబెరుమనార్ (మన్నాథ!) అని సంబోధించి, మెచ్చుకొను సందర్భమున వాడబడిన పదములు :

సేకరణ : ప్రపన్నామృతము నుండి. ప్రాచీన ప్రతి, 11 వ అధ్యాయము 61-64 పుటలు.

"అయం వైష్ణవ సిద్ధాంతో హ్యాస్మాభిస్త్వద్య వైష్ణవాః
రామాను జార్య సిద్ధాంతం - ఇతి సర్వత్ర కీర్తితః
ఏతదారభ్యలోకేస్మిన్ శ్రీ వైష్ణవ దర్శనమ్
రామానుజార్య సిద్ధాంతం ఇతి సత్యం భవిష్యతి
తతః ప్రభృతి లోకేస్మిన్ ఇదం వైష్ణవ దర్శనమ్
రామానుజార్య సిద్ధాంతం - ఇతి సర్వత్ర ప్రకాశితః॥"

15 దర్శన ప్రత్యేకత : విశిష్టత :

"గుణగుణి నోర్భేదః ఖలునిత్యః
చిదచిద్ద్వయ పరభేదస్సత్యః
తద్ద్వయ దేహో హరిరితి నిత్యమ్
పశ్యవిశిష్టాద్వైతం సత్యమ్"

చేతనా చేతనములకు పరస్పరమున్ను, పరమాత్మతోగల భేదమున్ను సత్యము. ఇవి చేతనా చేతనములు పరతంత్రములు. భగవంతునకు యథేష్ట విని యోగార్హములు.

రామానుజ దర్శనమున కన్పట్టు ముఖ్యాంశముల సారాంశము :

1. 1) ప్రపంచము సత్యమైనది 2) శ్రియఃపతి దానికి సర్వ శేషి 3) అతడే బ్రహ్మ యనబడును 4) చేతనా చేతనము లన్నియు నాతనికి శరీర భూతములు 5) చేతను లీశ్వరునికంటె భిన్నులు 6) సంసారమా శ్రియఃపతి నిగ్రహముచే సంప్రాప్తించినదిగాన సత్యమైనది 7. కర్మజ్ఞానాంగమగు కర్మ చేతనే ముక్తి 8) ఆ ముక్తి యనబడు మహానంద ప్రాప్తి పరమపదమునందే కలుగును 9) ఆ మోక్షమనగా ఆ శ్రియఃపతి యనుభవమే అని చెప్పుదురు.
(శ్రీవైష్ణవ పత్రిక, స్వర్ణోత్సవ సంచిక నుండి 10-5-1976)
రచయిత శ్రీశ్రీశ్రీ త్రిదండి రామానుజ జీయర్ స్వామివారు. పుట 3.)

2. 1) స్థూల సూక్ష్మ చేతనాచేతన బ్రహ్మముల ఏకత్వము 2) ద్వైతా ద్వైత శ్రుతుల అవిరోధము 3) బ్రహ్మము యొక్క సగుణత్వ విభుత్వములు 4) బ్రహ్మము యొక్క నిర్గుణత్వ నిర్విశేష ఖండనము 5) జీవుని అణుత్వ బ్రహ్మ స్వభావ దాసత్వము 6) జీవుని బంధకారణమగు అవిద్య 7) మోక్షో పాయమగు విద్య 8) భక్తి యొక్క మోక్షకారణత్వ శ్రేష్ఠతలు 9) బ్రహ్మైక్య నిరసన 10) మాయావాద ఖండనము 11) అనిర్వచనీయ వాదఖండనము 12) జగత్తుయొక్క సత్యత్వస్థాపన 13) జీవ జగత్తుల శరీరత్వము.

అనంత సంఖ్యాకులగు జీవులును, ఈ జగత్తును కలిసి ఈశ్వరుని శరీరము. ఈ జీవజగద్వ్యక్తమగు శరీరమునకు ఈశ్వరుడే యాత్మ.

ఈ జీవ జగద్విశిష్టమగు ఏకత్వ ప్రతిపాదన వలన ఈ వాదము విశిష్టాద్వైతమనబడుచున్నది.

ఆచార్య రామానుజుడు చిత్ (జీవులు) అచిత్ (జడము) ఈశ్వరుడు (పురుషోత్తముడు) అను మూడు పదార్థముల నొప్పుకొనుచున్నాడు.

(సేకరణ : భారతీయ తత్త్వశాస్త్రము. సాధన గ్రంథమండలి. తెనాలి. పుటలు. 92, 93. "ఆలోచ్యవిషయముల" నుండి.)

యామునాచార్యుల అపూర్ణమగు ఆశాత్రయము :

1. బ్రహ్మసూత్ర భాష్యరచన
2. ద్రావిడ వేద ప్రచారము
3. పరాశర శఠకోప నామకరణములు

(భగవద్రామానుజులు వీటిని పూర్తి గావించిరి )

ఈ విశిష్ట ప్రస్థానమెవరెవరిచే అవతరింప జేయబడినది?

అనాది నిధనమగు ఈ విశిష్ట ప్రస్థానము :

1) బాదరాయణ 2) బోధాయన 3) టంక 4) గుహదేవ 5) భారుచి 6) ద్రమిడాచార్య 7) బ్రహ్మనంది 8) భర్తృమిత్ర 9) భర్తృప్రపంచ మొదలగు ఆచార్యవర్యులచే విశిష్ట సంప్రదాయ క్రమమున అవతరింప జేయబడినది.

## 7. వివిధములైన కర్మకాండకు సంబంధించిన విషయములు, ఇతర విషయములు

అ.సూ.ము.లో వ్రతములు, జయంతులు, చరమ సంస్కార, అర్చిరాది మార్గములు, గానకళల ప్రసక్తి, కాలక్షేపములు, జన్మనక్షత్ర నిర్ణయములు, అవతార నిరూపణములు, యోగశాస్త్ర ప్రసక్తులు సందర్భోచితముగా వర్ణింపబడినవి.

1. ఏకాదశీవ్రత నిర్ణయము
2. జయంతి నిర్ణయము (శ్రీ జయంతి)
3. ఆచార్య జన్మనక్షత్ర నిర్ణయము
4. ధనుర్మాస పూజావిధానము

5 ''మణవాళ మహామునులు రామానుజావతారంబు'' పుట. 617
అని నిరూపించుట

6. ప్రబంధ పఠన నియమములు పుట. 501

7. చక్రధారణ విషయము - శ్రుతి ప్రమాణములు పుట. 502

8. గానకళ ప్రస్తావనము :

తొండర డిప్పొడి యాళ్వారుల వైభవము పుట. 37

రంగామృత కవీంద్రుడు - కూరేశులు పుట. 142

సింహగిరి కృష్ణమూర్త్యులు పుట. 222

నాథమునుల వైభవము పుట. 83, 84

9. యోగశాస్త్ర ప్రసక్తి, నాథమునులు పుట. 87

ఇట్లు పెక్కు విషయముల నుదాహరణ పూర్వకముగా ప్రామాణికాంశము లతో ఈ కవి తన గ్రంథమున పేర్కొన్నాడు. కొన్నియెడల వచనము లతిదీర్ఘములుగ నున్నవి. శ్లోకములను, శ్లోకభాగములను, న్యాయములను సందర్భోచితముగా ప్రవేశపెట్టినాడు.

ప్రస్తుత మొక యుదాహరణమును సంగ్రహముగ వివరింతును.

ఏకాదశీనియమ నిర్ణయము 607-612 164 పంక్తుల సుదీర్ఘవచనము గలదు.

సందర్భము: ప్రతివాది భయంకరం అణ్ణంగారు వేంకటగిరి డిగ్గి గోవింద రాజుల సన్నిధి వసించిన సమయము. ఒకనాడు వారు వేదాంతకాలక్షేపము సేయుచుండ కొందరాశ్రితులు కొన్ని వివరణముల గోరిరి.

1 ఏకాదశీనియమ నిర్ణయము.

2 శ్రీ జయంతీ నిర్ణయక్రమము.

3. ఆచార్య జన్మనక్షత్ర నిర్ణయము

4. ధనుర్మాస పూజా విధానము.

5. మణవాళమామునులు రామానుజావతారమని నిరూపించుట.

ఏకాదశీ నిర్ణయమునకు 37 గ్రంథముల నుండి ప్రామాణికాంశములగు శ్లోకములు పేర్కొనబడినవి. అవి యేవనగా:

1. శతపథబ్రాహ్మణము, 2. న్యాయము, 3. వచనప్రామాణ్యము, 4. సనత్కుమార, 5. ఆగ్నేయ, 6 కాణ్వ, 7. సనత్కుమార, 8. వైష్ణవ రహస్యము, 9. భవిష్యత్ పురాణము 10 స్మృత్యంతర వచనము, 11. నారదోక్తము(1), 12. వ్యాసప్రోక్తము, 13. నారదోక్తము(2), 14 భాగవత - బ్రాహ్మ, కైవర్తాది పురాణములు, 15. పాద్మోక్తి, 16 ముద్గల, 17. పరాశర, 18. భారద్వాజ, 19. శుక్ర, 20 బోధాయన, 21. బృహత్ప్రచేత, 22. కపిల, 23. రుక్మాంగదచరిత్ర, 24. కపిలసంహిత, 25. భవిష్యత్, 26. ముద్గల స్మృతి, 27. పరాశర, 28. స్మృతిసంగ్రహ, 29. భారద్వాజ, 30. బృహత్ప్రచేతస, 31. పాద్మ, 32. భారద్వాజ, 33. స్మృతిసంగ్రహ, 34. స్మృత్యంతర, 35. స్మృత్యుత్తర వచనద్వయ, 36. స్మృత్యుత్తర, 37. ఇతరములు ఇత్యాదులు.

గమనిక :- ఇందు న్యాయములు, ఉక్తములు, వచనములవంటి వానికి గ్రంథముల పేర్లుండవు. కవి తెలుపలేదు.

ఏకాదశినా డుపవసించుటను గూర్చి :-

శతపథ బ్రాహ్మణము ప్రకారము, శుక్లయజుస్సునందు యాజ్ఞవల్క్యుడు తెలిపిన క్రమము :-

"పక్షే పక్షే ఏకాదశ్యాం నయాజయేత్ నతర్పయేత్ నశ్రాద్ధ కర్మ కుర్వీత॥ యది మోహేన కుర్యాత్ - సోగ్నిహాస పితృహాస - మాతృహాచేతి"

ఏకాదశియందు యాజన తర్పణ శ్రాద్ధకర్మంబులొనరింపగూడదు. చేసిన వాడు అగ్ని - పితృ - మాతృ హత్యాపాతకుడగును.

ఏకాదశి రెండు విధములు :

1) నిత్యము. 2) కామ్యము.

నిత్యంబున ద్విభుక్తి వర్జంబు.

కామ్యంబు చతుర్భుక్తి వర్జితంబు.

నిత్యవ్రతంబు యావదాయుష్యంబు. ఒకప్పుడైన నతిక్రమింపగూడదు.

నిత్యంబైన యీ వ్రతంబు సకల వర్ణంబులవారు సేయందగుదురు. కావున ఉభయ పక్షంబుల యందుపవాసము కర్తవ్యము.

"వైష్ణవరహస్య" ప్రకారము : కామ్యవ్రతము—

విష్ణుసాయుజ్యము, పుత్రాది సకల సంపదల నిచ్చుయిందువా దుభయ పక్షంబులయందు భుజియింప నర్హుడుగాడు.

గమనిక :- మిగతా విషయములకు ఆ.సూ.ము. లోనివి సూచించిన పుటలను జూడనగును.

**8. పరము-వ్యూహములు- విభవము - అంతర్యామి - అర్చావతారములు : పుట. 538**

**ఆ.సూ.ము. ప్రకారము విపులీకరణము : దివ్యదేశములు-ప్రపన్నోత్సవముల ప్రస్తావనము :**

1. పరము : శ్రీమన్నారాయణుడు, శ్రీ భూనీళాది దేవీ సహాయుడు.

2. వ్యూహములు :- ఇవి నాలుగు.

1. వాసుదేవ, 2 ప్రద్యుమ్న, 3. అనిరుద్ధ, 4. సంకర్షణ.

1. వాసుదేవ :- చక్రవాక పర్వతంబున కవ్వల, అంధతమః పరంబై, యమృత ప్రవాహ పరివేష్టితంబై, యనేక దివ్యరత్నమయ గోపుర ప్రాకార, సౌధప్రాసాదమాలికాలంకృతంబై, పరమాశ్చర్యకరంబగు దివ్యలోకంబునందు నిత్యనివాసం బొనరించి, తొల్లి కృష్ణార్జునులకు విప్రకుమారుల నొసంగిన భగవంతుడు వ్యూహ వాసుదేవుండని ప్రాజ్ఞులు వక్కాణింతురు.

2. ప్రద్యుమ్న :- సత్యలోకంబునందు నారాయణాశ్రమంబున నివసించు హరి ప్రద్యుమ్నుండతండు ద్వారకా సృష్టి కారణుండై యుండు.

3. అనిరుద్ధ:- క్షీరసాగరంబు నందు సర్వావతారకందభూతుండైన యనిరుద్ధుండు వసియించు.

4. సంకర్షణ :- పాతాళంబునందు సంహారకర్తయగు సంకర్షణుండు నాగకన్యా సహస్ర పరిచరిత చరణారవిందుండై సిద్ధఋషి సేవితుండై యుండు.

4. అంతర్యామి :- యమనియమాద్యష్టాంగాది యోగసాక్షాత్కరణీయుండై, హృత్పుండరీకవర్తియగు దహరాకాశమధ్యంబునందు అపహతపాప్మత్వాది గుణాష్టక విశిష్టుండైన దేవాధిదేవుం డతర్యామి యనంబడు.

5. అర్చారూపి : సకల మనుజ నయన గోచరుండయి, దాసచేతనుల కభిమతంబగు ద్రవ్యంబునందు జగన్మోహన దివ్యమంగళ విగ్రహ విశిష్టుండయి, సాన్నిధ్యంబొనరించి, భగద్భాగవతాచార్యమందిరంబులందు వసించు నారాయణుండర్చారూపి యనంబడు.

**దివ్యదేశములు : 108.** (పుట. 539)

అర్చాస్థలంబులందు శ్రీ పరాంకుశ పరకాలాది దివ్యసూరి గాథా కథిత మహావైభవంబుగల దివ్యదేశంబు లష్టోత్తర శత సంఖ్యంబులై తేజరిల్లును. అందు ప్రసిద్ధంబులు :

శ్లో॥ శ్రీరంగ మంగళమణిం కరుణానివాసమ్,
శ్రీవేంకటాద్రి శిఖరాలయ కాలమేఘమ్,
శ్రీహస్తిశైల శిఖరోజ్జ్వల పారిజాతమ్,
శ్రీశం నమామి శిరసా యదుశైల దీపమ్॥

1. పుష్పత్యాగ భోగజ్ఞాన మంటప సంజ్ఞలుగల కోవెల 2. తిరుమల పెరుమాళ కోవెల 3. కాంచీపురము 4. యాదవాచలము - ఇవి ముఖ్యములు.

ఈ దివ్య దేశంబులయందు ప్రధానంబై "కావేరీ విరజా తోయమ్" ఇత్యాది న్యాయంబున ప్రత్యక్ష పరమపదంబగు 'శ్రీరంగంబు'నకు నిత్యనిర్వాహకుండగు "శ్రీరంగరాజ స్వామి" ప్రథమగురుండు.

శ్రీ భూనీళా చతురాననులు, తచ్ఛిష్యులు, శ్రీరంగరాజ స్వామి, తదీయ దివ్య నామంబులు : (పుట. 539.)

1 శ్రీరంగరాజ స్వామి, 2. పెరియ పెరుమాళ్, 3. నంబెరుమాళ్, 4. అళగియ మణవాళ పెరుమాళ్, 5. మున్నిలుం పిన్నిలు మళగియ పెరుమాళ్, 6. అభరణ త్తైక్కళట్టిక్కడుక్కుం పెరుమాళ్, 7. పదిమరు తిరునామం పాడుం పెరుమాళ్, 8. వందవళివారాద పెరుమాళ్, 9. మంధారం కండాళ్, 10. మత్తైయు పెరుమాళ్, 11. దైవశిఖామణి పెరుమాళ్.

**శ్రీరంగమహిషి - దివ్యనామములు :**

1. పెండుగల్ నాచ్చియార్, 2. శ్రీరంగ నాచ్చియాళ్, 3. పెరియ పిరాట్టియార్.

ఈమె శిష్యులు : అనంత గరుడ విష్వక్సేనాది నిత్యసూరులు.

తిరువారాధనము : పెరియ పెరుమాళ్.

తిరువనంతాళ్వాను = ఉరగేంద్రులు.

పెరియ తిరువడి నయనారు = పక్షీంద్రులు.

విష్వక్సేనులు : 1. సేనముదలియార్, 2. సేనాపతి, 3. సేనేశుడు, 4. సూత్రవతీనాథుడు, 5. వేత్రపాణి.

ఇతని శిష్యులు : పదుగురు ఆళ్వారులు.

**ఆళ్వారులు సేవించెడు దివ్యక్షేత్రములు :**

ఈ యాళ్వారాదులు : వీరికిగల విశేషణములు : (పుటలు **491-492**)

1) శ్రియఃపతి భక్తిపరాయణులు, 2) సంగవర్జితులు, 3) అనన్యప్రపన్నులు, 4) శంఖచక్రాంకితభుజులు, 5. మంత్రవిత్తములు, 6) పద్మాక్ష తులసీ వనమాలాలంకృతులు, 7) ధవళచ్ఛిద్రోర్ధ్వపుండ్రధారులు, 8) నిత్యయుక్తులు, 9) నిత్యముక్తులు, 10) జీవేశపరిశీలనతత్పరులు.

వీరు దర్శించెడు దివ్యస్థలములు : **24** గలవు.

సందర్భము : అగస్త్యుడు మలయాచలంబున కరుగుదెంచి శ్రియఃపతి నుద్దేశించి చిరకాలము తపంబొనరించెను. సర్వేశ్వరుండు ప్రసన్నుండై ఆళ్వారాచార్యుల జన్మస్థలకాలాదికముల, వారు సేవించిన దివ్యదేశములగూర్చి తెలిపెను.

1. శ్రీ రంగనాథుడు - ఉభయ కావేరీ మధ్యరంగమున ప్రణవ విమానమందుండును.

2. శ్రీ వేంకటేశుడు : వేంకటాచలమునం దానందనిలయ విమానమందుండును.

3. కరిగిరి వరదుడు - వేగవతికి ఉత్తరతీరమున (కాంచీపురము) పుణ్యకోటి విమానమందుండును.

6. శ్రీ నారసింహుడు (హిరణ్యాసురమర్దనుడు, ప్రహ్లాదవరదుడు) - అహోబిలంబున గరుడాచలంబున నుండును.

7. నరకేసరి - ఘటికాచలంబున

8. వీరరాఘవుడు - హృత్తాపనాశినీ తీరమున (తిరువళ్లూరు)

9. ఆదికేశవుడు - భూతపురియందు (శ్రీ పెరుంబూదూరు)

10. పార్థసారధి - కైరవిణీతీరము (తిరువల్లిక్కేణి)

11 జగన్నాథుడు - మహీసారపురమువ

12. దేవనాయకుడు - తిరువహీంద్రపురము (తంజావూరు వద్ద-సమీపము)

13. గోవిందరాజులు - తిల్లచిత్ర కూటమున (చిదంబరములో)

14. త్రివిక్రముడు తిరుక్కోవలూరియందు (విల్లుపురం సమీపము)

15 శ్వేతవరాహమూర్తి - శ్రీముష్ణమున

16. శార్ఙ్గపాణి - కుంభకోణమున

17. చక్రపాణి - తంజాపురంబున

18. రాజగోపాలుడు - మన్నారు కోవెల (మన్నారుగుడి స్టేషన్)

19 సుందరబాహువు - వానాద్రియందు

20 నృసింహుడు (చక్రనాభ్యంతరవర్తియై - మంగళాద్రి (కృష్ణా దక్షిణ కూలంబున వైష్ణవాశ్రమంబునందు, తోతాచలమను పేరుగలది. గుడోదక పానముజేయు)

21. భావనారాయణుడు - తుంగభద్రాతటమున (గోష్ఠీవనమున గోవింద భట్టారకునకు ప్రసన్నుఁడై సాక్షిగా నేతెంచిన)

22. ఉత్తర రంగశౌరి (శేషతల్పశయనుడు) - పినాకినీ తీరము

23 శ్రీరఘురాముడు (సీతాలక్ష్మణమధ్యస్థుడు) - భద్రాద్రియందు

24. శ్రీకృష్ణుడు (రుక్మిణీ సమేతుడు) కాళిందీ తీరమున

25. "ద్రవిడ దేశము నందుగల దివ్యక్షేత్రము లన్నియు" -

"సేవించుచు, నాయాదివ్యదేశముల యందు నెలకొన్న నన్ను రమణీయ వృత్తగద్యాత్మకయు చతుర్వేద స్వరూపిణియగు నీ ద్రవిడ వేదసంహిత దేవ గానంబుచే బాడుచు నానందింపజేయుదురు."

**ప్రపన్నోత్సవము :**

"ఆ ప్రకారముగా తచ్ఛిష్య ప్రశిష్యులైన శ్రీవైష్ణవుల క్రాంతమును, ఉభయకాలములందు దివ్యప్రబంధముల మత్సన్నిధి ననుసంధింతురు. మరియు ప్రతి సంవత్సరము నాలాయిర ప్రబంధము ననుసంధింతురు. అదియే ప్రపన్నోత్సవ మనబడును."

**దివ్యదేశములను పేరుగల్గుట :**

"ఏయే భగవదాలయమునందు ప్రబంధానుసంధానము ప్రపన్నోత్సవ పూర్వకముగా చేయబడు, నాయాస్థంబులన్నియును "దివ్యదేశంబులనంబడు."[1]

ఆ స్థలములయందు శ్రీవైష్ణవులు తీర్థ ప్రసాదముల స్వీకరింతురు.

**మంత్రత్రయము ప్రకారము మండలముల సంజ్ఞల విభాగము :**

యామునులు గోష్ఠిపూర్ణులకు, మహాపూర్ణులకు హితోపదేశము చేయు సందర్భము : (పుట - 119)

1. తిరుమంత్రార్థంబు - భోగమండపము
2. చరమశ్లోకార్థంబు - పుష్పమండపంబు
3. మంత్రరత్నార్థంబు - త్యాగమండపంబు

**ప్రమాతలు :**

ఈ మండపంబులు అనన్య ప్రపన్నులగు శ్రీవైష్ణవుల పాదపద్మంబుల నెల్లప్పుడుం ప్రాప్యప్రాపకంబులని విశేషార్థముల తెలియజేయుటకు ప్రమాతలు.

## 9. ప్రత్యేకతను, విలక్షణతను దెలుపు విశేషాంశములు :

1. **అండాళు నివసించు దివ్యదేశముల ప్రసక్తి.** (పుట 541)
   "తిరుప్పావై కాలక్షేపముల ద్వారా సామాన్య (శౌరినెడబాయదు) జనుల హృదయములలో స్థానము సంపాదించుకున్న అండాళ్ తల్లి ఈమె."
2. **నమ్మాళ్వారుల గూర్చి అధికమైన వివరములు** (పుటలు 594-598)
   తామ్రపర్ణినది ప్రత్యేకత - గలవు

---

1. పాంచరాత్రప్రకారము క్రియలు చేసిన దివ్య దేశమగును.
"పాంచరాత్రగమ ప్రథితక్రమంబున - ప్రోక్షణమొనరించి
భక్షణంబ, దివ్యదేశముజేసి" శ్రీ కూర్మనాథ ప్రకాశకుండయ్యెను.
రామానుజుల కార్యక్రమము, (అ.సూ.ము. 220)

3. త్యాగముల వృత్తాంతములు :

1) కూరేశులు ; గురుభక్తి సంప్రదాయ -
రక్షణ భావము. కండ్లను పెరకివై చికొనుట - 314 పుట.

2) రంగనాథ మాణిక్యత్తాళు : శ్రీరంగనాథుని రక్షించుకొనుటకు ప్రాణ మిచ్చినది. దేశము, దైవము, భక్తి భావనలు - పుట 427.

3) తిల్లయను వేశ్య : రామానుజుల సంబంధవతి గోవింద రాజుల ప్రతిష్ఠలో సాయము - పుట 201.

4. మత సమన్వయము :
ఢిల్లీ సులతాను కుమార్తె - బీబీనాంచారు
సంపత్కుమారుల వివాహము. హిందువుల దైవము

"హిందూల బొమ్మ నీకెందు"కనుటచే సుల
తాను మహమ్మదీయుడని (మ్లేచ్ఛ - తురుష్క శబ్దములు గలవు)
చెప్పగలము రామానుజులు సమన్వయకర్త - పుట 307.

5. అస్పృశ్యత కూడదను భావము :

మారనేరనంబియను పంచమునకు చరమ సంస్కారము జేయుట - పుట 134, పుట 3?6.

నిత్యులకు దేవాలయ ప్రవేశము నిప్పించుట. వీరిని నిషాదులుగ, చండా రులుగా గూడ గ్రంథములు పేర్కొన్నవి. 900 సం॥లకు పూర్వమే రామానుజులీ సంస్కరణను ప్రవేశపెట్టిరి.

సమర్థనము :- ఈ క్రింది వాక్యముల గమనింపుడు :

"More Than eight centuries ago when Sri Ramanuja granted this to the "UNTOUCHABLES" (అస్పృశ్యులు) it was indeed a bold step pioneering act go magnaminity. At present with the abolition of 'UNTOUCHABILITY' under Article 17, of the constitution of India, all Hindus irreespective of caste have eqal rights to enter any public place of worship belonging to their religion. And according to the UNTOUCHABILITY (offences) Act, 1955 (Act No 22 of 1955) any person preventing another to exercise the above right is liable to punishment. (from Life of Sri Ramanuja. Page 220 by Swami (Ramakrishnanada.)

ఇందు రామానుజుల ముందుచూపు, విశాలహృదయము కన్పట్టును.

6. వైష్ణవదీక్ష నొసంగుట : ఏకాంగులు = 12,000 మందికి. వీరు రామానుజుల పరివారములో పేర్కొనబడినట్టివారు. ప్రత్యేకత యేమన : విఠల దేవుడు హోయసలరాజు. మిథిలానగర ప్రాంతము. మైసూరు-కర్ణాటకరాజ్యము. ఇతనిని బిట్టిదేవుడని గూడ యందురు. ఇతడు బౌద్ధుడని సంప్రదాయ గ్రంథ ములు పేర్కొన్నవి. ఇతని గురువులను 12,000 మందిని గూడ 'క్షపణులు' అన్నారు. ఆ.సూ.ము లోగూడ క్షపణశబ్దమున్నది కాని, చరిత్ర ప్రకారము వీరు జైనులు.[1] (పుటలు 176, 181, 219, 263, 361 లలో.)

రామానుజులు విఠలదేవునికి వైష్ణవదీక్ష నొసంగి విష్ణువర్ధనుడని తిరు నామ ముంచిరి. ఇది చూచి రాజగురువులు జైనులు (బౌద్ధులు) రామానుజుల ప్రతిఘటించి వాదమొనర్చి ఓడిపోయిరి పిమ్మట యతిపతుల నాశ్రయించి వైష్ణవులయిరి[2] గాన ఈ 12,000 సంఖ్య ఏకాంగులకు వర్తించినట్లు వ్రాయ బడినది. క్రీ.శ. 1098 తర్వాతనే యగును. (శకము 1020.)

**ఇంకొక విశేషము[3] :** "ఈ జైన బ్రాహ్మణులు రామానుజులతో అన్న విష యము - 'మీ అనంతరం మాకు రక్షణ యివ్వండి. మీ తర్వాతివారు మమ్ము ఆదరించెదరో లేదో.' ఇట్లన్నవారు 'హెబ్బారు,' 'మండియం' అను గ్రామముల వారు. అపుడు రామానుజులవారు వీరికి దేవాలయములలోని బాధ్యతల నప్ప గించినారు.

1) 'మండియం' వారిని[4] : దేవాలయ పాకశాలలో వంటచేయువారినిగా నియమించెను.

2) 'హెబ్బారు' వారిని : దేవాలయ నిర్వహకులుగా నియమించెను.

---

1. (Life of Ramanuja, పుట 215లో గలదు.)
2. Thus Ramanuja converted Vittaladeva and thousand of Jains to Vaishnavism, he set his foot on the holy ground of yadavadri in 1020 Sakaera (Life of Ramanuja. Pages 217.)
3. (సేకరణ. ఆంధ్రప్రభ వారపత్రిక 18-4-1990. పదసంపద శీర్షికలోని ముఖ్యాంశములు ) (నిర్వహణ శ్రీ తిరుమల రామచంద్ర)
4. విఠలరాయుడు శిష్యుడైన పిమ్మట అతడిచ్చిన ధనముచే అంజనాచల మున కామడ దూరములోనున్న సువర్ణముఖరికడ "ముప్పది వృత్తుల నొప్పారు 'మండియం' బను అగ్రహారమును జేసెను. ఆ.సూ.ము.

**7. మానవ కాంతలుగానుండి భగవంతుని పెండ్లియాడుట :**

పెండ్లికుమార్తె మానవ రూపములో నుండి అర్చామూర్తి రూపములో నున్న భగవంతుని పెండ్లియాడుట చరిత్రలో అరుదుగా కన్పట్టు విషయము. ఇందులో ఇరువురు శ్రీరంగనాథుని పెండ్లాడిరి ఒకర్తు చెళ్వపిళ్ళరాయని చేపట్టి నది. పెండ్లి వైభవములు తెలుగువారి ఆచార సంప్రదాయముల కద్దముపట్టినట్లు న్నవి ఈ సందర్భమున దేవాలయములలో జరుగు భగవత్కల్యాణోత్సవముల నెమరువేసికొనవచ్చును

1. గోదాదేవి శ్రీరంగనాథుని పెండ్లాడుట. పుటలు 27-28

2 ధర్మవరుడను చోళరాజు కుమార్తె శ్రీరంగనాథుని పెండ్లాడుట. విపులముగా నున్నది. రాజకుమార్తె పేరు కవి తెలుపలేదు. తెలుగు సాహిత్యములో ఇట్టి పేర్లు అటనట కన్పించును. ఉదా॥ ''నిగమశర్మ అక్క.'' 48-49 పుటలు.

3. ఢిల్లీ సులతాను కుమార్తెయగు మోహనాంగి (బీబీనాంచా) సంపత్కుమారుని (చెళ్వపిళ్ళరాయని) పెండ్లాడుట వర్ణన మనోహరము. 303 పుట.

**మహిమలు - విశ్వరూప ప్రదర్శనలు :**

ఒక ప్రయోజనము నాకాంక్షించి, జగద్ధితమునకై ఆళ్వారులు, ఆచార్యులు గావించినవి. స్వార్థరహితములైనవి. జనాకర్షణ నిమిత్తముగానివి.

1. రామానుజాచార్యులు : 263, 264, 266, 267, 303 పుటలు

2. మణవాళ మహామునులు : 455, 524, 567, పుటలు

3. వేదాంత దేశికులు - కనకధారావృష్టి పుట. 567

8/1. భగవంతుని మారువేషములు : భక్తుల నాదుకొనుట :

1. శ్రీ వేంకటేశుడు వేటకాడుగా తిరుమలనంబికి కనబడుట - పుట 113

2. వరద దంపతులు కిరాతుల వేషములో రామానుజులను కాపాడిరి- పుట 108.

3. మణవాళ మహామునులకు శ్రీరంగనాథుడు బ్రహ్మచారి రూపములో వచ్చి తనియన్ చదువుట - పుట 509

4. శ్రీ వేంకటేశుడు బాలకవేషములో వచ్చి తోతారమ్మకు గంటవంటి దొండపండొసగెను. పుట 564.

**9.** ప్రపన్నోత్సవము - ప్రబంధపఠన నియమములు : శ్రీ మణవాళ మహామునులు వివరించిన క్రమము. పుట 501

**10. తటాకములు : సరస్సులు తిరునందనవనములు స్వయముగా నిర్మించుట :** ఇందు దైవభక్తి - జగద్ధిత భావములు గలవు.

1) శ్రీశైల పూర్ణులు ఆకాశగంగ (పాపవినాశినిని) ను కొండ సమీపమునకు దెచ్చిరి తిరుమలలో. పుట 114

2) అనంతసూరి ఒక దొడ్డ చెఱువును స్వయముగా త్రవ్వెను. అతని భార్య గర్భిణియైనను తట్టలు మోసినది. శ్రీ వేంకటేశుడు ఒక అర్భకుని రూపములో సాయపడెను. పుట 329.

3) శ్రీ వేదాంతదేశికులు తిరువహీంద్రపురములో స్వహస్తములతో నొక మంచినీటి సరస్సును త్రవ్వెను. తిరునందనవనమును నిర్మించెను. పుట 584.

**11. మంత్రములు : బ్రహ్మరాక్షసుడు, గ్రహములు పట్టుటలు, బాధించుటలు :**

1) రామానుజులు యాదవ ప్రకాశునివద్ద నున్నప్పుడు చోళరాజ పుత్రికకు బ్రహ్మరాక్షసుడు పట్టుట. పుట 164.

2) విఠలరాయని కుమార్తెకు గ్రహబాధ. వివిధ మంత్రముల ప్రయోగము. పుట 261.

3) వేదాంతదేశికులు, విషవైద్యుడు పోటీగా పరస్పర మంత్ర ప్రయోగములు పుటలు 584-586.

**12. స్వప్న వృత్తాంతములు :** తెలుగు సాహిత్యములో సర్వసాధారణములు కొందఱకు నేటికిని స్వానుభవములే. ఈ గ్రంథములో అసంఖ్యాకములు.

పుటలు : 10, 23, 25, 44, 291, 272, 268, 265, 596, 622 తెలుగు సాహిత్య ప్రపంచములో ఆసక్తిని గొలుపు ఘట్టములు (11,12 వ అంశములు.)

**13. తొండమాన్ చక్రవర్తి వృత్తాంతము :** శంఖచక్రముల ప్రసక్తి. ఆంధ్రులు కారు ఐనను ఆంధ్ర సాహిత్యమును పోషించిరి. పుదుక్కోట రాజులకు తొండమాన్ బిరుదు గలదు. పుటలు 568, 591.

**14. విద్యారణ్యుడు :** వేదాంత దేశికుల సమకాలికుడు. విజయనగర సామ్రాజ్య నిర్మాణమునకు మూలధారము. ప్రసిద్ధ చారిత్రక పురుషుడు. **13, 14** వ శతాబ్దము. పుటలు 568, 591.

**15. వడహల (వడగల)-తెంగల యాచారములు :** ఈ గ్రంథములో వడహల యాచారమను పదము వేదాంత దేశికుల వైభవములో గలదు. "శ్రీ వేదాంత దేశికులు వడహల యాచార ప్రపన్నులకు కూటస్థుడు" తెంగల యాచారమను మాటలేదు. కాని, ఇరు శాఖల వారికిని గల ఆచార్య పరంపర గలదు. దాశరథి (ముదలియాండాన్) వారిది వడహల ఆచారమందురు. రామానుజాచార్యుల పిమ్మట. పుట 556.

1. కురుకేశుడు మొదలుగా....వడహల పుట 566.
2. గోవిందుడు మొదలుగా....తెంగల పుట 566.

**16. వడమాచారము :** శ్రీశైల పూర్ణుల సంతతికి సంబంధించినది. పుట 545.

**17. నిత్యచేతనుల నివాస స్థానములు :** రామానుజుల పరివార సైన్యములోని వ్యక్తుల నివాస భూములు. "వీరు గురు కార్యములందు గోరరసువులు" "అమలమతులు" పుట 281.

1 యదుగిరి 2 నారాయణాద్రి 3. సత్యవ్రత పీఠారణ్యము 4. సింహగిరి, 5. రంగస్థలి, 6. చంపకాటవి, 7. ధన్వీపురము, 8 శ్రీముష్ణము 9. గరుడనగము, 10. కురుక, 11 తిరుక్కురుంగుడి, 12 అనంతపురము, 13. శేషాద్రి, 14. ఘటికాద్రి, 15. భూతపురి, 16. భక్తారామము, 17. అళహరి తిరుమల, 18. పాండురంగము, 19. కూర్మము, 20. భద్రగిరి, 21. వేగవతి, 22. తామ్రపర్ణి, 23. కావేరి, 24. ఇంకను దివ్యదేశములు, పుణ్యతీర్థములు.

**18. దైవదర్శన సందర్భములు :** పోవుచున్నపుడు క్రమముగా దర్శించుకొనవలసిన విషయములు :

1. రామానుజులు తిరుమలకు ప్రయాణము, మోకాళ్ళపై పుట 175.

ఊరేగింపు పద్ధతి (ఆచార్యులు వచ్చునపుడు) పుట 589.

కాలినడక కొండనెక్కు పద్ధతి, వేంకటేశుని దర్శించుటకు 30కి పైగా స్థలముల దాటవలయును. పుటలు 601.

19. విభూతిద్వయము: ఉడయవరుల బిరుదు : రామానుజులకు

1. శ్రీ వేంకటేశులిచ్చినది. విభూతిద్వయము పుట 234.

2. శ్రీరంగనాథు డిచ్చినది ,, పుట 186

"భూతియుగంబు గల్గియుండు కతన

యతిశిఖామణి 'ఉడయవరని' ధరిత్రి" కీర్తిగాంచిరి. పుట 186.

20. ఊరేగింపుల రకములు :

1. ఆచార్యులు, దైవమునకు సంబంధించినవి, పెక్కులు.

2. పెండ్లి ఊరేగింపులు, పుటలు 28, 49, 304.

21. యోగశాస్త్రపద్ధతి : నాథమునులు, కురుహావలప్పనులవరకే. అష్టాంగయోగరహస్యము యామునులకు లభించలేదు, పుటలు 103.

22. పాంచరాత్రాగమక్రమము : రామానుజులు శ్రీ కూర్మనాథుని "పాంచరాత్రాగమ ప్రథిత క్రమంబున తక్షణంబ దివ్యదేశము జేసెను" శ్రీ కూర్మనాథ ప్రకాశకుండని దొడ్డవాని గాంచెను. పుట 220.

23. దేవాదాసినుల సంప్రదాయము : ఇచట రామానుజుల పరివారములో కొత్తైమసానులు గలరు. వీరు పవిత్రులు. పుట 218.

24. ఆచార్య పురుషుల స్థానము : స్త్రీలు గూడ గలరు. వీరినే అమ్మయార్లు, నాచ్చియార్లు సంప్రదాయము. పుట 323, 324.

25 రాజాస్థానమున నుండు ప్రముఖులు, పరివారములు :

1. ఢిల్లీశ్వరుని సభలో : గూఢచారులు రాయబారులు, వజీరులు, ఉమ్రాలు, పీనుజాదులు, ఈశ్వరవాదులు పకీరులు, సరదారులు, సూరమానులు. పుటలు 282, 283, 284

విష్ణువర్ధనుడు, కులశేఖరాళ్వారుల వంశీయులు, పాండ్యుని వంశీయులు, నిషాదులు, తుండీరమండలరాజు, ఆంధ్రరాజు, కళింగాధిపతులు, ఉత్కళరాజు భట్టమంటప బ్రాహ్మణులు, రామానందుడు, శిష్యులును, నాగాలు, నిత్యచేతనులు.

ఇందు వర్ణింపబడిన పదజాలము వలన నాటిరాజుల, ప్రజల వేషభూష ణాదులు, నివాసస్థానములు తెలియనగును. అతిశయోక్తులును గలవు. కొన్ని చారిత్రకములున్ను, కొన్ని కల్పనలు గలవు.

26. పల్లీయ జీవన చిత్రణము:- రామానుజులు నిషాదుల చెంతనున్నపుడు. పుట : 250

27. ఆతిథ్యముల చిత్రణము :-

1) నిషాదులు రామానుజులకిచ్చిన ఆహారాదుల వర్ణనము. ఆటవికుల అలవాట్లు. కంకులు మొదలగునవి. పుట 250

2) కొంగుపిరాట్టి ఇచ్చిన ఆతిథ్యము. మర్యాద. పాద్యమిచ్చు తీరు, వంటకములు. నాటి ప్రజల ఆచారముల తెలుపును. పుట 255

వంటచేయు విధానము, వస్త్రముల ధరించుటయు, వడ్డించు విధానము పూర్వాచారముల తెలుపును

3) పరిత్తికొల్లై నాచ్చియారు వైభవములో: వంటకములవర్ణన, ఆచార్య ప్రపత్తి గలదు. పుటలు 123-128.

28. వీడుకోలు సందర్భము, చక్కని విధానము :
రామానుజులకు యాదవాచలవాసులు. పుట 319.
ఊరడింపు సందర్భము. పరాశరభట్టరుగూర్చి. పుట 335.

29. మ్రొక్కుబడులు - ముడుపులు చెల్లించు ఆచారము :

1) ఢిల్లీసుల తాను కుమార్తై తన మనములో (రామప్రియుడు తనకు దక్కవలెనని) పుట 296.

2) రామానుజులు గోదాదేవి యభీష్టమును నెరవేర్చుట. అళగిరి తిరుమల కరిగి 100 బాండముల ఘృతప్లుత పాయసము శౌరికర్పించెను. పుట 322.

30. వ్యక్తులను (పాత్రలను) పరిచయము సేయు పద్ధతి : నాట కీయ పక్కీలో జరిగినది. గూఢచారులకు రామానుజుల నైన్న పరిచయ పద్ధతి.

**30/1. తెలుగు నేలలో గూడ పర్యటన :** రామానుజులు ఆంధ్ర దేశ మును దర్శించిరి. "ఆంధ్రనాధాది దివ్యక్షేత్ర పతులెల్ల నతనికి కనిపింప" అంద తికిని మంగళశాసనముల జేసెను. పుట 228

**31. పుత్ర ప్రాప్తికై భగవంతుని ఆశీర్వచనములు :**
**వరప్రసాదములు :** పెరుమాళ్ళు తనకు తానై ఆచార్య పురుషుల నవతరింపజేయ సంకల్పించుట:-


1. శ్రీపరాశరభట్టరు, రామపిళ్ళ జన్మవృత్తాంతములు పుట 193
2. మణవాళ మామునుల జన్మవృత్తాంతము ,, 435
3. శ్రీవేదాంత దేశికుల జన్మ ,, ,, 563
4. శ్రీ నయనారాచార్యుల (వేదాంతదేశికుల కుమారుని) జన్మ వృత్తాంతము ,, 580
5. ఆళ్వారుల నుండి రామానుజుల వరకుగల పూర్వాచార్యుల జన్మలు భగవత్సంకల్పములే - ,, 3


**32. స్వప్న వృత్తాంతముల ఆశయము :**

తెలుగు సాహిత్య ప్రపంచములో స్వప్న వృత్తాంత ఘట్టములు బహుళ ప్రచారములునై ఆసక్తికరముగా నుండి, లక్షణ నిర్దేశమట్లుగా రూపొందినవి. సౌలభ్యమునకై వీటిని రెండు తెఱంగులు గావించినచో—

1. కవికి (గ్రంథ రచయితకు) గలిగిన స్వప్నములు.
2. కథ కనుగుణ్యముగా ఆయా వ్యక్తులకు కలిగెడు స్వప్నములు, కవి కల్పనలున్నూ.

**ఆశయములు :** కావ్య (సాహిత్య) ఉద్దేశములన్నియును. ప్రబోధములు, ఆదేశములు, ఆనతులు, కార్యక్రమముల నిర్వహించు విధానములు మొదలగునవి ఈ గ్రంథమందెన్నియో స్వప్న వృత్తాంతములు గలవు అద్భుతములైన వర్ణనములు గలవు.

**33. ఫలశ్రుతులు :** ఈ ఫలశ్రుతియును సాహిత్య ప్రపంచములో తఱచుగా కన్పించునట్టిదే. ముఖ్యముగా స్తోత్రములలోను, శతకములలో వ్యక్తము చేయబడు ఘట్టమిది. ''భగవద్గీత'' ఫలశ్రుతి సుప్రసిద్ధమే గదా!

అను సూచనముండును. నిజముగా పాఠకునకిది ప్రోత్సాహము నిచ్చునట్టిది. రస గ్రహపారీణులకు, సహృదయులకిక చెప్పవలసిన పనిలేదు.

ఆ.సూ.ము.లో కొన్ని ప్రత్యేకతలు గలవు. కవి ప్రత్యక్షముగా ఫల శ్రుతి చెప్పడు. అంతరార్థమిమిడి యుండును.

1) ఆ.సూ.ము. గ్రంథరచనోద్దేశమే లోకోపకారము గావించుట :
పుటలు. 3, 623.

2) ఆచార్యుల నామధేయముల చదువుట, వినుటవల్ల కలుగు ఫలితము :
పుట. 323.

''యతిరాజులకునైన యంతేనివాసులు
క్షేమంకరులు, వారి నామధేయ -
ముల జగత్రయ పాప నిర్మోచనముల
తెలియ ఖలికెదనేవిన్న కొలది ననుచు.''

ఫలశ్రుతిని గ్రంథము మొదట వ్రాయు పద్ధతిగూడ గలదు. ఇది పీఠిక వంటి దనదగును. ఉదాహరణమునకు చిన్నయసూరి నీతిచంద్రికలో, ఉపదేశము, ఫలితము విద్యార్థుల కుద్దేశింపబడి వ్రాయబడినది. ''పొదలును భాషా జ్ఞానము, కుదురును గొదలేక నీతి కుశలత్వంబుఁ.'' (నీతిచంద్రిక. పుట. 7.)

**34. పరమ నిలయ పర్యంత సోపాన పంక్తి :** రామానుజులు, యామునమునులు తమ జీవిత కాలములో ఒకరినొకరు కలిసికొని మాట్లాడలేదు. కలిసి మాట్లాడుకొన్నచో ఎట్లుండునోయను ఊహాచిత్రమును మనముగూడ సంకల్పించుకొన్నచో వొళ్ళు పులకరించిపోవుట కవకాశము గలదు.

రామానుజులు గూడ తాను యామునుల అంత్యదశయందు శపథము చేసిన పిమ్మట తలంచి యుండవచ్చును. కవి ఇట్లు చిత్రించినాడు. (పుట 167.)

''ఆళవందారితో నెఱగడె యైన సం
భాషింప గలిగిన పరమనిలయ

**ఆచార్య ప్రాధాన్యతగల సూక్తి :**

''ఆచార్యరహితమౌ హరిమందిరంబైన
కంఠీరవాక్రాంత గహ్వరంబు''
అని కరిగిరి వరదుని కడకు వెళ్ళిపోయెను.

35. **ఏకలవ్య శిష్యరికత్వము :** రామానుజులు తిరుమాలె యాండాను కడ తిరువాయిమొళి నధికరించుచుండిరి. ఒకప్పుడు గురువు చెప్పిన యర్థము సరికాదని తాను దలచిన అర్థమును నుడవగా గుర్వగు యాండానుగారు చదువు చెప్పుట నాపిరి. గోష్ఠీపూర్ణు లదియెఱింగి, అచటికివచ్చి రామానుజులు నుడివిన యర్థము ఆళ్వందారు చెప్పినదానిని బోలియున్నదనెను. అపుడు యతివరులు : (పుట. 185)

''ఏకలవ్యుండగానా నేనెన్నటికిని
యామునార్యులకని పల్కెననుచు ఘనుడు
వాదిభీకర గురుడనె మోదమలర!''

36. **నాయకమణి రామానుజులు :** ఆ. సూ. ము. గ్రంథమునకు నాయకుడు. అట్లే పూర్వాపరాచార్యులకు మధ్యస్థుడైన నాయకమణి. కృతిభర్త పద్యము :

''స్ఫారగురుపంక్తి మౌక్తిక
హారతరళదివ్యరత్నహాతకలియత్నా!
ధీరోదారగభీరవి
చారా! శ్రీశైలనాథ సన్నుతచరణా!'' (పుట. 434)

37. **బౌద్ధ విగ్రహమును పెకల్చుట :** తిరుమంగయాళ్వారులు బంగారు బుద్ధప్రతిమను నాగపట్టణములో నున్నదానిని పెకల్చితెచ్చి, దానిని కరగించి, శ్రీరంగనాథునకు సప్తప్రాకారముల గట్టించెను. సకల కైంకర్యముల జేసెను. (పుట 69.)

38. **ఇతరమతముల పుస్తకములను లేకుండ జేయుట :** రామానుజులు ఇతరమతముల జయించిన పిమ్మట—

కలగానుగుల వారి విలయముజించించి
మరం యాదవగిరి మఠము జెంది"
12 సంవత్సరములుండెను. (పుట. 312)

గమనిక : (37, 38 విషయములు) ఇతర మతములకు సంబంధించిన వస్తువులను లేకుండజేయుట నాటి మతాచార్యుల లక్ష్యముగా వచ్చును. చారిత్ర కాధారముల నన్వేషింపవలయును రచయితలు విజయోత్సాహమును చిత్రించుటలో కల్పనలు గూడ చేయుదురు. రామానుజులు గ్రంథముల కాల్చజేయలేదు, మనుష్యులలో మానసిక పరివర్తనమే కాని, బలవంతముగా వారికి హాని తలపెట్ట లేదు.

**39. కృతిభర్త పద్యములలోని విశేషాంశములు : ప్రత్యేకతలు :**

రామానుజులు కృతిభర్త. పద్యముల సంఖ్య 95. అ.సూ.ము. ఉల్లాస ముల సంఖ్య 24. ఆశ్వాసాది=24 పద్యములు ఆశ్వాసాంత=71 పద్యములు. మొత్తము 95. ఆశ్వాసాంతములో ఇందు ప్రత్యేకతగల పద్యముల సంఖ్య 24. ఈ 24 పద్యములలో పునశ్చరణాంశాలు గలవు.

ఇందలి స్తుతి విశేషణములు సర్వసామాన్యములైనను సందర్భోచితములు. వ్యక్తుల తీవిని దెల్పునట్టివి వైభవస్ఫోరకములు. సమగ్ర జీవితమునకు దర్పణ ములు. రసరమ్యములు. రమణీయములు. కృతికర్త కవితా శిల్పమునకు ప్రతీ కలు. సాలంకారములు.

1) గద్యలోని విషయసూచికాంశము లొకటి రెండు వరకిందులో గలవు. సంబంధిత ప్రకరణములోని సారభూతమైన, సారతమార్థమైన పలి తాంశముల నతిసంగ్రహముగా నాల్గయిదు పదములలో తెలిపినాడు. ఇది ప్రకరణ మునకు సంగ్రహ పునశ్చరణ వంటిది. ఏ తెలుగు కవియును ఇట్టి విధానమును ప్రయోగించలేదేమో!

2) రామానుజులకు పూర్వముగల ఆళ్వారాచార్యుల వైభవములో చిత్రించిన విధానము 'స్మరణము' వలె నున్నది.

3) రామానుజుల జీవితములో, జీవిత ప్రధాన ఘట్టములు. సాధించిన కార్యక్రమములు.

4) రామానుజుల అనంతరము వచ్చిన ఆచార్యుల వైభవములలో ఆయా వ్యక్తుల జీవిత కార్యక్రమముల ప్రధానాంశములతో పాటు "ఎంబెరు మానారు దివ్యచరణములే తంజమను" భావములదెల్పు పదములు, మలచబడ్డ విధానము ప్రతియుల్లాసము కొకటి చొప్పన—

1. పూర్వభాగము, ప్రథమోల్లాసము. పుట 18.

" కాసార, భూత, మహితమ
హాసంయమి, భక్తిసార, హరిపదభక్తి-
శ్రీసంయుత కులశేఖర
వాస హృదబ్జా! యతీంద్ర! వరగుణసాంద్రా!''

ఇందు 1) పొయిగై 2) పూదత్త 3) పేయాళ్వారులు 4) తిరుమళిశై 5) కులశేఖరాళ్వారులు స్మరణము. (వీరు యతీంద్రుల హృదయ పద్మములో ఆవాసమొనర్చినవారు. రూపకాలంకారము )

2. మధ్యమభాగము. ఉల్లాసము - 3. పుట 194

" శ్రీరంగధామశరణా!
కూరకులాధీశముఖ్య గురునుత చరణా!
ఘోరకలిదోషహరణా!
సారశ్రీభాష్యసూక్తి జగదుద్ధరణా!"

(ఇందు యతీంద్రులు శ్రీభాష్యమును వ్రాసిన సంగతి గలదు.)

3. ఉత్తరభాగము : పంచమోల్లాసము. పుట 556.

" కాంతోప యంతృగురురా
ట్స్వాంతోల్లసదబ్జ పూజ్య చరణ సరోజా!
సంతత సంశ్రిత చేతన
సంతోషకరా! యతీంద్ర! సంయమిచంద్రా!''

(ఇందు మణవాళమహాముని వృత్తాంతము, ఆచార్యుల జన్మస్థల వంశ ప్రబంధాదుల సంగతి సూచితము.)

4. బిరుదులను రచనలను తెలుపునవి: మధ్యమభాగము, పంచమోల్లాసము - పుట 229.

"పరమపదనిదానా! భాష్యకారాభిధానా!"

తృతీయోల్లాసము. పుట 194

"స్వజనహిత విచార! జ్ఞాతవేదాంతసారా!"

## 10. ఈ గ్రంథము నందలి వాదోపవాద విషయముల ఘట్టములు (ఖండన మండవములు) :

**కొన్ని నుతముల ప్రస్తావనము**

తెలుగు సాహిత్యములో వాదోపవాదముల విభాగమును చిత్రించుట కావ్య లక్షణ నిర్దేశమైనట్లుగనే కన్పించును. ఏదోయొక వాదము, సంవాదముండును. ఇది నాటకీయతను తలపించును.

**వాదములలో కనపట్టు సామాన్యములైన ముఖ్యాంశములు :**

విద్వత్సభలు- 1. కవిపండితులకు, వేదాంతులకు, శాస్త్రజ్ఞులకు సంబంధించినవి. శాస్త్రప్రమాణముల జూపించుట.

ప్రయోగములు- 2. మహిమల ప్రదర్శనములతో వాదించుట - పరస్పర మంత్రప్రయోగములు. వాదయుద్ధములు.

పోటీలు- 3. పోటీలు. మౌఖిక, రచనలకు సంబంధించినవి.

పీఠములు- 4. ఆచార్యపీఠములు, శంఖఫలకములు, సరస్వతీ పీఠములు. వీటిపై కూర్చుండువారి నోడించు పద్ధతులు. కావ్యముల నాదరించు గుర్తులు.

**వాదనియమములు :** ఇరుపక్షములవారు చేసికొన్న నియమములు. గెలిచినచో? ఓడినచో? ఏమి చేయవలె? లేదా ఏమియు పట్టించుకొనక ఎవరిదారిని వారు వెళ్ళుట ప్రతిజ్ఞలు-శపథములు, భాసలు - ఇట్లెన్నొ రకములుగ నుండ వచ్చును.

ఆచార్య సూక్తి ముక్తావళిలో వాదోపవాద ఘట్టముల నతిరమ్యముగా, సందర్భోచితముగా, వైష్ణవధర్మ విజ్ఞానదాయకముగా, చక్కని పదజాలముల

సృష్టించి శబ్దార్థ సౌందర్యముల పోహళించి, శబ్దములకు నాదశక్తిని కలిగించి (వాద యుద్ధము లుండును గనుక) రసానందభరిత మొనర్చినాడు. శబ్దనాదము లందును రసానందము గోచరించును. నాద సౌందర్యమునకు లయ కారణము. లయానుకూలములైన పదముల మేళవింపు, ఛందస్సు. ఇట్లు మనము వాదము సేయుచున్నవారి మాటలు విని (ఇట చదువుకొని) రసానందము ననుభవింప వచ్చును.

**ఆ.సూ.మూ. నందలి కొన్ని వాద ఘట్టములు - ముఖ్యాంశములు :**

**1. పెరియాళ్వారుల వైభవములో-** పుట 23.

పరతత్త్వ నిర్ణయ సభలో విజయముగాంచిన విష్ణుచిత్తులు విద్యాశుల్కమును గ్రహించుట, రాజ సన్మానము, రాజతనిని భద్రగజంబుపై కూర్చుండ బెట్టుట, కేలూతనిచ్చి యెక్కించి, యగ్గురునకు "భట్టనాథుం" డని భవ్యనామ మాచరించెను. అపుడు వినువీధిని గన్పించిన హరికి విష్ణుచిత్తులు పల్లాండు పాడిరి.

**2. తిరుమంగైయాళ్వారుల వైభవములో -** పుట 69.

ఈ యాళ్వారులు కార్తికేయాంశసంభవుండగు సంబంధప్పెరుమాళ్‌ను 'ఒరుకురుళాయిరునిలమ్' అనియెడి తిరువాయిమొళి నానతిచ్చి జయించిరి. అతడు చతుష్కవి శిఖామణి బిరుదు నీకే తగునని వెళ్ళిపోయెను.

**3. నమ్మాళ్వారుల సూక్తిగల తాళపత్ర విజయము -** పుట 77.

"కణ్ణినుణ్ చిరుత్తాంబు" యను తిరువాయిమొళి పాశురమును శంఖఫలకము (పీఠము) నందుంచగా అది దానిపైనున్న 300 మంది ద్రవిడసంఖ్యావంతులును, కంబనాథుండను కవీంద్రునితో నహా క్రింద బడవైచెను. కంబ కవీంద్రుడు క్షమాపణ చెప్పికొని వెడలిపోయెను.

**5. సరస్వతీ పీఠము : భారతీ భవనము: సరస్వతీ నిలయము పు. 215.**

''సరస్వతీ భండారమను'' రత్నభవనమందు నెలకొన్న వాగ్దేవి రామానుజు లిచ్చిన శ్రీ భాష్యమును చేబూని సంతసమున 'భాష్యకారులను బిరుదు' నొసంగినది. అపుడు కొంద ఱచటి కుమతు లోర్వక రామానుజులతో వాదించి ఓడిపోయి, అతనిని చంపుటకై క్షుద్రపన్ని అభిచారికాహూతి యొనర్చి అష్టసాయకభుజకృత్య ననిపిరి. అది రామానుజుల బాధించక తిరిగి వారినే బాధింప వారందఱును అతని శ్రీపాద తీర్థమును గ్రోలి సుఖించిరి పుట 215.

మహా విద్వాంసుని నిరుత్తరుల జేసి, పందెము ప్రకారము శిరస్త్రాదనము జేయక గౌరవించిరి. చోళరాట్పత్ని బాల యామునులను "నెన్నైయాళ్వందారివరని" సంబోధించెను. పుట 97.

7. ఎవరి దేవుడను విషయమున పందెములు :

1 రామానుజులు, శైవులు చేసికొన్న నిబంధనల ప్రకారము తన ముందున్న శైవ, వైష్ణవ చిహ్నములగు ఆయుధములలో శ్రీ వేంకటేశుడు శంఖ చక్రములనే దాల్చెను. పుట 176.

2 రామానుజులు శ్రీ కూర్మములో శైవులతో చేసికొన్న నియమములు: దైవమూర్తి (విగ్రహము) శ్రీ కూర్మనాథుడు ఎవరికభిముఖముగ తిరిగిన వారి దేవుడు (పుటట 219) కూర్మనాథుడు యతిపతికభిముఖముగ తిరిగెను.

8 కవిత్వ రచన పోటీలు : వేదాంత దేశికులకు జగదార్యులకు జరిగినవి. పాదుకా సహస్ర కావ్యమావిర్భవించెను. పుట 588

9. మంత్రప్రయోగువాదములు:

వేదాంతదేశికులు కోలాహలుడను విషవైద్యునితో హోరాహోరిగా మంత్ర యుద్ధము నేసి వాని నోడించెను పు 588.

10. గురు-శిష్య సంబంధము : ఓడినవారు శిష్యులగుట నియమము. లేదా ఇష్టానుసారము శిష్యులగుట:

1. రామానుజులు వాదములో యజ్ఞమూర్తిని జయించుట. 18 రోజులు వాదయుద్ధము సాగినది. అతడు శిష్యుడాయెను. పుట 181.

2. రామానుజులు విఠలరాయని రాజగురువులగు 12,000 మంది క్షపణ (బౌద్ధ) మతస్థులను వాదములో ఓడించెను. తన విశ్వరూపమును జూపెను. (పుట 263.)

ఈ 12,000 మంది రామానుజుల శిష్యపరివారమునైరి.

3 శ్రీ పరాశర భట్టరువారు మేలునాటగల మేటి పండితుడగు వేదాంతిని జయించిరి. 9 రోజుల వాదయుద్ధము. (పు. 361) వేదాంతియే 'నంజియ్యరని' ప్రఖ్యాతిగాంచిన ఆచార్యోత్తముడు. పరాశరుల పాదపద్మముల నాశ్రయించిరి.

4. భట్టరు ప్రతిభనోర్వలేక కొందఱు కుమతులతనితో శాస్త్రవాదములు సేసి ఓడిపోయి భట్టరును చంపుటకై కుట్రను తలపెట్టిరి. వారొక విషసర్పమును దెచ్చి ఒక కుండలో నుంచి, అందులో నేమున్నదో చెప్పుమనగా, భట్టరు అందులో తెల్లగొడుగున్నదన, వారు తిరిగి చూడగా ఆ భాండములో శ్వేతాతపత్రమే కన్పించెను. ఇట్లందఱును ఓడిపోయి శ్రీపరాశర భట్టరు సాక్షాత్ శ్రీరంగశౌరియే యని కొనియాడి మ్రొక్కి వెడలిపోయిరి. పుట : 377.

గమనిక : ఓడినవారు గెలిచినవారిని చంపు ప్రయత్నములుగూడ చేయవచ్చును.

5) శ్రీ వేదాంతదేశికులు అద్వైత మాయావాద విద్వాంసులతో వాద యుద్ధము సేసి వారి నోడించెను. వారు శిష్యులై ఇతని నాశ్రయించిరి. (పుటలు: 574 576.)

1. చతుర్వేద పండితుని జయించెను.

2. సోమేశ్వర భట్టు నోడించెను.

3. వేదకాశీ వాగ్విజయ భట్టారకునితో 8 రోజుల వాదయుద్ధము సేసి ఓడించెను.

**11. వాదములో విగ్రహ మెవరి కెదురు తిరిగిన వారు జయించినట్లు నియమము :**

అణ్ణంగారు శ్రీవేదాంతదేశికుల కుమారుడైన నయనాచార్యుల శిష్యుడు. శ్రీ నృసింహమిశ్రుడను అద్వైతవాదితో వాదించి విశిష్టాద్వైత తత్త్వస్థాపనజేయగా శ్రీనృసింహ విగ్రహము అణ్ణంగారి కభిముఖమయ్యెను. అణ్ణంగారు గెలిచిరి. గురువు సంతోషించి "ప్రతివాద భయంకర" బిరుదును ప్రసాదించెను. (పుటలు : 595)

ఈ వృత్తాంతములో కొంత హాస్యమును కవి చిత్రించినాడు:

మాటల చమత్కృతి : ఇరువురికిని ఒకరినొకరు పరిహాసమొనరింప వలయునని మనస్సులో గలదు. హాస్యరసము :

నృసింహమిశ్రుడు : అణ్ణంగారిని జూడగనే, (అణ్ణగారు పొట్టివాడు) "అకారో హ్రస్వః" అనెను.

అణ్ణంగారు : "అ" కారంబు దీర్ఘమని ఖండించెను.

నృ : "కాపూర్వః'' అని గూఢోక్తి బలికెను.

అణ్ణం : "కాంచీపూర్ణః" అని గంబీరార్థమును బలికెను.

**ఈ గ్రంథము నందుగల ఇతర మతముల పేర్లు - ఖండన వాక్యములు - పరమత నిరాకరణములు :**

ఆ.సూ.ము.లో సందర్భోచితముగ వాడుకొనబడిన పదములు మతములకు సంబంధించినవి గలవు.

షణ్మతములు : 1. శైవము 2. వైష్ణవము 3. శాక్తము 4. గాణపత్యము 5. సౌరము 6. కాపాలము.

శాస్త్రకర్తల పేర, వాదస్థాపన జేసినవారి పేర, ఋషుల పేరగూడ పర్యాయ పదములుగా మతముల నన్వయము చేయుట జరిగినది.

**విదేశీయ మతముల ప్రస్తావన :** లేదు. మనుష్యుల పరముగా, జాతి వాచకముగానే కవి ప్రయోగించినాడు.

"పారసీక తురుష్క పల్లవ యవన హూణాదులౌ మ్లేచ్ఛులు.' రామానుజుల ఢిల్లీ విజయ సందర్భములో వాడబడినవి. (పుట 290)

**పరమత ఖండన ప్రస్తావన :** ఆచార్యుల జీవిత చరిత్రములో కన్పించును.

**నాటి సాంఘిక స్థితి :** పరమతములను సోపపత్తి క్రమముగా ఖండించి, స్వమతమును స్థాపించుట నాటి పీఠాధిపతుల లక్ష్యము. ఇది లోకోపకారార్థమని నిరూపించి, తత్త్వనిర్ణయముల జేసి, స్వయముగా ఆచరించి చూపెడువారు. సంఘసంస్కర్తలుగా వీరిని పేర్కొనవచ్చును. ఖండన విషయములను స్తోత్ర శ్లోకములుగా చేసి శిష్యులు అనుసంధించెడివారు. (పుట 279.)

రామానుజుల స్తుతి : ఢిల్లీవిజయ సందర్భము (పుట. 273.)

''చార్వాక పర్వత శతకోటి సంకాశ

పాషండ ఖండన బహుపరాకు!

బౌద్ధమతధ్వాంత బాలదివాకర

స్తోత్రముల యందు కనబడు ఇతర మతముల పేర్లు-ధాటీ పంచక స్తోత్రమునకు అనుకరణ :

''పాషండ ద్రుమషండ దావదహనశ్చార్వాక శైలాశనిః,
బౌద్ధ ధ్వాంత నిరాసవాసరపతిర్జైనేభకంఠీరవః
మాయావాది భుజంగ భంగ గరుడస్త్రైవిద్యచూడామణిః
శ్రీరంగేశ జయధ్వజో విజయతే రామానుజోయంమునిః॥

ఇందలి మతముల పేర్లు : 1. చార్వాకమతము, 2. పాషండమతము, (ఇది వేదబాహ్య మతము. పాషండు లెట్టివారో ఆ.సూ.ము. పుట 469 లో విపులముగా నున్నది.) 3. బౌద్ధమతము, 4. మాయావాదులు.

**శాస్త్రోక్తముగా తర్కించెడివారు - ప్రమాణముల సహితముగా వాదనా విధానములు :**

"బలవత్ప్రమాణ తర్కోజ్జ్వల కిరణ సహస్రదూత పరవాది మహోచ్ఛల, వాదాంధతమిస్రా, సులలిత రామానుజార్య సూర్యమహాత్మా!"కృతిభర్త పద్యము. (పుట 212)

2. ప్రతివాదభయంకరం అణ్ణంగారి వాదనావిధానము. (పుట 596)
("బలవత్ప్రమాణ సహకృత బ్రహ్మతర్క సహస్రోపన్యాసము") (పుట 596)

3. వేదాంతదేశికుల వాదము. (పుట 575)

"సకల ప్రమాణముల్ సవిశేషపరములు" (పుట 575)

**వాదయుద్ధములు, పందెములు - గురుశిష్యులగుట :**

4. శ్రీ పరాశర భట్టరు - నంజియ్యరు వాదములు. (పుట 361)

"పరస్పర విజిగీషచే బ్రహ్మతర్క ప్రమాణ శస్త్రచ్ఛటలం ప్రబల వాదాహవం బొనరించు వారికిం" తొమ్మిది రోజులు గడచెను.

5. రామానుజులు - యజ్ఞమూర్తి వాదములు. (పుట 181)

"అష్టాదశ దినంబు లాగమాంత ప్రసి
ద్ధ బ్రహ్మతర్క(ము) శస్త్రములచేత."

పందెము శ్రీరంగని కడ. గెలిచినవారు గురువులు గావలె. ఓడినవారు వారి శిష్యులు గావలె.

4. 'పరకాలమునీంద్రుడు' సంబంధి కవీంద్రునితో తర్కించిన సందర్భము:

"ఊరంతయు వీరపాషండ భూయిష్ఠంబై యున్నంత, ఒక సాత్త్విక వనితకడ బాలగోపాల విగ్రహము సంపాదించెను." ఇచట పేర్కొనబడిన మతము పేరు వీరపాషండము.

## 11. గురుశిష్యాదుల చర్చలలో గల ప్రశ్నలు - సందేహములు, సమాధానములు

ఆ.సూ ము.లో శిష్యులు లేదా ఆశ్రితులడిగిన ప్రశ్నలకు, వారికి గలిగిన సందేహములకు ఆచార్యులిచ్చిన సమాధానము సందర్భోచితములై యొప్పుచున్నవి. సామాన్యజనుల మనస్సులలోనున్నమగు సందేహములు గూడ ఇందు కాననగును. ప్రశ్నలు - జవాబులు కొన్ని పద్యరూపములోను కొన్ని వచనరూపములోను గలవు.

ప్రశ్నలు - సమాధానముల సంఖ్య :

| | | సంఖ్య | పుటలు |
|---|---|---|---|
| 1. | ఉదయవరుల వైభవములో | | |
| | పూర్వభాగము. షష్ఠోల్లాసము. | 5 | 139, 141-143 |
| | ,, మధ్యమభాగము, తృతీయ ,, | 1 | 189 |
| 2. | భట్టరు వైభవములో | 6 | 372-375 |
| 3. | నంజియ్యరు వైభవములో | 6 | 387 |
| 4. | నంబిళ్ళ వైభవములో<br>ప్రశ్నలకు సూటిసమాధానములు భావమును స్ఫురింపజేయునవి గూడగలవు. | 13 | 389-414 |
| 5. | పెరియ వాచ్చాంబిళ్ళవైభవములో | 8 | 416-417 |
| 6. | మణవాళమహామునుల వైభవములో | 12 | 456-503 |
| | మొత్తము సంఖ్య | 51 | |

ప్రశ్నలు-సమాధానములు:

మణవాళ మహాముసుల వైభవములోనివి.

ప్రత్యేకత - ఆ.సూ.ము.లో 1444 పంక్తులు గలిగిన అతిదీర్ఘమైన వచన భాగము ఈ గ్రంథమున కాయువుపట్టు వంటిది. వైష్ణవధర్మముల నెఱుంగుట కెంతగనో తోడ్పడును మనకు తెలియని విషయములెన్నియో ఇందు ప్రశ్నలు-సమాధాన రూపమున నిర్వబడినవి.

స్థలము, సమయ సందర్భములు :

కురంగనగరము. తిర్కుకురుంగుడికి మణవాళ మహాముసు లొకమారు విచ్చేసిరి. అపుడు తిరువేంగడ ముడయానను బ్రాహ్మణుడు అచటికివచ్చి వారిని కొన్ని ప్రశ్నలడిగి, తృప్తికరమైన సమాధానములను బడసి వారి నాశ్రయించి శిష్యుడాయెను పిమ్మట మామును లితనికి "తిరువేంగడ దాసుడని" తిరునామ మిడిరి.

ఇందు ప్రధాన ప్రశ్నలు మరియు జవాబు చెప్పునపుడు సందర్భవశాత్తున వచ్చు అంతర్గత ప్రశ్నలును గలవు. సాధికారమైన ప్రమాణములు గలవు. (పుటలు 456 నుండి 502 వరకు.)

1. నారాయణుండే అధికుండేల? జవాబు - పుటలు 456, 457.

2 శ్రీరాముడు శివలింగ ప్రతిష్ఠ నేలగావించెను? జవాబు- పుటలు 457, 461.

చిన్నప్రశ్న: బ్రహ్మహత్యాపాతకమును తెలుపుడు. ,, ,,

3. శరభరూపి రుద్రుడు నరకేసరిని ఓడించెను. విష్ణున కాధిక్యమెట్లు? జవాబు - పుటలు 463-465.

4 అట్లు పరాత్పరుండగు హరిని ఎల్లవారేల యర్చింపరు? జవాబు - పుట 466.

5. పాషండులను గూర్చి.

1. పాషండు లెట్టివారు? జవాబు - పుట 466-469

2. వారి చిహ్నము లెట్టివి? జవాబు - 469-470.

3. శ్రుతిగర్హితంబగు కపాలచర్మభస్మాస్థిధారణంబు నీ వొనర్చుటకు కారణము?

(పార్వతి శివుని ప్రశ్నించుట. జవాబు - పుట 470-472.

4 తామసశాస్త్రముల నామములేవి? జవాబు - 473-474.

6. శంఖ చక్రోర్ధ్వపుండ్రాది విష్ణులాంఛన ధారణంబులకు ప్రమాణమేమి? జవాబు పుట 474-483.

1. శ్వేత మృత్తికను గ్రహించుట, హరిద్రా శ్రీచూర్ణ మహిమ. పుట. 484-487.

7. శ్రీ పరాంకుశ పరకాలాది దివ్యసూరుల యవతార రహస్యమును, తదీయదివ్య ప్రబంధమాహాత్మ్యమును వివరింపుడు?వివరణము-పుటలు487-489.

ఉడయవరుల వైభవములోనివి : శ్రీ రంగామృత కవీంద్రుడను తిరువరంగత్తముదనారు చరిత్రము రామానుజుల ఆజ్ఞచే కూరేశులు తిరువరంగత్తముదనారును సాత్త్వికునిగా జేయుట:

కూరేశులు సమస్త శాస్త్రములందును, గానశాస్త్రమునందు పండితుడు. మహాగాయకుడైన, విప్రుడగు తిరువరంగత్తముదనారును వాదములో, గానరీతిలోను జయించెను. వెంటనే అతడు కూరేశుల నాశ్రయించి, నాల్గయిదు ప్రశ్నల నడిగి సదుత్తరముల బడసి ప్రహృష్టాంతరంగుడై యతీంద్రుల పాదపద్మముల సేవించుకొనెను. రామానుజ భవ్యనామాంకితముగా ప్రసన్నగాయతి (రామానుజ నూత్తందాది) యను దివ్యప్రబంధమును రచించెను.

ప్రశ్నలు - సమాధానములు:

1) భూతి రుద్రాక్ష త్రిపుండ్రాదులేల మీరాదరింతురు? పుటలు 142-143.

2) తప్తచక్రాంకచిహ్నోర్ధ్వపుండ్ర ధారణంబు నందు ప్రమాణంబెయ్యది? పుట 143

3) శ్రీశఠకోపాది దివ్యసూరుల జనన క్రమంబును తత్ప్రబంధములకు శ్రుతిత్వ ప్రకారంబు నెట్టిది? పుట 143.

4) సర్వదేవోత్కృష్టుండని శాస్త్ర ప్రసిద్ధుండైన శివుండు మీకనాదరణీయుండగుట కేమి కారణము? పుట 143.

కూరేశులు తనకుతానై ప్రశ్నవేసి యిచ్చినసమాధానము పుటలు 143-144

1. శ్రీరామభద్ర ప్రతిష్ఠాపితుండు గావున హరుండధికుండని తలంచితివేని?

జవాబు. ఇది వాల్మీకి ప్రోక్తముగాదు.

నమ్మాళ్వారుల వైభవములో - ఆ సూ.ము. కర్త ఈ ప్రశ్నను చేర్ప లేదు.

ప్రప్రథమ దర్శనమున మధురకవులు నమ్మాళ్వారులను ప్రశ్నించిరి. జవాబును పొందిరి.

ప్రశ్న : ప్రకృతి కడుపున బుట్టిన జీవుడేమి తిని యెట్లు బ్రతుకును?

జవాబు : దానిని తిని యట్లే బ్రతుకును.

**ద్వాదశోర్ధ్వపుండ్రముల ధరించు ఆచారము ఎప్పటి నుండి? ఆ. సూ. ము. లోని ప్రసక్తులు.**

1) ఈ గ్రంథములో మొట్టమొదట దీని ప్రసక్తి తిరుమళిశై యాళ్వారుల వైభవములో చేయబడినది. పుట : 16

2) పిమ్మట మణవాళ మహామునుల వైభవములో అతి విపులముగా నిరూపింపబడినది. పుటలు 474.487

3) ఆళ్వారుల, ఆచార్యుల దివ్యాకృతుల వర్ణనములో దీని ప్రశక్తి ప్రసక్తులు గలవు.

4) కూరేశులు చూపిన ప్రమాణములు. పు 143

**సూచనలు :**

5. కొన్ని పత్రికలందు దీనిస్వరూపము, ఆకారము, పరిమాణము, రేఖలు, వంకల వంటివి, కాలక్రమేణ ఎట్లు మారుచు వచ్చినవో తెలుపబడినవి. విశేషముల నరయగోరు వార్తాపత్రికలను చదవ వచ్చును. పాఠకులత్సాహజనకము, కొంత పరిశోధనాదృష్టియు సహకరించును.

పత్రికలపేర్లు 1. శ్రీశైలప్రభ. డిసంబరు 1985; జనవరి, ఫిబ్రవరి 1986 సంచికలు.

2. "The Indian Magazine", Oct. 1987- The Vaisna vite Tilaks. Written by Gautam Chattopadhyay.

## 12. చారిత్రక విషయములు

దక్షిణ భారతమును పరిపాలించిన కొన్ని రాజవంశముల పేర్లు ఇట పేర్కొనుట సమంజసమని నా యభిప్రాయము.

చార్యుల కాలములను చారిత్రకముగా లెక్కగట్టుట కాధారము లభించుటయేగాక నాటి ఆచార్య వ్యవహార మత సంప్రదాయ సంస్కృతులను తెలిసికొనుట కవకాశము లభించును. విశిష్టాద్వైత తత్త్వ సిద్ధాంతము, వైష్ణవధర్మ పరివ్యాప్తులు, వాటి పుట్టుపూర్వోత్తరములు దక్షిణ భారత చరిత్రతోడనే ముడివడి యున్నవి గదా! ఆ.సూ.ము. లో తఱచుగా చారిత్రక పురుషులైన రాజులపేర్లు, వ్యక్తుల పేర్లు గానవచ్చుచున్నవి. ఉత్తర భారతమునకు సంబంధించినవారి పేర్లు తక్కువ. ప్రసిద్ధ వైష్ణవాచార్యుల, ఆళ్వారుల జన్మస్థానము దక్షిణభారతముగదా! ఈ క్రింది ఆ.సూ.ము. వాక్యములను గమనింపుడు: (పుట : 3.)

శ్రీమన్నారాయణుడు : (రామ కృష్ణాద్యవతారముల పిమ్మటమాట) శ్రీవత్స కౌస్తుభ వైజయంతీ వనమాలా పంచాయుధానంత గరుడ విష్వక్సేనాది నిత్యసూరులం జూచి;

"మీరలేగి భూమండలంబున, ద్రవిడ భూభాగంబున, కావేరీ తీరంబున, తామ్రపర్ణీతటంబున, వేగవతీ కూలంబున, బాహుదా సమీపంబు నందభిమత వర్ణంబుల యందవతరింపుడు.''

గాన ఈ భూభాగముల పాలించిన రాజులపేర్లు తెలిసికొనుట అవశ్యకమే యగును. అదియునుగాక, రామానుజాచార్యులు విశిష్టాద్వైత ప్రచారము నిమిత్తము భారతదేశమంతయు పర్యటించిరి. దివ్యదేశములన్నింటిని దర్శనము చేసికొనిరి. రామానుజులు తర్వాత వచ్చిన ఆచార్యులు ఎక్కువగా దక్షిణభారతముననే పర్యటించిరి. ఆచార్య పీఠస్థులకు అటు రాజులతోడ, ఇటు ప్రజలతోడను సంబంధము లుండి తీరును గాన, కొన్ని చారిత్రక విశేషముల సంగ్రహముగా నిట్లు క్రోడీకరించుట జరిగినది:

1. **పల్లవులు :** (మహా పల్లవులు) క్రీ.శ. 550 - 890.
వీరు దక్షిణ భారతంలో ఎక్కువభాగం పాలించినారు.

1. మొదటి మహేంద్రవర్మ 600 - 630.
2. రెండవ నరసింహవర్మ 691 - 728.
3. రెండవ పరమేశ్వరవర్మ 728 - 731.
4. రెండవ నందివర్మ 731 - 796.
5. దంతివర్మ 796 - 847.
6. మూడవ నందివర్మ 847 - 869.

7. నృపతుంగవర్మ 869 - 885.

8. అపరాజితవర్మ 885 - 915.

వీరి కాలంలో శైవనాయనార్లు, వైష్ణవ ఆళ్వార్లు గలరు.

**ఆళ్వార్లు - కాలము :-**

1) ముదలాళ్వారులు ముగ్వురు- మహేంద్రవర్మకు పూర్వం క్రీ.శ. 600.

2) తిరుమళిశైయాళ్వారులు క్రీ.శ. 600 - 630 ప్రాంతము. ఇతడు మొదటి మహేంద్రవర్మను "గుణభర" అని వర్ణించినాడు.

3) తిరుమంగై యాళ్వారులు. ఇతడు నందివర్మ పల్లవవర్మ (847-868) అను చోళరాజు సామంతుడు. ఇతనిది చోరవృత్తి (నిస్వార్థమైనది). వీరుడు. వృద్ధాప్యంలో శ్రీరంగ పునరుద్ధరణ గావించెను. బౌద్ధ, జైన, వీరశైవ మతములకు శత్రువు.

4) నమ్మాళ్వారులు (ఇతడు రైతుబిడ్డ) పాండ్య దేశము

5) మధురకవి - క్రీ.శ. 797 ,,

6) పెరియాళ్వారులు - ఆండాళ్ క్రీ.శ. 725, 776 ,,

7) కులశేఖరాళ్వారులు - చేరదేశము రాజు 767 క్రీ.శ.

8) తొండరడిప్పొడి యాళ్వారులు - క్రీ.శ. 787 చోళప్రాంతము

9) తిరుప్పాణియాళ్వారులు - క్రీ.శ. 841 ,,

గమనిక :- ఆళ్వారులందఱు క్రీస్తు పూర్వము నాటి కాలము వారని సంప్రదాయ గ్రంథములలో గలదు. నమ్మాళ్వారుల కాలము క్రీ.పూ. 3102. శ్రీకృష్ణ నిర్యాణ కాలమిదే.

**చోళవంశము :** క్రీ.శ. 985 - 1270.

చోళరాజులు : పల్లవుల ప్రాబల్యం పిమ్మట తమిళదేశంలో సార్వభౌమత్వం వహించినవారు.

1. రాజరాజు క్రీ శ. 985 - 1018.
2. రాజేంద్రుడు 1018 - 1044.
3. రాజాధిరాజు 1044 - 1052.
4. రెండవ రాజేంద్రుడు 1070.
5. రెండవ కులోత్తుంగ చోళుడు 1133 - 1144.

**మత సంబంధములు - వీరికాలములో :**

1. శైవనాయనార్ల తేవారం, తిరువాచకం పాటలు వైష్ణవుల నాలాయిర ప్రబంధము లవతరించి, అత్యంత ప్రజాదరణ పొందినవి.

2. చోళుల కాలంలో శ్రీవైష్ణవం ఒక మతముగా, శాఖగా వికసించినది. నాథమునులనుండి ఆచార్య పీఠము లేర్పడినవి. వీరి కేంద్రము శ్రీరంగము, శ్రీరంగనాథ దేవాలయము.

3. రామానుజుల జీవితకాలంలో (క్రీ. శ. 1017 - 1137) ఐదుగురు చోళ రాజులు ప్రథమ రాజేంద్రుని నుండి విక్రముని వరకు పరిపాలించిరి. రామానుజులు క్రీ.శ. 1100 ప్రాంతంలో చోళ దేశమును వీడినపుడు "ప్రథమ కుళోత్తుంగచోళుడు" రాజుగా నుండెను అతడు శైవాభిమాని. "క్రిమికంఠ చోళుడుగా" కథలలో పేర్కొనబడినాడు. ఇతని పాలనా కాలం (1070 - 1118) ఇతడు పరమతస్థులను బాధించెడు వాదను విషయమును చరిత్రకారులు తేల్చవలసినదే.

**ఇతర రాజవంశములు :**

1. పై చోళ, పల్లవ వంశీయులతోడనేగాక ఆచార్యులకు పాండ్య భూపతులతోడను సంబంధములున్నవి. పాండ్య దేశ భూభాగమును చోళులు గూడ పరిపాలించిరి. కావేరీనదికి దక్షిణ భూభాగము, చేర దేశమును చేరవంశీయులు పాలించిరి. కర్ణాటకమును హోయసలరాజులు పాలించిరి.

1. పెరియాళ్వారులు పాండ్యభూపతి సభలో విద్యాశుల్కమును గెలుచుకొనెను. (పుటలు 23, 24) రాజు పేరు వల్లభరాయడు. నగరము మధుర.

2. కులశేఖరాళ్వారులు కేరళ (చేర) రాజు (పుట 16)

2. విజయనగర రాజుల కాలము . ప్రసిద్ధ వ్యక్తులు క్రీ. శ. 1336 మొదలుకొని 1571 వరకు.

| | | |
|---|---|---|
| 1. | సంగమ వంశము | క్రీ. శ. 1336 - 1485 |
| 2. | సాళువ వంశము | క్రీ. శ. 1485 - 1506 |
| 3. | తుళువ వంశము | క్రీ. శ. 1506 - 1571 |

శ్రీకృష్ణదేవరాయల కాలము (1509 - 1530)లో దక్షిణ భారతదేశ మంతయు వీరిదే.

ఆ.సూ.ము.లో విద్యారణ్యుల ప్రస్తావన గలదు.

ఇతడు విజయనగర సామ్రాజ్య స్థాపన కంకురార్పణము జేసి హైందవుల కైక్యము నేర్పిన చారిత్రక పురుషుడు (క్రి. శ. 1333). వేదాంత దేశికుల సహాధ్యాయి. (ఆ.సూ.ము. పుట 568.)

## ఆ.సూ.ము.లో గల 'చరిత్ర' వ్యక్తుల పేర్లు

1. వల్లవరాయలు, పల్లవదేశము రాజు పుటలు 11.
తిరుమళిశై ఆళ్వారుల సమకాలికుడు. కాంచీపురము.
2. కులశేఖరులు, రాజు, ఈతడు స్వయముగా ఆళ్వారు. పుట 16.
3. వల్లవరాయడు. పాండ్యభూపతి. దక్షిణమధుర.
విష్ణుచిత్తుల సమకాలికుడు. పుటలు 23, 24.
4. చోళరాజు. పేరు తెలియదు. శ్రీరంగము పుట 42.
తొండరడిప్పొడియాళ్వారుల సమకాలికుడు.
5. ,, పేరు తెలియదు శ్రీరంగము పుట 65.
తిరుమంగై ఆళ్వారుల సమకాలికుడు.
6. ,, పేరు తెలియదు. శ్రీరంగము. పుట 83.
నాథమునులకు సమకాలికుడు.
7. ,, పేరు తెలియదు. శ్రీరంగము. పుట 94
యామునుల సమకాలికుడు.
8. యామునాచార్యులు రాజుగా నుండుట. పుట 94.

**రామానుజాచార్యుల కాలములో (క్రి.శ. 1017 - 1137) నున్నవారు. లేదా పేర్కొనబడినవారు :**

1. ఢిల్లీ సులతాను. పేరు తెలియదు. పు. 275
2. వీరప్రతాపరుద్రుడు. కాకరుద్రుడు. పు. 284 కాకతీయవంశము.[1]
3. కఫిరుదాసు ఇతడు హరిభక్తుడు. భక్తుల చరిత్రలోగల కబీరదాసు అగుటకు వీలులేదు. ఇతని కాలము క్రి.శ. 1455.(పు 284)
4. ఔరంగజేబు పుట 290. ఇతడు మొగలాయి చక్రవర్తి. కాలము - క్రి.శ. 1618 - 1707.
5. రామానుజులు యాదవప్రకాశులవద్ద నున్నపుడు చోళరాజు. పుట 164.

---

1. ఢిల్లీ సులతాను - కాకరుద్రుల వైరుధ్యమును గూర్చి, మైత్రిని గూర్చి ఏకామ్రనాథుని 'ప్రతాపరుద్ర చరిత్రము'లో గలదు. ఆం.ప్ర.సా.ఎ. ప్రచురణ 1984, పుటలు 66, 67.

6. పండిత రాయలు, భగవంత రాయలు. మహారాష్ట్రులు. రామానుజుల శిష్యులు. ఢిల్లీ సులతాను దూతలు. పుట 287.

7. తొండమాన్ చక్రవర్తి వృత్తాంతము. పుట 232.

8. రామానంద యోగీంద్రుడు శిష్యుడగుట. పుట 281.

9. క్రిమికంఠుడు. చోళరాజు. 147, 246, 247, 314 పుటలు.

10. కాశ్మీరరాజు. భారతీ భాండర భవనముకడ. పుట 216.

11. విఠలరాయుడు. ఇతనినే విష్ణువర్ధనుడందురు. పు. 261, 262, 279.

12. సింహగిరి వచనముల కృష్ణమాచార్యులు. ఇతనిది సంతూరను గ్రామము. ఇతను క్రీ.శ. 1265-1270 న జన్మించి యుండవచ్చును. అ.సూ.ములో రామానుజులతో వాదించినవాడుగా పేర్కొనబడినాడు. పుట 222.

13. మలికనేబు. పుట 225.
ఇతడు అల్లావోద్దీన్ ఖిల్జీ సేనాని మాలిక్ కాఫర్ అగుటకు వీలున్నది. దక్షిణాపథముపై దండయాత్ర, శ్రీరంగమును దోచుకొనుట క్రీ. శ. 1310 లో జరిగినది. పిళ్ళలోకాచార్యుల వారి కాలము (క్రీ. శ. 1213-1327) లో తురుష్క దండయాత్ర జరిగినది.

14. రామానుజుల సైన్యములో నున్నవారుగా వర్ణింపబడినవారు : పుట 279 నుండి 1. విష్ణువర్ధనుడు. 2. కులశేఖరుని వంశీయుడు. 3. పాండ్యుని వంశీయుడు. 4. తుండీర మండలరాజు. 5. ఆంధ్రులు. 6. నిషాదులు. 7. కళింగాధిపతులు. 8. నాగాలు. 9. నిత్య చేతనులు. 10. ఉత్కళ రాజు. 11. భట్టమంటప బ్రాహ్మణులు.

15. గోపనాయుడు - పుట 426.

16. శ్రీరంగనాథ మాణిక్యాభిధానవేశ్య - త్యాగము చేసినది. పుట 426.

17. సింగప్పరాన్ అనెడి విప్రుడు. పుట 426.
భట్టరు వైభవములో పేర్కొనబడినవారు. క్రీ.శ. 1063
1. వీరసుందర బ్రహ్మరాయభాడు, చోళరాజు. పుట 369
2. వీరశిఖామణి వల్లరాయడు. ,, 372
3. త్రిభువన వీరదేవరాయరాజు. ,, 373

వేదాంత దేశికుల సమకాలికులు : క్రీ. శ. 1268 - 1369

1 అక్షోభ్యమునులు. పుట 591

2. విద్యారణ్యులు (మాధవ విద్యారణ్యస్వామి). పుట 591

గ్రంథకర్త శ్రీ నంబూరి కేశవాచార్యుల సమకాలికులలో ఆర్కాటునవాబు ప్రసక్తి గలదు. పుట 622

**కొన్ని సాంఘిక విషయముల ప్రస్తావనము :**

ఆళ్వారుల చరిత్ర మొదలుకొని గ్రంథాంతమందుగల ప్ర.భ.అణ్ణంగారి చరిత్రవరకు గల జీవిత కాలమును పరిశీలించినచో, దేశచరిత్ర-సంస్కృతి యను గ్రంథముల నధ్యయనముజేసి సమన్వయపరచుకొనచో ఎన్నియో నూతనాంశము లిందు తేలును. దగ్గరదగ్గరగా క్రీ.శ. 5 లేదా 6 లేదా 7వ శతాబ్దము మొదలుకొని 15 వ శతాబ్దాంతము వరకు 1000 సంవత్సరముల నంచనా వేయవచ్చును. ఇన్ని సంవత్సరములలో జరిగిన దేశచరిత్ర - సాంఘిక విషయములను ఇన్ని, అన్నియని లెక్కగట్టుట కష్టము.

కాన, ప్రస్తుతము ఆ.సూ.ము. లోని కొన్ని అంశములను గైకొని సాంఘిక జీవనముతో సమన్వయము గావింతును. సాంఘిక జీవనములో గూడ బహుళ విషయములుండును. వ్యక్తిగతమైనవి. సామూహికమైనవి. ఆచారము, సంప్రదాయము, అలవాట్లు, ఆహార పానీయములు, మతము, విద్య - మంత తంత్రములు మొదలగునవి. కవికిగల సామాజికావగాహనమున కివి దృష్టాంతములు.

నాడు రాజుల పరిపాలన గనుక ఎక్కువ ప్రాధాన్యత రాజులదై యుండును.

"రాజులు - ప్రజలు - ఆచార్యులు - గురువులు, వ్యవహారవేత్తలు - అధికారులు"- వీరందఱకును అవినాభావ సంబంధములుండును గదా!

కొన్ని ఉదాహరణములు :

1. రాజులనుబట్టి ప్రజలు మతమును మార్చుకొందురు.

విఠలదేవుడు. యతిపతి నాశ్రయింప, ప్రజలు, రాజగురువులును చివరకట్లే చేసిరి. పుట. 263.

2. రాజు మంత్రిమండలి - సలహాదారులను సమావేశపఱచును. రాజ్యాంగనీతుల ఆదరణము గలదు. ఢిల్లీ సులతాను చరిత్ర.

3. శిక్షలు : రాజాజ్ఞ ధిక్కారమునకు శిక్షలుండెడివి. పుటలు 282-284 విప్రనారాయణులు, తిరుమంగై యాళ్వారు, కాంచీపూర్ణుల చరిత్రల జదువుడు.

**2. ఆచార్యపీఠస్థుల విషయము :**

పరమతఖండనము, స్వమతస్థాపనము, లోకోజ్జీవనము నాటి మతకర్తల ఆశయముగానున్నట్లగుపించును. ఎవరి మతమును వారు రక్షించుకొందురు. అందులకై వాదయుద్ధములు గూడ జరుగును. రాజసభలో పండిత వాగ్వివాదములు గూడ జరుగుచుండెడివి. ఉదాహరణమునకు విష్ణుచిత్తులు పాండ్యరాజు సభలో పరతత్త్వనిర్ణయముచేసి విద్యాశుల్కమును గెల్చుకొనెను.

1. రామానుజులు యజ్ఞమూర్తితో 18 రోజులు వాదయుద్ధము గావించి చివరకు తన మతమును స్థాపించి గెలిచెను. (పుట 181) ఇట్లే

2. పరాశరభట్టరు వేదాంతిని జయించెను. (పుట 361)

3. వేదాంతదేశికులు ప్రతివాదుల జయించిరి. (పుట 576)

**3. వైవాహిక జీవితము :**

1. ఇరువురు భార్యలను చేసికొను ఆచారము గలదు. 1. శ్రీ పరాశర భట్టరుకు, వేదాంతికిని ఇరువురు భార్యలు గలరు.

2. వరుని ఎన్నుకొను విషయములో కుమార్తెల భావములను తల్లిదండ్రులామోదించిరి.

1. గోదాదేవి కథ, 2. ధర్మవరుడను రాజు కుమార్తె కథ, 3 ఢిల్లీ సులతాను కుమార్తె కథ నిదర్శనములు.

3. పెండ్లిండ్ల వేడుకలు ఘనముగా జరుపబడెడివి. తెలుగువారి పెండ్లిండ్ల ఆర్భాటములు, అలంకరణములు, ఊరేగింపులు, అరణములు, అప్పగింతలు, ఇంకను పెండ్లితంతు లన్నియును గలవు.

4. పెండ్లిండ్లలో వేశ్యల మేళములు, భగవంతుని ఊరేగింపులలోను ఇవి కొనసాగెడివి.

4) పెండ్లి కుమార్తె పెట్టిన నియమముల ప్రకారము వరుడు శపథము చేసి పెండ్లి చేసికొని వాగ్దానములు నెరవేర్చెదరువారు

ఉదా॥ పరకాలుడు కుముదవల్లిని పెండ్లాడుట.

తదీయారాధన వృత్తాంతము - పుట 56.

5) భార్యయుండగనే సన్న్యాసాశ్రమము స్వీకరించెడివారు.

1. రామానుజుల సన్న్యాస స్వీకారము పుట. 169
2. గోవిందుడు (ఎంబారు కవి) ,, ,, 180
3. వేదాంతి ,, ,, 366

వీరందఱును విశ్వకల్యాణమునే తమ ధ్యేయముగా నెంచి ఈ తురీయాశ్రమమును స్వీకరించిరి.

**3. మంత్ర తంత్రముల విషయములు :**

1) రామానుజులను చంపుటకు విరోధులు అభిచారిక హోమమును తలపెట్టిరి. (పుట. 215)

2) గ్రహముల బాధను పోగొట్టుటకు తంత్ర, మంత్ర, యంత్రముల ప్రయోగించువారు.

ఉదా॥ విఠలరాయని కుమార్తె గ్రహబాధ. (పుట. 260)

**4. ఆహారములు - పానీయములు :** వంటకముల వర్ణనల జూడనగును. పుటలు : 127, 250, 254, 603, 604.

**5. దైవభక్తుల శక్తి అసాధారణము :** పవిత్రతకు చిహ్నము.

1) కాంచీపూర్ణులు కంచివరదునితో ముచ్చటలాడువాడు.
2) రామానుజుల స్వస్వరూప మహిమలు ప్రసిద్ధములే.
3) కృష్ణమాచార్యులు శ్రీహరిని గూడ శపించినాడు. పుట. 225

## 13. ఇందలి సంకేతములను గూర్చి

ఈ కవి ఆయా సందర్భములలో కొన్ని సంకేతముల ద్వారా విషయమును, వాస్తవమును స్ఫురింపజేయు కళాత్మకమైన రచన గావించినాడు. ఇట్టి సంకేతములు సైగల ద్వారా, చేష్టలద్వారా, శరీర కదలికలద్వారా నిరూపింపబడవచ్చును. వస్తురూపములోను, మాటల రూపములోను తేటతెల్లము జేయవచ్చును. కొన్ని సంజ్ఞలను, గుర్తులను చూపి స్ఫురణకు తెప్పింపవచ్చును.

కవితా వాదములలో ప్రతీకవాదముండుట (SYMBGLISM) గమనింపవలసిన విషయము,

**అర్థవివరణము :** నైఘంటికార్థము : 1. ఆంధ్రశబ్ద రత్నాకరములోనిది.

**సంకేతము :** పేరు, అభిధేయము; ఏర్పాటు, నియమము, ఒడబాటు, సమ్మతి, సయిగ, సంజ్ఞ, కాముకులు కలిసికొనుట కేర్పరచు కొని తావు; చిఱునామా.

2. ఆంగ్ల నిఘంటువునుండి :

Webster's New Collegiate Dictionary:

SYMBOLISM: 1. The art of or practice of using symbols esp. By inserting things with a symbolic meaning or by expressing the invisible or intangible by means of visible or sensuous representations as—

a) The use of conventional or traditional signs in the representations of divine beings and spirits.

b) Artistic imitation or invention that is a method of revealing or suggesting immaterial, ideal or other wise intangible or states.

2) The system of symbols or representations.

**సారాంశ మేమన :** తెలిసిన విషయముల ద్వారా, దృశ్యమాన పదార్థముల ద్వారా తెలియని వాటిని స్ఫురింపజేయు విధాన మవలంబింపవచ్చును. లేదా మాటలు, చేష్టలు, సైగలు, గుర్తుల ద్వారా తెలుపు విధానమవలంబింపవచ్చును. ఇట్టి విషయములను కళాత్మకముగా నుండునట్లు కవి తన రచనమును కొనసాగించుట సర్వసమ్మతముగా నుండును.

**ప్రతీక భేదములు :** శాస్త్రసంకేతములు, కావ్యసంకేతములు. కావ్యసంకేతములు రసభావబోధకములు. భాషాసారళ్యమునుబట్టి ప్రతీక బహువిధములుగా నుండవచ్చును. ఇవి సాధారణముగా మతసంబంధియై యుండును.

**ప్రతీక ప్రయోజనములు :** 1. To interpret a theme (వస్తు వ్యాఖ్యానము) 2. To make it acceptable (వస్తువును అంగీకారయోగ్యము జేయుట) 3. To escape (అపసరణము) 4. To awaken dorment or suppressed expenence. 5. అలంకారములకు సంబంధించినవి.

అ.సూ.ము. సంకేత విషయముల నర్థము చేసికొనుటకివి తోడ్పడును.

## సంకేతములు - సైగలు - ప్రతీకలు

**సంకేతములు : గుర్తులు :**

1) తిరుమంత్రార్థంబు - భోగమండపము
2) చరమ శ్లోకార్థంబు - పుష్ప మండపము
3) మంత్ర రత్నార్థంబు - త్యాగ మండపము

వీనికి ప్రమాతలు ఎవరనగా : (పుట 119).

1 శ్రీ పాణియోగీంద్రులు,
2. అభిజ్ఞులు.

**వస్తువులు - పోలికలు :**

సమస్య : వైష్ణవుడెట్లుండవలయును? (పుట 138)

1. సైంధవము వలె
2. బకము వలె
3. చరణాయుధము (కోడి) వలె
4. నీవలె (సాత్త్వికుని వలె)

**అర్థ సమన్వయముద్వారా మాటల కర్థము చెప్పుట : అక్షరములకు** దేవతల గుర్తులు సమస్య - "తస్య యథేత్యాద్యుదారశ్రుతి" పుటలు 165, 215 రామానుజుల వివరణము.

కపి=సూర్యుడు; ఆసమ్=వికసించు, అతనివల్ల వికసించునది నేత్రమ్ము, దానివంటి కనులు; కం=జలము, ఆ జలమును గ్రోలువాడు సూర్యుడు అనగా కపి, ఆసమ్=వికాసము, అతనివల్ల వికసించునది పుండరీకము, బాల సూర్య భాను సద్య స్ఫుటత్వావన పుండరీకము బోలు కన్నులు.

**సమస్య :** 'కాంచీపురము'నకర్థము వచ్చుటలో గల సంజ్ఞలు. (పుట : 559.) క='క' పదము బ్రహ్మవాచకము. ఇతడు పరమ పూరుషుని గూర్చి ఈ స్థలములో పూజ లొనర్చెను. గాన నా పురము "కాంచి" యయ్యెను.

సమస్య సందర్భము : రామానుజులు గావించిన స్తుతి. పద్మనాభ స్వామిని సేవించు సందర్భము. విమానాగ్రభాగమునందువెల్గు కనకమయరత్న విగ్రహమునుగాంచినపుడు అన్నమాటలలో సంజ్ఞలు.

"వాచ్యమీ బ్రహ్మము, వాచకమీవేద
మీ విమానము జ్ఞానమీ శిఖరము
అన్యోన్యసంబంధులగు మూడువస్తువు
లిచ్చోట నెలకొన్నవిట్లు నిజము." (పుట 209)

1. వాచ్యము=బ్రహ్మము, 2. వాచకము=వేదము, 3. జ్ఞానము=శిఖరము.

**చేష్టలు : సైగలు :** శరీరకదలికలు ద్వారా అర్థబోధ :

**సమస్య :** ఆత్మకాచార్యులెందరను ప్రశ్నకు ధనుర్దాసుని భార్య చూపిన సంకేతములు : రామానుజాలా గూఢార్థముల వివరించుటలు. (పుటలు 189, 190)

| | సైగలు | సమాధాన వివరణలు |
|---|---|---|
| 1. | కొప్పువిప్పుట, విదిర్చుట, ముడివేయుట | ఆ పూర్తియొకనికే. |
| 2. | తొగరుదారము జా(గ)ట్టుట | అతనిగా మముజూపె |
| 3. | ద్యుమణిజూచుట, మ్రొక్కి | గురుదేగతి |
| 4. | ఇలుసొచ్చుట, వాకిలిమూసి | ఇంతకంటేమి లేదు. |

చివరిమాటలు : దానికేమి తెలియను. గురుదె మీ కెఱుకపఱచు.

**సంజ్ఞలు గల కోవెలలు :**

"పుష్ప - త్యాగ - భోగ-జ్ఞాన మండప సంజ్ఞలు గలవి" : 1. శ్రీరంగము 2. శ్రీవేంకటాద్రి 3. హస్తిశైలము 4. యదుశైలము.

పాదముల, పదముల జోడించుటలో గల సంకేతములు :

**సందర్భము :** తిరునగరి వీధిలోని ఒక బాలిక; తిరునగరి నుండి తిరుప్పళ్ళుంగుడి ఎంత దూరమను రామానుజుల ప్రశ్నకా బాలిక 'తిరువాయిమొళి'లోని రెండు పాటల కొనపదముల జోడించిన తెలియుననెను.

**సమస్య :** "కొడువినై ప్పడగళన్" పదో పాటలో 'కూపు లిత్యాది' కొన పదములు వరకు తొమ్మిదొపది తిరువాయిమొళి నుండి - వరకు **From - to** =

పాశురములోని 4 పాదములను మొదటి నుండి చివరివరకు చదివినచో పట్టు కాలము 1 లేదా 2 నిమిషముల సమయము - కూత పెట్టు దూరము.

ఆటల, పాటలలో పదములకు కల్పితములగు అపార్థ చిహ్నములు :

విద్యార్థు లాటలాడుకొనుచు ఈ మాటలనగా యతిపతులు వినిరి. (పుటలు 243, 244)

1. ఆడియాడియనగా ప్రతి ఆషాఢమాసము నందు

2. నగంగరైందు - దండివర్షము.

కిరశారికల చదువు : తిరువసంతపురములో (పుట 207) :

"భళినద్రైవం కేళవాత్సరమ్."

ఈ పేర్లు వీరికే చెల్లునను గుర్తులు : ఇట్టివి పెక్కులు. ఉదా॥

1. ఎంబెరుమానారు = రామానుజాచార్యులు
2. ఎంబారు = గోవిందుడు
3. వేదాంతి = నంజియ్యరు
4. లోకాచార్య = పిళ్ళ లోకాచార్యులు
5. కవితార్కికసింహుడు = వేదాంత దేశికులు

**సంకేతములద్వారా హితము :**

వ్యక్తులను, స్థలములను సూచించుట ద్వారా-

1. ఆత్మకేది తంజము? (పుటలు - 373, 374).

భట్టరు సమాధానము → హరినెఱుంగుట; తదీయులు = అనగా భాగవతుల నెఱుంగుట.

2. వీరవల్లవరాయనికి → మనస్సు ఉనికి పట్టుగా నుండుటెట్లు?

భట్టరు సమాధానము. (పుటలు. 373, 374)

"దక్షిణ సింధుతీరమున నీ చిత్తముంచుము."

భావము : రావణ వధకై నుద్యమించిన శ్రీరామచంద్రుడు సముద్ర తీరమున రాత్రి ఇసుకలో నిద్రించిన తన పరివారమును గాపాడినాడు. కాన, అతడే తంజము.

3. పాండ్యదేశీయ వైష్ణవునకు → (పుటలు. 397)

నంబిళ్ళ సమాధానము పైవిధమునసే గలదు.

"దక్షిణాబ్ధి తటంబె తంజము."

ఒక కార్యమును చేయుచు ఫలితాంశముల గ్రహింపజేయు పద్ధతి : క్రియల ద్వారా సంకేతములు :

1. పేయాళ్వారుల క్రియలు :

**సమన్వ** : భక్తిసారులను శ్రియఃపతి కనుకూలునిగ జేయుటకు(పు.540) పేయాళ్వారుల పని :

"ముసల మొక్కటినాటి పొసగదానికి శత
చ్ఛిద్ర ఘటంబుతో జీవనీయ
మెత్తగాజూచి భృగువంశ్యు డిట్టి
విఫల యత్నమేటికి జేసెద?'' వనెను.

2 'పిన్బళహరాన్ పెరుమాళ్ళ జియ్యరు' తాను అస్వస్థులైయుండ, తన శిష్యుల నిరువురిని బిలిచి వారితో ''మురవిరోధి పాదపద్మములందు ప్రపత్తిసల్పు దనుచు జెప్ప వా రట్లొనర్ప నతనికి జబ్బు నయమయ్యెను. అపుడు కొందరు నంబిళ్ళతో 'పలునాళ్ళు మనలతో ప్రపత్తి సేయించినాడేల? అతని భావమేమి?' అని యడుగ నాతడు ఆచటి దేశికులను తమకు తోచిన యభిప్రాయముల దెలుపుమన, వారు తలకొక్కక రీతిగా దెలిపిరి. ఇది ''ఇతరున భావముల నూహించు సంకేత మనదగును.'' వారు సరిగా చెప్పలేకపోయిరి. పుటలు 388, 389.

చివరకు జియ్యరే తన యభిప్రాయము నెఱింగించెను.

''నంబిళ్ళగారు అభ్యంజనస్నాన మొనరించిన పిమ్మట, అతనికి వీవన వీచుచు ముఖమండలంబు నందలి ఘర్మకణముల నివారించుటకు'' ప్రపత్తి సేయించితిననెను.

**తర్క సంకేతములు** : (వాదము సేయునపుడు చిక్కు సమస్యలు) ఆళ్వందారు వైభవములో గలవు (పుట 97)

1. వసుధ యుష్మన్మాత వంధ్య గాదు.

2. ఈ రాజా ధర్మాత్ముడు.

3. ఇతని ధర్మపత్ని పతివ్రత.

# పారిభాషిక పదములు

శ్రీ వైష్ణవ సంబంధ పదజాలము-పారిభాషిక పదములు : వీరు విశిష్టాద్వైతులని సులభముగా గుర్తించుటకు కొన్ని పదములు గలవు. అవి సంస్కృత-తమిళ సమ్మిశ్రితములు. శ్రీ వైష్ణవులే అధికముగా వాడుకొందురు. కాన, ఈ పనములను శ్రీ వైష్ణవ సంకేతము లనవచ్చును. ఆ.సూ.ము. లోనివి - ద్రావిడ పదసంకేతములు - ముఖ్యములైనవి:

| | పదములు | | అర్థములు |
|---|---|---|---|
| 1. | తిరువాల వట్టము | - | సద్వైష్ణవులు భగవత్సన్నిధానమునకువచ్చినప్పుడు కట్టునట్టి శిరోవేష్టనము. స్వాగత పద్ధతి. మాలికాసమర్పణము చేసి, శఠకోపమిచ్చి తోడ్తెత్తురు. శ్రీ స్వామివారికి ధరింపజేసి తీసినట్టియు, భక్తులకు సన్మానముగా నొసగునట్టిదియు నగు పవిత్ర వస్త్రము. |
| 2. | తిరుమాల | - | దివ్య మాల్యము |
| 3. | తిరువడిత్తామరలు | - | పాదపద్మములు |
| 4. | తిరుమాళిగ | - | ఆచార్యుని యిల్లు |
| 5. | తిరువారాధన | - | భగవదారాధన |
| 6. | తిరుమేను | - | దివ్యమైన శరీరము |
| 7. | తిరుప్పళ్ళి | - | తిరుప్పళ్ళి-తిరుప్పళ్లాని - దర్భశయనము |
| 8. | తిరువంశము | - | గొప్ప వంశము |
| 9. | తిరునామము | - | ఊర్ధ్వపుండ్రము, పేరు, నామము |
| 10. | తిరుమణి | - | వైష్ణవులు ధరించు శ్వేతమృత్తిక |
| 11. | తిరుచూర్ణము | - | వైష్ణవులు ధరించు శ్రీచూర్ణము |
| 12. | తిరుమాలె | - | వనమాల, ఆకులు, పువ్వులు చేర్చి కట్టిన తోమాలె |
| 13. | తిరుమట్టపల్లి | - | శ్రీ స్వామివారికి నివేదనము చేయు పదార్థములు వండెడు చోటు |
| 14. | తిరునందన వనము | - | తులసి పుష్పముల తోట |

15. తిరువుళ్ళము - మంచి మనస్సు
16. తిరుమణిత్తావళములు - శ్వేతమృత్తిక, జపమాల (తులసీమాల)
17. తిరుకల్యాణము - శ్రీ కల్యాణము
18. తిరుచుట్టు మాలె (లియ) - దేవాలయమున చిన్న దేవతల నుంచుటకై ఆవరణము చుట్టు కట్టిన కట్టడము
19. తిరుపవిత్రములు - మిక్కిలి పవిత్రములు
20. తిరు వధ్యయనము - సంవత్సరీకార్థము, ఆబ్దికము
21. తిరు పవిత్రోత్సవము - పెరుమాళ్ళ యుత్సవము
22. తిరుమంత్రము - అష్టాక్షరీ మంత్రము
23. తిరువడిగ(ళు) - శ్రీ పాదములు
24. తిరుమంజనము - తిరుమజ్జనము, స్వామివారికి చేయించు అభిషేకము
25. తిరుబోనము - భోజనము
26. తిరునోవు - వేదన, వ్యాధి
27. తిరుముడి - జడలుగా అల్లుకొనిన జుట్టు
28. ఏకాంతి - మోక్షార్థి, వైష్ణవ భక్తుడు. శ్రీమన్నారాయణుని తప్ప ఇతర దేవతల పూజింపడు. ఐహిక సదాచారముల (good things of this life) కోరుకొనును.
29. పరమైకాంతి - పైవారిలో నితడు జ్ఞాని. Among them the man with janana
30. ఏకదండి - ఒకే కఱ్ఱ చిహ్నము గలవాడు - అద్వైతి.
31. త్రిదండి - మూడు కఱ్ఱల చిహ్నము గలవాడు- విశిష్టాద్వైతి.
32. ఏకాంగులు - అవివాహితులైన వైష్ణవ సన్యాసులు.
33. వ్యాపక మంత్రములు - "ఓం నమో నారాయణాయ, ఓం నమో భగవతే వాసుదేవాయ, ఓం నమో వైష్ణవే". Omnipresent or all prevading

## ఆ. సూ. ము. లో పేర్కొనబడిన తమిళ పాశురములు - మరియు సంస్కృత న్యాయములు, శ్లోకముల సంగ్రహము

కవి యీ గ్రంథములో సందర్భానుసారముగ (కథాగమనమునకు తోడ్పడునట్టి) సంస్కృతశ్లోకములను, న్యాయములను బహుళముగా ప్రయోగించి ప్రతిపాద్యాంశములకు సమర్థనముల నుడివినాడు. అట్లే తమిళపాశురభాగములను వాడుకొన్నాడు. కాని పూర్తిపాశురములను వ్రాయలేదు. గ్రంథమంతయు వెదకినచో 35 వరకు పదప్రయోగములు కన్పించును. గ్రంథములనే పేర్కొని నాడు గాని విభాగముల పేర్లను తెలుపలేదు. పాశురములకు అనువాదములుగాని అర్థవివరణములుగాని సేయలేదు.

ప్రస్తుత మొకటి రెండుదాహరణముల నొసంగి, పట్టికరూపములో పాశురభాగములు - గ్రంథముపేరు, సంఖ్యల పేర్కొందును.

**గ్రంథ ప్రారంభదశలోనే పేర్కొనబడిన పాశుర భాగములు :**

సందర్భము: పొయగై పూదప్పే యాళ్వారుల వైభవము: పుట: 5. ముప్వురాళ్వారుల మధ్యజొచ్చి ఒరపిడి గావించిన శ్రీమన్నారాయణుని జూచి స్తుతించిరి. ఇట్లు సన్నుతించి లోకోపకార్థంబుగా—

1. 'వయ్యందగళియా' అనియు,

2. 'అన్బేద గళియా' యనియు,

3. 'తిరుకణ్డేన్ పొన్ మేని కండేన్' యనియు నుపక్రమించి సర్వాధికారంబగు (బులగు) మూడు ప్రబంధంబు లానతిచ్చి ముప్వు రమ్మహాత్ములిట్లు లోకానుగ్రహంబొనర్చిరి.

వీరి స్తుతులు కవితాగుణాలంకార శోభితములు.

2. 'ఆరావముదే' తిరువాయిమొళి, పాశురము 5 శతకము 8 దశకము 1 సంఖ్య మరియు 5 శతకము 8 దశకము 11 సంఖ్య పాశురములు (పత్తు) ఇట్లే గ్రహించునది. (పుటలు 80.)

**సందర్భము :** శ్రీమన్నాథమునులు నాలాయిర ప్రబంధమును కూర్చుటకు మూలకారణమైన సన్నివేశము. ప్రేరేపణోత్సాహములకు హేతువైనది అసలు విశిష్టాద్వైతస్థాపనోద్యమ ప్రారంభమునకే 'నాంది' యన నొప్పును.

"ఆరావముతే యడియే నుడలుమ్, నిన్పాలంబాయే,
నీరాయిలైందు కరై యవుర్క్కు నిన్ఱ నెడుమాలే,
శీరార్ శెన్నెల్క వరివీశుమ్, శెఱునర్ తిరుక్కుడన్దై
ఏరార్ కోలమ్, తికళక్కిడందాయ్, కండేనెమ్మానే"

తా॥ నీ సౌందర్యాదుల నెంత యనుభవించినను తృప్తికల్గింపని అమృతము వంటి స్వామీ! నిన్ను చూడగనే నా శరీరము పరవశమై నా మనస్సు నీరై కరగిపోవుచుండును. నాతో మాటాడకుండ కుంభకోణములో పవ్వళించి యున్నావు గదా! నీ యలంకారము సేవింపగనే యెంతటివారి మనస్సైన కరుగకమానదు. ఎఱ్ఱధాన్యపుకంకులు చామరమువలె గాలి వీచుచుండునది సుమీ యీ దివ్యక్షేత్రము.

**తమిళ పాశుర భాగముల పేర్ల సూచిక :**

ఇందు: తిరువాయి మొళినుండి 12, నాచ్చియార్ తిరుమొళి నుండి 1, తిరుప్పావైనుండి 1, పెరియాళ్వార్ తిరుమొళి నుండి 1, మొదల్, ఇరండామ్, మూన్ఱాం తిరువందాదులు నుండి ఒక్కొక్కటి, ఇతరములు 10, 15 వరకుండును.

సంజ్ఞలు = శతకము - దశకము - వరుస సంఖ్య.
(పత్తు)
5 - 8 - 1 ఇట్లు గ్రహింప

**I తిరువాయి మొళిలోనివి :**

| | | | పుటలు |
|---|---|---|---|
| 1. | ఆరావముదే, | 5-8-1 | 80 |
| | ఓ రాయిరత్తుళిప్పత్తు | 5-8-11 | ,, |
| 2. | కెడువిడరాయ వెళ్ళామ్ | 10-2-1, 10-2-8 | |
| | నడుమినోనన మర్గశుళ్ళర్నాము మక్కరి యచ్చొన్నోమ్ | | 102 |
| 3. | శూళ్ విశుంబణి ముహి | 10-9-1 | 120 |
| 4. | కొడువిడై పడగల్-కూపుదల్ | - 9-2-10 వ | |
| | | పాశురము మొత్తము | 203 |
| 5. | తేవుమేప్పొరుళుంబడైక్క | 2-3-4 | 110 |
| 6. | ఒరునాయగంబ | 4-1-1 | 270 |

సందర్భము : మణవాళ మహామునులు [illegible] కాలక్షేపము సేయు నపుడు ఈ వాక్యార్థ వివరణమును దేవరాజు గురునిచే (ఎరుంబియప్పా) బడసి సందేహమును నివారించుకొనెను.

"అర్థము : జ్ఞాన చతుర్థులపై గదా ఆనంద షష్ఠ లుదయించును."
(శ్రీమాన్ కందాడై శేషాచార్యులుగారి వివరణము - 1927. పుట 36.)

4. ఆర్తి ప్రబంధము, మణవాళ మహామునులు - పుట 531. "వాళియతిరాజున్" అను పాశురము మొదలుకొని'' "ఇందవరంగ" అను పాశురము వరకు. యతిరాజ నామాంకితంబుగా విన్నవింప నది ''ఆర్తి" యను ప్రబంధ మయ్యెను.

5. "అరుళప్పాడిడ నాయండేన్" అనుచు శ్రీ వైష్ణవులు నిటంతట ఘటితాంజలిపుటులగుచు విచ్చేసిరి. పుట 336.

6. "ఉలగముండ పెరువయిననెడు నొక తిరువాయి మొక్కుడీ వ్యాఖ్య వత్రములన్నియు బయలుజెంది యెరుపెక్కి ఝురముపైనేతేడ పుట 405.

7. "ఇరుకరయరు'' అని వడుగనంబి వ్రాకుచ్చెను. పుట 344

8. "గొడుమశైయనియును" (భట్టనాథోక్తి) రామానుజులు గురుగాథ చదివి ఇసుకను చల్లించెను. పుట. 249. పెరియాళ్వార్ తిరుమొళి శెన్నియోజ్గులోనిది.

9. "నాంగయిల్ పాయ్ వయల్ తెన్నరంగన్" పుట 533.

సంస్కృత న్యాయములు - శ్లోకభాగములు:

I పద్యములలో ప్రయోగింపబడినవి - కొన్నిమాత్రమే.

1. 'అహమన్న మహమన్న మనుచు' నూరులు గొల్వ. పుట : 1

2. 'సర్వమయా సన్యస్త'మని వల్కి యావరదుని చరణాబ్జములకు.
169

3. 'తస్యయథేత్యాద్యుదార' శ్రుతికి వానరాక్షుడు హరియర్థమనిన. పు165

4. ప్రణవో ధనుర్శను ప్రవబలోపనిషదుక్తి. పు. 181

5. 'ఇట్లు వైశ్వామిత్ర మేర్పరించెదు'. 185

6. 'నదైవం కేశవాత్పరమ్'; "సర్వం విష్ణుమయం"; "దాసోస్మి". పు207

**వచనములలో పేర్కొనబడిన న్యాయములు :** (కొన్ని మాత్రమే శ్లోకభాగములు)

| | | పుటలు |
|---|---|---|
| 1. | 'శాసనాత్ శాస్త్రమ్' | 2 |
| 2. | కృష్ణానాం వ్రీహీనాం నఖచ్ఛిన్నమ్ | 14 |
| 3. | నా కించుత్కురు శేషత్వమ్ | 22 |
| 4 | ధర్మ జ్ఞానమయః వేదాశ్చ | 22 |
| 5. | తత్త్వజ్ఞానాన్మోక్షః | 22 |
| 6. | యతోవా ఇమా | 23 |
| 7. | ఏకోహవై నారాయణ ఆసీత్ | 23 |
| 8. | ధిక్కులేన దురాత్మనా | 44 |
| 9. | జ్ఞానీత్వాత్మైవ మేమతః (గీత) | 45 |
| 10. | "ఏవముక్త్వా తుమాతఙ్గం రాక్షసశ్శరణంగతః" | 51 |

**ఇతర కవుల "ఆళ్వారాచార్యుల గ్రంథములకు" 'ఆచార్య సూక్తిముక్తావళి' కిని కథాంశములలో గల పోలికలు, భేదములు :**

ఒకటి రెండింటిని వివరింతును.

గైకొన్న గ్రంథములు : ఇవి జీవిత చరిత్రలను దెలుపు కావ్యములు.

1. ప్రామాణికమనబరగు "ప్రపన్నామృతమ్" సంస్కృతము.

కవి. అనంతార్యులు క్రీ శ. 1554-1614

2. ద్విపద పరమయోగి విలాసము. గొప్ప వైష్ణవతత్త్వకావ్యము.

కవి. తాళ్ళపాక చిన్నన్న క్రీ. శ. 1498-1561

I **సమన్వ :** ముదలాళ్వారులను గూర్చిన కథ : (వారి కలయిక సన్నివేశము.)

1. 'ప్రపన్నామృతమ్' శ్రీ గోపాలాచార్యుల వారి ప్రచురణ. 1984. నడిగడ్డపాలెం. (పుట 79)

**శ్లోకముల సారాంశము :** "శ్రీమన్నారాయణుడు శ్రీవామనక్షేత్రమున నొకప్పుడు తలవని తలంపుగ గొప్ప వర్షమును కల్పించి వారి ముగ్గురను మిక్కిలి చీకాకు పరచెను అంతట కాసారయోగీంద్రులు వర్షముచే తడిసి ఖిన్నముగ తిరుకోవలూరునకేగుదెంచిరి. వారప్పుడు బ్రాహ్మణ మందిరద్వారమున

శయనించిరి. పిమ్మట భూతయోగియు, ఆ పిమ్మట మహాయోగియు విచ్చేసిరి. ఈ ముప్వురు నిలిచియే యుండిరి. ఇంతలో వారిమధ్య విష్ణువు వచ్చిచేరెను.

50-58 గల శ్లోకముల సారాంశమిట్లు గలదు:

"దేహళీం నగరేతేషాం - త్రయాణాం సుగతింవ్యధాత్"

"తయోర్మధ్యగతో విష్ణుశ్శంఖ చక్రగదా ధరః"

**ద్విపద పరమయోగి విలాసము :** టి.టి.డి. ప్రచురణ. 1938. పుటలు 36, 37.

కవి : తాళ్ళపాక చిన్నన్న.

ఇందును యోగిత్రయ సమ్మేళనము గలదు. మరియు మహావృష్టివర్ణన అధికముగా గలదు. ఆది యోగీంద్రుడు అంధకారములో "నొకనికి కూర్చొండి యుండగజాలు - నొక చిన్నగేహళి యుండంగజూచి" అచట నిలిచెను. పిమ్మట ఇరువురాళ్వారులు వచ్చుటగలదు.

**ఆచార్య సూక్తి ముక్తావళి :** పుట 4.

**పోలికలు :** యోగిత్రయసమ్మేళనము తిరుక్కోవలూరులో.

"గ్రామైక రాత్రులగుచు, సంచరించుచు ముప్వురా

సత్త్వనిధులు, కూడిరొకరాతిరిని తిరుక్కోవలూర

చిన్నదైనట్టి యొక పంచె తిన్నెనను చు"

అని గలదు. విష్ణుదాసనామము పరస్పరము తెలిపికొని పరిచయము గావించుకొని నిల్చొనియుండిరి. పిమ్మట నాల్గవ వ్యక్తి విష్ణుమూర్తి వారిమధ్య నొరపిడిగావించెను.

**భేదములు:** ఇందు వర్షప్రసక్తిలేదు. ఒకరి యింటిపంచెతిన్నె మీదికి చేరిరి.

**సమన్వ్య :**

II తిరుమళిశయాళ్వారుల జన్మవృత్తాంతము : కథ.

1. ప్రపన్నామృతము : పుటలు : 91-97.

ఇందులో భార్గవ మహర్షి తపస్సు చేయుటయు, కనకాంగి యను వేశ్య తపోభంగము గావించుటయు, అతనితో క్రీడించుటయు గలదు. ఈమె భార్గవుని పత్నిగా గూడ ఇందు పేర్కొనబడినది.

పిమ్మట ఆమె గర్భమును ధరించుటయు, మాంసపు పిండమును గనుటయు పేము వెదురు పొదరింటిలో వదలి వెళ్ళెననియు గలదు. గ్రుడ్డు నుండి వెలువడిన గరుత్మంతునివలె మాంసపుముద్ద నుండి సరియగు కాలమున పిల్లవాడు తనపైనున్న ఆవరణమును ఛేదించుకొని వెళ్ళెను.

ఇట్లు యోగీంద్రులగు భక్తిసారులు ఒకచోట పుట్టిరి. ఇతనిని మేదరివాడొకడు జూచి తన యింటికి తీసుకొనిపోయి పెంచుటవల్ల మేదరివాడుగా మరొకచోట పెరిగిరి.

ఆ.సూ.ము : పుటలు : 5, 6.

**పోలికలు:** మాంసపు ముద్దరూపము; మేదరివాని. ప్రసక్తి జన్మాంశము సుదర్శనాంశము. తండ్రి: భార్గవముని.

**భేదములు :** కనకాంగి యను వేశ్య పేరిందులో లేదు. భార్గవముని తన ధర్మపత్నితో (పేరు లేదు) శౌరికల్పితముగ సత్రయాగమను 'దీర్ఘసత్రము' నతిభక్తి నెరవేర్చుటయుగలదు తద్ధర్మపత్ని సౌదర్శనాంశ గర్భము దాల్చినది. ''నెలలేగ పదునొండు మఖతారకను, పుష్యమాసమునను, 'పిండముల్బావృతము' గని బెదరి, ప్రేప పొదరింటి నడుమబెట్టి వచ్చి'' భర్తృశుశ్రూషణమును జేసినది. సిరి, హరి కృపచే బాలకుడు రక్షింపబడి 'తిరువాళరను' ప్రేపదువ్వల నరకువానికి దొరికినట్లు గలదు.

**గమనిక :** మణిప్రవాళశైలి - సంస్కృతము + తమిళము గల గ్రంథము "గురుపరంపరా ప్రభావమ్''—

దీనిని నంబిళ్ళ శిష్యుడగు ''పిఞ్ఞళగియ పెరుమాళ్ జీయరు'' (క్రీ.శ. 1300 ప్రాంతము) వ్రాసిరి. ముదళాళ్వారుల నుండి నంబిళ్ళ వైభవము వరకు గల మూలకథను, అంశములనీ కవి 90% అనుకరించినాడని తెలియుచున్నది. పరిశోధకులు పరిశీలింపవలసినదిగా ప్రార్థనము.

## ఆ.సూ.ము పై తెలుగు కవుల ప్రబంధాదుల ప్రభావము : అనుకరణములు

ఆ.సూ.ము. ని వ్రాసినకవి శ్రీమాన్ నంబూరి కేశవాచార్యులు. వీరు మత సంప్రదాయాది శాస్త్రగ్రంథములను సంపూర్ణముగా నాకళించుకొనుటయేగాక కవితావైభవ మహోదధిని మధించి మధించి ఆచార్యరుచి పరిగ్రహీతములైన

విషయములను, విశిష్టాద్వైత వేదాంతసారామృతమును వెలికిదీసి భక్తదాసకోటి కందించిన సుకవి మూర్ధన్యుడు.

ఈ ప్రబంధమును రచించునపుడీ కవి ప్రాచీనాంధ్ర కవుల వాగ్వైభవము, కవితారీతులు, పదగుంభనము, వర్ణనములు, శైలి మొదలైనవాటిని అనుసరించినట్లు ఆ.సూ.ము.ని చదువునపుడు మనకు ద్యోతకమగుచుండును.

**ఈ కవిపై ప్రభావముద్ర అధికముగా వేసిన గ్రంథములు :**

1. ఆంధ్ర మహాభాగవతము - అత్యధిక ముద్ర వేసినది - (తెలుగు - సంస్కృతము)
2. ఆముక్తమాల్యద (తెలుగు)
3. మనుచరిత్ర (తెలుగు)
4. వాల్మీకి చరిత్ర (తెలుగు)
5. భారతము (సంస్కృతము)
6. పారిజాతాపహరణము మొదలైన గొప్ప కావ్యములు.

**గమనిక :** ఈ కవి ఇతర కవుల స్తుతి చేయలేదు. కాన ఇతని అభిమాన కవుల నిర్ణయము పాఠకులకే పరిమితము. ఇతడు మడికి సింగన కవి పద్మ పురాణమును గూడ పరిశీలించియుండవచ్చును. ఇది విష్ణు పారమ్యము గలది.

**వివరణములు :**

**1. ఆముక్తమాల్యద :**

"స్వామీ నన్ను **ఇతః పురాపతిత శాస్త్ర జ్ఞాన జాత్యంధు, నా**
**రామక్ష్మా ఖనన క్రియా ఖరఖనిత్ర గ్రాహితోద్యత్కిణ**
స్తోమాస్నిగ్ధ కశున్ భవద్భవన దాసున్నాదిగా బంపుచో
భూమీ భృత్సభ నోటమైన నయశంబుల్ మీకు రాకుండునే." (2-91)

ఆ.సూ.ము : లో ఇదే భావమిట్లు గలదు. పెరియాళ్వారుల వైభవము పుట 23.

వచనము : ఆ హరికి విష్ణుచిత్తుండిట్లనియె:

"సర్వవేదాంత ప్రాతిపాద్య **వేదశాస్త్రాధ్యయనాది జనితజ్ఞాన వాసనా హీనుండనగు** నేను విద్యాశుల్కంబైన యిద్ధనంబు **పుష్పవన ఖనన జనిత స్వపాణితల కిణగణంబు** జూపి తేవలయుగాని వేఱొక యధికారంబునం గొనలే

**స్వప్నప్రబోధములు :**

ప్రబంధములలో కవులకు దైవము కలలో సాక్షాత్కరించి కర్తవ్య ప్రబోధమును సేయుట సామాన్యమైన విషయమే. పోతన కవీంద్రునకు, శ్రీకృష్ణ దేవరాయలకు, రఘునాథభూపాలకునకు స్వప్నప్రబోధము జరిగినట్లే ప్రతివాది భయంకరం అణ్ణం గారికిని జరిగినది.

**భాగవతము :**

"మెఱపుచెంగటనుండు మేఘంబు కైవడి
ఉవిద చెంగటనుండ నొప్పువాడు"

..........................................................

(ప్రథమస్కంధము - 16)

**ఆ.సూ.ము. 596 వ పుట :**

"అంజనపుంజమో హరినీల శైలమో
యనజాలునీలక యంబువాడు,
సజల మేఘమునందు శంపాలతబోలె
గలిమి చేడియ బోర గలుగువాడు."

ఇందు పద్యపునడక గూడ భాగవతమును బోలియున్నది.

2. 'శ్రీరామచంద్రుడు' రఘునాథ భూపాలకునకు కలలో కనబడి "వాల్మీకి చరిత్రను" వ్రాయించుకున్నాడు. (1-18).

ఆ సూ. ము. లో అణ్ణంగారిని "వేంకటాచలనాథుడు" తన శ్రీపురికి పిలిపించుకున్నాడు (596 వ పుట)

**వర్ణనాదికములు :**

వాల్మీకి చరిత్రలో సప్తర్షులు ఏ యే తీర్థముల నెట్లు దర్శించిరో వర్ణింప బడినది. అట్లే ఆ. సూ. ము. లో అణ్ణంగారు దర్శించిన పుణ్యక్షేత్రముల వర్ణనము గలదు. ఇందు మనకు సామ్యములు, పోలికలు కన్పట్టుచుండును: పోతన పెద్దనగారల పద్యములను గూడ పేర్కొన వచ్చును.

**వాల్మీకి చరిత్ర :**

''చనిచని కాంచిరంత హరిచందనభూరుహ చారువాటికా (2-51)
''కననయ్యెన్ పురరత్నమొక్కటి........'' (2-17)
"అంతంగాంచిరి........" (2-24)

''అనఘమతుల్. ......" (2.41)

"కనిరంతన్........" (2.83)

**మనుచరిత్ర :**

"అటజనికాంచె...." (2.3)

**భాగవతము :**

"కనియెన్ రుక్మిణి.... .."

ఆ. సూ. ము. :

''చనిచని గృధ్రపుష్కరిణి........" (277 వ పద్యము)

"కనియెన్ వత్సకులామృతాంబునిధి రాకాచంద్రుడద్దేశికుం డనఘప్రాంశు ........" (282 వ పద్యము)

పోతనగారి ఈ క్రింది వచనమును తొమ్మిది పాళ్ళనుకరించినాడు.

**గజేంద్రమోక్ష ఘట్టము - వృక్షముల పేర్లు :**

"మాతులుంగ, లవంగ, లుంగ, చూత, కేతకీ, భల్లాతకామ్రాతక...." అను వచనము.

ఆ. సూ.ము.లో ఈ పేర్లు గలవు. శైలియు నిట్లే గలదు.

"మాతులుంగ, మాకంద, మందార, తాల, తమాల, హింతాల, రసాల, సాల, జంబు, జంబీర్యాది....'' (పుట 110)

199 వ పుటలో వృక్షసంపద వర్ణనము గలదు:

''ఆ తామ్రపర్ణిమహానదీ తటమున
సంపూర్ణ కలమాది సస్యములును,
నారికేళవనాళి, నాగవల్లీవృత
పూగీవనంబుల బొగడ తరుల
.... .... .... .... ''

''తాల, తమాల, తక్కోల, హింతాల, రసాల, సాల, కదంబ, సరళ, వకుళ, చంపకాశోకపున్నాగ చందనాది క్రమపుష్ప పల్లవ నమ్రశాఖ శాఖులను జూచె సంయమివరుండు...." (పుట 213)

**ఇతర గ్రంథములపై-ముఖ్యముగా పద్యకావ్యములపై ఆచార్య సూక్తి ముక్తావళి ప్రభావముద్ర :**

ప్రచీన కావ్యముల ప్రభావము ఆ సూ.ము. పై నున్నట్లే ఆచార్య సూక్తిముక్తావళియును కొన్ని విశిష్టాద్వైత పద్యకావ్యములపై, ఇతర సాహిత్య ప్రకియల

గ్రంథములపై తన ప్రభావముద్రను వేసినది. కవులుగూడ తమ తమ గ్రంథములను ఆ సూ.ము. ననుసరించి ప్రబంధములనియే పేర్కొన్నారు.

**1 ముముక్షుజన కల్పకము (ప్రచురణ, 1972) :**

కవి శ్రీ ఆచ్చి రామానుజాచార్యులు. (100 సం॥ లకు పూర్వమిది ముద్రితమైనట్లు గ్రంథపీఠికలో గలదు. ఇట్లు కవి జీవితకాలమును 1872 వరకూహింపవచ్చును)

అనుకరణము లిట్లు గలవు :

**1. గద్య :**

''ఇది ముముక్షుజనకల్పకంబను మహాప్రబంధంబు నందు....''

ఇందు ఆ.సూ.ము. వలె మహాప్రబంధమను సమాసము వాడబడినది. ఇది ద్రవిడవేద సంప్రదాయజ్ఞులు పాటించునట్టి ఉత్కృష్టమైన పదబంధము. పిమ్మట ఆ.సూ.ము. వలె విషయసూచిక విభజనాంశములు వరుసక్రమముగా వ్రాయబడినది.

**2. కృతివక్త సంప్రదాయము :**

ఆ.సూ.ము. లో కృతివక్త వాదిభీకర గురుడు. సీసపద్యములోని తేటగీతి చివరిపాదమే మకుటము.

''వాదిభీకర గురుడనె మోదమలర!''

ముముక్షు జనసంకల్పమునకు :

కృతివక్త : లక్ష్మణాచార్యులు సీస పద్యములలోని చివరి పాదము మకుటము - వక్త చెప్పినారను భావమును సూచించునది. గణములు, యతుల ప్రకారము కొలది మార్పు. గ్రంథము మొదటి పద్యము మకుటము :

''ధ్యేయుడని చెప్పె లక్ష్మణదేశికుండు....''

3. ఆ.సూ.ము. బృహద్గ్రంథము. అసంఖ్యాకములైన పద్యములు, వచనములు గలవు 90% సీస పద్యములే.

ముముక్షుజనకల్పకము చిన్న గ్రంథము. అన్నియు సీసములే. సంఖ్య= 256. వచనములు లేవు.

**4. అనుకరణ పద్యములు :**

ఆ సూ.ము. : గురుపరంపరను తెల్పునది, రూపకాలంకారము.

"శ్రీసఖ జలధి సుస్థిర కృపా సలిలంబు,
  గ్రోలి శఠారాతి కాలఘనము
........ ........ ..... .. ........ ....."

(ఉదయవరుల వైభవము పుట. 157)

**ముముక్షుజనకల్పకము :**

గురుపరంపరనే తెల్పునట్టిది. రూపకాలంకారమే—

"సర్వేశ్వరుండను జలధి లోపలనున్న
  కల్యాణ గుణగణాకార జలము,
శఠకోపయోగీంద్ర జలదంబు దాగ్రోలి,
  కొనివచ్చి నాథాద్రి గురియ నదియు
... .... ........ ........ ........ ........
ప్రాణి సస్యంబుపై బారబండు కర్ష
కాత్మనాథుని కని లక్ష్మణార్యులనిరి." (ద్వితీయ ప్రకరణము-5)

**2. శ్రీరామానుజాభ్యుదయము :**

**3. శల్వపిళ్ళ రాయచరిత్ర :**

అముద్రితములు. కవి శ్రీ మరింగంటి వేంకట నరసింహాచార్యులు. (1680 లేదా 1770.)

ఈ కవి ఆ.సూ.ము.ని అనుకరించినట్లుగా డా. రంగాచార్య తమ పరిశోధనా గ్రంథము "మఱింగంటి క"వులసాహిత్యసేవ - ప్రబంధములు పుట 145, 172 లో పేర్కొన్నారు.

**4. నరసింహతాండవము : (హరికథ)**

కర్త : శ్రీ నల్లాన్ చక్రవర్తుల కృష్ణమాచార్యులు. ఆ సూ. ము.ని దీనికాధారగ్రంథముగా పేర్కొన్నాడు.

"ఘనుడు నంబూరు కేశవార్యుని ప్రబంధ
మొక్కటియె దీనికాధారముపరి సింహ
గిరి వచనములొక్కింత యాదరువు నయ్యె."

**5. సుల్తానీ కళ్యాణం : (యక్షగానము)**

కవయిత్రి : ముడుంబై అలమేలు మంగతాయారమ్మ. బీబీనాంచారు కథ ఇతివృత్తం. ఇది ఆ. సూ. ము ఆధారంగా రచించిన యక్షగానం.

(తెలుగు అకాదమి తెలుగుసాహిత్యకోశము II పుట : 5.)

## 16. ప్రకీర్ణము - మిగిలిపోయిన నానావిధ విషయములు :

**మకుట ప్రయోగము - వాది భీకర గురుడనె మోద మలర :**

తెలుగు పద్యరచనలలోను, వచనములలోను విన్నపములలోను మకుట ప్రయోగము కానవచ్చుచున్నది గాని. కావ్యములలోను, మహా కావ్యములలోను ఈ ప్రయోగము కానరాదు. ఉదా॥ సుమతి శతకాదులు, వేంకటేశ్వర వచనములు మున్నగునవి.

నంబూరు కేశవాచార్యులవారు ఏ యుద్దేశముతో నీ మకుట ప్రయోగము గావించెనో ఊహించుట కష్టము. కాని ఒక విషయము స్పష్టమగుచున్నది. అదేమనగా: కృతివక్త వీరి స్వాచార్యులు. ఆచార్యుని యందు గల భక్తిని ఆచార్య ప్రపత్తిని ఇట్లు నిరూపించుకొన్నాదేమో యనిపించును. ఆచార్యస్తుతిని చేయవచ్చును గదా! ఇట్లేల చేసినాడన్నచో: రు "వాదభీకర గురుడనె మోదమలర" అని చెప్పుట నొక్కి వక్కాణించుట వంటిదగునని యూహ సేయుట కవకాశమున్న దన వచ్చును. ఐనను ఇట్లు చెప్పుట వల్ల ఒక పాదములో చెప్పదలచుకున్న భావమునకుగాను కొన్ని మాటలు లోపించుట జరుగును. మూడు పాదములతోనే తృప్తి పడవలసి యుండును. శతక ప్రక్రియలో మకుటమును చదువుటవల్ల ఒక యనుభూతి జనించును. విసుగుండదు. కాని కావ్యములలో నట్లు గాదు. వైవిధ్యముండవలయును.

ఏమో! ఇట్లు మహా కావ్యములో మకుటము నుపయోగించుట ఒక క్రొత్త ప్రయోగమేమో!

"నిరంకుశాః కవయః"

**2. అష్టదిగ్గజ సంప్రదాయము** : తెలుగు సాహిత్యములో అష్టదిగ్గజకవుల సంప్రదాయము కడు ప్రసిద్ధము. రాజకీయ ప్రభుత్వ స్థానానికి చెందిన వారు వీరు.

ఇట్లే ఆచార్య పీఠాధిపతులు తమ సాన్నిహిత్యములో తత్త్వ ప్రచారాదులకు అష్టదిగ్గజముల నేర్పరచుకొనువారు. శ్రీ మణవాళ మహాముని, శ్రీ నయనారు దేశికులును అష్టదిగ్గజముల నేర్పాటు చేసికొనినారు. వీరందరు ఉభయవేదాంతులు. పండితులు. ఆచార్య పురుషులు.

రామానుజుల పరివారములో అష్టదిగ్గజములుండెడివారను ప్రచారము గలదు. అందులో వటుకనంబి యొకరని ప్రతీతి.

**3. ఇందలి లాక్షణిక దోషములను గూర్చి :** గ్రంథము యొక్క ఉపోద్ఘాతములో నిట్లు గలదు. "ఇందు కొన్ని లాక్షణిక దోషములు గలవు కాని ప్రతిపాద్య విషయమునకు గల వైలక్షణ్యముంబట్టియు, నుజ్జీవకములైన తక్కిన విశేషంబులంబట్టియు నా దోషములంతగా నాదరణీయములు గావు."

దోషములనగా ఉపోద్ఘాతకర్త దృష్టిలో వ్యాకరణాంశములగు సంధులు-సమాసములు గావచ్చును. ఛందో విషయములు గావచ్చును.

ఈ గ్రంథములో ఛందస్సుకు సంబంధించిన గణ యతిప్రాసాది దోషములు (ఒకటి రెండు తప్ప) కానరావు.

ఇక సంధుల, సమాసముల విషయమున కొన్ని విపరీత ప్రయోగములుండవచ్చును. కావ్యరసాస్వాదనదృష్టికవి ఆటంకములుగావు.

**4. కావ్య విషయము :** ఇది స్వతంత్ర కల్పనా కావ్యముగాదు సంఘములో జీవించిన ప్రసిద్ధాళ్వారాచార్యులకు సంబంధించిన విషయముగల చంపూ రచనము. మూల సిద్ధాంతములలో, వాస్తవ సంఘటనలలో మార్పులు సేయరాదు. పదముల అమరికలోనే కవి చాతుర్యమును జూపవలసి యుండును.

ఇందలి వర్ణములలో కొన్ని చర్వితచర్వణములనిపించునవిగ నున్నవి. ఎందుకనగా - దాదాపు 21 మంది ఆళ్వాచార్యులు వివిధ స్థలములలో జన్మించినారు. దివ్యదేశముల దర్శించినారు గాన, పుణ్యక్షేత్రములు, పట్టణములు, అష్టాదశ వర్ణనములలోని కొన్ని అంశములు ఒకేరీతినున్నట్లనిపించును. ఐనను కవి తన వాక్యవైవిధ్యముల జూపి, ప్రతి యంశమును క్రొత్తగనే గదువుచున్నట్లుగా స్ఫురింపజేయుచు గ్రంథమునంతయు పరమరమణీయముగా నొనర్చినాడు.

ఇందలి శాస్త్రవిషయముల క్రోడీకరణమును జూచినచో నితడు శాస్త్రకవి యనిపించును. కవికిగల వేదాంత ప్రతిభ తెలియును. సామాన్య పాఠకునకివి

అందునట్టివిగావు గాన, కొంత క్లిష్టత జనించవచ్చును. విసుగు గూడ గలుగ వచ్చును. కాని, పరిశోధకుల మెదడుకిది మేతవంటిది.

కొన్ని తావుల శృంగారరసము, వర్ణన ఔచితిని మించినది. 'బాగు' అని పించదు. కవి సంస్కృత పదాడంబరమును వాడినందున 'శృంగార కేళి' కప్పి పుచ్చబడినది.

గమనిక : (వర్ణనలవైభవములో వివరములు వ్రాసినాను.)

ఆ. సూ. ము. ప్రసక్తి :- రాజకవి బహరీ రాఘవపామ నాయకుడు వ్రాసిన తెలుగు చంపువు భార్గవ పురాణము. ప్రచురణ **A P. G. O M.L, 1986.** దీని **Preface** లోను, పీఠికలోను ఆ సూ. ము. పేరు గలదు. ఈ రాజకవి పన్నిద్దరాళ్వారుల స్తుతి గావించినాడు.

## పాత్రచిత్రణము

ఆ. సూ. ము ఒక శ్రవ్యకావ్యము. దీనిని కవి మహాప్రబంధముగా పేర్కొనినాడు. ప్రబంధముల కంటగట్టబడిన లక్షణములనుబట్టి చూచినచో ఇందు పరిమిత పాత్రలు లేవు పరిమిత పద్యములు లేవు ఏకకథానాయకాశ్ర యముగాదు. వస్త్వైక్యము లేదు. ఐనను ఇది ప్రబంధమే ద్రావిడ సంప్రదా యము ననుసరించి ఈ పదము తెలుగులో వ్యాప్తినందినది. కవి సంప్రదాయ జ్ఞుడుగాన మహాప్రబంధమను పదమును వాడుకొన్నాడు. జీవితచరిత్రల సంపుటీ కరణగల కావ్యము గాన ఒకే కథానాయకుడుండుటకు వీలులేదు. కథాసంవిధా నము వేరుగా నుండును. ఇది కల్పితకథాకావ్యముగాదు. చారిత్రక కథాకావ్యము. కాని, నిశితముగా పరిశీలించినచో ఇందురామానుజులు కథానాయకుడగుచున్నాడు. కథానాయిక పాత్రము లేదు.

ఇందు ఆళ్వారాచార్యుల చరిత్రలు, వీరి సంబంధములు పెనవేసికొని యున్నవి. విడదీయరానివి (link) ఆచార్య పరంపర అనుబంధములట్లు సాగి నవి. గ్రంథము పేరునకు తగినట్లుగా ఇందు ఆచార్యుల ప్రాధాన్యత, వారి సూక్తుల ప్రసక్తియే కావ్యము ఆద్యంతముల నందుకొని అంతర్వాహినిగా ప్రవ హించు వస్త్వైక్యముగలదియైనది

వ్యక్తుల గొప్పదనమును, నడవడి, దినచర్యనుబట్టి గుణశీలములుండును. ఇందలి వ్యక్తులు అనగా ఆళ్వారులు, ఆచార్యులు, వారి శిష్యవర్గము పేరు (Topic)ను బట్టియే వీరు మహనీయులు, పావనీయులై, పవిత్రచరిత్రలను

ఇందు స్త్రీ పాత్రలు పరిమితములు. ఇందులోను అతి ముఖ్యములు పది గలవు.

ఇక పురుషపాత్రలసంఖ్యాకములు. ఐనను ఆళ్వారుల, ప్రసిద్ధాచార్య పురుషుల సంఖ్యలను లెక్కవేసినచో 30, 35 వరకు వచ్చును. ఇతర చారిత్రక వ్యక్తుల పేర్లను కలిపినచో 40 సంఖ్యను దాటుచున్నది. (గ్రంథబృహత్ స్వరూపములో అన్నిరకముల సంఖ్యావివరముల నిచ్చియున్నాను.)

## స్త్రీ పాత్ర చిత్రణము

(వీరి జీవితచరిత్ర కథలు గ్రంథస్థ విభాగములో వ్రాసినాను.)

ఇందలి స్త్రీపాత్రలను గమనించినచో మానుషాతీత వ్యక్తులుగా కన్పట్టువారు ముగ్గురు : 1. ఆండాళ్. 2. ధర్మవరుదను రాజు కుమార్తె 3. బీబీ నాచ్చియారు. ఈ ముప్వురు పెరుమాళ్ళను పెండ్లి చేసికొన్నవారే. ఆండాళు అన్నచో ఆళ్వారు స్థానము నాక్రమించినది. బీబీనాంచారు (మోహనాంగి) మహమ్మదీయ మతస్థుడగు ఢిల్లీశ్వరునకు పెంపుడు కుమార్తెయై పోషింపబడుచు యాదవాద్రివతియగు సంపత్కుమారుని పరిష్వంగములో లీనమైపోయి, అతనినే పెండ్లియాడినది.

వీరందరిది అమలిన శృంగారమే. వీరియందు అమాయకత్వము, భగవంతుని పొందుటకై పడు తపన, మధురభక్తి గోచరించును. ఇక కేవలము మానవ కాంతలుగ నుండి విశిష్ట వ్యక్తిత్వము గల్గినవారు కొందఱున్నారు. ముప్వురు గృహిణులు, ఇద్దరు వేశ్యలు.

**గృహిణులలో** : 1. పరిత్తికొల్లై నాచ్చియారు (కార్పాసారామలక్ష్మి), 2. కొంగుపిరాట్టి (చేలాంచలాంబ), 3. పొన్నాచ్చియార్ (హేమాంగి).

వీరు ఆచార్య ప్రపత్తికి ప్రతీకలు. ఉత్తమ సాధ్వీమణులు. ఇందులోను పరిత్తికొల్లై నాచ్చియార్ (కార్పాసారామలక్ష్మి) పేరు ముందు పేర్కొనవలసియుండును. భర్త పేరు వరదుడు. ఈ దంపతులు రామానుజుల శిష్యులు. ఈమె తన ధన (ధనము లేదు), మన, శరీర ప్రాణములను ఆచార్యునకే అంకిత మొసంగినది. తనను కామించిన ధనమదాంధునికి "మేనమ్మి కనిధనంబు గురుని పూజింతునని యెంచినది" (మేనమ్మకట జరుగలేదు).

వేశ్యలలో ఇరువురు గలరు:

1) దేవదేవి

2) రంగనాథ మాణిక్యాభిధాన యను దేవదాసి.

ఇందులో దేవదేవి శృంగార నాయిక. పందెము వేసి తొండరడిప్పొడి యాళ్వారులనే మరులు కొలిపిన జాణ. ఐనను భగవద్భక్తిగల పవిత్రచరిత్ర. ఆళ్వారుల, పెరుమాళ్ళ కైంకర్యమే పరమావధిగా గలది. ఇచటను అమలిన శృంగారమే కన్పించును.

ఇక రంగనాథ మాణిక్యాభిధాన యగు దేవదాసి. దేవదేవిని మించిన త్యాగమయ శృంగార రసాధి దేవత. శ్రీరంగ పదము నుద్ధరించుటకై తురుష్కుడగు ప్రభునికి తన అందమును ఎరగా జూపి, శరీర లావణ్యముచే భ్రమింప జేసి, వానిని వెల్ల గోపురమెక్కించి, క్రిందికి పడద్రొబ్బి, తానును పడమటి తట్టున బడి ప్రాణముల వీడినది. అర్చిరాది మార్గము నాశ్రయించి పరమ పదమును జెందినది.

## పురుష పాత్రలు

ఇందలి పురుష పాత్ర లసంఖ్యాకములు. ఐనను ప్రత్యేకముగా పేర్కొన వలసిన వారుందురు గదా! అందులో ఆళ్వారులు పన్నెండుగురు. ఈ పన్నెండు గురితో అన్ని కులముల వారున్నారు భగవద్గుణానుభవమే వీరి జీవిత సర్వ స్వము ఇందులోను తిరుప్పాణాళ్వారులు అంత్యజులై జన్మించి, తన జన్మ సరి హద్దును తానే తెలుపుకొని, దానిని మీరకుండ శ్రీరంగనాథుని కీర్తించుటలో తన్నుతానే మరచిన ధన్యజీవి. సుకృతాత్ముడు.

శఠకోపులు (నమ్మాళ్వారులు) శూద్రులై జన్మించి, ద్రవిడ వేదము నందించి, ద్వాదశ సూరుల కాత్మయై నిలిచినవాడు గదా! నాథమునులు వీరిని "ద్వాదశాత్మనిగతి, ద్వాదశస్వరూపుని, నా శఠకోపమునిని' గాంచి పొగడినాడు.

ఇట్లే ఆళ్వారులందరి చరిత్రలలో ప్రత్యేక విలక్షణత్వము గోచరించును.

ఇక రామానుజులను గూర్చి చెప్పవలసినదేమున్నది? వారి చరిత్రను పొగడుట కాదిశేషునకైన నలవిగాదు. (మరి వారే ఆదిశేషాంశ సంభూతులు గదా!) భగవద్రామానుజులుగా, జగద్గురువులుగా లోకవిఖ్యాతి నందినారు

(ఆళ్వారులందఱును చారిత్రక పురుషులే. ఐనను మానవాతీత వ్యక్తులుగా

రామానుజుల పిమ్మట ఆచార్యపరంపరల ఇరుతెగల పరంపర (వడగల-తెంగల) పట్టికను వ్రాసినాను. పరిశీలింపనగును.

1. పరాశరభట్టరు, వేదాంతి, నంబిళ్ళ, పిళ్ళలోకాచార్యులు విద్వదంశ, భగవదంశలు పుంజీభవించిన మహాచార్యులు. విశిష్టాద్వైత చరిత్రలో వీరికి ప్రత్యేక స్థానము గలదు.

2. శ్రీ మణవాళ మహామునులు సాక్షాత్ రామానుజుల యవతారమే యని పేర్కొందురు, వీరి కాలక్షేపములలో వైష్ణవధర్మ సంబంధ సందేహము లెన్నియో తొలగిపోవును. ఇట్టి కాలక్షేప వైభవము వర్ణనాతీతము. వీరి కాలక్షేప ముల విని శ్రీరంగనాథుడే స్వయముగా బాలక బ్రహ్మచారి రూపములో వచ్చి "శ్రీశైలేశ దయాపాత్రం-" తనియ విన్నపము చేసినవాడు.

3. శ్రీ వేదాంత దేశికులు శ్రీ వేంకటేశ ఘంటావతారులు. కవితార్కిక సింహులు. తనకెన్నియో బిరుదులున్నను శత్రువులకు లొంగనివాడు. కాని, భగవద్భక్తులకు దాసుడు. వినయశీలి. (వైష్ణవులలో గూడ గిట్టని వారుందురు గదా!) ఒకప్పుడు కొంద అభిజ్ఞులు ఇతని గృహప్రవేశద్వార తోరణమునకు చెప్పులు (పాదుకలు) - వ్రేలాడదీయగా అవి అతని తలకు తాకినవి. వారప్పుడు నుడివిన శ్లోకము కడు ప్రసిద్ధము:

"కర్మావలంబకాః కేచిత్, కేచిత్ జ్ఞానావలంబకాః
వయస్తు హరిదాసానాం, పాదరక్షావలంబకాః.''

## గ్రంథ మూల్యాంకనము - విలువలు

మూల్యాంకనమనగా గ్రంథము నన్ని విధములుగ, అన్ని దృక్కోణము లతో నిశితముగ పరిశీలించి, సహృదయ విమర్శగావించి, అంశముల విభాగించి, విషయమును విశ్లేషించి ఫలితాంశముల నివేదించుట.

ఉదాహరణమునకు భారతము : ఇది ధర్మశాస్త్రము, వేదాంతము, నీతి శాస్త్రము, ఇతిహాసము, పురాణ సముచ్చయము, లక్షణ గ్రంథము. ఇట్లెన్నియో అంశములిందు స్ఫురించును. వీటన్నింటికి విలువగట్టుట ''విధాతృనకైనను నేర బోలునే'' అని యనిరి.

అట్లే ఆ.సూ.ము.ని పరిశీలించినచో ఇందులో మనకు ఆళ్వారుల, ఆచా ర్యుల పవిత్ర జీవిత చిత్రణము కనిపించును. గ్రంథ బృహద్స్వరూప పట్టిక

గ్రంథ రచనములో నిమిత్తము లేకున్నను పైవారి చరిత్రలు ముఖ్యముగా శ్రీవైష్ణవులకు నిత్యపారాయణములు. ఆళ్వారులందఱును సత్కవీశ్వరులు. ఆచార్యులు గూడ అధికముగా రచయితలు, కవులు, కాలక్షేపములు చేయువారై, ఆచార్య పదమునకు ప్రమాణభూతమై నిలిచినారు.

ఇచట గమనింపవలసిన అంశమేమనగా - జీవితములు మహనీయములైనవి. గ్రంథరచన శైలి, రీతి, వాక్యనిర్మాణ పద్ధతి, వివరణ అనగా కావ్య నిర్మాణ ప్రతిభ[1] మహాప్రబంధమువలె సాగినది. చదువరులకు అందరానిదిగాగాక, అందదగినదై, స్పష్టమై, సరళమై (శాస్త్ర నిరూపణాంశములు తప్ప) కావ్యలక్షణముల కనుకూలమైనదిగా రూపొందినది.

ఇందలి కథలను చదివినచో మన మనస్సులలో నిలుచునదేమి? చిట్టచివరి వరకు జీవితాంతమువరకు స్థిరపడు భావమేమి? ఏ గ్రంథమైననుసరియే. దానిని చదివిన పిమ్మట ఇట్టి ప్రశ్ననే వేసికున్నచో వచ్చు జవాబు:

ఆచార్య ప్రతిపత్తి, భగవద్భక్తి, భగవద్గుణానుభవనము. మలిన భావముల ప్రక్షాళనము. కులము, పుట్టుక, చదువు ప్రధానముగాదు; గుణము, సౌశీల్యమే ప్రధానమని తేలును. ఇందుకు ధనుర్దాసు వృత్తాంతము గొప్ప దృష్టాంతము. రామానుజులన్న సూక్తులు.

1. "ఆత్మతత్త్వానభిజ్ఞుల యభిజనాదులడవిగాచిన వెన్నెలవంటి వనెను."

2 ''జ్ఞానమనుష్ఠానమేనరునకు గల్గు
వాడెపో పుడమి సద్వైష్ణవుండు."

## 18. కావ్య ప్రయోజనము

ఆచార్య సూక్తి ముక్తావళి ఒక విలక్షణమైన విశిష్టాద్వైత తత్త్వ మహా కావ్యము మహా ప్రబంధము.

---

1. "కవి ప్రతిభలోననుండు ఒ కావ్యగత శ
తాంశములయందు తొంబదియైన పాళ్ళు" (విశ్వనాథగారి పద్యము)
-సహృదయ చక్రము డా. సుప్రసన్నాచార్య, పుట 137.

కవి ఎన్నుకొన్న కథా వస్తువు (ప్రతిపాద్యము) మహా పురుషుల (ఇచట ఆళ్వారాచార్యుల) జీవితచరిత్ర. వివరించిన పద్ధతి కావ్య ప్రక్రియలో. పరమ లక్ష్యము - కావ్యానందము ద్వారా హితోపదేశము జేయుట.

గ్రంథ మవతరించినది గూడ జనులను కర్తవ్యోన్ముఖులను జేయుటకే; పరమార్థముల తెలియజేయుటకే.

**సందర్భము :** శ్రీమన్నారాయణుడు సంసారిచేతనులకున్న అభిజాత్య గర్వమును, అవిధేయ రాక్షస ప్రవృత్తిని గూర్చి విచారించి (శోకము-అంతర్మథనము) దానిని తొలగించుటకై ఆళ్వారాచార్యుల నవతరింపజేసెను. (కార్యక్రమ విధానము సర్వచేతనోద్ధారణ జేయుటకై.)

వారు సర్వలోకోపకారార్థముగా దివ్య ప్రబంధంబుల రచించిరి. (కావ్య సృష్టి) (ఆ.సూ.ము. పుట 3)

**సమన్వయము :** వాల్మీకి శోకము (అంతర్మథనము) నుండి శ్లోకము (కావ్య సృష్టి) జనించినట్లే ఇచటను భగవానుని అంతర్మథనము (శోకము, ఆలోచన, ప్రణాళిక) వల్ల వ్యక్తు లవతరించి కావ్యసృష్టి జేసిరి. ప్రయోజనము: లోకోపకారము. ఇది మూడంచెలుగా సాగినదన్నచో నా యభిప్రాయము ప్రకారము విశిష్టాద్వైతము ధ్వనించుచున్నది. సంఖ్యాదృష్టితో తత్త్వత్రయము, మంత్ర త్రయమును బోలియున్నది.

"విశ్వశ్రేయః కావ్యము" : ఇచట విశ్వశ్రేయస్సే కావ్యము యొక్క (ఆ.సూ.ము. యొక్క) పరమ ప్రయోజనమని తెలుచున్నది ఆంధ్రశబ్ద చింతామణి యందలి ప్రథమ శ్లోకమిట్లున్నది:-

''విశ్వ శ్రేయః కావ్యమ్
తదదోషౌ పరికృతౌచ వాగర్థౌ
సావాగ్యా రసవృత్తిః
సాధ్యో హి రసోయథా యథం కవిభిః."

మహా గ్రంథము లవతరించినదీ లక్ష్యముతోడనే గదా?

**మహాగ్రంథము** (Classic) : ఇట్లు ఆ.సూ.ము. ఒక మహాగ్రంథము వలె నున్నది. ఉత్తమ సాహిత్య సంపద గలది. (సారస్వత గ్రంథము=శాస్త్రాంశములున్నదిగాన)

ఒక మహాగ్రంథ మెట్లనబడునో యనుటకి క్రిందివాక్యముల గమనింపుడు:

A CLASSIC may be simply defined as a book which has stood the test of time, and by its stability and permanence, and the universality and persistency of its appeal, has given unmistakable assurence of immortal life."

—W.H. HUDSON.

"కాలము యొక్క పరీక్షకు తట్టుకొన్న గ్రంథము క్లాసిక్, స్థిరప్రకృతి సార్వకాలీనత, నిలుకడగల రక్తిజనకత అను తన లక్షణముల ద్వారా అమరత్వము సాధించినట్టి గ్రంథము. అదీ క్లాసిక్."1

ఉత్కృష్టమైన లక్ష్యములుగల, ఆచార్యపురుషుల పవిత్ర జీవితచరిత్రలు గల కావ్యవైభవ గ్రంథరాజము ఆ. మా ము. ఇది జన్మించి 200 సం॥లు మాత్రమే. వైష్ణవలోకములో బహుళప్రచారము నందినది. కాలపరీక్షకు తట్టుకొనుట భవిష్యత్తు నిర్ణయింపగలదు మిగిలిన క్లాసిక్ గుణములన్నియు ఇందు గలవు, మతవిషయములున్నవన్నచో దీనిని వైష్ణవ మహాగ్రంథమనవచ్చును. ఈ గ్రంథమును చదివిన పిమ్మట తీసి అవతల పారవేయలేము. మరల మరల చదువుదుము. ఫలితాంశముగా భగవద్గుణానుభవరుచులకు మరగెదము. ఇట్లు ఆత్మధర్మమును విలసితముజేయునట్టిది గ్రంథము.

"మహాగ్రంథం బహుముఖ వ్యక్తీకరణ సామర్థ్యం కలిగి ఉంటుంది. ఒక చదువరికో, ఒక కాలానికో సంపూర్ణంగా అవగాహన అయి, తర్వాత కాలానికి చెప్పదగిన అంశం అంటూ లేకపోయే పరిస్థితి ఆ రచనకు గల్గదు. కాలానికొక క్రొత్త భావస్పందం స్ఫురింపజేస్తూ, ఆయా వేళలకు అనుకూలంగా సజీవంగా తన ఆత్మధర్మాన్ని ప్రకాశింపజేస్తూ వుంటుంది. ఒక విధంగా భగవంతుని అవతార విశేషాలు ఎలాంటివో మహాగ్రంథం ఆయా కాలాల్లో స్ఫురించే భావ విశిష్ట రూపాంతరాలు అలాంటివే"2

పరమోత్కృష్ట లక్ష్యములుగలవాని నాచరణలోబెట్టి ఫలితాంశముల నందించుటయే కావ్యప్రయోజనము: ఇట్టితరి ఆ.సూ.ము.లోని రెండుదాహరణముల జూడుడు:

---

1. సాహిత్యభావలహరి. తెలుగు అకాదమి. పుటలు 40. మోనోగ్రాఫ్.
2. సహృదయచక్రము - శ్రీ సుప్రసన్నాచార్య. పుట : 2.

"సర్వజ్ఞుడై సర్వశక్తిసంపన్నుడై

సత్యసంకల్పుడై సర్వశేషి" అను పద్యమును జూచునది.

ఇందు లక్ష్యము సుస్పష్టమే. జ్ఞానోపదేశము.

ఇందులకై జగద్గురుత్వము : (పుట 158 లోని పద్యము)

"సర్వభూతోద్ధర్త జగదేకగురువర్య

లుదయవరేగాని యొరులుగారు,

సత్యంబు సత్యంబు శపథించి పల్కెద

సందియంబులు మాని చెందుడితని"

లక్ష్యము : జగద్ధితమైన జగదుద్ధారణ. అఖిలజను లితని శిష్యప్రశిష్యులయిరి. (ఈ వాక్యము నయనారుదేశికులు చెప్పినదని ఆ.సూ.ము.లో గలదు. కాని శ్రీ కణ్ణియనూరి సిరియాచ్చాన్ చెప్పినదని కొన్ని గ్రంథములలో గలదు.)

కావ్య ప్రయోజనము లిట ప్రస్ఫుటమైనవి.

అవి : చేతనోద్ధారణము, భూతోద్ధారణము, విశ్వశ్రేయము, లోక కల్యాణము, వ్యక్తిత్వ నిర్మాణము, సంపూర్ణ మానవ వికాసము. చెప్పెడి విధానములో మన నానందపరచుచున్నా డీ కవి.

ఒక మహాగ్రంథములో కేవలము వచనము, శాస్త్రాంశము లున్నచో - అవి కవిత్వగుణము కలిగియుండకపోయినచో చదువుటకు చప్పచప్పగా నుండును. ఆనందమయముగా, రసమయముగా, రమణీయముగా విషయమును సౌందర్య సంశోభలచే నలరించుట కవిత్వ లక్షణము. ఇది రచయిత, కవి చేసెడు కల్పనము. కవి చెప్పెడు విధానము. ఒకచో నవి నియమములకు కట్టుబడి యుండవు. వర్ణనలు కవి సృష్టియములు. ఈ క్రింది శ్లోకమును గమనింపుడు.

కావ్య ప్రయోజనముల నీ దృక్కోణముతో పరిశీలించుట సమంజసమే.

''నియతి కృతి నియమ రహితాం

హ్లాదైకమయీ మనన్య పరతంత్రాం

నవరస రుచిరాం నిర్మితే మాదధతి

భారతీ కవేర్జయతి.'' - మమ్మటుడు.

ఆ.సూ.ము. కవి ప్రతిజ్ఞగూడ, అంశములు కొన్నియు ఇట్టివే.

''అదర మొప్ప నాదు రసనాగ్రశుభాసన మధ్యవర్తియౌ
వాది భయంకరార్యుడన వద్య కృపాతిశయంబుచే నికన్
మీదటి గ్రంథమంత రసమృష్టపదాక్షర వృత్తపద్య స
మ్మేదుర భావమొందుగతి మేలుదయింప రచించు నింపుగాన్.''

**విశ్వశ్రేయస్సు - కావ్యప్రయోజనము దృష్టి - రసమృష్టపదాక్షర రచనము, దర్శనానందానుభూతి :** ఇట కావ్య ప్రయోజనము రసానందము గల రచన జేయుట. చవులూరింపజేసే రచనము : ఆందానుభూతి : ఈ క్రింది శ్రీరంగనాథ స్తుతి పద్యము పరమ రమణీయము. రసమృష్టపదాక్షర సమన్వితము. మొత్తము 7 పద్యములు గలవు; ఒకటి: శ్రీ వేదాంతదేశికులు శ్రీరంగనాథుని దర్శించి ఆనందతన్మయుడై స్తుతించిన విధము. పుట : 571.

లయగ్రాహివృత్తము :

"మేలిమగమీల నగజాలు వగగీలుకొను వాలుగను లీలగలబాలయురమేలన్
హేలనిలనీల రతనాల కడియాలుగల కేలుగవ మాలిమిగఁగాలుఁ
దములొత్తం
గాలఘనజాలహరి నీలసుతమాలములఁ గీలికొనజాలు రుచిశాలి
తనువొప్పన్,
లోలవనమాల శుచినీల శుభమూల ఫణిపాల తనుడోల జగమేలునినుం
గంటిన్."

ఇట్టి వర్ణనలు భగవద్గుణానుభవానందమునకు ప్రతీకలు.

**సాహిత్యోపదేశము :** సాహిత్యోపదేశములు పద్ధతులు : వివిధ లాక్షణికులు పేర్కొన్న కావ్యప్రయోజన లక్షణములు ఆ సూ ము. లో గోచరించును. కొన్నింటిని పేర్కొందును.

సాహిత్యోపదేశమును మూడువిధములుగా జేయవచ్చును. 1. వేదసమ్మితముగ, 2. మిత్రసమ్మితముగ 3. కాంతాసమ్మితముగా.

**1. వేదసమ్మితముగా :** ఇందలి వేదాంత రహస్యములు, మంత్రత్రయోపదేశములు వేదసమ్మితమువలె నుండును.

**ఉ॥** రామానుజులు మంత్రోపదేశమును బడయుట : (పుట : 173.)

"అతిగుహ్యమీ మంత్ర మన్యులకెవరికి
చెప్పరాదని నీకు చెప్పినపుడె
అట్లాచరించెదననిపోయి. ......"

**2 సుహృత్సమ్మితముగా :** (పురాణముల వలె) ఆచార్యులు శిష్యులకు ఆశ్రితులకు తెలుపు విధానములు, బోధనా పద్ధతులు వాత్సల్య పూర్వకముగా కొనసాగును. ధనుర్దాసు వృత్తాంతము వంటివి. శ్రీ పరాశరభట్టరు, శ్రీ నంబిళ్ళ బోధనా రీతులిందుల కుదాహరణము. ఉదా॥ భట్టరువారు వీరశిఖామణి వల్లరాయనికి 'మనస్సు నిల్కడగా నుండుటకు' చెప్పిన తీరు సంకేతముల పూర్వకమైనది. 'దక్షిణాబ్ధి తటమందు' దృష్టిని నిలుపుమనును.

**3) కాంతాసమ్మితముగా :** (కావ్యమువలె) మనుచరిత్రాది కావ్యములిందుల కుదాహరణములు. కవి కల్పనలతో, నవరసములతో పోషింపబడు కావ్య రచనలలోని ఘట్టములిందు చేరును. తిరుమంగై యాళ్వారుల చరిత్రలో వీర భయానక రౌద్ర బీభత్సాది శృంగార రసములు గలవు. తొండరడిప్పొడి యాళ్వారుల వైభవములో విషయము కాంతాసమ్మితమై తనరారుచున్నది.

**లాక్షణికుల కావ్యప్రయోజన నిర్వచనములు మరికొన్ని :**

1. "కావ్యం యశసేఽర్థకృతే
వ్యవహారవిదే శివేతరక్షతయే,
సద్యః పరనిర్వృతయే
కాంతాసమ్మిత తయోపదేశయుజే॥ —మమ్మటుడు

వివరణ :

కావ్యము వల్ల కీర్తి ధనము, లోకజ్ఞానము, శుభపరంపర సమకూరును. ఇంకను మించి ప్రేయసీ వలె మైమరపించే బ్రహ్మానందము, తద్వారా ఉపదేశము. (ఇచట ప్రయోజనములు = లాభాలు-కవికిని, సహృదయున కించుమించు సమానమే.)

అ.సూ.ము. లోని వర్ణనలు ఎన్నియో రకములుగా నున్నవి. వివిధ సన్నివేశములు వివిధానందానుభూతుల గలిగించును. తిరుప్పాణాళ్వారు వైభవములో భగవత్సందర్శనానందానుభవము గలదు. విప్రనారాయణ చరిత్ర, బీబీ నాంచారు కథలో శృంగార రసానందము కాంతాసమ్మితముగా నుండి పరమార్థో

రామానుజుల ఢిల్లీ విజయ ఘట్టములో, భట్టరు వైభవములో లోక జ్ఞానము స్ఫురించును.

ఆళ్వారాచార్యుల జీవితముల చదివినచో విశ్వమానవ కల్యాణ భావనలు గలుగును. అన్నియు శుభపరంపరలే.

ఇద ఆ.సూ.ము. గ్రంథకర్తకు- కీర్తియు, ధనప్రాప్తియు, ధనము నాత డనుభవించెనో లేదో తెలియదు గాని, అతని కీర్తి విశిష్టాద్వైత ప్రపంచములో చిరస్థాయిగ నున్నది. భవిష్యత్తులో నుండగలదు.

**2. ఉత్తమ కావ్యాధ్యయనం చేయడంవల్ల కలిగే లాభాలు :**

"ధర్మార్థ కామమోక్షేషు
వైచక్షణ్యం కలాసుచ
కరోతి కీర్తిం ప్రీతించ
సాధుకావ్య నిషేవణమ్॥ —భామహుడు

వివరణము : పురుషార్థములు : 1. ధర్మము 2. అర్థము 3. కామము 4. మోక్షము - ఇవన్నియు ఈ గ్రంథములో పోషింపబడినవి.

1. వైష్ణవ ధర్మములు (మానవ ధర్మములు గూడ) తెలుపబడినవి.

2. తదీయారాధనము, దేవాలయ నిర్మాణములు, కైంకర్యములు అర్థముతో ముడివడియున్నవి.

మఠముల నిర్వహణము, మతప్రచారము, దేశపర్యటనలు, తీర్థయాత్రలు సేయుటలు, ఆశ్రితులకు విధులు, బాధ్యత లప్పగించుటలు పరిపాలనారీతుల (admnistration) వ్యవహార, లోకజ్ఞానముల తెలుపునవిగ నున్నవి.

3. శృంగారరస ఘట్టములలో కావ్యానందము వరకే కామము గలదు. గృహస్థాశ్రమ విషయములో, సంసార యాత్రలలో కామము ధర్మబద్ధము. గృహస్థులు అతిథుల నాదరించుతీరు లోకోత్తరము. ఆచార్య పురుషులకును దారసుతాదులున్నారు.

4 ఇందలి ముఖ్య హితోపదేశమే ఆచార్య ప్రపత్తి ద్వారా మోక్షము. ఉదాహరణముల సంఖ్యాకములు.

**3.** "చతుర్వర్గ వ్యుత్పత్తేరపిచ అనందఏవ
పార్యంతికం ఫలమ్" —అభినవగుప్తుడు

ధర్మార్థ కామమోక్షాలనే నాలుగు పురుషార్థాల వివేకం కావ్యంవల్ల కలుగుతుంది. అయితే ఆనందం ఒక్కటే కావ్యం యొక్క ప్రయోజనం.

The purpose of Poetry is to teach and delight - Sir Philip Sidney.

ఉపదేశించుట, ఆనందపరచుట కావ్య ప్రయోజనములు.

ఇందు (ఆ. సూ. ము. లో) తాత్కాలికానందము, శాశ్వతానందము రెండును గలవు. శృంగార రసపోషణలో పతాకస్థాయికి చెందిన ఆనందము తాత్కాలికమై, చివరకు నిరతిశయ భగవద్గుణానందములో ఐక్యత జెందినది.

**ప్రత్యేక ప్రయోజనము - దేశభక్తి, జాతీయ సమైక్యత :** ఆళ్వారాచార్యుల జీవితములు భారతదేశ జాతీయ సమైక్యతకు తోడ్పడునట్టి అంశములలో నొక అంశముగా గుర్తింపవచ్చును. భారతీయ సంస్కృతి దేశ చరిత్ర గ్రంథములలోనే (పాఠ్య పుస్తకములలో గూడ) గాక భారత భక్తి స్తోత్రములో, మహనీయుల స్తుతి పరంపర శ్లోకములలో వీరి పేర్లు గలవు.

వీరందఱును దేశభక్తికి స్ఫూర్తిదాయకముగ నున్నారు.

1. "బుద్ధో జినేంద్రో గోరక్షః
శంకరశ్చ పతంజలి
రామానుజోఽథ చైతన్య
కబీరో గురునానకః॥ శ్లోకము 18. (రామానుజాచార్యుల ప్రసక్తి గలదు. వీరు గొప్ప సంఘ సంస్కర్తలు గూడ.)

2. నాయన్మారాళవారాశ్చ
తిరువళ్ళ వరస్తథా
వితరన్తు సదైవైతే దేవం
మేగుణ సంపదమ్॥ శ్లోకము 20. ఇందు ఆళ్వారుల స్తుతి గలదు.

భారత భక్తి స్తోత్ర గ్రంథము. జాగృతి ప్రచురణము 1966.

'అస్పృశ్యత' కూడదను హితోపదేశములు ఆ సూ.ము.లో గలవు. ఇవి జాతీయ సమైక్యతకు తోడ్పడును. ఆళ్వారులలో శూద్రులు పంచములు గలరు. పుటలు 54, 61 74, 133, 137, 189, 250 కావ్యప్రయోజనములలో సమాజ హితముకొఱకు సమైక్యత నాకాంక్షించుట, సమన్వయ పరచుట సముజ్జ్వలమే యగును.

సహేతుకముగా తత్త్వముల సిద్ధాంతకముల నిరూపించుట, వేదాంత ప్రతిభల ప్రదర్శించుట, నిస్వార్థ జీవితమును గడపుట, అహంకార రహితులై హితోప దేశముల జేయుట మన జాతికే గర్వకారణమనవచ్చును.

**భారతీయ సంస్కృతి చరిత్ర :** ఈ గ్రంథమునందలి దివ్య పురుషుల, దివ్య పుణ్యక్షేత్రముల, దివ్యప్రబంధముల, దివ్య గ్రంథరాజముల దివ్యనదుల, దివ్యకుల పర్వతముల, దివ్యఋషుల ప్రసక్తులనేకముల సందర్భోచితములుగ నుండి భారతీయ సంస్కృతి చరిత్రతో అంతర్లీనమగుచున్నవి.

**ఏది ఉత్తమ సాహిత్యము : అభిప్రాయములు :**

**సాహిత్య ప్రయోజనమును గూర్చి :**

"Great literature appeals not to reason, but to spiritual perception.... If a poet is lacking in intensity of vision, inward grace, in chastity of spirit, he fails as a poet. Creation implies suffering for the creator Man rises to God head through TAPASAS. Before Creation sets in there is a tapaswin a seer and he from whom he desires illumination is the prince of seers"- డా॥ సర్వేపల్లి రాధాకృష్ణన్‌గారి అభిప్రాయము, అఖిల భారతీయ రచయితల సమావేశము, జయపురములో 1945లో జరిగినపుడు.

ఇందులో "నానృషిః కురుతే కావ్యమ్" అను సూక్తి ధ్వనించుచున్నది. ఆళ్వారులు, ప్రసిద్ధాచార్య పురుషులు ఋషితుల్యులు. కవులు, రచయితలు, యోగులు, భగవత్సందర్శనాభిలాష, అందులకు వారు పడిన తపన వర్ణనాతీతము వారి తపస్సులీగ్రంథములో పేర్కొనబడినవి. అంతర్దృష్టి, లోదృష్టి, ఉన్మనీ భావదశ వంటి పదములిందు గలవు. ముదలాళ్వారుల భగవత్సందర్శనానంద భావస్రవంతులు కట్టలు తెంచుకొని కవితావాహినులై పర్వులెత్తినవి. ఆళ్వారుల జీవితఘట్టములన్నియు ఇందుకు నిదర్శనములు.

ఆ.సూ.ము. గ్రంథములోని వ్యక్తుల (యోగుల, ఋషుల, భక్తుల, యతుల, సూరుల) జీవితచరితలు ఉత్తమపురుషులకోవకు చెందిన వైభవములు

"యత్రపునరుత్తమపురుష
చరితం న నిబద్ధ్యతే
తత్కావ్యం పరిత్యాజ్యమేచ
తద్విషయాచ స్మృతిః"
"కావ్యాలాపాంశ్చ వర్జయేత్" —అభినవగుప్తుడు

స్తోత్రరత్నము :

ఉత్తమపురుషులైన యామునాచార్యుల స్తోత్రరత్నకవితావాహిని నుండి ఒక కెరటం వంటి ఉదాహరణము.

''వశీ, వదాన్యో, గుణవాన్, ఋజుః, శుచిః
మృదుర్దయాళుః, మధురః, స్థిరః, సమః
కృతీ, కృతజ్ఞః, త్వమసి, స్వభావతః
సమస్త కల్యాణ గుణామృతోదధిః''-శ్లో. 18.

ఇందలి భగవంతుని కల్యాణగుణ వర్ణనము లాదర్శప్రాయములైనవి. లోక కల్యాణభావమిందు నిబడీకృతము. ఇట్టి విశిష్టభావనలు గలవారి చరిత్రలు ఆ.సూ ము. యందు వర్ణింపబడినవి. ఇట్లు ఆ.సూ.ము. ఉత్తమ సాహిత్యము నందించు మహాకావ్యము.

ఆ.సూ.ము. పరిశీలన పునశ్చరణము :

1. ప్రథమాధ్యాయములో : కృతికర్త - కృతిభర్త - కృతివక్త - గ్రంథ స్వరూపమును గూర్చిన పరిశీలనము.

2. ద్వితీయాధ్యాయములో : ఆళ్వాచార్యులను గూర్చి తెలియదగిన అంశముల పరిశీలనము.

3 తృతీయాధ్యాయములో : ప్రతిపాద్యవిషయములు - నిరూపణాంశములు - పరిశీలనము, మహా ప్రబంధనిరూపణము.

4. చతుర్థాధ్యాయములో : గ్రంథస్థ విషయ సంగ్రహము కథాగమనము, Text.

5. పంచమాధ్యాయములో : కావ్యానుశీలనము, వర్ణనావైభవములు కావ్య ప్రయోజనములు మొదలగునవి.

6. అనుబంధ విభాగము.

విషయ సంగ్రహణలు, చిత్రములు, పటములు Maps పట్టికలు గలవు.

## ముగింపు : చివరి మాటలు

ఉత్తమ సాహిత్యమును మనమాదరించి, అందులోని విశిష్టమైన విషయముల గ్రహించుట, దానిని రక్షించుకొనుట సంభావనీయమే యగును.

"సాహిత్య పాదోనిధి మంథనోద్ధం
కావ్యామృతం రక్షత హే కవీంద్రాః
యత్తస్య దైత్యా ఇవ లుంఠనాయ
కావ్యార్థ చోరాః ప్రగుణీ భవంతి" —బిల్హణ కవి

ఆ. సూ. ము. గ్రంథకర్త శ్రీ వైష్ణవ సంప్రదాయ సాహిత్య సముద్రమును మథించి కావ్యామృతము నందించినాడు. దానిని అనుభవించుచు, ఆచార, విచార, ప్రచారములద్వారా పరిరక్షించుకొనవలసి యున్నది. కవి ఎన్ని గ్రంథములను పరిశీలించి, శ్రమకోర్చి, (గ్రంథము లందుబాటులో లేని, అచ్చు యంత్రముల ప్రారంభదశలో) దీనినెట్లు వ్రాసినాడో తలంచుకొన్న దిగ్భ్రమ కలుగక మానదు. (ఈ మహా కావ్యములో ప్రధానముగా కావ్యభాష ప్రాచీనుల పద్ధతి ప్రకారమే సాగినది. ఇంకను వైష్ణవుల పరిభాష, వ్యవహారములోని మాటలును దొర్లినవి.) దీనిని చదివి కావ్యానందమును పొందవలయును. హితముల బడసి నలుగుర కందించవలయునని నా ప్రార్థనము.

కవి తాను ప్రతిపాదించిన అంశములను (ప్రతిపాద్యమును) "శ్రీమద్భూతపురీశ..." కృతినాయక స్తుతితో మొదలిడి, మూడు భాగములలో, 24 ఉల్లాసములలో జీవిత వైభవములను తన కవిత్వ పటుత్వ సంపదచే చిత్రించి, కావ్యమును సుసంపన్నము జేసి చివరి జీవితచరిత్రను కృతివక్త వాదిభీకరగురుని వంశమూలపురుషుడగు ప్రతివాదిభయంకరం అణ్ణంగారి వైభవముతో పూర్తి చేసి, తిరిగి కృతిభర్తను కొనియాడి, చిట్టచివరగా శ్లోకపంక్తులలో తనకు మంత్రోపదేశమును జేసిన నేలకొండపల్లి రామానుజ జీయరుకు నతులొనరించినాడు. ఇట్టి కథావస్తువును కవితానుగుణముగా నెట్లు మలచినాడో నా పరిశీలనలో వివరించినాను.

**పరికల్పన లక్ష్యము (Hypothesis) ఆశించిన ఫలితములు ఫలప్రదమైనవి :**

కవి లక్ష్యము, కవిత్వలక్ష్యము ఇందు సోదాహరణముగ వివరించినాను. నా పరికల్పన (Hypothesis) ఆశించిన ఫలితముల పొందినవని నా యభిప్రాయము.

సమాజములో నిజముగా జీవించిన మహనీయుల, చారిత్రక పురుషుల జీవితచరిత్రలు గల కావ్యములను చదువుకొని ఆనందము ననుభవించుట, తద్వారా విశ్వకల్యాణము, శ్రేయస్సు, ప్రేయస్సుల నాకాంక్షించుట పరమావధులు.

కవి గొప్పవాడు, ప్రతిభాశాలి. కథావస్తువు ఇంకను గొప్పది. ఐనను వస్తువెంత గొప్పదైనను, పురుషులెంత గొప్పవారైనను కవి రచనానైపుణ్యము లోనే వారి విశిష్ట వ్యక్తిత్వములు ప్రస్ఫుటములగుచుండును. అవియే కావ్య హేతువులు. శబ్దసంపద, భావసంపద, సంప్రదాయసంపదలు పుష్కలముగా కలిగినవాడీకవి. ఇతడు శాస్త్రకవి, పండితకవి, కావ్యవైభవకవి యననొప్పును. కావ్యహేతువు లేవనగా-

"శక్తిర్నిపుణతా లోకశాస్త్ర కావ్యద్యవేక్షణాత్
కావ్యజ్ఞశిక్షణాభ్యాస ఇతి హేతుస్తదుద్భవే." —మమ్మటుడు

ప్రతిభ, వ్యుత్పత్తి, అభ్యాసములు నిండుగా గల్గిన వాడీ కవి శ్రీమాన్ నంబూరి కేశవాచార్యులు. కథా వస్తువులోని మొదటి పద్యములోనే శ్రీమన్నారాయణుని నిండు సభా వైభవమును చిత్రించి, ఆచార్య పురుషుల "అమ్మహాత్ముని చరితాబ్ధియందు (అమృత) చిత్తమా నీవు నోలాడి చెంది సతము (సుఖము) పదుగురార్యుల దలపుమీ భక్తి ననుచు" అనుచు వక్కాణించి, ద్రవిడోపనిషత్ సంగతిని దెలిసి, దివ్యప్రబంధముల తన కవితా దృక్పథములో నిమిడ్చుకొని తెలుగులో మహాప్రబంధమును మనముందుంచిన సంప్రదాయ వ్యవసాయమును చేయు కవి కృషీవలుడు. అతడీ కావ్యసృష్టికి పడిన తపన ఫలప్రదమైనది.

తెలుగులోని విశిష్టాద్వైత సిద్ధాంత తత్త్వ మహాకావ్యములలో దీనికే పెద్ద పీట వేయవచ్చును. కవి కృషి అపూర్వమైనది. గ్రంథము పేరు అందమైనది. కథా వస్తువు ఇంకను అపూర్వమైనది. అనిర్వచనీయమైన ఉపదేశముల నిచ్చెడు ఆచార్య పురుషుల, సుకృతాత్ముల చరిత్ర సంబంధ మధురోహల బంధురం బయినది.

''జయంతితే సుకృతినో రససిద్ధాః కవీశ్వరాః
నాస్తి తేషాం యశఃకాయే జరామరణ జంభయమ్.'' — భర్తృహరి.

**సహృదయులకు :** సహృదయులు దీనిని రక్షించుకొని, ప్రచారము సేసి, ఇంకను ఉత్తమ సాహిత్యమును సృష్టించవలయునని నా ప్రార్థనము.

''యేషాం సతత కావ్యానుశీలనా.
భ్యాసవశాత్ విశదీభూతే
మనో ముకురే వర్ణనీయ తన్మయీ
భావన యోగ్యతా, తీ
హృదయ సంవాద భాజః సహృదయాః.'' —అభినవగుప్తుడు.

మంచి కావ్యాలను అదే పనిగా చదువుతూ ఉన్నందువల్ల, మనస్సు నిర్మలమై, కవి వర్ణించే విషయాలను చక్కగా గ్రహించి ఆస్వాదింపగలుగుతుంది. ఆ విధమైన మనస్థితిని సంపాదించినవారే సహృదయులు. వారి హృదయం, కవి హృదయమున్ను ఒకటిగానే ఉంటాయి.[1] (కవి హృదయంతో సమానమైన హృదయంగలవాడే సహృదయుడు.)

**కావ్యసందేశములు - రామానుజుల సందేశము :** ఆ.సూ.ము యను మహా ప్రబంధమునకు కృతినాయకుడు రామానుజులకు నుతి. కృతి వక్తకు సన్నుతి. భగవంతుని బడయుటకు భగవద్రామానుజులే శరణాగతి.

గృహస్థుని ధర్మములు - పుట 130.

ప్రపన్నుండగు చేతనునకుం పంచ సంస్కార సంపత్తియు, శ్రీ మహా భాగవతార్చనంబు, నాచార్యాధీన వృత్తియు, నర్థపంచక జ్ఞానంబు, దదీయాను వర్తనంబును వైష్ణవత్వ పూర్వకంబగు పరమ ధర్మములు.

**ధర్మపంచకము-క్షేమమొనంగునవి, భరతవాక్యము వంటి ఫలాగమము :**

ఈ సందర్భములో ఈ క్రింది పద్యము స్పృహణీయమైనది. పుట 157.

''శ్రీభాష్య మాచార్య సేవచే పఠియించి
శిష్యముఖంబుగా జెప్పవలయు,

1. సాహిత్యభావలహరి. తెలుగు అకాడమి పుటలు 198.

నది యొనర్ప నశక్తుడాయె నా శఠవైరి
శ్రీసూక్తులే విశ్వసింపవలయు,
నట్లు రంగాదులందమరి యా హరికి, ప్ర
సిద్ధకైంకర్యమే చేయవలయు
మంత్రరత్నార్థమే మననంబు సేయుచు
కలిగిన కాలంబు గడపవలయు,

సతత వైష్ణవపూజలే సేయవలయు
నొదిగి యదుగిరి చెంతల నుండవలయు
సేమమిది యని యతిపతి చెప్పెననుచు
వాది భీకరగురుడనె మోదమలర!''

**కృతివక్త నుతి - ప్రతివాది భయంకరం అణ్ణంగారు :** (మొదటి వాది భీకరగురుని నప్తృనప్తపౌత్రుడు, కవి సమకాలికుని స్తుతి పుట 620)

“ఆస్మన్ముఖంబున నాచార్య సూక్తిము
క్తావళి యే గురు డానతిచ్చె
వత్స వంశాబ్ధి చంద్రుడే సత్సహాయు
దేమహాత్ముడు మద్ధిత హేతువయ్యె
నట్టి మద్గురు నణ్ణగారార్య ననఘు
చిత్తమలర భజించెద చింతమాని.''

**పురుషకారము - రామానుజులు స్తుతి - ఇదిగో! మీ (మన) ఆచార్య సూక్తి ముక్తావళి సత్కృతి :**

ఇట్లు ఆ.సూ.ము గ్రంథావిర్భావ వికాస లక్ష్యములు, సందేశములు, **ఫలశ్రుతులు** ఫలవంతములైన సాహితీ పరిశోధక మూర్తులకు, ఆలోచనామృత **ఫలము**లొసంగవలయునని నా యాకాంక్ష. ఇందుకు రామానుజులే పురుషకార **భూతులు**, అతడే శరణాగతి. అందులకై కవి యొనర్చిన స్తుతి - (పుట 18)

"శ్రీమద్వ్యాస పరాశరప్రియ మహాసిద్ధాంత సంస్థాపనా!
కామక్రోధ మదాదిదూర! సుకవిగ్రామ ప్రియాధాన! ని
స్సీమాపాంగరథాంగపాణి గుణరాశిప్రేమ! కర్మంది సు
త్రామా! రంగవిమాన మండప మహోద్యద్ధామరామానుజా!"

(విశిష్టాద్వైత ఉద్యమకర్త స్తుతి)

చివరగా - ధనుర్దాసుకు రామానుజులు చూపిన శ్రీరంగనాథుని నయనా నంద సౌందర్య దర్శన భాగ్యము సహృదయుల కందఱకును గలుగవలయునని నా వినతి రామానుజులే మనకు శరణాగతి. (పుట 187).

"గురుసుధా వాక్సుధావృష్టి ఆత్మతత్త్వానభిజ్ఞుల అభిజనాదు లడవిగాచిన వెన్నెల వంటివి." సూక్తి—

"భూరి గంభీరాంభములబొల్చు దృఢనాళ
మై బాలభాస్కరు నంశుతతుల
బోరి వికసించిన పుండరీకము బోలు
కస్తూరి రంగని కన్నుదోయ,
కమనీయ దివ్యమంగళ విగ్రహంబును
దేవీ విభూషణ దివ్యహేతు
లా యతీశానుగ్రహంబుచే గనుగొని
యమ్మహాత్ముండతి హర్షమొంది
ఎవని కృపచేతఁగంటి నేనిట్టి సుఖము
నతడె మీనికి సర్వస్వమని తలంచి
యాశ్రయించెను యతిపతి యంఘ్రులనుచు
వాదిభీకర గురుడనె మోదమలర!"

**పురుషకార గ్రంథము ఆ.సూ. ముక్తావళియే :**

ఇట్లు పురుషకారగ్రంథము ఆచార్య సూక్తిముక్తావళి.

"శ్రీమతే రామానుజాయ నమః"

భగవంతునకు మంగళాశాసనము చేయు అవకాశము ఆళ్వారాచార్యులకు గలదు. ఇది ఈ సంప్రదాయ విలక్షణత. హితచిత్తులు శ్రీహరికి బహువిధంబుల

**పాశురము :**

"పల్లాండు పల్లాండు పల్లాయ రత్తాండు
పలకోడి నూఱాయిరమ్
మల్లాండ తిండోళ్ మణివణ్ణా
ఉన్ శేవడిశెవ్వి తిరుక్కాప్పు."

**పల్లాండు మంగళాశాసనము :**

ఈ తిరుప్పల్లాండులో 12 పాశురములు గలవు.

## ఆలోచనీయాంశములు - ప్రార్థనము :

ఆ.సూ.ము. గ్రంథమంతయు పరిశీలించిన పిమ్మట నాకు కలిగిన అనుభవములనుబట్టి కొన్ని సూచనలు చేయుట సమంజసమని అనుకొందును. సహృదయులాలోచించగలరని ప్రార్థన.

రచయిత, కవి విశిష్టాద్వైతతత్త్వ కావ్యములు : 1. తెలుగునేలలో ఎన్నియో ఇట్టి కావ్యములుండవచ్చును. వీటికై అన్వేషణ సాగించి ఇందు దాగియున్న అపార విజ్ఞానశాస్త్ర విషయసంపదను వెలుగులోకి తేవలయును.

2. కావ్యమును పరిశీలించుటకు ముందు రచయితను గూర్చిన అవగాహనయు అవసరము.

3. అతడు విశిష్టాద్వైతి కావచ్చును. కాకపోవచ్చును. లేదా అభిమాని కావచ్చును. మధ్యన వైష్ణవ మతము నవలంబించి యుండవచ్చును. సాహిత్య మర్మజ్ఞుడు గావచ్చును. తెలిసికొనవలయునను కుతూహలము గలవాడు గావచ్చును. కేవలము ఖండనజేయువాడు గావచ్చును. ఉబుసుపోక ఊరకే వ్రాయువాడు గావచ్చును గాన, పరిశీలకునకు ఈ విషయములో మెలకువ అవసరము.

కవి ప్రతిభ కావ్యములో గోచరించును. స్వంత వ్యక్తిత్వ ముద్ర తప్పక యుండును. చేపట్టిన అంశము ఇనుమునైనను బంగారముగా మార్చగలడు.

కవి జీవించిన కాలము, సాంఘిక పరిస్థితి, కుటుంబము, కవి పెరిగిన తీరు, రాజాదరణములు, దేశాటనము మున్నగు విషయములను జాగ్రత్తతో గమనించవలయును.

ప్రస్తుతాంశము విశిష్టాద్వైత ప్రసక్తి, కావ్య పరిశీలన గాన, సహృదయు లిందులోని విశిష్టతనే గ్రహించవలయును.

4. ఒక సుకరమైన మార్గము. అన్వేషణములో లభించిన గ్రంథములను వర్గీకరణము చేసి, పిమ్మట పరిశీలించవలయును.

గ్రంథవర్గీకరణము - వాఙ్మయసూచిక : పీటిని వ్యక్తిగతముగా ఎవరికి వారే తయారుగావించుకొనవచ్చును.

ఉదాహరణకు : వచన భాగము. ఇందులో 15 అంతర్భాగములున్నవని నా అంచనా. ఇట్లే కవితా విభాగము. నాటక, నవల, కథ, మిశ్రమములు.

మౌలిక చర్చలలో (field work) పాల్గొని ఎన్నియో విషయముల రాబట్టవచ్చును. ఆచరణలో విశిష్టాద్వైత మెంతవరకున్నది? ఇది రామానుజుల నాటి నాలానుగుణ్యమైన పద్ధతిలో సాగునా? ఇట్టి ప్రశ్న లాలోచించవలసి యుండును. విజ్ఞానశాస్త్రప్రభావ మీనాటి కాలమును మార్చివేసినదిగదా! శాశ్వత సత్యముల విలువలకు ఆ సూ ము.లో జవాబులు లభించగలవు. సహృదయు లాలోచించగలరు.

శ్రీమాన్ నంబూరి కేశవాచార్యులవారు ఈ మహాకావ్యమును సృష్టించుటకు ఎంత కృషి సల్పిరో తలచుకొన్నచో ఒళ్ళు పులకరించునట్లుగా అనిపించుచున్నది. ఇటువంటివారు పడిన శ్రమను, వారాశించిన ఫలమును సార్థకము చేయుట సత్యాంశమని నా యభిప్రాయము శ్రీవైష్ణవాచార్య పరంపరయు కొనసాగుచున్నదీ దృష్టితోడనే.

ఆచార్య సంసేవ, ఆశ్రితవాత్సల్యము, లోకోపకారము, ఆనందము ద్వారా హితముల నుపదేశించుట నిస్స్వార్థమైన, నిరాడంబరమైన ఆదర్శజీవనము మున్నగు సద్గుణ భావములీ కావ్యమునకు పెట్టనికోటలు. విజ్ఞులు దీనిని రక్షించుకొనవలయునని ప్రార్థనము. నాకు తోచినంత మనవి చేసితిని. ఇంకను ఈ గ్రంథముల వంటి గ్రథములను వెలికిదీయవలయును. ఆచార్యసూక్తిముక్తావళి విశిష్టాద్వైత తత్త్వ మహాప్రబంధము - శ్రీ వైష్ణవ విజ్ఞాన సర్వసమున్న.

''అనంతశాస్త్రమ్ బహువేదితవ్యమ్

యత్సారభూతం తదుపాసి తవ్యమ్."

"ఉత్పత్స్యతే మమంతు కోపిసమానధర్మ
కాలోహ్యాయం నిరవధిః విపులాచ పృథ్వీ." —భవభూతి.

కవి ఆకాంక్ష - ఆ సూ.ము. మహాప్రబంధము :

విద్వత్కవీంద్ర కర్ణమధురమగుగాత!
శ్రీరామానుజుల అపరావతారామగు శ్రీమణవాళ మహామునుల

స్తుతి వైభవము : పుట 536

"వరవర మునివర! పరమ దయాకర!
సరసగుణాధార! శాంతిసార!
శివతాతిలక్షణ సిద్ధాంత సంస్థాప
నాచార్య! ధైర్యాద్యహార్యవర్య!
ఘనపరాంకుశ పరకాలాదిదివ్యసూ
రిప్రబంధార్థ నిర్వేశ నిపుణ!
చేతనా చేతన క్షేమతాతి పదాబ్జ
బ్రహ్మవిన్మానస పద్మపూజ్య!
త్వద్యశో దివ్యగుణ భూషిత ప్రబంధ
మిది భవత్కృత విద్వత్కవీంద్ర కర్ణ
మధురమగు గాత ఓ జగన్మాన్య యనుచు"
వాదిభీకర గురుడనె మోదమలర!

చివరిగా ఆ సూ.ము. గ్రంథసర్వస్వమునకు లక్ష్యమైన, స్ఫూర్తిదాయక మైన మహనీయుని స్మరించుటయే ఇందులకు పరిష్కారము. (ఆ సూ.ము. పుట : 623 లోని పద్యమిది.) సహృదయులు, భాగవతోత్తములు నా ఆ. సూ. ము. పరిశీలనము నాదరింతురు గాత యని సవినయ ప్రార్థనము.

**ఆచార్య సూక్తిముక్తావళి కృతి భర్తకు నమస్కృతి: జగద్ధితభావనము :**

స్వస్త్యస్తుతే యతిస్వామినే భూతపూ
ర్మణిమయ ప్రాకారమందిరాయ

వందన మస్తుతే వరణీయ వజ్రత్రి
దండ మండిత పాణికాండజాయ

నతిరస్తుతే జగద్ధిత కృతే కాషాయ
పరిధానసంవ్యాన భాసురాయ

అంజలిరస్తు భవ్యతరోర్ధ్వపుండ్రాయ
జ్ఞానముద్రా సమంచత్కరాయ

కమల తులసీ వలయసక్త్య కంధరాయ
బ్రహ్మసూత్ర శిఖాబంధ భాస్వరాయ
విలసితోదయ భాస్కర విగ్రహాయ
ప్రణతి శతమస్తు మత్కృతి పాలకాయ!"

శ్రీమతే రామానుజాయ నమః.

ఎంబెరుమానారు దివ్య తిరువడిగళే శరణమ్.



# ఆచార్య పరంపర - ఉపదేశవృష్టి
## (శ్రీసఖిజలధి... ఆ.సూ.ము. 157 వ పుట)




(ఆ.సూ.ము. హృదయావిష్కరణము)

## దివ్యదేశములు - 108, ఇతర ప్రసిద్ధ క్షేత్రములు - 16

**I తొండమండలము = 22 + 9**

(మద్రాసు - కాంచి నావరించినది)

1. తిరువల్లిక్కేణి
2. తిరునిన్ఱవూర్
3. తిరువళూరు
4. శ్రీఘటికాచలం
5. తిరునీర్మలై
6. తిరువిడవెన్దై
7. మహాబలిపురమ్
8. కాంచీపురమ్
9. తిరువెళ్కా
10. అష్టభుజమ్
11. తిరువేళుక్కై
12. తిరుత్తణ్కా
13. ఊరగమ్
14. నీరగం
15. కారగం
16. కార్వానమ్
17. పరమేశ్వర విణ్ణగరమ్
18. పవళవణ్ణన్
19. పాడగమ్
20. నిలాత్తింగళ్‌తుండమ్
21. కళ్వనూర్
22. తిరుపుట్కుళి

**అదనముగా :-**

1. మైలాపూర్
2. కంచి
3. కూరం
4. మధురమంగళం
5. శ్రీ పెరుంబూదూరు
6. పూనవల్లి
7. తిరుమళిశై
8. పచ్చై పెరుమాళ్ళకోయిల్

**II మధ్యమండలము = 2 + 2**

23. తిరుక్కోవలూరు
24. తిరువహీంద్రపురము

**అదనముగా :-**

1. శ్రీముష్ణము
2. పిరనారాయణపురము

**III చోళమండలము = 40 + 3**

25. తల్లై తిరుచిత్రకూటమ్
26. కాళిచ్చీరామ విణ్ణగరం
27. తిరువాలి తిరునగరి
28. మణిమాడక్కోయిల్
29. వైకుంద విణ్ణగరం
30. అరిమేయ విణ్ణగరం
31. తిరుత్తేవనార్‌తొక్కై
32. వణ్పురుషోత్తమమ్
33. శెమ్పొన్‌శెయ్‌కోయిల్
34. తిరుత్తెట్రియంబలం
35. తిరుమణి కూడం
36. కావళం పాడి
37. తిరువెళ్ళక్కుళమ్
38. పార్థన్ పళ్ళి
39. తలైచ్చంగ నాణ్మదియం
40. తిరువిందళూరు
41. శిఱుపులియూరు
42. తిరునాగై
43. తిరుక్కణ్ణంగుడి
44. తిరుక్కణ్ణమంగై
45. తిరుక్కణ్ణపురం
46. తిరువళందూర్
47. తిరుచ్చెఱియంగుడి
48. తిరువిణ్ణగర్
49. తిరుక్కుడందై
50. నందిపురవిణ్ణగరం

52. తిరుచ్చేర్రై
53. ఆదనూర్
54. పుళ్ళమ్బూదంగుడి
55. కపిస్థలమ్
56. కూడలూరు
57. తంజై మా మణిక్కోయిల్
58. కణ్ణియూరు
59. తిరుప్పేరునగర్
60. అన్బిల్
61. శ్రీరంగం
62. ఉత్రై యూర్
63. ఉత్తమర్ కోయిల్
64. తిరువెళ్ళత్రై

అదనముగా :

1) రాజమన్నారు సన్నిధి
2) పదువూర్ 3) మందంగుడి

పాండ్యమండలము $= 18 + 2$

65. దక్షిణ మధుర
66. తిరుమోహూర్
67. తిరుమాలిరుం శోలై
68. తిరుమెయ్యం
69. తిరుక్కోటియూర్
70. తిరుప్పుళ్ళాని
71. తిరుత్తణ్కాల్
72. శ్రీవిల్లిపుత్తూర్
73. తిర్కుకురుగూర్
74. తిరుక్కోళూర్
75. తులై విల్లి మంగలమ్
76. తెఞ తిరుప్పేరై
77. తిరుక్కుళన్దై
78. శ్రీవైకుంఠం
79. వరకుణమంగై
80. తిరుప్పుళిం గుడి
81. తిరువరమంగై
82. తిర్కుకురుంగుడి

మలయాళ మండలము $= 13 + 2$

83. తిరువణ్ వరిశారమ్
84. తిరువాటాఱు
85. తిరువనంతపురం
86. తిరుచ్చెంగునూరు
87. తిరువణ్ వండూరు
88. తిరువారన్ విళై
89. తిరుప్పులియూర్
90. తిరువల్లవాళ్
91. తిరుక్కడిత్తానమ్
92. తిరుక్కాట్కరై
93. తిరుమూళిక్కళమ్
94. తిరువిత్తువక్కోడు
95. తిరువానాయ్

అదనముగా :

1) జనార్దన క్షేత్రము
2) తిరువంజిక్కళమ్

ఉత్తర భారత మండలము $= 12$

96. తిరుమలై (తిరువేంగడం) తిరుపతి
97. అహోబిలమ్
98. ద్వారకా
99. ఉత్తరమధుర
100. సాలగ్రామము
101. దేవప్రయాగము
102. తిరుప్పిరిది
103. శ్రీ బదరికాశ్రమము
104. తిరువాయ్ప్పాడి
105. బృందావనమ్, నైమిశమ్
106. అయోధ్య
107. గోవర్ధనము
108. శ్రీవైకుణ్ఠము

# భగవద్రామానుజులు - భారతదేశ పర్యటనము
## విశిష్టాద్వైత సిద్ధాంత స్థాపనము



# రామానుజుల దిగ్విజయయాత్ర

## (శ్రీభాష్యరచన పిమ్మట - శ్రీరంగ పీఠాధిపతులుగా.)

కేంద్రము :- శ్రీరంగము నుండి

1. కుంభకోణము
2. అళగరి తిరుమల
3. సముద్రతీరము - సేతువు
4. తిరునగరి (తామపర్ణితీరము) నవతిరుపతులు
5. తిరుక్కురుంగుడి

మలయాళ దివ్యదేశములు : 13

6. తిర్వణ్బరిశారము
7. తిర్వట్టారము
8. తిరువనంతపురము
9. ఇతరములు

ఉత్తరమువైపు :

10. పాండురంగ క్షేత్రము
11. ఉత్తర మధుర
12. వ్రేపల్లె - బృందావనము
13. కాళియహ్రదతటము
14 ద్వారక
15. శ్వేతవరాహపుష్కరతీర్థము
16. అయోధ్య 17. ప్రయాగ
18 గయ 19. సాలగ్రామము
20. వైకుంఠపదము
21. నైమిశాటవి 22 హరిద్వారము
23. కాశ్మీరము
24. బదరికాశ్రమము
25. శమ్యకాశ్రమము
26 భారతీభవనము(భాష్యకార బిరుదు స్థలము)

తూర్పువైపు :-

27. వారణాసి
28. నీలశైలము

తూర్పుతీరము :-

29. శ్రీ పురుషోత్తమ క్షేత్రము
30 జగన్నాథస్వామి
31. శ్రీకూర్మము
32. ఋషికుల్య
33. శ్రీకాకుళము
34 సింహగిరి

దక్షిణము :-

35. అహోబలము
36. పినాకినిదాటి వృషాద్రికి

తిరుగుప్రయాణము : తిరుపతి నుండి శ్రీరంగం

37. ఘటికాద్రి
38. గృధ్రపుష్కరిణి తీరము
39. కాంచీపురము
40. భూతపురి
41. వీక్షారణ్యపదము
42. భక్తారామపదము
43. తిరునీర్మల
44. మహీసారపురము
45. పురుషమంగళము
46 మయూరపురి
47. మైలాపురి 48. భూతపురి
49. కంచి 50. మధురాంతకము
51. శ్రీవిల్లిబుత్తూరు
52. శ్రీముష్ణము
53. వీరనారాయణపురము
54. పాండ్యమండల దేశములు 22
55. తిరిగి శ్రీరంగమునకు (మొత్తము మీద 97 స్థలముల దర్శించిరి)

ఢిల్లీ విజయము :- శ్రీరంగము నుండి నిషాదుల గ్రామము; మిథిలాపురము, యాదవాద్రి (మేలుకోట) నుండి ఢిల్లీకి, తిరిగి శ్రీరంగమునకు.

# సంప్రదించిన గ్రంథములు

| | | | | |
|---|---|---|---|---|
| 1. | ద్వాదశసూరి చరిత్ర | గోదా గ్రంథమాల - శ్రీ కె.టి.యల్. | | |
| 2. | దివ్య ప్రబంధమాధురి | ,, | ,, | నరసింహాచార్యులు. |
| 3. | రత్నత్రయి, దివ్యప్రబంధత్రయి | ,, | ,, | ముసునూరు. |
| 4. | రామానుజ చరిత్ర | ,, | ,, | కృష్ణాజిల్లా. |
| 5. | రామానుజ కథాసారము | ,, | ,, | ,, |
| 6. | ఉపదేశరత్నమాల | ,, | ,, | ,, |
| 7. | గద్యత్రయము | ,, | ,, | ,, |
| 8. | దివ్యసూరి కథాసారము | ,, | ,, | ,, |
| 9. | రత్నయుగళి - నారదభక్తిసూత్రములు | | ,, | ,, |
| 10. | రజతోత్సవ సంచిక | ,, | ,, | ,, |
| 11. | స్తోత్రరత్నము | ,, | ,, | ,, |
| 12. | వకులభూషణ నాయకి | ,, | ,, | ,, |
| 13. | నాచ్చియార్ తిరుమొళి | ,, | ,, | ,, |
| 14. | శఠకోపవాక్సుధ | ,, | ,, | ,, |
| 15. | శ్రీ రామానుజ కీర్తి కౌముది I - II భాగములు. | శ్రీరామానుజకీర్తికౌముది గ్రంథమాల శ్రీధనకుధరం వరదాచార్యులు | | |
| 16. | ఆళ్వారులు - దివ్యప్రబంధములు | ,, | ,, | గుంటూరు. |
| 17. | గురుపరంపరా ప్రభావము. | శ్రీకాంచీపురం ప్ర.భ. అణ్ణంగరాచార్యస్వామి | | |
| 18. | తిరువాయిమొళి | ,, | ,, | ,, ,, |
| 19. | 108 దివ్యదేశముల దర్పణము. | రామానుజ పత్రిక-246. | ,, | ,, |
| 20. | శ్రీగుణ రత్నకోశము | శ్రీ కె.వి ఆర్. నరసింహాచార్యులు, ఏలూరు | | |
| 21. | ఇరామానుశనూత్తందాది | శ్రీ పా.తి.గు.వేం.ల. నరసింహాచార్యులు మచిలీపట్నం. | | |
| 22. | 108 దివ్యదేశ పాశురక్కుటిప్పు (1959) | శ్రీ కె. వరదాచార్యస్వామి | | |
| 23. | విశిష్టాద్వైత సిద్ధాంత దర్పణము | శ్రీ కుంటిమద్ది శేషశర్మ | | |

25. యతిరాజీయము ,, ,,
26. ఆళ్వారాచార్యుల చరిత్ర జియ్యర్ ఎడ్యుకేషనల్ ట్రస్టు
27. ప్రసన్నామృతము వాసుదాసాశ్రమం-నడిగడ్డపాలెం
28. విశిష్టాద్వైత విశిష్టత ,, ,,
29. శ్రీ రామానుజ దర్శన విశిష్టత ,, ,,
30. ప్రాతర్నిత్యానుసందేయము ,, ,,
31. శ్రీవైష్ణవుడవు కాగోరుదువా? ,, ,,
32. శ్రీవైష్ణవాహ్నికము ,, ,,
33. రామానుజుల సమగ్ర చరిత్రము ,, ,,
(108 చిత్రవర్ణములు)
34. యతీంద్రమతదీపికా. ,, ,,
35. శ్రీ. శఠజిద్దర్శనము శ్రీ శఠకోప శిక్షా శిబిరము
36. శ్రీ విశిష్టామృత గ్రంథసారము శ్రీ బి. యెంబేరుస్వామి
37. శ్రీ వైష్ణవ ముక్తిమార్గము శ్రీ పరాంకుశం మనోహరస్వామి
38. రామానుజ చరిత్ర (గేయము) శ్రీ సౌమిత్రి నారాయణాచార్యులు
39. శ్రీ వేదాంతదేశిక ప్రణీత గోదాస్తుతి ఉ.వే. శ్రీ కె. వి. రాఘవాచార్యులు
1987 ,, ,, సిద్దిపేట
40. భగవద్విషయము, ఈడు, అవతారిక ,, ,,
1989
41. పరతత్త్వ పరిశోధన-32 విద్యలు శ్రీ కిలాంబి కృష్ణమాచార్యులు
1981
42. భారతీయ తత్త్వశాస్త్రము V డా॥ సర్వేపల్లి రాధాకృష్ణన్
43. రామానుజుల ప్రతిజ్ఞ (నవల) శ్రీ పి. వి. రాజగోపాలనాయుడు
44. నమ్మాళ్వార్ కేం. సా. అ. 1987
45. తమిళ సాహిత్య కథలు ,, ,, ,, 1988
46. దయాశతకము సటీక T.T.D. 1984
47. ఆళ్వారుల దివ్యవైభవము ,, 1984
48. ఆళ్వార్ల మధురకవితలో తిరుమలేశుని వైభవం T.T.D. 1984

| | | | |
|---|---|---|---|
| 49. | శ్రీనివాస మంగాపురం - మన ఆలయములు చరిత్ర | ,, | 1980 |
| 50. | శ్రీ వచన భూషణ సార సంగ్రహము | ,, | 1951 |
| 51. | దేవాలయములు - తత్త్వవేత్తలు | ,, | 1985 |
| 52. | వేంకటాచలేతిహాసమాల | ,, | 1987 |
| 54. | ముముక్షుజనకల్పకము (పాతప్రతి) తాత్పర్యము | | 1912 |
| | తేవప్పెరుమాళయ్య (అచ్చి రామానుజాచార్యుల రచన) | | 1972 |
| | వరద ప్రింటర్స్ క్రొత్త ప్రతి. | | |
| 55. | రామానుజాచార్యులు | N.B.T. | 1972 |
| 56. | శ్రీ మద్భగవద్గీత (భాష్యత్రయ వ్యాఖ్య - వావిళ్ళ ప్రచురణ) | | 1955 |
| 57. | తెలుగు సాహిత్యము - పరిశోధన | ఆచార్య ఎం. కులశేఖరరావు | O U. |
| 58 | సింహగిరి వచనములు | ,, ,, ,, | ,, |
| 59. | శ్రీకృష్ణ చరిత్ర కథాకావ్యము | ,, ,, ,, | ,, |
| 60. | దక్షిణ భారత సాహిత్యములు | సా. ఎ. అం. ప్ర. | 1979 |
| 61. | అన్వీక్షణం | డా॥ ఎస్ వి. రామారావు | O. U. |
| 62. | ఆంధ్రవాఙ్మయ చరిత్ర సంగ్రహము | డా॥ దివాకర్ల వేంకటావధాని | |
| 63. | భారత భక్తి స్తోత్రము | జాగృతి ప్రచురణలు | |
| 64. | వివేచన 3 వ సంపుటము | ఉస్మానియా యూనివర్సిటీ తెలుగుశాఖ | |
| 65. | సాహితీ మంజూష | కళాస్రవంతి హైదరాబాదు | |
| 66. | ఆముక్తమాల్యద (వావిళ్ళ ప్రతి) | రాయలరచన | |
| 67. | ,, ,, (వేదంవారి ప్రతి) | | |
| 68. | ద్విపద పరమయోగి విలాసము | TTD ప్రచురణ | 1938 |
| 69. | చూతపురీ విలాసము | ఎల్లూరి నరసింగకవి | |
| 70. | సూక్తి సుధాకరము | సా. ఎ. | 1963 |
| 71. | కావ్యస్వరూపమ్ | సా. ఎ. | 1967 |
| 72. | సాహిత్య పదకోశము | తె. అ. | 1978 |
| 73. | ఆంధ్ర మహాభాగవతము | సా. ఎ; TTD. I భాగము | |
| 74. | ఆంధ్ర మహాభారతము | సా. ఎ. | |
| 75. | వాల్మీకి చరిత్ర | సా. ఎ. | |
| 76. | మనుచరిత్ర | సా. ఎ. | |

77. ఆముక్తమాల్యద - పర్యాలోకనము   పల్లెండ ప్రభాకరరామాత్యుడు
78. సర్వసిద్ధాంత సౌరభము 7 వ భాగము   అనుభవానందస్వామి
79. ప్రపన్నామృతమ్  (రామానుజ, ఆచార్యులచరిత) అతిప్రాచీన ప్రతి
80. గురుపరంపరా ప్రభావమ్  - పిన్‌బళగియ పెరుమాళజీయరు
అతిప్రాచీనప్రతి.
81. తెలుగు ఛందోవికాసము   డా. కోవెల సంపత్కుమారాచార్యుల
82. రామానుజ చరిత్ర (తెలుగు అనువాదము) జి. మంగమ్మ
83. విశ్వగుణాదర్శము (సం) తెలుగు అనువాదము=సన్నిధి పంచాంగం దేవప్పెరుమాళయ్య (1914 వ సంవత్సరము ప్రతి) మద్రాసు.
గ్రంథాలయములు :
1) స్వంత గ్రంథాలయము
2) చాత్తాద శ్రీవైష్ణవ సంఘ గ్రంథాలయము వంగపల్లి : నిర్వాహకులు శ్రీమాన్ శ్రీ పెరుంబూదూరు రంగనాథస్వామి, వెంకటనర్సయ్య, ఎం. వి. కృష్ణగారలు.
3) ఇతరములెన్నియో గలవు.
84. సాహిత్యభావలహరి, తెలుగు అకాడమి, 1989. సంపాదకులు - ఆచార్య. ఎం. కులశేఖరరావు - రచయిత. ఆచార్య యస్. వి. జోగారావు.
85. కావ్యాలంకార సంగ్రహం - శ్రీ సన్నిధానం సూర్యానారాయణశాస్త్రి.
86. సహృదయ చక్రము, 1983 - డా॥ కోవెల సుప్రసన్నాచార్య
87. సాహితీ సౌరభము, 1983 - శ్రీ ఎం. జి. పి. శ్రీరామచంద్రమూర్తి.
88. సమగ్రాంధ్రసాహిత్యము, 8, 9 సంపుటములు - ఆరుద్ర.
89. భారతీయ తత్త్వశాస్త్రము-సాధనగ్రంథమండలి - తెనాలి-నిర్వికల్పానంద స్వామి.
90. ఉషఃకిరణాలు - శ్రీవాత్సవ.
91. వస్తుగుణదీపిక - శ్రీ యెర్రా వేంకటస్వామి.
92. ఆంధ్ర రచయితలు - శ్రీ మధునాపంతుల సత్యనారాయణశాస్త్రి.
93. ముకుందమాల పీఠిక - శ్రీ చెలమచర్ల రంగాచార్యులు. 1973.
94. తెలుగు సాహిత్యకోశము I, II - తెలుగు అకాదమి, హైదరాబాదు.
95. తెలుగు సాహిత్య సమీక్ష - డా॥ జి. నాగయ్య.

96. అముద్రిత తనియన్ అనువాదములు - శ్రీ తిరునగరి స్వామినాథం.
97. మడికి సింగన - Ph.D. సిద్ధాంత వ్యాసము - డా॥ కె. కుసుమాంబ.
98. రైతు రామాయణము - శ్రీ వానమామలై జగన్నాథాచార్యులు.
99. పురుషకారము - శ్రీ వేముగంటి నరసింహాచార్యులు.
100. భార్గవపురాణము - బహరి రాఘవసామనాయకుడు, 1752 - 1774.
101. యామునవిజయవిలాసము - శ్రీ తిరుమలచిగురిరేవుల వేంకటకృష్ణమాచార్యులు.

## విజ్ఞానసర్వస్వములు : నిఘంటువులు

1. తెలుగు విజ్ఞాన సర్వస్వము. తెలుగుభాషా సమితి. 7వ భాగము.
2. ,, ,, ,, ,, ,, 6వ ,,
3. ,, ,, ,, ,, ,, I 3వ ,,
4. ,, ,, ,, ,, ,, II 4వ ,,
5. సూర్యరాయాంధ్ర నిఘంటువు. సా.ఎ. 1 - 8 సంపుటములు
6. ఆంధ్రశబ్దరత్నాకరము. 1, 2, 3 సంపుటములు - శ్రీ చెలమచర్ల రంగాచార్యులు
7. తెలుగు వ్యుత్పత్తి పదకోశము A.U. వాల్తేరు
8. ఆంధ్రవాచస్పత్యము. 1, 2, 3 సంపుటములు
9. శబ్దార్థ చంద్రిక మహాకాళి సుబ్బారాయుడు
10. ఆంధ్రదీపిక మామిడి వేంకటాచార్యులు
11. తెలుగు పర్యాయపద నిఘంటువు డా॥ డి. ఎన్. రెడ్డి.
12. అమరకోశము వావిళ్ళ ప్రచురణ

## సిద్ధాంత వ్యాసములు

1. వైష్ణవాంధ్ర వాఙ్మయము. డా. వేటూరి ఆనందమూర్తి
2. తిరునామములు - సమగ్రపరిశీలన. డా. కిడాంబి నరసింహాచార్యులు
3. అచ్చతెలుగు కృతుల పరిశీలన. డా. కె. వి. సుందరాచార్యులు
4. ఆధునికాంధ్ర కవిత్వము - ప్రయోగములు. డా. సి. నారాయణరెడ్డి
5. రంగనాథ రామాయణము - తులనాత్మక పరిశీలన. డా. గుండి వేంకటాచార్యులు

6. కనపర్తి అబ్బయామాత్యుని కృతుల పరిశీలన - డా. వి. నారాయణశర్మ
7. ఆసూరి మరింగంటి వేంకట నరసింహాచార్యుల (చతుర్థి) రచనల సమగ్ర పరిశీలన - డా. ఎం. రంగాచార్యులు
8. మరింగంటి కవుల సాహిత్యసేవ - డా. రంగాచార్య
9. ప్రబంధ వికాసము - డా. పల్లాదుర్గయ్య
10. విష్ణుభక్తి తత్పరుడు - విప్రనారాయణ - (M.phil) - డా. ఎర్ర బాలక్రిష్ణారెడ్డి
11. ఆముక్తమాల్యదా సౌందర్యము - డా. తుమ్మపూడి కోటేశ్వరరావు.
12. కవికర్ణరసాయనము - విశిష్టాద్వైత సమన్వయము - డా. గల్లా చలపతి


## ఆంగ్లము :


1. The History and Culture of Indian people Vol. III, IV,V - Bharateeya Vidya Bhavan, Bombay.
2. A Descriptive Catelogue of Telugu Manuscripts in the. Taugore Maharaja Sarfoji's Saraswaty Mahal Library- Vol. II.
3. Saints of India - Sri Rama Krishna Mutt. 1986.
4. Sri Ramanuja: His Life Religion, Philosopy-1991 Vol II
5. Life of Sri Ramanuja by Swami Rama Rrishnananda, Sri Rama Krishna Mutt.
6. The RAHASYA Traya SARA of VEDANTA DESIKA English Translation by M. R. Rajagopal, Kumbakarnam.
7. Sri Ramanuja's theory of Knowledge : A study - TTD. K. C. Varada Chari 1980
8. Visistadvaita - A.S.R. Raghavan TTD 1985
9. The Theology of Ramanuja (An essay in Inter religious understanding by John Braisted Carman.) 1981.
10. An Advanced History of India 1988 Macmillan India Limited.

11. The new & Encycolopadeia of Britanica. Vol. I, the University of Chicago.
12. Alvars of South India - K. C. Varadachari B V.B. 1966
13. Ministrels of God (ANDAL) B.V.B. 1951
14. Ten Saints of India B.V.B. 1971
15. Ramanuja's teachings in his own words B.V.B. 1965

## పత్రికలు

తెలుగు :

1 ఆంధ్రపత్రిక (దిన-వార), 2. ఆంధ్రజ్యోతి (దిన-వార), 3. ఆంధ్రభూమి (దిన-వార), 4. ఈనాడు (దిన), 5. సమాలోచన (మాస), 6. భారతి (మాస), 7 ఆరాధన (మాస), 8. శ్రీశైలప్రభ (మాస), 9. భక్తినివేదన (మాస), 10. సప్తగిరి (మాస), 11. శ్రీనృసింహప్రియ (మాస), 12. ముముక్షువు (మాస), 13. శ్రీ వైష్ణవ పత్రిక - స్వర్ణోత్సవ సంచిక 1970, 14. పుష్పపల్లకి - రజతోత్సవ సంచిక 1977, 15. ఉపదేశరత్నము (మాస).

ఆంగ్లము :

1. THE HINDU Daily
2 Bhavans' Journal (fortnightly)
3. The Indian Magzine - 1987.

హిందీ :

హిందీ కల్యాణ్ విశేషాంకములు.

శ్రీమతే రామానుజాయ నమః

